**REGADI VITTULU**
(Seeds of Black Soil)
A Novel in Telugu

*Writer*
**CHANDRA LATHA**
Sridhar Children Hospital
Pogathota, Nellore - 524 001
Andhra Pradesh - INDIA



*Cover Design*
**SRIDHAR**

First Edition
**Telugu Association of North America**
USA
July - '97
Second Edition
November `97
Pravardhana Publications, 8-II, L B Stadium, Bashir Bagh, Hyderabad-1

*Sole Distribution :*
Visalandhra Book House, Bank Street, Hyderabad

**Rs. 125/-**




‘తానా’ నవలల పోటీలో

రూ. 1,20,000/-

బహుమతి పొందిన

తొలి నవల




తానా ఉత్తర అమెరికాలో స్థిరపడిన తెలుగు సాహితీ పిపాసులు మాతృభాషాభివృద్ధిపై మమకారంతో స్థాపించుకున్న సంస్థ. అక్కడి సాహితీ పిపాసులు తెలుగు నవలా సాహిత్యంలో నూతన చైతన్యం తెచ్చే లక్ష్యంతో ఇరవయ్యేళ్ళ 'తానా' (Telugu Association of North America) చరిత్రలో తొలిసారిగా నిర్వహించిన నవలల పోటీలో ఏకైక బహుమతి రూ. 1,20,000/- గెలుచుకున్న ఉత్తమనవల

# ''రేగడి విత్తులు''

విత్తనంలోనే విప్లవం వుందనీ

విశ్వసౌభాగ్యం వుందనీ

విశ్వసించే నాన్న...

కోటపాటి మురహరిరావు గారికి ...

ఆప్యాయంగా



దూరాల తీరాలు దాటుకొని తానా 'తెలుగు' వారు స్పందించిన తీరూ, నా రచనపట్ల నాపట్ల చూపిన ఆదరణాభిమానాలు నాకు మధురానుభూతులు.

ఆ ఉద్వేగభరిత క్షణాలు నా సొంతం కావడానికి మూలమైన న్యాయ నిర్ణేతలు శ్రీమతి అబ్బూరి ఛాయాదేవిగారికి, డా॥ కేతు విశ్వనాథరెడ్డిగారికి, డా॥ జంపాల చౌదరిగారికి, శ్రీ సరిపల్లె కనక ప్రసాద్‌గారికి -

ఈ ఖండాంతర యజ్ఞాన్ని నిర్విఘ్నంగా పూర్తి చేసిన ఘనులు, కార్యనిర్వాహకులు శ్రీ మురళి చందూరిగారికి -

"ఆహ్వానం" లక్ష్మి గారికి, ఆర్టిస్ట్ శ్రీధర్ గారికి -

నా అభిమానాలు.

- చంద్రలత

వారు నిర్వహించిన ఈ నవలల పోటి గురించి కొంత.

్యాపార ధోరణులు అన్ని రంగాలతో పాటు సాహిత్యరంగంలోను ప్రవేశించడం వల్లగాని - ి యొక్క విషయ విశేషణాల నిర్ణయాలు రచయితలు కాక పత్రికలు తీసుకోవడంవల్లగాని ఈరోజుకి వేగతరమై పోతున్న జీవనశైలిలో సుదీర్ఘ రచనలు చేసే నేర్పు ఓర్పు రచయితలలో ి వల్లగానీ - దీర్ఘపఠనం చేసే ఓపిక పాఠకులలో సన్నగిల్లడం వల్లగానీ - తెలుగు నవల ికీ చిక్కిపోతున్నది. విషయపరంగానూ, సాంద్రతపరంగాను.

ఈ నేపథ్యంలో - గత కొన్ని దశాబ్దాలుగా తెలుగువారి జీవితాలలో వస్తోన్న చెప్పుకోదగ్గ ర్పుల్ని చూపదగ్గ నవల కోసం తానా వారు పోటీ ప్రకటించడం హర్షించదగ్గ విషయం. నవల నిడివి సూచించడంలో వారు చూపిన విశాలదృష్టి ఎంతో సంతోషాన్నిచ్చింది. వల్లనంటే - మొదటి దానివలన కొన్ని దశాబ్దాలలో వచ్చిన మార్పులు అధ్యయనం చేసే శం లభించింది. రెండవ దానివలన విషయాన్ని, నేపథ్యాన్ని, పాత్రలను చిత్రించడానికి మైన కాన్వాస్ లభించింది. రెండు విధాల మొదటి లాభం రచయితదే! అందులోనూ ారం అందుకున్న ఈ ఒక్క నవల మాత్రమే కాకుండా పోటీకి వచ్చిన మిగిలిన నవలలు ఏదో రూపేణా ప్రకటితమవుతాయి. ఇది తెలుగు నవలకు శుభపరిణామం. అందుకు ధారులైన తానావారికి అభినందనలు.

నవల ''రేగడి విత్తులు'' - శీర్షిక సూచించినట్లుగా - నల్లరేగడి భూమితోనూ - ఆ రైతులు మట్టిలోంచి మలిచిన మాణిక్యాల్లాంటి విత్తనాలతోనూ సంబంధం ఉన్న నవల. వలలో వ్యవసాయం గురించి చిత్రిస్తూనే - వ్యవసాయ కుటుంబాల గురించి చిత్రించాను. ఫంగా ఇది వ్యవసాయ సంస్కృతిని ప్రతిబింబించే నవల. అందువలన తానా వారి ారం - వ్యవసాయ సంస్కృతి పట్ల ప్రకటించుకున్న గౌరవంగా నేను భావిస్తున్నాను.

త కొన్ని దశాబ్దాల ఆంధ్రదేశం అనేకానేక చారిత్రిక, రాజకీయ, సాంఘిక, ఆర్థిక ామార్పుల్ని చవిచూసింది ఎన్నో ఘటనా ఘటనలు, వాటిపై నా అభిప్రాయాలు, నలు, ఎన్నెన్నో చెప్పాలనుకొన్న విషయాలు నవలలో ఇమడ్చలేకపోయాను. నవలాపరంగా ంటిని సూచన ప్రాయంగా ప్రస్తావించాను. కొన్నింటిని కూలంకషంగా చర్చించాను. బ్దాల కాలంలోని అన్ని ఘటనలను లోతుల్లోకి పోయి చిత్రిస్తే నవల ఒక చరిత్ర పుస్తకం ే ప్రమాదం ఉంది. ఎంచుకున్న విషయానికి, కథనానికి అడ్డు తగలకుండా ఆ కాలంలో

మన తెలుగునాడు ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమల ముప్పేట. ఒక్కో ప్రాంతం ఒక్కో విశిష్ట మాండలికాన్ని కలిగి ఉంది. ఏ తెలుగులోని తియ్యదనం దానిదే. నా నవలలో విషయపరంగా అవసరాన్ని బట్టి ఆయా మండలికాలను వాడాను. నిజానికి, దీనికోసం నేను ప్రత్యేకించి శోధించి సాధించిన వ్రాసిన భాష అంటూ ఏమీ లేదు. కథాగమనంలో మలిచిన పాత్రలు, ఆ పాత్రలు మాట్లాడుకొనే భాష - అంతే. వాస్తవానికి భిన్న మాండలికాల వాడుక నా నవలలో నేను అప్రయత్నంగా ప్రకటించుకున్న అంశం. అందుకోసం ఎక్కడా తడుముకొనే సందర్భంగానీ వెదుకులాడే అవసరంగానీ నాకు రాలేదు.

నవల నవరసాల పేటిక. భౌతికాంశాలను స్పృశిస్తూనే ఆత్మికాంశాలను సృజించాలి. మనోరంజకంగా మలుస్తూనే మేధావంతం చేయాలి. అనుభూతికి అంతర్లీనంగా ఆలోచనను ఆవిష్కరించాలి. ఆనందాల్నీ ఆవేదనలనీ సమస్యల్నీ పరిష్కారాల్నీ వ్యక్తులను సమాజాన్ని అందంగా అల్లుకురావాలి. ఆలోచనలను ఆదర్శాలను ప్రకటిస్తూ వాటి ఆచరణలోని సాధ్యాసాధ్యాలను చర్చించాలి. ఏవో నమూనాల మాదిరిగా కాకుండా జవజీవాలు తొణికిసలాడేలా - రాగద్వేషాల రంగులద్ది రమ్యంగా పాత్రలను మలుచుకు రావాలి. అన్నిటికి మించి జీవితాన్ని స్పృశించాలి. జీవనాన్ని సృజించాలి. అందువలన నా దృష్టిలో నవల ఆకస్మిక వ్యక్తీకరణ కాదు. సునిశిత అధ్యయన స్పష్టమైన అవగాహనల కలనేత.

పల్లె, పల్లె ప్రజలు, పల్లె సంప్రదాయాలు నా సజీవ సంబంధాలు.

ఈ నేపథ్యం వలన వ్యవసాయశాస్త్రజ్ఞుల నుండి సామాన్య రైతుల వరకు భిన్న కోణాలతో పరిశీలించే అవకాశం నాకు లభించింది. సంప్రదాయ సేద్యానికి ఆధునిక వ్యవసాయానికి నడుమ ఉన్న శాస్త్రీయవారిధి నిర్మించడంలోని ఒడిదుడుకులేమిటో లోతుపాతులేమిటో నాకు తెలుసు. నేడు గోండులు, లంబాడీలు కూడా సంకరజాతి విత్తనాలు వాడుతున్నారన్నా, రాళ్ళల్లో రప్పల్లో పెరిగే రేగుకు కూడా సంకరజాతి వంగడాలు ఉన్నాయన్నా - దాని వెనుక వ్యవసాయ శాస్త్రజ్ఞుల నుండి వ్యవసాయదారుల వరకు ఉన్న పాత్ర ఏమిటో నేను ఊహించగలను.

మన వ్యవసాయ రంగం ఎంతటి ప్రగతిని సాధించినా, ఈనాటికీ వానదేవుడి చపల చిత్తంపై ఆధారపడ్డాడు సామాన్యరైతు. రెక్కలు ముక్కలు చేసుకొన్నా డొక్కలు మాడ్చుకొనే కృషీవలురు ఎందరో! పదిమందికి పట్టెడన్నం పెట్టి, పిడికెడు మెతుకులకు పరిమితమయ్యే రైతన్న లెందరో!

ఆహార ఉత్పత్తికి ఆహార వినిమయానికి మధ్య ఉన్న అగాధం నానాటికీ పెరుగుతోంది. అవసరానికి ఆడంబరానికి నడుమ నిర్వచనాలు చెదిరిపోతున్నాయి. అవసరం తీరక అల్లాడే అన్నార్తులకు - ఆడంబరాల్ని అవసరాలను చేసుకొన్న అసంతృప్తులకు మధ్య దూరం మరింత పెరుగుతోంది. నేడు శ్రమ కన్నా విశ్రమకు గౌరవం ఎక్కువ. దేశస్థాయిలో ఉత్పత్తికి కుటుంబస్థాయి ఉత్పత్తికి మధ్య ఎంతో తేడా ఉంది. అలాగే దేశస్థాయిలో వినిమయానికి వ్యక్తిగత స్థాయిలో వినిమయానికి చాలా భేదం ఉంది. అన్ని లోతు పాతులు ఎరిగినవాడు కాబట్టే మన

పెద్దన్న వేమన్న 'అన్నమధికమైననదియు దాజంపు, నా యన్నమంటకున్న నాత్మ నొచ్చు, చంపనొంప బువ్వ చాలదా వెయ్యేల' అన్నాడు

అన్నం పరబ్రహ్మ స్వరూపం
దానేషు మహాదానం అన్నదానం
అన్నం ఎంత ప్రధానమైనదో అన్నదాత అంత ప్రధానమైన వాడు.

అన్నపూర్ణ అయిన మనదేశంలో అన్నదాతల ఆత్మహత్యలు తరచు వినవలసిరావడం దురదృష్టకరం. ''కృషి సకల పరిశ్రమలకు కీలు చీల'' కానీ, కృషి పట్ల ఆసక్తి రోజురోజుకీ సన్నగిల్లుతోంది. కృషి వలుర సంఖ్య నానాటికీ కృశించి పోతోంది. అనేకానేక ఉత్పత్తి నిరోధక శక్తులు మన వ్యవసాయ ఉత్పతికి అడ్డంకులవుతున్నాయి. రాజకీయంగా గానీ, సామాజికంగా గానీ మనం వారికి బలమైన ఊతం ఇవ్వలేకపోతున్నాం. అనేక నిరుత్సాహ పరిస్థితుల మధ్య నిరాశా నిస్పృహల మధ్య ప్రగతిశీల రైతులు కొందరు ఒంటరిపోరాటం చేస్తున్నారు వారి శ్రమలో కానీ కృషిలో కానీ వెయ్యోవంతు కూడా నేను రేగడి విత్తులలో చిత్రించి ఉండను. రైతులవారి జీవితాల వాస్తవ చిత్రాన్ని ఏ కొంతైనా నలుగురి ముందు ఉంచగలిగినందుకు ఒక రైతు బిడ్డగా నాకు సంతోషంగానే ఉంది.

మానవ మనుగడంతా ఉత్పత్తి మీదే ఆధారపడి ఉంది. అది వ్యవసాయం లాంటి ఆర్థికపరమైన భౌతిక పరమైన ఉత్పత్తులే కావు మేధా పరమైనవి, ఆత్మికమైనవి, మరేదయినా - మనిషి ఏఏ రంగాలలో సాధించగలడో అన్ని రంగాల్లోనూ సృజించే ఉత్పత్తి, నిర్మించే ఉత్పత్తి, సాధించే ఉత్పత్తి అలాంటి ఉత్పత్తి మనకిప్పుడు అవసరం అత్యవసరం

నా రేగడివిత్తులు ఏ ఒక్క నిర్వ్యాపారిలోనైనా ఉత్పత్తి స్పృహకు బీజం వేయగలిగితే, నిర్మాణం వైపు మళ్ళించగలిగితే నా ప్రయత్నం ఫలించినట్లే

రచయితకు రచనలు కన్నబిడ్డల వంటివి అంటారు నా నవల ప్రాథమిక పరీక్షలో నెగ్గింది. ఇంకా పాఠకులపరీక్షలోనూ కాలంపరీక్షలోనూ నెగ్గాల్సి ఉంది మరి ఆనాడే నాకు నిజమైన పుత్రోత్సాహం!

కొత్త కలాన్ని ప్రోత్సహించి - పెద్ద భారం మోపారు. పెద్దలు నాపై ప్రకటించిన ఈ నమ్మకాన్ని ఇక ముందు కూడా నిలుపుకోవడానికి నిజాయితీగా నిబద్ధతతో కృషి చేస్తాను

మీ అభిప్రాయాలే నాకు అండదండలు.
చివరిగా చెప్పవలసింది ఒక్కటి ఉంది - అన్నదాతా సుఖీభవ!

— చంద్రలత

# 1

"నేనేమి సేతూ - సేనెట్లు గాతూ
మొగులు[1] మెత్తనాయె
భూమి బుర బుర పొంగె
నల్లనీ రాగట్ల[2] తెల్ల జొన్నాలేస్తే ..." ఎండ పొడలో కూర్చుని బోసినోట్లో పోకనాడిస్తూ పాడుకుంటోన్న లచ్చుమమ్మ ఎదురుగా వచ్చిన వాళ్ళని చూసి కళ్ళు చిట్లించింది

"ఎవురా వచ్చేడ్డి ?" గొణుక్కుంది లచ్చుమమ్మ కుడి చేతిని నడుముకి ఆసరాగా పెట్టి - ఎదురెండకు ఎడంచేయిని అడ్డం పెట్టి - వచ్చిన వాళ్ళ దగ్గరగా వెళ్ళింది.

"అవ్వా .! బాలయ్య మావ ఇంట్లున్నడా?" ఆ వచ్చినవారిలో ఒకరు అడిగారు

లచ్చుమమ్మ సమాధానమివ్వకుండానే వాళ్ళని ఎగాదిగా చూసింది

ఒకరి ముఖం ఎప్పుడో చూసినట్లేవుంది ఎటొచ్చి రెండో అతనే ..... !

అజానుబాహుడు, ఖద్దరు ధోవతి, లాల్చీ - చక్కగా మడతపెట్టి కుడి భుజాన సర్ది వుంచిన పైపంచ, కురచ జుట్టు, నవ్వు ముఖం.

లచ్చుమమ్మ మనసులో ఏవో సందేహాలు కదలాడాయి.

'ఆ మడిసి ఎవ్వడో? ఏమో? ముసలీ ముతకా పిల్లా మేకా ఇంట్ల వుండే ఈ పొద్దుల ఎందుకొచ్చిండు?' లచ్చుమమ్మ ఏదో శంకించింది.

"బాలయ్య ... లేడు .. .. లేడు ... ! నా కొడ్కు గిప్పుడింట్ల ఎందుకుంటడు? సేనికి పోయిండు!" గబగబ అని - మళ్ళీ చేనుకి వెళ్ళాడని ఎందుకు చెప్పానా అని చింతించింది.

"ఓ అవ్వా .... ఆ సెల్లా[3] బాలయ్య మావది కాదూ? సూడు .... పో . .. ఇంట్ల గిట్ల వున్నడేమో - " మొదట పలకరించిన అతను అరుగు మీదున్న బాలయ్య పైపంచను చూపిస్తూ చనువుగా అన్నాడు.

"ఎవురొచ్చిన్రే అమ్మా - ముచ్చట పెట్టినవ్ . !" మిద్దె మెట్లు దిగి బాలయ్య రానే వచ్చాడు

లచ్చుమమ్మ కంగారుగా బాలయ్యను వారించబోయినా ఫలితం లేకపోయింది బాలయ్య నేరుగా ఆ రెండో ఆయన దగ్గరకే వెళ్ళాడు. ఆయన చేతులు పట్టుకొని నవ్వుతూ ఆహ్వానించాడు.

---

1 ఆకాశము, మేఘము 2 రేగడిలో 3 పై పంచ, ఉత్తరీయం

"రాన్రి - రాన్రి - కూసోన్రి ! రావయ్య దస్తగిరీ - గీడకూసో!" బాలయ్య వచ్చిన వాళ్ళను అరుగు మీద పరిచివున్న జంపఖానా మీద కూర్చోబెట్టాడు

లచ్చుమమ్మ వచ్చిన వాళ్ళతో ప్రమాదం లేదని నిశ్చయానికి వచ్చాక - తను ఇంతకు మునుపు కూర్చున్న స్థలానికి వెళ్ళి కూర్చుంది

వచ్చిన వారిలో మొదటివాడు దస్తగిరి - ఐజ ప్రాంతాలవాడు. ధాన్యం బేరగాడు గద్వాల, పెబ్బేరు, జడ్చర్ల , పాలమూరు మార్కెట్లల్లోకి ఇక్కడి ధాన్యం తీసుకెళతాడు. మాటకారి మనిషి రివటలాగుంటాడు. ఐదడుగుల వాడు, పొట్టిచేతుల చొక్కా, మోకాళ్ళు దిగిన పంచె.

రెండవ వాడు రామనాథం. ఇతను రేపల్లె ప్రాంతాలవాడు భారీ విగ్రహం. ఆరడుగుల ఎత్తు విశాలమైన ఛాతీ. పొడవాటి చేతులు. వెడల్పాటి నుదురు ఛామన ఛాయకన్న ఓ ఛాయ తక్కువ జిజ్ఞాసతో మెరిసేకళ్ళు, గంభీరమైన కంఠం, స్పష్టమైన వాక్కు అతన్ని ప్రత్యేకంగా నిలబెడతాయి.

అతను మద్రాస్‌లో చదువుకుంటున్న సమయంలో విశాలాంధ్ర ఉద్యమం మంచి ఊపులో వుంది. డిగ్రీ పుచ్చుకొని ఊరికి తిరిగి వచ్చే సమయానికి - విశాలాంధ్ర స్వప్నం సాకారం అయివుంది. ఆ సంతోషాల మధ్య మేనమామ కూతురు సావిత్రితో దండల పెళ్ళి.

అతని తండ్రి వెంకట్రామయ్య మంచి కార్యదక్షుడు. వ్యవహర్త వాళ్ళ వూరిలో హైస్కూలు, లైబ్రరీ పెట్టడంలో ప్రధానపాత్ర వహించాడు.

తల్లి పున్నమ్మ ఆ వూరు ఆశ్రమ స్త్రీలందరిలోనూ రాట్నం వడకడంలో నేర్పరి.

అన్న రత్తయ్య - వ్యవసాయం చేస్తున్నాడు.

సంతోషంగా వున్న ఆ కుటుంబంపై విషాదం విరుచుకుపడింది. రామనాథం చెల్లెలు దమయంతి, ఆమె భర్తా నాగాయలంక పెళ్ళికి వెళుతూ పడవ మునిగి కృష్ణ పాలయ్యారు. వారి పసిపిల్ల అనూరాధ పున్నమ్మ వడిని చేరింది. వెంకట్రామయ్యా ఆ దిగులుతోనే చనిపోయాడు.

వెంకట్రామయ్య వ్యాజ్యం పోయిన సంగతి అన్నదమ్ములకు అప్పుడే తెలిసింది. రామనాథం కో-ఆపరేటివ్-సొసైటీ లో ఆడిటర్‌గా చేరాడు. ఉద్యోగరిత్యా మహబూబ్ నగర్ ప్రాంతాలకు వచ్చాడు. కల్వకుర్తి, ఆమన్‌గల్లు, వనపర్తి, గద్వాల, అచ్చంపేట చాలా చోట్లు తిరిగాడు. పచ్చని కొండల పాలమూరు-వెచ్చని గుండెల పాలమూరు ప్రజలు అతనికి ఆత్మీయంగా తోచాయి.

దస్తగిరితో పరిచయం అతన్ని నడిగడ్డ దాకా తీసుకొచ్చింది.

నడిగడ్డ కృష్ణా తుంగభద్రల మధ్య నల్లరేగడి ప్రాంతం. సారవంతమైన నడిగడ్డ ఏళ్ళూ పూళ్ళుగా తుమ్మల బీళ్ళుగా పడి వుండడం అతని రైతు గుండెను కదిలించింది. ఏ కారణాలు ఏ అవాంతరాలు ఆ భూమిని వాముకు, జొన్నకూ, సజ్జకూ, కుసుమ, ధనియాలకు పరిమితం

చేసాయో తెలుసుకోవాలన్న కుతూహలం అతన్ని ఆ భూమిపై వ్యవసాయం చేస్తే ఎలా వుంటుందన్న ఆలోచన దగ్గర నిలిపింది.

దొర భూమి అమ్మకానికి వున్న విషయం దస్తగిరి అతనికి తెలియజేసాడు. ఆ వూరి పెద్దమనిషి బాలయ్య మధ్యవర్తిత్వంతో పొలం బేరానికి వచ్చాడు రామనాథం

బాలయ్య, దొరల హయాం గడిచాక ఆ ఊరు మంచీ చెడ్డలు చూస్తోన్న పెద్దల్లో ఒకడు. బాలయ్య మధ్యస్తపు ఎత్తువాడు. ఎండకు కమిలిన ఉక్కులాంటి శరీరం. గుబురు మీసాలు, నున్నగా గీచిన గడ్డం, చకచక కదిలే చిన్న కళ్ళు. నడిగడ్డ వారిలో వుండే మర్యాద మన్నన, ఆత్మీయ భావం ఇతనిలో ఓ పాలు ఎక్కువ. వాగు కింద వున్న పొలాన్ని సాగు చేసుకుంటున్నాడు.

"ఎట్లున్నది సేను? కొననింకనే ఖరారయ్యిందా?[1] " బాలయ్య మంచినీళ్ళ చెంబు, గ్లాసులు తెచ్చి, అరుగు మీద పెడుతూ రామనాథాన్ని అడిగాడు

" మంచి భూమి! కొందామనే నిశ్చయించుకున్నా. కాకపోతే కాలవ ఇంకా అక్కడ దాకా ఎప్పుడొస్తుందో-వచ్చినా చేనంతా నీళ్ళందేట్లు లేవు. అది ఒక్కటే కాస్త . . ."

" బాయి తవ్వనింక రాదు-రాయి పడ్తది "అన్నాడు బాలయ్య.

రామనాథం తలాడించాడు.

" దొర గడీకి[2] వచ్చారట కాదా? వెళ్దామా మరి?" రామనాథం అడిగాడు

" ఇప్పుణ్ణే పోదాం . . జర[3] నాస్తా[4] గిట్లజేసి. ." బాలయ్య గబగబ ఇంటి లోపలికి వెళ్ళాడు.

బాలయ్య వాళ్ళది ఓ మట్టి మిద్దె. మిద్దె ద్వారం ఎనిమిది అడుగుల ఎత్తు ఐదడుగుల వెడల్పు, ఎంతో రాజసం ఉట్టి పడుతోంది. చక్కగా చెక్కిన వడ్రంగి పనితనానికి నిదర్శనంగా వుందది. ద్వారానికి అటూ ఇటూ నాలుగడుగుల ఎత్తులో పెద్ద అరుగులు. అరుగుల చివరి దాకా సాగిన మిద్దె కప్పు చెక్కిన నాలుగు స్తంభాల మీద ఆనివుంది.

లచ్చుమమ్మ ఓ స్తంభానికి ఆనుకొని కూర్చుని వుంది. కొడుకు వెళ్ళిన వైపు చూసి రామనాథాన్ని పలకరించింది.

" ఏం బిడ్డా? సేను కొననింకె వొచ్చినవ్?"

" అవునమ్మా" రామనాథం వినయంగా జవాబిచ్చాడు.

" సేద్యం జేస్తావ్? ఎందుకు బిడ్డా? సదూకొన్నోనిలక్క[5] వున్నవ్ . . . సర్కారీ నౌక్రీకి[6] పోరాదె?" లచ్చుమమ్మ కూర్చున్న చోటి నుంచి లేచి వారి దగ్గరగా వచ్చి ఆరాతీసింది.

---

1. నిర్ణయమైనదా? 2 దొర నివాస స్థలం 3. కాస్త
4. ఉపాహారం 5. లాగా 6. ప్రభుత్వ ఉద్యోగం

దస్తగిరి రామనాథం చెవిలో గొణిగాడు, 'ఈ ముసిల్దానికి అవుసరం లేంది లేదు' - పైకి అన్నాడు " నౌక్రీ వదిలి పెట్టిండు "

లచ్చుమమ్మకు రామనాథం మీద ఎక్కడ లేని వాత్సల్యం ముంచుకొచ్చింది ".

" మంది యా వూరు బిడ్డా . . .?"

" రేపల్లె దగ్గర పల్లెటూరమ్మ . ."

" నదికి యా పక్క?"'

" కృష్ణానదికి దిగువ!"

" పెండ్లయిందా?"

రామనాథం నవ్వుతూ తలాడించాడు.

" బిడ్డలు?"

" ఒక కొడుకు, ఒక కూతురు."

" మా బాలయ్య క్కూడా గంతే! ఒక ఆడుపిల్ల - ఒక మగ పిల్లగాడు ఆ శీసైల[1] మల్లన్నకు మొక్కి మొక్కి ముడుపులు కట్టి నంక పిల్లగాడు పుట్టిండు. మల్లేశు, గద్వాల ఇస్కూల్ల[2] చదువుతుండు. ఆడుపిల్ల అలంపురం జోగులాంబకు జోతలెత్తి నంక పుట్టె. రేణ్క, పెండ్లాయే, మల్లేశ రేణ్క తానే వుంటుండు."

రామనాథం నవ్వుతూ తలాడిండు.

" నాకోడాలు నారాయణి పొద్దుగాల సేనికి పాయె, నడిగడ్డ కోడలు. సేల నాట్లు పెట్టిందంటే సక్కంగ[3] గీత గీసినట్టు!" అవ్వ కళ్ళెగ రేసింది.

బాలయ్య ఇంకా రాలేదమని దస్తగిరి ఇంట్లోకి తొంగి చూసాడు. ఏదో ఒకటి మాట్లాడాలని అవ్వతో అన్నాడు.

" నీ పేరేందే అవ్వా?"

" లచ్చుమమ్మ ". అవ్వ నోరుంతా విప్పి అంది.

"లక్ష్మమ్మా ? " రామనాథం రెట్టించాడు.

" ల్యా . . లచ్చుమమ్మ!" లచ్చుమమ్మ నవ్వుతూ అంది.

" సరేగానీ . . అవ్వా - ఇందాక మేము వచ్చినపుడు ఏదోపాట పాడు తున్నావే - ఆ పాట మళ్ళీ పాడవూ?" లచ్చుమమ్మను అడిగాడు రామనాథం.

లచ్చుమమ్మకి తన పాట వింటానంటే ఎంతో సంతోషం కలిగింది. రామనాథం ఎదురుగా కూచోని పాడడం మొదలెట్టింది.

" . . నేనేమి సేతూ - సేనెట్లు గాతూ-

---

1 శ్రీశైల 2 స్కూల్ 3 చక్కగా

నల్లనీ రాగట్ల తెల్ల జొన్నా లేస్తే
మొలిసీ మొలవక ముందే కోతింత పీకే-
కోతి పీకిందాని కోపాన నేనుంటే
ఉరికురి వచ్చేటి ఉడుతింత పీకే-"

రామనాధం నవ్వుతూ తలాడించాడు. లచ్చుమమ్మ మరింత ఉత్సాహంగా పాట కొనసాగించింది.

" ఉడుత పీకిందాని ఉరిమురి నేనుంటె
పసపస వచ్చేటి పందింత పీకే-"

" ఓ యమ్మ వాండ్లని మళ్ళా మన యింట్ల గిట్ల రానిచ్చుటట్లు లేవు!" బాలయ్యా నవ్వుతూ వచ్చాడు

" అలాంటిదేం లేదులెండి చక్కగా వుంది పాట. ఈ రోజు పాటంతా వినాల్సిందే నువ్వు పాడమ్మా" రామనాధం ఆమెని ప్రోత్సహించాడు

దస్తగిరి ముఖం చిట్లించాడు. అతనికి ముసిల్దాని బొంగురు గొంతు బోసినోటి పాట కర్ణకఠోరంగా వుంది

బాలయ్య ఇత్తడి పళ్ళాల్లో సర్దుకు తెచ్చిన, కజ్జికాయలు కారప్పూస వారికి అందించాడు. నారాయణమ్మ ఇంట్లో లేక పోవడంతో అతిథి మర్యాదలు చేయడానికి తబ్బిబ్బవుతున్నాడు. తడబడి పోతున్నాడు.

" తీసుకోన్రి బిడ్డా . .తినున్రి . . నా కోడాలు ముర్కులు[1] మంచిగ జేస్తది." అంది లచ్చుమమ్మ.

" పటుకు మన నింకె పండ్లు[2] లేవుగాని ముర్కులెట్లుండయ్యో గెట్ల తెలుసే అవ్వా నీకు?" చలపతి ఆటలు పట్టించాడు.

" ముసిల్ది ముక్కున జూసి చెప్తది- బిడ్డా!" లచ్చుమమ్మ నవ్వింది.

రామనాధం మళ్ళీపాడమని అడిగాక-ముసిముసి నవ్వులు నవ్వి-చేతులు వూపుతూ గొంతంతా ఎత్తి పాడింది. ఆపాటకు నేపథ్యంగా ఆమె చెంపల మీదకు. జారిన చెవుల మకర కుందనాలు నెమ్మదిగా ఊగుతున్నాయి.

" పంది పీకిందాని రంది[3]తో నేనుంటె
ఆవులేగా వచ్చి ఆయింత మేసే-
బాకి సాకి సేసి బక్కలను[4] నేకొంటే-
బాకి దీరక ముందే బక్కలే తరలే-

---

1 కారప్పూస, జంతికలు 2. పళ్ళు (Teeth) 3 చింత 4 పశువులు

కరణాలు కాపులు పన్నులడగా వస్తే
పన్ను గట్టకపోతే పట్టి తన్నేరూ-
నేనేమి సేతూ - సేనెట్లు గాతూ ''

అవ్వ రెండు చేతులు నెత్తిన పెట్టుకొని చేసిన అభినయానికి అందరూ నవ్వారు.

" ఇయ్యాల రేపు సేద్యం పని గట్లనే వుంది. ఆకులేని అడవిలోన మేకలు మేపబోయి నట్లుంది. కాదే?" బాలయ్య తల్లికి వంతపాడాడు. " కష్టమంతా కరణాల పాలు"

"నల్లనీ రాగట్ల తెల్ల జొన్నా లేస్తే-
అరువై యారు పుట్ల జొన్నలెల్లునురా!" అవ్వ తన పాట ముగించి-ముసిముసి నవ్వులు నవ్వింది.

" ఆసి. . .నీ. . !అవ్వా! మళ్ళా ఆ మాటంటవ్ . .!" దస్తగిరి ఆశ్చర్యంగా అన్నాడు.

" అవ్ బిడ్డా-నడిగడ్డ మింద నడ్కచిరి[1] పుట్టింది. నాగలి పట్టినోని ఇంట్ల సిరిలచ్చిమి నడిచొస్తది!"

" ఇంగ నీతో పెట్కుంటే కాలమే తీర్తది, పోదాం పద(ని" బాలయ్య చెప్పు వేసుకుంటూ అన్నాడు.

" వస్తామమ్మ-నీ పాటలు మళ్ళీ వింటాం''' రామనాథం వీడ్కోలు చెప్పాడు. అతనూ, దస్తగిరి అరుగు దిగి - నాలుగడులువేసి బాలయ్య కోసం నిల్చున్నారు.

" అయ్యో - కొడ్కా - సెల్లా మర్సినావు!" లచ్చుమమ్మ ఓ కేక పెట్టే సరికి బాలయ్య పై పంచ తీసుకొని - తలకు పాగా చుట్టు కున్నాడు.

ఇంతలో నారాయణమ్మ రానే వచ్చింది. నారాయణమ్మ ఎండకు కాగిన ముదురు రంగు మనిషి, ఎత్తు మధ్యస్తం. పలుచటి పొట్ట, వంట్లో కాస్తన్నా కొవ్వున్న ఛాయలేదు. కొత్తకోట చీరను మడమల పైకి కట్టి జారకుండా సన్నని వెండి వడ్డాణం పెట్టుకుంది. అంచురవిక, నల్లపూసలకు పుస్తెలు గుచ్చుకొంది, పుస్తెలతాడు మెడకు అంటి పెట్టుకొంది. ముక్కుకు అటూ ఇటు వెడల్పాటి అర్ధ చంద్రాకారపు ముక్కుపుడకలు. చేతుల నిండా ఆకుపచ్చ మట్టి గాజులు వాటి ముందు వెండి మురుగులు. కాళ్ళకు కడియాలు. నుదుటన రూపాయి బిళ్ళంత ముదురు గులాబి రంగు కుంకుమ బొట్టు. నున్నగా దువ్విన నూనె రాసిన జుట్టును కొప్పు కట్టింది. ఏదో పువ్వును తురుముకుంది.

---

1 నడుకసిరి · ఈమె "హలశత సహస్ర'' "గోశతసహస్ర" బిరుదాంకితుడు గురజాలకు చెందిన చాందమూలుని కుమార్తె అతడు శిస్తు రూపేణా వసూలు చేసిన ధనంతో శాస్త్రీయ వ్యవసాయాభివృద్ధికి నాగళ్ళను, ఎద్దులను దానం చేసాడు నడుకసిరి నడిగడ్డ మీదకు నాగళ్ళను తెచ్చింది ఆమె నాగళ్ళను పంచినపురం 'హలంపురం' నేటి ఆలంపూర్ నాగలి నడుస్తోంటే నాగేటిచాలులో సిరి పుడుతుంది నడుకసిరి నాగలికి చక్కటి పర్యాయపదం

"గప్పుడ్నే పోబడితిరి? నాస్తా గిట్ల చేసిన్రా లేదా?" హడావుడి పడింది, నారాయణమ్మ.

" ఆ. . .చేసినము గానీ . పనే మాయె?" బాలయ్య ఆరాతీసాడు.

" పైమళ్ళు ఆయె. కూలోల్లు సద్దికి దిగిన్రు. నేనిట్ల వస్తి."

" మంచిగ జేసినవ్-" బాలయ్య ఆమెని వచ్చిన వారికి పరిచయం చేసాడు. నారాయణమ్మ రామనాథంకి " నమస్తే " చెప్పింది. చలపతిని పలకరించింది.

" దొర సేను తీసుకోనింకెవొచ్చినోళ్ళు వీండ్లేనా. . .ఎట్ల?" ఆరా తీసింది.

"రామానమంతా[1] ఏమింటవ్?" బాల్చయ్య ఆమెతో పరాచికాలాడాడు.

" గిప్పుడు రామున్కి సీత ఏమయితదంటవ్!"

నారాయణమ్మ బాలయ్య వేళాకోళాలు పట్టించుకోకుండా రామనాథంతో అంది "దొర బేరం ఇస్తడులే! ఏంచేస్తడు? ఆ తిమ్మన్కి అప్ప జెప్పిండు. పోయి పాలమూర్ల కూసుండు. జొన్నలు పండ్తే పండినట్లు లేకుంటె లే! సారమున్న బావి. ఏంజేస్కోనింకె? అమ్మా పెట్టదు అడ్క తిన నివ్వదు - ఆయన నాటు పెట్టడు కవుల కియ్యడు బేకార్‌గా[3] సేను బీడు పెట్టిండు" నారాయణమ్మ వేళ్ళువిరిచింది

" పశుల మేత పండ్తది - తియ్ !" బాలయ్య ఆమెను ఊరడించి నట్లుగా అన్నాడు. అందరూ నవ్వారు.

" పదన్రి . పదన్రి - దొరకు గుస్స[3] వస్తది!"' చలపతి తొందర చేసాడు ముగ్గురూ దొర ఇల్లు - వైపుగా బయలు దేరారు.

రామనాధానికి దొరతో భేటీ తలచుకొంటే ఎంతో ఆందోళన గానూ ఆశ్చర్యంగానూ వుంది.

ప్రధానంగా ఆ భూమిని సాగులోకి తేవడంలో కొన్ని సమస్యలున్నాయి. నీటి ఎద్దడి ముఖ్యమైంది. కాలువలకి నీళ్ళు వదిలే దాకా తిప్పలే. ఇక దొరతో బేరం అనేది చేసాక వెనక్కి వెళ్ళడం ! ఏమో? అంతా సందిగ్ధంగా వూగిసలాటగా వుంది.

'నిజంగా బేరం వీళ్ళన్నంత తేలికగా కుదిరి పోతుందా?' రామనాధం మనసులో దొరల గురించి విన్ననంతా మెదిలింది. 'దొర గడీకి వెళ్ళడమే!'

నరసింహం కిందవున్న ఈ ప్రాంత భూముల బాగోగులు తిమ్మడు చూస్తాడు. వర్షాధారంగా పొలంలో సాగు కష్టంగా వుంది. పైనుంచి, రైతు కూలీలు అతని పొలంలో పని చేయడానికి సిద్ధంగాలేరు.

ఇంకా ఏ మాత్రం దొరతనం వదలని దొర, అతని మనుషులు పని చేయడం కూలీల విధి అన్నట్లుగా - కూలీడబ్బు చెల్లించే విషయంలో మొండికెత్తారు. వెట్టి చేసే ఓపిక రైతులకు

1. రామాయణం 2. అనవసరంగా 3 కోపం

లేదు. ఎకరమో, అరెకరమో, సొంతంగా సేద్యం చేసుకొని - తిండి జరిగితే చాలున్నట్లుగా - రోజులు వెళ్ళదీస్తున్నారు. వీటికి తోడు వస్తుంది వస్తుందనుకొన్న ప్రాజెక్టు ఎంతకీ పూర్తి కావడంలేదు. కాలువల తవ్వకాలు ఎప్పుడు పూర్తవుతాయో నీరు కాలువలని ఎప్పుడు చేరుతుందో ఇంకా స్పష్టం కాలేదు.

పాలమూర్లో స్థిరపడుతోన్న దొరకు ఇక్కడి భూమిపై మమకారం ఏ మాత్రమూ లేదు. అందుకనే సాధ్యమైనంత త్వరలో దీనిని వదిలించుకోవాలని చూస్తున్నాడు. ఈ మధ్య అబ్కారీ పాట పాడాడు. పైసా రాల్చని పైరు కన్నా సారాయి వ్యాపారం మేలని నిర్ణయానికి వచ్చాడు బేరానికి వస్తానన్న బాలయ్య, రామనాథాల కోసం అసహనంగా ఎదురు చూస్తూ - కొడుకు భూపాలుతో మాట్లాడుతూ కూర్చుని వున్నాడు, తిమ్మన్న అక్కడి పొలం బాగోగులు ఏకరువు పెడుతున్నాడు.

గడీకి అల్లంత దూరాన వుండగానే, " ఇగో . ఈ సుట్టముక్క పీల్చి గిప్పుడ్నే వస్త" అంటు దస్తగిరి మెల్లగా పక్క సందులోకి జారుకున్నాడు.

బాలయ్య, రామనాథం గడీ లోకి ప్రవేశించారు.

రామనాథానికి కుతూహలంగానూ ఆందోళనగానూ వుంది. గడీ . . . దాని చుట్టూ అల్లుకున్న విషాదగాథలు అతని మనసులో మెదిలాయి. ద్వారంలో నిలబడి చుట్టూ పరిశీలనగా చూసాడు.

ప్రహరీ గోడ నీడలో ఓ జీపు నిలిపివుంది.

దర్వాజ ద్వారం పదడుగుల ఎత్తుతో ఆరడుగుల వెడల్పుతో గంభీరంగా వుంది. తలుపులకున్న కొయ్య గుబ్బలు - వాటిపై తాపడం చేసిన ఇనుప గుబ్బలు మొనదేలి మరింత గంభీరంగా వున్నాయి. ఇనుప గుబ్బలు పోషణలేకో ఏమో తుప్పుపట్టాయి. దొరవుండే రోజుల్లో ఆ మొనలు నల్లని పిశాచి కోరల్లా నిగనిగ లాడుతూ ఉండేవేమో.

ఎత్తైన గడప, ఏకాలంనాడో రాసినట్లున్న పసుపు. బహుశా ఆడు పాపల కన్నీటి ధారల్లో కరిగి పోయినట్లుంది.

గడీ - ద్వారమే ఇలా వుందంటే ఇక భవనం . . .!

ఒక పెద్ద సున్నం మిద్దె, కొయ్యదంతుల ఆసరాతో నిలిచిన పెద్ద వసారా. ముందు వైపుగా వున్న మెట్లెక్కి వెళితే పైన అర్రలు అనబడే గదులు. బహుశా ఆ అర్రల గోడలే ఎంతో మంది అమాయక స్త్రీల ఆర్తనాదాలతో ప్రతిధ్వనించి వుంటాయి. ఆ మెట్లమీదే ఎందరో అ భాగ్య స్త్రీలు తమ జీవితాల్ని జారవిడుచుకొని వుంటారు.

రామనాథం పెదవులు కంపించాయి.

పెద్ద వేప చెట్టు. దాని చుట్టూ వేసిన దిమ్మె. చెట్టుకొమ్మలు నల్లగా మొద్దుబారి పోయి వున్నాయి. ఆకులు ఉండమా ఊడమా అన్నట్లుగా పచ్చబడి ఊగిసలాడుతున్నాయి. ఆ ఆకుల

గుండా గుసగుస లాడుతోన్న గాలి ఏ కమ్చీల దెబ్బల ఏ కొరడా ఝళింపుల ఏ ఆడుపాపల కన్నీటి కథను చెప్పాలని ప్రయత్నిస్తుందో-

రామనాథం హృదయం విషాదంలో మునిగి పోయింది. గొంతుతడారి పోయిన అనుభూతి కలిగింది

రామనాథంకి తన పరిస్థితి తనకే ఆశ్చర్యంగా వుంది పైపంచతో ముఖం తుడుచుకొని గొంతు సవరించుకొన్నాడు కొనడానికి వచ్చినవాడు తను ఈ పూట తనది పైచేయిగా వుండాలి

రామనాథం తనని తాను సర్దిచెప్పుకొన్నాడు అయినా అందరు దొరలూ ఒక్కలానే వుంటారా ? వాళ్ళలోనూ మంచీచెడూ వుండదూ? అలా అనుకున్న క్షణంలోనే

అప్పటిదాకా రాక్షసుడి గుహలాగా తోచిన దొరగడీ - విచిత్రంగా దొర యిల్లులా మాత్రమే కనిపించింది

"ఏది అక్కడ్నే ఆగిన్రు రాన్రి పోదాము" బాలయ్య వెనక్కి తిరిగి రామనాథాన్ని పిలిచాడు.

బాలయ్య కంఠం బలహీనమవ్వడం రామనాథం గమనించాడు. ఇంతలో, మోకాళ్ళ దాకా వున్న ఖాకీ నిక్కరు, కురచ చేతుల బనీను, మెడలో తాయెత్తు - చేతిలో పెద్ద కర్రతో ఒకతను బయటకు వచ్చాడు. అతను కండలు తిరిగి - వస్తాదులా వున్నాడు. పెద్ద మీసకట్టు. చిన్నికళ్ళు ఏదో గర్వం అతని ముఖంలో దోబూచులాడుతోంది.

అతను చెవి వెనక నుంచి బీడీ తీసాడు. బీడీ చివర కొరికి తుపుక్కున ఊస్తూ వీళ్ళ దగ్గరకి వచ్చాడు.

"ఇంతసేపు జేసిన్రు - దొర పాలమూరు పోబోతుండు!" అతని కంఠం గరగర లాడింది.

"జల్దీ[1] రానింకెనే చూస్న - దొర కోపమైతుండా?" బాలయ్య గొంతు మరీ బలహీనమ పోయింది

"లేదు - చిందొర వచ్చిండు వాళ్ళు వాళ్ళు బాతాఖానీ[2] జేస్తున్రు" అతను బీడి ముట్టించ కుండానే పెదాల మధ్య వుంచి మాట్లాడుతున్నాడు.

"జర[3] చెప్పి రారాదూ - మేమొచ్చినమని" బాలయ్య కంఠం అతనికి తెలియకుండానే బతిమి లాడింది.

"జల్దీ[4] మీదున్నవే- ఇక్కడ్నే ఉండుని - గిప్పడ్నేవస్త" అతను రామనాథాన్ని పైనుంచి కిందికి తేలిపారజూచి - లోపలికి వెళ్ళాడు.

"ఎవరతను?" రామనాథం అతను కనుమరుగవ్వగానే అడిగాడు

---

1 తొందరగా 2 కబుర్లు 3 కొంచెం 4 తొందర

"వడ్డేపల్లి తిమ్మడు!" బాలయ్య రహస్యం చెప్పినట్లుగా చెప్పాడు.

'బహుశా నారాయణమ్మ ప్రస్తావించిన తిమ్మడూ ఇతనేమో'. రామనాథం తలాడించి ఆ పరిసరాల్ని పరిశీలిస్తూ నిల్చున్నాడు.

ఎండ చురుక్కుమంటోంది.

ఓ కాకి నల్లటి వేపకొమ్మల మీద ఒక దాన్నుంచి మరోదాని మీదకు గెంతుతోంది. అప్పుడో పుల్ల ఇప్పుడో పుల్ల పుటుక్కుమన్న శబ్దం తప్ప మరో శబ్దం లేదు. అప్పుడో ఆకు ఇప్పుడో ఆకు గాలిలో వయ్యారంగా వూగుతూ రాలి పడుతోంది. అడ్డ దిడ్డంగా వేసిన నాపరాళ్ళు ఆవరణంతా పరుచుకొని వున్నాయి. నాపరాళ్ళ మధ్య నిగడదన్నుకొన్న గరిక మొక్కలు అప్పుడప్పుడు పక పక మంటున్నాయి.

బాలయ్య రామనాథం దగ్గరకి వచ్చి నెమ్మదిగా గుసగుస లాడాడు. రామనాథం కాస్త వంగి చెవి అందించాడు.

"ఏం వైబోగముండె ఆ కాలంల! మా అసుంటోల్లం గడప దాట్తుంటిమా? ఏం కళ! ఏం కత! అంతాపాయె !"

బాలయ్య పెదవి విరిచాడు. రామనాథం తలాడించాడు.

ఇంతలో తిమ్మన్న తలవాకిటకు వచ్చి లోపలికి రమ్మని చేతిసైగ చేసాడు.

బాలయ్య చెప్పులు విడిచి, తలపాగా విప్పాడు. పైపంచ మడిచి చంకలో పెట్టుకొన్నాడు చేతులు కట్టుకొని తలవంచుకొని గబగబ ముందుకు నడిచాడు.

రామనాథం కూడా బాలయ్య విడిచిన దగ్గరే చెప్పులు విడిచి అతని వెనకే నడిచాడు.

ముందు నడుస్తోన్న తిమ్మన్న అడుగుల బలానికి భూమి అదురుతోందా అన్నట్లుగా వుంది.

బాలయ్య అడుగులు వణుకుతోన్నట్లుగా బలహీనంగా పడుతున్నాయి.

రామనాథం తన ఆందోళనను ఒక్కో అడుగు కిందా అణుచుకుంటు గంభీరంగా నడిచాడు.

తిమ్మన్న వాళ్ళని తిన్నగా ఓ పెద్ద హాలులోకి తీసుకెళ్ళాడు. తలుపు దగ్గర వాళ్ళనాపి, తను లోపలికి వెళ్లి వచ్చాడు.

"పొన్రి!" అంటూ తన చెవి వెనకదూర్చిన బీడీ ముక్కనుతీసి చేతిలో పట్టుకొని తిమ్మడు బయటకు వెళ్ళి పోయాడు.

రామనాథం, బాలయ్య లోపలికి నడిచాడు.

అప్పటి దాకా మాట్లాడుకుంటున్న వాళ్ళిద్దరూ దొర - అతని కొడుకు నిశ్శబ్దమై పోయారు. ఇద్దర్నీ చూడగానే పోల్చుకొనేట్టు వున్నారు.

నరసింహం దొర ఓ పాత కొయ్య కుర్చీలో కూర్చొని వున్నాడు. అతని పక్కనే అలాంటి మరో కుర్చీలో అతని కొడుకు భూపాలు దొర కూర్చున్నాడు. అతని కాళ్ళ దగ్గర గొలుసు పట్టు తప్పితే దూకడానికి సిద్ధంగా వున్న పెద్ద పెద్ద ఆల్సేషియన్ కుక్కలు ఉన్నాయి. అవి కొత్తవారిని చూడడంతోనే గొలుసువిడిపించుకోవాలనే ప్రయత్నంలో గుర్రు మంటూ బలంగా కదిలాయి. భూపాలు వాటిని నిమరడంతో అదో మాదిరిగా మూలిగాయి. అతని కాళ్ళ దగ్గరే ముడుచు కొన్నాయి. వచ్చిన వాళ్ళను మిర్రి మిర్రి చూస్తూ - నోరు తెరిచి - నాలుకు వేలాడేసి వగర్చు తున్నాయి.

నరసింహం దొర సింహం లానే వున్నాడు. చదరం లాగున్న ముఖం. కోటేరు ముక్కు. చురుకైన చూపు మంచి ఒడ్డూ పొడవు. బలమైన ఛాతీ, అతని పెద్ద పెద్ద మీసాలు అతను మాట్లాడుతుంటే పైకి కిందికి తమాషాగా కదులు తున్నాయి. చిన్ని కళ్ళు రాత్రి తాగిన సీమ సరుకు మిగిల్చిన ఎర్రదనాన్ని చిమ్ముతున్నాయి. గ్లాస్కో పంచె కట్టి - పొడవాటి చొక్కా వేసుకొని వున్నాడు.

భూపాలు బడి విడిచి కాలేజి చేరిన పిల్లాడిలా వున్నాడు. తండ్రికి మల్లే భారీ మనిషి.

రామనాథం హాలుని పరిశీలనగా చూసాడు.

గోడకు అలంకరించిన జింక చర్మాలు బూజు చాటునుండి తమ ఉనికిని చాటుకుంటున్నాయి

ఎవరివో నిలువెత్తు చిత్రపటాలు రూపం గుర్తు పట్టలేనట్లుగా దుమ్ము పట్టి వున్నాయి. ఓ పక్కగా గోడలో నిలువుటద్దం అమర్చి వుంది.

హాలు హాయిగా చల్లగా వుంది. పైన దూలం నుండి గుడ్డ పంఖా వేళ్ళాడుతోంది. దాని నుంచి వేళ్ళాడే తాడు చుట్టగా చుట్టి పెట్టి వుంది. బహుశా ఏ బేగారో[1] విగ్రహంలా నిలబడి తాడు పట్టుకొని అటూ ఇటూ వూపుతూ వుండే వాడేమో -

"మీరేనా రాంనాధం?" దొర కంఠం ఖంగుమంది.

అప్పటికే బాలయ్య నేలకంటా వంగి సలాం చేసి, పైపంచ చంకలో ఇరికించుకొని, చేతులు కట్టుకొని, పక్కగా నిల్చుని వున్నాడు.

రామనాథం ఏం చేయాలో తెలీక నమస్కారం చెప్పి వూరుకొన్నాడు.

అది బహుశా దొర దృష్టికి ఆనినట్లుగా లేదు.

"అవునండి!" రామనాధం సమాధానం ఇచ్చాడు.

"కూసోన్రి!" దొర కంఠం మళ్ళీ ఖంగుమంది.

రామనాథం చుట్టూ చూసాడు.

---

1. వెట్టి చేసేవాడు

దొర పక్కనే కుర్చీలు రెండు ఖాళీగా వున్నాయి. అక్కడికి వెళ్ళి కూర్చోవాలా? తనకూ వారికీ మధ్య ఇరవై అడుగుల దూరం. రామనాథానికి ఏమీ తోచక ముందే బాలయ్య నేలమీద గొంతుక్కూర్చున్నాడు. అతని పైపంచ కాళ్ళమీద వుంచుకొన్నాడు. తల భూమిలో పాతేసినట్లుగా వంచుకున్నాడు.

"నీ కాల్మొక్తా బాంచెన్! గులాపోణ్ణి[1]!" అంటున్నట్లుగా వున్నాడు బాలయ్య.

'ఇలాంటి వారేనా దొరలను పల్లెల్లోంచి తరిమి తరిమి కొట్టింది!' రామనాథం ఆశ్చర్యంగా అనుకొన్నాడు.

దొర మరోసారి కూర్చోమని చెప్పి - ఈ సారి చేత్తో నేలవైపు చూపించాడు అతని చూపుడు వేలు మూర్తీభవించిన అహంకారంలాగా వుంది.

రామనాథం నరాల్లో రక్తం సలసల పొంగింది. 'ఆ దొర అంత సంస్కార రహితంగా ఎలా ప్రవర్తిస్తున్నాడు? ఇంటికి వచ్చిన వారికి ఇలాంటి సన్మానమా?' రామనాథం లోలోన కుతకుతలాడిపోయాడు. గిర్రున తిరిగి వెనక్కి పోదామని అనుకొన్నాడు 'కానీ, వచ్చిన పని ?'

రామనాథం దొర వంక పరిశీలనగా చూసాడు

అతని నలు చదరపు ముఖం నవ్వుతో విప్పారివుంది

"మీరు మద్రాస్‌ల చదివిన్రంట గదా?"

రామనాథంకి ఆశ్చర్యం వేసింది. 'అన్నీ తెలిసే అతనలా ప్రవర్తిస్తున్నాడా? అవమానించాలనేనా? లేకపోతే - అలా ప్రవర్తించడం అతనికి అలవాటయి పోయిందా?' రామనాథం కోపాన్ని అణుచుకొని నెమ్మదిగా అన్నాడు

"అవునండి".

మూడోమారు దొర రామనాథాన్ని కూర్చోమని చెప్పాడు

ఇక, ఇన్నిసార్లు చెప్పించుకున్నాక కూర్చోకపోవడం అమర్యాదగా వుంటుందన్న స్పృహ రామనాథానికి కలిగింది 'ఛ' అతనుసంస్కార రహితంగా ప్రవర్తిస్తే - మరి తన సంస్కారం ఏమయింది? కార్యసాధకుడు ఒక చోట పూసెజ్జపై పవళించినా మరోచోట కటిక నేలపై పడుకోవడానికి సిద్ధంగా వుండాలని కదూ ... అంటారు ! ఇప్పుడు ఎక్కడ కూర్చున్నానన్న దానికన్నా కార్యం సాధించు కోవడం ముఖ్యం. అదీకాక దొర కాళ్ళ దగ్గర కూర్చోవలసి వచ్చినంత మాత్రాన దొరతనాన్ని నెత్తిన పెట్టుకున్నట్లు కాదుగా? దాసానుదాసుండ అంటూ సాగిలపడి సమర్పించుకొన్నట్లూ కాదు రామనాథం బాలయ్య ఎదురుగా బాసింపట్టు వేసుక్కూర్చున్నాడు.

దొర రామనాథాన్ని చూసి తృప్తిగా తలాడించి అడిగాడు -

"బాలయ్య ఏమంటుండు? బేరమేంది?"

---

1 బానిసను

"నీవెంత చెప్తె అంతే దొరా! మేమెంత నీకు చెప్పనిన్కి?" బాలయ్య వినయం ఉట్టి పడుతుండగా అన్నాడు.

"అంగ్రేజి దొర[1]ల కింద సదివినోళ్ళు మన మాట ఇంటారే !" దొర పెద్దగా నవ్వాడు.

కుక్కలు అసహనంగా మూలిగాయి.

భూపాలు రామనాథం వంక ఓ అద్భుతాన్ని చూసినట్లు చూసాడు.

" అదేంది దొరా - నీ మాట ఎవ్వరు దాట్తిరి ?" బాలయ్య మళ్ళీ నివేదించుకొన్నాడు

"చూడువయ్యా రాంనాథం - నా మాట ఒక్కవేయి ఎక్రాకు - నీమాట చెప్పు మల్ల-ఫైస్లా[2] చేతాం" దొర - గడ్డం పైకెత్తి కిందికి చూస్తూ చూపుడు వేలాడిస్తూ - అన్నాడు

బాలయ్య మనసులోనే దొర ఆశపోతు తనానికి తిట్టు కున్నాడు 'పదినూర్లు ఎక్రాకా ? వీని శిరుసు పగల ! జొన్న పండే చేల తిననింకె గింజ రాలదు ! అయిదు నూర్లంటే మస్తు ! వీని ఆశ తీన్కపోయి తుంగల కుక్క !' బాలయ్య లోలోనే శపించాడు.

రామనాథం మరోలా ఆలోచించాడు 'కాలువకి దిగువగా వున్న తమ వూళ్ళో గరువు చేలు ఎంత లేదన్నా ఎకరా పదివేలు తగ్గదు అయినా నాట్లు పెట్టాలంటే నీళ్ళు అందేదాకా నోళ్ళు వెళ్ళబెట్టుకు చూడాలి దొర పొలం రాబోయే కాలవకు ఎగువన వుంది నాణ్యమైన నల్లరేగడి భూములు నాలుగు రోజులు అటూ ఇటైనా బంగారం పండుతుంది '.

బాలయ్య సందేహిస్తూ సందేహిస్తూ అడిగాడు, "దొరా . బేరం ఎక్కువయితాదేమొ .... జర ... సూసి చెప్పు దొరా .. "

రామనాథం బాలయ్యను మాట పూర్తి చేయకుండా వారించాడు "నాకు సమ్మతమే నరసింహంగారూ ! రిజిస్ట్రేషన్ ఎప్పుడు పెట్టుకుందాం ?"

నరసింహం దొరకు ఆశ్చర్యంగా వుంది మారు మాట్లాడకుండా తను కోరినంత బేరం కుదరడం మహానందంగా వుంది తన దొరతనం చూడమన్నట్లు బాలయ్యను చూసి మీసాలు దువ్వాడు

బాలయ్యకు రామనాథానికి భూమిని గురించి వాటి ధరలను గురించి తెలియని తనం మీద బోలెడంత దిగులేసింది

"ఎప్పుడు దుడ్లిస్తే[3] అప్పుడ్నే ! " అన్నాడు నరసింహం దొర.

రామనాథం ఓ క్షణం ఆలోచించాడు 'ఊరికి వెళ్ళిరావడానికి డబ్బు సమకూర్చుకోవడానికి కనీసం పది రోజులైనా పడుతుంది. ఇంతకీ అమ్మ ఏమంటుందో - అన్నయ్య ఏమంటాడో' అందుకే అన్నాడు."ఊరెళ్ళి రావాలండి ! పదిహేను రోజులైనా పడుతుందేమో ! "

1 ఇంగ్లీషువారు 2. నిర్ణయం 3 డబ్బులు

" సెప్పినట్లు రావాలె ! సానా దినాలయితే ఇంకోర్కి బేరంపెడ్తా " !
నరసింహం దొర ఖరాఖండిగా చెప్పాడు - అతనికి డబ్బు తొందరగా అవసరముందున్న విషయాన్ని వ్యక్తపరచకుండా !

'అవ్‌మల్ల ! మా దుబ్బ[1] బేరాలు నెత్తి మీదుండే !' బాలయ్య మనసులోనే దొరను వెక్కిరించాడు. పైకి వినయం వుట్టిపడుతుండగా అన్నాడు.

"దొరా .. దుక్కి దినాలు మొదలాయే - సేద్యం సేసెటోడు రాకుండ ఎట్లుంటడు ? "

"అవ్ ... అది నిజమే ! " నరసింహం దొర తలాడించాడు.

"నా పతా[2] గిట్ల ఎర్కే కదా ? ఏం సంగతీ వూరికి బోయినింక చిట్టీ[3]రాయి "

రామనాథం మరోమారు దొరకి చెప్పి - నమస్కారం పెట్టి బయటికి నడిచాడు

తలుపెత్తున్న, రామనాథం విగ్రహం చూస్తూ భూపాలు తండ్రితో అన్నాడు,

"ఆయన దొర లాగున్నడు కాదే నాయానా ? "

నరసింహం దొర మాట్లాడకుండా మీసం దువ్వుకున్నాడు.



---

1 లావు 2. చిరునామా 3 ఉత్తరం

# 2

"చిన్న మావయొచ్చాడు . .. ..... చిన్నమావయొచ్చాడు . .. ... "అనూరాధ సంతోషంగా గెంతులు గెంతుతూ వంటింట్లోకి వచ్చింది

వచ్చినంత వేగంగా - మంచినీళ్ళకుండలో గ్లాసు ముంచుకొని - పెద్దింట్లోకి పరుగులు తీసింది.

వంటింట్లోని ఆడవాళ్ళ ముఖాలు ఒక్కసారిగా విప్పారాయి.

శాంతమ్మ - తోడికోడలు సావిత్రి వైపు చూసి ముసి ముసి నవ్వులు నవ్వుతూ అంది - "పిల్లకు రెండుకాళ్ళూ ఒక చోట ఆనవు కదా ? "

తోడికోడళ్ళిద్దరూ కొంగులకు చేతులు తుడుచుకొంటూ పెద్దింటివైపు నడిచారు.

నాలుగడుగులు వేసాక, శాంతమ్మ ఏదోజ్ఞాపకం వచ్చినట్లు ఆగింది వెనక్కి వచ్చి మరిదికి ఇష్టమని మాపటికి గారెలకు మినపప్పు నానేసి - మళ్ళీ వెళ్ళింది.

అప్పటికే అందరూ ముందు వసారాలో చేరి వున్నారు. ఏడాది తరువాత వచ్చిన రామనాథాన్ని కుటుంబమంతా సంతోషంగా ఆహ్వానించింది. ఆప్యాయంగా పలకరించింది.

రామనాథం నవారు మంచం మీద కూర్చున్నాడు. అటూ ఇటూ అనూరాధ, పున్నమ్మ ఎదురుగా మరో మంచం మీద రత్తయ్య, కల్యాణి కూర్చొని వున్నారు శివుడు, సుధాకర్ గట్టుమీద కూర్చున్నారు.

పున్నమ్మ రామనాథం తల్లి. అనూరాధ రామనాథానికి మేనకోడలు. రత్తయ్య, శాంతమ్మ - రామనాథం అన్నావదినలు రత్తయ్య కూతుర్లు - పద్మ, సరళ - ఇద్దరి పెళ్ళయి అత్తారింట వున్నారు. శివుడు రత్తయ్య కొడుకు ఇక, సావిత్రి రామనాథం భార్య. సుధాకర్, కల్యాణి వారి పిల్లలు.

"ఏరా అబ్బాయ్ - ఇట్టా చిక్కిపోయా ! " పున్నమ్మ కొడుకుని తనివి తీరా తడుముతూ అంది.

"అవున్రా । మరీ నల్లపూసయి పోయావ్ ! " రత్తయ్య తమ్ముడ్ని కళ్ళరా చూస్తూ అన్నాడు.

"మరే - కాలం నాడు మీ తమ్ముడు వెన్నపూసయ్యే ! " శాంతమ్మ మరిదిని ఆటలు పట్టించినట్లుగా రత్తయ్యతో అంది.

అందరూ నవ్వారు శాంతమ్మ మరిదిని ఆప్యాయంగా పలకరించింది. సావిత్రి కూడా మాట్లాడి - స్నానానికి పొంతవేయడానికి లోపలకి వెళ్ళింది.

"నా మతి మండి పోనూ - ఎసరు కాగిపోతందేమో - బియ్యం ఎయ్యాలి" అంటూ శాంతమ్మ కూడా గబగబ వెళ్ళింది రత్తయ్య కూడా లేచి గబగబ వెళ్ళాడు.

"మరక్కడ - జొన్నరొట్టి తింటారటగా బాబాయ్ "

శివుడు కుతూహలంగా అడిగాడు. అందరూ ఉత్సాహంగా నైజాం విశేషాలు చెప్పించుకుంటున్నారు.

ఇంతలో రత్తయ్య వెళ్ళినంత వేగంగా వచ్చాడు. తాటికాయలు ఓ మామిడికాయ తీసుకొచ్చాడు.

"తమ్ముడూ - నీ కోసం రెండుతాళ్ళు అట్టాగే అట్టిపెట్టా - ఈ ఏడాది ఒక్క ముంజయనా తిన్నావు కాదు. ! "అంటూ రత్తయ్య తాటికాయల్ని గట్టుపక్కన పెట్టాడు. చూరులోంచి కొడవలి తీసి - పైపంచతో తుడిచాడు.

"చూడు చిన్నమావయ్యా .. ...... నీ కోసమని అట్టిపెట్టి - మాకెవరకీ ఆ తాటి చెట్ల కాయలు పెట్టలా .... !" అనూరాధ ఫిర్యాదు చేసింది.

"ఓసి నీ అసాధ్యం కూలా - అరెకరం తాటిచెట్ల కాయలు అమాంతం తింటివి కదే ! " రత్తయ్య అనూరాధ నెత్తిన చిన్న మొట్టికాయ వేసాడు

" అరెకరం తాటిచెట్లేం ఖర్మ ఆరెకరాల తాటిచెట్లూ సరిపోవు ! అవురావురంటోన్న అమ్మాయి గారి కడుపు కంబాల చెరువయ్యే ! " సుధాకర్ అనురాధని వేళాకోళాలాడాడు.

"చాల్లే బడాయి - అక్కడికి కంబాలచెరువు చూసొచ్చినట్లు ! " అనురాధ ఉక్రోషంగా బదులిచ్చింది.

"ఇంక కంబాల చెరువు చూడ్డం ఎందుకూ ? దండగ ? నిన్నూ నీ కడుపుని చూసాంగా ! " శివుడు సుధాకర్‌కి సాయానికి వచ్చి అన్నాడు.

"పోనీంద్రా .. చిన్నపిల్ల ! " రత్తయ్య అనూరాధను వెనకేసుకొచ్చాడు.

రామనాథం అందర్నీ ఆనందంగా చూస్తున్నాడు.

రత్తయ్య కొడవలి మొనతో నాజూకుగా తాటికాయల్లోంచి ముంజెను తీసి మొదటిది అనూరాధకే ఇచ్చాడు. అనూరాధ ఆ ముంజును అమాంతం రామనాథం నోట్లో కుక్కినంత పని చేసింది.

"వుండవే .......... అన్నీ ఆత్రపుపన్లు ! చూడు వాడి బట్టల్నిండా మరకలు - --" పున్నమ్మ రామనాథం చొక్కామీద చిందిన ముంజలోని నీటిని విదిలిస్తూ - అంది.

"అన్నయ్యా --అక్కడ సీతాఫలాలు వుంటాయి. ఎంత బావుంటాయని ! పండు చెట్టు

మీదే మాగితే భలే రుచిలే ! అమృతమే అనుకో ! నీ కోసం కొన్ని విత్తనాలు తెచ్చానన్నయ్య - ఓ తాటి తోపుగట్ల మీద వేయి'' రామనాథం లేచి తన బ్యాగ్ లోంచి విత్తనాల పొట్లం తీసిచ్చాడు

రత్తయ్య బంగారం పుచ్చుకున్నంత సంబరంగా పుచ్చుకొన్నాడు

తన తమ్ముడు తన కోసం తెచ్చిన ఆ అమూల్య బహుమతి అతనికి అపరిమితమైన ఆనందాన్నిచ్చింది. రత్తయ్య ఉత్సాహంగా పొట్లం విప్పి చూసాడు సీతాఫలం విత్తనాలు సన్నగా కోలగా నల్లగా నిగనిగలాడుతున్నాయి.

"సపోటా గింజల్ని కుదించినట్లున్నాయిరా .. ! "

"ఏవీ .. ఏవీ . ?'' పిల్లలు ఆసక్తిగా గింజల్ని చూడడానికి రత్తయ్య మీదికి ఎగబడ్డారు.

"అబ్బబ్బ ఉండండ్రా .. ఆత్రగాళ్ళకి బుద్ధిమట్టని ఊరికే అన్నారా ? కుదురుగా కూచోండి ! '' రత్తయ్య పిల్లల్ని గదిమాడు

పిల్లలకి దూరాన్నుంచే చూపించి, గబగబ పొట్లం కట్టి చూరులో దాచొచ్చాడు కల్యాణి బుంగమూతి పెట్టుకొని, కాళ్ళు టపటపలాడిస్తూ రామనాథం పక్కన వచ్చి కూర్చుంది.

"నాన్నా నాన్నా . . ఈసారి మాకోసం బోలెడు విత్తనాలు తీసుకురావూ'" రామనాథాన్ని బతిమిలాడినట్లుగా అంది కల్యాణి.

"తేవడం దేనికి ? వచ్చే ఏటికి గింజకో చెట్టు - పై ఏటికి చెట్టు నిండా కాయలు - కాయల్నిండా గింజలు . ''రత్తయ్య కళ్ళు మిలమిల మెరిసాయి "అంతెందుకు, మీరు వాటితో వామనగుంటలు[1] కూడా ఆడుకోవచ్చు ...''

పిల్లలకీ సంతోషమేసింది

ఇంతలో పక్కింటి నాగయ్యగారి కోడలు గోడ అవతల నుంచి కేకేసింది.

"పున్నమ్మప్పొ . అబ్బాయొచ్చాడంటగా ? ఇదుగో ..... . ఈ ఉలవ నీరందుకో ఆ శాంతాన్ని ఓ కరేపాకు రెబ్బేసి చారెట్టమను - '' ఆమె ఉలవనీరున్న గిన్నెను పున్నమ్మకు అందించింది.

వారి మాటలు విని ఎదురింటి సుందరం గారి భార్య వాకిట్లోకి వచ్చింది. రామనాథాన్ని పలకరించాక, అనూరాధని కేకేసింది.

" మా ఎఱ్ఱిపడ్డ[2] నిన్న సందేళ ఈనింది. జున్ను తీసుకెళుదువుగానీ - రావే - అనూరాధా'',

పిల్లలు పోటీలు పడి వాళ్ళింటికి పరిగెత్తారు.

పొంతలో నీళ్ళు మసిలి పోతున్నాయని సావిత్రి వచ్చింది.

అమ్మలక్కలు ఇళ్ళకు మళ్ళారు. రామనాథం లోనికి వెళ్ళడానికి లేచాడు

సావిత్రి రామనాథం బ్యాగు తీసుకొస్తూ అడిగింది, "బ్యాగులోని బట్టలన్నీ చాకలాడికి వేసేవేగా ? ''

---

1. ఒక ఆట 2 గేదె

"అ ... వేసేయి. కాకపోతే అందులో ఓ చిన్నమూట వుంది. అది కదిలించమాక "

"మూటలో ఏం ముల్లె తెచ్చారేమిటి ?" సావిత్రి నవ్వుతూ అడిగింది.

"సమయం రానీ - నేనే చూపిస్తాగా ! "

రామనాధం స్నానానికి వెళ్ళేసరికి గాబు దగ్గర చిన్నపీట, చెంబులో కుంకుడురసం, బక్కెట్టులో వేణ్ణీల్లు సిద్ధంగా వున్నాయి. పున్నమ్మ తలమీద కుంకుడు రసం పోస్తూ వుంటే - రామనాధం తలంటు కొన్నాడు.

ఇంతలో ఉలవచారు, గారెలు, జున్ను అన్నీ సిద్ధమయ్యాయి. అందరూ కలిసి భోంచేసి, కొబ్బరి చెట్లకింద మంచాలు వేసుకొన్నారు.

"మావయ్యా ... ఓ మంచి పాట చెప్పవూ !" ఇంతలో అనూరాధ, కల్యాణి వచ్చి రామనాధానికి చెరో పక్క చేరారు.

"వదినకి మానితే మానావు కానీ - నాకు చెప్పనాన్న "అంది కల్యాణి.

"అదేవిటి హఠాత్తుగా పాటల మీదికి పోయింది మనసు ? " రామనాధం నవ్వుతూ అడిగాడు.

"మరే ... మొన్న పాటల పోటీలో నాకు బహుమతొచ్చింది." కల్యాణి గొప్పగా చెప్పింది.

"ఓహో ! ఏం బహుమతేమిటి ?"

"పింగాణి కప్పు !" కల్యాణి తలెగరేసి చెప్పింది.

"ఓయబ్బో ! " రామనాధం ముచ్చట పడ్డాడు. కల్యాణి సిగ్గు పడింది.

"ఏం పాడావేవిటి ? "

"భలే తాత మన బాపూజీ ... చిన్నత్తయ్య నేర్పిందిలే ! " ఈ మారు అనూరాధ చెప్పింది.

"అది సరేకానీ - మీ పాఠాలెలా వున్నాయి ?"

"మావయ్య - మరే - పెద్ద బావ మళ్ళీ లెక్కల్లో డింకీ ! చిన్నబావకి ఇంగ్లీష్ గ్రామర్ రావట్లేదని ఇంగ్లీష్ మాష్టారు కోప్పడుతున్నారు.....' అనూరాధ రహస్యం చెప్పినట్లుగా చెప్పింది.

" ఏంటీ చాడీకోరూ ...... చిన్నబావా ....... పెద్ద బావా అంటున్నావ్ ? కొట్టేనంటే కొబ్బరి చెట్టెత్తెగిరి పడతావ్ !'"శివుడు అనూరాధ చెవి పుచ్చుకుని పైకి లేపాడు.

"అబ్బా ... ? " అనూరాధ ఓ కేక పెట్టింది.

"ఒరేయ్ ...అదేంట్రా ... శివుడూ ? అట్టా ఆటలు పట్టిస్తావ్ ? ముందు దాన్ని వదులు! వదులు తావా ... ముల్లు కర్రెత్తుకు రమ్మంటావా?" రత్తయ్య కేకేసాడు.

"అయిందానికి కాందానికి పాలి కేకలు ! అసలు మీ అలుసు చూసుకొనే ఇదిలా తయారయింది - కొండేల కొరివి !" శివుడు అనురాధని వదిలేసాడు.

అనూరాధ శివుణ్ణి వెక్కిరించి, రత్తయ్య పక్కకు వెళ్ళి కూర్చుంది.

"ఇంతకీ మన చదువు సంగతేమిట్రా ? " రామనాథం శివుణ్ణి నిలదీసాడు.

"ఏం చేయమంటావ్ బాబాయ్ - ఆ లెక్కలు వచ్చి చావట్లా ? " శివుడు తేల్చేసాడు.

"ప్రయివేటుకు వెళ్ళట్లా ? "

"ఆడెక్కడికి ఎళ్తాడూ ? ఎప్పుడు జూసినా ఎడ్లకి మేతేద్దామా - బండి కడదామా - పాలు పిండుదామా - కావిడేసుకు వెళ్దామా - అన్న రంధి తప్పితే ఆడికి లెక్కలేం పట్టాయ్ ? పక్కలేం పట్టాయ్ ? "రత్తయ్య శివుణ్ణి కోప్పడి, రామనాథంతో అన్నాడు, "అసలు చదువుకొనే వాడి వాలకమే నట్రా అబ్బాయ్ అదీ ! చదువు మాత్రం ఏం వచ్చుద్దీ ? చట్టు బండలవుద్ది ! "

"శివుడూ . ! " పున్నమ్మ లోపల్నుంచి కేకేసింది

శివుడు దొరికిందే సందని అదేపోత పోయాడు.

రత్తయ్య పక్కన చేరిన కల్యాణి నిద్రపోయింది. అనూరాధ ఆవులింతల్ని ఆపుకుంటోంది.

"చిన్న పిల్లలు చూడు-చూస్తుండగానే చిటుక్కున నిద్రోతారు. ఓ చింతలావంతలా ? " రత్తయ్య కల్యాణి ముంగురుల్ల సవరించాడు. అనూరాధ వైపు తిరిగి అన్నాడు ," అయినా, ఆవులింతల్ని ఆమాంతం ఆపుకోవడం దేనికీ ? మరీ నడమంత్రం కాకపోతే! పోయి నడుంవాల్చరాదూ ? ఎలాగూ పొద్దోయింది ".

అనూరాధ నిద్రమత్తులో నడుచుకుంటూ వెళ్ళిపోయింది.

రత్తయ్య రామనాథంతో అన్నాడు "ఏంటోరా - అబ్బాయ్ శివుడికి చదువు అబ్బేట్టు లేదు. ఈ దుక్కిలో నాగలి పట్టించేద్దాం అనుకుంటున్నా, ఎట్టాగు మేనరికం వుందయ్యే - వచ్చే శ్రావణంలోనో మాఘంలోనో వాడిచేత ఆ మూడుముళ్ళూ ఏయించేస్తే అట్టా ఎళ్ళమారి పోతాడు "

శివుడికి శాంతమ్మ అన్న కూతుర్ని చేసుకోవాలని చాలా కాలంగా అనుకుంటున్నారు.

"అదేంటన్నయ్యా - ఈ కాలంలో చదువురానివాడు ఎందుకూ కొరగాడు. వాడ్ని ఆ లెక్కల పరీక్షన్నా పాసవనీ - "రామనాథం సర్ది చెప్పాడు.

"ఏం పాసవడం ? మూడేళ్ళ నుంచీ ఏసినచోటే పిల్లిమొగ్గలు ఏత్తానే వున్నాడుగా ? కాస్త నా చేతికిందన్నా వుంటాడు. మరీ ఒక్కణ్ణీ చేసుకోలేకపోతున్నా -" అంటూ రత్తయ్య ఆవులించాడు.

"ఎందుకురా పెద్దాడా ... నిద్రాపుకుంటావ్ ? ఒంటికి మంచిది కాదు. కబుర్లు తెల్లారాక చెప్పుకుందురులే - వచ్చినాడు ఎక్కడికి పోతాడు ? పోయిపడుకో " పున్నమ్మ మంచినీళ్ళ చెంబు గ్లాసు తీసుకొచ్చి - రామనాథం మంచం పక్కన పెడుతూ అంది

రత్తయ్య ఆవులిస్తూ వెళ్ళాడు.

పున్నమ్మ వచ్చి రామనాథం ఎదురుగా కూర్చుంది.

"ఏంటోరా అబ్బాయ్ - చేసినాళ్ళం చేసినట్టే వుంటున్నాం - ఎంతకీ వగతెగదీ పని ! " పున్నమ్మ కొంగుతో ముఖం తుడుచుకొంది.

పున్నమ్మ వయసు అరవై పైమాటే. అయితే వయసును కనిపించనీయని గట్టిపుటక. ఐదున్నర అడుగుల ఎత్తు ఎత్తుకు తగిన వెడల్పాటి భుజాలు, విశాలమైన కళ్ళు, చక్కటి నుదురు. మాగిన మామిడిపండు రంగు లేత కాషాయరంగు ఖద్దరు చీర. గోచిపోసిన చీరకట్టు ముడేసిన తెల్ల ఖద్దరు రవిక చిన్న జారుముడి. చెవులకు నీరు తిరగిన ఏడురాళ్ళపోగులు. ఆ వీధిలో ఆమెది పెద్దకుండ, ఎముకలేని చేయిగా ప్రసిద్ధి. అమ్మలక్కలందరిలో వ్యవహార్తగా మంచి గుర్తింపు

వెంకట్రామయ్య బతికున్న రోజుల్లో పున్నమ్మ వల్లే కలిసొచ్చిందని చెప్పకొనేవాడు ఇప్పుడు కొడుకులకూ తల్లంటే వల్లమాలిన అభిమానం. అక్కడి అన్ని రైతుకుంటుబాల్లాగే తల్లిగా - ఆవిడది కుటుంబం తలలో పెద్ద నాలుక.

"ఇంతకీ ఊళ్ళో విశేషాలేంటమ్మా ? " రామనాథం తల్లిని మాటల్లోకి దించాడు

"ఏవున్నాయిరా అబ్బాయ్ - అంతా పోగాలమొచ్చింది. మన ఆశ్రమం వుంది చూసావూ - ఎంత చక్కగా రాట్నాలు వడికే వాళ్ళం ఖద్దరు నేసే వాళ్ళం - ఆ కళంతా పోయిందిరా ! అంతా ఆ చెరువుగట్టు శేషమ్మ పెత్తనమైపోయింది వట్టి వూసుకోరు కబుర్లు పూజలు పునస్కారాలు, భజనలు భజంత్రాలు - వట్టిగోలేననుకో ! అక్కడికి ఊళ్ళో గుళ్ళనీ వట్టిపోయాయా ? ఇదో సంబడం మొదలెట్టారు . ఖద్దరు నేయడం ముతకయి పోయింది. ఖద్దరు వేయడం ముతకయి పోయింది. ఆ బస్సులొకటి - బుర్రు బుర్రున తిరుగుతున్నాయా ? ప్రతి అమ్మా కొప్పముడేసి చీరాలకో తెనాలికో పరిగెత్తేదే ! ఊర్నిండా ఆ సిలుకు గుడ్డలు తెచ్చి గుమ్మరిత్తన్నార్రా ! వళ్ళంతా కన్పడతా - ఛీ.... . ఛీ .... పిదప కాలమొచ్చింది.! " పున్నమ్మ మెటికలు విరిచింది.

రామనాథం నవ్వుతూ వింటున్నాడు

"మన వూళ్ళోని సాలాళ్ళంతా ఒకటే గొడవనుకో ! ఆకాడికి సిలుకు కట్టినమ్మ చిటుకు చిటుకున పని మాత్రం చేసుద్దా ! ఆ గుడ్డలు ముడ్డిమీద జారుతుంటే ఇటు సర్దుకోనే అటు సర్దుకోనూ ! అబ్బబ్బో ... ఆ వగలూ చూడాల్సిందే .... ఆ వొయ్యారవూ చూడాల్సిందే ! అంతా నడమంత్రంలే అబ్బాయ్ ! " పున్నమ్మ బుగ్గలు నొక్కుకుంది.

రామనాథం పకపక నవ్వాడు.

"నీ కన్నీ నవ్వులాటలేరా ! అనకూడదు కానీ ఆ హైస్కూల్లో మాస్టార్లు మాత్రం ! ఓ తీరుతెన్నూ చచ్చిందీ ! మాస్టారంటే మాట సుబ్రం మడిసి సుబ్రం వుండొద్దా ... ! ఆ సిలుకు చొక్కాలు . .. ఆ సిగరెట్లూ ఆ చీట్లపేక . .... అబ్బబ్బ ...... ఒహటేమిటిలే ! ఇక పిల్లలకి పాఠాలేం చెబుతారూ ? కమిటి మీటింగు పెట్టించి గట్టిగా చెప్పి వెళ్ళబ్బాయ్ . ." పున్నమ్మ తన

కొడుకు మాట మీద అందరికి అంత విశ్వాసముంటుందని .. ఎంతో నమ్మకంగా అంది. చెప్పేవాడు చెప్పినా వినేవాడు వినొద్దూ ?

రామనాథం అలాగే లెమ్మంటూ తలాడించేడు.

"ఇక మన లైబ్రీ రామయ్య ఒకటే గోలనుకో ! ఏ మాట కామటే చెప్పకోవాలి - మీ తరం వాళ్ళంతా చక్కగా లైబ్రీ కెళ్ళి చదువుకొనే వాళ్ళా ! ఇపుడు ఇల్లిల్లు తిరిగి పుస్తకాలిచ్చి చదూకోండమ్మా చదుకోండయ్యా అని బతిమిలాడినా చదివే నాథుడు లేడని - పాపం తెగ బాధపడి పోతన్నాడనుకో ! ఆ టాకీసులు ఏమని వచ్చి పడ్డాయో - ప్రతి ఒకడూ సందేళ ఆటకు వెళ్ళాల్సిందే - ఆ కాడికి మన శివుడూ సుధాకరూ మాత్రం తక్కువ తిన్నారేంటీ ! "

"అదేంటమ్మ - చెప్పాపెట్టకుండా సినిమాలకి వెళ్తున్నారా ? " రామనాథంకి చర్రున కోపం వచ్చింది

"అదేం కాదులే అబ్బాయ్ - ఏడిసోగునిసో ఎళతారు. వయసు మీదున్న పిల్లలు గందా - ఆ పళాన నడిచే పోతారు ఆ సావిత్రి నెత్తీనోరూ కొట్టుకుంటానే వుంటది - మగపిల్లలు వంగి చస్తేగా - ఏవైనా, ఆడినా పాడినా చదివినా చేసినా ఆడపిల్లలే కళ ! అనూరాధ, కల్యాణి ఎంత బాగా చదూతారను కొన్నావ్ ? ఏ మాష్టారు కనపడినా మెచ్చుకోవడమే ! పున్నమ్మ మనవరాళ్ళనిపిస్తారు ! " పున్నమ్మ అది అంతా తన గొప్పేనన్నట్టు సంతోషంగా చెప్పింది.

"అనూరాధ అప్పుడే నీ ఎత్తు ఎదిగింది కదే ! " అన్నాడు రామనాథం

"ఆ మరే ! మునగ చెట్టల్లే ఆడపిల్లలు ఇట్టా చూస్తుండగానే అట్టా ఎదిగిపోతారు. మళ్ళీ ఏడాది తిరిగితే పెళ్ళికి రాదూ ! నేను పదారేళ్ళకే పెద్దాడి నెత్తుకున్నా ! "

"దమయంతే వుంటే ఎంత ఆనందించునో ! " రామనాథం నిట్టూర్చాడు

"బంగారం లాంటి బిడ్డను కళ్ళారా చూసుకొనే బాగ్గెం లేకపోయింది ". పున్నమ్మ కొంగుతో కళ్ళుద్దు కుంది, "చీమక్కూడా హాని తలపెట్టేది కాదు నా తల్లి ! అంతా నా కడుపుకోత దాని తలరాత ! " పున్నమ్మ గొంతు బొంగురు పోయింది.

రామనాథం తల్లిని ఓదార్చాడు.

"పోనీలే అమ్మా - అనూరాధే దమయంతనుకో ! అయినా అనూరాధ అంతా దమయంతిని తీసిపెట్టినట్టే ! అవే పెద్ద పెద్ద కళ్ళూ - అదే బుర్రముక్కు ! "

"ఎందుకురా ఏళాకోళాలు " మూతి మూడొంకర్లు తిప్పి నవ్వింది పున్నమ్మ. వెంట్రామయ్య పున్నమ్మని ఎప్పుడూ "ఎర్రతోలూ బుర్రముక్కు" అంటూ వేళాకోళాలాడేవాడు. అదే ముక్కు - దమయంతికి - మళ్ళీ అనూరాధకి వచ్చింది.

"అదేం మడుసులోరా - అబ్బాయ్ ! అనూరాధ బాబాయిలున్నారన్న మాటేకానీ అబ్బాయ్... పసిగుడ్డును తీసుకొచ్చాక ఒక్కనాడన్నా ఇట్టా తొంగి చూసిన పాపాన పోయారూ? ఆ ఆసాముల అయివేజులో వాటాలకు పోతామని గామాలి !" పున్నమ్మ వేళ్ళు విరిచింది.

"అనూరాధకి ఆ అవసరమేం వచ్చిందమ్మా ? మనమంతా లేమూ ? సరేకానీ చెరువు గట్టు శేషమ్మత్త గురించి చెప్పావ్... మరి మిగలిన వారి విశేషాలేంటి ?"

"ఆ...... ఏవున్నాయిరా ? అన్నట్టు - మర్చేపోయా - మన ఎంకాయమ్మ గారి అల్లుడు చలపతి లేడూ - వాడు అమెరికా వెళ్తున్నాట్ట ! "

"ఎవరూ మన రంగయ్య మావ అల్లుడే ! " రామనాధం సంతోషంగా అడిగాడు. చలపతి ఆ వూరివాడే, ఆ వూరి వారమ్మాయినే చేసుకొన్నాడు.

"మరే ! అన్నట్లు నీకు స్నేహమే గామాలి ! అందరూ - అంతా అమ్మాయి అదృష్టం అనుకుంటున్నార్రా ! కాకపోతే, ఆ రంగయ్య ఏనాడైనా పిల్లికి బిచ్చం పెట్టాడూ ? ఎంగిలి చేత్తో కాకి ఇదిలించాడా ! అట్టా పోగేసి పెట్టాడు కాబట్టే కూతురికి మెడ తిరక్కుండా దిగేసాడు అల్లుణ్ణి ఇమానమెక్కించేత్తన్నాడు ! అది సరేకానీ - రావుడూ - మర్చిపోకుండా ఎళ్ళి పలకరించిరా .... ఆ తరువాత, కాలం నాడు రానైనా రాలేదని తప్పు పడతారు !"

"చలపతిని కలవకుండా ఎట్లా అమ్మ ? "

"మన్లోమాట ! ఆ చలపతి - అసలు ఎట్టావుండే వాడురా ? పలకరిస్తే పదొంకర్లు తిరిగేవాడా ? అమాంతం అమెరికా ఎట్టా ఎళ్తాడ్రా ? " అంకిలి నొక్కుకుంది పున్నమ్మ.

"భలే దానివే అమ్మా - మన దగ్గర బిడియంకానీ - డాక్టరు కాదూ ? లోకం తెలీదూ? " నవ్వుతూ అన్నాడు రామనాధం.

"దేనికయినా పెట్టి పుట్టాలిరా రావుడూ - అంతా ... ఆ . . ఎంకాయమ్మ కూతురి బోగం బాగ్గెం ! ఏంటోరా అబ్బాయ్ - ఆడపిల్లల అదురష్టం చెప్పి వచ్చేది కాదు ! మన ఆడ పిల్లలు - పాపం .... పెళ్ళి చేసి పంపామన్న మాటే కానీ - ఏనాడన్నా ఆకులో కుంకుమన్నా ఆశించి ఎరుగుదురూ ? కడుపు చించుకుంటే కాళ్ళమీద పడుతుంది ! " పున్నమ్మ ముక్కు ఎగబీల్చింది.

"ఎవరి గురించమ్మా - మన దమయంతి గురించేనా ? "

"పోయినోళ్ళు సుకపడ్డార్రా ! మన పెద్దాడి కూతుళ్ళు .... తొలుసూరు బిడ్డ - పద్మకి అయిన సంబంధం గందా అని మీ వదిన పుట్టింటారి సంబంధం చేసిందా - వాళ్ళొట్టి దరిద్దరపు గొట్టు గుంపురా ! "

"అదేంటమ్మా - వాళ్ళావూరు పెత్తందార్లు అయితే ? " రామనాధం ఆశ్చర్యంగా అడిగాడు.

"పెత్తందార్లయితే ? ఆ పెత్తనమే మిగిలి చచ్చిందిరా ! అయినా ఈ రోజుల్లో పెత్తనం చేత్తే ఎవడూరు కుంటున్నాడూ ? మింగ మెతుకు లేదూ మీసాలకు సంపెంగ నూనసీ - ఆడంబరాలకేం తక్కువ లేదు. పేరుకి రైసు మిల్లుందా ? అది ఆడిందా ఆ పూటకి భోజనం. అదీ సంబడం ! మన చెరువు కింది పొలం - నా పసుపు కుంకుమల కింద నా కన్నారిచ్చింది

- దాని కట్నం కింద ఇచ్చామా ? అదీ కృష్ణార్పణం అయిపోయింది ! మన యిళ్ళకి వస్తే ఏం గుట్టు ఇప్పుద్దనో దాన్నిటురానీయరు ! అక్కడికీ మనసు చంపుకొని మన పిల్ల కోసం నేనేపోయొచ్చా. ప్రాణం కళ్ళల్లో పెట్టుకుందనుకో. గుడ్లనీరు గుడ్లలో కుక్కుకుంది. దానికి తోడు పిల్ల నీళ్లోసుకుంది. పద్మని పురుడికి తీసుకురావాలి ! " పున్నమ్మ నిట్టూర్చింది.

"సరళ విషయం ఏంటి ? "

"అయినాళ్ళతో ఇట్టా వుందని - బుద్ధిమంతుడుగందా అని బయటి సంబంధం చేసామా - సరళకి ! దాని మొగుడు వొట్టి తండ్రి చాటు కొడుకు ! చదువు కున్నాడు కందా ? ఉద్యోగం సద్యోగం చూసుకోవద్దూ ? ఊళ్ళేవన్నా వట్టిపోయాయా ? ఆరామడ పట్నం అనుకుంటున్నాడో ఏవో .. వాళ్ళూరు పొలిమేరదాటడు. పోనీ ఎవసాయం చేత్తాడా అంటే అదీ లేదు. ఎప్పుడూ షిలుకు గుడ్డలోటి ఏసుకొని వంతెన దగ్గర పడుంటాడంట ! ఆళ్ళూరి వొంతిన కింద వోటలోటి పెట్టార్లే - వొచ్చేవాళ్ళూ - పోయేవాళ్లూ - అదీసంగతి ! పైనుంచి సరళ మామకట్నం తేలేదని అమ్మాయిన ఒకటే సొడ్డంట ! "

"అదేంటి సరళకివ్వాల్సిన డబ్బులు ఇవ్వలేదూ ? "

"ఇచ్చినట్టే ఉంది ! పెద్దదానికి ఇవ్వాల్సిందే ఇంకా దిగడిపోతే ! ఎవసాయం ఎత్తు భారమై పోయింధిరా అబ్బాయ్ - పై పంట నాటికిద్దాం అని పెద్దాడు ప్రతిసారీ అనుకొంటాడు ఏంచేత్తాడు పాపం ! ఆ పోయినేడాది పంట చేతికొచ్చే నాటికి ఉప్పెనొచ్చే ! కిందటేడు గాలీవానా! నడుం దించినాడు ఎత్తకుండా చేత్తాడా - ఏం లాభం ? నువ్వు పంపే డబ్బు సంద్రంలో వానచుక్కై పోతంది ! పైరన్నాక చీడాపీడా తగులుద్ది కందా ? ఎరువు తరువు, కూలీనాలీ - చూడాలా ? పైగా, పిల్లలకి బడిలో, ప్రయివేటులో కూడా డబ్బులు కట్టాలెమొ ! మహానుబావుడు ఏ స్వర్గాన వున్నాడో - సుకపడతన్నాడు ! " పున్నమ్మ భర్తని తలుచుకొంది.

"అయినా కానీ - కట్నం వప్పుకున్నాక ఇవ్వాలి కదమ్మా ! "

"ఎట్టారా ? అప్పు సొప్పూ చేసిన వంశం కాదయ్యేమనది ! అందుకేగా ఆ పెద్దాడట్టా పిసుక్కుంటన్నాడు. పైకి వూరికే అట్టా బోకరిస్తాడు కానీ - వట్టి బోళామనిషి. కాస్తదానికే కంగారు పడతాడు. ఎట్టా బతుకు భారమీడుస్తాడో ఏవో ! ఆ పొలమేమిటో వాడేమిటో ! " పున్నమ్మ రత్తయ్యను తలుచుకొని నిట్టూర్చింది.

"ఏదైనా చేయకపోతే ఎట్లా అమ్మా ? ఆడపిల్లల్ని అత్తారూరు కొంటారా ? మనం మాత్రం మర్యాద ఉంచుకోవద్దూ ? "

"ఎలారా అబ్బాయ్ ... ? అక్కడికీ .. పెద్దదాని పెళ్ళపుడు నా పెద్ద గొలుసు ఇచ్చానా? చిన్న దాని పెళ్ళికి మురుగులిచ్చాను మనకేవన్నా మళ్ళున్నాయా ! మాన్యాలున్నాయా ? అక్కడికీ కోడళ్ళు అయినవాళ్ళు కాబట్టి ఏనాడు ఫలానాది లేదని బయట పళ్ళేదు.

ఆ వంటేంటో- ఆ వార్పేంటో ..! పెళ్ళయ్యాక వంటి మీద చిన్నం బంగారం ఎరుగుదురూ ? '' పున్నమ్మ కోడళ్ళ మంచితనాన్ని తలుచుకుంది.

"పోనీ మీ మేనమావలు సాయం వత్తారా అంటే - అమ్మపుట్టిల్లు మేనమావకి ఎరికన్నట్లు - నా పుట్టింటారి సంగతి నాకు తెలియందా ? మీకు తెలియందా ? అందుకేగా కానీ కట్నం అనుకోకుండా సావిత్రిని నీకు చేసుకొంది. '' పున్నమ్మ నిట్టూర్చింది. "అయినా ఏదో కష్టమూ సుఖమూ ఎళ్ళ బోసుకోడమే కానీ - నీకు మాత్రం తెలీదట్రా ఇయ్యాన్నీను ! ''

రామనాథం మౌనంగా తలాడించాడు.

"ఏదో కుటుంబాని కంతా ఆదరువుగా వుంటావంటే నువ్వా ఉద్యోగం పున్నాన నైజాంకి ఎళితివి ! ఆ అడివి దేశంలో ఎట్టా వున్నావో ఏం చేత్తన్నావో అని వగచని క్షణం లేదనుకో - రోజూ ఏడ్చుకొని పడుకోవడమే ! అబ్బాయ్ - ఎట్టాగయినా ఈ పక్కకి వచ్చేయిరా '' పున్నమ్మ బతిమిలాడినట్లుగా అంది.

"అలాగనుకుంటే ఎలా అమ్మ ! ఉద్యోగమన్నాక వెళ్ళక తప్పుతుందా ? ''

"అయ్యో - నా మతి మండిపోనూ - ఆ పళాన బస్సులో పడి వచ్చావు - వొళ్ళు హూనం అయ్యింటుంది పడుకోరా రావుడూ - అయినా ఇదెప్పుడూ వుండే సోదేగా ... ! '' పున్నమ్మ హడావుడిగా లేచింది ఆవులిస్తూ వెళ్ళి పడుకుంది.

రామనాథం తలకింద చేతులు పెట్టుకొని వెల్లకిలా పడుకున్నాడు. వేసవి కాలం రాత్రి. కొబ్బరి చెట్ల గాలి ఇంకా తిరగలేదు. పొగడ చెట్టు మీది గూట్లోని పక్షేదో నిద్రలో కదిలింది.

మేఘాలు లేని నీలాకాశపు జాబిల్లి కొబ్బరాకుల మీద దీక్షగా వెన్నెల చిత్రాలు గీస్తోంది.

ప్రయాణపు అలసటో ఆలోచనల అలసటో రామనాథాన్ని పరిసరాలు ప్రభావితం చేయలేక పోతున్నాయి.

"అమ్మ చెప్పిన సమస్యలన్నిటిని ఎలా గట్టెక్కించాలి ? పిల్లా పాపా సంతోషంగా సంతృప్తిగా వుండాలనుకోవడం కోరరాని కోరికేం కాదుగా ? మనుగడ కోసం ఆరాటపడడం మనిషికి సహజమేగా ? ఈ గరువు తమని గట్టెక్కించేనా ? అదికల్ల కాలువ రావడం ఆలస్యమైతే దొరభూమి ఇబ్బంది పెడుతుందేమో - అయినా, సాహసం చేయాలి. సాధించాలి. సాహసవంతుడికి ఓటమి ఒక్కసారే - అది - అనుకొన్నది సాధించలేకపోయిన రోజున. సాహసమే లేకపోతే సాధించడం ఏముంటుందీ ? అసలు సమస్య అన్నయ్యను గరువు పొలం అమ్మడానికి వప్పించడం. ఏ రైతైనా నిలుచున్న పళాన భూములు అమ్ముకోవడానికి ఎలా వప్పుకొంటాడూ ? గుండె పగిలి పోదూ ? అన్నయ్య లాంటి రైతుకు భూమి సంపత్తి మాత్రమే కాదు. ఊపిరి - ప్రాణం - అంతా ఆ భూమే. ఆ భూమి కోసమే అతని జీవితం. ఆ భూమి కోసమే అతని జీవనం. ఆ భూమి కోసమే ఆరాటం పోరాటం. ఆ భూమి కోసమే తపన తాపత్రయం.

భూమి ! భూమి !! భూమి !!!

రైతు భూమిని ప్రేమిస్తాడు భూమిని సేవిస్తాడు బదులుగా భూమి అతనికి ఇచ్చేది పిడికెడు ఫలసాయమైనా పట్టించుకోడు

ఎందుకని బాలయ్య నారాయణమ్మ తిండికి మిగిలే జొన్నలకోసం రెక్కలు ముక్కలు చేసుకొంటున్నారు ?

ఎందుకని అన్నయ్య ఏ మాత్రం ఆసరాకు రాని గరువు చేనుకి అంకితం అవుతున్నాడు?

భూమి ఇచ్చే ప్రతిఫలం వాళ్ళకు అక్కర లేదు భూమితో సాన్నిహిత్యం కావాలి భూమితో మాట్లాడాలి భూమితో పోట్లాడాలి ఆనందం ఆవేదనా పంచుకోవాలి

కానీ, ఆ భూమే సారవంతమైనదైతే వాళ్ళుపడే ఆ శ్రమే వారితో పాటు అందరికీ ఆలంబన కాదూ ? అలా అవ్వాలని కోరుకోవడంలో అసహజమేమీ లేదుగా ?

లేదు లేనే లేదు !

రామనాథం అటు మెసిలి ఇటు మెసిలి, మంచంలో లేచి కూర్చున్నాడు. "పుట్టిన గడ్డ మీద ఊపిరి వదిలి కొత్తగడ్డ మీద ఊపిరి పీల్చమంటే ఆ మనిషేమవుతాడూ ? అయ్యో అన్నయ్యా ! ఎలా నిన్నా పనికి పురమాయించడం ? "

రామనాథం గుండె పట్టేసింది, గుండెల నిండా ఊపిరి పీల్చి వదిలాడు. లేచి మంచినీళ్ళు తాగి మళ్ళీ పడుకొన్నాడు.

" తన కుటుంబం ఆర్థిక స్థితో పక్క - మిణుకు మిణుకు మంటోన్న ఆశో పక్క - మధ్యలో నలగబోయే మనుషుల మనసులు ! కానీ ... కానీ . . ఆ నల్లగడ్డను వదులు కొనేదెలా? ఏ రైతు గుండెనైనా పొంగించే గడ్డ. అన్నయ్య మాత్రం ఒక్కసారంటే ఒక్కసారి ఆ గడ్డను చూస్తే అమాంతం కావలించుకోడూ ?" రామనాథం గుండెల నిండా ఆశ నిండింది.

ఇంతలో ఎప్పుడు లేచాడో ఏమో బండి కట్టుకొని రత్తయ్య పొలానికి వెళ్ళడానికి బయల్దేరాడు

ఇంకా చీకట్లు చిక్కగానే వున్నాయి రామనాథం మంచంలోంచే రత్తయ్య వైపు చూసాడు.

రత్తయ్యదీ ఆరడగుల పుటక, ఎండకూ వానకూ గట్టిపడిన ఇనమంటి వళ్ళు. కురచజుట్టు. పైకి ఎగగట్టిన నీర్కావి పంచె. బనీను.

రత్తయ్య ఎడ్లను చ్చొ .. ..చ్చొ.... మని అదిలిస్తూ ముందుకు కదిలి పోయాడు.

రామనాథం ఆ వైపే చూస్తూ వుండిపోయాడు.

"ఏం మనిషి ? ఓ రుచీ పచీ ఎరుగునా ? ఓ మంచి బట్ట కట్టి ఎరుగునా ? ఓ బస్తీ ఎరుగునా ? ఓ స్నేహితులా ? సరదాలా ? ఓ పుస్తకం చదువుతాడా ? ఓ పురాణం వింటాడా? పొలమూ పుట్రా తప్పితే గొడ్డూ గోదా !

పొద్దు పొడవక ముందే లేచి పొద్దుపోయే దాకా పొలం .. పొలం ... పొలం .! ఈ మనిషికి ఇంకేం అక్కర్లేదా ? ఫలితం ఉన్నాలేకపోయినా ... చేసిందే చేసింది ఎంత కాలమని చేస్తుంటాడు ? ఆ మట్టి తప్ప ఇంకేం పట్టదు. పట్టించుకోడు. అంతే ! మట్టి తప్ప అతనికి ఇంకేం అక్కర్లేదు. అందులోనూ అతనెరిగిన మట్టి తప్ప ! "

రామనాధం నిట్టూర్చాడు అతనికి రత్తయ్యతో నరసింహం చేను బేరమాడిన విషయం ప్రస్తావించడం చాలా గడ్డుగానూ సిగ్గుగానూ వుంది. ప్రస్తావించాల్సిన అవసరం తోసుకోస్తోంది. నిస్పృహయంగా నిరామయంగా ఆలోచిస్తూ వుండి పోయాడు.

రామనాధం ఆకాశం వైపు చూసాడు. చందమామ వెలాతెలా పోతున్నాడు. వేగుచుక్క విరగబాటుగా నవ్వుతోంది. పొగడ చెట్టు మీది పక్షులు బద్దకంగా వళ్ళు విరుచుకుంటున్నట్లున్నాయి. ఆకులు మెత్తగా కదులుతోన్న సవ్వడి వినిపిస్తోంది.

రామనాధం మంచంలోంచి పైకి లేచాడు. నిద్రలేమితో తలభారంగా తయారయ్యింది. మంచినీళ్ళు తీసుకొని ముఖాన చిలకరించుకున్నాడు. గొంతులో కొన్ని నీళ్ళు పోసుకొని పుక్కిలించి వూసాడు. పైపంచతో ముఖం తుడుచుకున్నాడు. వళ్ళు విరుచుకొని, గొంతు సవరించు కొన్నాడు.

రామనాధం ఇంటి ప్రహరి గోడదాకా నడిచి, వీధి చివరి కంటా చూసాడు.

సరిగ్గా అప్పుడే రత్తయ్య బండిని వీధిమలుపులోకి తిప్పాడు. బండి చక్రాల గుర్తులు వీధిలో వదిలి బండి కదిలిపోయింది.

రామనాధం ప్రహరి గోడమీద కూర్చుని ఇంటివైపు చూసాడు.

ప్రహరీని తీసుకొని ఎత్తుగా పెరిగిన ఆరు కొబ్బరి చెట్లూ రామనాధం మద్రాస్ నుండి తెచ్చినాటినవి. ఆ పక్కగా వున్న రాధా మనోహరాలను దమయంతి నాటింది. ఇప్పుడది ప్రహరీనంతా అల్లేసుకొని నేలనంటుతోంది. చెట్టునిండా ఎర్రటి తెల్లటి గులాబి రంగుపూలు - వాటి పొడవాటి కాడలు ఆకుల చాటున దాగున్నాయి. ఆ చివరన పొగడచెట్టు. వెంకట్రామయ్య ఎప్పుడు నాటాడో కానీ - ఎవరో శ్రద్ధగా కత్తిరించినట్లుగా చక్కని గుమ్మటంలా వుంది. దాని మీది పక్షులు ఒక్కోటి లేచి వళ్ళు విదిల్చుకొని, ముక్కులతో, రెక్కలు శుభ్రం చేసుకుంటున్నాయి. ఇప్పుడో అప్పుడో ఎగరడానికి సిద్ధంగా వున్నాయవి.

కొబ్బరి చెట్లకు సరిగా ఎదురుగా చేవబారిన తాటిదూలాలయిల్లు. తాటాకులు పరిచిన కప్పు, వేపద్వారబంధాలు, నేరేడు చెక్క తలుపులు. ఎడమ వైపున మూడు గదులు. కుడివైపున మూడు గదులు. మధ్యన హాలు. అటూ ఇటూ వసారా.

సూర్యకిరణాలు తూర్పు వాకిలి గుండా అప్పుడే రావాలా వద్దా అన్న సందేహంలో పడి ఎటూ తేల్చుకోలేక ముఖాలు ఎర్ర బరుచుకున్నాయి.

పాచి వూడనడానికి పున్నమ్మ కొబ్బరి చీపురు తీసుకువచ్చింది.

ఆమె వెనక కళ్ళాపి నీళ్ళు తీసుకొని - శాంతమ్మ - ఆ వెనుక కొబ్బరి చిప్పలో ముగ్గు పిండి వేసుకుని సావిత్రి వచ్చారు.

రామనాథం కూర్చున్న దగ్గర్నుంచి లేచాడు. పెద్దింటికి ఎడమ పక్కగా వెనక్కి వెళ్ళడానికి బండి వెళ్ళేంత దారి వుంది. రామనాథం అటు పక్కగా వెనక్కి వెళ్ళాడు. వెనక విశాలమైన దొడ్డి - దాదాపు అర ఎకరం ఆవరణ. కుడి పక్కన విశాలమైన చుట్టిల్లు. అదే వంటిల్లు. పెద్దింటికి వంటింటికి మధ్యనున్న ఖాళీ స్థలంలో విరబూసిన మందారాలు, విప్పారిన కాగడా మల్లెలు, విచ్చుకుపోయిన దొంతర మల్లెలు, బోర్లాపడిన పారిజాతాలు, కనకాంబరాలు - ఒక దానిమ్మ చెట్టు - ఒక కరివేపాకు చెట్టు - నేలలో పైపైన పాతిన అల్లం - మరికొన్ని కూరపాదులు వెరసి ఒక చిన్న పెరటి తోట.

వెనుక ప్రహరీని ఆనుకొని చావిడి. చావిడి ఎదురుగా వరుసగా పాతిన కట్టు గొయ్యలకు గేదెలు కట్టేసి వున్నాయి.

చావిడికి ఇంటికి మధ్య చుట్టు బావి. దాని పక్కనే నారింజ చెట్లు. బొప్పాయి చెట్లు. కొండ వుసిరి చెట్టు.

"బాబాఃయ్ - పక్కకి తప్పుకో!"

శివుడు నీళ్ళ కావిడి భుజాన వేసుకొని, రామనాథాన్ని తప్పించుకుంటూ - పెద్దపెద్ద అంగలేస్తూ వాకిట్లోకి వెళ్ళాడు. పున్నమ్మ చీపురు తీసుకొని వెనక పక్కకి వచ్చింది. రామనాథాన్ని చూసి - ఏదో గుర్తువచ్చిన దానిలా గబగబ అతని దగ్గరకు వచ్చింది

"అయ్యో - నా తెలివి తెల్లారినట్లే ఉందిరా అబ్బాయ్ - కాఫీ పెట్టియ్యనా ఏంటి ? పొద్దెక్కిపోతంది కందా అని ఈ పాచిపని పెట్టుకొన్నానే!" పున్నమ్మ నొచ్చుకుంది. వెనక్కి తిరిగి కేకేసింది, "అమ్మాయ్ - శాంతం - ఈ పక్కకి రండే - దూడనొదలాలి!"

"అప్పుడే తొందరేం లేదులే అమ్మా - వేప్పుల్ల ఇలా ఇయ్యి ... పళ్ళు తోముకుని వేస్తా!' రామనాథం ఆమెను వారిస్తూ అన్నాడు.

వంటింటి చూరులోంచి వేపపుల్ల తెచ్చి - కొడుక్కి ఇచ్చింది పున్నమ్మ.

"అన్నయ్య ఎక్కడికి తెల్లారగట్టే వెళ్ళాడు?"

"చెర్లో మట్టి పొలానికి తోలుతున్నాడ్రా" పున్నమ్మ అంటూనే పాచి వూడవడానికి నడుం వంచింది.

శివుడు ఖాళీ కావిడేసుకుని గబగబ బావి దగ్గరకి వెళ్ళాడు. రామనాథం నోట్లో వేపపుల్ల పెట్టుకొని నములుతూ గేదెల దగ్గరకి వెళ్ళాడు. వాటి వొళ్ళు నిమిరి - కొమ్ములు తడిమి - చావిట్లోకి తొంగి చూసాడు. ఓ లేగదూడ గుంజ నుంచి తప్పించుకోవాలని ప్రయత్నం చేస్తూ వుంది.

రామనాథం మళ్ళీ ఇంటి వైపు చూసాడు.

ఓ పక్క పున్నమ్మ వూడ్చిందంతా పోగు చేస్తుంటే మరోపక్క నుంచి శాంతమ్మ కళ్ళాపి చల్లుతోంది. శివుడు బక్కెట్లో నీళ్ళు పోసి పేడవేసి రెండు చేతుల్తో పైకీ కిందికి కలియబెడుతున్నాడు ఇంతలో సావిత్రి ముగ్గు చిప్ప తీసుకొని వచ్చింది

రామనాథం హృదయం భారంగా మూలిగింది

'ఈ ఆవరణని ఈ ఇంటిని వదులుకొని వీళ్ళంతా నడిగడ్డకి వస్తారా? ఎవరికైనా - ఇంతటి ఆప్యాయత అల్లుకున్న ప్రదేశాన్ని వదిలి వెళ్ళాల్సిన రోజు వస్తుందన్న ఊహైనా కలుగు తుందా? శరీరంలో భాగమేదో వేరు చేసినట్లు బాధపడరూ?'

రామనాథం నోట్లోకి వేపపుల్ల చేదు వూరింది. వూరిన చేదును పక్కకి వూసేసి - వేపపుల్ల నములుతూ తాటి తోపులోకి వెళ్ళాడు.

గుబురుగా వున్న పచ్చని మట్టలు వరుసలో లేని తాటిచెట్ల నల్లని పొడవాటి కాండాలపై తూర్పు నుంచి వర్షించబోయే వెలుతురు కోసం నిక్కి నిక్కి చూస్తున్నాయి.

ఆ చూపుల ఫలితమేమో నెమ్మది నెమ్మదిగా వెలుతురు తాటి మట్టల పైకి వాలుతోంది.

గురివింద తీగలు వయ్యారంగా తాటిచెట్లను అల్లుకొని వున్నాయి. గుత్తులు గుత్తులుగా వేళ్ళాడుతోన్న కాయల్లోంచి ఎర్రటి గురివిందలు కనువిందు చేస్తున్నాయి ఏవో పక్షులు ఉదయరాగాలు పాడుతున్నాయి ఓ పక్కగా వున్న సీమచింత చెట్లను దాటుకుంటూ తాటి తోపు చివరికంటా వెళ్ళాడు రామనాథం.

సరిగ్గా అక్కడే అతని తండ్రి వెంకట్రామయ్యను దహనం చేసింది.

వెంకట్రామయ్య అస్థికల మీద నాటిన మామిడి టెంకె ఇప్పుడు మహావృక్షమైంది. దానిని రామనాథమే తెచ్చి నాటాడు. మంచి బంగిన పల్లిజాతి. విరగ కాసిన కాయల బరువుతో చెట్ల కొమ్మలు నేలను తాకుతున్నాయి.

రామనాథం ఆ కాయల్ని ఆప్యాయంగా నిమిరాడు. ఆకుల్ని తాకుతూ కొమ్మల్ని తడుముతూ తండ్రిని తాకినంత అనుభూతి పొందాడు.

చెట్టు మొదట్లో తలకింద చేతులు పెట్టుకొని ఎప్పుడు పడుకున్నాడో - అలా ఎంతసేపున్నాడో అతనికి స్పృహేలేదు.

దట్టమైన మామిడాకుల గుండా చొచ్చుకు రావడానికి ప్రయత్నిస్తోన్న లేత సూర్యకిరణాలు చెట్టు మొదట్లో అక్కడక్కడా ముగ్గేయడానికి పెట్టిన చుక్కల్లా పడుతున్నాయి.

తాటితోపులో పక్షుల అరుపులు ఎక్కువయ్యాయి.

ఓ గడుసరి గండు చీమల గుంపు చెట్టు మొదట్లోంచి బయలుదేరి, చెట్టుగట్టు నెక్కి రామనాథం కాళ్ళమీద సవారి చేసి, చెట్టు కాండం మీదికి పాకి, ఆకుల మీదుగా - కాయల

తొడిమల్లోంచి రసాన్ని తాగే ప్రయత్నంలో ప్రయాణం మొదలెట్టింది. అవి తమ ఆరు కాళ్ళ మీదా మూడు భాగాల శరీరాన్ని అలవోకగా ఎత్తి, తలవంచి దారి వెతుకుతూ వడి వడిగా వెళుతున్నాయి.

అప్పుడో పండుటాకు ఇప్పుడో పక్షి విరిచిన పుల్ల రామనాథం మీద పడుతున్నాయి

ఆ పక్కన భూషణం గారి సపోటా తోటలో బోరింగ్ ఆగి ఆగి మోగుతోంది. ఎవరో రైతు దూరాన ఎక్కడో తన ఎద్దుల్ని అదిలిస్తున్నాడు.

"హమ్మయ్య! ఇక్కడున్నావా బాబాయ్ నువ్వు! తాటి తోపంతా తిరగ లేక చచ్చాననుకో! తొందరగా రా - నాయనమ్మ పిలుచుకొని రమ్మంది!" గట్లు మీదుగా గెంతుకుంటూ వచ్చిన శివుడు వచ్చీ రావడమే హడావుడిగా అరిచాడు," "అయ్యొయ్యో ! చీమలు బాబాయ్ - కరెంటు చీమలు! కుట్టాయంటే తేలు కుట్టినట్లే - లే బాబాయ్ - లే!"

సరిగ్గా అప్పుడే ఓ వయ్యారి చీమ రామనాథం చెవి తమ్మెను సుతారంగా కొరికింది

"అబ్బా!" రామనాథం చెవి నులుముకుంటూ చీమల్ని దులుపు కుంటూ గబుక్కున పైకి లేచాడు.

"ఉండు బాబాయ్!" అంటూ శివుడు కూడా రామనాథం వీపునెక్కిన చీమలు దులుపుకోవడానికి సాయం చేసాడు.

"అబ్బా - చెవి నిజంగానే మంట పుడుతుందిరా" రామనాథం చీమల బారుకి దూరంగా నడుస్తూ అన్నాడు.

"ఉండు బాబాయ్" శివుడు గబుక్కున వెళ్ళి గట్టుమీద గరిక కింద మంచుతో తడిసిన మట్టిని చిటికెడు తెచ్చాడు.

"వంగు బాబాయ్!" అంటూ చీమకుట్టిన రామనాథం చెవి తమ్మెకి తడి మట్టి అద్దాడు.

"నాన్న మంట పుట్టకుండా ఇట్లాగే తడిమట్టి పెడతాడు. సమ్మగా ఉంటుందిలే!" శివుడి కంఠంలో భరోసాతో పాటు ఆరిందాతనం పుట్టిపడింది.

క్రితంసారి రామనాథం వచ్చినపుడు శివుడి గొంతులో యౌవనా రంభ దశను సూచించే బొంగురు తనం వుండేది. ఇపుడు యువకుడి కంఠంలో వుండే వగరు - గాంభీర్యం వచ్చి కూర్చున్నాయి.

రామనాథం నవ్వుతూ చిన్నగా శివుడి వెన్ను తట్టాడు.

"అరే - నా వేప్పుల్ల ఏవయింది?" రామనాథం చెట్టు మొదట్లో అటూ ఇటూ చూసాడు.

రాలిన మామిడాకులు దాన్నెపుడో దాచేసాయి.

రామనాథం వంగి చేతితో ఆకుల్ని అటూఇటూ కదిల్చాడు.

శివుడు రామనాథం వెంట్రుకల్లో చిక్కుకున్న పండుటాకుని చటుక్కున తీసి - కింద పడేసాడు. అది గాలిలో బరువుగా కదులుతూ కిందపడివున్న ఆకుల్ని చేరుకుంది.

"అబ్బా - పోనీలే బాబాయ్ - చావిడి చూర్లో కావలసినన్ని వున్నాయి. మొన్నే ాలక్ష్మమ్మ చెట్టు కొమ్మొాటి విరుచుకొచ్చి - పుల్లలు కట్ట కట్టి పెట్టాడు నాన్న" తలెత్తి చెట్టు మీద ియల్ని చూస్తూ రామనాధంతో అన్నాడు శివుడు.

"అయ్యో - అన్నట్టు మర్చిపోయాను బాబాయ్ - చలపతి మావయొచ్చాడు. ంసలందుకే నాయనమ్మ నిన్ను కేకేసుకురమ్మంది" శివుడుఅంటూనే ఒక్క ఎగురు ఎగిరి ఓ ూమిడి కాయ దొరక బుచ్చుకున్నాడు. "అబ్బ - ఏం కాయ!" కాయ నేవళింపు చూసి - చొక్కాకు ుడిచి - ముక్కు దగ్గరకు తెచ్చి - వాసన చూసాడు.

రామనాధానికి శివుడి పని ముచ్చటేసింది. రామనాధం ముందుకు నడుస్తూ అడిగాడు, చలపతి వచ్చి ఎంత సేపయ్యిందిరా?'

"ఏమ్మరి!"

శివుడికి సరిగ్గా రామనాధం తల మీదో మామిడి కాయ వేళ్ళాడుతూ కనిపించింది. పైకి ెగరడంలో - రామనాధాన్ని తోసినంత పని చేసి ఎలాగయితేనేం కాయ దొరక బుచ్చు కొన్నాడు.

ఇంతలో, సపోటా తోటలోని బోరింగ్ దగ్గర్నుంచి కావిడేసుకుని వెళ్తున్న భూషణం గారి విన్నబ్బాయి రామనాధాన్ని చూసి గబగబ దగ్గరికి వచ్చాడు.

కావిడిని భుజాన్నుంచి తప్పించి - అలుపు తీర్చుకొని - రామనాధాన్ని అప్యాయంగా పలకరించాడు.

"ఏరా రావుడూ? ఎప్పుడొచ్చా? ఎన్నాళ్ళుంటావేంటి?"

రామనాధం, అతనూ మాట్లాడు కొంటూ వుండగానే - శివుడు చిక్కగా గుబురు లాగా విచ్చుకొని వున్న చిన్న తాటి బొంద దగ్గరకి వెళ్ళాడు.

నిజానికి దానిని చెట్టనాలో - మొక్కనాలో ... నిండా పదిమట్టలు కూడా లేవు. ఇంకా నేలని అంటుకొనే వుంది. శివుడు తాటాకు ముక్క విరుచుకొని - ఈనెలు తీస్తూ రామనాధం వాళ్ళ దగ్గరకి వచ్చాడు.

వాళ్ళు ఒకళ్ళ చేతులు ఒకళ్ళు పట్టుకొని కబుర్లు చెప్పుకొంటున్నారు. ఇంతలో ఏదో గుర్తొచ్చినట్లు భూషణంగారి చిన్నబ్బాయి అన్నాడు -

"అయ్యొయ్యో - మర్చేపోయా! మంచి నీళ్ళెత్తుకెల్తన్నానా - ఆలస్యమై పోద్ది! అన్నట్టు రావుడూ - ఈ ఏడు మా సపోటా ఏం కాసిందను కుంటున్నావ్! చితక కాసిందిలే! మా నాన్న ఆ రాజోలు బసవయ్యగారికి బేర మిద్దామను కొంటున్నాడు. మంచికాయలు కోసి గడ్డివాములో మాగేసాకానీ - మాపటేళ తెచ్చిత్తా -"

"ఏం మావయ్యోయ్ - మమ్మల్ని మీ తోట కంచె కూడా దాటనియ్యవు - అక్కడికి బాబాయ్ కేమో - ఇంటికే తెచ్చిస్తావా?" శివుడు నవ్వుతూ అడిగాడు.

వాళ్ళని, వాళ్ళ సపోటా చెట్లని ఏం తిప్పలు పెట్టాడో కానీ, శివుడి గొంతులో దాచుకుందామన్నా దాగని చిలిపి తనం వుంది.

"ఆ కాడికి - ఆ కోతి కొమ్మొచ్చులాట లాడ్డానికి మాతోటే కావాల్సొచ్చిందీ? అడిగేవాడు లేడు గందాని పిల్ల మూకేసుకొని తయారవుతావు. ఏడీ నీ తమ్ముడు సుధాకరం -" అతను సుధాకర్ కోసం అటుఇటూ చూసి శివుడితో అన్నాడు. రామనాథం వైపు తిరిగి అన్నాడు, "ఓరే రావుడూ - నువ్వన్నా కాస్త గడ్డెట్టి పోరా! వట్టి వాలి సుగ్రీవులై పోయారు. వీళ్ళకి తోడు కంచెలవతల కాయలందుకోను ఆ అనూరాధ, కళ్యాణి! ఏవన్నా అందామంటే - ముల్లు గర్ర తీసుకొనీ తీసుకోక ముందే గట్లమ్మట పోలోమంటూ పరుగులు! ఏమని బడికి సెలవలిచ్చారో కానీ - రేయింబవళ్ళు తోట దగ్గరే కాపలా కాయలేక చత్తన్నావనుకో" - అతను వాపోయాడు. "బోర్డు మీటింగెట్టేసి బడి తెరిపించేత్తే పోద్ది!"

రామనాథం ఆ దృశ్యం తలుచుకొని పకపక నవ్వాడు.

"మావయ్యోయ్ బడి సంగతి తరువాత - ముందు గడ్డి వాము చూసుకో! నీ సపోటాకాయలు భద్రం!" శివుడు పోకిరిగా అన్నాడు

"అరి - నీ! అనక అనక నీ ముందే అన్నానూ?" భూషణం గారి చిన్నబ్బాయ్ వంగి కావిడిబద్దను కుడిభుజాన వేసుకున్నాడు -

"ఒరే శివుడూ - మరీ చిన్నతనం పోవట్లేదురా నీకు ! ఆ పక్కక్కానీ వచ్చావంటే - మరి చూసుకో!"

"ఏం చేత్తావేంటి?" శివుడు వెక్కిరింతగా అన్నాడు.

"ఏంట్రా శివుడదీ ...... చిన్నంతరం పెద్దంతరం లేకుండా?"రామనాథం శివుడినే మందలించాడు.

"అట్టా పెట్రా రావూడూ .. గడ్డి! మాపటేళ వత్తా .. .. ఇంట్లోనే వుండేం . ."

భూషణంగారి చిన్నబ్బాయి వెనక్కి తిరిగి చూస్తూ కావిడి బరువుకు ఓ పక్కగా వంగుతూ, పెద్దపెద్ద అంగలేస్తూ వెళ్ళిపోయాడు.

శివుడికి ఈనెలు తీసిన చిన్న తాటాకు ముక్కని రామనాథానికి అందించాడు, "ఇదుగో బాబాయ్ - నాలిక బద్ద!"

"అది కాదురా శివుడూ - అన్నీ బాగానే వుంటాయికానీ - చదువు మాటంటే అంత ఉలుకెందుకురా? అసలు సుధాకర్ ఎలా చదువుతున్నాడు? వచ్చిందగ్గర్నుంచీ మాట్లాడదామంటే తప్పించుకు తిరుగుతున్నాడు -" రామానాథం - సరిగ్గా శివుడు ఏమని అడుగుతాడని ఊహిస్తున్నాడో అదే - అడిగాడు.

సరిగ్గా అప్పుడే -

శివుడి అదృష్టానికో అతని దురదృష్టానికో ఎల్లాయ్ శివుడి కంట పడ్డాడు.

ఎల్లాయ్ పొద్దున్నే వచ్చి తాటి చెట్టెక్కి తాటిగెలలకు ముంతలు తగిలించి వెళతాడు. మునిమాపువేళ దించుకుంటాడు

ఆ పూట అటూ ఇటూ ఎవరూ వాడి కళ్ళబడక పోవడంతో తాటిమట్టల చాటున తాటిగెలను తీసుకెళ్ళే ప్రయత్నంలో వున్నాడు. తాటి గులకలనీ పోగేసి మోపు కట్టబోతున్నాడు.

శివుడికి రామనాథంతో తలంటు తప్పించుకొనే అవకాశం దొరకడం మహానందాన్నిచ్చింది. ముఖం గంభీరంగా పెట్టుకొని ఓ కేక పెట్టి - ఎల్లాయ్ వైపు పరిగెత్తాడు.

"ఎల్లాయ్ - ఆగరా! ఆగట్టా!"

శివుడి కేకతో ఎల్లాయ్ తత్తర పోయాడు చేతిలో మట్టను గబుక్కున కింద పడేసాడు

తాటి చెట్టు ఎక్కేటప్పుడు పడిపోకుండా నడుముకు తాటి చెట్టుకు ఆధారంగా కట్టుకునే లావాటి చక్రం లాటి మోకును భుజాన వేసుకున్నాడు. ఇక వెనక్కి తిరిగి చూడకుండా ఒకటే పరుగు.

ఎల్లాయ్ వెనకే శివుడి పరుగు

రామనాథంకి శివుడి ఎత్తుగడంతా వలిచి పెట్టిన అరటి పండులా అర్థమవుతోంది. ఇంకా చిన్నతనం చిలిపితనం వీడిపోని శివుడి చేష్టలకు నవ్వుకొంటూ ఇంటికెళ్ళాడు.

రామనాథం తిన్నగా గాబు దగ్గరకి వెళ్ళి, ముఖం కడుక్కుని - వసారాలోకి వెళ్ళాడు

పొగడ చెట్టుకింద వాల్చిన మంచం మీద చలపతి కూర్చుని వున్నాడు. చలపతి ఎదురుగా మరో మంచం మీద రత్తయ్య కూర్చుని వున్నాడు. నారని పాయలు పాయలుగా తీసి మంచం కోడుకి చుడుతున్నాడు. కల్యాణి, సుధాకర్ రత్తయ్యకు చెరో పక్కాచేరి పోటీలు పడుతూ నార అందిస్తున్నారు. నార చిక్కులు పడితే చిక్కు తీయడంలో సాయం చేస్తున్నారు.

ఇంతలో పున్నమ్మ ఎటు నుంచి వచ్చిందో కానీ - రామనాథాన్ని చూసి అంది. "నువ్వేమిట్రా చిన్నాడా ? బారెడు పొద్దెక్కే దాకా ఆ తోపులో ఏం చేత్తన్నా ? మరీ బస్తీ అలవాట్లయి పోతన్నాయ్ ... పొద్దు నెత్తికెక్కేదాకా వేప్పుల్ల నోట్లో ఏసుకొని గట్లమ్మట పుట్లమ్మట తిరిగేయడమేనా? ఓ వివరం తవరం వుండొద్దూ ? "

అంతెత్తు రామనాథాన్ని కొంటె పని చేస్తూ పట్టుబడిన చిన్నపిల్లాడ్ని కేకలేసినట్లుగా పున్నమ్మ కేకలేయడం పిల్లలకి మహా సరదాగా వుంది. ఆ ఆవేశంతో పున్నమ్మ ఎప్పుడు రామనాథం చెవి పట్టుకుంటుందోనని - వచ్చే నవ్వు పెదాల చాటున బిగబెడుతూ - కుతూహలంగా చూస్తున్నారు.

రామనాథం నిస్సహాయంగా నవ్వుతూ చలపతి వైపు చూసి కళ్ళెగరేసాడు.

"బాబాయ్ ఎక్కడికీ ఎళ్ళలా ... ! తాతయ్యగారి చెట్టు కింద పడుకున్నాడు. .." తూర్పు వాకిలి లోంచిఅప్పుడే అక్కడికి వచ్చిన శివుడు రామనాథానికి సాయమొచ్చాడు.

"పిల్లికి ఎలక సాచ్చెం - మా బాగా వుందిలే !" పున్నమ్మ మూతి మూడు వంకర్లు తిప్పి - వంటింటి వైపు విసవిసా వెళ్ళింది.

అప్పటి దాకా నవ్వావుకుంటోన్న పిల్లలు పున్నమ్మ వాలకం చూసి, ఒక్కసారిగా ఫక్కుమన్నారు.

అందరూ నవ్వారు రామనాథం నవ్వుతూ చలపతి పక్కకెళ్ళి కూర్చున్నాడు

"ష్. ... ష్. .. ." శివుడు నోటితో చిన్నగా శబ్దం చేస్తూ పిల్లలని పిలిచాడు. కోసుకొచ్చిన మామిడి కాయల్ని ఓమారు వారికి చూపించాడు వారు చూసీచూడక ముందే వాళ్ళని ఊరిస్తూ పైకెత్తి పట్టుకొన్నాడు. నెమ్మదిగా నాలుగడుగులు వెనక్కివేసి, పరుగు తీసాడు

చేతిలో నార వదిలేసి - పిల్లలు శివుడి వెనకాలే పరిగెత్తారు

"ఊ . ఇప్పుడు చెప్పరా ఏంటి విశేషాలు ?" రామనాథం చలపతితో అన్నాడు

"నువ్వు చెప్పాలి ఏడాది తరువాత వచ్చిన వాడివి" చలపతి నవ్వాడు.

చలపతి వేసుకొన్న టెర్లిన్ షర్ట్, ప్యాంటు చూసి రామనాథానికి నవ్వొచ్చింది. "సిలుకు గుడ్డ లేసుకొన్నాడని" పున్నమ్మ ఎలా శివాలెత్తి పోయుంటుందో తలుచుకొని తనలో తనే నవ్వుకున్నాడు

అమెరికా వెళ్ళబోతోన్న రంగయ్యమావ డాక్టరు అల్లుడు - తన తమ్ముడి కోసం తమ ఇంటికి రావడం రత్తయ్యకు ఎక్కడ లేని సంతోషాన్నిచ్చింది వాళ్ళు ఏం మాట్లాడుకుంటున్నా చెవి ఒగ్గి పొల్లుపోకుండా వింటున్నాడు.

"దొరలెవరినైనా చూసావా ?" చలపతి కుతూహలంగా అడిగాడు.

"ఊ .... చూసాను !" రామనాథం కళ్ళముందు వరసింహం దొర అతని పెద్ద పెద్ద కుక్కలు మెదిలాయి.

"ఎలా వుంటారేం ?" చలపతి ఆసక్తిగా అడిగాడు

"మీ సీమ దొరల్లాగా మాత్రం వుండరు !"

"నీ వేళాకోళాలకేం కానీ, ఇంతకీ నువ్వెళ్ళిన ఊరెలా ఉంది ?"

"మహబూబ్ నగరేనా ? ఆ వూరిని అక్కడివారు పాలమూరు అనీ మైబ్ నగర్ అనీ పిలుచుకుంటారు. ఒక్క చినుకు రాలిందంటే ఆ ఊరి అందం వర్ణించనలవికాదు ఊరంతా పచ్చని తివాచీ అయిపోతుంది. ఇళ్ళూ వాకిళ్ళూ - పిల్లలు పచ్చిక మీద ఆడుకోవడానికి అమర్చుకొన్న అందమైన బొమ్మలై పోతాయి. ఊరి చుట్టూ వున్న గుట్టలు పోతపోసిన హరిత నందనాలై పోతాయి. అందులో విరిసిన అందమైన రంగురంగుల వనపుష్పాల్లా లంబాడీలు - వారి అద్దాల పరికిణీలు - బృందగానాలు. ఓహ్ ! ఇక కమ్మని మాగిన సీతాఫలాల రుచి తిని చూడాల్సిందే !" రామనాథం అద్భుతమైన అనుభూతిలో మునిగిపోతూ పారవశ్యంతో వర్ణించాడు.

"తినకుండానే నోరూరించేస్తువుగా ? కానీ, అది నైజాం కిందే కదూ వుంటా ? "

"ఆ ... అవును ! నైజాం హయాం పోయి అటూ ఇటుగా పదిహేనేళ్ళ యిందా ? ఇంకా అక్కడి రైతు పరిస్థితి ఎక్కడ వేసిన గొంగళి అక్కడే లాగుంది. దొరభూముల పంపకాల గొడవలు పూర్తిగా తెమల్లేదు వ్యవసాయపు స్పృహ పెరగలేదు 'జొన్నలు వేస్తిమి రొట్టెలు తింటిమి ' అన్న ధోరణి తప్పించి ఉత్పత్తిని పెంచే ఆధునిక పద్ధతులు ఇంకా విస్తరించలేదు. ఎన్నో మంచి భూములు బీళ్ళలాగా పడున్నాయి ఆ భూమిని చూస్తే కడుపు తరుక్కు పోతుందనుకో - కొన్ని చోట్ల పశువుల మేతకి పరిమితమై పోయాయి -" రామనాథం తన కళ్ళముందు నరసింహం దొర చేను కదలాడుతుండగా విషాదంగా అన్నాడు.

"అయితే, ఏం చేయాలంటావ్ ? " చలపతి కుతూహలంగా అడిగాడు

"వ్యవసాయం"

"అదేగా చేస్తున్నారు ! అందుకేగా భూములు ! "

"మేఘంలో నీళ్ళు చూసి జడ్డిగంలో విత్తులు వొలకబోసే వ్యవసాయం కాదు. ఫలసాయాన్ని పెంచే వ్యవసాయం. రైతు తను బతుకుతూ పది మందిని బతికించే వ్యవసాయం. అలాంటి వ్యవసాయం చెయ్యాలి " రామనాథం కళ్ళు మిలమిల మెరుస్తుండగా అన్నాడు.

"నీ ఉద్దేశం నాకేం అర్థమవట్లా ... అసలు వ్యవసాయం మీద నీకెందుకింత శ్రద్ధ పట్టుకొచ్చిందీ ? " చలపతి ఆశ్చర్యంగా అడిగాడు

రత్తయ్య కూడా చిక్కులు తీసిన నారను మంచం కోడుకు చుడుతూ రామనాథం వైపు ఆసక్తిగా చెవి రిక్కించాడు.

"నేను రైతుబిడ్డను - నేను గది గోడల మధ్య ఇరుకు కుర్చీలో కూరుకుపోయి గొర్రెకు బెత్తెడు ఉద్యోగానికి పరిమితం కాలేను. బొంగరంలా తిరిగిన చోటే తిరగనూ లేను. దిగంతాల మధ్య భూమ్యాకాశాల మధ్య స్వేచ్ఛావాయువుల మధ్య మాత్రమే నేను పని చేయగలను. ఇన్నాళ్ళ ఉద్యోగ కాలంలోనూ నా గురించి నేను తెలుసుకొంది అదే ! " రామనాథం లోతుగా అన్నాడు.

"అయితే .... ?" చలపతికి రామనాథం ఉద్దేశం అంతుపట్టక అయోమయంలో పడ్డాడు.

రత్తయ్య చేస్తుంత పనాపి రామనాథం వైపు కుతూహలంగా చూసాడు.

"అందుకు నేనెంచుకున్నది - నడిగడ్డ. తూర్పుకు పారే కృష్ణానది. పడమర నుండి కృష్ణను చేరడానికి పరుగులెత్తే తుంగభద్ర ... " రామనాథం పరవశంతో అన్నాడు.

"ఎందుకు ఎంచుకున్నావ్ ? " చలపతి ఆశ్చర్యంతో అతనికి అడ్డొస్తూ అన్నాడు, "వ్యవసాయం చేద్దామనే ? "

రత్తయ్య మంచం కోడు చివరి కంటా వచ్చి కళ్ళు పెద్దవి చేసి రామనాథం వైపు చూసాడు.

రామనాథం ఔనన్నట్లు గంభీరంగా తలాడించాడు

రత్తయ్య ఉరుము లేని పిడుగు పడ్డట్లు ఉలిక్కిపడ్డాడు.

తేనెతుట్టు మీద తుంటరి పిల్లలు వేసిన రాయి తుట్టు మొదలంటా కదిలించినట్టు - జుమ్మంటూ ఆలోచనలు చుట్టుకున్నాయి. చలపతి ఏం అడుగుతున్నాడో రామనాథం ఏం చెపుతున్నాడో రత్తయ్య చెవిన పట్టులేదు బ్రహ్మాండమైన నిశ్శబ్దమేదో అతని మీద విరుచుకు పడింది. స్తబ్దుణ్ణి చేసింది.

"అన్నపాళ అవుతుంటే ఎక్కడాళ్ళు అక్కడ అట్టాగే కూసున్నారేంటి ? మీ కబుర్లు ఎంతకీ తెమలవు కానీ - గాబు దగ్గరకి వెళ్ళి కాళ్ళూ చేతులు కడుక్కు రండి. వడ్డించేస్తాను." పున్నమ్మ కొంగు దులిపి నడుం చుట్టూ బిగిస్తూ అంది,"పదబ్బాయ్ చలపతీ - పెద్దాడా- నువ్వూలే - !"

రామనాథం రత్తయ్య వైపు చూసాడు

రత్తయ్య కలలో చేస్తోన్న వాడిలా నారని ఎలాగో మంచంకోడుకి చుట్టేసి - వంటింట్లోకి నడిచాడు.

అన్నదమ్ముల మధ్య వాతావరణం - గాలి కూడా ఆడలేనంత దట్టంగా కమ్ముకొచ్చిన కారుమేఘం కురవకుండా ఉబ్బరించేస్తున్నట్టుగా వుంది.

ఏ క్షణానో కురవబోయే జడివాన కోసం రామనాథం అణువణువూ బిగబెట్టి, చాలా మెలుకువగా చాలా జాగ్రత్తగా రత్తయ్య వెనకే నడిచాడు.

చలపతి భోజనాలయ్యాక - కాసేపు కబుర్లు చెప్పి వెళతానని లేచాడు. అతన్ని సాగనంపడానికి రామనాథం వీధి చివరి దాకా వెళ్ళాడు.

భోం చేసాక రత్తయ్య తిన్నగా పొగడ చెట్టు కిందికెళ్ళి - మంచం మీద కూలబడ్డాడు నిశ్శబ్దంగా నారని చేతుల్లోకి తీసుకొన్నాడు. ఒక నారపాయ తీసుకొని, దాని చివర్ని కుడి కాలి వేళ్ళతో వత్తి పెట్టి - కాలిని బార చాపాడు, రెండో చివర్ని ఎడమ అరచేతిలో పెట్టుకొని - కుడి చేత్తో పేనడం మొదలెట్టాడు. ఒక్కోపాయను కలుపుతూ పోతున్నాడు. కాస్త పొడవు పేనగానే ఒక్క కర్ర ముక్కకు చుట్టి - మళ్ళీ తాడు పేనుతున్నాడు.

ఇంతలో పున్నమ్మ రాట్నం తీసుకు వచ్చింది. గట్టుమీద కూర్చుని ఏకులు సరి చూసింది. ఎడం చేత్తో దూది పట్టుకొని - వడకడం మొదలెట్టింది. రాట్నం చక్రం గిరగిరా తిరిగింది. దారం కండెకు చుట్టుకుంటోంది

రామనాధం చలపతిని సాగనంపి తిరిగి వచ్చాడు

రత్తయ్య ఎదురుగా మంచం మీద కూర్చున్నాడు. నిశ్శబ్దం బద్దలయ్యింది.

రత్తయ్య పేనుతున్న తాడు వైపే దీక్షగా చూస్తూ - గట్టిగా వ్యంగ్యంగా అన్నాడు.

"అమ్మా - మరి . . చివరాకరకు పుట్టాడు చదివి వుద్దరిస్తాడు అని మహాసంబర పడ్డావే - నీ కొడుకు సలక్షణంగా చేస్తున్న ఉజ్జోగం సజ్జోగం మానుకొని - ఎద్దు ముడ్డి పొడుస్తాడంట ! " ముంచుకోస్తోన్న కోపాన్ని బలవంతంగా అణుస్తున్నట్లు రత్తయ్య దవడ కండరం బిగుసుకుపోయింది నుదిటి మీది నరాలు వుబ్బాయి ముక్కు పుటాలు అదురుతున్నాయి

రామనాధం తల్లి ఏమంటుందోనని ఊపిరిబిగపెట్టి చెవులు రిక్కించి, పున్నమ్మ వంక చూసాడు.

"ఏంట్రా పెద్దాడా . . . నువ్వనేది ? మన రావుడే ? " పున్నమ్మ రాట్నం తిప్పడం ఆపి, కళ్ళు పెద్దవి చేసి అంది

"ఉజ్జోగం అంటే ? ఎంత గౌరవం ! ఎంత ప్రతిష్ట ! అయినా పట్నమెళ్ళి అన్నేళ్ళు చదివిందీ మట్టి పిసుక్కోడానికా ? పెంటపోగులు తోలడానికా ? " రత్తయ్య మళ్ళీ విరుచుకు పడ్డాడు.

పున్నమ్మకు ఒక పట్టాన విషయం మింగుడు పడలేదు. ఆమెకు రాత్రి కొడుకుతో తను వెళ్ళబోసుకున్న కష్టమూ సుఖమూ జ్ఞాపకం వచ్చింది నెమ్మదిగా తేరుకొని రామనాధంతో అంది, "అయినా .... అంత ఖర్మేం పట్టిందిరా నాయనా నీకు ? ఏదో కడుపు తీపి కొద్దీ కళ్ళెదుటగా వుంటావు లెమ్మని ఈ పక్కకి మార్చుకోమన్నానే కానీ - ఉన్న పళాన ఉజ్జోగం మానేయమన్నానట్రా - " పున్నమ్మ వాపోయింది.

"అయినా - ఏం చేత్తాడంట ఎవసాయం ? ఆ కాడికి ఇక్కడ చేసేవాళ్ళంతా దిగడి పొయ్యారా ? మా కంటే మొనగాడి రైతా ? " రత్తయ్య కోపంతో వూగిపోతూ - రామనాధాన్ని నేరుగా చూడకుండా పున్నమ్మని ఉద్దేశించినట్లుగా అన్నాడు.

"అది కాదన్నయ్య ..... పొద్దు పొడవకముందే వంచిన నడుం పొద్దుగూకిందాకా ఎత్తువు కదా .... ఏం లాభం ? ఏ పూట కాపూట గడుస్తుందే కానీ - పై నిలవ ఏం వుంటుంది? అక్కడికి .... ఇంటి ముందు పురి కట్టి ఎన్నాళ్ళయింది ? " రామనాధం నచ్చ చెప్పినట్లుగా అన్నాడు.

"పై నిలవలుంచి మేడలు మిద్దెలు కట్టే ఆశ ఇక్కెడెవరికీ లేదులే - మా లావు ఆశ నీకుందేమో కానీ -"రత్తయ్య కోపం వెటకారంగా మారింది

"మేడలు మిద్దెలు కట్టక్కర్లా - పూలమ్మిన చోట కట్టెలు అమ్మకపోతే చాలు ! "

పున్నమ్మ కొడుకు లిద్దరి వైపు నిస్సహాయంగా చూసింది వారి వాదనలు ఏ ప్రళయంగామారుతాయో ఆమె ఊహకు అందడం లేదు ఎవరు మాట్లాడుతుంటే వారివైపు చూస్తూ - గుండె మీద చేయి వేసుకుంది. ఆమె గుండె దడ దడలాడుతోంది.

"ఇక్కడ ... మహామాగాణి క్షేత్రాలు పోగడ్డాయి ! ఇందరం వొళ్ళు విరుచుకోడానికి ! " రత్తయ్య రెండు చేతుల్ని వెడల్పుగా చాస్తూ గాలిలోకి విసురుతూ కస్సు మన్నాడు.

"అందుకే - అన్నయ్యా .... మంచి భూమి బేరం చేసాను ! " రామనాథం టక్కున అన్నాడు.

రత్తయ్య రామనాథం వంక అనుమానంగా చూసి - కళ్ళు చిట్లించి అడిగాడు, "ఎన్నెకరాలు ?"

"ఇరవై" రామనాథం ఉత్సాహంగా చెప్పాడు.

"ఏకాడికి ? "

"ఎకరా వేయి రూపాయలు"

"ఎకరా వేయి రూపాయలా ? అది ఏ జిల్లేళ్ళు మొలిసిన మెట్టో అయ్యుంటది ".

"కాదన్నయ్యా .... మంచి రేగడి భూమి - నల్లరేగడి !"

"నాకు తెలిసి ఈ పక్క సారమంతా సంద్రం పాలయ్యి మిగిలింది..... చౌటు పర్రలు - గరువు చెక్కలు . . . తప్పితే చెరువు కింది మాగాణే కానీ రేగడెక్కడిదిరా ? " రత్తయ్య మళ్ళీ కళ్ళు చికిలించాడు.

పున్నమ్మ ఊపిరి బిగబెట్టింది.

"ఈ పక్క కాదన్నయ్య ...... ఆ దేశాన ? "

"ఏ .... ఏ.... దేశాన ? ఆ .... అడవి దేశానే ! " రత్తయ్య రెండుగా విచ్చిపోయాడు. చాలాసేపు ఏమీ మాట్లాడలేక పోయాడు. నెమ్మదిగా తేరుకొని అన్నాడు "అసలెట్టా కొంటా ? ఒక్కడివీ ఎట్టా చేస్తా ?"

"మీరంతా వుంటారుగా అన్నయ్యా ..... అయినా మన నాలుగెకరాలు ..... ఈ ఇల్లు - తాటితోపు బేరానికిచ్చేస్తే అక్కడ ఇరవై ఎకరాలు సులభంగా కొనచ్చు. పై నుంచి పంట ఖర్చులకీ డబ్బులుంటాయ్ ....." రామనాథం ఉత్సాహంగా అన్నాడు, "మిగిలిన రెండకరాలు ఎలాగూ దమయంతివి కనుక అనూరాధకి ఇవ్వాల్సిందేగా ! "

పున్నమ్మ, రత్తయ్య ఇద్దరూ మొదలు నరికిన చెట్లలా ఒకేసారి కూలిపోయారు. రామనాథం ఉద్దేశం వారికిప్పుడు స్పష్టమైంది.

రామనాథం వాళ్ళిద్దరూ తన నిర్ణయాన్ని ఎలా తీసుకొంటారో ఎలా స్పందిస్తారో ఊహించలేని ఉద్విగ్న స్థితిలో వున్నాడు. మోకాళ్ళ మీద చేతులాన్చి నిటారుగా కూర్చున్నాడు.

"కన్న తల్లి వున్నవూరు సొరగం[1]తో సమానమంటార్రా - పాలు తాగి పొదుగు గుద్దే రకం కాదురా మన వంశం - తాత ముత్తాతల కాలం నుంచీ ఇంత కూడెట్టిన ఆ భూమి తల్లిని పరాయి పాల్జేసి ఎళ్ళిపోదామనే ... ?" రత్తయ్య కోపాన్ని దుఃఖం కరిగించేసింది గొంతు బొంగురు పోయింది.

" అది కాదన్నయ్య - మన ముత్తాత యాభై ఎకరాల ఆసామి - మన తాత లొచ్చేసరికి చెరి పాతిక. తాత దాన్ని ముప్పై ఎకరాలు చేసి నాన్న పాలు పదెకరాలిచ్చాడా ? నాన్న వ్యాజ్యాన పోయింది పోగా- దమయంతి పసుమకుంకుమల కిందది అనూరాధకి పెళ్లినాడు ఇచ్చేస్తే మనకి మిగిలేది ఏ మాత్రం ? నాలుగెకరాలు ! పెళ్ళయిన ఆడపిల్లల అత్తారింట మర్యాద వుంచుకోవద్దా ? మిగిలినవాళ్ళ పెళ్ళిళ్లూ చేయద్దా ? మళ్ళీ శివుడు, సుధాకర్‌ల దగ్గరకి వచ్చేనాటికి ఏం ఇస్తాం ? ఎంత ఇస్తాం ? చెరో సెంటోకుంటో పంచియ్యాల్సిందే ? " రామనాథం నెమ్మదిగా నచ్చ చెప్పినట్లుగా అన్నాడు.

"అదెట్టాగరా ? అనూరాధని మన సుధాకరానికి చేసు కొందామనేగా అనుకుంది. మన పొలం మన దగ్గరే వుంటాందాయె. ఆకాడికి పోయేదేవుందీ వచ్చేదేవుందీ ? " పున్నమ్మ నెమ్మదిగా అంది.

"అదీ నిజమేననుకో అమ్మా - అయినా ఆ రోజటికి ఎట్లా జరగబోతుందో మనం చూడొచ్చానూ ? కానీ అమ్మా - ఎంతలేదన్నా ఇప్పుడు సరళకైతే కట్నం ఇవ్వాలా ? పద్మకైతే పొలం ఇవ్వాలా ? అయినా, ఆ గరువు పొలం కాలువకి దిగువయిపోయే - నారు పొలంలో పెట్టుకొని నీరు కోసం నోరెళ్ళ బెట్టాల్సిందేగా ? ఇక పైరు చేతికొచ్చే సరికి ఏ ఉప్పెనో గాలీవానో - మునకేసింది, మునకేయగా - మిగిలింది మురిగిపోయే ! ఎందుకమ్మా .... ఏడాది పొడువునా పడ్డ పాటంతా ఏటి పాలు చేయడం ?" అన్నాడు రామనాథం.

"ఓ - యబ్బో ....... ! మహా పాటడి పోతన్నం - పాటు ! " రత్తయ్య వెక్కిరించాడు. కనుబొమలు ఎగరేస్తూ చూపుడు వేలాడిస్తూ రామనాథంతో అన్నాడు, "నువ్వు వెయ్యి చెప్పు లక్ష చెప్పు ! ఈ కట్టెలో ప్రాణం వుండగా ఆ పొలం బేరం పెట్టేది లేదు ! ఈ యిల్లు మీద ఈగ వాలనిచ్చేది లేదు. తాటితోపులోకి ఎవడన్నా తొంగి చూసాడా .... ! " రత్తయ్య హుంకరించాడు.

"పెద్దాడా .... తొందర పడ్డావంటే .. .. నా మీద ఒట్టే !" పున్నమ్మ రత్తయ్యని చేయి పట్టుకొని, సవరించి - అతన్ని సమాధాన పరిచింది.

"అన్నయ్యా - నాగలి పట్టినప్పట్నించీ నువ్వా పొలంలో వంచిన నడుం ఎత్తలేదని నాకు మాత్రం తెలీదూ ? నీకు ఆ మాత్రం ఆశ - పాశం వుండవూ ? కానీ, నడిగడ్డ మొనగాడి గడ్డ అన్నయ్య - పోతుగడ్డ ! నువ్విక్కడ పడ్డ శ్రమే అక్కడ పడ్డావంటే నూరెకరాలు దుక్కి చేయవచ్చు

---

1 స్వర్గం

- ఆసామి వవ్వచ్చు ! " రామనాథం ముఖం విప్పార్చి చెప్పాడు భవిష్యత్తు మీద ఆశ అతని కంఠంలో గుసగుసలాడింది

"ఏం మొనగాడి గడ్డ ? అదొట్టి నెత్తుటి గడ్డ ! నీ కబుర్లకేమిగానీ - మేము మాత్రం ఆ నైజాం గురించి ఇన్లేదను కొంటున్నావా ? ఆ నరుక్కోడాలు ... ఆ సంపు కోడాలు .. ! అబ్బాయ్ . . పిల్లాపాపా పచ్చగా వుంటే అదే పదివేలు, ప్రాణాలు అరిచేతిలో పెట్టుకొని బిక్కుబిక్కుమంటూ - ఎట్టా బతికేది ? " పున్నమ్మ గట్టిగా వారించింది.

"లేదమ్మా ... అదెప్పుడో గడిచిన కథ. ఇప్పుడట్లా లేదమ్మా అందులోనూ నేను చూసిన పొలం ."

"మేవేమన్నా చూసామా ? పెట్టామా ? అయినా మన వూళ్ళో మనకున్న గౌరవం ఏ దేశంపోతే వచ్చుద్దీ? ఇప్పటికీ మన హైస్కూల్లో మీటింగెడితే మన మాటంటే ఎంత విలువ ? ఎంత గౌరవం ? ఎన్ని పురులు కట్టినా ఎంత సిరులు మూటగట్టినా - మన ముత్తాత తవ్వించిన ఈ ఊరి చెరువు, మన తాత నాటిన తాటితోపు - మన నాన్న కట్టించిన స్కూలు, లైబ్రీ - ఇయ్యాన్నీ ఆ దేశానికి వస్తయ్యా ? ఇదుగో .. నాన్న ...ఈ పొగడ చెట్టు కింద వాలు కూర్చీలో కుర్చుని. . వచ్చినాళ్ళందరికి మంచీసెబ్బరా చెపుతుంటే ఎట్టా వుండేది ! ఈనాటికి మాత్రం ఊళ్ళో ఏ కష్టానికైనా సుకానికైనా మన మాటకేగా విలువ ! చుట్టాలు పక్కాలు పిల్లా పాపలతో తరతరాల నుంచీ ఈ గడ్డ మీదే పాతుకు పోయిన వంశమయ్యే మనది - అయినా కళకళలాడుతోన్న మామిడి చెట్టు మొదలంటా పెరికి - మరోచోట నాటి - కాయలు కాయిస్తానని ఏ వెంగళాయీ అనడు ! " రత్తయ్య కంఠంలో హేళన ధ్వనించింది.

"టెంకె తీసుకెళ్ళి నాటొచ్చుగా అన్నయ్యా ? "

రామనాథం మాటతో రత్తయ్య మళ్ళీ కస్సున లేచాడు.

"ఇన్నెందుకురా ? ఇంత ముద్దపప్పు తిని ముడుచుకు పడుకొన్నా - పుట్టిన గడ్డ పుట్టినగడ్డే - పరాయి గడ్డ పరాయిగడ్డే ! అందునా మన తాత ముత్తాతల చెమటతో తడిచిన ఆ పొలాన్ని అరంగుళం అమ్మినా నన్ను చంపుకు తిన్నంత వొట్టే ! ఆ . ! " రత్తయ్య రామనాథం ముఖాన గుద్దినట్లు చెప్పి విసవిసా వెళ్ళి పోయాడు బలంగా పడుతోన్న రత్తయ్య అడుగుల బరువుకి నేల గతగత లాడి పోయింది.

పున్నమ్మ కొడుకు లిద్దరి మధ్యనా ఎవరికి ఏం చెప్పాలో తెలియక తత్తర పోయింది. కాళ్ళు వణికి పోతుంటే - చెమట్లు పట్టిన చేతుల్ని పిసుక్కొంటు - ఏదో చెప్పబోయి చెప్పలేక - నాలుగడుగులు అటూ నాలుగడుగులు ఇటూ వేసి మళ్ళీ వెనక్కి తిరిగి వంటింటి వైపు వెళ్ళింది

రామనాథం ఇద్దరూ వెళ్ళిన వైపు చూసి గట్టిగా ఊపిరి పీల్చి వదిలాడు. ఆలోచిస్తూ తాటితోపు వెనక నున్న మామిడిచెట్టు దగ్గరకి వెళ్ళాడు.

రత్తయ్య తిన్నగా చావిడి దగ్గరకి వెళ్ళాడు. అతడి పెదవులు వణికి పోతున్నాయి. చేతులు పట్టు తప్పు తున్నాయి

ఎడ్లముందు గడ్డి ఎగేసి - జనపకట్ట తెచ్చి వాటి ముందేసాడు. ఎడ్ల మూపురాల్ని ఆప్యాయంగా తడిమాడు. గంగడోలు ఆత్మీయంగా నిమిరాడు. వంగి జనపకట్ట తీసి చెరోచేత్తో నోటి కందించాడు అవి కృతజ్ఞత పూర్వకంగా అతని అరచేతుల్ని నాలికతో నాకాయి. తలాడించి, పరకను పళ్ళ నాడించాయి.

రత్తయ్యకు ఏడుపు ముంచుకొచ్చింది.

పైపంచ నోట్లో కుక్కుకొని చావిట్లో కెళ్ళాడు నులకమంచం బరబరా లాగాడు మంచం కోడుమీద చేతులు పెట్టుకొని బోర్లా పడుకున్నాడు

పున్నమ్మ గబగబ వంటింట్లోకి వెళ్ళింది.

పిల్లలందరూ మామిడికాయలు ముక్కలు చేసుకొని - ఉప్పుకారం అద్దుకుని తినే హడావుడిలో వున్నారు.

శాంతమ్మ మజ్జిగ చిలుకుతుంది. సావిత్రి చిక్కుళ్ళు గిల్లుతోంది. పున్నమ్మ వచ్చీ రాగానే గుంజకానుకొని కూలబడింది కొంగుతో కళ్ళుద్దుకొంటూ వాపోయింది.

"నాకు కాళ్ళూచేతులాడ్డం లేదే అమ్మాయ్ - నాకూహ వచ్చే నాటికి ఈ దొడ్లోకి కాపరానికి వచ్చానా ... నేను బతుకుండగానే ఇట్టాంటి మాట ఇనాలిసొస్తొందనుకోలేదే .. . అయ్యో .... నా రాత ! "

"ఏమయిందత్తయ్యా ? " కోడళ్ళిద్దరూ చేస్తున్న పనాపి పున్నమ్మకి చెరో పక్క చేరారు.

పున్నమ్మ ఓ చేత్తో సావిత్రిని ఓ చేత్తో శాంతమ్మని పట్టుకొంది.

"సావిత్రీ - మీ నాన్నకి నేనేం సమాధానం చెప్పనే ? చదువుకున్నాడని మహా బిరుసుగా నా కొడుక్కేసి కట్ట బెట్టాడా ? 'అప్పా .. ... నా కూతుర్ని అడవికి తోలి అన్యాయం చేత్తావా ? ' అని నిలదీస్తే నేనేం చెయ్యనే ? ఓసే శాంతం - నీ కూతుళ్ళ పురుళ్ళు వున్నాలు - పండుగలు పబ్బాలు ఎవరు చూస్తారే ..... నా తల్లీ .. ? అందరం వుండీ నీ కూతుళ్ళు అనాథలై పోతారెట్టాగే ? " పున్నమ్మ మాటలు తడబడుతోన్న పెదాలు వణికిపోతుంటే అంతూ పొంతూ లేకుండా వాపోయింది.

"ఒరేయ్ - శివుడూ - నువ్వెక్కడ చచ్చావురా ? పోయి బ్రహ్మయ్య తాతనీ భూషయ్య తాతనీ సూరయ్య తాతనీ పిలుచుకురా ! అట్టాగే కమలమ్మ నాయనమ్మనీ కేకేసుకురా ! మీ అప్పచెల్లెలు కట్టంలో వుంది నిలుచున్న పళాన పరిగెట్టుకు రమ్మను ! ఒరేయ్ . . సుధాకరూ - ఆ మామిడికాయ బద్దలు ఏడకి పోవుకానీ - అయ్యాట్టా పడేసి - పోయి పద్మనీ ... అట్టాగే ఆ చాకలాడిని రమ్మను ... సరళాళ్ళూరికి కబురు చేద్దాం ! " పున్నమ్మ హడావుడిగా మగపిల్లలిద్దర్నీ చెరోవైపుకు పరిగెత్తించింది.

విషయం ఏంటో అర్ధం కాక తెల్లబోయిన కోడళ్ళను చూసి - పున్నమ్మ పెదవి విరిచింది ముక్కు ఎగబీల్చింది. గుండె గొంతులో కొట్టుకుంటోంటే ... . నిట్టూర్పుల మధ్య ఆమె చెప్పిన విషయం ఊపిరి బిగబెట్టుకొని విన్నారందరూ

బ్రహ్మయ్య భూషయ్య పున్నమ్మకి అన్నలు. సూరయ్య తమ్ముడు, కమలమ్మ చెల్లెలు సూరయ్య కూతురు సావిత్రి.

పెద్దవాడు బ్రహ్మయ్య మంచి వ్యవహర్త. పున్నమ్మ పెళ్ళికి ముందు నుంచే అతనికి వెంకట్రామయ్యతో స్నేహం. అందుకనే బావ అన్న గౌరవంతో పాటు స్నేహంతో కూడిన చనువుండేది. వాళ్ళ మురా అంతటికి వాళ్ళిద్దరే మంచి చెడూ నిర్ణయించేవారు. లోకం లౌక్యం తెలిసిన వారు.

ఆడవాళ్ళంతా వారి రాక కోసం ఎదురు చూస్తూ కూర్చున్నారు.

మామిడి చెట్టుదగ్గరకి వెళ్ళిన రామనాధం గొప్ప సంక్షోభంలో పడి పోయాడు. ఇంట్లో తలెత్తిన పరిణామాలు అతను ఊహించనివి కావు. అయినా వాస్తవంగా పరిస్థితిని ఎదుర్కోవాల్సి రావడమే అసలు సమస్య

రామనాధం కుటుంబంలో మనషుల మధ్య అపారమైన ప్రేమతో పాటు పెద్దల మాటను గౌరవించే నిబద్ధత తరతరాలుగా వస్తోంది.

వరదన పడి కొట్టుకు పోతున్నవాడు గడ్డి పరకదొరికినా ఆసరాకై ఆధారమవుతుందేమోనని ఆశగా చూస్తాడు

అలాగే సమస్యలను గట్టెక్కాలనే ఆరాటంలో వున్నవాడికి మిణుకు మిణుకుమనే ఆశ ఆధారమై ఏదో ఆశయాన్ని నిర్దేశిస్తుంది ఆ ఆశయసాధన ప్రయాణమెపుడూ విజయానికి అపజయానికి మధ్యనుండే సూక్ష్మాతి సూక్ష్మమైన రేఖ మీదే.

అలాగే, ఆ ఆశయసాధన కోసం ప్రయాణం మొదలెడడానికి ముందు ఇంటగెలవాలనే తపన, తనవారి అండదండకై తాపత్రయం చాలా సహజంగా తలెత్తేవే.

అయితే, గెలవ లేక పోతున్నానన్న స్పృహ కలిగించే ఉక్రోషం - ఎలాగైనా గెలిచి తీరాలన్న పంతానికి మూలమవుతుంది. పంతానికి మొండితనం ఆయుధమవుతుంది.

సరిగ్గా అలాగే, పంతం నెగ్గించుకోవడానికి మొండికెత్తిన ఓ చిన్నపిల్లవాడిలా రామనాధం కూడా ఓ కృత నిశ్చయానికి వచ్చి ఇంటికి తిరిగి వచ్చాడు.

చావిట్లో మంచం మీద మునగడ దీసుకొని పడుకొని వున్న రత్తయ్యను దూరం నుంచే చూసాడు. రామనాధం గుండె పట్టేసి నట్లయ్యింది

వంటిల్లు నిశ్శబ్దంగా వుంది.

రామనాధం గాబు దగ్గరకెళ్ళి - చెంబుతో నీళ్ళు కాళ్ళమీద గుమ్మరించుకొన్నాడు తిన్నగా పంచలోకి వెళ్ళాడు.

ముగ్గురు మేనమామలు - పినతల్లి, తల్లి - వదిన - భార్య అందరూ గంభీరంగా కూర్చుని వుండడం చూసి, ఒక్క క్షణం కదిలిపోయాడు

గొంతు సవరించుకొని వెళ్ళి భూషయ్య పక్కన మంచం మీద కూర్చున్నాడు. ఎదురు మంచం మీద పెద్దమామ - బ్రహ్మయ్య, చిన్నమామ - సావిత్రి తండ్రి - సూరయ్య కూర్చుని వున్నారు. ఆడవాళ్ళంతా గట్టుమీద కూర్చుని వున్నారు అందరి ముఖాలు కళ తప్పి వున్నాయి

పిల్లలు ఎక్కడున్నారో చడీచప్పుడు లేదు

ఎక్కడి నుంచో తెచ్చుకున్న బాదం కాయను పొగడ చెట్టు మీద నుంచి కింద పడేసుకున్న పక్షులు రెండు తిరిగి పైకి తీసుకెళ్ళే ప్రయత్నంలో సందడి చేస్తున్నాయి.

ఓ కందిరీగ చూరు వాసంలోకి దూరాలని ప్రయత్నిస్తూ గీమంటు గోలపెడుతోంది

రామనాథం, మేనమామలు పరామర్శలు చేసుకొన్నారు.

బ్రహ్మయ్య గొంతు సవరించుకొన్నాడు పైపంచ సర్దుకొని గంభీరంగా నెమ్మదిగా అడిగాడు, "ఏరా అబ్బాయ్ ... పొలం బేరం చేసావంట ..... ఏకాడికి ? "

రామనాథం వివరాలు చెప్పాడు

భూషయ్య, సూరయ్యా తలాడించారు.

ఆ మాట ఈ మాటా చెప్పుకున్నాక బ్రహ్మయ్య రామనాథం వైపుగా కాస్త వొంగి హుందాగా మనసుకు పట్టేంత సౌమ్యంగా అన్నాడు, "మేనమావ మేలు కోరతాడని అన్నట్టుగా - నా మాటిను ! దుక్కి దున్నడానికి, విత్తునాటడానికి, కోతకోయడానికి - పనిముట్లతో పాటు దుడ్డు కర్రెత్తు కెళ్ళాల్సిన చోట రైతు ఎక్కిరాడు. రైతుకు ఎట్టాంటి భయం ఎట్టాంటి ఆందోళన వుండకూడదు. ఆడి పాటికి ఆడిని సొతంతరంగా వదిలెయ్యాలి. అట్టాంటి చోట ఆడి పాట్లేవో పడి పంట పండిస్తాడు ! "

" ఆ నైజాం హయాంతోనే ఆ భయాలన్నీ పోయాయి మావయ్య ...... ఇప్పుడట్లా లేదు. అందులోనూ .. .. " రామనాథం నచ్చచెప్పే రీతిలో అన్నాడు.

బ్రహ్మయ్య అతని మాటలు పూర్తికాకముందే అడ్డొచ్చాడు.

"బిడ్డపోయినా పురిటికంపు పోదురా ..... తలపండిన వాణ్ణి చెపుతున్నా ఎప్పటికైనా జ్ఞాపకం వుంచుకో ..... పడగ నీడన విత్తనం మొలవదు ! "

"మీ బావయ్యే వుంటే ఇట్టాంటి గోరం జరగనిచ్చేవాడా అన్నాయ్ ......" రుద్ధమైన కంఠంతో మాట పెగలక పున్నమ్మ కళ్ళొత్తుకుంది. పున్నమ్మతో పాటు ఆమె చెల్లెలు కమలమ్మ కళ్ళొత్తుకుంది.

" ఆ పెద్దాడు చూడు ..... ఉంగడి పడ్డ గొడ్డులా ఎట్టా మంచానికి అడ్డం పడ్డాడో .... కదిలిస్తే కస్సుమంటున్నాడు ..... " పున్నమ్మ మళ్ళీ ముక్కులు ఎగబీల్చింది.

కోడళ్ళు, అన్నదమ్ముల కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

కాసేపు మౌనం తరువాత బ్రహ్మయ్య అన్నాడు, "ఏవైనా - ఒరే అబ్బాయ్ - మంచికీ చెడుకీ మన మధ్యనుంటే వేరు ! అయినా ఆ దేశాన భూములన్నీ నాపరాళ్ళ మయమని ఇన్నానే! ఎవసాయం ఎట్టా చేత్తావ్‌రా ? "

"ఇప్పుడు కాలవలొస్తున్నాయి మామయ్య "

"అయినా, బస్తీకెళ్ళి చదూకున్నాడివి నీకెందుకురా ఈ కాడి బరువు ? " ఇక ఆగలేక భూషయ్య కలగజేసుకొని అన్నాడు

"నలుగురం బాగుపడతామనే కదా మామయ్యా . . నేనిలా ఆలోచించిందీ ! "

"పుట్టినూళ్ళో మురుక్కాలువ మీద ముక్కుమూసుకొని బతికినా సుఖం కానీ ముక్కుముఖం తెలీని జనాల మధ్య పరాయాడిలాగా బతుకే బతుకెందుకురా ? " నిట్టూర్చాడు భూషయ్య

"అదేవుంది మామయ్య ... నోరు మంచిదయితే ఊరు మంచిదవుతుంది అయినా, మనుగడకోసం మనిషి ఒకచోట నుండి మరోచోటకి వెళ్ళడం అనాదిగా వుందేగా - మనకి వేదాలు చెప్పిన ఆర్యులు మాత్రం ! ఈ గడ్డ మీదకు మనుగడ కోసం వచ్చినాళ్ళేగా ? " రామనాథం అన్నాడు.

"నువ్వు చదివిన చదువంతా మాతో వాదాలకి పనికొస్తుంది కానీ - అబ్బాయ్ - ఇంతకీ ఏమంటావ్ ? "బ్రహ్మయ్య నిలదీసాడు

ఆడవాళ్ళంతా కళ్ళుతుడుచుకొని రామనాథం నిర్ణయం వినడానికి సిద్ధపడ్డారు. రామనాథం మేనమామలు అతనికి కళ్ళు చెవులు అప్పగించారు. రామనాథంకి వాళ్ళంటే ఎనలేని గౌరవం, ప్రేమ. ఒక్కసారి వాళ్ళ ముఖాల్లో కదలాడుతోన్న ఆదుర్దాను భయాన్ని చూసాడు.

గుండెల నిండా ఊపిరి పీల్చుకొని గంభీరంగా అన్నాడు.

"ఏముందీ ? ఎవరొచ్చినా ఎవరు రాకపోయినా నే వెళ్ళేది ఖాయం ! ఉమ్మడి పొలం కూడా బేరం పెట్టేది లేదు. అనూరాధ పొలం అమ్మే స్వతంత్రం తీసుకుంటున్నా, నాకు మరో మార్గం కనిపించలా. మిగిలిన డబ్బు షావుకారి దగ్గర తీసుకొంటా. కాలం కలిసొచ్చి ఇవన్నీ తీర్చేయగలిగానా సరే ... లేదూ ఉమ్మడిన నా వంతమ్మి కట్టండి ! నేను అమ్మని, అన్నయ్యని..... చివరికి సావిత్రిని కూడా నాతో పాటు రమ్మని అడగను, నాతో ఎవరు రావాలనుకొంటే వాళ్ళు రండి లేదూ.... ఆ ధైర్యం వచ్చాకే వద్దురు ! అంతే ! " రామనాథం ఖచ్చితంగా తేల్చి చేప్పేసాడు.

సావిత్రి అందరివైపు బిత్తరపోయి చూసింది. ఏదో నిర్ణయించుకోవాల్సిన అవసరం తన నెత్తినొచ్చి కూర్చుంటుందని ఆమె ఊహించలేదు. తత్తర పాటుతో తండ్రివైపు అత్తవైపు మార్చి మార్చి చూసింది. సావిత్రి తండ్రి - సూరయ్య బ్రహ్మయ్య ఏవంటాడోనని చూసాడు

బ్రహ్మయ్యకు ఇక సావిత్రి నిర్ణయం అడగక తప్పలేదు,

"ఏవంటావే సావిత్రీ ?"

సావిత్రి ఎటూ తేల్చుకోలేక పున్నమ్మ వైపు మాట సహాయం కోసం బేలగా చూసింది

"నన్నెందుకు సూడ్డం ? ఆకాడికి ఆడి మాట తోసేసి నట్టెందుకూ ? ఎళ్ళు !" పున్నమ్మ తన ఉద్దేశం చెప్పింది.

ఇంతలో చటుక్కున ఏదో గుర్తుకు వచ్చిన వాడల్లే రామనాధం గబగబ ఇంట్లోకి వెళ్ళి - తన ఊరు నుండి వస్తూ తెచ్చిన మూటను బయటకు తీసుకొచ్చాడు.

మూట మూతికి బిగించి కట్టిన పురికొస విప్పాడు. మూటలోకి అరచేతులు జొనిపి - మూటలో వున్న నల్లమట్టిని దోసిట్లోకి తీసుకొన్నాడు.

బ్రహ్మయ్యకు దోసిలి చూపించాడు. రామనాధం వెడల్పాటి అరచేతులతో పొడవాటి వేళ్ళతో విప్పారిన దోసిట్లో నల్లమట్టి నల్ల బంగారపు పొడిలా వుంది.

రామనాధానికి ఉద్వేగం, ఆవేశం, వారందరినీ మెప్పించాలన్న ఆరాటం ముప్పిరిగొనగా అన్నాడు,"చూసారా మామయ్య-ఎట్లాంటి మట్టో?మన చెర్లో మట్టి ఇట్లా వుంటుందా? మామయ్యా అది నడిగడ్డ కాదు. నీరందిన మరుక్షణం గనిగడ్డ !అవును మామయ్య గనిగడ్డ! "

బ్రహ్మయ్య ఆ మెత్తటి చిక్కని నల్లటి మట్టిని చేత్తో పట్టుకు చూసాడు. ఆయన తమ్ముళ్ళిద్దరూ చెరి కాస్త మట్టి తీసుకొని అరచేతిలో వేసుకొని పరీక్ష చేసారు.

రామనాధానికి వాళ్ళ ముఖాల్లో కదలాడిన భావాలతో ఎక్కడలేని ఆత్మ విశ్వాసం వచ్చేసింది. కళ్ళు తళతళలాడు తుండగా బ్రహ్మయ్యతో అన్నాడు, " అయినా ఇన్నెందుకు మావయ్యా ... మన కృష్ణకు ఎగువకేగా నే వెళ్తూంట !"

"ఏటికి ఎదురుళ్తాననే వాడిని ఏవంటాం ? కోరి కష్టాలు కొని తెచ్చుకునే వాడికి ఏం చెపుతాం ? "

బ్రహ్మయ్య ముక్తాయించి పొలం బేరం కుదిర్చిపెట్టడానికి, షావుకారు దగ్గరకి తీసుకెళతానన్నాడు.

"ఉలిపికట్టెకి ఏం చెపుతాం ? "

" ఆడి కుందేలుకి మూడే కాళ్ళు !""

మిగిలిన ఇద్దరు మేనమావలు తామేమి , వొప్పించలేక పోయామన్న నిస్సహాయంతో పున్నమ్మతో ఆ మాటలునేసి వెళ్ళిపోయారు.

రామనాధం దోసిట్లో మట్టి తీసుకొని తిన్నగా చావిడి దగ్గరకు వెళ్ళాడు.

రత్తయ్య మంచం కోడు మీద తలానించుకొని పడుకొని - దీర్ఘంగా చావిడి దూలం కేసి చూస్తూ - ఏదో ఆలోచిస్తున్నాడు

రామనాధం నెమ్మదిగా మంచం తలవైపు కెళ్ళి నిలబడ్డాడు. నిదానంగా స్పష్టంగా తన నిర్ణయం చెప్పేసాడు.

"అన్నయ్యా ... నిన్ను బాధ పెట్టాలని కాదు. ఒక్కసారి నువ్వా భూమిని చూసావా - వదిలి వస్తానంటే వొట్టు ! రేపు దమయంతి వంతు రెండెకరాలు బేరానికి పెడుతున్నా ! అక్కడ అప్పుడే పొలం పన్లు మొదలయ్యాయి. ఆలస్యమైతే మనకే ఈ దుక్కి నష్టం. చేసేపని అదును తప్పి నాటిన విత్తనం కాకూడదుగా ... అన్నాయ్ !" అంటూ - రామనాధం మంచం కోడు పక్కగా దోసిట్లోని మట్టిని పోసాడు. రత్తయ్య ఏం మాట్లాడలేదు.

రామనాధం సమాధానం కోసం కాసేపు చూసి - ఏమీ రాకపోవడంతో వడివడిగా మామిడి చెట్టు వైపు వెళ్ళి పోయాడు.

రత్తయ్య రామనాధం కనుమరుగయ్యేంత వరకూ కదలకుండా పడుకొన్నాడు. రామనాధం తాటితోపు మలుపు తిరగగానే, రత్తయ్య కనుచివరల నుండి మంచంకోడు దగ్గర రామనాధం ఏం పెట్టాడో చూసాడు.

మట్టి, నల్లమట్టి

రత్తయ్య మెల్లిగా లేచి, వంగి మట్టిని తాకి చూసాడు. అరచేతిలో వేసుకొని పరీక్షగా చూసాడు ఈ అరచేతిలోంచి ఆ అరచేతిలోకి మార్చుకొని చూసాడు.

ఇంతలో, పాలుపిండడానికి శాంతమ్మ తపేలాలు తీసుకురావడంతో రత్తయ్య ఏమీ ఎరగనట్లు మట్టిని కింద పడేసాడు - పై పంచ విదుల్చుకొని, తలకు చుట్టుకొని దూడలను విప్పడానికి వెళ్ళాడు

ఆ తరువాతి వారమంతా రామనాధానికి ఏదో పని హడావుడి సరిపోయింది. పెద్ద మేనమామ బ్రహ్మయ్య పొలాన్ని బేరానికి కుదిర్చిపెట్టాడు. షావుకారు ముప్పావలా వడ్డీ లెక్కన డబ్బు అందిస్తానన్నాడు.

ఆ తరువాత, రామనాధం ఫలాన రోజున బయలుదేరుతున్నట్లు రిజిస్ట్రేషన్ పెట్టుకోమన్నట్లు - నరసింహంకి టెలిగ్రాం ఇచ్చాడు. దానితో పాటే చలపతికి ఉత్తరం రాసాడు - వుండడానికి ఓ యిల్లుంటే చూడమనీ - కనీసం ఒక్కగదైనా చాలుననీ.

ఆ తరువాత బడికి వెళ్ళి మాష్టార్లతో పిల్లల చదువు గురించి మాట్లాడాడు - కమిటీ మీటింగ్ పెట్టించి, తమ కుటుంబం తరుపు ఉద్యోగానికి రత్తయ్య చిన్నల్లుడు - సరళ భర్తకి టీచర్ పోస్టు ఇప్పించాడు. ఇక చలపతిని కలవాల్సి వుంది.

ఈలోగా ఆడవాళ్ళందరూ అంతకన్నా హడావుడిగా వున్నారు.

దాదాపు బంధువులంతా వచ్చారు. కొందరు వచ్చి పలకరించి వెళ్ళిపోతే - కొందర్ని పనిసాయంగా వుంటారని పున్నమ్మ ఆపింది. ఇంకొందరు రామనాధం వాళ్ళను సాగనంపాకే వెళ్దాం లెమ్మని వుండి పోయారు. వాళ్ళంతా వస్తూ వస్తూ తమ పొలాలలో పండిన ఏ మినుములో ఏ కందులో తీసుకొని వచ్చారు.

ఇరుగు పొరుగు చుట్టాలు పక్కాలు అమ్మలక్కలు - అందరూ ఏ మినుముల్ని పప్పుగా విసురుతూనో, ఏ ధాన్యం బాగు చేస్తూనో, ఏ పిండి దంచుతూనో, ఏ రవ్వ విసురుతూనో అక్కడే వుండిపోయారు.

సున్నిపిండి విసురుకున్నారు. పిండివంటలు చేసుకొన్నారు కారాలు పొడులు దంచుకున్నారు. చేసుకున్న వాటినన్నంటిని కొన్ని మూటల్లోనూ, కొన్ని సీసాల్లోనూ, ఇంకొన్ని డబ్బాల్లోనూ సర్దుకున్నారు

ఇంత హడావుడిలోనూ రత్తయ్య ఉలుకూపలుకూ లేకుండా తిండి తిప్పలు లేకుండా చావిట్లోనే పడివున్నాడు. శివుడే పాడి విషయం చూసాడు. పొలం రిజిస్ట్రేషన్ రోజున రత్తయ్య జబ్బున పడ్డ మనిషిలా వేళ్ళాడపడిపోయాడు. పరధ్యానంగా తనలో తాను కుమిలిపోయాడు. పున్నమ్మ బతిమిలాడి బామాడి ఇంత ముద్ద కతికిస్తోంది

రామనాథం చలపతి దగ్గరకి వెళ్ళాడు.

చలపతి ఇంట్లోనూ ఇదే సందడి.

ఇద్దరూ నడుచుకుంటూ మాట్లాడుకుంటూ కాలువ మీది వంతెన దాకా వెళ్ళారు

రామనాథం కిందకు వంగి గులకరాళ్ళు తీసుకున్నాడు. ఒక్కో రాయిని నీళ్ళల్లోకి వేస్తూ, రాయిచుట్టూ వేగంగా విస్తరిస్తోన్న నీటి వలయాలను చూస్తూ అన్నాడు, "అదేంటో చలపతీ - నువ్వు అమెరికా వెళుతున్నా వన్న బెంగ కన్నా నేను వ్యవసాయం చేస్తాననడమే అందరికీ బెంగగా వుంది. నిజానికి బాధగా కూడా వుందనుకో. ఇంతకీ - నేనేమైనా చేయకూడని పని చేయబోతున్నానా ? " కొద్ది రోజులుగా రామనాథం అనుభవిస్తోన్న మానసిక వొత్తిడంతా ఆ మాటల్లో ధ్వనించింది.

"నేనైతే ఊహించలేక పోయాను .... నువ్వసలు వ్యవసాయం ఎలాచేస్తావ్ ? " చలపతి ఆశ్చర్యంగా అడిగాడు.

రామనాథం చిన్నగా నవ్వి- తలెత్తి చలపతివైపు చూసాడు. నవ్వుతూనే అన్నాడు -

"కల్ల కసటు లేని పల్లెలో నాగలి
దున్ను వారు నన్ను కన్నవారు
మడికి నొక్కపూట బడి కొక్క పూటగా
దాటినాడ చిన్నతనము నేను - "[1]

చలపతి మనసారా నవ్వాడు, "నిజం ! నువ్వో కళాకారుడివి కావాల్సిన వాడివి ! '

"చలపతీ .. ... వ్యవసాయాన్ని మించిన కళేం వుంది ? వ్యవసాయదారుడిని మించిన కళాకారుడెవ్వరు ? పొలం కాగితంపై నాగలి కుంచెతో గీసే అద్భుత చిత్రాలు పచ్చని చేలు.

---

1 శ్రీ తుమ్మల సీతారామమూర్తి

మట్టిని మాణిక్యంగా మలచకలిగే పరుస వేదిని ఎరిగిన స్వర్ణకారుడు . ఎద్దు మువ్వల నేపథ్యంలో అలుపు తీర్చుకోను ఆశువుగా పాడుకొనే పాటలతో సంగీతకారులకే సంగీతకారుడు . ప్రకృతి మాత గీచిన అపురూప చిత్రంలో ఆమె మురిపెంగా దిద్దుకున్న ముద్ద బిడ్డడు . వ్యవసాయదారుడు ''

రామనాథం హృదయపు లోతుల్లోంచి వ్యవసాయదారుడిపై వున్న అంతులేని ఆప్యాయాన్ని ప్రతి ధ్వనిస్తూ అన్నాడు.

రైతు కుటుంబాల్లోని అంతరాంతరాల్లోని ఆత్మీయత చలపతి గుండెల్నీ ఆవరించగా - ఆప్యాయంగా రామనాథం వెన్ను నిమిరాడు.

''అంతెందుకు చలపతీ - రేపు నువ్వు అమెరికాలో ఏ తెల్లదొరకో శస్త్ర చికిత్స చేసేప్పుడు - నీ చేతి కత్తిగీటు - మీ నాన్న పొలంలో నాగలితో గీచిన నాగేటి చాలు అంత నైపుణ్యంగానూ అంత అందంగానూ రాకపోతే చూడు ! '' రామనాథం చలపతి భుజం చరిచాడు

''మొత్తానికి అసాధ్యుడివి ! '' చలపతి ఫక్కుమన్నాడు

''ఏవైనా ఈ కాలువ గట్టునీ, మామిడి చెట్టునీ - తాటితోపునీ ఈ చుట్టాలనీ పక్కాలనీ - ఈయిళ్ళూ వాకిళ్ళనీ - అన్నిటినీ అందరినీ . వదిలి వెళ్ళాలంటే - చాలా దిగులుగా - ఏదో వెలితిగా . వుంది '' రామనాథం ఒక్కోమాట పట్టిపట్టి నెమ్మదిగా బరువుగా అన్నాడు.

''అయితే, మరేవుంది ? హనుమంతుడు సంజీవిని పర్వతాన్ని మోసుకెళ్ళినట్లు నువ్వు ఈ ఊరిని అమాంతం మోసుకెళ్ళు ! '' చలపతి రామనాధాన్ని ఆటలు పట్టిస్తున్నట్లుగా అన్నాడు.

''నీకన్నీ వేళాకోళాలే ! ''

''నాకు మాత్రం వంతెన్ని అలాగే మోసుకుపోవాలని వుంది ! ''

''విమానం మీదే ? ''

''ఊ ! '' చలపతి భారంగా అన్నాడు, ''నువ్వు ఒక వూర్నించి మరో వూరికి వెళ్తున్నావ్ - అంతేగా ? నేను ఒక దేశం నుంచి ఇంకో దేశానికి వెళుతున్నా ! '' చలపతి నిట్టూర్చాడు ఆ నిట్టూర్పులోనూ రామనాథం వ్యక్తపరచిన బెంగే వుంది

చాలాసేపు ఒకరినొకరు పలకరించుకోకుండా మౌనంగా రామనాథం నీళ్ళల్లోకి విసురుతోన్న రాయి చుట్టూ పుట్టుకొస్తోన్న వలయాలను చూస్తూ కూర్చున్నారు

రాయి కేంద్రంగా పుడుతోన్న ఆ వలయాలు అంత కంతకూ దూరమై ఒక్కో ఒడ్డును చేరుతున్నాయి

ఇద్దరూ ఒక్కసారిగా ముఖాల్లోకి తేరిపార జూసుకుని - ఫక్కు మన్నారు

ఆ మర్నాడు ఉదయం గుంటూరు వెళ్ళే బస్సు డ్రైవర్ - ఆ వూరు వూరంతా బస్‌స్టాండ్ వద్ద కనిపించడంతో తత్తరపోయాడు. బస్సులో అంతమందినీ ఎలా ఎక్కించుకోవాలో అర్ధంకాక, బస్సును బస్‌స్టాండ్‌కి ఆమడ దూరం తీసుకెళ్ళి ఆపాడు

పిక్కబలం కలవారు పరిగెత్తు కెళ్ళి డ్రైవర్‌కు పరిస్థితి వివరించారు.

రామనాథం, సావిత్రి బస్సెక్కగానే, బస్సు కదలిపోయింది.

కన్నవారి కళ్ళనీళ్ళు చీర కొంగుల్లోకి పై పంచల్లోకి ఇంకిపోయాయి. ఊరి వారి నిట్టూర్పులు బస్సు పొగలో కలసిపోయాయి.

రత్తయ్య మూట కట్టి ఇచ్చిన విత్తనాల వడ్లతో - సీమచింత, నారింజ, ఉసిరి విత్తనాలతో - పున్నమ్మ ఇచ్చిన గుమ్మడి, సొర,బీర, కాకర విత్తనాలతో - శాంతమ్మ ఇచ్చిన పందిరి చిక్కుళ్ళు, గోరు చిక్కుళ్ళు, పెరుగుతోటకూర, రాంములగ, మునగ విత్తనాలతో - అనూరాధ తెచ్చిచ్చిన ఎండిన సీతమ్మ వారి జడబంతులతో - కల్యాణి తెచ్చిచ్చిన కనకాంబరం విత్తనాలతో - రామనాథం వాళ్ళు కదిలి వెళ్ళి పోయారు.

అనూరాధ పాటల పుస్తకంలో రామనాథం రాసిన లచ్చుమమ్మపాట మాత్రం మిగిలిపోయింది.

"మొగులు మెత్తనాయె
భూమి బుర బుర పొంగె
నల్లానీ రాగట్ల తెల్ల జొన్నా లేస్తే -
అరువై యూరు పుట్ల జొన్నలెల్లునురా -!"



# 3

అది  సంగమ సమయం.

అది సమన్వయం సాధించవలసిన సమయం.

ఒకే భాష ఒకే సంస్కృతి ఒకే చరిత్ర కలిగివున్న తెలుగు ప్రజలు - భిన్న పరిపాలనా వ్యవస్థల కింద శతాబ్దాల తరబడి విడివిడిగా జీవించి - 'విశాలాంధ్ర వచ్చువరకు విరామమే లేదు మనకు' అంటూ ఉద్యమించి అనేక అడ్డంకుల మధ్య అనేక సందేహాల మధ్య అనేక త్యాగాల తరువాత - ఏకమవుతోన్న సమయం

నైజాం నవాబు బ్రిటిష్ వారికి ధారదత్తం చేసిన తెలుగుగడ్డ బ్రిటిషిండియాలోని ఇతర ప్రాంతాలు అభివృద్ధి చెందినట్లే అభివృద్ధి చెందింది  ఆనకట్టలు నిర్మించబడ్డాయి  ఆర్థికంగా అధికమైంది. పాఠశాలలు, గ్రంథాలయాలు గ్రామస్థాయిలో అనివార్యమైనాయి. రాజకీయంగా చైతన్యవంతమైంది. సాంఘికంగా బలపడింది. సారస్వతం వెల్లివిరిసింది  సాంస్కృతికంగా పుంజుకుంది

ఇక, నైజాం కింద వున్న తెలుగు ప్రజల భాష సంస్కృతీ నిరంకుశ నైజాం ఉక్కు పాదాల కింద అణిచివేయబడ్డాయి. "తెలంగీ - బేడంగీ"[1] అంటూ వెక్కిరించబడిన చోట తెలుగువాడు తన ఉనికిని కాపాడుకునేందుకు చేసిన ప్రయత్నం - తన తేనెలొలుకు భాషను ప్రకటించుకొనే స్వేచ్ఛ కోసం చేసిన ప్రయత్నం - చైతన్య పోరాటమై నైజాంను గద్దె దింపింది

ఏ సార్వభౌముడు చేయలేని  పనిని - ఏ చతురంగ బలాలు సాధించ లేని పనిని - ఏక భాష చేసి చూపింది. ఏక సంస్కృతి చేసి  చూపింది · విశాలాంధ్ర ఆవిర్భవించింది తెలుగుతల్లి హృదయం పులకరించింది

అది, విభిన్న నేపథ్యాల మధ్య నలగిన అన్నదమ్ములు ఎన్నో ఏళ్ళ ఎడబాటు తరువాత ఆనందంగా ఏకమవుతోన్న సమయం.

"వచ్చిండన్నా వచ్చాడన్నా వరాల తెలుగు మనదేనన్న" అంటూ ఆప్యాయంగా ఒకరినొకరు  అదుముకోవలసిన సమయం.

అది సమన్వయం సాధించవలసిన సమయం.

అది సంగమ సమయం



---

1 తెలుగు తీరూ తెన్నూ లేని భాష

రామనాథం సావిత్రి తెల్లవారు ఝామునే కర్నూలు చేరారు

కర్నూలు బస్‌స్టాండ్‌లోని వెయిటింగ్ రూంలోనే సామాను పెట్టుకొని - ఉపాహార కార్యక్రమం పూర్తి చేసుకొన్నారు

గడియారం ఆసుపత్రి దగ్గర గద్వాల వెళ్ళే ప్రయివేట్ వ్యాన్ ఎక్కారు నల్లగా, డమడమలాడే మోటారుతో వున్న ఆ వ్యాన్ అచ్చం పోలీస్ వ్యాన్‌లా వుంది బారుగా అటూఇటూ రెండు సీట్లు తప్పితే మధ్యలో ఖాళీ, తలుపు వెనక వైపు బార్లా తీసి వుంది

రామనాథం వాళ్ళు ఎక్కినపుడు ఆ వ్యాన్ ఎంత ఖాళీగా వుందంటే - సావిత్రి చక్కగా తన సామానంతా ఆ రెండు సీట్ల మధ్యలో సర్దేసుకుంది

చూస్తుండగానే తట్టాబుట్టా పిల్లామేకలతో సహా చాలామంది -సావిత్రి సర్దుకున్న సామాను మీద చక్కగా సర్దుకు కూర్చున్నారు

వ్యాన్ డ్రైవర్ పాం - పాం - అంటూ ఒక్క హారన్ మోగించగానే - బీడీలు తాగడానికి వెళ్ళిన వాళ్ళు గప్పు గప్పు నవూదేసి - చివరి ముక్క విసిరేసి - గబుక్కున వ్యాన్‌లోనికి దూరారు. సావిత్రి సామాను మీద కూర్చున్న వారి మీదే వీరూ సర్దుకున్నారు

వ్యాన్ డ్రైవర్ వ్యాన్‌ను ఒక్క అడుగు గెంతించాడో లేదో - పరిగెత్తుకొంటూ వచ్చి కొందరు - తలుపులు బార్లా తీసి కాళ్ళు కిందికి వేలాడేసో - ఓకాలు వ్యాన్ తలుపులో - మరో కాలు గాలిలోవేసో - పైనున్నక్యారియర్ మీదకు ఎగబాకో - తమ ప్రయాణం మొదలెట్టారు

ఆ గందరగోళంలో అర నిమిషానికోసారి ఆగుతూ - కిందకు - పడుబోతున్న మనిషినో తట్టనో బుట్టనో మళ్ళీ పైకి లాగి - లోపలికి సర్దుకొంటూ - వ్యాన్ తుంగభద్ర వైపు కదిలింది

సావిత్రి వళ్ళో ఎవరో రెండు పిలకల అమ్మాయి సర్దుకుంది. సావిత్రి భుజాన ఓ ముసలమ్మ సర్దుకుంది

ఆ సందట్లో పడి - వ్యాన్ కూరగాయల మార్కెట్ మీదుగా - కొండారెడ్డి బురుజును దాటి - మున్సిపల్ పార్క్ దగ్గర మలుపు తిరిగి - ప్రకాశ్ నగర్ మీదుగా - తుంగభద్ర పక్కగా ప్రయాణించడం సావిత్రి గమనించలేదు.

సావిత్రి తన వళ్ళో కూర్చోన్న పిలకల పాప పిలకల మీదుగా మెడను అమాంతం వెనక్కి వంచి, కిటికీ లోంచి చూసేసరికి వ్యాన్ తుంగభద్ర వంతెన మీద వెళుతోంది.

తుంగభద్ర ఇసుక తిన్నెలపై వరుసలు వరుసలుగా అల్లుకుపోయిన ఖర్బుజ, పుచ్చకాయల పాదులు - వాటిని పలకరించి వయ్యారంగా వంపులు తిరిగి ముందుకు సాగుతోన్న తుంగభద్ర తళతళలు - సావిత్రి కళ్ళల్లో ఓ క్షణం నిలిచాయి. తుంగభద్రను దాటడంతోనే నడిగడ్డ స్వాగతం పలికింది.

రామనాథం, సావిత్రి వారి సామానుతో సహా గద్వాలవైపు వెళ్ళే ఎర్రవెల్లి చౌరస్తాకు ఆమడ దూరాన విసిరేయబడ్డారు.

అరగంటలో చేరవలసిన గమ్యాన్ని రెండు గంటలలో చేరారు. ఎక్కడ నుంచి చూసాడో కానీ దస్తగిరి గబగబవచ్చి వారిని పలకరించాడు. తుమ్మచెట్టు కింద ఆపివున్న సవారి బండి దగ్గరకు తీసుకెళ్ళాడు చక్కగా గడ్డివేసి గొంగడి పరిచివున్న బండిలో సామానుతో పాటు మనుషులు సర్దుకున్నారు.

రామనాథం, దస్తగిరి ఆ మాట ఈ మాట చెప్పుకుంటున్నారు.

మౌనంగా కూర్చున్న సావిత్రి - బండి కుదుపుల మధ్య కుదురుగా కూర్చోగలిగినపుడల్లా చూడగలిగింది ఒకటే - దారికి ఇరుపక్కలా దట్టంగా పెరిగివున్న ఫిరంగి తుమ్మలు - అవలగా కనపించినంత మేరా నల్లరేగడి - బండి చక్రాలు ఎద్దుల గిట్టలు రేపుతున్న దుమ్ము.

చూస్తూ వుండగానే వారి గమ్యం వచ్చేసింది

దస్తగిరి వారిని తన యింటికే తీసుకెళ్ళాడు.

సామాను బండిలోనే వుంచేసి అందరూ ఇంట్లోకి వెళ్ళారు

చిరచిరలాడే ఎండలో ప్రయాణం - బండి కుదుపులతో కదిలిపోయిన వళ్ళు - దుమ్ముతో నిండిపోయిన తల, వళ్ళు, కళ్ళు - సావిత్రికి వెంటనే స్నానం చేసి - హాయిగా నడుం వాల్చాలని వుంది.

దస్తగిరిది రెండు నిట్రాళ్ళ యిల్లు జమ్ముతో వేసిన కప్పు. చూరువాసాలు గుమ్మంలో కిందకంటా వున్నాయి

రామనాథం, సావిత్రి, గుమ్మంలో బాగా వంగి లోపలికి వెళ్ళాల్సి వచ్చింది. ఇంటి లోపలి భాగం మట్టిగోడలతో మూడు గదులుగా విభజించి వుంది. మధ్యగదిలోకి వెళ్ళి కూర్చున్నారు.

"కాలు మొగం కడుక్కోని - భోజనం జేస్తురు" - అంటూ దస్తగిరి రామనాథాన్ని బయటకు తీసుకెళ్ళాడు

వెళుతూ వెళుతూ, వెనక్కి తిరిగి లోపలికెళ్ళి - భార్యతో కాబోలు గుస గుసలాడి వెళ్ళాడు. ఏం చెప్పాడో వినిపించలేదు కానీ చివరగా అన్నమాట కాస్త గట్టిగానే అన్నాడు, " ఊకే కిరి కిరి[1] బెట్టకు ! "

సావిత్రికి ఏదో అసహజంగా తోచింది.

చాలాసేపటి వరకూ సావిత్రిని పలకరించడానికి ఎవరూ రాలేదు. స్నానాలగది ఎక్కడో వెతుక్కుంటూ వెళదామని - లోపల్నించి తోసుకోస్తోన్న కోరికను సావిత్రి బలవంతాన అణుచుకుంది. చుట్టూ చూస్తూ కూర్చుంది.

ఓ పిచ్చుక దూలంపై గూడు కట్టుకొని వుంది. అప్పుడే ఆహారం తెచ్చింది కాబోలు - కువ కువ మంటూ పిల్లపిచ్చుకల నోటికి అందిస్తోంది అవి తమ లేత రెక్కలను అటూ ఇటూ

1 గొడవ

కదిలించడానికి ప్రయత్నిస్తూ నోరంతా తెరిచి తల్లిని ఆహారం అందించమని తొందర పెడుతున్నాయి వాటి సందడితో గూడు చివరి పుల్లలు పుటుకు పుటుకు కిందపడుతూన్నాయి.

ఇక మొహమాటం వదులుకొని ఇంట్లో వున్న ఆడ మనిషిని పలకరిద్దామని సావిత్రి నిశ్చయించుకున్న సమయంలో దస్తగిరి భార్య బయటకు వచ్చింది

సావిత్రి పలకరింపుగా నవ్వింది. ఆమె కూడా నవ్వి, సావిత్రిని పరామర్శించింది

"కాలు మొగం కడుక్కుంటరా ? " అంటూ ప్రశ్నించింది.

సావిత్రికి ప్రాణం లేచొచ్చింది. అవునన్నట్లు గబగబ తలాడించింది.

ఆ రోజు మొట్ట మొదటిసారిగా జొన్నరొట్టెలు రుచి చూసింది ఉల్లిపాయపప్పు, చింతకాయతొక్కు, నూనొంకాయ - చాలా భిన్నమైన రుచులు, తానెరిగిన గుత్తొంకాయ కూరకూ నూనొంకాయ కూరకూ ఎంత తేడా ! పూర్తిగా భిన్నమైన రుచి.

ఆ కొన్న కూడు అమృతం అనేకాక, సావిత్రికి ఆ వంటకాలు నిజంగానే నచ్చాయి

ముఖ్యంగా చిన్న పిండి ముద్దను రొట్టెల రాయి మీద దస్తగిరి భార్య అరచేతులతో తడుతుండగా పలుచని రొట్టె తయారవడం చాలా అద్భుతంగా అనిపించింది జొన్నరొట్టెలు చేయడం ఎలాగైనా నేర్చుకోవాలని ఆ క్షణానే నిశ్చయించుకుంది దస్తగిరి భార్యతో ఆ విషయమే చెప్పింది.

"జొన్న రొట్టెలు చేయడం ఎలాగో నాకు నేర్పించాలండీ - "

ఆడవారు కొత్తవంటకం నేర్చుకోవాలంటే ఎలాంటి కుతూహలం చూపిస్తారో సరిగ్గా అలాంటి కుతూహలంతోనే సావిత్రి అడిగింది.

కానీ, ఖచ్చితంగా అక్కడే దస్తగిరి భార్యకు సావిత్రి నచ్చడం మానేసింది సావిత్రి తనను అవమానిస్తుందేమోనన్న అనుమానం ఆమెలో మొదలయి పెనుభూతమై కూర్చుంది.

'ఈడ రొట్టెల దుక్నం[1] పెట్టుకొని ఎవ్వడూ కూసోలేదు !' దస్తగిరి భార్య తనలో తను గొణుక్కుంది.

దస్తగిరి రామనాథం వాళ్ళని ఇకపై వుండాల్సిన చోటుకి తీసుకెళ్ళాడు.

అది దస్తగిరి చావిడి. సరిగ్గా దస్తగిరి ఇంటికి కుడిపక్కగా వున్న రెండు నిట్రాళ్ళ జమ్ము పరిచిన చావిడి.

దస్తగిరి చావిడిలో ఓ పక్కన నాలుగువైపులా మట్టిగోడలు కట్టించి, తడికల తలుపు పెట్టించి ఓ గది తయారు చేసివుంచాడు.

దస్తగిరి ఉండేచోటు నిజానికి ఆయకట్టు పనులు చేయించడానికి వచ్చినవారు తాత్కాలికంగా వేసుకున్న ఓ క్యాంప్. అన్నీ చిన్న చిన్న పూరిళ్ళు, పాకలు. మరొక కాపురానికి తమ యిళ్ళల్లో చోటిచ్చేంత అవకాశం వారికి లేదు.

---

1 దుకాణం, అంగడి

సరిగ్గా చావిడికి ఆ చివరన దస్తగిరి వద్ద పనిచేసే జీతగాళ్ళు కాపురం వుంటున్నారు.

వారికి, రామనాధం వాళ్ళు వుండాల్సిన చోటుకు మధ్యన రెండు గేదెలు, వాటి దూడలు, ఒక ఎద్దుల జత - ఓ కోడిగంప - కోడి - పుంజు వాటి పిల్లలు - రెండు మేకలు.

చావిడికి వెనకగా నాలుగు గుంజలు పాతి, చుట్టూ గోనెపట్టాలు బిగించి కట్టి వున్నాయి ఆకాశమే కప్పు అది స్నానాల గది

వీళ్ళు వెళ్ళేసరికి వాళ్ళసామాను వాళ్ళకు ఉద్దేశించిన గదిలో పెట్టి వుంది. సావిత్రి ఆ ఒక్కగదిలోనూ సామానంతా ఎలా సర్దుకోవాలో తెలీక తడబడిపోతూ గుమ్మంలో నిల్చుంది రామనాధం లోపలికి వెళ్ళి - తనకు కావలసిన, కాగితాలు సరి చూసుకుంటున్నాడు.

ఇంతలో, దస్తగిరి తన ఇంట్లో నుంచి ఓ నులకమంచం తెచ్చి గోడవారగా ఆనించాడు.

సావిత్రి అతను రాగానే పక్కకి జరిగి, రామనాధం బయటకు రావడానికి దారిచ్చింది తమయింటి గుమ్మంలో నిలబడి దస్తగిరిని కొరకొర చూస్తోన్న దస్తగిరి భార్యను సావిత్రి గమనించలేదు

రామనాధం పైకం, కాగితాలు తీసుకొని, దస్తగిరితోపాటు వెళ్ళాడు.

సావిత్రి దస్తగిరి తెచ్చిచ్చిన నులక మంచం లోపలికి తెచ్చింది. దానిని గోడ దగ్గరగా వాల్చింది. తనతో తెచ్చుకున్న సామానంతా మంచం కిందకు సర్దేసింది. ఓ మూల ట్రంక్ పెట్టె పెట్టింది ట్రంకు పెట్టెమీద రామనాధం పుస్తకాల సంచి.

పొయ్యి ఎక్కడ పెట్టాలో నిర్ణయించుకుంది ఆమూల నుంచి ఈ మూలకు బట్టలు వేసుకొను దండెం కట్టుకోవాలనుకొంది. మొదట పొయ్యి అమర్చుకోవాలి. పొయ్యికి రాళ్ళేరుకు రావాలి.

సావిత్రి బయటకు వచ్చి అటూ ఇటూ చూసింది.

వంటి మీద చిన్నలంగా తప్ప మరేం లేని ఓ ఐదేళ్ళ పాప కనిపించింది. ఆ పాప ఓ చిన్న పుల్ల తీసుకొని నేలపై గుంటలు చేస్తూ వుంది ఆమె పక్కనే ఓ మూడేళ్ళ పిల్లాడు. వాడి వంటిన ఆ మాత్రం ఆచ్ఛాదనాలేదు.

సావిత్రి అప్పటికే తనవారిని తన వూరిని వదిలి వచ్చి ముప్పైయ్యారు గంటలయ్యింది.

సావిత్రికి ఎవరితోనైనా మాట్లాడాలని బలంగా అనిపిస్తోంది. ఆడుకుంటోన్న పిల్లల్ని దగ్గరగా పిలిచింది. వాళ్ళు తలెత్తి సావిత్రిని చూసి - అదే పరుగు పెట్టి పారిపోయారు.

సావిత్రికి వంటకు కావాల్సిన పుల్లల దగ్గరి నుంచి ఎన్నో అవసరాలున్నాయి. దస్తగిరి భార్య పదిసార్లు తలుపు తడితే పదకొండోసారి తలుపు తీసింది.

"ఏవండి-కొన్ని సరుకులు అవీ కొనుక్కోవాలి. తెప్పించుకోవడానికివీలవుతుందాండీ?' సావిత్రి నెమ్మదిగా మాట మాటలో మర్యాద వుట్టి పడుతుండగా అడిగింది.

దస్తగిరి భార్యక్కు చర్రున కోపం వచ్చింది. ఆమెకు సావిత్రి ఏం మాట్లాడుతున్నా నయగారాలు పోతున్నట్లుగా వుంది. కసురుకున్నట్లుగా కరుకుగా అంది -

"ఏం గావాలె ? ఈ వూర్ల దుక్నం[1] లేదు. ఆదారం[2] బొంకూరు సంతపెడ్తరు. పోయి కొనుక్కోని "

సావిత్రికి సదురు బొంకూరు ఎక్కడో ఎలావెళ్ళాలో అక్కడ ఏమేం దొరుకుతాయో అన్నీ తెలుసుకోవాలని వుంది. దస్తగిరి భార్య ధోరణి గమనించి అడగాలనుకొన్నవి అడగకుండానే విరమించుకుంది.

సావిత్రి అదృష్టానికి ఆరోజు శుక్రవారం. ఇంకా రెండ్రోజులు ఆగాలి. దస్తగిరి భార్యకు తనంటే ఎందుకనో అయిష్టంగా వుందని సావిత్రి గ్రహించింది. ఇంక ఆమెతో సంభాషణ పొడిగించలేక తన యింట్లోకి వెళ్ళిపోయింది.

ట్రంకుపెట్టె తెరిచి, ఊర్నించి తెచ్చుకున్న బాండీ - తపేలాలు బయటకు తీసింది. ఉప్పులు, పప్పులు మూటలు విప్పింది. దస్తగిరి చావిడి వెనుక తుమ్మ చెట్లు - వాటి వెనుక పొలం, సావిత్రి చావిడి వెనుకగా వెళ్ళి పుల్లాపుడకా ఏరుకొచ్చింది.

మూడురాళ్ళు తెచ్చుకుని పొయ్యి పెట్టింది.

దస్తగిరి గారి దడిమీద దొండ తీగ పాకించి వుంది. నాలుక్కాయలు అడుగ దామనుకొని విరమించుకుంది. ఆ పూటకి అన్నం - ముద్దపప్పు చేసింది. పచ్చళ్ళు - పొడులు ఎలానూ వున్నాయి. కందిపప్పు వుడుకుతోన్న కమ్మని వాసన కొత్తగడ్డ మీద సావిత్రి గృహిణి బాధ్యతలు స్వీకరించిన సంగతిని నలువైపులా మోసుకు వెళ్ళింది.

సావిత్రి పనులు పూర్తయ్యేసరికి దస్తగిరి గారి జీతగాడు నాగలేసుకుని ఎద్దుల్ని తోలుకు వచ్చాడు. ఎద్దులకి కుడితి నీళ్ళు పట్టి - తీసుకొచ్చి చావిడి మధ్యలో గుంజకు కట్టేసాడు పగలంతా బాగా అలిసిపోయాయేమో అవి పేడనూ గడ్డినీ ఏకం చేసి హాయిగా సర్దుకొని పడుకొన్నాయి.

ఇంతలో జీతగాడి పెళ్ళాం వస్తూ వస్తూ పిల్లల్ని వెతికి పట్టుకొని మరీ వచ్చింది ఆ వేగంతోనే వాళ్ళను లాక్కెళ్ళి గాబు దగ్గర నిలేసింది. ఇద్దరి మీద నీళ్ళు గుమ్మరించింది. మట్టి పెళ్ళనే సబ్బులాగా పిల్లలళ్ళంతా గబగబ రుద్దింది. కడవతో నీళ్ళు వాళ్లపై గుమ్మరించింది. గోళ్ళతో గిరిగిరి స్నానం చేయించింది. కుండపెంకు తిరగేసి కాళ్ళూ చేతులు రుద్దింది.

సావిత్రికి ఆశ్చర్యంతో కళ్ళు పెద్దవయ్యాయి.

"ముల్లును ముల్లుతో తీయొచ్చు కానీ మట్టిని మట్టితో శుభ్రం చేయొచ్చా ? " సావిత్రి తనలో మెదిలిన సందేహాన్ని అప్రయత్నంగా పైకే అనేసింది.

---

1. దుకాణం 2. ఆదివారం

పిల్లల్ని గిరడం ఆపి - జితగాడి పెళ్ళాం తలెత్తి నవ్వి, అంది ``ఎట్ల మట్టి ! ఏసి రుద్దిన మంచే నిగనిగలాడ్తరు !

ఆమె కంఠంలో అంతగా అనుమానమైతే వాడి చూసుకో అన్న సవాలు ధ్వనించింది

ఆ తరువాత సావిత్రి కుండపెంకుతో కాళ్ళు రుద్దుకోవడానికి ప్రయత్నించింది కానీ - మట్టితో వళ్ళు రుద్దుకొనే సాహసం మాత్రం చేయలేకపోయింది

సావిత్రిది బక్క పలుచపుటక వాళ్ళవూరి నేతచీరలో ఒద్దికగా పొందికగా వుంటుంది

మేనత్త పున్నమ్మ వాళ్ళది పెద్ద ఆవరణ కావడంతో చుట్టాలపక్కాల పిల్లలందరూ అక్కడే ఆడుతూ పాడుతూ పెరిగారు తాటితోపులలో నారింజ చెట్ల మీదా పొగడ చెట్టు కింద ఆడుకొనేవారు గుజ్జన గూళ్ళు కట్టుకొనేవారు కోతికొమ్మచ్చులు, దాగుడుమూతలు ఆడేవాళ్ళు, గచ్చకాయలు సంపాదించి అచ్చంగాయలు ఆడుకొనేవారు సీమచింతగింజలతో చింతపిక్కలతో వామనగుంటలు ఆడేవారు మగపిల్లలు బిళ్ళంగోడు ఆడుతోంటే ఆడపిల్లలు తొక్కుడు బిళ్ళలు ఆడేవారు దమయంతి, సావిత్రి ఒకే ఈడువాళ్ళు ఒకేబడి ఒకే తరగతి ఒకే జట్టు చిన్నప్పట్నించి అనుకున్న మేనరికం రామనాధం సావిత్రిలది

దమయంతి అస్తమానం సావిత్రిని ఆటలు పట్టిస్తూ ఉండేది పలకరించడమే ``వదినా వదినా వంకాయ్ '' అంటూనే పలకరించేది ``వాసి గలవారండి మా వదినగారు వండబోయిన చోటకుండ నాకేరు'' అంటూ వేళాకోళాలాడేది

బడిలో ఆటల్లో దమయంతి చురుకైతే - పాటలు పాడడం సావిత్రికి ఇష్టం రామనాధం వ్యాసరచన, వకృత్వంలో పాల్గొనేవాడు బడి వార్షికోత్సవాల్లో ముగ్గురికి బహుమతులందేవి

హైస్కూలు పూర్తవ్వగానే దమయంతి పెళ్ళయింది బొబ్బర్లంకలో ఇచ్చారు. ఆ తరువాత మూడు నెలలకే రామనాధం, సావిత్రిల పెళ్ళి, సావిత్రికి సుధాకర్ పుట్టిన తరువాత దమయంతికి అనూరాధ పుట్టింది. అనూరాధ ఏడాది పిల్లపుడు దమయంతి, ఆమె భర్తా ఇద్దరూ కృష్ణ[1] పాలయ్యారు. అప్పట్నించీ సావిత్రి అనూరాధను సొంత బిడ్డలా చూసుకుంటోంది.

నిజానికి, ఆ కుటుంబంలో తన బిడ్డ పరాయిబిడ్డ అని లేదు పెద్దలు,పిల్లలు అంతే. సావిత్రికి తన కూతురు కల్యాణిని వదిలి వచ్చిన బాధ ఎంత వుందో అనూరాధను వదిలేసి వచ్చిన బాధా అంతే వుంది. పైగా, తన పిల్లలకు తనులేని లోటు వుంటుందేమోనన్న ఆలోచన కూడా రాలేదు.

సావిత్రికి తమ యింటి ఆవరణ, విశాలమైన లోగిలి, ముగ్గులతో కళకళలాడే ముంగిలి, తాటితోపు, పిల్లలు, పున్నమ్మ - శాంతమ్మ - అందరూ పదే పదే జ్ఞాపకం వస్తున్నారు ఆమె పుట్టి బుద్దెరిగి ఒంటరిగా వున్నది లేదు. ఒక పెద్ద కుటుంబంలో పుట్టి మరో పెద్ద కుటుంబంలో మెట్టింది. పనిపాటలు, కబుర్లు కాలక్షేపాలు, వేళాకోళాలు, ఆటలు

1 కృష్ణా నది

పట్టించుకోవడాలు, చతుర్లు విసురుకోవడాలు - నవ్వులు కేరింతలు, పిల్లల చిలిపి పనులు, తగువులు పోట్లాటలు, పిల్లచేష్టల మధ్య సమయమే తెలిసేది కాదు.

ఇక్కడ వంటరిగా మాట్లాడేవాళ్ళు లేనట్లుగా నోరుకుట్టేసుకుని వుండడం ఆమెకు దుస్సహంగా వుంది. ఒడ్డున పడ్డ చేపలా గిలగిల లాడిపోతోంది.

రామనాథం వచ్చేవరకూ ఆమె విన్నా వినకపోయినా ఆ మాటా ఈ మాటా చెపుతూ జీతగాడి పెళ్ళాంతో కబుర్లాడింది. దస్తగిరి భార్య అటు వైపు తొంగి చూడలేదు.



భోజనం చేసి బయటకు వెళ్ళిన రామనాథం, దస్తగిరి తిన్నగా బాలయ్య వాళ్ళింటికి వెళ్ళారు

బాలయ్య వాళ్ళవూరు అక్కడికి రెండుమైళ్ళు. పొలాలకి అడ్డం పడి వెళ్ళేసరికి, నరసింహం ఎప్పుడో వచ్చి, వారికోసం ఎదురు చూస్తున్నాడని తెలిసింది. అందరూ కలిసి నరసింహం ఇంటికి వెళ్ళారు.

రామనాథం నరసింహం ఇంటివద్దనే డబ్బు చెల్లించాడు నరసింహం జీపులో ఎక్కి అందరూ రిజిస్ట్రార్ ఆఫీస్‌కి వెళ్ళారు. రాతకోతలు ముగించుకొని సాయంత్రం ఆఫీసు మూసేలోగా రిజిస్ట్రేషన్ కార్యక్రమం పూర్తి చేసుకున్నారు.

రామనాథం చేనుని అనూరాధ పేరున సగం - ఉమ్మడిన సగం వ్రాయించాడు.

బాలయ్య రామనాథం తరుపు సాక్షిగా వున్నాడు.

దొరను చూసిన క్షణంలోనే దస్తగిరి ఎటో తప్పించుకుపోయాడు. సంతకాలు పెట్టేసి నిర్విచారంగా జీపెక్కి కూర్చున్న నరసింహాన్ని చూసి రామనాథానికి చాలా ఆశ్చర్యమేసింది

ఇంక ఆ వూరితో అతనికి బంధం తెగిపోయిందన్న బాధ దిగులు అతనిలో ఏ కోశాన లేవు. పై నుంచి, ఏదో మోయలేని భారాన్ని వదిలించుకొని తేలిక పడినట్లుగా అతను చాలా హుషారుగా వున్నాడు. వూరికూరికినే మీసాలు సవరించుకొంటూ గలగలమంటూ ఏదో మాట్లాడుతూనే వున్నాడు.

రామనాథం కళ్ళముందు అతని అన్న రత్తయ్య మెదిలాడు. చేను అమ్మవలసి వచ్చినపుడు ఎలా గిలగిలలాడిపోయాడో తలుచుకున్నాడు. ఏనాడూ చిర్రున చీది ఎరుగని మనిషి వెయ్యి లంఖణాలు చేసినవాడికి మల్లే ఎలా కృశించాడో - జ్ఞాపకం తెచ్చుకున్నాడు

నరసింహం చేను అమ్మడానికి రత్తయ్య చేను అమ్మడానికి మధ్య వ్యత్యాసం రామనాథానికి చాలా స్పష్టంగా కనిపిస్తోంది

నరసింహానికి చేను ఒక ఆస్తి - రత్తయ్యకు చేను తన ప్రాణం

ఆ క్షణంలోనే రామనాథం ఒక నిశ్చయానికి వచ్చాడు

"ఏనాడైతే మట్టిపై వుండాల్సిన రైతు కాళ్ళు గట్టు పైకి లేస్తాయో ఆరోజు అతని పతనం మొదలవుతుంది

రైతుకు మట్టితో వుండాల్సింది మమేక భావన దానిస్థానంలో అధికార భావన ఏ రోజు వచ్చి కూర్చుంటుందో ఆ రోజే అతనికి మట్టితో ఆత్మిక బంధం తెగిపోతుంది. అతను భూమిని ప్రేమించనూ లేడు భూమిని సేవించనూలేడు. ఆ క్షణం నుంచే భూమికూడా అతనిని ప్రేమించదు. మాట వినదు. మొండి కేస్తుంది ఇక రైతుపతనం వేగంగా జరిగిపోతుంది

ఎందుకంటే గాలిలోకి లేవాలని ప్రయత్నించిన వాడు ఎప్పుడో ఒకప్పుడు ఎక్కడో ఓ చోట దబ్బున కూలబడక మానడు"

రామనాథం ఇంటికి వెళ్ళేసరికి -

సావిత్రి జీతగాడి పెళ్ళాం చేసినట్లుగా ఖాళీసీసాలో నూనె పోసింది. సీసా మూతకి రంధ్రం వేసింది గుడ్డ వత్తిని తయారుచేసి రంధ్రం గుండా సీసాలోని కంటూ దింపింది. అలా తయారు చేసిన బుడ్డిని వెలిగించి వుంచింది

దస్తగిరి వాళ్ళ జీతగాడు వాళ్ళ గాబులో పోసుకొంటూ - వీళ్ళ స్నానాల గది దగ్గరా ఓ కావిడి దింపాడు

రామనాథం స్నానం చేయగానే - భోజనం వడ్డించి - తనూ స్నానానికి వెళ్ళింది సావిత్రి. ఆ గోనెపట్టాల స్నానాలగది రాత్రిపూట తప్పించి మరోవేళ వాడడానికి వీలవుదు

గొడ్ల కంపుతో - పేడకంపుతో, ఉచ్చలరొచ్చు కంపుతో నూనె బుడ్డి కమురు కంపుతో, అప్పుడే ఆర్పిన పొయ్యిలోని బూడిద కంపుతో ఇల్లు నిండి పోయి వుంది. ఆవిరి తేలి వుంది

రామనాథం నులకమంచాన్ని అమాంతం బయటకు ఎత్తుకెళ్ళాడు. దస్తగిరి గారి చావిడి ముందు మెల్లా మీద మంచం వాల్చుకుంటూ - సావిత్రితో అన్నాడు - " సర్దుకు పోవాలి - సావిత్రీ - సర్దుకు పోవాలి ! "

సావిత్రి అప్పటికే సామాన్ల మధ్య సర్దుకొని నిద్ర పోయింది. అలవాటు ప్రకారం సావిత్రి తెల్లవారు ఝామునే లేచింది. పాచిపనులు చేసుకొంది. గొడ్ల దగ్గర పేడ తీసుకొచ్చి కళ్ళాపి చల్లింది. ఓ ముగ్గు కర్ర గీచింది. పొయ్యిలో బూడిద ఎత్తేసి, కచ్చికలు పక్కన పెట్టింది. ఊర్నించి తెచ్చుకున్న వేపపుల్లతో పళ్ళు తోముకుని - శ్రద్ధగా కాళ్ళూ చేతులు ముఖం కడుక్కుంది మళ్ళీ చీకటి పడ్డాకే స్నానం

సావిత్రి వంటకు పుల్లలేరుకొని వచ్చేసరికి జీతగాడి పెళ్ళాం పాచి పనులు మొదలు పెట్టింది. క్షణాల్లో సద్ది కూడా కట్టుకొని పొలానికి బయలుదేరింది. అదే సమయానికి దస్తగిరి భార్య పాలు పిండడానికి వచ్చింది. సావిత్రి కొద్దిగా పాలు తీసుకొంది.

రామనాథం కూడా పొలానికి బయలు దేరాడు పంచె కుచ్చిళ్ళు పైకి దోపాడు పైపంచ భుజాన వేసుకున్నాడు. ముల్లు కర్ర చేత పట్టుకొని పొలానికి వెళ్ళాడు.

రామనాథం కొన్న నరసింహం పొలం బాలయ్య వాళ్ళ వూరికి దస్తగిరి వాళ్ళ క్యాంప్‌కి మధ్యలో వుంది. ఈ వైపుగా వెళ్ళితే క్యాంప్‌కే దగ్గర.

రామనాథం పొలానికి మొదట్లో వున్న పెద్దపెద్ద తుమ్మచెట్ల కిందకు వెళ్ళి నిల్చున్నాడు పొలమంతా దృష్టిసారించి చూసాడు.

గట్ల మీదంతా తుమ్మచెట్లు. చేనంతా కంపా కర్రా రాయి రప్పా.

రామనాథం గుండె దడదడమంది.

'ఏదో ఆవేశంతో మొండితనంతో వచ్చేసాడు మరి ఇదంతా ఎట్లా సాగులోకి తీసుకు రావడం? పెద్దలమాట చద్దిమూటంటారు. నలుగురిని ఎదిరించి వచ్చినందుకు నగుబాటు పాలవడు కదా?'

రామనాథం పొలం చుట్టూ తిరిగాడు.

రాయిరప్పా ఏరాలి. కంపాకర్రా కాల్చాలి. తుమ్మలు తుప్పలు కొట్టాలి. చదును చేసుకోవాలి గట్లు వేసుకోవాలి. మడులు విభజించుకోవాలి.

అక్కడక్కడ నేల నెర్రులు కొట్టుకొని నల్లని నోళ్ళు తెరుచుకొని వుంది పంట కాలువలు అంతగా లేవు. ఉన్న బోదెలు, పిచ్చిమొక్కలతో ముళ్ళకంపతో రాయిరప్పల్తో నిండిపోయి వున్నాయి. అవన్నీ సరిచేసుకోవాలి. మడులన్నింటికి నీరు చేరేలా చిన్న కాలవలు తవ్వుకోవాలి. కాలవల్లోకి నీరు వదులు కోవాలి.

కానీ నీరు? నీరేది?'

రామనాథం సరిగ్గా అప్పటికి వాగు ఒడ్డుకు చేరుకొన్నాడు. వాగు బాగా పల్లంలో పారుతోంది. ఎండాకాలం కనుక బాగా చిక్కిపోయి వుంది. చిత్తడి వున్నచోట జమ్ము గుబుర్లు వున్నాయి. జమ్ము పసుపుకితిరిగిపోయి వుంది. కాస్త లోతు వున్నచోట నీరు నిలిచి చిన్న నీటి గుంట ఏర్పడి వుంది. దాంట్లో, నీళ్ళు కనబడనీయకుండా అల్లుకు పోయిన బుడగ తామర - వాటి లోటాల్లాంటి తెల్లపూలు.

ఒక కొంగ ఒంటి కాలు మీద నిలబడి వుంది. జపం చేస్తుందో ఏమో! రామనాథం వాగొడ్డున నిల్చుని చుట్టూ చూసాడు.

వాగు అవతలంతా తుమ్మ చెట్లు. డొంక

ఆ నరసింహం దొర తిమ్మడికి ఏమని అప్పచెప్పాడో కానీ - వాగొడ్డు రెండెకరాలు తప్పించి, మిగిలిన చేను ఏనాడు నాగలి నడిపినట్లు లేదు ఆ రెండెకరాలు దుక్కి చేస్తే సాగులోకి వస్తాయి అంతమేరకు ఏతామేసినా నీళ్లు అందేట్టుగానే వున్నాయి ఇంకా వీలుకాకపోతే మోట వేసుకోవాలి. ఒకవేళ ఈ ఏడాది అదునులో వానలు రాకపోతే ... ? వాగులు పారక పోతే .. ?'

"ఎందుకట్ల పరేషానవుతున్రు[1]? వాగు మంచిగ వస్తది. మస్తుగ[2] వస్తది. మా పొలం దిక్కు కూడా ఈవాగే పార్తది కాదూ!" బాలయ్య ఎప్పుడు వచ్చాడో కానీ సరిగ్గా రామనాథం మనసులో మాట తెలిసినట్లుగా అన్నాడు.

వాగు అవతల డొంక దాటిన దగ్గర్నించి బాలయ్య చేను మొదలవుతుంది వాళ్ళ పొలంలో గొర్రెలనీ మేకలనీ తోలారు. బాలయ్య వాటివెంటబడి ఈ చివరి దాకా వచ్చాడు. ఇద్దరూ వాగుకి అటూ ఇటూ నిలబడ్డారు

తన పొలమంతా పరచుకొని వున్న చిన్న చిన్న గుండ్రటి నున్నటి రాళ్ళు చూపిస్తూ నిరాశగా అన్నాడు రామనాథం - "తొండలు పెట్టిన గుడ్లలా ఉన్నాయి కదూ ఈ రాళ్ళు ! ఈ రాళ్ళలో చేలు పండించగలమా"?

"ఈ గడ్డను రాంనాసురుడు[3] ఆయన సెల్లె చూర్పనకమ్మకు[4] అరణ మిచ్చిండంటరు![5] చెయ్యనింకె బేజారైతము[6] కానీ, పండనింకె మస్తుగ పండ్తది!' బాలయ్య తన అనుభవం చెప్పాడు.

కాసేపు మాట్లాడు కున్నాక, బాలయ్య తన చేనువైపు వెళ్ళాడు. రామనాథం తన చేనువైపు

బాలయ్యకు రామనాథం ఏం చేసినా వింతగా కొత్తగా వుంది అది సరిగ్గా పిల్లవాడు ఓ కొత్త విషయాన్ని చూసి ఆశ్చర్యంగానూ అద్భుతంగానూ వింతపడే భావన. రామనాథం మాట మన్నన బట్టాకట్టు అన్నీ బాలయ్యకు వింతగా వున్నాయి. ఇతను నాగలి పట్టి వ్యవసాయం ఎలా చేస్తాడు అన్న కుతూహలమూ వుంది. బాలయ్యకు రామనాథం మరో విషయంలో దగ్గరయ్యాడు. చదువుకున్న ముఖ్యంగా దొరకన్నా బాగా చదువుకున్నట్టు తోస్తోన్న రామనాథం ఎలాంటి హెచ్చుతగ్గులు లేకుండా తనతో మాట్లాడడం - తన ఇంటికి వచ్చి వెళ్ళడం ఎంతో దగ్గరి తనాన్ని ఇచ్చాయి. పైనుంచి, అన్నీ ఎరిగిన వాడికి మల్లేవున్నా - ఎన్నో తన దగ్గర అడిగి తెలుసుకోవడం - మంచి చెడ్డా చర్చించడం - అతనిని ఎంతో సన్నిహితం చేసాయి సంతోషాన్ని ఇచ్చాయి.

ఇంతలో పొలానికి అడ్డం పడి ఎవరో తనవైపే రావడం బాలయ్య గమనించాడు. ముల్లుకర్రనునేలకు తాటించి, ఎండకు చేయి అడ్డంపెట్టి - అతనెవరోనని కుతూహలంగా చూసాడు. చూస్తుండగానే అతను బాలయ్య దగ్గరగా వచ్చాడు.

1 దిగులు పడుతున్నారు   2. ఎక్కువగా, బాగా   3 రావణాసురుడు
4 శూర్పనఖ   5. కట్నం   6. విసుగెత్తి పోతాం

సవారి!

సవారి - అంతకు మునుపు నరసింహం చేను సాగులోవున్నపుడు నరసింహం దగ్గర గాసానికి వుండేవాడు. ఆ తరువాత భార్య పుట్టిల్లు పూడూరుకి జీతానికి వెళ్ళాడు. దొరచేను ఎవరో కొన్నారని తెలుసుకొని - ఆ చేను మీది మమకారంతో మళ్ళీ వచ్చాడు

బాలయ్య ముఖం వెలిగిపోయింది. సవారికి నరసింహం పొలంలో బాగోగులన్నీ బాగా తెలుసు రామనాథానికి మంచి గానగాడు అవుతాడు.

బాలయ్య వెంటనే గొర్రెలు మేకలను చేలోవున్న నారాయణమ్మకు అప్పగించి - రామనాథం వెళ్ళిన వైపు అంగలు పంగవేసుకొంటూ వెళ్ళాడు

సవారి అతన్ని అనుసరించాడు.

ఇద్దరూ కలిసి దూరాన వెళుతున్న రామనాథాన్ని కేకలేసి ఆపారు.

రామనాథానికి సవారి విషయంచెప్పి, అతనితో మాట్లాడించాడు బాలయ్య పంట వచ్చాక కొలవాల్సిన గింజల విషయంలో ఇద్దరూ ఓ అంగీకారానికి వచ్చారు. సవారి జొన్నలు అడిగాడు. ప్రస్తుతానికి తన వద్ద ధాన్యం లేదు కనుక మొదట కొంతపైకం ఇస్తానన్నాడు రామనాథం.

బాలయ్య ఆ వూళ్ళల్లో వున్న పద్ధతిప్రకారం ఇద్దరి మధ్య ఒప్పందం కుదిర్చాడు.

రామనాథం అవీ ఇవీ ప్రశ్నించాడు సవారి సమాధానాలిచ్చాడు

"ఇప్పుడు ఎక్కడ వుంటున్నావ్?"

"పూడూర్ల"

"పెళ్ళయిందా?"

"అవ్ దొరా!" సవారి సిగ్గుపడుతూ తలగోక్కున్నాడు, "దాని ఓలికి[1] దుడ్లు[2] కొరవబడె. దాని నాయన ఈ సంస్రం[3] చూసుకోని - ఒగ్గేయ[4] మన్నాడు - వాని నోట్ల మన్నుబడ!" సవారి తన మామను శాపనార్థాలు పెట్టాడు.

"పిల్లలు లేరా?"

"గింత పొట్టి[5] !" సవారి మూడేళ్ళ పిల్ల ఎత్తును చేయితో సూచించాడు.

"ఇంకేమాయె! గాసాన్కి కుదిర్తివి పోయి పెండ్లాం బిడ్డల తోల్కరా. దుక్కులే మొదలులే. ఇంగ నాట్లు పెట్టేడ్డి ఏ పొద్దుల?" బాలయ్య కల్పించుకుని అన్నాడు.

సవారి ఛాతీ మీద చరుచుకొంటూ అన్నాడు - "ఈ సవారి గడెం[6] ఏసిడంటె భూవి పగలాల మల్ల! దొరా - బుగులు[7] పడకు - ! పొద్దుగాల వొస్త!"

---

1. కన్యాశుల్కం 2. డబ్బులు 3. సంవత్సరం
4. వదిలేయమన్నాడు 5. పాప 6. నాగలి 7 దిగులు

"సవారీ " రామనాథం నెమ్మదిగా అన్నాడు, "నువ్వు నన్నలా మాటి మాటికి దొర . దొర . అనకు".

సవారి అయోమయంగా తలగోక్కున్నాడు, "మల్ల గెట్ల పిలుసుడు?"

రామనాథం ఏమీ సమాధానం చెప్పలేక పోయాడు

బాలయ్య ఓ పిలుపు పట్ల మడత పేచీ ఎందుకని అసలే తలకెక్కించుకోలేదు సవారి మరో రెండుసార్లు చెప్పిందే చెప్పి - పోతూ పోతూ రామనాథం కాళ్ళు - బాలయ్య కాళ్ళు మొక్కి ఆనందంగా డొంకను పట్టి వెళ్ళిపోయాడు సవారి ధోరణికి రామనాథం బిత్తర పోయాడు.

బాలయ్య వెళుతోన్న సవారిని చూస్తూ అన్నాడు, "పొట్టిగానప్పుడు దొరతాన గొర్లు మేపుతుండె దొర తాన్నే గడెం పట్టి గాసగాడయ్యిండు. ఏమాయె ... ? వాని శిరసుపగల ! ఆ దొర ఏ దినమన్న సక్కరంగ గింజలు కొలిసిండా? గింత గంజి నీళ్ళు పోసిండా? . వూర్ల పట్టక పోక ఏం చేస్తడు ? కష్టం చేసెటోనిక్కి గింత కూడు పుట్టదా?"

రామనాథం మౌనంగా తలాడించాడు.

సవారి అన్నట్టు ఆ మర్నాడు ఉదయాన్నే వచ్చాడు. వస్తూ వస్తూ, కమ్మరి ఇంటికి వెళ్ళాడు పనుల కాలం కాబట్టి కమ్మరి తయారుగా చేసి వుంచిన కొడవళ్ళను, గొడ్డళ్ళను, పలుగు పారలను తీసుకొచ్చాడు.

వాటితో పాటు కమ్మరిని కూడా రామనాథం దగ్గరకు తీసుకొచ్చాడు. అక్కడి పద్ధతి ప్రకారం పంట వచ్చాక గింజలు కొలవమని చెప్పి వెళ్ళాడు కమ్మరి.

ఆ రోజు ఆ గడ్డమీద మొట్టమొదటి సారిగా రామనాథం వ్యవసాయం పనిముట్లు చేతిలోకి తీసుకొన్నాడు.

మొదట కొడవలితో వాగులోకి జమ్ము కోసి ఎండేసారు ఓ పెద్ద తుమ్మ చెట్టు కొట్టారు. దాని మానును దూలాలుగా గుంజలుగా వచ్చేట్టుగా సరి చూసుకొని నరికారు. మిగిలిన చిన్న కొమ్మలను కొట్టి, పేళ్ళను పగల దీసారు. ఎండలోకి వేసారు.

వడ్రంగిని పిలుచుకువచ్చి ఓ తుమ్మ మొద్దును ఇచ్చి - కాడిని, నాగళ్ళను, గొర్రులను, గుంటకను, పళ్ళమానును, దిమిసెలను చేయమని పురమాయించాడు.

ఇక, వాగొడ్డు పొలం బాగుచేయడం మొదలెట్టారు. తుమ్మలు తుప్పలు కంపాకర్రా కొట్టి, తగుల పెట్టారు. చదును చేసి గట్లు వేసారు. చక్కని మడులుగా విభజించుకున్నారు. వాగు పల్లంలో వుంది కనుక వడ్రంగిని, కమ్మరిని పిలుచుకువచ్చి, ఏతానికి కావాలసిన మరమ్మత్తులు చేయించారు. పంట కాలువలు, బోదెలు బాగు చేసుకున్నారు.

బాలయ్య తక్కువ ధరలో ఒక ఎడ్లజతను, ఒక బండిని బేరం కుదిర్చిపెట్టాడు.

రామనాథానికి వ్యవసాయం చేయడానికి కావలసిన పనిముట్లు - హంగులు అన్నీ అమిరాయి. ఇక, డబ్బు చూసి - చూసి - పొదుపుగా వాడాల్సిన సమయం వచ్చేసింది.

ముందుగా, పొలం మొదట్లో వున్న తుమ్మ మానుల కింద చదును చేసి రెండు నిట్రాళ్ళ చావిడి వేసారు తుమ్మ మాను దూలంగానూ గుంజలుగాను మారిపోగా, జమ్ము కప్పులా రూపాంతరం చెందింది

సవారి తన భార్యా బిడ్డలను కాపురానికి తీసుకువచ్చాడు. వాళ్ళుండగా మిగిలిన చావిడిలో ఎద్దులు, బండి, వ్యవసాయ పనిముట్లు సర్దుకున్నాయి.

ఒక్కోరోజు పనిచేస్తూ పొద్దుపోతే, రామనాథం ఆ పాకలోనే పడుకుంటున్నాడు.

సవారి, తన భార్య మాణిక్యం చేత వేడివేడి జొన్న రొట్టెలు చేయించి పెడుతున్నాడు.

రామనాథం ఎంత వారించినా సవారి దొర దొర ... అనడం మానలేక పోతున్నాడు పుటకకి దొరలాగున్న రామనాథం తనతోపాటు పొలం బాగుచేయడానికి రెక్కలు ముక్కలు చేసుకోవడం అతనికి నమ్మరాని నిజంలా వుంది అతనికి కాళ్ళు నేలమీద ఆనడం లేదు రామనాథాన్ని నొప్పించడం ఇష్టంలేక, ఎదురుగా దొర అని సంభోదించడం తగ్గించుకున్నా - వడ్రంగి దగ్గరా కమ్మరి దగ్గరా కుమ్మరి దగ్గరా అడిగిన వాళ్ళ దగ్గరా అడగని వాళ్ళ దగ్గర రామనాథం దొర గురించి ఘనంగా చెప్పడం తనకే గౌరవంగా భావించాడు. రామనాథం దగ్గర పనిచేయడానికి అక్కడి గాసగాళ్ళు ఉవ్విళ్ళూర సాగారు

రామనాథం సవారి మూకుట్లో తినడమే కాదు - త్వరలోనే సావిత్రిని కూడా సవారి వాళ్ళు ఉంటున్న ఆ పాకలోకే కాపురానికి తీసుకు వచ్చాడు

రామనాథం తరుచూ పొలం పనులమీద పొలం వద్దనే వుండి పోవడం సావిత్రికి మహా విసుగ్గా ఉంది.

అంటీ ముట్టనట్లు వుంటున్న దస్తగిరి భార్య ప్రవర్తన ఆమెకు మెల్లి మెల్లిగా అర్థమయింది.

దస్తగిరికి తమపట్ల వున్న ఆదరణకూ అతని భార్య నిరాదరణకూ మధ్యన దస్తగిరి తమకు ఇస్తోన్న ప్రాధాన్యత కారణమని సావిత్రి భావించింది.

దస్తగిరి జీతగాడి కుటుంబం సావిత్రికి సన్నిహితమయ్యారు. సావిత్రి జీతగాడి భార్యను బొంకూరు సంతకు పంపించింది.

మంచినీళ్ళకూ పొంతకు బానలు, స్నానాలగదిలోకి కుండలు, నీళ్ళు తెచ్చుకోను కడవలు - వంటకు గాను మట్టి కూర చట్లు, మూకుళ్ళు తెప్పించుకుంది. కుండా చట్టి అమిరాయి

పొలం పనులు ముమ్మరం అవడంతో మగవాళ్ళు వెళ్ళీ వెళ్ళగానే ఆడవాళ్ళు పొలానికి వెళుతున్నారు. ఊరంతా నిశ్శబ్దంగా వుంటుంది. చీమ చిటుక్కుమన్నా సావిత్రి గుండె గుభిల్లంటోంది.

ఆ ఒంటరి తనంలో సావిత్రికి మాటి మాటికీ పిల్లలు జ్ఞాపకం వస్తున్నారు.

శివుడి వేళాకోళాలు, సుధాకర్ చిలిపి చేష్టలు - కొంగుపట్టుకు వేళ్ళాడే అనూరాధ, కాళ్ళకి అడ్డాలు పడుతూ కుచ్చిళ్ళతో తలదాచుకొనే కల్యాణి - సావిత్రి కళ్ళముందు మెదులుతున్నారు

ప్రతి క్షణం ఈ వేళప్పుడు వాళ్ళేం చేస్తుంటారో అనే ఊహలో పడిపోతోంది ఆలోచనల్లో మునిగిపోతోంది

మజ్జిగ చిలికీ చిలకగానే వెన్నపూస కోసం తపేలాలో చేయి పెట్టే పిల్లలు - వెన్నపూస కరిగేయగానే నెయ్యి అడుగున మిగిలే గోదారి కోసం వంతులు వేసుకొనే పిల్లలు - సీమ చింతకాయల్నో సపోటాల్నో దాచి పెట్టమని బతిమిలాడే పిల్లలు - పున్నమ్మకు తెలియకుండా అరిసముక్కలో ఆవకాయ బద్దలో ఇప్పించుకొని పరుగులు తీసే పిల్లలు - సావిత్రి ఊహలని చుట్టుముట్టేస్తున్నారు వారి ఎడబాటు ఆమెను విషాదంలో ముంచేస్తోంది

అయితే, దుఃఖంలోంచి బయట పడడానికి అందరు ఆడవాళ్ళు చేసినట్లే ఆమె కూడా పని వైపు దృష్టి మరల్చేది

ఎంత చేసినా ఇద్దరు మనుషులకు ఏం పని? సావిత్రిది పదిమందికీ వండిన చెయ్యి - పది మందికీ పెట్టిన చెయ్యి ఇద్దరికి ఇంత ఉడకేసుకోవడం ఆమెకు పెద్ద పనేం కాదు పైనుంచి పాడి పనిలేదు. పన్నెత్తి పలకరించే మనిషి లేడు. ఆ వంటరి తనం భరించలేక ఒక్కోసారి దస్తగిరి భార్యలాగా జీతగాడి పెళ్ళాంలాగా పొలం పనులకి వెళదామన్నంత ఆవేశం ఆమెను ఆవహించేది

కానీ, పొలం పనులు ఆమెకి అలవాటు లేదు అసలు తెలియనే తెలియదు గొడ్డూ గోదా వంటావార్పూ ఇవి ఆమెకి వెన్నతో పెట్టిన విద్యలు

ఇక, పొలంలో పగలంతా పనిచేసి వచ్చిన రామనాథానికి - యింటికి రాగానే పశువుల రొచ్చులో కంపులో ఒక్కముద్దకూడా గొంతు దిగడం లేదు. ముసురు కుంటున్న దోమల మధ్య ఒక కునుకు కూడా తీయలేక పోతున్నాడు. పొలం దగ్గర బండి జల్లలో హాయిగా పడుకున్న రోజు ఇల్లు అక్కడకే మార్చేసుకుందామన్న ఆలోచన వచ్చింది రామనాథానికి

సవారి, మాణిక్యం చిన్నపిల్లతో వుండడం లేదూ ? మనిషికి మనిషి తోడుంటారుగా? అయినా, దస్తగిరిగారి చావిట్లో ఎంత కాలమని వుండడం ? తమకంటూ ఓ ఇల్లు ఏర్పరచుకోవాలిగా?

ఆ ఆలోచన రాగానే, రామనాథం పొలం దగ్గర పశువుల చావిడికని వేసిందానికి చుట్టూ మట్టి గోడలు నిలబెట్టాడు లోపల తడికలతో రెండు గదులుగా విభజించాడు జమ్ముతో నాలుగు వైపులా దడికట్టి స్నానాల గది తయారు చేసారు. చూస్తూండగానే ఇల్లు సిద్ధమైంది. ఎద్దుల కోసం మరోచిన్న పాక సిద్ధమైంది. వాగులో జమ్ము, తుమ్మ మొద్దుల మూలాలు - గుంజలు - తమకంటూ ఓ గూడు ఏర్పడింది

సావిత్రికి ఊపిరి పోసుకున్నట్లయింది

చావిడి ఖాళీచేసి వెళుతోంటే దస్తగిరి గారి జీతగాడి భార్య బాధపడింది బండిలో సామాను వేసుకొని బయల్దేరేముందు చెప్పిరావడానికి దస్తగిరి ఇంట్లోకి వెళ్ళారు

"ఆ అడివిల ఆడుమనిసితోన ఎట్లుంటరు? ఊరు వొట్టిపోయిందా? ఎట్ల?" అంటూ దస్తగిరి మనసు కష్టపెట్టుకున్నాడు

"ఉంటె ఏమాయె? ఆడ ఉండెటోల్లు మడుసులు కారా?" దస్తగిరి భార్య కోపంగా అంది

రామనాథం దస్తగిరికి నచ్చచెప్పి, ధన్యవాదాలు చెప్పి బయలు దేరాడు.

బాలయ్య కూడా బాధపడ్డాడు తమ ఇంటికి రమ్మని ఆహ్వానించాడు. రామనాథం మృదువుగానే నచ్చచెప్పాడు.

సావిత్రికి యిల్లు అల్లంత దూరాన కనబడగానే ఎక్కడలేని హుషారు వచ్చేసింది. బండి దిగగానే చిన్నపిల్లలాగా ఆ పాక చుట్టూ తిరిగేసి వచ్చింది. సవారి భార్య మాణిక్యం పెంచుకుంటున్న బుజ్జిమేక పిల్లను నిమిరింది. సవారి కూతుర్ని పిలకలు పట్టి ఆడిస్తూ పలకరించింది సవారికి, మాణిక్యానికి కూడా మహా సంతోషంగా వుంది అందరూ కలిసి సందడి సందడిగా సామానంతా ఇంట్లోకి సర్దారు.

సావిత్రికి ఇప్పుడు కాలుచెయ్యి ఆడినట్లుగా వుంది వంటకో గది. పడుకోవడానికో గది. మంచి స్నానాలగది.

అది తనదన్న స్వతంత్రం వల్లనేమో సావిత్రి ఆనందానికి పట్ట పగ్గాల్లేవు ఆ ఆనందం ఓ అంటు వ్యాధిలా క్షణాల్లో అందర్నీ - చుట్టేసింది. రామనాథానికి కొండంత అండ దొరికిన సంతోషం కలిగింది

ఆ ఇంటిలో సావిత్రి పొయ్యిపెట్టాలని నిర్ణయించుకొన్నచోట రాళ్ళు పెట్టింది. రాళ్ళమీద మట్టితో మెత్తి - మంచి పొయ్యి తయారు చేసుకొంది.

సవారి అలుకు మన్నులో పేడనీళ్ళు పోసి, తొక్కి ఇస్తే సావిత్రి, మాణిక్యం ఇల్లంతా అలికారు గోడల పైదాకా అలికారు. పొయ్యి మీదా అలికారు.

రామనాథం ఈలోగా గుమ్మానికి అటూ ఇటూ గట్లు వేసాడు. ఆడవాళ్ళు బయటి గోడలు, గట్లు అన్నీ శుభ్రంగా అలికారు. మాణిక్యం తాముండే చోట అలాగే అలుక్కుంది.

సావిత్రి బియ్యం నానేసి - రుబ్బి - ముగ్గు పిండి తయారుచేసింది. బట్ట ముక్కని ముగ్గులో ముంచుతూ - బొటని వేలి కిందుగా ముగ్గును జారుస్తూ మిగిలిన వేళ్ళకీ మధ్యన బట్టను పట్టుకొని - ఉంగరం వేలితో ముగ్గులేసింది సావిత్రి. బొటన వేలితో గోడలకీ, గట్లకి వరుసల్లో ముగ్గు బొట్లు పెట్టింది. పొయ్యి మీదా ముగ్గు కర్రలు గీచింది. చూస్తుండ గానే చక్కని ముగ్గులతో ఇల్లంతా కళకళ లాడింది. ఈలోగా రామనాథం ఇంటి ముందు మొరుసు మట్టి తోలించాడు.

రోజు నీళ్ళు కొట్టి - దిమిసె వేసి - గట్టి - చదును - మెల్లా తయారు చేసాడు.

సావిత్రికి ఉదయం సాయంత్రం పేడకళ్ళాపి చల్లుకొని పాడి ముగ్గు వేసుకోవడానికి చక్కని ముంగిలి అమిరింది.

ఇంటికో రూపం వచ్చాక పనులన్నీ ఓ క్రమంలో పడ్డాక సావిత్రికి ఓ గేదె కొనుక్కోవాలని పించింది. ఎట్లాగు డబ్బు చెల్లిస్తున్నారు కాబట్టి, దస్తగిరి గారి జీతగాడు పొలానికి వెళుతూ వెళుతూ పాలముంత ఇచ్చి వెళుతున్నాడు. ఎంతయినా సొంతపాడి వుంటే ఆ తీరే వేరని సావిత్రి భావించింది. అయినా పల్లెల్లో పాలు కొనడం ఏమిటి? ఒక్క పడ్డ[1] వున్నా అదే పదివేలు.

సావిత్రి తన దగ్గర వున్న పదీ పరకా తెచ్చి రామనాధం చేతికి ఇచ్చింది. ఆ డబ్బుని ఇక్కడికి వచ్చేప్పుడు అమె పుట్టింటివారు పసుపు కుంకుమ పెట్టి రవిగ్గుడ్డ కొనుక్కోమని ఇచ్చారు.

రామనాధం, సవారి వెళ్ళి బాలయ్యతో మాట్లాడి ఓ గేదెని కొనుక్కొచ్చారు.

సవారి అంత దూరాన్నుంచీ కేకలేసు కొంటూ వచ్చాడు - "దొర్సానీ - దొర్సానీ - బర్రిగొడ్డు తోలికొస్తిమి - బెరీన[2] రా దొర్సానీ".

మాణిక్యం - కూతురు పరిగెత్తుకొని ఎదురెళ్ళి - బుజ్జి దూడను నిమిరాలని ప్రయత్నించింది. ఆ దూడేమో ముట్టిని అటూ ఇటూ ఆడించి - ఆ అమ్మాయినే నాలుకతో నాకాలని ప్రయత్నించింది

సావిత్రి గేదె వచ్చిన సంతోషాన్ని దాచుకొంటూ సవారితో చిరు కోపంతో అంది, "ఇదిగో సవారి - ముందా దొర్సాని అనడం మానేయి - సాని ఏంటి సాని ! అసయ్యంగా!!"

సరిగ్గా రామనాధం దొర అన్న పిలుపంటే ఎలా ఉలిక్కి పడతాడో సావిత్రి అలా ఉలిక్కి పడుతుంది.

సవారి రామనాధం వైపు, సావిత్రివైపు మార్చి మార్చి చూసి తలగోక్కున్నాడు "మల్ల గెట్ల పిలుసుడు?" గొప్ప సందేహంలో పడి అడిగాడు.

రామనాధం సావిత్రి ఏం సమాధానం చెపుతుందోనని చెవిరిక్కించాడు.

"అమ్మా అన్లేవూ?" సావిత్రి ఎదురు ప్రశ్నించింది.

సవారి ముఖం వికసించింది "గట్లయితే, దొరని అయ్యా అంట!"

సావిత్రి సులువుగా చేసిన ఈ పరిష్కారం రామనాధానికీ నచ్చింది.

"అమ్మగారు అను!" మాణిక్యం సవారికి సర్ది చెప్పింది మాణిక్యం సావిత్రితో మాట్లాడుతూ గారు, అండి - లాంటివి అప్పటికే పట్టేసింది.

"మళ్ళీ ఆ గారెలు బూరెలు ఎందుకు? శుభ్రంగా అమ్మ అని పిలవక!" సావిత్రి మళ్ళీ అడ్డొచ్చింది.

---

1. గేదె 2. త్వరగా

సావిత్రి కొత్తగేదె మెడ మీద చేయివేసి నిమర బోయింది. గేదె తల విసురుగా తిప్పింది. అది గౌడ గేదె. దాని చెవులు పెద్దగా విప్పారి వున్నాయి. కొమ్ములు మెలి తిరిగి వున్నాయి దాని బానలాంటి కడుపును - పొదుగులో వుబ్బివున్న పాలనరాన్ని చూసి సావిత్రి తృప్తిగా తలాడించింది.

సావిత్రి సవారి వాళ్ళకు అమ్మ అయ్యాక - వాళ్ళకి కొండంత అండ దొరికినట్లయింది. దొర - దొర్సాని పిలుపే మనుషుల మధ్య ఆమడ దూరాన్ని - కనిపించని అగాధాన్ని సృష్టిస్తుందని వాళ్ళకి స్పష్టం కాకపోయినా - అమ్మా అయ్యా అంటూ పిలువడంతో సొంత తల్లిదండ్రులతో మెలిగినంత చనువుగా మెసల గలుగుతున్నారు. నిజానికి వాళ్ళ మధ్య వయసులో పెద్ద తేడా లేదు. సావిత్రి మొగుడు పెళ్ళాల మధ్య తగువులు కూడా తీరుస్తోంది.

అక్కడికి వచ్చిన కొత్తల్లో ఓ రోజు, పనులన్నీ పూర్తి చేసుకొని పొంతలో నీళ్ళు తోడుకొని - స్నానాల గదిలో పెట్టుకుంది సావిత్రి. - చన్నీళ్ళు తోడు కోను నీళ్ళబానలో చెంబు ముంచింది. నీళ్ళ చెంబు బుడుంగు మన్న శబ్దంతో పాటు బుస్సుమన్న శబ్దం వినిపించింది.

సావిత్రి వెనక్కి ఓ గెంతు గెంతింది. చేతిలో చెంబు కింద పడేసి కెవ్వుమంది. చెవులు చేతుల్తో మూసుకొని అరిచింది.

"పాము .... పా .... పాము"

చెంబు దడేల్ మనింది. ఆ శబ్దానికి కోడెనాగు బుస్సున లేచింది - పడగ విప్పార్చి కస్సు కస్సున అటూ ఇటూ చూస్తోంది.

సవారి ముల్లుకర్ర తీసుకొని ఒక్క ఉదుటున వచ్చాడు.

సవారి నేర్పుగా ముల్లు కర్ర చివర చీలిన వంకీతో కోడనాగు కంఠం మీద పొడిచాడు. అమాంతం నేలకు వత్తి పెట్టాడు.

పాము పడగ ముడుచుకుంది. వళ్ళంతా గిలగిల లాడించింది. తోకతో తన శత్రువును చుట్టేయాలని విఫల యత్నం చేసింది. శక్తి కొద్దీ తోకతో కర్రకు చుట్టుకొని పట్టు తప్పించాలని గట్టి ప్రయత్నం చేసింది.

సవారి అంతకన్నా బలంగా గట్టిగా దానిని నేలకు అదిమి పెట్టాడు. అది రక్తాన్ని విషాన్ని చిమ్మి చిమ్మి నీరసమైపోయింది. ఇంతలో రామనాథం కర్ర తీసుకొని వచ్చాడు.

ఆ లోగానే పాము నిశ్చలనమై పోయింది.

సవారి గబగబ సావిత్రి దగ్గరికి వెళ్ళాడు.

"పాము సచ్చె! పైసలుంటే ఇయ్యమ్మ."

సావిత్రి అమ్మయ్య అంటూ నిట్టూర్చి - ముఖానికి పట్టిన చెమటను కొంగుతో తుడుచుకొంది. ఎందుకు ఏమిటని అడక్కుండా గూట్లో దొరికిన చిల్లరంతా తీసుకొచ్చింది. సావిత్రి.

సవారి ఒక రాగిపైస తీసుకొన్నాడు.

పాము నోరు వెడల్పు చేసి - రాగి నాణెం నోట్లో పెట్టాడు దానిని పొలంలోకి తీసి కెళ్ళాడు. గడ్డీ గాదెం వేసి - చేలోపడుకోబెట్టాడు. పాము శరీరాన్ని దహనం చేసాడు. దానికి ముందుగా నాగరాజుకు నమస్కారం చేసాడు.

చల్లారిన చితాభస్మం లోంచి రాగి నాణెం ఏరుకు వచ్చాడు. నాణేనికి ఓ చిన్న రంధ్రం వేసి కూతురి మొలతాట్లో కట్టాడు.

సావిత్రి సవారి చేసినవన్నీ గమనించి ఆశ్చర్యంగా అడిగింది - "అదేంటి? అలా కట్టావు సవారి?"

సవారి పామును దహనం చేసిన వైపుగా దండం పెడుతూ అన్నాడు. " ఆ నాగరాజు నా బిడ్డను సల్లంగ సూడాల! గిట్ల రాగిపైసె కడితే పొట్టి పైల[1] ఇషం గిషం ఇట్ల ఇరగాల[2] మల్ల!"

ఆ తరువాత కూడా సావిత్రి చాలాసార్లు పాముల్ని చూసింది. దూలాన వేళ్ళాడుతూ - చూరు వాసాలకు చుట్టుకొని - జమ్ములో జర జర పాకుతూ - కుండల కింద కుదురుగా ముడుచుకుని - ఎన్నోసార్లు పాముల్ని చూసింది.

నాగుపాము, జెర్రిగొడ్డు, త్రాచుపాము, కట్లపాము, రక్త పింజర, ఇంకా ఎన్నెన్నో పాముల్ని చూసింది. నీళ్ళ కట్టపాములు, పసికర పాములు అయితే లెక్కలేదు. కానీ, మొదటి సారి పామును చూసినపుడు కలిగిన భయం కానీ - వెన్నులోని జలదరింపు కానీ మళ్ళీ అనుభవంలోకి రాలేదు. పొయ్యిలో ముడుచుకున్న పామును పక్కకు తోలేసి చితుకులు మంట వేసుకోవడం ఆమెకు అలవాటు అయిపోయింది.

అయితే, చూస్తుండగానే - సవారి కూతురి మొలతాడు చుట్టూ కాలిన రాగి నాణేలు అమిరాయి. సవారి మొలతాడున మరికొన్ని చేరు కున్నాయి.

ఇక వ్యవసాయం పనులు ముమ్మరమయ్యాయి.

రామనాథం ఎరిగింది వరి పండించడం - సవారికి తెలిసింది జొన్న సేద్యం.

వాగు ఒడ్డున రెండెకరాలు వరి వేయాలని - మిగిలినది జొన్న వేయాలని నిర్ణయించారు. ఎంత చేసినా ఆ పంటకి పదెకరాలు సాగులోకి వచ్చింది.

రామనాథం, సవారి నాగళ్ళు పట్టారు.

దుక్కులు దున్నుకున్నారు.

పెంట పోగులు తోలుకున్నారు.

కలియ దున్ను కొన్నారు.

గొర్రు తోలు కొన్నారు. దమ్ము చేసుకున్నారు

గుంటకలు తోలుకొన్నారు. చదును చేసుకొన్నారు.

1. శరీరములోని 2. విరగాలి

రోళ్ళు బద్దలు కొట్టేసి రోహిణి వెళ్ళిపోయింది.

పెళపెళమంటూ మృగశిర వురిమింది. మూలనున్న ముసలెద్దు కూడా హుషారుగా రంకె వేసింది. రామనాథం ఉత్సాహంగా అన్నాడు,

"మృగశిర వురిమింది. ముసలెద్దు రంకె వేసింది. మన నాగలికిక తిరుగు లేదు."

సవారి ఆనందంగా తలాడించాడు.

వానలు కురిసాయి. వాగులు పారాయి.

విత్తనాల వడ్లు తీసి నానబోసుకొన్నారు. మంద కట్టుకొన్నారు. విత్తనాల మీద చుక్కల్లాగా మొలకలు మొలిసాయి. వరినార్లు పోసుకొన్నారు. నవనవలాడుతూ నారు మడి సిద్ధమైంది.

జొన్న చేను దుక్కులు దున్నుకున్నారు. ఎరువులు వేసి దమ్ములు చేసారు.

అదుగో ఇదుగో అంటూ వుండగానే ఆర్ద్రకార్తె వచ్చింది.

వరి నారు మళ్ళలో అంతరకృషి చేసుకొన్నారు. సస్య రక్షణ చూసుకొన్నారు. జొన్న చేనులో విత్తనాలు విత్తడానికి సిద్ధమయ్యారు.

సవారి ఊళ్ళోకి వెళ్ళి కూలీలను పిలుచుకు వచ్చాడు

గొర్రలకు జడ్డిగం పిడతలు బిగించుకు వచ్చాడు.

తెల్లవార గట్లే, గట్ల వెంబడి బిల బిలమంటూ కూలీలు రానే వచ్చారు నున్నగా దువ్వి కొప్పున ముడిచిన వారి తలలోని పూలు ఫక్కుమన్నాయి. చేతుల నిండా వేసుకొన్న గాజులు గలగలమంటూ పరాచికాలాడాయి.

మాణిక్యం విత్తనాల కుండను తెచ్చి గట్టు మీద పెట్టింది. విత్తనాల కుండకు, జడ్డిగం పిడతలకు విభూతి పూసారు. విత్తనాలు తీసుకొని కొంగులో పోసుకొని వడి కట్టుకున్నారు.

మొదటి గుప్పిట విత్తనాలను వడి కట్టుకొన్న ముదిత ఒకరు - పెద్దగా పాట మొదలెట్టింది. మిగిలినవారు గొంతు కలిపారు.

"యితనాల[1] కడవకి యీబూతి[2] బొట్లు
యిత్తబోదము రండి ముత్తైదలారా ....
గొర్రు లెయ్యీమను గుంటకలెయ్యి
కోటార్లు తోలుమను కోళ్ళైన గూసే - "

మగవాళ్ళు సాళ్ళు చేస్తూ గొర్రులు తోలు తోంటే - ఆడవాళ్ళు వడిలోంచి విత్తనాలు తీసి గుప్పిటతో జడ్డిగంలో పోస్తున్నారు. జడ్డిగం కంతలగుండా సరియైన దూరంలో సరియైన వరుసలో విత్తనాలు పడుతున్నాయి. వాటికి నేపథ్యంగా జానపదుల పాట సాగుతోంది.

---

1. విత్తనాల 2. విభూతి

లయాత్మకంగా సాగుతోన్న పని - పనికి ప్రాణం పోస్తోన్న పాట గట్టు మీద కూర్చుని వారిని గమనిస్తోన్న సావిత్రిని కదిలించాయి ఓ క్షణం ఆ పాటను తన పాటల పుస్తకంలో రాసుకుందామనుకుంది. పాట రాసుకోవడమో పాట వినడమో ఎటూ తేల్చుకోలేక అక్కడే వుండి పోయింది.

పై నుంచి, తనూ కొన్ని విత్తనాలు తీసుకొని కొంగులో పోసుకుంది రామనాధం పక్కన జడ్డిగంలో విత్తనాలు పోస్తోన్న కూలీని తప్పించి - తను వెళ్ళింది.

అది చూసిన కూలీలు ఒకళ్ళ నొకళ్ళు సైగలు చేసుకొని - ముసిముసి నవ్వులతో - ముక్త కంఠంతో పాడారు.

"గొర్రు దోలె రామనకు గొడుగు నీడల్లు
యిత్తేటి సీతమకు యిరజాజి పూలు"

రామనాధం ఓ క్షణం ఆగి - పాడుతోన్న వాళ్ళను చూసి నవ్వాడు. పై పంచను దులిపి తలకు చుట్టు కొన్నాడు

సావిత్రి సిగ్గుపడి పోతూ పని సాగించింది. కానీ, అలవాటు లేని పని కావడం వలన ఒక్క సాలు తిరగక ముందే గట్టు మీద చతికిల పడింది.

ఇక ఆడవారి దృష్టి మాణిక్యం, సవారిల మీద పడింది

"అక్కిడేసే మానిక్యానికి అంచు చీరల్లు
నాగుబడిగల రైక నాను తీగల్లు"

మాణిక్యం మూతి మూతి మూడొంకర్లు తిప్పింది. ఆమె ముక్కు మీది, పుడక ముచ్చటగా కదిలింది.

"గుంటక సవారయకు గోటంచు దోవతి
పులిగోరు తాయితులు బొమ్మంచు సెల్లా"

"బిర బిర[1] కానిండె హె! పదాలు పాటలు ఎనక సిక్కి[2] కడుదురు!"

సవారీ కూలీలను పనివైపు మళ్ళమంటూ హెచ్చరించాడు.

ఆడ కూలీలు కిసుక్కుమన్నారు.

అయితే, అదేం చిత్రమో ఈ సారి పాట సవారే స్వయంగా అందించాడు. పొలం మీద క్రమశిక్షణతో కదలుతూ - మౌనంగా తమ కష్టంలో పాలు పంచుకొంటోన్న ఎద్దుల్ని చూసి ముచ్చట పడ్డాడు. చ్చొ .... చ్చొ.... . మని అదిలిస్తూ - తోక నిమురుతూ ఆప్యాయంగా పాడాడు.
మాణిక్యం - మిగిలిన ఆడవాళ్ళు గొంతులు కలిపారు.

"గొర్తి యెద్దులకేమో కొమ్ము కుప్పల్లు

---

1. త్వరత్వరగా  2. తరువాత

పచ్చల పణకట్లు పట్టుగౌ సెన్‌లు -
గుంట కెద్దుల కేమో కుచ్చుల్ల తాడు
బొరు బోరు గజ్జెల్లు బొడ్డు గంటల్లు -
పైసాల యెద్దులకు పగిడి కుప్పెల్లూ
కుచ్చుల్ల పణకట్లు కురు మల్లి తాడూ - ''

పాడుతూ పాడుతూ వుండగానే పని పూర్తయింది. జొన్నచేను విత్తడం పూర్తయింది.

వారి పనితో పాటతో ఉత్తేజితురాలైన సావిత్రి గబగబ వెళ్ళి - తమ వూరి నుండి తెచ్చిన విత్తనాలన్నీ మూటలు విప్పింది.

ఇంటి ముందు వాటిని నాటింది.

మునగ, రాంములగ, వంకాయ, బెండ, సొర, బీర, కాకర, దోస, చిక్కుడు అన్ని విత్తనాలు విత్తింది.

కనకాంబరాలు, సీతమ్మ వారి జడ బంతులు నారు పోసింది.

పెరుగు తోట కూర విత్తనాలు చల్లింది.

పునర్వసు కార్తె వచ్చింది వరి నాట్లు ముగిసాయి.

రామనాథం వాగునీటిని వరిచేలోకి మళ్ళించాడు. రెండోరోజునో మూడోరోజునో రామనాథం వాగొడ్డున వుంటే సవారి గబగబ వచ్చాడు.

"ఏమాయెనేమో సూడయ్యా - వరి దుబ్బు ఏళ్ళబడె -"

రామనాథం వరిదుబ్బు చేతిలోకి తీసుకొని పరీక్షించాడు.

మొక్కలో జీవంలేదు. వేళ్ళాడబడి పోతోంది.

రామనాథం మనసులో ఏదో అనుమానం మెదిలింది.

రామనాథం తిన్నగా వరిచేలోకి వెళ్ళాడు. మడి మధ్యలోకి వెళ్ళి వరి దుబ్బు కదిలించి చూసాడు. అది చులాగ్గా చేతిలోకి వచ్చేసింది. బురద నీళ్ళలోనే వేళ్ళకున్న మట్టి విదిలించాడు. మొక్క వేళ్ళాడ బడిపోతోంది.

రామనాథంకి ఏమీ అర్థం కాలేదు. నొసలు ముడిచాడు 'రోజూ చూస్తూనే వుంటాంగా! తెల్లారేపాటికి ఇదేం ఉపద్రవం వూడి పడింది? పురుగు ఆశించలేదు. తెగులు సోకలేదు. మరి ఏం వచ్చింది ? ఈ విధంగానే వుంటే నాలుగు రోజుల్లో పచ్చటి పొలం ఎండు గడ్డయి పోతుందో ఏమో?'

రామనాథం గుండె చిక్క బట్టింది.

సవారి అయోమయంగా రామనాథం వంక అతని చేతిలోని వరిదుబ్బు వంకా చూస్తున్నాడు.

వరి దుబ్బువేళ్ళ నుంచి జారుతోన్న బురదనీరు రామనాథం వంటిని తడుపుతోంది - ఇంతలో ఎవరో పిలిచినట్లుగా బాలయ్య వచ్చాడు.

" ఏమాయె ? గట్ల మడి మధ్యంగ నిలుసున్రు ? " బాలయ్య గట్టు దిగి రామనాథం దగ్గరకు వస్తూ - ఆశ్చర్యంగా అడిగాడు.

"వాగుల నీళ్ళు మళ్ళించాము. ఏమయిందో ఏమో తెలియడంలేదు'?

"వాగు నీళ్ళు పొలంలోని సేనుల పెట్టిన్రా ? "

రామనాథం హతాశుడయ్యాడు.

'పక్కనే వాగు పారుతోంది ఇసుక బస్తాలు అడ్డం వేసాడు నీరు పొలంలోకి మళ్ళించాడు. అదేంటి బాలయ్య చేయకూడని పని చేసినట్లుగా అంటున్నాడు ? '

"నీళ్ళు అందుబాటులో ఉన్నాయికదాని చేలోకి మళ్ళించాము. వరికి నీరేగా ప్రాణం"

"నిజమేగానీ, గిటు దిక్కు సేను చదును చేస్తివి వానల కొట్కోని భూమిల పాలచౌడు గిట్ల వాగుల చేర్తది. గా ఉప్పు నీళ్ళు సేల పారిస్తే మొక్కేడ నిలస్తది ? "

"అయ్యో - ఈ విషయం నాకు తెలియదు నేను సేద్యానికి కొత్త - "

"ప్రతిసారి గిట్లనే అయితదను కోకు. సేను చదును చేసినపుడు - జర భద్రం గుండాలె - గిప్పుడు పంట చేతికొస్తదా ? "

"నా పంట పోయింది ! మొట్టమొదటి పంట ! "

రామనాథం తొలుసూరు బిడ్డ పోయినట్లు విలవిలాడిపోయాడు.

"అరరే - ఎందుకు పరేషానవుతున్రు ? సేద్యగాడు పంట పోయినగానీ పరేషానవ్వరాదు. పంట వొస్తది పోతది. సేద్యం చేసెటోన్కి గిది గెప్పుడుండె ముచ్చట్నే ! సేను మల్ల దున్నని. పిల్లిపెసర ఏద పెట్టని. సేను మంచిగయితది. మల్లపారి ఈతగుల్లలు ఏదపెట్టని - "

"ఈతగుల్లలా ? "

"అవ్, ఈతగుల్లల రకం వరి ఈ గడ్డ మింద సరిపోతది. నువ్వేందో కొత్తది తెస్తివి. అది ఈ రేగట్ల నిలుస్తదో నిల్వదో - ఈపారి ఈతగుల్లలు నాటు బెట్టుని - " బాలయ్య నెమ్మదిగా అన్నాడు, "మేము వాముపంట మంచిగ చేస్తం. నడిగడ్డ వాము దేశమంతా పోతదంటరు. జొన్నలు, కుసుమలు, ధనియాలు, సజ్జలు గిసుమంటి పంటల ముచ్చట మాకు మంచిగ ఎర్కెగానీ, వరిచేను ముచ్చట మంచిగ తెల్వదు -"

రామనాథం మౌనంలో మునిగి పోయాడు.

"జొన్నసేను మంచిగున్నది కాదె - జరమొక్కలు పల్చనచేయరాదె "

కంకులు పట్టి, గింజలు నిండి కళకళలాడాల్సిన వరి చేను పిలకలు కట్టకముందే పోటాకు పొడవక ముందే ఎండుగడ్డయి పోయింది

కోతకు రావలసిన వరిచేనును పీకేసి, పిల్లపెసర వేస్తోంటే రామనాథం తట్టుకోలేకపోయాడు ఆ పని సవారికి వదిలేసి, గట్టుమీద కెళ్ళి కూలబడ్డాడు రామనాథం గుండె మెలిపెట్టినట్లయింది

"ఆకాడికి నాకంటే మొనగాడి రైతువా ? " రత్తయ్య హుంకరించినట్లు తోచింది రామనాథానికి

రామనాథానికి ఆక్షణంలో ఏమేం గుర్తొచ్చాయో - తుమ్మచెట్టు మొదట్లో కూలబడి ఏడ్చాడు. పైపంచ నోట్లో కుక్కుకొని, కుళ్ళి కుళ్ళి ఏడ్చాడు.

ఎట్లాగయినా వెళ్ళకుండా ఆపాలని - కాళ్ళావేళ్ళా పడి బతిమిలాడిన తల్లి, కంటికి మింటికి ఏకధారగా ఏడ్చిన అన్నయ్య - నానావిధాలుగా నచ్చ జెప్ప ప్రయత్నించిన మేనమామలు - అడవిలోకి వచ్చి అష్టకష్టాలు పడుతున్న భార్యా - కన్న వాళ్ళున్నా అనాథలయిన బిడ్డలు - చుట్టాలు పక్కాలు, స్నేహితులు - అందరూ జ్ఞాపకం వచ్చారు. ఒక్కొక్కళ్ళని తలుచుకొని తలుచుకొని వెక్కివెక్కి ఏడ్చాడు

ఆ రోజు వూళ్ళో మామిడి చెట్టు కింద మొండితనంతో కరడు కట్టిన గుండె కరిగేలా కుమిలి కుమిలి ఏడ్చాడు

గుండెలోని వెలితిపూడేలా పొగిలి పొగిలి ఏడ్చాడు. ఏడ్చి, ఏడ్చి తేరుకొని - ఏడ్చింది తనేనా అని ఆశ్చర్యపోయాడు రామనాథం.

నడిగడ్డ మీదకు వచ్చినప్పటి నుంచీ ఇప్పటి వరకు ప్రతి క్షణాన్ని పునశ్చరణ చేసుకొన్నాడు. జడ్డిగంలోనే మిడత కొట్టి నట్లయింది. గుడ్డెద్దు చేలో పడ్డట్లు వచ్చిన క్షణం నుంచి వళ్ళు విరిచుకొని కష్టపడ్డా మిగిలిన ఫలితమేంటి ? రామనాథం తన అరచేతులు విప్పార్చి చూసుకొన్నాడు.

ఖాళీగా వున్నాయి. కానీ చేసిన కష్టం వాటికి మొద్దుబార్చింది. ముఖం తుడుచుకొని, లేచి నిల్చున్నాడు.

'పట్టు పట్టరాదు పట్టి విడువరాదు. నిజం - తను పట్టుపట్టి వచ్చాడు. మామూలు పట్టు కాదు మొండిపట్టు. సాధించి తీరాలి. ఈ ఇరవై ఎకరాలను సాధించితీరాలి. నల్లరేగడి నడమంత్రాల నడుం విరగకొట్టి తీరాలి - 'పట్టెనేని బిగియ పట్టవలయు'.

ఈ ప్రకృతి తన అందంతో మురిపిస్తుంది. వైపరిత్యాలతో విరుచుకు పడుతుంది. అనుభూతించినా అనుభూతించక పోయినా ప్రకృతి అందాలు సంతరించకోకామానదు. ఎదుర్కొన్నా ఎదుర్కోకపోయినా ప్రకృతి వైపరిత్యాలు సంభవించక మానవు.

ఎవరు గమనించినా గమనించకపోయినా ఒక నియమంతో ఒక నిబద్ధతతో ప్రకృతి తన పని తను చేసుకుపోతుంది. ప్రకృతిలో ఆ నియమ నిబద్ధత నిలిచిపోదు. అది వాస్తవం.

అందాలను ఆనందించే అనుభూతిని ఎలా ఇచ్చిందో వైపరిత్యాలను తట్టుకొనే ఆలోచననీ ప్రకృతి మనిషికి ప్రసాదించింది ఆ శక్తి ప్రకృతిని అర్థం చేసుకొనే క్రమంలోనే ప్రకటితమవుతుంది అందుకే ప్రకృతితో పోరాడాలి. తనలో ప్రకృతి నింపిన ఆ నిగూఢ శక్తులన్నీ ప్రకటితమయ్యేంత వరకూ పోరాడాలి.

'పట్టి విడుట కన్నా బరగ చచ్చుట మేలు ! ' రామనాధం ఒక నూతనశక్తితో తన నిర్ణయాన్ని నింపుకున్నాడు.

"ఏం పుట్టి మునిగిందని ఊరికే అనుకోవడం ! ఈ పంటపోతే మరో మూడు నెల్లకో ఆరునెల్లకో మరో పంట ! " సావిత్రి ఎప్పుడు వచ్చిందో కానీ రామనాధం పక్కగా వచ్చి అంది.

రామనాధం సావిత్రి వైపు విచిత్రంగా చూసాడు



ఉరుకులు పెడుతూ ఉత్తరకార్తె వచ్చింది.

జొన్నచేలు జవజవలాడుతూ ఎదిగిపోయాయి. పాలకంకులు పోటీలు పడుతూ నవ్వాయి

సవారి జొన్న చేను మధ్య మంచె కట్టాడు

వడిసెలవారు తెగిందేమో చూసుకొని సరిచేసుకొన్నాడు.

రెండు పొడవాటి కర్రలు తీసుకొచ్చాడు. ఒకటి నిలువుగా మరొకటి అడ్డంగా కట్టాడు. ఓటికుండను తలగా అమర్చాడు. సున్నంతో కళ్ళముక్కు తీర్చాడు గడ్డితో వళ్ళు నింపాడు. రామనాధం పాత లాల్చీ తొడిగి, ముస్తాబు చేసాడు. దిష్టి బొమ్మలు తయారు అయ్యాయి.

జొన్నచేలో అటొకటి ఇటొకటి నిలబెట్టాడు.

దిష్టిబొమ్మలు మీసాలు మెలేసుకుంటూ పక్షుల్ని బెదిరించాయి.

అటూ ఇటూగా సావిత్రి నాటిన విత్తనాలన్నీ మొలకెత్తాయి.

మొక్కలకు పాదులు తవ్వుకోనూ, గొప్పులు పోసుకోనూ, సావిత్రికి చేతి నిండా పని.

సవారి కూతురు సావిత్రి సాయానికి వస్తోంది.

పేడకళ్ళు ఎత్తి - చావిడి వూడ్చుకొని - గేదెకు దూడకు కుడితి పెట్టి దాణాపెట్టి పాలు పిండడంలో పొద్దే తెలవడం లేదు.

రామనాధం అప్పుడప్పుడు సావిత్రిని ఆటలు పట్టించడానికి - సవారి మేకపిల్లను సావిత్రి మొక్కల మీదకు ఉసిగొల్పేవాడు. పైనుంచి సవారి కూతురికి "బుజ్జిమేక బుజ్జిమేక ఏడకెళ్ళితివి ? - రాణిగారి తోట సాగసు చూసి వస్తివా ? " అంటూ పాటలు నేర్పేవాడు

సావిత్రి ఉక్రోషంతో - "రాజుగారి పంట చేను మేసిరా తల్లీ " అంటూ ఓ మంద చేత బుచ్చుకొని మేకపిల్ల వెంట పడేది.

సవారి కూతురు, రామనాథం పకపకలాడేవారు.

సావిత్రి నాటిన మునగచెట్టు చకచక ఎదిగిపోతోంది. తీగ కూర గాయలన్నీ పందిళ్ళు వెతుక్కుంటున్నాయి

సావిత్రి దొండ తీగను ఇంటికప్పు మీదికి పాకించింది.

కాకరను దడిమీదకి అల్లించింది. బీర, దోస, గుమ్మడి తీగల్ని గట్ల మీదకు వదిలేసింది. సొర, పొట్ల, చిక్కుడు తీగలు పందిళ్ళు మీద కుదురుకున్నాయి.

అందంగా అల్లుకున్న తీగల మీది పచ్చని ఆకుల మధ్య లేత ఎరుపు చిక్కుడు పూలు, తెల్లటి తెలుపు సొరపూలు, ముదురు పసుపు గుమ్మడి పూలు మనోహరంగా విరిసాయి

కొన్ని పూలు అప్పుడే పిందెలుగా తొంగి చూస్తున్నాయి. లేతపిందెలను పలకరిస్తూ వంగ పూలు నవ్వుతున్నాయి. మునగచెట్టు ముచ్చటగా పూత పూసింది.

కారబ్బంతులు, కనకాంబరాలు, సీతమ్మ వారి జడ బంతులు - మొగ్గలు తొడిగాయి.

సావిత్రికి నవనవలాడుతూ కళ్ళకు ఇంపుగా వున్న వంకాయల్ని చూసినపుడల్లా గుత్తి వంకాయకూర వండమని మారాం చేసే అనూరాధ జ్ఞాపకం వస్తోంది. బెండకాయ వేపుడు సుధాకరానికి ఇష్టమైతే శివుడికి సొరకాయ పాలకూర ఇష్టం కల్యాణికి కాకరగాయ కూర అంటే మహాప్రీతి.

ఏదో ఓ రోజున పిల్లలంతా అక్కడికి వచ్చేస్తారని - తను పెంచుకున్న మొక్కల మధ్య సంబరంగా తిరుగుతూ గెంతులు వేస్తారని - ఆడపిల్లలు పూలన్నీ మాలలు కట్టి - తలలో తురుముకుంటారనీ సావిత్రి భావిస్తోంది.

ఆ భావనే ఆమెని ఆ మొక్కల మీద మరింత శ్రద్ధను, ఆమెకు తెలియకుండానే అంతులేని అప్యాయాన్ని కలిగించడానికి దోహదపడింది.

ఆ రోజు తొలిపొద్దులో పాదుల్లో నీళ్ళు పోస్తూ వుంది సావిత్రి. పొలాలలో నీరు కట్టిన మళ్ళల్లో పకపకలాడుతోన్న పాలకంకుల మీదుగా బద్ధకంగా వళ్ళు విరుచుకుంటూ లేచి వస్తోన్న నారింజ రంగు సూర్యుడు ఆమెను కట్టివేసాడు.

ఆకాశంలో మేఘాలు రాత్రి నలుపును విదిల్చుకొంటూ పగలు రంగులు అద్దు కుంటున్నాయి. తెల్లని కొంగలు అప్పుడే లేచి - పైర గాలికి పచ్చని అలలుగా సాగుతోన్న పంట చేలపైకి విహారానికి బయలుదేరాయి.

తూర్పున విరిసిన నారింజ రంగు పడమరన నీలానికి తిరుగుతోంది. ఆ రెండు దిక్కుల నడుమ ఎన్నెన్ని వన్నెలో ఎన్నెన్ని చిన్నెలో ! ఎన్ని కన్నులున్నా అన్ని చాయలు చూడను కొరతే !

సావిత్రి మొక్క మొదట్లో నీళ్ళు పోసి, మొక్కల మీదా నీరు చిలకరించింది. ఆకుల మీది నీటి బిందువులు పచ్చల్లా మెరిసాయి. చిక్కుడు పూల మీది నీటి బిందువులు పొదిగిన కెంపులయ్యాయి. సొరపూలు మీది నీటి బిందువులు వజ్రాల్లా మిరుమిట్లు గొలిపాయి. మునగపూల మీది నీటి బిందువులు మంచి ముత్యాల్లా మిలిమిలలాడాయి గుమ్మడి పూలమీది నీటి బిందువులు పొంగు బంగారమై కళ్ళు చెదిర్చాయి.

సావిత్రి మనసు పరవశించింది. హృదయం పులకరించింది తన్మయత్వంలో గొంతు విప్పింది.

"పుట్టేటి భానుడా పుష్యరాగపు చాయశ్రీ సూర్యనారాయణ !
పుష్యరాగము మీద పొంగు బంగరు చాయ ,,
జామెక్కిభానుడా జాజి పూవుల ఛాయ ,,
జాజి పూవుల మీద సంపెంగ పువు చాయ ,,

గట్టు మీద కూర్చుని నాగళ్ళకు పట్టెడలు బిగిస్తున్న రామనాధం సావిత్రి పాట విని తలెత్తి చూసాడు.

సావిత్రి దీక్షగా తన పని తను కొనసాగిస్తూ పాట పాడుకొంటోంది. ప్రకృతిలో మమేకం చెందిన సంతృప్తితో మిలమిల మెరుస్తున్న ఆమెకళ్ళతో - ఆమె ముఖానికి నారింజరంగు అద్దిన సూర్యకిరణాలు పోటీ పడుతున్నాయి

ఆమె అరచేతి మీదుగా పాదులోకి పారుతోన్న కడవలోని నీరు సూర్యకిరణాలు ప్రతి ఫలించి ఇంధ్రధనుసులు సృష్టిస్తోంది.

'సావిత్రి ముఖంలో ఎంత సంతోషం !' రామనాధం సంభ్రమంతో ఆమె వంకె చూస్తూ వుండి పోయాడు.

"మధ్యాహ్న భానుడా మల్లెపూవుల చాయ శ్రీ సూర్యనారాయణ !
మల్లెపూవుల మీద మంచి వజ్రపు చాయ ,,
ముద్జాముల భానుడా మునగ పూవుల చాయ ,,
మునగపువ్వుల మీద ముత్యాలపాడి చాయ ,,

'అబ్బ ఏం పోలిక సావిత్రిది ! పుష్యరాగం మీద పొంగుబంగారమట - మల్లెపూవుల మీద మంచి వజ్రాలంట - మునగ పూవుల మీద ముత్యాల పాడులట !

అవును మరి !

మంచి వజ్రాలైనా మంచి గంధాల గనులతో మనుసులు దోచే మరులు గొలిపే మల్లెపూవుల సాటి అవుతాయా ?

ప్రపంచంలోని సిరులన్నీ పోగేసినా ప్రకృతి ఒడిలో విరిసిన విరుల సిరులతో తూగెనా ?

ప్రకృతి పరిణామంలో ఆకృతి దాల్చిన మనిషికి - ఆకులో ఆకై పూవులో పూవై ఆ ప్రకృతి ఒడిలోనే ఒదిగి పోవాలని ఇమిడిపోవాలని ఇంకిపోవాలని ఎంత ఆశ !

చివురు మొగ్గల్లో అతని జీవితం వికసిస్తుంది. కిసలయాల్లో అతని జీవనం ప్రభవిస్తుంది. నవ పల్లవాల్లో అతని జీవనరాగం వినిపిస్తుంది.

అయినా, సావిత్రి గుర్తించకపోతే సూర్యుడు ఉదయించడం మానుకుంటాడా ? నీలాకాశం రంగులతో సింగారించుకోవడం ఆపివేస్తుందా ?'

రామనాథం సావిత్రి వైపు చూసాడు. సావిత్రి గుమ్మడి తీగపైని పసుపు పచ్చ పూలను ఆకుల పైకి సర్దుతూ మునివేళ్ళతో తడుముతూ పాడుకుంటోంది.

"కుంగేటి భానుడా గుమ్మడి పూఛాయ శ్రీ సూర్యనారాయణ !
గుమ్మడి పువు మీద కుంకుమ పూఛాయ ,,
ఆయురారోగ్యములు ఐశ్వర్యముల నిమ్ము ,,
ఆయురారోగ్యములు ఐశ్వర్యముల నిమ్ము శ్రీ సూర్యనారాయణ !"

రామనాథం ఉలిక్కిపడ్డాడు. 'సావిత్రిలో స్వార్ధచింతనా ? ఎందుకు ఉండకూడదూ ? సావిత్రి మాత్రం మనిషి కాదూ ? తనకు ధనధాన్యాలు కావాలనీ భోగభాగ్యాలు కావాలనీ సర్వ సౌఖ్యాలు కావాలనీ ఆయురారోగ్యాలు కావాలనీ ఏ మనిషి కోరుకోడు ? మనిషి తాపత్రయమంతా సుఖమయ జీవనం కోసమేకాదూ ? అక్కడికి తను మాత్రం - ఎందుకుఇంత దూరం వచ్చాడు ఈగలు ముసిరే అడవిలో రెక్కలు ముక్కలు చేసుకొంటుంది ఎందుకు ? స్వహితం కోసం కాదూ ? నిజమే - ఇబ్బంది పడకుండా బతకాలని - తన కుటుంబం, తన కుటుంబంతో పాటు తనూ !కానీ ఓ తల్లి ఓ తండ్రి తనబిడ్డలు బాగు పడాలని కోరుకోవడం స్వార్ధచింతనా ? స్వహితమా ? తనే బాగుపడాలని తల్లి ఆశిస్తుందా ? తను నశించినా తన బిడ్డలు బాగుపడాలని కదా తల్లి ఆశ. అవును తన బాగుపడాలని ఆశించడం స్వహితం అయితే, తనే బాగుపడాలని ఆశించడం స్వార్ధచింత. మరి తనది స్వహితమా ? స్వార్ధచింతా ? ప్రయాణం మొదట్లో వున్నాడు - ఏ చింత అయినా ఇప్పుడు తనకి ఒకటే - చేసిన అప్పు తడిపి మోపుడు భారం కాకముందే కోరి మెడకు తగిలించుకున్న గుదిబండను వదిలించు కోవాలి ! అంతే !

ఇంతకీ, సావిత్రిది స్వహితమా ? స్వార్ధచింతనా ?'

రామనాథం ప్రశ్నార్ధకంగా సావిత్రి వైపు చూసాడు.

సావిత్రి అప్పటికే కడవతో సహా గడప దాటేసింది.

❋ ❋ ❋

వరి చేలో పంట పోయింది.

జొన్న చేను కోతలు అయ్యీ అవకముందే - కొత్త ధాన్యం పరిమళించిందో ఏమో కమ్మరి, వడ్రంగి, కుమ్మరి అందరూ వచ్చారు.

అందరికీ కల్లాంలోనే గింజలు కొలవాల్సి వచ్చింది

సవారి తన వంతు గింజలు కొలిపించుకున్నాడు అవి తీసుకెళ్ళి మామ ఓలి కింద చెల్లు బెట్టి వచ్చాడు.

ఇక మిగిలిన దిగుబడి ఎంతో దానిలో రాబోయే రాబడి ఎంతో రామనాధానికి స్పష్టంగా తెలుస్తోంది

మిగిలిన ధాన్యాన్ని దస్తగిరి పెబ్బేరు సంతలో అమ్ముకువచ్చాడు. నష్టం ! తీవ్ర నష్టం !

రామనాధం వచ్చిన డబ్బును కాస్తా ఎరువుల కోసం క్రిమిసంహారక మందులు కోసం ఎరువుల కొట్లో చేసిన బాకీ కింద చెల్లేసాడు ఇంకా తీర్చాల్సిన బాకీ వుంది.

రామనాధానికి ఏం చేయాలో తోచడం లేదు.

ఇవ్వన్నీ ఒక ఎత్తు పై పంటకు పెట్టుబడి ఒక ఎత్తు.

అవన్నీ అలా వుంచినా - అక్కడ తమ ఊళ్ళో - తన అన్నయ్య రత్తయ్యను ధిక్కరించి షావుకారు దగ్గర చేసిన అప్పు ఒక ఎత్తు.

రత్తయ్య ఎంత లేమిలో వున్నా ఎంత కష్టంలో వున్నా తమ మర్యాదకు మచ్చపడకుండా మాట రానీయకుండా నెగ్గుకొస్తున్నాడు.

ఇది అక్కడకూడా పంట చేతికి వచ్చే సమయం.

డబ్బు చెల్లించమని ఆ షావుకారు ఇంటిమీదికి వచ్చి కూర్చున్నాడో ఏమో - ఛ - అన్నయ్యను కూడా ఇబ్బందిలో పడేసాడే - '

రామనాధం ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు. వెంటనే బాలయ్య దగ్గరకు బయల్దేరాడు. 'ఇక్కడ మాత్రం ఎవరో ఒకరు డబ్బు సాయం చేసేవారు ఉండకపోతారా ?'

"దుడ్లు గావాల్నంటే ఈడ మిత్తికైతే ఇస్తరు. వడ్లు గావాల్నంటే నాగుకి తీస్కోవాలె - "

"మిత్తి అంటే ? "

" ఏదన్న కుదవ పెట్కోని దుడ్లు ఇస్తరు. నూరు కింత మిత్తి కింద జమ చేసి ఇయ్యాలే - "

"వడ్డీ లాగానే నన్నమాట. కానీ, ఏం కుదవ పెడతాం ? "

"ఏమైన పెట్టొచ్చు. సొమ్ములు గిట్లలేవా ? "

' ఛ - ఆడవారి వంటిమీది నగలు ఆశించడమే - ? ' రామనాధానికి ఏదోలా అనిపించింది.

"పొలం పెట్టుకుంటారా ? "

"అడుగుదం - "

"మరి నాగు అంటే ఏంటి ? "

"ఎన్ని బస్తాల గింజలు కావాల్నంటే ఇస్తరు పంట వచ్చినంక బస్తాకి గింతని గింజలు ఏసి ఇయ్యాలే - "

"రైతులు ధాన్యం తీసుకోవడం ఏవిటీ ? "

" ఏం జేస్తరు ? పంట లెల్లేద్ది కనాకష్టం. ఎల్లినపంట ఖర్చుల కెళితే మస్తు. ఎట్లనన్న కడుపు నింపాలెగాని పాణం ఇడసలేం గాదే ? అందుకే గాదు సేద్యగాండ్లు గిట్ల నాగుతీస్కోనేద్ది. చెల్లుబెట్టనోళ్ళు బేగారోల్లయితరు. నా ఎర్కల సేన్లు చెల్లుబెట్టి నోళ్ళున్నరు. ఏం జేస్తరు ?"

రామనాథం తలాడించాడు.

"దుడ్లు గావాల్నంటె మిత్తి తీస్కో నాగుకెందుకు పోతవ్ ? గింజలు నేను కొలుస్త తియ్ - " బాలయ్య చనువుగా అన్నాడు.

" ఇది ఒకరోజు వ్యవహారం కాదు కదా బాలయ్య - కూలీల దగ్గర్నుంచి అందరికీ గింజలు కొలవాల్సిందే - ఒకరికి మానితే ఒకరూరు కొంటరా ? అయినా మీకు మాత్రం పంట చేతికి రావద్దా ?"

రామనాథం ప్రస్తుతానికి షావుకారుకి డబ్బు పంపించాల్సి వుంది. 'మిత్తి' కి కొంత పైకం తీసుకొని ఊరికి మనియార్డరు చేసాడు పై పంట పెట్టుబడికి కొంత పైకం తీసుకొన్నాడు.

కూలీలకు కొలవడానికి, తెల్లజొన్నలు, తినడానికి ఈతగుల్లలు నాగుకి తీసుకొన్నాడు.

మళ్ళీ కొత్త పంటల కాలం వచ్చింది.

ఆ ఏడు వర్షాలు బాగా కురిసాయి.

రామనాథం పిల్లిపెసర వేసి సాధన చేసిన చేలో - ఈత గుల్లలు నాటు పెట్టాడు. మిగిలిన పొలంలో వాము, జొన్న వేసాడు. పంట చేతికొచ్చిన తరువాత కానీ రామనాథానికి మిత్తి, నాగుల ప్రభావమేంటో అర్థం కాలేదు.

గింజలు కల్లాంలో వుండగానే 'నాగు' వసూలు చేసుకోను బండి కట్టుకొని సేటు వచ్చి బైరాయించాడు.

ఆ పంట తనను గట్టెక్కిస్తుందనే రామనాథం ఉత్సాహంగా ఉన్నాడు. రామనాథం నాగుకి ధాన్యం తీసుకున్న నాటికి ఇప్పటికి ధరలు పెరిగాయి. నాగు వసూలుకి పెరిగిన ధరలతో నిమిత్తం లేదు. ఒక బస్తా తీసుకుంటే రెండున్నర బస్తాలు సేటు బండి ఎక్కాయి. రామనాథం తీసుకున్న పది బస్తాల వడ్లకు గాను పాతిక బస్తాలు బండి నెక్కాయి. రామనాథం దిమ్మతిరిగి పోయింది. 'ఇంక ఏం అమ్మాలి ? మిత్తి కింద ఏం చెల్లుబెట్టాలి ? అసలు ఎప్పుడు ఈడేర్చాలి ? మిత్తి పెరిగిపోతుందేమోనని అవసరం వచ్చినపుడల్లా ఓ అర మూట లెక్కన తెచ్చుకున్నాడు. అది తడిచి మోపెడయ్యింది "మిత్తి" "నాగు" ఎవరు పెట్టిన పేర్లో కానీ - మిత్తి మెత్తమెత్తగా కబళించే మృత్యువు. నాగు - నిలువునా కాటేసి నిర్జీవుణ్ణి చేసే కాలనాగు !"

ప్రాణం మీదకు వచ్చినా ఇంక నాగు జోలికి పోరాదని రామనాథం గట్టిగా నిర్ణయించుకొన్నాడు.

'తెలిసి తెలియక చేసిన పని మళ్ళీ తనకు తెలిసిన వాళ్ళెవరిని కూడా ఆ నాగు బారిన పడనివ్వకూడదు - ఏదైతే అది అవుతుందని నాగు వరకూ పూర్తిగా చెల్లు బెట్టేసాడు - మిత్తి కింద మరికొంత డబ్బు తీసుకొని తమ ఊరి షావుకారు గారి రెండో చెల్లింపు కింద డబ్బు అన్నకు పంపాడు షావుకారు గారి అసలు వడ్డీ తగ్గుతున్న కొద్దీ ఇక్కడి మిత్తి పెరుగుతోంది పంట పంటకు ఎక్కువ పొలం సాగులోకి తేవాలని రామనాథం పట్టుదలగా వున్నాడు

రామనాథం శాయశక్తులు రేగడి మీద పోరాటంకై నిమగ్నం చేసాడు ఓడిపోకూడదన్న పట్టుదల - వెనక్కి మళ్ళి వెళ్ళ కూడదన్న పట్టుదల - రేగడిని గెలిచి తీరాలన్న పట్టుదల - రైతుగా నిలదొక్కుకోవాలన్న పట్టుదల !'

❋ ❋ ❋

ఆ రోజు ఆదివారం

దుబ్బు లాగా పెరిగి మాసిన తలను తడుముకున్నాడు రామనాథం. క్షవరం చేయించుకోను బొంకూరుకు బయలుదేరాడు.

పొలంగట్ల మీదుగా నడుస్తూ పొలం చూస్తూ అనుకొన్నాడు. 'మురిపించినట్టే మురిపించి ఎంత దెబ్బ తీసింది' ! పొలం దగ్గర వాగుకు అడ్డం పడి - డొంక దారి పట్టాడు.

"ఏవయ్యోయ్ .... ! " ఎవరో పిలవడంతో ఆగాడు.

హనుమచ్ఛాస్త్రిగారు. అక్కడ అందరూ పంతులు అని పిలుస్తూంటారు.

"నమస్కారం పంతులుగారూ .. ఎక్కడికి ఇలా బయలుదేరారు ? " పంతులుగారిని చూస్తూ అన్నాడు రామనాథం

"ఆయుష్మాన్ భవ ! " అక్కడినుంచే ఆశీర్వదిస్తూ - ఆయాసంగా నెమ్మదిగా నడుస్తూ దగ్గరికి వచ్చారు పంతులుగారు "అసలు పుల్లూరుకు ప్రయాణం, నశ్యం నిండుకొంది. దారేకదా బొంకూరు సంతలో ఒక పొగాకు కాడ తీసుకొని - అటు నుంచి వాగు వాలుగా పుల్లూరుకు పోవాలని యోచన. నీవెక్కడికి ? " పంతులుగారు పైన కప్పుకున్న ఉత్తరీయాన్ని సవరించుకొంటూ అన్నాడు.

"నేనూ బొంకూరికే - పదండి వెళదాం "

చాలాకాలంగా పంతులుగారు రామనాథాన్ని కలవాలనే అనుకొంటున్నారు. రామనాథం కొన్న చేను పక్కనే పంతులుగారి పొలం వుంది. ఆయన దానిని మగతాకు ఇచ్చాడు. పంట సరిగ్గా పండడం లేదని ఏనాడు వాళ్ళు సరిగ్గా కౌలు తాలుకు ధాన్యం చెల్లించరు. పంతులుగారు ఏనాడూ పొలంలోకి దిగినవాడు కాడు.

"నరసింహం దొరకు ఎక్రాకు వెయ్యి రూపాయలిచ్చినారట నిజమేనా ? "

"అవునండి "

"ఈ ఏడాది పంట ఎట్లున్నది ? "

"మాయదారి ఎలుకలొచ్చి పడి చేతికందిన పంట నాశనం చేసాయండి - మంచి దిగుబడి వస్తుందనుకొన్నా - ఏమైనా రేగడిలో వ్యవసాయం సులభం కాదండి. ఇక మాఘిజొన్నకు నాట్లు వేయాలి "

"ఈ నడిగడ్డ వుంది చూసావ్ .. అందినట్టే అంది జారిపోతుంది. మురిపించినట్టే మురిపించి ముంచిపోతుంది. పెద్ద ముండా వాణ్ణి ఎన్ని చూసానో " పండిన తలను తడుముకొంటూ అన్నారు పంతులుగారు.

వంగి దారి కడ్డంగా పడివున్న ముళ్ళకంచెను పక్కకు తీస్తూ రామనాధం నిజమేనన్నట్లు తలాడించాడు.

పంతులుగారు పట్టుమని పది అడుగులు వేయకుండానే ఆగి చుట్టూ చూస్తూ అన్నారు, "ఈ నడిగడ్డ వుంది చూసావ్ - కాకతీయుల కాలంలో ఎలాంటి వెలుగు వెలిగిందో కానీ - ఆ తరువాత ఇటు నుంచి విజయనగర చక్రవర్తులు అటునుంచి బహమనీ సుల్తానులు. వారిరువురి వైరంలో మూడు శతాబ్దాల పాటు ఈగడ్డ - వీరరక్తంలో తడిసి తానమాడింది.

అలంపురం ఆలయంలో రాయలవారు సుల్తాన్‌ల ఆక్రమణను ఆపడానికి కట్టిన గోడ ఇంకా అలాగే వుంది. చూసావ్ ... ? ఈ సారం గల సీమ - దో ఆబ్ - కోసం ఎన్ని యుద్ధాలు జరిగాయని .... ! కుదురుగా సేద్యం చేసుకొనే భాగ్యం ఈగడ్డ మీది రైతును లేకపోయె ఇది రైతు గడ్డ కాదు పోతుగడ్డ ! "

" నిజమేనండి. ఈనాటికీ ఇక్కడి రైతు క్షణం క్షణం యుద్ధం చేయ్యాల్సిందే ? "

"అక్కడికి ఆ గద్వాల ప్రభువులు వుండేవారు చూసావ్ ..... ధర్మ ప్రభువులు .. అహా .. ఆ శోభ ... ఆ వైభోగం ... !

నాణెంబైన మెఱుంగు కబ్బములతో నవ్యాకృతుల్

వాఙ్మయ శ్రేణిందీర్చిన సత్కవీశ్వరులకున్ సేవాప్రదేశంబైన తెలుగు గడ్డలో గద్వాల విద్వద్గద్వాలకదోయ్ ! ఇక అమర చింత సంస్థానం ! తిరుపతి వేంకట కవులను సన్మానించి చరిత్రలో నిలిచి పోయింది కదోయ్ ! "

"అమర చింత అంటే ? "

"మన ఆత్మకూరు వుంది చూసావ్ - అదే అమర చింత. కృష్ణకు ఇద్దరి గద్వాల. అద్దరి అమర చింత. ఇక బోరవెల్లి. వనపర్తి. జటప్రోలు అదే కొల్లాపూర్ సంస్థానాలు .. ఆహా .. ఆ కాలం వుండేది చూసావ్ - సాహిత్య సభలు, శాస్త్రగోష్ఠులు, కవిగాయక సమ్మేళనములు, నృత్యనాటక ప్రదర్శనములు, కవి పండితాదులకు సత్కార సమ్మానములు. ఈ పాలమూరు గుబగుబ

గుబాళించేది కాదూ ?" ఆంధ్ర సంస్థాన వాఙ్మయ చరిత్రలో సువర్ణాక్షరాలతో వ్రాయవలసిన కాలం ! " పంతులుగారు చేయి ఎత్తి ప్రశంసించారు గతకాలం అనుభవాలతో ఆయన ముఖం తేజోవంతమయింది

అదేమిటోగానీ రామనాధం తన మనసులో 'కావ్యకన్యకన్ గూళలకిచ్చి యప్పడుపు కూడు భుజించు కంటె సత్కవుల్‌హాలికులైన నేమి' అని అనుకోకుండా వుండలేక పోయాడు.

పంతులుగారు తన ధోరణిలో తను అన్నారు

"ఏనుగు నెక్కినాము ధరణీంద్రులు మ్రొక్కగ నిక్కినాము" అంటూ ఆంధ్ర దేశమంతటినీ రసవాహినిలో ఓలలాడించిన తిరుపతి వేంకట కవుల రసగుళికల లాంటి ఆపద్యములు పలికినది అమర చింతలోనే". పంతులుగారు గొంతు గద్గదమవుతోండగా అన్నారు -

"బెంచినార మీసలు రెండు బాసలకు మేమే కవీంద్రుల మంచదెల్పగా - "

రామనాధం పంతులుగారిని కుతూహలంగా ఆరా తీసాడు. "పంతులుగారూ - ఇంతకూ మీరు ఆ సంస్థానాలన్నిటినీ స్వయంగా దర్శించారా ? "

"ఆ .. మన గద్వాల ప్రభువులు వుండేవారు చూసావ్ .... ధర్మప్రభువులు - ఈ హనుమచ్ఛాస్త్రి పెట్టిన ముహూర్తమంటే ఎంత గురి అనుకొన్నావ్ ? ఏ మాటకి ఆ మాటే చెప్పుకోవాలి - ధర్మ ప్రభువులు - 'శాస్త్రిగారూ మీరుపెట్టిన ముహూర్తం రామబాణం కద టండీ ' - అనేవారు ప్రతి ఉగాది నాడు ప్రభువుల సమక్షంలో పంచాంగం పఠించడం మా తరతరాల ఆనవాయితీ - "అంటూ పంతులుగారు గుబురు కనుబొమ్మలు ఎగరవేసి రొంటిలో దోపుకొన్న నశ్యంకాయను చేతిలోకి తీసుకొన్నారు.

ఆ నశ్యంకాయ అందమైన వెండి పొన్ను నశ్యంకాయ. చివరి చిటిక నశ్యంను బొటన వేలికి చూపుడు వేలికి మధ్యన వుంచి తనవి తీరా పీల్చుకొన్నారు. వేళ్ళకు అంటిన నశ్యం పొడిని ఉత్తరీయం అంచులకు తుడుచుకొన్నారు.

"మీరు కొన్న పొలం వుందే దానికి తూర్పునే కదా నా పొలం. అది ఆ గద్వాల ప్రభువులు నా నశ్యం ఖర్చులకుగాను దానమిచ్చినది. అది నా నశ్యం చేను".

రామనాధం చాలా ఆసక్తితో తలాడించాడు.

ఇంతలో బొంకూరు వాగు వచ్చేసింది. నీరు నిశ్చలంగా పారుతోంది. పంతులుగారు రామనాధం పంచెలు ఎగకట్టారు.

పంతులుగారు లోతు తక్కువగా వున్న వైపు నీళ్ళల్లోకి దిగారు.

చీల మండలు మునిగి - పిక్కలను ముంచి - మోకాళ్ళ పై దాకా వచ్చాయి వాగు నీళ్ళు కాలు తీసి కాలు వేస్తుంటే చల్లని నీరు కాళ్ళని కోసుకుపోతున్నట్లు తన పాటికి తను ముందుకు పారుతోంది. అడుగు తీసిన చోట అడుగువేసిన చోట బురద పైకి లేచి వాగు నీటిని మురికి చేస్తోంది. వాగునీరు తొడల దాకా వచ్చింది

ఇంతలో సంతకు వెళుతున్న అతనొకడు భుజాల మీద మేకను ఎక్కించు కొని ముల్లు కర్రను నీళ్ళ అడుగు ఇసుకలో గుచ్చుతూ - దాని సాయంతో చకచకా వాగు దాటుతున్నాడు. ఆ వేగంలో అతను పంతులుగారికి చెయ్యంత దూరంలోకి వచ్చాడు.

"ఒరే త్రాష్టుడా ! ఆగరా ! దగ్గరికి రామాక ! నీకు తోడు నీ నెత్తిన ఆ మేకముండ కూడానా ! పింజారీ వెధవ - ఎదురుగా మనిషి వున్నాడన్నది చూసుకోవద్దా ? " పంతులుగారు నీళ్ళల్లో నిలబడి గట్టిగా అరిచారు.

మేకను మోసుకెళుతున్న తను ఏమీ చలించలేదు. పంతులుగారి కోపాన్ని పట్టించుకోనట్టు తన పాటికి తను పోబోయాడు.

కోపంతో వూగిపోతున్న పంతులుగారు గబగబ వాగునీటిలో రెండు అడుగులు వేయబోయి - ముందుకు తొట్రు పడ్డారు. మేక ఆసామి గబుక్కున కదిలి పంతులుగారికి చేయి అందించబోయి - విరమించుకొని - ముల్లు కర్రను ముందుకు చాచాడు.

పంతులుగారు కర్రను పట్టుకొని నిలదొక్కుకొన్నారు. ముల్లుగర్రను విసిరినట్టు మేక ఆసామి వైపు నెట్టి ముందుకు నడిచారు.

ఆ విసిరిన వేగానికి మేక ఆసామి నీళ్ళల్లో వెల్లకిలా పడబోయాడు. వెనుక నుంచి రామనాథం గబుక్కున అతని భుజాలు పట్టుకొని ఆపాడు. కిందకు జారిన మేకను అతని భుజాన కుదురుగా కూర్చోబెట్టాడు.

మేక ఆసామి రామనాథాన్ని చూసి నోరంతా తెరిచి నవ్వాడు. ఏమీ మాట్లాడకుండానే గబగబ వాగు దాటేసి అతను వెళ్ళిపోయాడు.

పంచలు తడవకుండా వాగుదాటాలన్న రామనాథం, పంతులగార్ల ప్రయత్నం ఫలించలేదు. అందులోనూ పంతులుగారికి నడుం వరకూ నీళ్ళొచ్చాయి. పంతులుగారు నశ్యం కాయసు గుప్పిటలో భద్రంగా పట్టుకొని - జాగ్రత్తగా అడుగులేస్తూ వాగు దాటారు.

నీళ్ళల్లోంచి రావడంతో తడి కాళ్ళను ఇసుక అంటుకుంది. వాగు ఒడ్డున నిల్చుని పంతులుగారు సంచెకుచ్చిళ్ళ తడి పిండుకున్నారు.

రామనాథం కాల్లో ముల్లు గుచ్చుకుంది. వాగు ఒడ్డున ఓరాయి మీద కూర్చుని నెమ్మదిగా ముల్లు తీసుకొంటూ తనలో తన గొణుక్కున్నాడు.

"పాడుముళ్ళు - కాళ్ళని జల్లెడ చేసేస్తున్నాయి"

ముల్లును జాగ్రత్తగా తీసి దూరంగా విసిరేసాడు.

మళ్ళీ ఇద్దరూ నడక సాగించారు. పంతులుగారు రామనాథాన్ని ఉద్దేశించి అన్నారు "నా నశ్యం చేను కౌలుకు ఇచ్చానా ! నడుం విరగొట్టుకుంటున్నాం నాలుగ్గింజలు రాలలేదని - ఆ అప్రాచర్యపు వెధవలు ఏడిచిచస్తారు. వాళ్ళ శ్రాద్ధం పెట్టా ! నా కౌలు నాకు చెల్లించడానికేం రోగం ? మీరు సత్యం చెప్పండి - ఈ ఏడుగింజలు ఎలా రాలాయేం ? "

"బొటా బొటి - ! అయినా మీకు ఒప్పుకొన్నది ఇవ్వాలిగా పంతులుగారూ - మా నోరు కట్టుకున్నామే కానీ కమ్మరికి, వడ్రంగికి, కుమ్మరికి ఎవరికి మాత్రం కొలవడం మానాం - "

"ధర్మం చెప్పారు ! నా పాలు గింజలు నాకు పంపాలి కదా ? పంపినట్టే వుంది వారి పిండాకూడు ! నా నశ్యం చేనుగట్టు తెగ్గోస్తే మీ పొలంలో పొలం అయిపోతుంది. నలభై ఎకరాల ఏకఖండిక అవుతుంది. ఏమంటారు ? " పంతులుగారు ఆశగా అడిగారు.

రామనాధం ఉలిక్కిపడ్డాడు. "ఎక్కడండీ పంతులుగారూ - ఇప్పటికే పీకల్దాకా మునిగి వున్నాం. నేను కొన్నచేనే పూర్తిగా సాగులోకి పెట్టలేదు. ఈ పంటకు పడ్డ కష్టమంతా వ్యర్థమైపోయింది ఆ కాలువలు వచ్చినట్టే వచ్చి ఆగిపోయె. మళ్ళీ చలికాలంలో మొదలవుతాయో. వేసవి కాలంలో మొదలవుతాయో కాలువ పనులు"

" ఆ ఇచ్చే పాపిష్టి పైకమేదో పొలంలో పంట చేతికొచ్చాక ఇద్దురు. కానీ పొలం తీసుకొంటానని మాటివ్వండి చాలు - పోనీ కౌలు కయినా తీసుకోండి - " పంతులుగారు అభ్యర్థిస్తున్నట్లుగా అన్నారు.

రామనాధం పంతులుగారి వైపు పరిశీలనగా చూసాడు.

పంతులుగారి తెల్లని నూగు గడ్డం చాటున దవడలు పీక్కుపోయి వున్నాయి. కళ్ళులోతున ఎక్కడో వున్నాయి. ఉత్తరీయం మాటున వడలిపోయిన వళ్ళు అస్పష్టంగా కనిపిస్తోంది

రామనాధం నెమ్మదిగా అన్నాడు, "పంతులుగారూ - అలోచించి చెపుతాను".

ఇంతలో బొంకూరు శివార్లకు వచ్చేసారు.

రామనాధం, పంతులుగారు ఊరి రోడ్డు ఎక్కేటప్పటికి దుమ్ము రేపుకుంటూ ఓ వ్యాన్ వచ్చి ఆగింది.

పంతులుగారు ఆ దుమ్ము ఘాటుకు దగ్గుతూ కళ్ళు ముసుకొన్నారు.

రామనాధం రెండుచేతులతో ముఖం మీద దుమ్ము పడకుండా విసురు కొన్నాడు.

ఎక్కవలసిన వాళ్ళు వ్యాన్ చుట్టూ ముసిరారు.

వారి తలల మీదుగా గోతాలు, సంచులు, బుట్టలు, తట్టలు వచ్చి దూరంగా పడ్డాయి. వాటి తాలుకూ మనుషులు దిగారో లేదో కానీ ఎక్కగలిగినంత మందిని ఎక్కించుకొని వెళ్ళిపోయింది వ్యాను. మళ్ళీ దట్టంగా దుమ్ము లేచింది.

పంతులుగారు దగ్గుతూ ఉత్తరీయం ముక్కుకు అడ్డం పెట్టుకొన్నారు.

"ఈ దుమ్ముంది చూసావ్ .... నాకు రొంపపట్టిస్తుంది. ఘాటుగా కషాయం కాచుకొని తాగితే కానీ తగ్గి చావదు - "

"బాబాయ్ ! "

రామనాథం చిరపరిచిత కంఠం విని - భ్రమ పడుతున్నానేమోనని చుట్టు చూసాడు

"బాబాయ్ ! ఒక గెంతుతో శివుడు ప్రత్యక్షమయ్యాడు

రామనాథంకి సంతోషంతో నోటమాట రాలేదు అమాంతం శివుడిని వాటేసుకొన్నాడు ముఖం అంతా విప్పార్చి ఆశ్చర్యంగా అడిగాడు , " అలా చెప్పా పెట్టకుండా వూడి పట్టావేరా ? "

" అక్కడికి నువ్వు మాత్రం ! కనీసం నువ్వు వుండే వూరికి ఎట్లా రావాలో అయినా చెప్పావా ? నువ్వా పంట డబ్బులు పంపిస్తూ రాసిన ఉత్తరం వెనుక రాసిన ఎరువుల కొట్టు అడ్రస్ పట్టుకొని కర్నూలు వచ్చేసా. ఆ కొట్లో గుమాస్తా లేడూ . అదే సన్నగా నల్లగా ముక్కుపురుగులాగా వుంటాడూ. అతనే ఈ వ్యాన్ ఎక్కించి టిక్కెట్ కొట్టించి మరీ వెళ్ళాడు ' ' శివుడు గలగల మాట్లాడుతూ అన్నాడు

"అతను తిరుపాలు. - ఎరువులవీ కొనడానికి వెళ్తుంటాగా ఆ చనువు - అన్నట్లు మాటల్లో పడి మర్చే పోయాను-" రామనాథం పంతులుగారి వైపు తిరిగి అన్నాడు . "పంతులుగారూ - వీడు మా అన్నయ్య గారబ్బాయి - శివుడు !"

శివుడు పంతులుగారికి నమస్కారం చేసాడు.

"చిరంజీవ ! సుఖీభవ ! " పంతులుగారు శివుడిని కుడిచేయి ఎత్తి ఆశీర్వదించారు.

"పుల్లూరుకు అపరాహ్ణం వేళకల్లా చేరుకోవాలి. ఒక్కతూరి వచ్చి నా నశ్యం చేను చూచివెళ్ళండి - మరి నే వస్తా ! " అంటూ పంతులు గారు ఉత్తరీయం సరిగ్గా కప్పుకుంటూ వెళ్ళిపోయారు

రామనాథం ఆయనకు వీడ్కోలు చెప్పి - శివుడి భుజం మీద చేయివేసి అన్నాడు - "అవున్రా శివుడూ - అందరూ బావున్నారా ? అమ్మ ఎలా వుంది ? అన్నయ్య ఎలా వున్నాడు ? "

"అందరూ నిక్షేపంలా వున్నారు. నాయనమ్మే రాములారు వనవాసం ఎళ్ళినట్లు నా రావుడు ఆ అడివికి ఎళ్ళాడమ్మా '- అంటూ అందరి దగ్గర వెళ్ళబోసుకుంటోంది" శివుడు పున్నమ్మ మాటలు అంటూ పున్నమ్మ ఎలా చేసేదో అలాగే అభినయించాడు. మాటలు ముగించి ముక్కు చీదినట్లుగా కూడా అభినయించాడు.

రామనాథం చాలారోజుల తరువాత పకపక నవ్వాడు.

"పదరా శివుడూ - ఆ పక్కకు వెళ్దాం" అంటూ చేతిలో సామాను అందుకొని - రోడ్డుకు అవతల వున్న తుమ్మచెట్టు వైపు నడిచాడు.

తుమ్మచెట్టు కింద వున్న రాయి మీద శివుడుని కూర్చోమని పక్కన సామాను పెట్టాడు.

"తల మాసిందని క్షవరానికి వచ్చా - చిటికలో చేయించుకు వస్తా ఇక్కడే వుండు, ' 'అన్నాడు రామనాథం.

"అదేంటి బాబాయ్ - మనముండే ఊళ్ళో మంగలాడులేడూ ? " శివుడు ఆశ్చర్యంగా అడిగాడు.

"అది మంగలి లేని మహానగరం ! నువ్వూ చూద్దువుగానీ తొందర పడకురా అన్నట్టు నే వచ్చేలోగా, ఇక్కడ ఎవరితోనూ వేళాకోళాలాడకు గొడవలకు దిగకు ఇక్కడి వాళ్ళు ఇస్తే ప్రాణం ఇస్తారు తీస్తే ప్రాణం తీస్తారు జాగ్రత్తరా !"

శివుడు బుద్ధిమంతుడి లాగా తల వూపాడు

సూట్‌కేస్ నిలబెట్టి దానిమీద ఎక్కి కూర్చున్నాడు పెద్ద అల్యూమినియం టిఫిన్‌లో కారప్పూస వుంది మూత తెరుచుకుంటుందేమోనని కొక్కేలు రెండింటిని పురికొస వేసి బిగించింది శాంతమ్మ.

శివుడూ వేళ్ళతో మెల్లి మెల్లిగా మూత ఎత్తి టిఫిన్‌లోంచి కారప్పూస బయటకు తీసాడు కారప్పూస నోట్లో వేసుకొని కరకరలాడిస్తూ చుట్టూ చూసాడు.

అక్కడో వేపచెట్టు ఇక్కడో వేపచెట్టు కనిపిస్తోంది.

రోడ్డుకు ఇరువైపులా కంటికి కనిపించినంత వరకూ తుమ్మచెట్లు వున్నాయి పూతకాలమేమో పసుపు పచ్చని పూలతో కన్నులకింపుగా వున్నాయి. ఆ చెట్ల మధ్యలో నుంచి తట్టను ఎత్తుకోనో మోపును మోసుకొనో చటుక్కున ఎవరో ఒకరు బయటకు వస్తున్నారు

తట్టలు మోసుకొంటూ వచ్చిన వాళ్ళంతా రోడ్డుకు అటూఇటూ చేరుకొంటున్నారు తట్టమీద పరుచుకు వచ్చిన గోనెపట్టాను రోడ్డు వారగా పరచి - తెచ్చిన కూరగాయల్నో పళ్ళనో చక్కగా చిన్నచిన్న కుప్పలుగా అమర్చుతున్నారు.

పిన్నీసులు, పక్క పిన్నులు,మొలతాళ్ళు, కాశీదారాలు అమ్మేవాడు ఓ కర్ర మీద వాటిని వేలాడేసుకొని - ఆ కర్రను భుజాన తాటించుకొని వచ్చాడు. ఎర్రని నల్లని తాళ్ళ మధ్య ఇత్తడి పిన్నీసుల వరుసలు పచ్చగా తళతళలాడు తున్నాయి.

ఒకడు రంగరంగుల రిబ్బన్లు అమ్ముతున్నాడు

గాజులవాడు రంగురంగుల మట్టి గాజుల్ని వరుసలుగా పేరుస్తున్నాడు.

కుంకుమలు అమ్మే ఆవిడ కుంకుమ మూటలకు కట్టిన పురికొసలు విప్పింది ఆ మూటల్లోనే కుంకుమలను రాసులుగాపోస్తుంది. ఎరుపు, సింధూరం, మామిచిగురు రంగు, మంకెన పూరంగు, ముదురు గులాబిరంగు, లేతగులాబీరంగు, కెంపురంగు, వక్కరంగు ల కుంకుమల రాసులు ఎక్కువవుతోన్న ఎండలో అందాలు చిందిస్తున్నాయి వాటిలో కలిపిన మెరుపు - అప్పుడప్పుడూ తళుక్కుమంటోంది.

కుమ్మరి ఓ పక్కగా తన బండి ఆపి, బండి పక్కనే తన కుండలు పేరుస్తున్నాడు. బానలు, కుండలు, కడవలు, పిడతలు, ముంతలు, చట్లు, మూకుళ్ళు - ఎర్రగా కాలినవి - నల్లటివి. గడ్డివేసి చక్కగా ఒకదానిమీద ఒకటి పేర్చుతున్నాడు

ఆ పక్కనే కుండల కిందికి ఈతాకు కుదుళ్ళు అమ్ముతుందొకామె బొంగులు, వాసాలు అమ్మేవాళ్ళు - వాటినే చీల్చి తడికలు బుట్టలు అల్లుతూ అమ్ముతున్నారు.

ఈ తాకుల చాపటు అల్లుతూ - అల్లినవి అల్లినట్టే చుట్ట చుట్టి బేరానికి పెడుతూన్నారు ఒకరు

పచ్చిమిరపకాయ బజ్జీలు, పునుగులు, జిలేబి చుట్టలు - వండడం మొదలు పెట్టినట్లున్నారు. వాటి వాసనలు కలగలసి నెమ్మదిగా గాలిలో తేలి వస్తోంది.

చూస్తుండగానే కొనేవాళ్లు వచ్చారు.

తమాషా ఏమిటంటే కుండలు అమ్మినవాడు ఆ పైకంతో కోళ్ళు బేరమాడను వెళ్తున్నాడు.

మొగుడు తడికలమ్ముతుంటే సొమ్ము తను తీసుకొని ఉప్పులు పప్పులు కొంటుందొకామె.

కూరగాయలు తూస్తూనే పిన్నీసులు బేరం చేస్తుందొకామె.

చక చక సందడి హెచ్చింది సంతగోల వచ్చింది.

ఇంతలో రామనాథం వచ్చాడు. తలను అంట కత్తెర వేయించుకున్నాడు మళ్ళీ రెండు మూడు నెలలు క్షవరంతో పనిలేదు.

శివుడి సూట్‌కేస్, ట్రంకుపెట్టె, పిండి వంటలున్న టిఫిన్లు, పళ్ళు కూరగాయలు వున్న తాటాకు బుట్టలు - రామనాథం, శివుడు చెరి కొన్ని తీసుకొని ఇంటి దారి పట్టారు.

శివుడికి కొత్తవూరికి వచ్చినందుకు మహాసరదాగా వుంది. శివుడు వాగు దాటేప్పుడు ఓ తుమ్మ మండతో నీటిపై రాస్తూ నడిచాడు. వాగు దాటి కాస్త దూరం వెళ్ళగానే ఓ మేకల మంద అడ్డొచ్చింది. మేక పిల్లల్ని నిమురుతూ - మేకల మంద మధ్యగా దారి చేసుకొంటూ - అరుస్తూ - పరుగులు తీసాడు.

"మేకలు బెదిరిపోతాయ్ ... ఆగరా ... "అంటూ రామనాథం అంగలు పంగలేసుకుంటూ శివుడిని వెంబడించాడు.

ఆమడదూరం పరిగెత్తే సరికి శివుడి పని అయిపోయింది. సూట్‌కేస్ కింద పెట్టి దానిమీద కూర్చుని అలుపు తీర్చుకొన్నాడు.

"అయ్యిందీ అబ్బాయిగారి పని ! పద పద ! " రామనాథం నవ్వుతూ శివుడి రెక్కపుచ్చుకు లేపాడు.

శివుడ కాలుకదపకుండా రామనాథాన్ని కూడా నిలవేసాడు. ఇంతలో ఎవరిదో బండి వస్తూ కనిపించింది, రామనాథాన్ని చూసి - వాళ్ళ దగ్గరికి రాగానే బండి ఆపారు.

అది బాలయ్యగారి బండి.

"ఎక్కట్రి ... ఎక్కట్రి ... " బాలయ్య తొందర చేసాడు.

శివుడు సామానంతా బండి జల్లలో పడేసి - చటుక్కున ఎక్కి, కాళ్ళు కిందకి వేళ్ళాడేసి కూర్చున్నాడు.

రామనాథం బాలయ్య పక్కన కూర్చున్నాడు

శివుడిని పరిచయం చేసాక - రామనాథం పంతులుగారిని కలిసిన విషయం బాలయ్యతో చెప్పాడు.

“అవ్ . పంతులు నాతోన గూడా ఈ ముచ్చట చెప్పిండు ఆ కౌలుగాళ్ళు పంతుల్ని మస్తుగ పరేషాన్ చేస్తుండ్రు[1] - దొర చేనుకు ఎక్రాకు పదినూర్లు పెట్టవి - ఇక్కడ నాలుగు నూర్లు - లేకుంటే అయిదు నూర్లు - అదే పంతులు ఆశ పంతులుకు వేరే బేరం పోయినా బేకని[2] తిప్పి కొడుతుండు - ” అన్నాడు బాలయ్య. “సూడుండ్రి - కొనేడ్డి ఎనక సిక్కి ! ”

డొంక దగ్గర వాళ్ళని దించి బండి బాలయ్య వాళ్ళ ఊరు వైపు మళ్ళింది

శివుడు బద్దకంగా సామాను అందుకొంటూ అన్నాడు

“ఇంకా ఎంత దూరం పోవాలి బాబాయ్ . ? ”

“అప్పుడే ఎక్కడ ? పద పద . ”

చేలన్నీ రెండో పంటకు సిద్ధపడుతున్నాయి జొన్నపొలాల్లో చొప్పలు గూడు కట్టి వున్నాయి. కోసేసిన వరి దుబ్బులు ఇంకా పొలాన్నే వున్నాయి అక్కడక్కడ పొగాకు తోరణాలు కట్టి ఆరబెట్టి వున్నాయి.

ఎటు చూసినా తుమ్మచెట్లు - దేశీ తుమ్మలు - ఫిరంగి తుమ్మలు - నల్ల తుమ్మలు, కత్ర తుమ్మలు, తెల్ల తుమ్మలు - !

తుమ్మమొక్కలు, తుమ్మ పొదలు, తుమ్మ గుబుర్లు - తుమ్మ మానులు - దారంతా రాలిన తుమ్మపూలు - తుమ్మ ముళ్ళు - ఎండిన తుమ్మకాయలు.

శివుడు ఆశ్చర్యంగా అన్నాడు, “బాబాయ్ ఏంటిదీ? ఎక్కడ చూసినా తుమ్మచెట్లు ! ఇది అడవి దేశం కాదు బాబాయ్ - తుమ్మ దేశం ! ”

“అందుకో కారణం వుంది - వూహించు చూద్దాం !” రామనాథం శివుడికి సవాలు విసిరాడు.

కాసేపు ఆలోచించి ఏమీ తట్టక తల విదిలిస్తూ అన్నాడు శివుడు “నువ్వే చెప్పు బాబాయ్ ! ”

“మనం వాగు దాటాక మేకల మంద దాటాం గుర్తుందా ? మేకల్ని ఎదుర్కొనే మొండి చెట్టు తుమ్మ చెట్టే. వెనకటి కోసారి - చెట్ల మహాసభ జరిగిందట. అందులో అన్ని చెట్లు మహాగొప్పలు పోతూ విర్రవీగుతోంటే - తుమ్మచెట్టు లేచి, ‘తుక్కుచెట్లు మీరంతా మేకను చూస్తేనే దడిసి కేకలు వేసి బావురు మంటారు’ అంటూ వారి గర్వం అణిచిందట ! ” రామనాథం ఆ చెట్ల మహాసభలో తనూ కూర్చుని చూసినంత నమ్మకంగా చెప్పాడు

---

1 విసిగిస్తున్నారు 2 కావాలని

శివుడు నవ్వాడు

"అదుగో శివుడూ వచ్చేసాం - దూరాన పెద్ద తుమ్మ చెట్టు కనిపిస్తోందే అక్కడే మన యిల్లు ! "

శివుడు హతాశుడై పోయాడు

అక్కడ కనుచూపు మేరా ఎక్కడా మనిషి వున్న జాడలేదు పక్షుల అరుపులు తప్పించి - చెవులు పొడుచుకొన్నా మరోశబ్దం వినిపించడం లేదు చుట్టూ పొలాలన్నీ కూడా సాగు చేస్తున్నట్లు లేవు. బీళ్ళ లాగా వున్నాయి పిచ్చి చెట్లు పెరిగి వున్నాయి

'ఇది అడవి, నిజంగా అడవి.

తుమ్మలు, జిల్లేళ్ళు, జెముళ్ళు - ఉమ్మెత్తలు, తంగేడులు - వీటి మధ్య బతకడమా?'

శివుడి మనసులో మాట తెలిసినట్లుగా అన్నాడు రామనాథం, "మన వూళ్ళో మాత్రం మాసూలు చేసేటప్పుడు కల్లాం దగ్గర వుండమట్రా శివుడూ - అట్లాగే ఇక్కడాను ! అలవాటు అయిందంటే వదిలి వెళ్ళలేం, పదరా - "

'తమ వూళ్ళో మాసూలు చేసేటప్పుడు కల్లాం దగ్గర వున్నా కూతవేటు దూరంలో మరో కల్లాం వుంటుంది వెయ్యికి పైగా గడపలున్న వూరు ఆశ్రమం, హైస్కూలు, లైబ్రరీ, పాలకేంద్రం పోస్టాఫీసు తమ వూరికీ ఈ అడవిలోని ఒంటి గుడిసెకూ సాపత్యమా ? '

శివుడు ఏమీ మట్లాడకుండా రామనాథాన్ని అనుసరించాడు.

రామనాథం ఇంటిని సమీపించగానే ఎక్కడున్నాడో ఏమో నవారి పరిగెత్తుకొచ్చి సామాను అందుకొన్నాడు

రామనాథం ఇంట్లోకి చూస్తూ గట్టిగా కేక వేసాడు

"సావిత్రీ - ఇలా చూడు ఎవరొచ్చారో ! "

పొయ్యి దగ్గర ఏదో చేస్తున్న సావిత్రి కొంగుకు చేతులు తుడుచుకుంటు బయటకు వచ్చింది. ' ఈ వేళప్పుడు వచ్చే చుట్టా లెవరబ్బా అనుకొంటూ '- నిజానికి ఇప్పటి వరకూ ఏ చుట్టమూ తమ యింటికి రాలేదని ఆ యిల్లాలికి గుర్తుకు రాలేదు.

"పిన్నీ ! " అంటూ గుమ్మంలో నిలుచుని వున్న శివుడిని చూసి సావిత్రికి మూర్ఛ వచ్చినంత పనయింది.

ఆనందం ఆశ్చర్యం కలబోసి ఆమెను ఉక్కిరి బిక్కిరి చేసాయి. ఏం చేయాలో తోచక తడబడిపోయింది. గబగబ లోపలికి వెళ్ళి మంచినీళ్ళు తీసుకొని వచ్చింది.

"అబ్బాయ్.. అనూరాధ అల్లరి తగ్గిందా ? కల్యాణి పొడుగెదిగిందా ? సుధాకరం ఛదువెట్లా వుందిరా ? అత్తయ్య , అక్కయ్య, బావయ్య అంతా బావున్నారా ? మన ఎఱ్ఱిపడ్డ కొమ్ము విసరడం మానేసిందా ? " శివుడు వచ్చింది సత్యం ... అని ఆమె బుర్రకు తట్టిన మరుక్షణం గడగడ ఏకబిగిన అడగడం మొదలెట్టింది.

" ఉండు పిన్నీ - నువ్వు ఒక్కోటి అడుగు నేను ఒక్కోటి చెప్తూ పోతా - అందరూ సుబ్బరంగా - గుండ్రాళ్ళలాగా - వున్నారు ! కాకపోతే రాములారు వనవాసం ఎళ్ళినట్టు నా రావుడు ఆ అడవికి ఎళ్ళాడమ్మా అని నాయనమ్మ ఒకటే ఏడుపు - "

శివుడు రామనాధానికి చెప్పినట్లే చెప్పాడు

సావిత్రి అందర్నీ తలుచుకొని - కళ్ళ తడిగట్టగా - కొంగుతో కళ్ళద్దుకొంది.

ఇంతలో సవారి సామాను తెచ్చి ఇంట్లో పెట్టాడు.

రామనాధం క్షవరం చేయించుకున్నాను స్నానం చేసి ఇప్పుడే వస్తాను - అని గాబు దగ్గరికి వెళ్ళాడు.

శివుడు ఇల్లంతా చుట్టేసి - వంటింట్లోకి వెళ్ళాడు సావిత్రి కాఫీ కాస్తుంటే - పీట వాల్చుకొని ఆమె ఎదురుగా కూర్చున్నాడు.

"అదేంటి పిన్నీ . బాబాయ్ అట్టా చిక్కిపోయాడూ ... ? నువ్వు కూడా సన్న బడ్డావ్ పిన్నీ - "

"మీ బాబాయ్‌కి పొలం పనులు కదరా - నీడపట్టున ఉద్యోగం చేసినప్పటిలా ఎలా వుంటారు ? '

"అందుకే పిన్నీ - నాన్ననన్ను పంపించాడు. ఆ నాలుగెకరాల సోకుకి ఇద్దరం దండగనీ - ఇక్కడుంటే కాస్త బాబాయికి చేదోడు వాదోడుగా వుంటాననీ - నేను బయల్దేరే దాకా ఊరుకోలేదంటే నమ్ము - అసలు ఊపిరి తీసుకోనిచ్చాడా ? "

అప్పుడే స్నానం చేసి వచ్చి, పక్కగదిలో రామనాధం పంచె కట్టు కుంటున్నాడు. శివుడి మాటలు విని రామనాధం కళ్ళు చెమ్మగిల్లాయి.

'అన్నయ్యకు తనంటే ఎంత ప్రాణం ! ఆయన కోపం వుత్త తాటాకు మంట. బుస్సున లేచి చప్పున ఆరిపోతుంది.'

ఆరోజు రాత్రి, చిమ్మ చీకటిలో చిక్కటి నిశ్శబ్దంలో కీచురాళ్ళ రొదకు శివుడికి నిద్ర పట్టలేదు.

చుక్కల వెలుగులో తుమ్మచెట్లు జుట్లు విరబోసుకున్న దయ్యాల్లాగా వున్నాయి.

ఎక్కడి నుంచో ఎగిరి, గాలిలో ఓ పల్టీవేసి మాయమవుతోన్న మిణుగురు పురుగులు దయ్యాల కళ్ళలా మెరుస్తున్నాయి.

శివుడు ధైర్యం చిక్కబట్టు కొన్నాడు.

ఇంతలో వాగొడ్డు నుంచి ఓ నక్క గుండె మెలిపెట్టేట్టు ఊళ వేయడం మొదలెట్టింది

ఎద్దుల మెడపట్టీలోని గంటల శబ్దం శివుడికి మోహినీ పిశాచాన్ని దాని నృత్యాన్ని జ్ఞాపకం తెచ్చింది. శివుడు ముఖమంతా చెమటలు పట్టాయి

శివుడు రామనాథాన్ని నిద్ర లేపుదామనుకొన్నాడు. తన ఆలోచనకు తనే సిగ్గుపడి, ఆ ప్రయత్నం మానుకొన్నాడు.

సావిత్రిని లేపుదామను కొన్నాడు.

సందేళ తనకు భోజనం వడ్డించినపుడు - గోడకు బల్లిలా అతుక్కుని వున్న తేలును చటుక్కున చీపురుతో కొట్టి - బయట పడేసి - మళ్ళీ ఏమీ జరగనట్లే వచ్చి - భోజనం వడ్డించడం- శివుడికి జ్ఞాపకం వచ్చింది.

సాయంత్రం పాలు పిండే వేళ చావిడి దూలం మీద చర చరా పాకెళ్ళిన పొడవాటి పాము కళ్ళముందు కదిలింది

శివుడు వళ్ళు జలదరించింది

తేళ్ళు, జెర్రులు, పాములు - ఇవన్నీ పొలాల్లో తోటల్లో తోపుల్లో తిరిగే శివుడికి కొత్తం కావు అడపా దడపా కళ్ళ బడితే తన కర్రకు పని చెప్పేవాడు కానీ ఇక్కడ - కుప్పలు కుప్పలుగా ఎక్కడ బడితే అక్కడ .. అబ్బబ్బా . !

శివుడు ఆ రాత్రంతా దూలం వంకా గోడల వంకా చూస్తూ గడిపాడు.

అలికిన గోడమీద సావిత్రి పెట్టిన ముగ్గుబొట్లు కాసేపు వరుస తీరిన తేళ్ళలాగా కనిపిస్తున్నాయి నేలమీద తీర్చిదిద్దిన ముగ్గులు మెలికలు తిరిగిన పాముల్లాగా అగుపడుతున్నాయి

తెల్లవారేలోగా అతని నరనరాల్లోని రైతురక్తం - పురుగు పుట్రతో సహజీవనం చేసే మెలుకువను గుండెల్లో తట్టి లేపింది.

అలాంటి రాత్రి శివుడి జీవితంలో మళ్ళీరాలేదు.

మర్నాడు ఉదయం రామనాథం శివుడికి పొలం అంతా తిప్పి చూపించాడు

వరికి ప్రాణం నీరు. వరి చేలకు నీళ్ళు అందించను ఆ పంటలో ఎంత ఇబ్బంది పడ్డారో శివుడికి వివరించాడు రామనాథం.

చిన్న దొరువు తవ్వాలన్న తన ఆలోచనను చెప్పాడు. దొరువును ఎక్కడ తవ్వాలను కొంటున్నాడో - వాగులోని నీటిని దొరువుకు ఎలా మళ్ళించవచ్చో చూపించాడు.

ఆ మర్నాడే పలుగులు పారలతో రామనాథం, శివుడు దొరువు తవ్వాల్సిన చోటుకు వచ్చారు.

సవారి, మాణిక్యం తట్టలు తీసుకొచ్చారు.

శివుడి చేతి పలుగు పెళపెళలాడుతూ నల్లగడ్డను పెళ్ళగించింది. రామనాథం పారతో మట్టిని తీసి తట్టలో వేసాడు. సవారి అందించిన మట్టి తట్టను మాణిక్యం అందుకొని, మట్టిని గట్టు మీద పోసింది.

ఆ మంగలి లేని మహానగరంలోనికి అయిదవ మనిషి వచ్చిన ఆనందంలో - మూడో నాటికల్లా ముచ్చటైన దొరువు వాగునీటితో నిండి కళకళ నవ్వింది.



# 4

"ఇదుగో సవారీ . . వేటికవి తూకాలు సరిగ్గా వేయించు కొసరు బేరాలు పెట్టుకోక. ఖచ్చితంగా డబ్బులు ఇచ్చేవారికే కాయలు ఇవ్వు తెల్సిందా? ఇద్దరు ముగ్గుర్ని అడిగి ఏ ధరకి వేస్తున్నారో కనుక్కో!" సావిత్రి అప్పుడే కోసుకు వచ్చిన కూరగాయలను గంపలో విడివిడిగా సర్దుతూ అంది.

సవారి బుద్ధిగా తలాడించాడు.

"నోరు విప్పకుండా కుదేసిన కొయ్యబొమ్మలాగా ఓ పక్కన కూర్చుని వుండి పోయేవూ .. మొదటిసారే సంతకి గంప ఎత్తుకొచ్చిన ముఖం అనుకొంటారు. తెలిసిందా?"

సవారి కళ్ళు విప్పార్చి చూసాడు

"తూకాలు వేసేప్పుడు ఆ పక్కకి ఈ పక్కకి దిక్కులు చూసావనుకో - తక్కెడని గభాల్న వంచేస్తారు ముందు తక్కెడ తాళ్ళు రెండు వైపులా ఒకే పొడవున్నాయో లేదో చూడు తూకం రాయి కింద చింతపండు అతికించారేమో చూడు "

సవారి నోరెళ్ళ బెట్టాడు.

"సావిత్రి ... నువ్వన్ని జాగ్రత్తలు చెప్పావనుకో - వాడి బుర్రకి ఏవీ ఎక్కక మొదటికే మోసం వస్తుంది. నువెళ్ళరా సవారీ!" రామనాధం సావిత్రి మాటలకు అడ్డొస్తూ అన్నాడు.

"మీరూరుకోండి!" సావిత్రి రామనాధాన్ని వారించి సవారితో అంది,

"ఆయన అలాగే అంటారు గానీ ... సవారీ ... సిద్ధడు అద్దంకి వెళ్ళాడు వచ్చాడు ప్రకారం చేయమాక! వచ్చిన డబ్బులతో ఓ కోడి పెట్ట ఓ పుంజు కొనుక్కురా!"

సవారి సరేనన్నట్లు తలవూపాడు.

"ఏ పాడుక్కొచ్చిన పెట్టనో పట్టుకొచ్చేవ్ - జాగ్రత్త - అమ్మబోతే అడివి కొనబోతే కొరివి అని వూరికే అన్నారా? అసలే నువ్వో అయోమయ పక్షివి. దొంగ సచ్చినాళ్ళు సందు దొరికితే చాలు తాటాకులు కట్టి వెంగళాయిని చేయడానికి సిద్ధంగా వుంటారు! భద్రంరా!"

సవారి బర బరా తల గోక్కున్నాడు.

"దొరికిందే సందని ఊరిమీద పెత్తనాలు వెలగ బెట్టకుండా తిన్నగా ఇంటికొచ్చేయి. తరువాత నీ ఏడుపేదో నువ్వేడుద్దువు-"

ఆకు కూరలు పురికొసతో విడివిడిగా కట్టలు కడుతున్న మాణిక్యం కిసుక్కున నవ్వింది.

"ఆ చేత్తోనే ఆ పాట్టికి రెండు ఎర్ర రిబ్బన్లు కొనుక్కురా - జుట్టు విరబోసుకొని దయ్యం లాగా తిరిగి చస్తోంది - "

సావిత్రి సవారి కూతుర్ని చూపిస్తూ అంది

ఆ పాప పక్కికిలించింది

"పొద్దెక్కి పోతుంది ఇంకెళ్ళు! వెళ్ళ నాడివి వెళ్ళి నట్టే కూచోక! ఇక్కడున్నట్టు రావాలి!"

సవారి గంపనెత్తిన ఎత్తుకొని గట్లమ్మట పడ్డాడు

సావిత్రి వెనుక నుంచి అరిచింది, "వస్తూ వస్తూ ఆ కుమ్మరాడి దగ్గర చిన్న దబేణా[1] కొనుక్కురా -"

"గట్లనే .. గట్లనే " అంటూ అరుస్తూ సవారి చటుక్కున తుమ్మచెట్లలోకి మాయమయ్యాడు

"వాణ్ణి అట్లా బెదిరిస్తావేమిటి సావిత్రీ - " వాళ్ళ వ్యవహారం గమనిస్తున్న రామనాథం నవ్వుతూ అన్నాడు.

"బెదిరించేదేవుందీ ? ఆ మాత్రం మంచీచెడూ చెప్పకోరూ? అక్కడికి మీరు మాత్రం ? ఆ దస్తగిరి వచ్చినపుడు ఎన్ని ప్రశ్నలేసి ఎంత గీరిగీరి బేరాలాడి ధాన్యం తోలారూ ?" సావిత్రి విసవిసా రామనాథం దగ్గరికి వచ్చింది.

"సరే . సరే ...." రామనాథం ఓటమిని అంగీకరించాడు

రామనాథం గట్టుమీద కూర్చుని లెక్కలు రాసుకుంటున్నాడు తన పక్కనున్న మరో చిన్న పుస్తకం తీసి సావిత్రి చేతికి ఇచ్చాడు.

"నువ్వు చెప్పినవన్నీ సవారి చేసుకొచ్చాక - ఏవేవిటి ఎంతకు అమ్మాడు కొన్నాడు అన్నీ వివరంగా దీంట్లో రాసి పెట్టు తారీఖు వేయడం మర్చిపోకూ!"

"మీది మరీ చోద్యం! అంతోటి జమా ఖర్చులు రాసేటి వ్యవహారం ఏవుందనీ? ఇంత చేసీ కాసిని కూరగాయలు అమ్మి ఓ కోడిపెట్ట కొనుక్కురమ్మన్న భాగ్యానికా?"

"అణాకానీ కూడా వచ్చేది పోయేది ఖచ్చితంగా తెలిసుండాలి సావిత్రీ - "

"అయ్యగారి ఆడిటరీగిరి ప్రతాపమంతా నా మీద వెలగ బెడుతున్నారా?" సావిత్రి మూతి మూడొంకర్లు తిప్పింది.

"బాబాయ్ ఇదుగో . చలపతి మావయ్య ఉత్తరం! ఊర్నించి రాగానే ఇద్దామనుకున్నా - ఏదో ధ్యాసలో పడి మర్చే పోయా. ఇప్పుడు సూట్‌కేసులో చొక్కా తీసుకుంటుంటే - దాని అడుగున వుంది -" అంటూ శివుడు వాళ్ళ దగ్గరకి వచ్చాడు

"ఏదీ చూడనీ అమెరికా ఉత్తరమే!" సావిత్రి కుతూహలంగా దానిని చేతిలోకి తీసుకొని అటూ ఇటూ తిప్పి చూసింది

---

1 డబ్బు దాచుకొనే ముంత

"మొత్తానికి భలేవాడివిరా . శివుడూ  ఇన్నాళ్ళకట్రా ఇచ్చేది? ఏదీ ఇలా పట్రా " రామనాథం చేయి చాచాడు

శివుడు సావిత్రి దగ్గర నుంచి ఉత్తరాన్ని తెచ్చి రామనాథం చేతికి ఇచ్చాడు రామనాథం ఉత్తరాన్ని తీసుకొని, సావిత్రికి ఉద్దేశించి అన్నాడు -

"ఇదుగో సావిత్రీ - శివుడు పదో పరకో అడిగితే ఇవ్వు. ఖర్చు పెట్టుకోమను కానీ అన్నీ పుస్తకంలో రాసిపెట్టు "

"ఈ మహానగరంలో మాకేం ఖర్చులుంటాయి లెండి!" శివుడి తరుపున సావిత్రి బదులిచ్చింది "అయినా నాకు తెలవక అడుగుతానూ - మిమ్మల్ని నిలేసి లెక్కలు అడిగే మొనగాడెవడండీ?"

"ఏ మొనగాడో ఎందుకూ? రేప్పొద్దున ఈ శివుడే అడుగుతాడు!"

శివుడుకి విషయమేమిటో అర్థంకాక ఇద్దరి ముఖాల్లోకి అయోమయంగా చూసాడు.

సావిత్రి ఏమీ మాట్లాడకుండా ఇంట్లోకి వెళ్ళింది. గుమ్మం దాకా వెళ్ళి ఏదో గుర్తొచ్చి వెనక్కి తిరిగింది.

"పొయ్యిలో మంటేసుకోను పేళ్ళు లేవుకానీ -కాస్త కట్టెలు కొట్టి పెట్టరా - శివుడూ"

శివుడు గొడ్డలి తీసుకొని వెళ్ళాడు.

అంతా నిశ్శబ్దంగా వుంది.

ఓ వడ్రంగి పిట్ట తుమ్మమాను మీద ముక్కుతో వయ్యారంగా టికుటిక్కు లాడిస్తోంది. బెరడు కిందనుంచి తొంగి చూసిన ఏ పురుగునో చటుక్కున నోట్లో వేసుకుంటోంది.

శివుడు గొడ్డలితో తుమ్మ కొమ్మలను నరకడం - పేళ్ళుగా పగల కొట్టడం - బయలు పొలం మీద ఒకటి రెండుసార్లు వినబడుతోంది.

రామనాథం చలపతి వుత్తరం విప్పాడు. 'ఎన్నాళ్ళకు మిత్రవాక్యం!' రామనాథంలో ఏదో తెలియని ఉద్వేగం తలెత్తింది. వంతెన మీద వారిద్దరి చివరి సమావేశం గుర్తుకు వచ్చింది. ఉత్తరంలో అక్షరం అక్షరం లోను చలపతి ఒదిగి వున్నాడు. ఒక్కొక్క మాట చలపతి ఎదురుగా వుండి మాట్లాడుతున్నట్లుగానే వుంది. ఆ కంఠంలో ఎంత తడి!

ప్రియమైన రామం -

నేను 'ప్రియమైన' అన్న పదాన్ని అలవాటు కొద్దో మొక్కుబడిగానో వాడడం లేదు ఐ మీన్ ఇట్! ఐ రియల్లీ మీన్ ఇట్! ఆ పదంలోని లోతేమిటో నేను ఇక్కడికి వచ్చాకే తెలుసుకొన్నాను. ఆ పదంలోని బరువు కూడా నేను తెలుసుకొన్నాను. ప్రియమైన వారి ఎడబాటు కలిగించే వెలితి ఏమిటో మిగిలించే దుఃఖం ఏమిటో కూడా నేను తెలుసుకొన్నాను. నేను రామయ్యగారి అబ్బాయినని అభిమానంగా నన్ను పలకరించే వాళ్ళుకానీ - రంగయ్య గారి అల్లుడినని అపురూపంగా చూసుకొనే వాళ్ళు కానీ - చలపతినని ఆత్మీయంగా ఆదరించే వాళ్ళుకానీ - ఇక్కడ ఎవరూ లేరు

నేను వంటరిని. పూర్తిగా వంటరిని. నాకంటూ ఎవరూ లేని వంటరిని. నన్ను అభిమానంగా పలకరించే వాళ్ళ కోసం - అపురూపంగా చూసుకొనే వాళ్ళ కోసం - ఆత్మీయంగా ఆదరించే వాళ్ళకోసం - క్షణక్షణం అలమటించి పోతున్నాను.

ఇక్కడ మనిషి కనుక్కొన్న ప్రతి ఒక్క వస్తువు వాడకంలో వుంది. మనిషి సుఖమయ జీవనానికి అవసరమైన అన్ని ఏర్పాట్లు వున్నాయి. కాకపోతే, నాకు స్నానాల గదిలోని టబ్ దగ్గర నుంచి హాస్పిటల్‌లోని మానిటర్ వరకూ అన్నీ కొత్తే.

ఈ ప్రాంతం, ఈ వాతావరణం, ఈ మనుషులు - వారి అలవాట్లు, రుచులు అభిరుచులు, ఆచారాలు - అన్నీ ... అన్నీ .. కొత్తే.

ఆ కొత్తను అర్థ చేసుకోవడం ఎంత కష్టం! ఆ అర్థం చేసుకొనే క్రమంలో ఎంత వత్తిడి!

అబ్బ!

విభిన్న సంస్కృతుల సంపర్కం సృష్టించే అలజడి!

కల్చరల్ షాక్!

ఆ షాక్‌ను తట్టుకొని - తేరుకొని - నిలదొక్కు కొనేందుకు పోరాటం.

ఎంత శ్రమ పడాలి! ఎంత శక్తి వెచ్చించాలి! ఎంత మానసిక వత్తిడి!

ఎందుకూ ఇవన్నీ భరించడం? ఏం సాధించడం కోసం?

ఏకాకి తనం, ఎడబాటు తనం, అభిమానం, మొహమాటం, దిగులు, విచారం - అన్నీ ఏకమై నన్ను ఉక్కిరి బిక్కిరి చేస్తాయి. నా గుండెను డొల్ల చేస్తాయి నా నరనరాన్ని మెలి పెడతాయి. సరిగ్గా అలాంటప్పుడే -

నా నేపథ్యంతో సహా నన్ను అర్థం చేసుకొనే హృదయం కోసం - నా గుండెల్లోని వెలితిని నింపే ప్రేమ భరితమైన ఒక్క పలకరింపుకోసం - పరితపించి పోతాను. పరుగులు పెడతుంటాను.

అన్నీ అందితే జీవితంలో విషాదమేముందీ?

అలాంటి విషాద సమయంలో నాకు ఊపిరి పోసేది నా జ్ఞాపకాలే. ఏ చిన్న పని చేసినా అదొక ఘనకార్యంలా మెటికలు విరిచే అమ్మ - మీసాలు మెలివేసే నాన్న - మురిసిపోయే భార్య. మెచ్చుకొనే ప్రొఫెసర్ - అభినందించే స్నేహితులు - ముచ్చటపడే బంధువులు - అందరూ ... అందరూ ... జ్ఞాపకం వస్తారు.

అప్పుడు ... అప్పుడు ... నా విషాదం కరిగిపోయేలా - నాగుండెల్లో వెలితి పూడేలా - అందర్నీ తలుచుకొని తలుచుకొని ఏడుస్తాను. కుమిలి కుమిలి ఏడుస్తాను. ఓ పసిపాప తల్లి వడి కోసం ఏడ్చినట్లు ఏడుస్తాను - నిజం! నేను ఏడుస్తాను.

ఒక్కోసారి ఈ సరిహద్దులన్నీ చెరిపేసి - దూరాల తీరాలన్నీ దాటేసి - పరుగులు పెట్టి రావాలనిపిస్తుంది.

కానీ నేను ఇక్కడికి వచ్చిన ధ్యేయం ఒకటి వుంది ఆ ధ్యేయాన్ని సాధించమని ప్రేరేపించిన తాపత్రయం ఒకటివుంది నా ధ్యేయాన్ని నేను సాధించాలి. సాధించి తీరాలి. ఆ సాధించే క్రమంలో నేను ఏం కోల్పోయినా ఏం కోల్పోవాల్సి వచ్చినా వెనుతిరగ కూడదు. వెనుతిరగను

నా మూలాలు సుదూర ప్రాంతాల్లో సురక్షితంగా వున్నాయి అవి నా ఆనందానికి ఆవేదనకూ దూరాల అంతరాలు దాటుకొని స్పందిస్తాయి. ఆప్యాయంగా ఆదరిస్తాయి ప్రేమగా లాలిస్తాయి

అదే నా ఆశ. అదే నా ఆలంబన అదే నా ధైర్యం. అదే నా ఓదార్పు.

- చలపతి

రామనాథం కళ్ళు చెమర్చాయి. తొలిపంట పోయిన రోజుటి తన మానసిక స్థితి జ్ఞాపకం వచ్చింది. 'ఆ రోజు తను ఎందుకంత భీరుడైపోయాడు. ఎందుకని కుమిలి కుమిలి ఏడ్చాడు? సరిగ్గా అలాంటి సందర్భమేదో చలపతి ఎదుర్కొని వుంటాడు.'

రామనాథం నిట్టూర్చాడు.

'కొత్త ప్రాంతం...కొత్త మనుషులు... కొత్త సంస్కృతి... అన్నీ కొత్త ... అందరూ కొత్త !'

ఆ కొత్తలో ఇమడాలనే ప్రయత్నం - ఆ ప్రయత్నం కలిగించే అస్థిరత - అభద్రత - అది మిగిల్చే అలజడి - అబ్బ! చలపతి అన్నట్లు - ఇవన్నీ ఎందుకు భరించాలి?

ఎందుకంటే కొత్తను అన్వేషించాలన్న జిజ్ఞాస, కొత్తను అంతు తేల్చాలన్న పట్టుదల. అది మనిషికే లేకపోతే ఇంకా చెట్లమీదా గుహల్లోనూ తిరుగుతూ ఆకులు అలములూ తింటూ వుండే వాడేమో - !

కొత్తను శోధించడం సాధించడం మనిషి తత్వం.

ఈ రోజుటి కొత్త రేపటికి పాత. రేపటికి పాత మరునాటికి రోత. క్షణం క్షణం కొత్తను అన్వేషించడం అనేది అతని హేతుత్వ శక్తి అతనిలో అనుక్షణం రగిల్చే జ్వాల కొత్తను సాధించడంలో కొంత కోల్పోవల్సి వస్తుంది. కొంత సీకరించాల్సి వస్తుంది ఈ సత్యాన్ని భరించడం మనిషి సహజాత లక్షణం. ఆటుపోట్లకు వెరచేవాడు చతికిలబడతాడు. తట్టుకొన్నవాడు ముందుకు సాగిపోతాడు - అంతే!'

రామనాథం గుండెల నిండా వూపిరి పీల్చి వదిలాడు.

వ్రాస్తూ పక్కన పెట్టిన లెక్కల పుస్తకం వైపు దృష్టి మరల్చాడు

మొదటి పంటకు కొడవలి దగ్గర నుంచి నాగలి వరకు అన్నీ సమకూర్చుకోవాల్సి వచ్చింది. పై నుంచి పంటకు పెట్టుబడి. పంట డబ్బు రాగానే ఎరువుల కొట్టులో బకాయిలు చెల్లించాడు అత్యవసరంగా వాడుకోవడానికి కొంత డబ్బు ఉంచుకొని మిగిలిందంతా షావుకారుకు చెల్లు పెట్టడానికి ఊరికి పంపించాడు

ఇక, పై పంటకు విత్తనాలు, తినడానికి కొంత కొలవడానికి కొంత ధాన్యం, ఎద్దుల జత, గేదె, పూరిల్లు, పాక - ఇవీ ఏర్పడినవి.

రామనాథానికి నవ్వొచ్చింది.

మిగిలింది లేకపోగా తగిలిందే ఎక్కువ, మొదటి పంట సమయంలో అప్పు చేసిందైనా సొప్పు చేసిందైనా చేతిలో డబ్బుంటూ వుంది కూలీలని పిలవాలన్నా మరోటి చేయాలన్నా ఎంత ధైర్యంగా వుండేది! ఇప్పుడు ఆ ధైర్యం లేదు దుక్కులు స్వయంగా చేసుకొన్నా విత్తడం దగ్గర్నుంచి నూర్పిళ్ళ దాకా కూలీలను పిలవక తప్పదు ఇక మిత్తి పెరిగి పెరిగి యమపాశం కాకముందే వదిలించుకోవాలి!

రామనాథం ఆ పూటే తన పొలంలో నుండి మట్టి నమూనాలు సేకరించాడు వాటిని జడ్చర్ల భూసార పరీక్ష కేంద్రానికి తీసుకొని వెళ్ళాడు.

మొదటి పంటలో తన అనుభవం, బాలయ్య వ్యక్తపరచిన అనుమానం - అన్ని విషయాలు వారితో చర్చించాడు.

రామనాథం జడ్చర్లనుండి తిరిగి రాగానే పొలం బాగుచేసే పని మొదలు పెట్టారు

శివుడి రాకతో భుజానికి భుజం తోడయ్యింది నాగలికి నాగలి తోడయ్యింది.

"శివుడూ ... నాగలిని వాలుకి అడ్డంగా నడపరా ..." రామనాథం శివుడిని హెచ్చరించాడు, ' బాగా అదిమిపెట్టి దున్ను - రాయిరప్పా వస్తే ఏరేయి .."

శివుడు మేడిని అదిమి పట్టాడు. పణత మీద రాయికుదురుగా కూర్చుంది. నాగేటి కర్రు లోతుగా దిగింది. శివుడు ఎద్దుల్ని అదిలించాడు. అరక సాగింది. రేగడి పొర ఫెటిల్మంది నాగేటిచాలు సీతలా నవ్వింది. భూమి తల్లి పులకరించింది. మేఘం ఆనంద భాష్పాలు రాల్చింది.

రామనాథం గుండె ఉప్పొంగింది.

"మఖలో కురిస్తే మదురు మీది గింజైనా మొలుస్తుంది. విత్తనాలు ఏద పెట్టేదాం కానీయ్ రా .. శివుడూ ..." అనందంగా అన్నాడు రామనాథం.

శివుడి ముఖం వికసించింది.

వడివడిగా అరకలు సాగాయి.

ఉత్సాహంగా విత్తులు తలలెత్తాయి.

కొత్త పంట కిలకిల నవ్వింది.

కండలు కరిగాయి. కడుపులు కరకర లాడాయి.

సావిత్రి భోజనం వడ్డించింది.

పప్పుతో పలుచటి జొన్న రొట్టెలు, పిడత నిండా రాగి అంబలి.

రామనాథం చకచక నోటికి పని చెప్పాడు. శివుడు సంకటంలో పడ్డాడు.

"పిన్నీ ఇంకేం లేవూ ? " మొహమాటం లేకుండా సావిత్రిని అడిగాడు శివుడు.

"మాపటేళకి నీకోసం ఓ గిద్దెడు బియ్యం వార్చి పెడతా లేరా  ఈ పూటకి కానియ్యి - " సావిత్రి సర్ది చెప్పింది

"చద్దన్నం లేదూ ? " కందిపోయిన ముఖంతో అడిగాడు శివుడు

" సుబ్బరంగా వేడివేడి రొట్టెలు తినక ఆ సద్దన్నం ఎందుకురా ?"

శివుడు మాట్లాడలేదు

చద్దన్నంలో ఆవకాయే సహించింది శివుడికి

సావిత్రి మనసు చివుక్కుమంది  పాదిగేయడానికి అని అటక మీద దాచిన కోడిగుడ్డు తీసుకొచ్చి, శివుడికి అట్టు వేసి పెట్టింది

ఇల్లాలి నేర్పు ఇక్కట్లలో బయటపడుతుంది. కష్టపడిన వాడికి కడుపు నింపడం ఆమె సహజ లక్షణం  శివుడు తీరుచూసి ఆమె ఉసూరుమంది  పేదపడ్డ వెనుక పెండ్లాము గతి చూడుమన్నట్లు పదిమందికి వండిన సావిత్రి చెయ్యి మెతుకు మెతుకు చూసుకోవాల్సి రావడం ఎంత క్షోభ !

'ఉన్న రెండు బస్తాల వడ్లు మిల్లులో ఆడిస్తే తవుడు పోను మిగిలిన బియ్యమెంత ? అక్కడికీ  నూకలని కూడా మూటకట్టి భద్రం చేసుకొన్నానా ! బియ్యాన్ని అవసరానికి మించి ఒక్కగింజ కూడా వాడడం లేదు. అక్కడికి ఆ మాణిక్యం రొట్టెలు చేయడం  . సంగటి చేయడం నేర్పబట్టి కానీ,  లేకపోతే గిద్దెడు బియ్యం మనిషికి ఏ మూలకి ? మళ్ళీ దాంట్లో కూరా నారా ! భూమిని బద్దలు  కొట్టే మనిషి రాళ్ళయినా తిని  హరాయించుకో గలడంటారు. ఏంటో .. ఈ శివుడికి రొట్టెలన్నా సంగటన్నా తేళ్ళు జెర్రులు పాకుతాయి  ఎట్లా వాడి బుర్ర కెక్కిచ్చేది ? పాపం - వాడేం చేస్తాడు ? జిహ్వాకో రుచి అన్నట్లు వాడి నోటికి అవి సహించాయో లేదో ! వయసు మీదున్న పిల్లాడు - వాడి జిహ్వ చంపుకో మంటే ఎట్లాగు ? శివుడేమైనా తిండికి తిమ్మరాజా పనికి పోతురాజా ? ఏ మాట కామాట - శివుడు ఒక్క క్షణం బద్ధకిస్తాడూ ? కాడిమేడి పట్టినా కావిడి భుజాన పెట్టినా పని అయ్యిందాకా అరక్షణం ఊపిరి తీసుకోడు  ఎందుకో కడుపు కట్టుకొని కష్టాలు  పడ్డం !  ' సావిత్రి కొంగుతో కళ్ళనీళ్ళు అద్దుకుంది

శివుడు కంచంలో కంటూ తలవంచుకొని , వున్న చద్దన్నం  గబగబ కతికి గొడ్డలి తీసుకొని బయటకు పోయాడు

అప్పుడే రామనాథం తన పుస్తకంలో రాసుకుంటున్నాడు.

"చిన్న చిన్న రాళ్ళు, చిల్లర దేవుళ్ళు
నాగులేటి  నీళ్ళు, నాపరాళ్ళు
సజ్జజొన్నకూళ్ళు, సర్పంబులును తేళ్ళు . ." [1]

రామనాథం రాయడం ఆపి, రాసింది తనలో తను చదువుకున్నాడు

1 శ్రీనాధుడు

'వాగులోటి నీళ్ళు అని రాస్తే ఇక్కడి పరిస్థితికి చక్కగా సరిపోతుంది ఏమో రేపెలా వుంటుందో ఎవరు చెప్పగలరు ? ఈ భూమంతా సాగులోకి వచ్చి నడిగడ్డ పచ్చటి మాగాణయై కళకళలాడు తుందేమో - ! అవును అదే ఆశ ఆశే లేకపోతే మనిషే లేడు

రామనాథం రాయడం కొనసాగించాడు

గొడ్డలి తీసుకొని బయటకు వెళ్ళిన శివుడు చాలా అసహనంగా వున్నాడు తన అసహనాన్నంతా దారిలో కనబడ్డ తుమ్మల మీద చూపించాడు.

'ఎదవ తుమ్మ చెట్లని ఎదవ తుమ్మచెట్లు ! "

శివుడు గొణుక్కుంటూ పిచ్చిపట్టిన వవాడికి మల్లే కఱ్ఱ తుమ్మలన్నిటిని నరుకుతూ - కొమ్మలు చెలుగుతూ పోయాడు

శివుడు ఇక్కడికి బయలుదేరి వచ్చేటప్పుడు అతని ఊహలు మరో విధంగా వున్నాయి

ఇక్కడ పొలం తీసుకోవడానికి ముందు ఇక్కడి పరిస్థితిని వర్ణిస్తూ రామనాథం చేసిన వర్ణనలవల్ల అయితే నేమి - సరిగ్గా పంటలు కోసీ కోయకముసుపే రామనాథం డబ్బు పంపడం వల్ల అయితే నేమి - రత్తయ్యతో సహా ఊర్లో అందరూ ముక్కున వేలుసుకొన్నారు

నిలవడబ్బు లేనిదే పంపే వీలు వుండదనే వారు భావించారు. తమ్ముడి సామర్థ్యానికి రత్తయ్య మీసం మెలేసాడు

రామనాథం ఎన్ని విధాలుగా నచ్చచెప్పినా తాము అతనికి అండగా వుండక పోగా - నిలువునా నిరుత్సాహ పరచడం - అతని ఆలోచనని నీళ్ళు కార్చే ప్రయత్నం చేయడం - గుర్తు తెచ్చుకొని - రత్తయ్య సిగ్గు పడిపోయాడు. ఒంటరిగా అంత పొలం సాగు చేయడంలో ఏవేం ఇబ్బందులు పడుతున్నాడోనని ఆందోళన పడిపోయాడు తమ్ముడి పాటికి తమ్ముడిని వదిలేసి అతను పంపిన పంట డబ్బు మాత్రం తీసుకోవడానికి రత్తయ్యకు మనసు ఒప్పలేదు.

రత్తయ్య తను చేస్తున్న పని వదులుకొని తమ్ముడికి సాయానికి వెళ్ళలేడు రత్తయ్య దృష్టి తన కొడుకు శివుడి మీద పడింది.

శివుడు అప్పటికే కాడిమేడి పట్టడంలో రాటుతేలాడు. వడ్ల బస్తాను అవలీలగా అవతలకి విసిరి పారేస్తాడు. దిగబడిన బండిని అమాంతం భుజాన పట్టి లేపేస్తాడు.

అనుకున్న మరుక్షణం రత్తయ్య కొడుకుని ప్రయాణానికి సిద్ధం చేసాడు. రత్తయ్య నిర్ణయాన్ని పున్నమ్మ - ఆమె అన్నదమ్ములతో సహా చుట్టాలు పక్కాలు అందరూ హర్షించారు. దాంతో రత్తయ్య మరింత ఉత్సాహంగా శివుణ్ణి పురిగొలిపాడు.

"ఈ నాలుగెకరాల సోకుకి ఇద్దరం ఎందుకు ? ఆడక్కడ ఏం యాతనలు పడతున్నాడో ఏవో? ఊరు కాని ఊరు ! మంచీ సెబ్బరా చెప్పుకోవడానికి మన మనిషంటూ వుండొద్దా ! "

తండ్రి చెప్పాడనే కాకుండా రామనాథం దగ్గరికి వెళ్ళాలని శివుడికే ఎంతో ఉత్సాహంగా వుంది. కొత్త ప్రదేశానికి వెళ్ళడం అన్న సహజ కుతూహలమే కాకుండా మొదటి నుంచి శివుడికి రామనాథం దగ్గర చనువెక్కువ.

పై నుంచి ఎంత కుదురుగా పొలం పనులు చేస్తున్నా - రత్తయ్య తన కొడుకుని చదువు చట్టుబండలు చేసి వచ్చాడనో - సందేళ సినిమాకి వెళ్ళాడనో - ఆకతాయి వేషాలు వస్తున్నాడనో - మరోటనో - మరోటనో - ఊరికే దెప్పి పొడుస్తుంటాడు రామనాధానికి శివుడు ఏం చేసినా మురిపమే అందుకే శివుడు రామనాధం దగ్గరికి వెళ్ళమనగానే పెట్టేబేడా పుచ్చుకొని చక్కావచ్చాడు

ఇరవై ఎకరాల ఆసామి అంటే శివుడి వూహలో తమ ఊళ్ళోని షావుకారులాగా మండువాలోగిలి యిల్లు. మందీ మార్బలం , అరడజను ఒంగోలు జాతి ఎద్దులు - ఘనమైన చావిడి - పాడిగేదెలు - ఆవులు - !

శివుడు ఊహించుకొన్న దానికి ఇక్కడి పరిస్థితికి పొంతన కుదరలేదు. శివుడు హతాశుడై పోయాడు రామనాధం పేదపడి అప్పులు తీరుస్తాడని శివుడు ఊహించనైనా ఊహించలేదు.

కంచం ముందు కూర్చుంటే వాస్తవమేమిటో కళ్ళకు కట్టినట్లు కనిపిస్తోంది. రోజుకు రెండు రకాల కూరలు, వేపుళ్ళు, పప్పు, పులుసు, చారు, గడ్డ పెరుగు, నెయ్యి - ఇవ్వన్నీ ఏవీ లేవు.

సావిత్రి మజ్జిగ చిలికి- వెన్నతీసి - నెయ్యి పేరేసి సంతకు పంపుతుంది. కూరగాయలు - కోడిగుడ్లు - అదే దారి !

రోటి పచ్చడిలో అరచేయి వాలుగా నెయ్యి పోసుకోవడం వాళ్ళకి అలవాటు.

సావిత్రి నూరిన పచ్చడిని నెయ్యి కరగేసిన గిన్నెలో తిరగమోత పెట్టి సరిపెట్టేస్తోంది. గడ్డ పెరుగు చిలకేసి మజ్జిగ వడ్డిస్తోంది.

'పై నుంచి సమర్ధిస్తూ వాదనలు ! "

శివుడు తన కోపాన్నంతా తుమ్మ చెట్టు మొదలు మీద చూపించాడు. ఒక్కవేటుతో అది పక్కకు వొరిగింది

"రాగుల్లో ఇనుముంటుంది - జొన్నల్లో విటమిన్లుంటాయి. - గట్టి తిండి ! ఎంత ఆరోగ్యమని ! " సావిత్రి మాటలు జ్ఞాపకం తెచ్చుకొని - ఆమె అన్నట్లుగానే అంటూ వెక్కిరించాడు.

"కాఫీలో పంచదార వెయ్యచ్చుగా - బెల్లం ముక్క వేసింది కాక - బెల్లం వంటికి బలంరా శివుడూ - అంటుంది ! ఇంక ఆ కాఫీ మాత్రం ఎందుకూ పానకమే ఇస్తే సరిపోతుందిగా ! " శివుడు కోపంగా అనుకున్నాడు.

"ఇనుమంట ఇనుం ! ఇరుసులు చేసుకోమను ! నాకెందుకూ అయ్యన్నీ, నెత్తినేసి కొట్టుకోను ! "

శివుడు గొణుక్కుంటూ తుమ్మ కొమ్మలు చెలిగేసాడు.

"ఆ గడ్డంతా బలంట బలం ! ఎదవ పుస్తకాలు ఎదవ పుస్తకాలని ! చేతి కొచ్చిందంతా రాసి పారేయడమే ! " శివుడి కోపం తిండి మీద నుంచి ఈ విషయాలన్నిటిని సావిత్రికి నేర్పిన పుస్తకాల మీదకు మళ్ళింది

నిజానికి ఎవరి మీద కోపమో ఏ విషయంలో కోపమో అతనికే తెలియదు.

మొదటి నుంచీ శివుడు పదిమందీ కావాలనుకుంటాడు. వాళ్ళను ఆటలు పట్టిస్తూ వీళ్ళను వేళాకోళాలాడుతూ హుషారుగా తుళ్ళింతల సెలయేరులా వుండేవాడు. పరాచికానికైనా పరిహాసాలకైనా సమ వయస్కులు ఉండాలి సమ ఉజ్జీలు వుండాలి.

రామనాథం, సావిత్రిలతో ఎంత చనువున్నా తన వయస్సు వాళ్ళతో మెసిలినట్టు కాదుగా ?

శివుడి నరనరాల్లోనూ వేడి నెత్తురు ఉరకలు వేస్తోంది. ఒక్క క్షణం ఒక్కచోట కుదురుగా వుండలేక పోతున్నాడు ఏదో చిరాకు ఏదో పరాకు మీసం చిక్కబడింది. కంఠం గంభీరమైంది. ఛాతీ విశాలమైంది కండలు మెలితిరుగుతున్నాయి అణువణువూ ఆవేశం ఆవహించింది

వంటి మీద చేయి వేస్తే ఉలిక్కిపడి - బుసలు కొట్టి - గిట్టలు దున్ని కొమ్ము విసిరే పోట్ల గిత్తలాగా వున్నాడు

కదిలిస్తే కస్సుమని ఇంత ఎత్తున లేస్తున్నాడు.

ఆవేశంగా తుమ్మ చెట్లన్నీ నరుక్కుంటూ పోతోన్న శివుడి వాలకం చూసి సావిత్రి కలవర పడింది.

"వీడికి ఏం పైత్యం ఎక్కింది ఇవాళ ! " సావిత్రి రామనాథాన్ని ఉద్దేశించి అంది.

రామనాథం నవ్వాడు.

"ముక్కుతాళ్ళు బిగించే సమయం వచ్చింది !"

"అదేంటి ? "

"అదంతే ?"

రామనాథం శివుడి ఉద్రేకానికి కారణాలు వెతుక్కున్నాడు. 'పోట్లగిత్తకి అదునులో మెడమీద కాడి బరువు పడకపోతే అచ్చోసిన ఆంబోతులా ఊరి మీద పడుతుంది. సమయంలో కాడి బరువెత్తుకుందా దుక్కిటెద్దు అవుతుంది. వీడి ఉద్రేకం వెళ్ళకక్కాల్సింది చెమట రూపంలోనే ! " రామనాథం శివుడి ఆవేశాన్ని అసహనాన్ని పనివైపు మళ్ళించాలని నిశ్చయించుకొన్నాడు.

రామనాథం నెమ్మదిగా నడుచుకొంటూ శివుడి దగ్గరగా వెళ్ళాడు.

శివుడి ముఖం మీద చెమట ధార కట్టి వుంది. చొక్కా తడిచి వంటికి అతుక్కొని వుంది. శివుడు అటు ఇటూ పట్టించుకోకుండా ఏకాగ్రతతో చెట్లు కొట్టుకుంటూ పోతున్నాడు.

రామనాథం మెల్లిగా శివుడి పక్కగా వెళ్ళి నిల్చున్నాడు.

"ఇదంతా బండి వెళ్ళే దారి చేసుకొందాం ఏమంటావ్ ? "

నవ్వుతూ వున్న రామనాథం ముఖంలోకి శివుడు అనుమానంగా చూసాడు.

"నువ్వు ఇంటికి వెళ్ళి స్నానం చెయ్యి " అంటూ రామనాథం శివుడు చేతిలోని గొడ్డలి తను అందుకుని, అతను చేస్తున్నపని కొనసాగించాడు.

శివుడు ఇంటికి వెళ్ళలేదు. తుమ్మ మండలను లాక్కెళ్ళి ఒకచోట పడేయసాగాడు.

రామనాథం తనలో తనే నవ్వుకొన్నాడు.

నాట్లు అయినా, కలుపులు తీసుకొన్నా, పైసాల దున్నుకొన్నా శివుడికి చేతినిండా పని వున్నట్టేలేదు

రామనాథం మిగిలిన పొలం బాగుచేయడానికి పూనుకొన్నాడు శివుడు అరక కలిపాడు.

చూస్తుండగానే పొలం ఒక తీరుకి వచ్చింది.

వాగొడ్డు పొలం కోతలకి సిద్ధంగా వుంది. కోతలు అయ్యాయి. నూర్పిళ్ళు అయ్యాయి

మళ్ళీ శివుడి పరిస్థితి మొదటికి వచ్చింది.

పొద్దున్నే కోడి పుంజు కొక్కరకో ... అన్నా శివుడికి చిర్రెత్తుకొస్తోంది. రాత్రివేళ కీచురాయి కీచుమన్నా శివుడికి వెర్రెత్తు కొస్తోంది.

శివుడికి ఆటపాటలు .. సుధాకర్, స్నేహితులు, తోటలు, సపోటాలు ... అన్నీ ఒక్కోటి జ్ఞాపకం వస్తున్నాయి.

ఒక్కోసారి శివుడికి ఊరికి వెళ్ళిపోదామని బలంగా అనిపిస్తుంది. ఆ ఆవేశం రాగానే పూనకం వచ్చిన వాడిలా ఒక్క పరుగున బొంకూరు వాగు దాకా వెళ్తాడు.

బొంకూరు దాకా కాలు సాగిస్తే - అక్కడ వ్యాన్ ఎక్కి కర్నూలు వెళ్ళడం ఎంతసేపు ? అక్కణ్ణించి బస్సెక్కి ఊరికి వెళ్ళడం ఎంతసేపు ?

మళ్ళీ తన ఆలోచనకు తానే సిగ్గుపడి పోయాడు. 'ఇంత వంటరితనంలో బాబాయిని పిన్నిని ఎలా వదిలి వెళ్ళడం ? అంతపనితో బాబాయి ఇబ్బందులు పడుతుంటే పలకరించే మనిషి లేక పిన్ని దిగులు పడుతుంది. అసలు నాన్న తననెందుకు పంపించాడు. ఒకరికిఒకరు తోడనేగా? అర్థాంతరంగా ఎలా వెళ్తాడు ?

నవ్వుతూ తుళ్ళుతూ వుండే శివుడు ముభావంగా తయారవడం చూసి సావిత్రి విలవిలలాడి పోతోంది. నెత్తీ నోరూ కొట్టుకుంటూ శివుడిని బతిమిలాడుతోంద.

శివుడికి ఒక్కోసారి వారి మీద ఎక్కడి లేని జాలి ముంచుకొస్తోంది ఒక్కోసారి తన మీదే బోలెడంత జాలి !

రామనాథం శివుడిని వెంటబెట్టుకొని పంతులుగారి నశ్యం చెను చూసి వచ్చాడు. పొలం బాగానే వుంది. వర్షాధారంగా పంట పండిస్తున్నారు. మరో నీటి వసతి లేదు.

రామనాథం, శివుడు మాట్లాడుకుంటూ వస్తోంటే బాలయ్య ఎదురొచ్చాడు బాలయ్య వెనకే ఓ అబ్బాయి వున్నాడు.

రామనాథం ఆ అబ్బాయిని పరీక్షగా చూసాడు.

నూనుగు మీసాలతో పాలకంకిలా ముద్దుగా వున్నాడు మిలమిలలాడుతోన్న కళ్ళు, నవ్వుతున్న పెదవులు, వంపు తిరిగిన గడ్డం, విప్పారిన ముఖం, విచ్చిన పత్తికాయ లాగా లేత మొక్కజొన్న పొత్తి లాగా వున్నాడు.

రామనాథానికి ఆ అబ్బాయిని చూడగానే ఎందుకో చాలా సంతోషం వేసింది. అతను తన కొడుకు సుధాకర్ ఈడు వాడే !

"ఎవరీ కుర్రాడు బాలయ్య ! "

"మా పిల్లగాడు - మల్లేశ - నా కొడ్కు ఇంగపైన సదువుకొనుడా, నౌక్రీ[1] చేసుడా అని అడగ బట్టిండు. నీ తానకు తోల్కోని[2] వచ్చిన ! "

మల్లేశ్ రామనాథానికి 'నమస్తే' చెపుతూనే బిడియ పడిపోయాడు. ఎందుకనో శివుడికి కూడా మల్లేశ్ మీద సదభిప్రాయం ఏర్పడి పోయింది. అతని వంక రామనాథం వంక మార్చి మార్చి చూసాడు.

"ఏం చదువుతున్నావ్ అబ్బాయ్ ! " రామనాథం అడిగాడు.

"పియుసి పరీక్షలు వ్రాసానండి " తన కంఠంలోని బొంగురు తనానికి తనే సిగ్గు పడుతూ అన్నాడు మల్లేశ్.

రామనాథం మనసులో కొత్త చిగురుల వగరుతో బొంగురు పోయిన కోకిల కంఠం మెదిలింది. మల్లేశ్‌ను మళ్ళీమళ్ళీ మాట్లాడించబుద్దేసింది. మల్లేశ్ మాట్లాడుతున్నా తలవంచుకొన్నా నిలుచున్నా కదులుతున్నా రామనాథానికి ముచ్చటగా వుంది.

మార్కుల వివరాలవీ కనుక్కొన్నాడు. మల్లేశ్ డిస్టింక్షన్ విద్యార్థి

"మరి ఏం చేద్దామను కొంటున్నావ్ . ? "

"పాలమూరులో డిగ్రీ జాయినయిదామనీ .... " మల్లేశ్ మధ్యలో మాట మింగేసాడు.

"మిమ్మల సూడక ముంగట వీన్ని సదువుల పెడ్తుంటె బుగలు గుండె[3]. సేను సేద్యం ఉన్నోన్ని - వున్న ఒక్కడు సదువుకొని నౌక్రీకి పోతే ఏం చేసుడు ? సదువు కున్నగాని సేద్యం చేయచ్చు నీతీరున ! "

బాలయ్య కూడా పెద్దరైతు. మరోచోట అయ్యివుంటే ఆసామే అయి వుండేవాడు.

రామనాథం నవ్వాడు, " దాందేముందిలే బాలయ్య - ఎవరిష్టం వారిది"' మల్లేశ్ వైపుతిరిగి అడిగాడు, "ఏం అబ్బాయ్ ... మరి వ్యవసాయం చేస్తావా ? "

---

1. ఉద్యోగం 2 తీసుకొని 3. దిగులుగా వుండేది

మల్లేశ్ సిగ్గుతో ముఖం ఎర్రబరుచుకొన్నాడు

శివుడికి మల్లేశ్ నచ్చాడు ఇద్దరూ పలకరించుకొని మాటల్లో పడి కాస్త పక్కగా వెళ్ళారు కబుర్లలో పడ్డారు.

"ఏమైనా గాని సదుకొన్నోల్ని ఒక తీరు ! ఆ కాలవల సూపరైజర్ సాబ్ వున్నాడు సూడు - పాంట్ బుషర్ట్ తొడ్కోని అద్దాలు పెట్కోని బూటు గిట్ల ఏస్కోని - ఎంత మంచిగుంటడు ! మా పోరడు గట్లయితండంటరా ? " బాలయ్య ఆశగా అడిగాడు

"మొత్తానికి భలేవాడివే బాలయ్య - కాసేపు సేద్యం అంటావ్ కాసేపు సర్కారీ నౌక్రీ అంటావ్ ! ఇంతకీ రెండింటిలో నీకొడుకు ఏం చేయాలంటావ్ ?"

"ఏదయితేగది వాడు మంచిగుండెడె నాకు కావాలె !"

"కుర్రాడికేం ముచ్చటగా వున్నాడు ఆ వినయం ! ఆ అణుకువ ! చదువు కూడా అబ్బింది. నీవేం దిగులు పడకు. చదువుతానన్నంత చదివించు చదువు అన్ని సంపదల పెట్టు. చదువే ధైర్యం. చదువే విశ్వాసం కుర్రాడు వృద్ధిలోకి వస్తాడు !" రామనాథం మనసారా దీవించాడు.

తన కొడుకును రామనాథం మెచ్చుకున్నందుకు బాలయ్యకు సంతోషం వేసింది. శివుడితో మట్లాడుతోన్న కొడుకు వంక ఓ మారు మురిపెంగా చూసుకొన్నాడు రామనాథం వైపు తిరిగి అన్నాడు, "అవ్‌గాని, ఆ పంతులు ఊకే లొల్లి[1] పెడుతుండు ఆ సేను తీస్కొరాదె ?"

"ఎక్కడయ్యా ! మా వూరి షావుకారు దగ్గర తీసుకొన్న అప్పు అప్పుగానే వుంది. మొదటి పంట అలాగడిచిపోయె. రెండోది ఫరవాలేదు అనుకుంటే నాగు చెల్లింపుక్కే సరిపోయే. మిత్తి మిత్తిలానే మిగిలిపోయే. వచ్చిన డబ్బు వచ్చినట్టు వూరికి పంపితిమి. మళ్ళీ పొలం కొనేంత స్తోమత నాకు లేదు "

"ఈడ పొలం ఐదునూర్లు పోతే మస్తు[2]. ఆ పంతులు తోన మాట్లాడుదాము. వెయ్యికో పదేను నూర్లకో వొప్పడా ? "

"చేతిలో డబ్బు లేకుండా బేరమేం చేస్తాం ? "

"వాయిదాల యిద్దము పంతులు ఏడ్కి పోతుండు ? నీవేడ్కిపోతున్నావ్ ? మా సేన్ల సేను కలసుడుంటె గింత గుసుసుడు పెడుతుంటిమా ? మా నారాయణమ్మ ఒక్క దినంల గడెం[3] పంపుతుండె !"

"ఆలోచిద్దాం లెండి ! "

"బాబాయ్ - మల్లేశ్ మన సుధాకర్ క్లాసే - " శివుడు సంబరంగా అంటూ వారి దగ్గరకు వచ్చాడు.

అతని వెనకాలే మల్లేశ్.

---

1. గొడవ 2 ఎక్కువ 3 నాగలి

'ఈ ఎండాకాలం సెలవలంతా ఏం చేస్తావ్ ? మా దగ్గరకి వచ్చి పోతుండు - " శివుడు చనువుగా అన్నాడు మల్లేశ్‌తో,

"అట్లనే ! "

కానీ ఆ మర్నాడే బాలయ్య కూతురు రేణుక, ఆమె భర్త వచ్చి మల్లేశ్‌ను తమతో పాటు శ్రీశైలం తీసుకెళ్ళారు. అటునుంచి తిరుపతి కూడా వెళ్తారట. ఇక సెలవులు ఖాళీ !

శివుడు ఓపికగా రెండుమూడు రోజుల వరకూ మల్లేశ్ వస్తాడని ఎదురు చూసాడు. విషయం తెలిసాక చాలా నిరుత్సాహపడ్డాడు.

నూర్పిళ్ళు అయ్యిం దగ్గర నుంచీ పనీపాటలేదు. ఊరికి వెళ్దామంటే ఎందుకో బుద్ధి పుట్టలేదు.

శివుడు తనకు తెలియకుండానే - మామిడి చెట్లెక్కడం - కోతి కొమ్మచ్చులు ఆడడం - తోటల్లో కాయలు కోసుకురావడం - అన్నీ ... ... చిన్న పిల్లల చేష్టలుగా భావించడం మొదలు పెట్టాడు.

పెద్ద వాళ్ళలాగా వ్యవహారాలు చూసుకోవాలనుకున్న కుతూహలం ఎక్కువయింది. అలాగే పెద్దవాళ్ళలాగా ప్రవర్తించాలనీ, నిర్ణయాలు తీసుకోవాలని, అమలు పరుచుకోవాలనీ - ప్రయత్నించసాగాడు.

రామనాథం చెప్పినట్లుగా తుమ్మ చెట్లన్నీ నరికి బండివెళ్ళేంత దారి చేయడానికి ప్రయత్నాలు మొదలు పెట్టారు.

పొలంలోని రేగడి మట్టి బంకమన్ను కావడంతో - చినుకు పడితే చాలు మోకాళ్ళు లోతున కూరుకుపోతోంది అడుగు తీసి అడుగు వేయాలంటే మణుగు మన్ను కాలికి అతుక్కుని పైకి లేస్తుంది. బండి అమాంతం కూరుకుపోతుంది. దుక్కులు చేస్తున్నా ఇదే పరిస్థితి. నాగలి కర్రుకు మట్టి కతక్కున అతుక్కుపోతుంది. పదునుగా నాగలిని ముందుకు సాగనివ్వదు.

రామనాథం వాళ్ళు బొంకూరు వాగు వద్దనుండి సన్నని ఇసుక తోలుకొన్నారు. పొలంలో చల్లి, కలియ దున్నుకున్నారు.

బాట వేయాల్సిన చోట మొరుసుమట్టి, ఇసుక తోలుకొని, చదును చేసుకొన్నారు.

రామనాథానికి శివుడి వాలకం చూస్తే నవ్వాలో ఏడవాలో అర్థం కావట్లేదు. రామనాథానికి చిన్నప్పుడు విన్న పనిభూతం కథ గుర్తొచ్చింది.

ఒక సోమరి రైతు పైసా తీసుకోకుండా ఏ పనినైనా చేసి పెట్టే భూతం తనకుంటే బాగుండునని అనుకుంటూ వుండేవాడట.

ఒకరోజు అతని మాటలు విని నిజంగానే ఓ భూతం వచ్చిందట. అయితే ఒక్క షరతు పెట్టిందట - రైతు పని చెప్పకపోతే అతన్ని నమిలి మింగేస్తుందిట. తనకు పని తప్పుతుంది

లెమ్మని అన్నిటికి వొప్పుకున్నాడు. ఆ సోమరి పోతు పనిభూతం ఏ పని చెప్పినా చిటికలో చేసేని - మరోపనికి సిద్ధమయ్యేదట. పని చెప్పకపోతే మింగేస్తాననేదట. అక్కడికీ ఆ రైతు ఇసుకలో గసగసాలు గుమ్మరించి ఏరమని, ఆకాశంలో చుక్కలు లెక్కపెట్టమనీ, చాట నిండ ఇసుకపోసి రేణువులు లెక్క చెప్పమనీ - ఇట్లాంటివే ఏవో కొన్ని పనులు చెప్పాడుట. ఏం పనులు చెప్పాలో తెలియక అటూ చావలేక ఇటు బతక లేక సతమతమై చివరికి - కుక్కతోక వంకర తీయమని పూరమాయించి తప్పించుకున్నాడట

రామనాథం నవ్వుకున్నాడు

'శివుడి వాలకం అచ్చం ఇప్పుడా పనిభూతం వాలకం లాగానే వుంది దుక్కులు మొదలయ్యేదాకా వూరెళ్ళి రమ్మంటే వెళ్ళనన్నాడు ఇరవై ఎకరాల పొలం బాగు చేసేదాకా వాడు ఊపిరి పీల్చుకోలేదు. తననూ ఊపిరి పీల్చుకోనీయలేదు. ఇప్పుడు చూస్తుండగానే రోడ్డుపని పూర్తయింది. శివుడికి తోడు ఆ సవారి ! సరిపోయినాళ్ళు దొరికారు ! ఇప్పుడు వాళ్ళకి ఏం పని చెప్పాలి ? 'మాట్లాడితే తోచి చావట్లా ఏదైనా పని చెప్పు బాబాయ్' ఇదే వాడి మంత్రమై పోయింది ! '

రామనాథం శివుడిని మురిపెంగా తలుచుకున్నాడు.

'అప్పుడే పలుకులు నేర్చిన పాపాయి నోరుమూత పడకుండా మాట్లాడుతూనే వుంటుంది. అప్పుడే నడకలు నేర్చిన చిన్నారి క్షణం కుదురుగా కూర్చోక లోకమంతా చుట్టేయాలన్నట్టుగా గునగునా తిరుగుతూనే వుంటుంది. అట్లాగే ఇప్పుడిప్పుడే నాగలి పట్టిన శివుడు వదిలిపెడితే భూగోళమంతా సాగుచేసికాని వదిలేట్టులేడు ! కొత్తొక వింత అని పెద్దలు ఊరికే అన్నారు ?'

సరిగ్గా అదే సమయానికి శివుడు సావిత్రిలో గొడవపడుతున్నాడు.

"పిన్నీ ... ఆ కోడిని కోయించేయరాదూ ? కోడిపులుసు తిని ఎన్నాళ్ళయిందో ..."

"ఓరేయ్ - ఎందుకురా అట్లా అంటావ్ ! ఆ వజాన కోసుకు తింటే ఏం వస్తుంది ? ఒక్కపూటకి అరిగి పోతుంది. ఇప్పుడు చూడు గుడ్లన్నీ పోగేసి పొదిగేసానా ? ఆ కోడి పిల్లలు చూడు .. పెట్ట ఎనకమాల గునగున మంటూ ఎట్లా తిరుగుతున్నాయో .... బుజ్జి ముండలు ! దొడ్డికే కళ వచ్చింది కదరా ! వున్న పళాన పెట్టని కోసి కూరొండడమే ...! అంతగా అయితే కోడిగుడ్డు పులుసో - పొరటో చేసి పెడతాలే ... ! "

సావిత్రి సర్ది చెపుతూ అంది.

నిజానికి శివుడికి కోడి పులుసు తినాలన్న కోరికలేదు.

తోచీ తోచక చేస్తోన్న పనులివి. సావిత్రి వాడి మాట కాదనే సరికి వాడికి చిర్రెత్తుకొచ్చింది.

దానికి తగ్గట్టు, సావిత్రి వేడి వేడి నూకలన్నం ముద్ద మీద చిన్నగుంట చేసి గొడ్డుకారం వేసి నెయ్యిపోసుకొచ్చింది వేడి అన్నం మీద కారం - కారం మీద నెయ్యి - నోరూరించే వాసన వస్తోంది.

శివుడు తన పట్టు వదలదలుచుకోలేదు శివుడు ఎంతగా పెద్దవాడి తరహాలో వుండాలనుకొన్నా. పిల్లవాడి చేష్టలు మానలేక పోతున్నాడు విసురుగా అడిగాడు, "నిమ్మకాయ బద్ద పట్టుకురా పిన్నీ ! "

"నీకు తెలియకుండా నిమ్మచెట్టు ఎక్కడేసానురా ? "

"అయ్యన్నీ నాకనవసరం ! అసలు నిమ్మరసం పిండుకోకుండా గొడ్డుకారం ఎలా తింటారు ? "

"నెయ్యి వేసాను కదరా ? "

. శివుడు చర్రున పీట మీద నుంచిలేచాడు కాలితో పీటను ఒక్కతన్ను తన్నాడు. పళ్ళాన్ని ఎత్తి సావిత్రి ముందుకు విసిరాడు

"ఎదవ సంతని ఎదవ సంత ! ఓ పనీ లేదూ ఓ పాటూ లేదు - ఎదవ తిండి తిని - పడి దొర్లడం ! ఇదుగో పిన్నీ - ఇప్పుడే చెపుతున్నా నాకు సరిపడా పని చెప్పారా ఇక్కడుంట - - లేదూ మాపటేళ బస్సుకి ఊరెళ్ళి పోతా ! " శివుడు చూపుడు వేలు ఆడిస్తూ కోపంగా అరిచాడు.

సావిత్రి తన కాళ్ళ దగ్గర విసురుగా వచ్చిపడ్డ పళ్ళెం వంక- ముద్దగా పడ్డ నూకల సంగటి వంక - చెల్లా చెదురైన గొడ్డు కారం వంక - శివుడి వంక విస్తుబోయి చూసింది మార్చిమార్చి చూసింది.

సావిత్రి గొంతు పెగల్లేదు మాటలు కూడ దీసుకొని నిస్సహాయంగా చూస్తూ నెమ్మదిగా అడిగింది " నన్నేం చేయమంటావ్ రా శివుడూ .. ! "

"ఏం చేస్తావ్ ? మెడనిండా చేతుల్నిండా అట్లా దిగేసోకపోతే అయ్యన్నీ తీసి బాబాయికి ఇవ్వచ్చుగా ? ఆ పంతులు చేను కొంటాడుగా ? అయినా ఈ అడవిలో నీ సోక్కేం వచ్చింది ? నాగలి పట్టి నాళ్ళకి పొలమే బలం, నగలు ఏం చేసుకోను ? పంతులు చేను తీసుకొన్నారా. ఇక్కడ వుంటా - లేదూ .. ! " శివుడు చరచరా బయటకెళ్ళాడు.

కోడిపులుసు దగ్గర్నించి మెడ గొలుసుదాకా తలాతోకా లేకుండా సాగిన వాదం ఏమిటో ఆమె బుర్రకి తట్టేసరికి కాసేపు పట్టింది. తేరుకొని, 'అయ్యో ... పిల్లాడు కంచం దగ్గర్నుంచి అర్థాంతరంగా లేచెళ్ళాడే ! " అనుకుంటూ గుమ్మం దాకా వచ్చి కేకేసింది

"శివుడూ .. అన్నం అన్నపూర్ణరా ... ! అన్నం మీద అలక్కూడదురా ! "

"పసిపిల్లలకు చెప్పే కథలు నాకు చెప్పమాక ! " శివుడు విసురుగా అని విసవిస వెళ్ళిపోయాడు.

సావిత్రి దిక్కు తోచలేదు  పాతేసిన గుంజలా గుమ్మానికి ఆనుకొని నిల్చుండి పోయింది

'మాట మన్ననకి ప్రాణం పెట్టే  పిల్లాడు ఇలా తయారయ్యేడేంటి ? ఇప్పుడేం జరిగందని అలా విరుచుకు పడి రాద్ధాంతం చేసాడు ? ఆ చతుర్లు ఆ వేళాకోళాలు అన్నీ ఏమయ్యాయి ? అయ్యిందానికి కాందానికి అట్లా కస్సుబుస్సుమంటూ ఒంటికాలి మీద లేస్తాడేం? దగ్గరుంచుకొని నా కొడుకుని  ఆగం చేసావేంటే - అని శాంతక్క చెప్తాతుందో ఏమో ! ' సావిత్రి తోడికోడలిని తలుచుకొంది.

సావిత్రి కళ్ళల్లో నీళ్ళు సుళ్ళు తిరుగుతున్నాయి ! ' అయినా ఆడి నాలిక్కి నరం వుందా లేదా ?  పుటిక్కిన ఎంత మాటనేసాడు ! ఆళ్ళు తిండికి దేబిరిస్తుంటే తను మెడనిండా చేతుల్నిండా దిగుసుకుందా '

సావిత్రి నిష్టూరపడింది.

సావిత్రి తేరుకొని, మెడ తడుముకొంది  చేతులు చూసుకుంది.

సావిత్రి మెడలో మంగళసూత్రం గొలుసు నల్లపూసల గొలుసు చేతులకు రెండు జతల గాజులు ఉన్నాయి

'గాజులు అమ్మవి, రోజు బూడిదేసి అంట్లూ తోమడం వవల్లో ఏమో అరిగి - మెరుగు తగ్గాయి. గొలుసు మాత్రం కాస్త మకిలి పట్టివుంది. ఏవైతేనేం బంగారపువి. కుంకుడురసం వేసి రుద్దితే తళతళమంటాయి'.

సావిత్రికి శివుడి మీద కోపం పోయింది. శివుడికి తట్టిన ఆలోచన తనకు తట్టనందుకు సిగ్గేసింది.

నేల శుభ్రం చేస్తూ ఆలోచిస్తూ వుంది ఆమె చెవుల్లో శివుడి మాటలే ప్రతిధ్వనిస్తున్నాయి.

"ఈ అడవిలో సోక్కొం వచ్చింది ? "

'తను సోకుని ఇవ్వన్నీ అలంకరించుకొందా ? ' సావిత్రి తనను తాను ప్రశ్నించుకుంది. 'పెళ్ళినాడు వేసుకున్న మంగళ సూత్రం , గాజులు ఇప్పటిదాకా ఒక్కరోజన్నా వంటి మీద నుంచి తీసిందా ? వంట్లో భాగమై పోయాయి. అసలు వాటిని వేసుకున్న స్పృహే తనకు లేదు. ఇక సోకు చేసుకొన్నదెక్కడ ? శివుడేదో కుర్రచేష్టగా అన్నాడని కాదుకానీ - ఎందుకు ఈ గొలుసుగాజులు? అందం కోసమో అలంకారం కోసమో అయితే ఇవే అవసరం లేదు. చేతుల్నిండా రంగురంగుల మట్టి గాజులు వేసుకొన్నా అందమే. పోనీ ఆస్తి అనుకొందామా అంటే మెతుకు మెతుక్కీ వెతుకాలట అయినప్పుడు అక్కరకు రాని ఆస్తి ఎందుకు ? అక్కడికీ తను కూరగాయలు అమ్మినా నెయ్యి అమ్మనా ఏదో వేణ్ణీళ్ళకు చన్నీళ్ళకు మల్లేగా ? ఈ గొలుసునీ గాజుల్నీ వంటి మీద దిగుసుకుంటే ఏం ఒరుగుతుంది ? ఓ పెంపా ? సొంపా ? నాకూ వున్నాయన్న ఘనత కాకపోతే !'

సావిత్రి తన చెవులు కూడా తడిమి చూసుకుంది

పచ్చరాయి పొదిగిన పంజరం పోగులు, 'వీటిని అమ్మితే ఏం వస్తుంది ? రెండు చిన్నాలు కూడా వుండవు - "

సావిత్రి గొలుసు గాజులు తీసి, జేబుగుడ్డలో పెట్టి - కొనలు ముడేసింది

రామనాథం భోజనం చేసాడు మంచం వాల్చుకొని నడుం వాల్చాదో లేన్నాడు. సావిత్రి నెమ్మదిగా వెళ్ళి అతని దగ్గర నిల్చుంది నెమ్మదిగానే అంది, "బయలు పొలాన వుంటున్నామా ? ఏ క్షణానికి ఏం వుపద్రమొచ్చి పడుతుందో ఎవడొచ్చి గొంతు పిసుకుతాడోనని బిక్కుబిక్కుమంటున్నా ఆపాడు బంగారం - వున్న దగ్గర్నుంచీ భయమే ప్రాణాలతో వుంటే పిల్లా పాపకి నాలుగురోజులు పనికొస్తాం ! "

రామనాధానికి విషయం అర్థం కాక సావిత్రి వంక విచిత్రంగా చూసాడు. సావిత్రి నగల మూట తెచ్చి అతని చేతికి ఇచ్చింది

అతను ఏదో అనబోయే లోపలే మళ్ళీ అంది, "అవునూ - ఆ పంతులు గారి పొలం బాగుందంటగా ! శివుడు చెప్పాడు ! "

రామనాధానికి అంతాఅయోమయంగా వుంది అతని నొసలు ముడిపడ్డాయి నగలు - పంతులుగారి పొలం - శివుడు - వీటి మధ్య సంబంధం ఏమిటి ?

"ఏమైందీ .. ? శివుడేవయినా అన్నాడా ఏమిటి ? "

"వాడేవంటాడూ ? పాపం - వాడికీ ఏవీ తోచి చావట్లా - వయసు మీదున్న పిల్లాడు ఒంటికాయ సొంటి కొమ్ములా ఎట్లా వుండాడూ ? మనల్ని వదలి ఊరికి వెళ్ళడానికి మనపొప్పట్లా - కొట్టుకుచస్తున్నాడు మాపటేళకి కాసిని సజ్జబూరెలన్నా చేసి పెడతా - "సావిత్రి రామనాథం మరో ప్రశ్న అడిగే అవకాశం ఇవ్వకుండా గబగబ వెళ్ళిపోయింది కొడుకు తొందరపాటును కొంగులో దాచుకొనే తల్లిలా సావిత్రి శివుడి విషయాన్ని మరెవరి ముందు ఎత్తలేదు.

రామనాథం మూట విప్పి చూసాడు. మెరుగు తగ్గినా విలువ తగ్గని బంగారం తనను మట్టిలా మార్చమని ప్రాధేయపడుతుంది.

రామనాథం చేతులు వణికాయి. చిన్నతనం అనిపించింది.

'పేదపడ్డ వేళ కూడా భార్య వంటి మీది బంగారం ఆశించలేదు ఆడవారికి బంగారమంటే ప్రాణమంటారు. గాఢానురక్తి అంటారు మోజంటారు మోహం పెంచుకుంటారంటారు. వాటి చుట్టూ అనుభూతులు పెనువేసుకుంటూ ఉంటారంటారు, మరి సావిత్రి తన మోజును అణుచుకొనే ఈ బంగారం తన చేతి కిచ్చిందా ? మోహం చంపుకొనే ఇచ్చిందా ? ఈ రోజు ఏదైనా ఆవేశంలో ఇచ్చిందేమో ? మళ్ళీ కావాలని ఆమె ఆశిస్తే ... ?' ఏమైనా కొంతకాలం వాటిని అలాగే వుంచాలని నిశ్చయించుకొన్నాడు రామనాథం.

బయలు పొలం మీద సుడిగాలి తిరిగింది. ఇంటికప్పు మీది జమ్ము - పశువుల ముందు వేసిన గడ్డి పరకలు గాలిలో గిరికీలు కొడుతున్నాయి గింగిరాలు తిరుగుతున్నాయి. వెర్రి ఆవేశంలో అన్నం పళ్ళెం విసిరికొట్టి వెళ్ళిన శివుడు చాలా సిగ్గుపడిపోయాడు. ప్రాణంలా చూసుకొనే పిన్నిని పట్టుకొని నానా మాటలు అన్నందుకు వాడికి నాలిక కోసేసుకోవాలన్నంత ఆవేశం వచ్చింది ఆ పని చేయలేక గొడ్డలి తీసుకొని తుమ్మచెట్ల వెంట పడ్డాడు

'పెద్దల్ని పన్నెత్తి ఓ మాట అనని కుటుంబం తనది. ఏం వచ్చి తలకెక్కి కూర్చుందో తననిట్లా వాగించింది అయ్యో ఎంత మాటన్నాడు - ఈ అడవిలో నీ సోక్కేం వచ్చింది ! ఛీ ఛీ తనూ మనిషేనా ? తల్లిని పట్టుకొని అంత మాట ఎట్లా అన్నాడు తన నోరు పడిపోదేం ! '

శివుడు ఆక్రోశించాడు

'పాపం పిన్ని ఏనాడన్నా సరియైన చీరన్నా కట్టుకుందా ? మిగులు తగులుతో కడుపు నింపుకుంటుందే కానీ ఏనాడన్నా తిన్నగా అయిదు వేళ్ళు నోట్లో పెట్టుకుందా ? ఆ సాలాడి దగ్గర తెచ్చుకొన్న చీరలు వెలిసిపోయి కొంగులు దారాలు పట్టి ఎలా వున్నాయో ! అసలు పిన్నివంటి మీది నగల వైపు తన చూపెలా పడింది ? అయ్యో .. ఈ పాపిష్ఠి కళ్ళు పేలిపోవేం ? '

శివుడు పశ్చాత్తాప పడ్డాడు. తన కుసంస్కారానికి తనే కుంచించుకు పోయాడు. తనలో తను ముడుచుకుపోయాడు

'తలెత్తి మళ్ళీ పిన్ని మొహంలోకి ఎట్లా చూడడం ? '

శివుడికి కాళ్ళూ చేతులు వణికాయి కళ్ళు నీరు కమ్మాయి

'హఠాత్తుగా భూమి బద్దలయ్యి తనని లోపలికి లాక్కెళితే బావుణ్ను'

అలాంటిదేం జరగలేదు.

శివుడి అపరాధ భావన ఆవేశంగా బద్దలయ్యింది.

అలసిపోయేదాకా తుమ్మ చెట్లన్నీ నరుక్కుంటూ పోయాడు. ఫర్లాంగు దూరంలో తుమ్మ చెట్ల మధ్యగా ఏదో శివుడిని ఆకర్షించింది.

శివుడు గొడ్డలి భుజాన వేసుకొని ఒక్కపరుగున అక్కడికి వెళ్ళాడు.

శివుడి అనుమానంనిజమే !

అదొక తూము !

శివుడు అన్నీ మరిచి పోయాడు. అన్నీ తుడిచి పెట్టినట్టు మాయమయ్యాయి. తూమును చూసిన సంబరంలో శివుడి నోటమాట రాలేదు. ఓ మేక తూమునెక్కి నిక్కుతూ నీలుగుతూ మెడ నిక్కించి దిక్కులు చూస్తోంది. శివుడు తూములో దూరి ఈ చివర నుంచి ఆ చివరికి పాకుతూ బయటకు వచ్చాడు.

తనలోతను నవ్వుకుంటూ - గెంతుతూ దుముకుతూ - మధ్య మధ్యలో ఉల్లాసంగా చిన్న-చిన్న కేకలేస్తూ - ఇంటికి పరిగెత్తుకొచ్చాడు

"బాబాయ్ .. బాబాయ్ .. మరే మరే.. మన చేల దగ్గరికి కాలవ వచ్చేస్తోంది ! బాబాయ్ - కాలవ వచ్చేస్తోంది ! "

శివుడు రామనాధాన్ని పట్టి గిరగిరా తిప్పేసాడు.

అదే వేగంతో సజ్జబూరెలు వండుతోన్న సావిత్రి దగ్గరకి పరిగెత్తాడు. అలుపు దీర్చుకొంటూ అరిచాడు, "పిన్నీ - మన చేను దగ్గరికి కాలవ వచ్చేస్తోంది - పిన్నీ - వచ్చేస్తోంది ! "

" నీకు ఏదొచ్చినా పట్టలేంరా ! " సావిత్రి నవ్వుతూ బూరెను బాండీలోంచి తీసి మూకుట్లో పెడుతూ అంది

"పదరా శివుడూ . బాలయ్యను తీసుకొని పంతులు గారింటికి వెళ్దాం. ఇంతలో రామనాధం పైపంచ భుజాన వేసుకొని వచ్చాడు శివుడు మూకుట్లోని వేడివేడి బూరెలు తీసి రామనాధం నోట్లోకుక్కి తన నోట్లో కుక్కుకున్నాడు

రామనాధం గడపదాటుతూ ఒక్క క్షణం ఆగి సావిత్రి వైపు చూసాడు. సావిత్రి తన జేబుగుడ్డ మూట విషయం అడుగుతుందేమోనని ! సావిత్రి ఎప్పుడో ఆ జేబుగుడ్డ రంగు కూడా మరిచిపోయింది. బాండీలో సావిత్రి వేసిన బూరెపిండి సుయ్‌మంది బుర బుర పొంగింది కమ్మని బూరె మూకుట్లోకి వచ్చింది.

❋ ❋ ❋

ఆ పంటకి కాలవ తవ్వకం రామనాధం వాళ్ళ చేల మీదుగా ముందుకు సాగింది.

తరువాతి పంట నాటికి తూములు బిగించారు.

ఆ తరువాతి పంట కాలంలో కల్వర్టులు కట్టారు.

మళ్ళీ పై పంట నాటికి బిగించబడిన కొత్తలాకులపైని రెగ్యులేటర్‌లు మిలమిల మెరిసాయి.

కాలువల తవ్వకం పనులు మొదలవ్వడంతోనే - అక్కడ సందడి వచ్చింది. కాలువలు తవ్వేవాళ్ళు - కల్వర్టులు కట్టేవాళ్ళు - తూములు పెట్టేవాళ్ళు - కాలువ పొడవునా సందడి సందడిగా వుంటోంది.

వాళ్ళు పగలంతా పని చేసుకొని సాయంత్రానికి దస్తగిరి వాళ్లుంటున్న క్యాంప్‌కి వెళ్ళిపోతున్నారు.

కాలువలో తవ్వితీసిన మట్టిని ఓ పక్కన వేసి - చదును చేసి - రోడ్డులాగా చేసారు. రోడ్డును చదును చేయడానికి బుల్‌డోజర్ వచ్చింది.

వంపులు తిరిగిన కాలువ. దాని పక్కనే సమాంతరంగా బాట ఇప్పుడు ఆ కాలువ మీది సూపర్‌వైజర్, జె ఇ ల జీపులు ఆ బాట మీదే నడుస్తున్నాయి ఆ ప్రాంతం ప్రాంతమంతా తవ్వుతున్న కాలువల దగ్గరికే వచ్చేసింది

గొర్రెలను వాటి పాటికి వాటిని వదిలి వంకీ కర్ర చేత బుచ్చుకొని - నడుమున చేయి పెట్టుకొని కాలువ గట్టున తిష్టవేసే గొర్రెల కాపర్లు

బర్రెల మీద స్వారీ చేస్తూ - బుల్‌డోజర్ చుట్టూ గిరికీలు కొడుతూ నోరెళ్ళబెట్టే బుడ్డాళ్ళు -

కొడవళ్ళు నడమున బిగించి, తట్టలు చంకలో ఇరికించి కాలువకు కళ్ళప్పగించే రైతు కూలీలు-

నాగళ్ళు భుజాన పెట్టి - ఛర్నాకోల చేతిన బట్టి ముందు ముందుకు జరుగుతూ వస్తోన్న కాలువలో నీరు ఎప్పుడు వస్తుందా అని ఆశగా చూసే రైతు బిడ్డలు -

పెద్దవాళ్ళకి బురిడీ కొట్టి పరుగు పరుగున గట్టుకు చేరే పిల్లలు -

పిల్లలకు చూపిద్దామని భుజాన ఎక్కించుకొని తవ్వుతోన్న కాలువ గుండా నడిచి వచ్చే పెద్దలు

అంతా సందడి - సందడి - సందడి.

ఇక శివుడి సంగతి సరేసరి.

కాలువ పనులు నడుస్తున్నంత కాలం శివుడి కాళ్ళు నేలమీదలేవు. పొలానికి వస్తూ పోతూ ఎవరితో ఒకరితో మాట్లాడుతూ వుండేవాడు. సూపర్‌వైజర్‌తో కబుర్లాడే వాడు. బుడ్డాళ్ళతో పరాచికా లాడేవాడు.

ఇక కాలువకు నీళ్ళు వదిలేలోగా రైతులందరూ తమతమ పొలాలను వచ్చే కాలువ కోసం సిద్ధం చేసుకోసాగారు.

రామనాథం మొదట తాము లోగడ వేసుకున్న బాటను కాలువ పక్కన వేస్తోన్న బాట దాకా పొడిగించాడు. కాలువలోని నీరు పొలంలోకి రానూ పోనూ మడవలు తవ్వుకున్నారు వాటినుండి పొలమంతా విస్తరించేలా చిన్న కాలువలు తవ్వుకున్నారు. తూరుప్పొలంలో మరో చిన్న దొరువు తవ్వుకొన్నారు.

శివుడు తూమును చూసిన నాటినుండి కాలువ పనులు పూర్తి కావడానికి నాలుగు పంటల కాలం పట్టింది.

ఆలోగా రామనాథం వాళ్ళు పంతులు పొలం బాగు చేసుకొన్నారు. వాగొడ్డు పొలంలో వరి వేసారు. మిగిలిన దాంట్లో మెట్టపైరులు. భూమి మేఘం అనుకూలించడంతో పంటలు బాగానే పండాయి. సావిత్రి నాలుగు గేదెల పాడి చేసింది. కోళ్ళ గుంపు తయారయ్యింది. శివుడికి అటూ ఇటూ ఆలోచించేంత వ్యవధి లేకుండా చేతి నిండా పని దొరికింది వళ్ళు అలిసిన

పనిభూతం హాయిగా గుర్రుపెడుతోంది. నెమ్మది నెమ్మదిగా పంతులుగారి బాకీలు తీరిపోయాయి. పొలం మిగిలింది.

చివరి బకాయి తీర్చినపుడు పంతులుగారు సంతోషంగా అన్నారు "ధర్మం నిలిపారు! మాటంటే మీదండీ ! మూడు ఏళ్ళలో ముక్తిని ప్రసాదించారు ! ధన ధాన్యాభివృద్ధి రస్తు ! పుత్రపౌత్రాభివృద్ధి రస్తు ! శుభమస్తు ! కల్యాణమస్తు ! " పంతులుగారు చేయి ఎత్తి రామనాథాన్ని ఆశీర్వదించాడు.

"పంతులుగారు ఆగండాగండి ! ఆ చివరి మాట మా శివుడిని అనాలండి ... ! వచ్చే మాఘమాసంలో వాడిపెళ్ళి ! " రామనాథం నవ్వుతూ అన్నాడు

శివుడు ముఖం ఎర్రబరుచుకున్నాడు

పంతులుగారు మనసారా నవ్వారు

❋ ❋ ❋

"అబ్బ . అదృష్టమంటే అమ్మాయిదే ! నలభై ఎకరాల ఆసాములంట !" పెళ్ళికూతురి చుట్టాలెవరో సంతోషంగా అంటున్నారు

"ఇప్పుడే ఏవుంది ? ముందుంది ముసళ్ళ పండగ. కాలవలొస్తున్నాయి ఆ పొలాల మీదుగా కాలవలొస్తున్నాయి. నా తమ్ముడు షావుకారు అవుతాడు " రత్తయ్య కనుబొమలెగరేస్తూ - పెళ్ళి పందిట్లో చేరిన పెద్ద మనుషుల్తో - అన్నాడు.

"ఏంది బావయ్యోయ్ - మహా సూచొచ్చినట్టు చెప్తున్నావే ! " చనువు వున్న ఒకాయన మేలమాడాడు.

"సూడాలేంట్రా ! నా తమ్ముడి మొహంలో ఆ కళ సూడు ! ఆ శివుడి మొహంలో వెలుగు సూడు ! ఆ కళ ఆ వెలుగు మంచి పంట చూసిన రైతు మొహాన కాక మరెక్కడ కన్పడ్తయ్‌రా ? " రత్తయ్య మీసం దువ్వుకుంటూ అన్నాడు.

"మా బాగా చెప్పావ్ ! " భూషణం తలాడించాడు.

"పెదనాన్నా - శాస్త్రిగారొచ్చారు. నిన్ను పిలుచుకు రమ్మన్నారు " ఇంతలో సుధాకర్ వచ్చాడు.

రత్తయ్య లేచి సుధాకర్‌తో పాటు వెళ్ళాడు.

అప్పటిదాకా నోరెళ్ళబెట్టుకొని రత్తయ్య చెపుతోన్న ఆ దేశం కబుర్లు వింటున్న వారంతా కాస్త తెప్పరిల్లారు.

"నాన్నా .. మనం కూడా ఆ దేశాన ఓ నాలుగెకరాలు కొనుక్కుందా వేంటి రామభద్రం గారి చిన్నబ్బాయి పక్కనే వున్న తండ్రిని ఆశగా అడిగాడు.

"ఒరే అబ్బాయ్ . ఆ రత్తయ్య కబుర్లకేం వచ్చెగానీ - ఆ వ్యవసాయం మనవల్ల అయ్యేదికాదు - పెట్టేది కాదురా.. ఆళ్ళు కాబట్టి నెగ్గుకొస్తున్నారు అసలా ఈగలు ముసిరే అడవిలో ఎవరుంటార్రా ? " రామభద్రం తమ్ముడు చిన్నబ్బాయిని వారించాడు.

"ఒంటి పిల్లి రాకాసుల్లాగా వెళ్ళమారడం మన తరం కాదు బాబూ " సుబ్బయ్య పైపంచ దులిపి భుజాన వేసుకొన్నాడు

"ఏం చేసినా - ఆ సజ్జలు జొన్నలు పండే భూములు ఓ భూములంట్రా ? మాకూ వున్నాయన్న బోకరింపే కానీ అట్టాంటి భూములు వుంటే ఎంత లేపోతే ఎంత ? " నర్సయ్య తేల్చి పడేసాడు

"నిజమే మావయ్య - అనుకున్నంత మాత్రాన ఆసాములై పోతారా " ధర్మయ్యగారి మేనల్లుడు తీర్మానిస్తూఅన్నాడు.

"ఆ అదో సంబడం ! " పెదవి విరిచాడు రామభద్రం.

"మరే సంబడం బద్దలయినట్టే వుంది ! మీకో విషయం తెలుసా ? " రంగనాయకులు గొంతు తగ్గించాడు " ఆ రామనాథం వాళ్ళు రొట్టెలు తింటున్నారట . . రొట్టెలు"

"సంగటి కూడా ! " ధర్మయ్య గారి మేనల్లుడు అందించాడు.

"ఏం గతి పట్టింది ! " రామభద్రం ముక్కున వేలేసుకున్నాడు.

"మరే అట్టా గడ్డితిని సంపాదించ బట్టే ఇట్టా బాకీలు ఎళ్ళ మారారు ! రంగనాయకులు హేళనగా అన్నాడు.

"అదీ ఓ బతుకేనంట్రా ? మన పక్క కూలీనాలీ చేసుకొనేవాడు కూడా కూటికి తినకుండా కక్కుర్తిపడడు ! " సుబ్బయ్య చులకన చేసినట్లుగా అన్నాడు.

"అసలు వాళ్ళంతా అంతేనయ్యా - ఆ రత్తయ్య మాత్రం పెంటపోగు మీద కానీ కనిపిస్తే చాలు ఆ పళాన .... కళ్ళకద్దుకొని దాచుకుంటాడు - " రంగనాయకులు గొంతుమళ్ళీ తగ్గించాడు.

"ఇంతకీ పెళ్ళికూతురు ఇక్కడుంటదా ? ఆ దేశానికి పోతందా ? "

"అయ్యన్నీ మనకెందుకులే కానీ ... మన్లోమాట .. పాపం . ఆ పిల్లకి తిప్పలే!'

అందరూ ఉసూరు మన్నారు.

"ఆ సావిత్రి మెడాచేతులు చూత్తే తెలీట్లా - ఆ దేశాన వీళ్ళే మాత్రం ఆసాములో " సరిగ్గా అదే సమయానికి అమ్మలక్కలు బుగ్గలు నొక్కుకున్నారు

పెళ్ళి అయిపోయింది

శివుడు మూడునిద్దర్లకి అత్తగారింటికి వెళ్ళాడు

"అన్నయ్య . . ఆ నరసింహంగారి చేను అనూరాధ పేరునా ఉమ్మడిన రాయించాను

పంతులుగారి చేను ఉమ్మడిన రాయించాను ... " రామనాథం మాటలకు రత్తయ్య అడ్డం వచ్చాడు

"నాకెందుకురా అయ్యన్నీ చెప్పడం ? "

"చెప్పకపోతే ఎట్లా అన్నయ్యా ? నేనూ సావిత్రి రేపు బయల్దేరతాం. శివుడు పదహారు రోజుల పండగ దాకా వుంటాడో - ఎండాకాలం అంతా వుంటాడో వాడిష్టం ఇక, కోడలిని కాపురానికి తీసుకురావాలిగా . అన్నయ్యా - ఏం చేద్దామంటావ్ ? "

"అదేంట్రా రావుడూ - విడ్డూరంగా అడుగుతున్నావ్ ? " పున్నమ్మ కలగజేసుకుంటూ అంది.

"అది కాదమ్మా - మేమంటే ఉంటన్నాం . కానీ కొత్త అమ్మాయి ... "

"అట్లాగని శివుడు అక్కడానూ - ఆ అమ్మాయి ఇక్కడట్రా ... ? నాల్రోజులు ఇబ్బంది పడుతుందేమో కానీ అదే కలిసిపోతుంది ఎరగని పిల్లయితే అనుకోవచ్చు.... !" అంది పున్నమ్మ

రామనాథం ఒంటరిగా వున్నపుడు పున్నమ్మ నెమ్మదిగా కదిలించింది, "ఒరేయ్ రావుడూ - పెద్దాడి కూతుళ్ళ పరిస్థితి ఏవీ బాలేదురా - కాస్త పచ్చగా వున్నాం కందా ఏదైన సాయం చేయమంటన్నార్రా ! "

రామనాథానికి వెర్రి ఆవేశం వచ్చింది నోటికి కట్టుకొని కడుపుకు కట్టుకొని ఆ అడవిలో తాముపడే పాట్లు గుర్తొచ్చాయి. అప్పుల పాలయ్యినా నీటుగీటు తగ్గనివ్వకుండా కట్టిన బట్ట నలగనీయకుండా తిరిగే అల్లుళ్ళు గుర్తొచ్చారు.

"ఏం సాయంట ? " కోపాన్ని అణుచుకొంటూ అడిగాడు.

"డబ్బు సాయం చేత్తే పద్మాళ్ళు మిల్లు ఇడిపించు కుంటారంట-సరళాళ్ళేమో ... "

"ఇదిగో అమ్మా - పద్మకీ, సరళకీ, అల్లుళ్ళకీ అందరికీ చెప్పు !

మేమేం అక్కడ లంకెబిందెలు పాతి పెట్టిరాలా ! దినదిన గండం నూరేళ్ళాయస్సు ! నేను సాయం చేయాలంటే ఓ పని చేయమను. బడాయిలు కట్టి పెట్టి వచ్చి వాళ్ళనీ పొలం తీసుకోమను. పంటకి కావల్సిన విత్తనాలు, పనిముట్లు అన్నీ సాయం చేస్తాం. పనిసాయం కూడా చేస్తాం. కష్టపడమను. బాగుపడమను. అంతే ! " రామనాథం ఖరాఖండిగా చెప్పేసాడు.

ఊరికి బయల్దేరబోతుండగా రత్తయ్య రామనాథం దగ్గరికి వచ్చాడు, "ఒరేయ్ రావుడూ - నా దగ్గర ఎందుకురా దాపరికాలు ? శివుడు నాకన్నీ చెప్పాడు. ఒక్కడివీ ఎన్నాళ్ళని తిప్పలు పడతా ? పై పంట నాటికి నేను వస్తా. ..... కొత్త కోడలు వచ్చేనాటికి ఇల్లూ వాకిలి సిద్ధం చేయొద్దూ ... ? "

రామనాథం కళ్ళు చెమ్మగిల్లాయి.

అన్నదమ్ముళ్ళు వాటేసుకొని కళ్ళనీళ్ళు పెట్టుకున్నారు.

"బాగానే వుందిరా అన్నాదమ్ముల యవ్వారం !" పున్నమ్మ మురిపెంగా ముక్తాయించింది

"అమ్మా - మరి నువ్వేమంటావ్ ?". రామనాథం తల్లిని అడిగాడు.

"ఏవుందిరా రావూడూ - పిల్లలు బళ్ళోకెళ్తన్నారా ? వున్న పళాన ఎట్టా రావడం ? కొత్త మనవరాలిని కాపురానికి రానీ ! " రామనాథం, సావిత్రి బయల్దేరారు

పదహారు రోజుల పండుగ అవ్వగానే శివుడు, రత్తయ్య నడిగడ్డకు ప్రయాణమయ్యారు

రత్తయ్య తనతో పాటు తన నమ్మిన నేస్తాలు - మంచి ఒంగోలు జాతి ఎడ్లను - తోలుకొచ్చాడు

నాగలికి నాగలి కలిసింది

ఒంగోలు గిత్తలతో నడిగడ్డ గిత్తలు పోటీ పడ్డాయి.

అరకలు సాగాయి దుక్కులు దున్నాయి

కొత్తకోడలు - భారతి - కాపురానికి వచ్చింది

కొత్త కాలువలలోకి కొత్తనీరు వచ్చింది

రామనాథం పొలంలోకి నీళ్ళు మళ్ళించారు

రోహిణి ఎండలకు కాగి వున్న మట్టి ఆత్రంగా నోరు తెరిచింది. వచ్చిన నీటిని వచ్చినట్లే ఆవురావురంటూ తాగింది.

నలుగురూ నవ్విన నాపచేను షండబోతుంది

రామనాథం నాట్లు మొదలెట్టాడు

శివుడు నారు కావిడేసుకొని గట్లమీద ఉరుకలు పరుగులు పెడుతూ నారు అందించాడు

"వాలుకి అడ్డంగా నాటండి !" రామనాథం హెచ్చరించాడు

"మరీ అంత లోతుగా నాటమాకండి పైపైన నాటండి - దుబ్బు బాగా కడతది - " రత్తయ్య నారు అందిస్తూ అటూ ఇటూ తిరుగుతున్నాడు

వరిచేలు పొట్ట కొచ్చాయి అక్కడక్కడా కంకులు ఈనుతున్నాయి.

కొత్త కోడలు వేవిళ్ళ భారంతో పుట్టింటికి వెళ్ళింది.

వరి చేలలో నిలిపిన నీరు ఇంకి ఇంకి ఇన్నాళ్ళూ ఎండిపోయిన నేల లోలోపలి పొరల్లోకి చొచ్చుకొని పోయింది.

ఇన్నాళ్ళూ పై నుంచి పడిన వర్షం నీటితో పాటు అడుగుకుంటూ చేరిన లవణాలు - ఈ చొచ్చుకు వచ్చిన నీటితోపాటు పైకి తేలాయి.

పొలమంతా తెల్లని పొరలాగా అట్ట కట్టాయి. పాలు పోసుకొంటోన్న గింజ గిడసబారింది.

"పాల చౌడేసింది ! " రత్తయ్య నిర్ధారించాడు. రామనాథం వాళ్ళ ముఖాలు తెల్లగా పాలిపోయాయి

"ఏం చేద్దాం ?" రామనాథం ఆత్రంగా అడిగాడు.

"పైపైది పారలతో చెక్కేద్దాం ! నీరు వదిలి మళ్ళీ నీరు పెడదాం ! "

ఏమి చేసినా ఆ ప్రాంతపు పంటలన్నీ దెబ్బ తిన్నాయి.

ఉప్పు గాఢతకు తట్టుకోగలిగిన జొన్న, మొక్కజొన్న మాత్రం మిగిలాయి" ఏం వచ్చి పడ్డా ఇట్టా పంట కళకళ లాడ్తున్నప్పుడు వచ్చుద్దే !" శివుడు వాపోయాడు.

అసలు ప్రమాదం కాలువగట్టున పొంచి వుంది.

రైతులందరూ పంటలు కోసి కుప్పవేసుకొంటున్నారు.

రామనాథం పనలు పట్టాడు. దుబ్బులు కోసాడు. ఓదెలు ఆరేసాడు. కాలువ కొత్తగట్టు నాని నాని ఆ రాత్రి పుటుక్కున తెగింది. దిగువనున్న పొలం మీదికి నీళ్ళు ఉరుకులు పెడుతూ వచ్చిపడ్డాయి. రామనాథం, శివుడు కాలువ గట్టుకు పరిగెత్తారు.

దివిటీలు వెలిగించారు ఎండుగడ్డి వేసారు. బంకమన్ను వేసారు. గండి పూడ్చారు.

రత్తయ్య, సవారి పొలాన పడ్డారు.

వంచలు కట్టుకొన్నారు. కంకులు కోసుకున్నారు - వంచల్లో వేసుకొన్నారు. - మెరకకు చేర్చుకొన్నారు.

సావిత్రి, మాణిక్యం కూడా వంచలు కట్టుకుని కొడవళ్ళు పట్టుకొని చేలోకి దిగారు.

రత్తయ్య సవారిని కాలువగట్టుకు పరిగెత్తించాడు.

గండిపూడవడం తూర్పు విచ్చుకోవడం ఒక్కసారే జరిగాయి. తడిసిన రైతు గుండె వెచ్చబరచడానికి తన వేడి కిరణాలను వెంటేసుకొని సూర్యుడు హడావుడిగా వచ్చాడు.

భళ్ళున తెల్లవారింది. రైతులు గొల్లుమన్నారు.

"మొగుల్ల నీల్లు చూసి ముంత వొలకబోసినట్టు - ఈ కాల్వలు వచ్చెనని సంకలు గుద్దుకోని వాననీళ్ళు వాగుల వదిలితిమి. ఎంత పరేషాన్ చేస్నయ్ ! " బాలయ్య గొంతులో ఏడుపొక్కటే తక్కువ.

"రెంటికి చెడ్డ రేవడిలా తయారయ్యింది పరిస్థితి ! " రామనాథం నిట్టూర్చాడు.

కాలువ కల్వర్టు మీద కొంతమంది రైతులు, రామనాథం, బాలయ్య నిలుచుని మాట్లాడుకొంటున్నారు.

"ఏమైతే అయితది తియ్ .. ఇంగ నా సేలగా నీళ్ళు పారిచ్చేడ్డి లేదు ! నిక్కరంగ కురిసి సక్కరంగ సేద్యం జేసిన మంటె గిన్ని జొన్నలెత్తే మస్తు ! " ఓ వయసు మీరిన రైతు నారాయణయ్య అన్నాడు "వాము ఏస్నమంటే తిరుగులేదు మల్ల "

"'గట్లంటే ఎట్లనే ? మనం సేద్యం సేసుకోనింకె కాదూ కాల్వల నీళ్ళు ! " యువరైతు కేసన్న అన్నాడు

"అవ్ బిడ్డా - మంచిగన్నవ్ ! " మరొక రైతు తలాడించాడు.

"అంత భయపడాల్సిందేమీలేదు కొత్త కాలువలు వచ్చినపుడు ఇవ్వన్నీ వచ్చేవే . నేను మట్టి పరీక్ష చేయించుకు వచ్చాగా.... అది పాలచౌడేనని అన్నారు" అన్నాడు రామనాథం

"నేను ముంగట్నే చెప్పలే ! " ఒక ముసలిరైతు తన కొడుకుతో అన్నాడు

"కాలవగట్లు బిగిసేదాకా ఎక్కడో చోటగండి పడుతూనే వుంటాయి. మనం అప్రమత్తంగా వుండాలి" రామనాథం మాటలకు అందరూ తలాడించారు.

నిజానికి అందరి లోనూ దెబ్బతింది. రామనాథమే. వారందరూ ఇంచుమించుగా తమ సంప్రదాయ సేద్యం ప్రకారం సజ్జ, జొన్న, మొక్కజొన్న వేసుకున్నారు అవి తట్టు కోగలిగాయి. వరి విలవిల లాడి వాడి పోయింది

రామనాథం పాలచౌడు పట్టిన భూములను ఎలా ఎలా మెరుగు పరుచుకో వచ్చునో తను తెలుసుకున్న వివరాలు వారికీ చెప్పాడు.

అందరూ తమ పొలాలవైపు మళ్ళారు.

బాలయ్య రామనాథం దగ్గరకు వచ్చాడు.

"గీ ముచ్చట ఇన్నారూ ... ? ఆ తిమ్మడు లేడు ... వాడు ... సారా దుక్నం పెడ్తుండు. ఆ గౌండ్లోల్లు పొద్దుగాల వచ్చి లొల్లి[1] సేసి పోయిన్రు "

"ఎవరూ ఆ నరసింహంగారి నమ్మిన బంటేనా ?"

"అవ్ ... వాడే ! దొర పొలం అమ్మిందే వాన్కి ఊర్ల ఇజ్జత్[2] పాయె. ఆ జమానల వాడు ఏం నీల్గుతుండె ..... ఏం నీల్గుతుండె ! గిప్పుడు గింత పొట్టిగాడు కూడా వాణ్ణి ఖాతర్ సేస్తలేడు[3].. పోయి పాలమూర్ల దొర తాన వుండిండు. మల్ల ఏమాయనేమో ఊర్ల కొస్తుండు."

"మరేం చేద్దామను కొంటున్నారు ?

"పంచాయితి పిలుస్తున్రు - అయినాగాని ఏమయితది ? ఆ గౌండ్లోల్ల మాట గెలుస్తుందా ? దొర మాట గెలుస్తదా ? " బాలయ్య పెదవి విరిచాడు.

---

1 గొడవ 2. గౌరవం 3. లెక్కపెట్టడం లేదు

రామనాథం తలాడించాడు

"దొర ఊళ్ళోనే లేడుగా ? మరి ఆయన మాట ఎలా చెల్లుతుంది ? "

"సారాబట్టి దొరదను కొంటున్రు - " బాలయ్య రహస్యం చెప్పినట్లు చెప్పాడు

"ఏదో ఒకటి చేసి ఆపాలి "

"ఫాయిదా లేదు[1]". బాలయ్య పెదివి విరిచాడు "

"ఊర్ల జనం ఆ గొర్లను కాసి కాసి గొర్లమందయిన్రు దొర చెప్పిండంటే ఖతం ! ఇంగ ఒక్కమాట చెవిలపెట్టరు ! '

"లారీలు లారీలు సారా తాగి ఊర్లో జనాలు ఏమవుతారు ? " రామనాథం నిట్టూర్చాడు

"ఈ కాల్వలేపొద్దు తవ్వి న్రో - మనకు కష్టమొచ్చె కాల్వ పక్కన తొవ్వ బడ్డది తొవ్వ మింద సారా లారీ వొస్తది ! "

"నాయనా . " ఇంతలో గట్టిగా పిలుపు వినిపించింది

రామనాథం, బాలయ్య తలెత్తి చూసారు

మల్లేశ్ ఎయిర్‌బ్యాగ్ తగిలించుకొని పరుగులు పెడుతూ వస్తున్నాడు.

"తోవ మీద నీ కొడుకు కూడా నడిచొస్తున్నాడు - చూడు - బాలయ్య " రామనాథం నవ్వాడు.

మల్లేశ్ రామనాథాన్ని చూసి పరిగెత్తడం ఆపి నెమ్మదిగా నడిచి వస్తున్నాడు

బాలయ్య కొడుక్కి ఎదురెళ్ళాడు. ఆప్యాయంగా కొడుకుని వాటేసుకొని - వెన్ను నిమిరాడు చెయ్యి పట్టుకొని రామనాథం దగ్గరకు తీసుకొచ్చాడు

"నమస్తే ! " రామనాథానికి గౌరవంగా నమస్కరించాడు మల్లేశ్ "నీ కొడుకు నిన్ను మించిపోయాడు - బాలయ్య " రామనాథం నవ్వుతూ అన్నాడు.

"మా పోరని[2] ముందు నేనేడ ? పొట్టోణ్ణి " బాలయ్య నవ్వాడు మల్లేశ్ ఇప్పుడు కండపట్టి వళ్ళు తేలి వున్నాడు యువకుడి నవగాంభీరం ముఖంలో తొణికిసలాడుతోంది కాలువలో తుళ్ళుతోన్న తుంగభద్రలా కళ్ళనిండుగా వున్నాడు.

బాలయ్య ఏదో అడిగాడు.

"కసరత్[3] చేస్తున్న ... .. " అంటూనే మల్లేశ్ కను చివర్ల నుంచి రామనాథాన్ని చూసి ముఖం ఎర్ర బరుచుకున్నాడు

బాలయ్య కొడుకుని ముచ్చటగా చూసుకుంటున్నాడు.

రామనాథం మనసులో సుధాకర్ మెదిలాడు. సుధాకర్ వంటరి వాడయిపోయాడు

---

1 లాభం లేదు 2 అబ్బాయి 3 వ్యాయామం

బాపట్ల కాలేజీలో చేరాడు బస్సుల్లో వచ్చీ పోవడం బక్కచిక్కి వున్నాడు 'కొడుకును మలుచుకోవడంలో తండ్రి అవసరం ఇప్పుడే ' రామనాథం అనుకొన్నాడు ఓ నిశ్చయానికి వచ్చాడు

"అబ్బాయ్ - మల్లేశ్ - మీ కాలేజిలో చేర్పించడానికి మా వాడికి ఓ అప్లికేషన్ పంపిస్తావ్ ? "

"అలాగే నండి "

రామనాథం సుధాకర్ వివరాలనీ ఇచ్చాడు

ఇంతలో బాలయ్య వాళ్ళ వూరి వాడొకడు కల్వర్టు దాటుతున్నాడు అతని చేతిలో పురికొసతో కాళ్ళు కట్టేసిన రెండు కోళ్ళు - భుజాన కల్లుకుండ వుంది

"ఏందిరా - రాజిగా - ఎట్ల పోబడితివి ?" బాలయ్య అతన్ని ఆపి పలకరించాడు.

"ఏడ్కిలే ఇక్కడ్నే . "అతను గునిసాడు అతని చేతిలోని కోళ్ళు కిందకు వేలాడబడ్డ తలలను పైకెత్తాలన్న ప్రయత్నం చేస్తున్నాయి క్కె . క్కె. క్కె . అంటూ అరుస్తున్నాయి

"మంచిగ చెప్పరా - "

"సూపర్వైజర్ దొర తానకు - కోడి, ముంత కొండ బోతున్నా[1] "

"అట్లా అలుసు ఇచ్చామంటే నెత్తినెక్కి కూర్చుంటారు అయినా అతని పని అతను చేయడానికి కోడిముంత నైవేద్యం సమర్పించుకోవాలా ? " రామనాథం కోపంగా అన్నాడు, "అయినా దొరేంటి - దొర ?"

"దొర ?" బాలయ్యకు కూడా అరికాలి మంట నెత్తికెక్కింది, "నీ యమ్మ ! మల్ల షురూ[2] పెట్టినార్రా . ? లంజ కొడుకుల్లారా . పోయి వాని కాల్మొక్తారూ ? ధూ ! " బాలయ్య తుపుక్కున పక్కని ఉమ్మేసాడు

"సిగ్గూ శరం లేదురా .. ?"

మల్లేశ్ తండ్రి ఉద్రేకాన్ని విస్తుపోయి చూసాడు.

రామనాథం బాలయ్య వైపు ఆశ్చర్యంగా చూసాడు.

దొర ముందు ముంగాళ్ళమీద కూర్చున్న బాలయ్య గుర్తొచ్చాడు. 'ఇప్పుడు మునివేళ్ళ మీద లేస్తోన్న బాలయ్యకూ బాలయ్యకూ ఎంత తేడా ! విశేషమే ! '

రామనాథం బాలయ్యను సావధాన పరచాలని ప్రయత్నించినా బాలయ్య తగ్గలేదు

"ఊరికి నడ్వరా బాడ్కావ్ ..! పంచాయితి పిలుస్తా - గాడ్డెకొడ్కా ? " బాలయ్య బెదిరించాడు.

1 తీసుకెళుతున్నా 2 మొదలు

రాజయ్యను ఊరి వైపు తోసినంత పని చేసాడు

బాలయ్య మీద గౌరవం వల్లో పంచాయితి అంటే భయంవల్లో అతను ఊరు దారి పట్టి అదే పోత పోయాడు

"నిజమే బాలయ్య - ఆ ఆఫీసర్లని అలా తయారు చేసేది మనమే మనం అంతా ఒక్క మాట మీద వుండాలి. వాళ్ళతో జాగ్రత్తగా వ్యవహరించాలి.

"ఒక్కడు ఒక్కతీరుగ వుంటడా ? " బాలయ్య నిట్టూర్చాడు. -

"కాల్వలొచ్చె .. కష్టమొచ్చె ! "



# 5

శివుడి గట్టు మీదికి ఎక్కి తేరిపార చూసాడు.

చుట్టు పక్కల పొలాల్లోని రైతులంతా ఎక్కడికో హడావుడిగా వెళ్తున్నారు శివుడు ఒకరిని ఆపి అడిగాడు - "ఏమిటి విషయం ? "

"ఏందిలే - కాల్వ మింద ఎవురో లొల్లి జేస్తున్రంట - రారాదూ - ? " శివుడు అతన్ని అనుసరించాడు.

శివుడు అక్కడకు వెళ్ళే సరికే అక్కడ చాలామంది రైతులు గుమిగూడి వున్నారు.

అది మేజర్ కాలువ. అక్కడి నుంచి మూడు వైపులకూ మూడు కాలువలు చీలిపోతాయి. వాటికి సంబంధించిన మెయిన్ లాకులు అక్కడ వున్నాయి.

సరిగ్గా వాటి ఎదురుగా సూపర్‌వైజర్ జీపు ఆగి వుంది. సూపర్‌వైజర్ - ఆయన పక్కనే మరో ఆయనా నిల్చుని వున్నారు

శివుడు అతను ఎవరని పక్కనున్న వారిని ఆరా తీసాడు ..

"జె. ఇ. సాబ్ ! "

"గొడవేంటి ? "

"వారబంది కింద మనకు పోయిన వారంల నీల్లు ఇడసాలలే ! నోల్లు ఎళ్ళబెట్టి ఎన్ని దినాలాయె ? గీ పొద్దున కాల్వ ఇడస నింకె లొల్లి జేస్తున్రు"

"ఏవంట ? "

"ఆ దిక్కు ఊల్లోల్లు సూపరైజర్‌కు మస్తుగ తినబెట్టింఢ్రంట తాపిన్రంట - దుడ్లు[1] కూడా ఇచ్చిన్రంటున్రు - ఎవ్వనికెర్క ? గిప్పుడు కాల్వ మనకు బందు జేసి[2] వాల్లకు ఇడ్వ బట్టిన్రు - ఏందివయ్యా అంటే తిరగ మల్లిండు - పెద్దసాబ్‌కు పిల్వనప్పిండు"

"మరి మనాళ్ళేం చేస్తున్నారు ? "

"సాబ్ గడ్డం పట్టుకున్రు - దుడ్లు ఇస్తమన్నరు - అంతేకాదు మరి ? కాల్వ వచ్చుడు గావాలె. దుడ్లు చూస్తిమా పంట ఆగం కాదే ? "

నిజమే. పొలాలన్నీ పొట్ట కొచ్చి వున్నాయి. ఇప్పుడు నీటి అవసరం ఎంతైనా వుంది.

---

1. డబ్బులు 2. ఆపేసి

ముఖ్యంగా వరి చేలకి ఈ సమయంలో నీరే ప్రాణం. శివుడు అవునన్నట్లు తలాడించి - అందరినీ పరిశీలించాడు. రైతులందరూ మంచి ఉద్రేకంలో వున్నారు. వారి చేతులలో దుడ్డుకర్రలు, వంకీకర్రలు, ముల్లుకర్రలు, వసి కొయ్యలు శివుడు మరోటి కూడా గమనించాడు.

బాలయ్య లాంటి ఊరి పెద్దలు కానీ - రామనాథం కానీ కనిపించలేదు. శివుడు ఒకడిని బాలయ్యను పిలుచుకు రమ్మని పరిగెత్తించాడు. శివుడు రామనాథం కోసం పరిగెత్తాడు. శివుడు అటు వెళ్ళగానే గొడవ తారాస్థాయిని చేరుకుంది.

"పోని - మీరేం చేసుకుంటరో చేసుకోని ! దమ్ముంటే ముందుకు రాని ! లాకులు మూసుకొంటే మూసుకోని ! ఏ దిక్కు కావాల్నంటే ఆ దిక్కు నీళ్ళు వదులుకోని ! " సూపర్ వైజర్ గట్టిగా అరిచాడు.

"అంతేకాదు .... మీ దిక్కున్న చోటికి పోయి చెప్పుకోని ! "

ఖరాఖండిగా చెప్పేసి లాకుల తాళాలు జె.ఇ. చేతికి అందించాడు సూపర్ వైజర్. జె.ఇ. తాళాలు జేబులో వేసుకొని జీపులో ఎక్కి కూర్చున్నాడు.

సూపర్ వైజర్ కాలువ గట్టు మీద నిలబడ్డాడు

రైతులందరూ మౌనంగా గట్టు దిగి ఓ పక్కగా గుమిగూడారు.

సూపర్ వైజర్ కొద్దిసేపు వారి వంక ముఖం చిట్లించి చూసాడు. వాళ్ళల్లో చలనం లేకపోయే సరికి వెళ్ళి జె.ఇ. పక్కన కూర్చున్నాడు. ఇద్దరూ పరిస్థితిని అంచనా వేస్తున్నారు.

జె.ఇ. డ్రైవర్‌ను పురమాయించి - కళాసీని కూడా జీపు దగ్గరకే పిలిపించాడు.

నీళ్ళు అటువైపు కాలువ గుండా పక్కవూరి పొలాల్లోకి వెళ్ళిపోతున్నాం. ఆ కాలువ షట్టర్స్ అన్నీ తెరిచివున్నాయి. ఇటువైపు షట్టర్స్ మూసి వున్నాయి. రైతులు వాళ్ళల్లో వాళ్ళే మంతనాలు చేసుకొన్నారు. కొందరు యువకులు వసి కొయ్యలు తీసుకొని లాకుల మీదికి ఎక్కారు. రెగ్యులేటర్ తిప్పాలని ప్రయత్నించారు. అది తిరగలేదు.

జె.ఇ., సూపర్ వైజర్ ఒకరి ముఖాల్లోకి ఒకళ్ళు చూసుకొన్నారు. ఒక యువరైతు లాకు కన్నంలోకి చూసాడు. లోపలి పిన్ను కనిపించింది. దాన్ని బయటకు లాగితే చాలు. తాళం పెట్టి అయితే ఊరికే వస్తుంది.

"ఏమన్నా చేస్తరంట్రా ? " సూపర్ వైజర్ కంఠంలో కంగారు ధ్వనించింది.

జె.ఇ. తేలిగ్గా పెదవి విరిచాడు.

ఇంతలో ఓ యువకుడి బుర్రకి ఏదో తట్టింది.

పుల్లను రంధ్రంలోకి దూర్చి ప్రయత్నిద్దామనుకొన్నాడు. పుల్ల విరిగితే మొదటికే మోసం అనిపించి విరమించుకొన్నాడు.

మెల్లగా తన మొలతాడు విప్పాడు

మిగిలిన యువలకులందరూ అతని వైపు అయోమయంగా చూసారు అతను మొలతాడు కొసను ఉచ్చుముడి వేసాడు. యువకులందరూ కుతుహలంగా చూసారు.

అతను ఉచ్చును రంధ్రంలోకి దూర్చి - పిన్ను చుట్టూ బిగించాడు యువకులందరూ ఊపిరి బిగ బెట్టారు

అతను నెమ్మదిగా పిన్నును బయటకు లాగాడు అందరూ ఆనందంగా అరిచారు.

సూపర్ వైజర్, జె ఇ లేచి నిలబడ్డారు కళాసీ, డ్రైవర్ ముందుకు వచ్చారు

లాకుల మీద నుంచి తొంగి చూస్తున్న వాడొకడు - రెగ్యులేటర్ తిప్పాడు షట్టర్ మెల్లిమెల్లిగా తెరుచుకుంది నీళ్ళు దారి మళ్ళాయి

సూపర్ వైజర్, జె.ఇ వేగంగా అటూ రాబోయారు.

రైతులందరూ అడ్డం పడ్డారు. జీపులోకి ఎక్కేదాకా దడి కట్టారు ఇంతలో అటు నుంచి బాలయ్య ఇటునుంచి రామనాధం పరిగెత్తు కొంటూ వచ్చారు రావడమే జీపు దగ్గరికి పరిగెత్తారు. రైతులు కాస్త దారి వదిలారు. లాకుల మీదికి ఎక్కున్న వాళ్ళని వెనక్కి పిలిచారు. అందరూ వచ్చి గట్టుమీద నిల్చున్నారు.

ఈలోగా సూపర్ వైజర్ జె ఇ. జీపు ఎక్కి రయ్యిన వెళ్ళి పోయారు.

బాలయ్య రైతు యువకులందర్నీ గట్టిగా కోప్పడ్డాడు.

"ఏం చేసిన్రా - హౌలగాండ్ల[1] తీరున ! దిమాక్[2] గిట్ల ఖరాబయ్యిందా[3] ? "

"దేనికయినా ఓ పద్ధతి వుంటుంది. ఇలాగేనా సమస్యను పరిష్కరించుకొనేది ? ఇప్పుడు జె.ఇ. వాళ్ళు పోలీసులని తీసుకొస్తే ఏం చేస్తారు ? " రామనాధం రైతులందరి ముఖాల్లోకి చూస్తూ అడిగాడు.

అందరూ తెల్ల మొహాలు వేసుకొని, ఒకరి వంక ఒకరు చూసుకొన్నారు.

"పోలీసులు రావడం సంగతి అటుంచి - అటు ఆ ఆఫీసర్లకి ఇటు పక్క ఊరి వారికి మనం బద్ధవైరులం అవుతాం. సరిగ్గా పంట చేతికొచ్చే సమయం. ఇట్లాంటప్పుడు చేలకి నీళ్ళు అందకపోతే మనమంతా ఏమవుతాం ? సేద్యం చేయడానికే మనశక్తి చాలడం లేదు. ఇంక ఆ స్టేషన్లు చుట్టూ కోర్టుల చుట్టూ ఎక్కడ తిరుగుతాం ?" రామనాధం సూటిగా అడిగాడు.

రైతుల ముఖాలలో భయం నీడ స్పష్టంగా కదలాడింది.

"ట్రాన్స్‌ఫర్ అయితే ఆ ఆఫీసర్ వెళ్ళిపోతాడు. మనం వైరం మాత్రం మిగిలి పోతుంది ! "

"అవ్ .... మంచిగ జెప్పిన్రు ! వారబంది పెట్కుకుందమని సుట్టుమట్టు ఊళ్లోలం ఫైస్ల[4] జేస్తిమి. ఆ తీరుగనే చేస్తమని జెప్తము. ఇంగ కిరికిరి[5] జేసుడు దేనికి ? " ఒక పెద్ద రైతు తీర్మానించాడు.

1 తెలివి తక్కువ వాళ్ళు (తిట్టు) 2 బుర్ర (మెదడు) 3 పాడయ్యిందా 4 నిర్ణయం 5. గొడవ

"బాలయ్యా పెదనాయన మాట ఇనబట్టి గిట్లాయె - ఆ దినమే కోడిముంత కొండబోయుంటే[1] గీ తీరుగ అయితుండెనా ? " రాజయ్య పాత జ్ఞాపకాలు తవ్వి బాలయ్య మీద నిష్టూరపడ్డాడు.

" అరె .... హౌలగాని తీరుగ మాట జెప్పకు. వాండ్లను మేపి మేపి తాపి తాపి ఈ తీరుగ తెచ్చిన్రు - " బాలయ్య గట్టిగా ఖండించాడు.

ఇంతలో దుమ్ము లేపుకుంటూ రయ్యిన జీపులొచ్చాయి

"పోలీసు దొరొచ్చిండు - పోలీసు దొరొచ్చిండు .. "

గుసగుసలు చెలరేగి - చప్పున ఆగిపోయాయి. మౌనం తాండవించింది 'ఆ రాంనాధం చెప్పినట్లాయె - ' అందరూ మనసులో అనుకున్నారు., రామనాధం మాటల మీద అక్కడి వాళ్ళందరికీ నమ్మకం కుదిరింది.

"ఎవ్వడ్రా బద్మాష్‌గాడు[2] .. ? ఆ లాకులు తెర్చినోడు .... ? " ఎవ్వరూ కిక్కురు మనలేదు.

సూపర్ వైజర్ ఓ ఇద్దరు ముగ్గుర్ని వేలెత్తి చూపించాడు. రామనాధం, బాలయ్య జీపు దగ్గరకి వెళ్ళబోయారు. ఆ లోగానే సూపర్ వైజర్ చూపించిన రైతు యువకుల్ని ఎత్తి - జీపులో వేసుకొని - బర్రున దూసుకుపోయారు.

కళ్ళల్లో పడ్డ దుమ్ము దులుపుకుంటూ రైతులంతా ఎక్కడి వాళ్ళక్కడ నిలబడి పోయారు.

"ఠాణాకు[3] కొండబోయిన్రు .... ఠాణాకు కొండబోయిన్రు ... " ఒక్కసారిగా కలకలం చెలరేగింది. అక్కడి వాళ్ళందరికి రామనాధం చెప్పిన దాని మీద గట్టి గురి ఏర్పడింది.

"గిప్పుడేం చేసుడు ? "

అందరూ లబలబలాడారు.

రామనాధం, బాలయ్య, మరికొందరు పోలీస్ స్టేషన్‌కు వెళ్ళారు. ఇన్‌స్పెక్టర్ వారితో నెమ్మదిగా మాట్లాడాడు. విషయమంతా వివరించమన్నాడు.

రామనాధం మొత్తం సంగతి వివరించాడు. రైతుల తొందరపాటు గురించి కూడా చెప్పాడు.

"ఎవ్వన్కి చాతనైతే వాన్ని లాకులు తెర్వమన్నడు. పోరగాళ్ళు తెర్సిన్రు. మా ఊళ్లల్ల జనమంత అక్కణ్ణే నిలబడ్డరు. ఎవ్వన్ని అడిగినా చెప్తరు ... " బాలయ్య కల్పించుకొని చెప్పాడు.

"అవ్ ... మల్ల ... " వచ్చిన రైతులు ఒక్కసారి అన్నారు.

"ఒకేవేళ వాళ్ళు కేస్ పెట్టేవరకూ వస్తే, వాళ్ళు మా నుంచి లంచం ఆశించిన విషయం ప్రసావిస్తూ - మేమూ కేస్ పెట్టాల్సి వస్తుంది - " రామనాధం కాస్త గట్టిగానే అన్నాడు.

---

1. తీసుకెళ్ళివుంటే 2. తిట్టు 3. పోలీస్ స్టేషన్

ఇన్స్పెక్టర్ లోపల గదిలో వున్న సూపర్ వైజర్, జె.ఇ.లతో మాట్లాడి వచ్చాడు చివరికి కేస్ పెట్టకుండా - గట్టి వార్నింగ్ ఇచ్చి అరెస్ట్ చేసిన వారిని వదిలేసారు.

వచ్చేస్తోంటే ఇన్స్పెక్టర్ రామనాథంతో అన్నాడు - "కాలువల మీద గొడవలతో ఊళ్ళకి ఊళ్ళు తలలు పగలకొట్టుకున్న కేసులు నేనెన్నో చూసాను. ఇక్కడ దాకా వచ్చిన మొదటి గొడవ ఇదే . కాస్త మెళుకువగా మీలోమీరు పరిష్కరించుకొనేందుకు ప్రయత్నించండి. "

"ఎవడి పొలం పక్కన కాలవ పారకపోతే వాడికే కదండీ కడుపు మంట. వాడే కయ్యాలకు కాలు దువ్వేది " రామనాథం నవ్వుతూ అన్నాడు.

రామనాథం సూపరిండెంట్ యింజనీర్‌కు విషయమంతా వివరిస్తూ - పూర్వ ఒప్పందం ప్రకారం నీళ్ళ పంపిణీ జరపాలన్న తమ అభ్యర్థనను జతపరిచి - ఒక ఉత్తరం వ్రాసాడు . అక్కడి రైతులందరూ 'నిశానీ'[1] లు వేసారు.

రామనాథం సంతకం పెట్టాడు.

బాలయ్య, రామనాథం ఆ ఉత్తరం తీసుకొని మహబూబ్ నగర్ బయలు దేరారు

రైతులుకు పనులకు మళ్ళారు.

❋ ❋ ❋

"భలే మంచి రోజు ... పసందైన రోజు ... వసంతాలు పూసే నేటి రోజూ ...

"ఝుంకా గిరారే ... బరేలీకీ బజార్ మే ... జుంకా ... మేరీ జుంకా " ...

"చల్‌తే చల్‌తే యూహి కోయి మిల్‌గయా థా ... యూహికోయి ...

"భలే మంచ్ ... చ్ ... చ్ . . "

"జుంకా గిర్ ... ఆ... రే... బ....ర్ ...ఏ ... "

పక్కపోర్షన్లో గ్రాంఫోన్ రికార్డులు బర్రుబర్రున మార్చేస్తున్న శబ్దం వస్తోంది.

"అక్కా తమ్ముళ్ళు నిద్ర లేచినట్లున్నారు ! " మల్లేశ్ నవ్వుతూ అన్నాడు.

"అప్పుడే వాళ్ళకి తెల్లారిందీ ? " సుధాకర్ సరదాగా అన్నాడు. ఇద్దరూ నవ్వుకున్నారు.

పక్క పోర్షన్లో ప్రసాద్‌గారి కుటుంబం వుంటున్నారు. ఆయన ఓ ప్రభుత్వోద్యోగి. అతని భార్య విజయ. వారి పిల్లలు హిమబిందు, రవి. హిమబిందు మల్లేశ్ వాళ్ళ కాలేజీలోనే డిగ్రీ మొదటి సంవత్సరం చదువుతోంది. రవి స్కూలు విద్యార్థి. అక్కా తమ్ముళ్ళు గిల్లికజ్జాలు పెట్టుకోకుండా అరక్షణం వుండరు.

"ఇవ్వాళ టిఫిన్ నేను చేస్తా ! " సుధాకర్ ప్రకటించేసాడు.

"ఇవ్వాళ నేను చస్తా !" మల్లేశ్ నవ్వుతూ అన్నాడు.

---

1. వేలిముద్ర

"నీ కన్నీ వేళాకోళాలే ! అయినా ఈ రోజు అటో ఇటో తేల్చి పారేస్తా ! నీ ప్రాణాల మీద నీకు ఆశే వుంటే .. " చూపుడు వేలాడిస్తూ అన్నాడు సుధాకర్.

"ఆ .... ఉంటే ... ? " మల్లేశ్ ఆదుర్దా నటిస్తూ అన్నాడు.

"ఉగ్గాని చేయడం ఎలాగో చెప్తాను అలానో కాదో చెప్పు . "

"చెప్పక చస్తానా ? ఊ .. కానీ . . "

"తిరగమోత వేయాలి. ఉల్లిపాయలు వేయించాలి. మరమరాలు నాన బెట్టాలి. పిండాలి, బాండీలో వేయాలి. వేయించాలి. పుట్నాలపాడి[1] చల్లాలి, నిమ్మరసం పిండాలి . అంతేనా ?

" ఓరి నాయనో .... ఉప్పు, మిర్చి ఏవిరా బాబు ? "

"వేస్తాలేరా ... " సుధాకర్ అభయమిచ్చాడు, "నువ్వలా స్నానం చేసిరా - క్షణాల్లో వేడి వేడి ఉగ్గాని రడీ చేస్తా "

"నేను క్షణాల్లో స్నానం చేయలేను కాబట్టి కాస్త నిదానంగానే ఆ చేసేదేదో చేసిపెట్టు, సరేనా ? " మల్లేశ్ స్నానాల గది దాకావెళ్ళి అరిచాడు, "ఒకవేళ మనం పడేసినా ఆ వీధి కుక్కలు తినే మాత్రం చెయ్యిరా . "

"పడేసేదేదో వాటి మొహాన ఎందుకూ ? నీ మొహానే పడేస్తా ! నిశ్చింతగా స్నానం చేసిరా .... " సుధాకర్ బదులుగా అరిచాడు.

మల్లేశ్ వచ్చేసరికి సుధాకర్ చకచక ఉగ్గాని చేసి ప్లేట్లలో సర్ది మరీ వుంచాడు.

ఆ తెల్లటి ముద్ద లాంటి పదార్థాన్ని చూసి మల్లేశ్ బిక్కముఖం వేసాడు.

"మహానుభావా ... ఈ పదార్థ పరిచయంబెద్ది ? "

"ఉగ్గాని ! డౌటెందుకు ? "

" ఏం లేదూ .. ! పోపు పెట్టావా ? " మల్లేశ్ అనుమానంగా అడిగాడు.

"పెట్టా !" సుధాకర్ హుషారుగా తలాడించాడు.

"ఉల్లిగడ్డలు వేసావా ?

"వేయించా ! "

"బురుగులు వేసావా ? "

"వేయలా . ! "

"మరి ? "

"అటుకులు వేసా !"

"అటుకులు నాన బెట్టావా ?" మల్లేశ్ నీరసంగా అడిగాడు.

"నానబెట్టా ! "

"పిండావా ?"

1. వేయించిన శనగపప్పు

"పిండా ! "

"మరి ఇలా తగలడక మరెలా తగలడు తుంది ? ఒరే నాయనా ఆ వండేదేదో నేను వండేవాణ్ణి కదరా ? ఏ జన్మలో కక్షని ఇలా తీర్చుకుంటున్నావ్‌రా ? చిట్టి తండ్రీ ? " మల్లేశ్ దీనంగా అన్నాడు.

ఇంతలో తలుపులు నెట్టుకొని రవి వచ్చాడు. ఇద్దరు నిటారుగా లేచి నిల్చున్నారు

"పది నిమిషాల్లో మా యింటికి రావాలంట ! టిఫిన్ కూడా అక్కడే చేయాలని అమ్మ చెప్పింది ! " రవి చెప్పాల్సింది చెప్పగానే వాళ్ళ అభిప్రాయం కనుక్కోకుండానే తలుపులు టక్‌న మూసేసి వెళ్ళిపోయాడు.

"బుజ్జి తండ్రి ... ఆపద్భాంధవుడు .... "సుధాకర్ వెక్కిరింతగా అన్నాడు

" నేనేం అలా అనుకోవట్లా - " మల్లేశ్ ఉక్రోషంగా అన్నాడు - "అయినా ఇప్పుడు మనకో పెద్ద ప్రోగ్రాం వుంది ఇవ్వాళ రాఖీ పండగ "

"అయితే ? "

"హిమబిందు మనకి రాఖీలు కట్టే ప్రయత్నంలో వుంది , "

"అయితే ? '

"మరి తనకి మనం కానుకలివ్వాలి ? "

"మనమేం ఇస్తాం ?"

" ఖరీదైనవి ఇస్తే ప్రసాద్‌గారు ఒప్పుకోరు - "

"నా దగ్గరో నెమలి ఈక వుంది ఇవ్వనా ? "

"బి ఎ జెంటిలా మాన్ ! మరీ పిల్లాడి సలహాలు ఇవ్వకు ! "

" అయితే ఏవీ వద్దు ! "

"పద . . పద ! "

ఇంతలో -

"బిందూ... " గేటులోంచే కేకలు పెడుతూ వచ్చాడు ప్రసాద్

" ప్రసాద్ గారొచ్చారు - కాస్త నిదానంగా - వెళ్దాంలేరా - " సుధాకర్ మల్లేశ్ మళ్ళీ గదిలోకి వెళ్ళి పోయారు.

" బిందూ ..... రవీ ....... కమాన్ . .... మీ కోసం ఏం తెచ్చానో చూడండి " ప్రసాద్ తనో చిన్న పిల్లాడిలా సంబర పడిపోతూ జీపులోంచి సైకిళ్ళను దింపడంలో డ్రైవర్‌కు సాయం చేస్తున్నాడు.

"అబ్బ .... ఈ ఎర్రది .... నాకు ! " రవి గబగబ పరిగెత్తాడు

"ఒరేయ్ ... అన్యాయం రా ! లేడీస్ ఫస్ట్ కదా ? ఆ సైకిల్ నాకు !" హిమబిందు అతనికి

అర్థం వెళ్ళింది

" ఏం కాదు ... చిన్న పిల్లలే ఫస్ట్ ! "

" మొదలెట్టారూ ? పదండి. . పదండి .. లోపలికి వెళదాం .. ముందు తొక్కడం నేర్చుకుంటే ఆ తరువాత ఎవరిదేదో నిర్ణయించుకుందురు - "

"ఉండు నాన్నా - " ఇద్దరూ ఒకేసారి ముద్దుగా విసుక్కున్నారు. రవి సైకిల్ సీటును తడిమి, పెడల్స్ గిరగిరా తిప్పి - స్టాండ్ వేసి తీస్తున్నాడు.

హిమబిందు అద్దంలో ముఖం చూసుకొని - సైకిల్ బార్‌ని, హ్యాండిల్స్‌ని ముట్టుకొని చూసి - బెల్‌ట్రింగ్ ట్రింగ్ మనిపిస్తోంది.

" వాడికి సైకిల్ తెచ్చారు. బానే వుంది ! మరి దీనికెందుకు " విజయ ఎప్పుడు వచ్చిందో కాని గుమ్మంలో నుంచే అడిగింది.

" దానికే కావాల్సింది ! " ప్రసాద్ నవ్వాడు.

" అదసలే దుడుకుది. ఏ కాలో చెయ్యో విరగ్గొట్టుకొస్తే కానీ మీకు తెలీదు ! "

" విరగ్గొట్టుకోనీ ... ! ఏవవుతుందీ ? "

హిమబిందు, రవి కిసుక్కున నవ్వారు. విజయకి ఉక్రోషం ముంచుకొచ్చింది.

" మీవన్నీ వితండ వాదాలు ! "

"ఇందులో వితండమేం వుందీ ? నీ బాధేంటో సూటిగా చెప్పరాదూ ? "

" బిందు క్లాస్‌లో లింగులిటుకు మంటూ నలుగురు ఆడపిల్లలు. ఇప్పటికే మనమ్మాయి ఒడ్డూపొడుగు మూలాన కాలేజీ కంతా ఘనత వహించింది. ఇక ఈ సైకిల్ ఎక్కి వీర విహారం చేస్తుంటే కానీ - వుండదు - "

"ఎలా వుంటుందేం ? గుర్రం ఎక్కిన రుద్రమదేవిలా వుంటుంది - అంతేగా ? "

"మీతో వాదించలేం ! "

"నీతోనే మేం వాదించలేం ! అవతల ఇందిరాగాంధీ దేశాన్ని ఏలుతోంటే నా కూతుర్ని ముద్దపప్పులా మూలన కూచోమంటావ్ ? "

"అబ్బో ... అయ్యగారొక పండిత నెహ్రూ ... అమ్మాయిగారొక ప్రియదర్శిని ! " విజయ మూతిమూడొంకర్లు తిప్పింది.

"కాకూడదేం ! ఇప్పుడు ఆడవాళ్ళు విమానాలు కూడా నడిపేస్తున్నారు. మరి మనమ్మాయి సైకిల్ తొక్కితే ఏం ? "

" హైదరాబాద్‌లో అయితే అది వేరండీ .. ఇక్కడ ... "

" ఏం ? హైద్రరాబాద్‌లో అయితే గాలిలో తొక్కుతారా ? " ప్రసాద్ వస్తోన్న నవ్వును

బిగబెడుతూ అన్నాడు

హిమబిందు , రవి కూడా ముసిముసి నవ్వులు నవ్వుకుంటున్నారు

"మీ కన్నీ వేళాకోళాలే " విజయ నిస్సహాయంగా వెనక్కి తిరిగింది, "ఒరేయ్ , రవీ వెళ్ళి మల్లేశ్‌నీ సుధాకర్‌నీ పిలుచుకురా ? " విజయ లోపలికి వెళ్ళిపోయింది

"ఏమిట్రా విశేషం ? " ప్రసాద్ గదిలోకి వెళ్ళి సూట్‌కేస్ తెరుస్తూ అడిగాడు

" ఇవ్వాళ్ళ రాఖీపండగ కదనాన్నా " గోముగా అంది హిమబిందు

" ఓహో . అదన్నమాట సంగతి ! ఒరేయ్ . రవీ . రాఖీ ఏమో నీకు టోపీ ఏమో నాకు ! "

అక్కాతమ్ముళ్ళిద్దరు పకపక నవ్వారు

"బిందూ" విజయలోపల్నుంచి కేకేసింది.

"నాన్న ముందే చెప్తున్నా . . అల్లాటప్పా కానుక ఇస్తే నేను తీసుకోను ! " హిమబిందు ఖరాఖండిగా చెప్పేసి లోపలికి వెళ్ళింది

ప్రసాద్ ఊరునుంచి వస్తూ తెచ్చిన డ్రస్ ప్యాకెట్ రవి చేతికిచ్చాడు

"ఒరేయ్ .. బాబూ ... ఈసారికి దీంతో సరిపెట్టేయరా ? " రవి అభయ హస్తమిచ్చాడు.

ఇంతలో మల్లేశ్ వాళ్ళు రానే వచ్చారు.

హిమబిందు బరబర కుర్చీలు లాగి - వాళ్ళని కూర్చోపెట్టింది.

"ఒరే బడుద్దాయ్ .. నువ్వూ రారా ! " హిమబిందు తమ్ముడిని కేకేసింది హిమబిందు లోపలకి వెళ్ళి ట్రేలో రాఖీలు, కుంకుమ, ఓప్లేట్లో రవ్వలడ్లు పెట్టి తీసుకొచ్చింది

విజయ దీపపు కుందిలో వత్తివేసి - వెలిగించి - హారతి పళ్ళెంలో పెట్టుకు వచ్చింది. ప్రసాద్ కూడా వచ్చి వారి పక్కనే కూర్చున్నాడు.

హిమబిందు ముగ్గురికి కనుబొమల మధ్యనుండి నుదుటి పైదాకా వీరతిలకం దిద్దినట్లుగా కుంకుమ దిద్దింది.

కుడి మణికట్టుపై రాఖీలు కట్టింది. రవ్వలడ్లు నోట్లో పెట్టింది. హారతి కళ్ళు కద్దింది.

రాఖీ పండుగ అన్నా చెల్లెళ్ళ అక్కాతముళ్ళ ఆనందాల పండుగ. సౌభ్రాతృత్వం సౌహార్ద్రం కలకాలం విలసిల్లాలని మనసారా ఆశించే శుభవేళ

"మీలో ఈ సోదరభావం ఎప్పటికీ నిలిచిపోవాలి ! "

విజయ, ప్రసాద్ వాళ్ళందరికీ మనసారా ఆశీస్సులు అందించారు.

ఇంతలో రవి పరిగెత్తుకు వెళ్ళి, ప్రసాద్ తెచ్చి ఇచ్చిన డ్రస్ ప్యాకెట్‌ను ట్రేలో పెట్టాడు.

"ఇక నీ కానుక కూడా ఇచ్చేసామే - అక్కా ! "

రవి చేతులెత్తేసాడు. రవి వాలకం చూసి అందరూ నవ్వారు.

హిమబిందు కనుచివరగా ఆ ప్యాకెట్‌ను గమనిస్తూ బింకంగా అంది, "ఒరే చవటాయ్ - నువ్విచ్చే బోడి కానుక కోసమట్రా... నీకు రాఖీ కట్టేది ? "

"మరెందుకు ? " సుధాకర్ నిజంగానే తెలుసుకొందామని అడిగాడు.

"రక్షించడానికి ! "

"హిమబిందుని మనమేం రక్షిస్తాం ? తనే మనల్ని రక్షించాలి ! ముఖ్యంగా ఇంగ్లీష్ మేడం బారి నుండి ! " మల్లేశ్ నవ్వాడు.

హిమబిందు ఏలూరు సెంట్ థెరిసాలో ఆ తరువాత సికింద్రాబాద్ సెంట్ ఫ్రాన్సిస్‌లోనూ చదివి వచ్చింది.

మల్లేశ్, సుధాకర్ పదో తరగతి వరకూ తెలుగు మీడియం.

పియుసికి వచ్చేసరికి ఇంగ్లీష్ మీడియం - పియుసి, డిగ్రీ అంతా ఇంగ్లీష్ మీడియమే తెలుగు మీడియం లేనేలేదు.

అందువల్ల పియుసిలో ఇంగ్లీష్ పుణ్యాన వడపోతపోయగా మిగిలిన కొద్ది మందే డిగ్రీలో కాలు పెట్టారు. ఆ కాలేజి వాళ్ళని హిమబిందు కాన్వెంట్ చదువు ఉక్కిరి బిక్కిరి చేసింది

" నేను రక్షిస్తాలేవే ! " రవి హిమబిందుకు భరోసా ఇచ్చాడు.

"పోరా .... బుడంకాయ్ ! " హిమబిందు రవి నెత్తిన ముద్దుగా మొట్టింది.

"మర్యాద ... మర్యాద ! ఇప్పుడైతే రాఖీ కట్టావ్ ! అప్పుడే దీవిస్తున్నావ్ !" రవి బుంగ మూతి పెట్టాడు.

అందరూ నవ్వారు.

"రాఖీ పండుగ శుభసందర్భంలో మిమ్మల్నందరినీ సినిమాకు తీసుకెళ్తాను .. "" ప్రసాద్ ప్రకటించేసాడు.

"ఏవున్నాయ్ ... ? "

" భారత్ టాకీస్‌లో లేత మనసులు ... రాధాలో మూగమనసులు ... హనుమాన్‌లో కన్నె మనసులు ... అశోక్‌లో ఏదో హింది సినిమా ... " వేళ్ళు ముడిచి తెరుస్తూ గబగబ చెప్పాడు రవి, " హింది సినిమా గుర్తొచ్చింది- మేరా సాయా ! "

" ఒరేయ్ తిన్నగా బడికెళ్తున్నావా ? టాకీసులన్నీ చుట్టేస్తున్నావా ? " విజయ అనుమానంగా రవి వైపు చూసింది. "అయినా, ఇన్ని మనసు లేమిట్రా ఒక్కసారిగా ? " విజయ ముక్కున వేలేసుకుంది.

"కన్నెమనసుల్లో కొత్త యాక్టర్స్ వున్నారు. - " సుధాకర్ తన సినిమా జ్ఞానం ప్రకటించాడు.

"లేత మనసులు పోదాం నాన్నా . . మా స్కూల్లో అందరూ చూసారంట " రవి గారాలు

పోయాడు

"ముందే చెప్తున్నాను - ఏ మనసులైనా నేను మాత్రం రాను !" అంది విజయ.

"అమ్మ రాకపోతే నేనెలా రాను " హిమబిందు బిక్కమొహం వేసింది.

"మళ్ళీ అదేంటి ? "

"అబ్బో ... ఆ టాకీసుల్లో ఆడవాళ్ళో పక్క - మగవాళ్ళో పక్క ! దానికి తోడు ఆడవాళ్ళ చుట్టూ పరదాలు కడతారు బాబూ - సినిమా మొదలయితే కానీ తీయరు. ఇంటర్వెల్‌లోనూ పరదాలు దింపేస్తారు. అబ్బో .. నేన్రాను ! " విజయ మళ్ళీ అంది.

"అయితే ఎవ్వరం రాము ! " అందరూ ముక్త కంఠంతో అన్నారు

" ఇంతకీ ఆ ప్యాకెట్‌లో ఏంటీ ? " హిమబిందు కుతుహలంగా రవి తెచ్చిచ్చిన ప్యాకెట్ విప్పింది

అది ఓ తెల్లని తెలుపు మీద లేత గులాబీ పూలు ఎంబ్రాయిడరీ చేసిన చుడిదార్ ముదురు గులాబి మీద నెమలి కంఠం రంగు టై అండ్ డై దుపట్టా.

"మళ్ళీ ఇదో సంబడం పెట్టారూ ? " విజయ ప్రసాద్‌ని విసుక్కుంది.

"మరి బిందు పరికిణి వేసుకొని సైకిల్ ఎట్లా తొక్కుతుంది ? చక్రాల్లో పావడా అంచులు పడవూ ? " ప్రసాద్ ఆమెను ఉడికిస్తూ అన్నారు.

విజయ తల పట్టుకుంది.

ఆ రోజు మధ్యాహ్నం నుంచే హిమబిందు, రవి సైకిల్ పాఠాలు మొదలెట్టారు.

ప్రసాద్ వాళ్ళ ఇంటి ఎదురుగా వున్న పెద్ద ఊడల మర్రిని దాటి, దాని ఎదురుగా వున్న విశాలమైన గ్రౌండ్‌లోకి వెళ్ళారు. ఆ గ్రౌండ్ దాటగానే రైల్వేస్టేషన్ వైపు వెళ్ళే రోడ్డు - రోడ్డుకు అవతల బాయ్స్‌మల్టీ పర్పస్ స్కూల్. ఆ గ్రౌండ్‌కి ఎడం వైపున డాక్ బంగ్లా కుడి వైపున పిడబ్ల్యుడి ఆఫీస్.

హిమబిందు, రవి వీటన్నిటి చుట్టూ తిరుగుతూ సైకిల్ పాఠాలు పూర్తి చేసుకొన్నారు. రెండు మోకాళ్ళు చెక్కులు కట్టించుకున్నాక హిమబిందు సైకిల్ చకచక తొక్కగలుగుతోంది.

ఆ ప్రదేశమంతా జనాల సందడి తక్కువ. అది న్యూటౌన్‌లో ఫార్టీ హౌసెస్ కాలనీ. ఉద్యోగస్తులు, ఇద్దరు డాక్టర్లు, ముగ్గురు లాయర్లు, ఒక సబ్ జడ్జి అక్కడ నివసిస్తున్నారు.

ఫార్టీ హౌసెస్‌కి సమాంతరంగా వున్న విశాలమైన కాంపౌండ్‌లో వున్న బాయ్స్‌మల్టీ పర్పస్ స్కూల్‌ని దాటితే బేసిక్ స్కూల్ - దాని కుడి పక్కనే ఈ మధ్యనే కొత్తగా నిర్మించిన భవనంలో గర్ల్స్ హైస్కూల్ - బేసిక్ స్కూలు వెనకగా హిమబిందు వాళ్ళు డిగ్రీ కాలేజి.

బడివేళలలో వచ్చేపోయే విద్యార్థులతో కళకళలాడే వీధులవి.

హిమబిందు కాలేజికి, వెళ్ళేలోగానే కెమిస్ట్రీ ట్యూషన్‌కి వెళ్ళేది. కలెక్టరాఫీసు దగ్గర

నుంచి రమ వచ్చేది శ్రీదేవిది ఆకాలనీనే ముగ్గురు కలిసి వెళ్ళడం అలవాటు చేసుకొన్నారు.

" బిందూ - వస్తూ వస్తూ కాస్త పంచదార తెచ్చి పెట్టవే -" విజయ ట్యూషన్‌కి బయల్దేరుతున్న హిమబిందుని పురమాయించింది.

అప్పటికే రమ, శ్రీదేవి వచ్చారు ముగ్గురు కలిసి కబుర్లు చెప్పుకొంటూ పోతున్నారు.

బసప్ప కాంపౌండ్ దగ్గర ఓ కిరాణా దుకాణం - అక్కడే చిన్న కూరగాయల అంగడి, అవసరమైన వాటన్నిటికి ఆకుల చౌరస్తాకో కూరగాయల మార్కెట్‌కో పోవలసిందే.

ఇంతలో ఎవరో ఒకతను సైకిల్ మీద రయ్యిన వచ్చి నడుస్తున్న అమ్మాయిల చుట్టూ ఓ గిరికీ కొట్టి వెళ్ళాడు

అమ్మాయిలు విషయమేంటో అర్థం కాక ఎక్కడి వాళ్ళక్కడ బిగుసుకు పోయారు. హిమబిందు ముందు తేరుకొని " పదేండేపోదాం - ఎవరోరౌడీవేధవ" అంటూ ముందుకు నడిచింది.

ఇంతలో నలుగురు అబ్బాయిలు చుట్టుముట్టారు. వాళ్ళచేతుల్లో వున్న నోట్‌బుక్స్ మీద దరువేస్తూ అరవడం మొదలెట్టారు.

"రౌడీ ... రౌడీ .. రౌడీ ..."

అప్పటికే రమ, శ్రీదేవి చవి చచ్చిపోయారు. ఆ అబ్బాయిలు వారి కాలేజ్ వారే వాళ్ళిద్దరూ హిమబిందును చెరోవైపు లాగారు.

ఆ అబ్బాయిలు అమ్మాయిల్ని కదలనివ్వకుండా చుట్టూ తిరుగుతూ దరువేస్తూనే వున్నారు. అలాగే నెమ్మదిగా ముందుకు కదులుతున్నారు.

హిమబిందు కనుచివరల నుండి చూసింది. ట్యూషన్లకు వచ్చి పోయేవాళ్ళు, పాలు వగైరా అమ్మేవాళ్ళు, వాళ్ళువీళ్ళు, నెమ్మదిగా అటూ ఇటూ తిరుగుతున్నారు. నడిబజార్లో అమ్మాయిల్ని ఎంతసేపు నిలవేసిన ఒక్కరూ అదేమిటని అడగడం లేదు.

ఆ కుర్రాళ్ళ గోల మధ్యనే కిరాణా దుకాణం దాకా వచ్చారు.

హిమబిందు తన ఫ్రెండ్స్‌ను లాక్కుని చప్పున దుకాణంలోకి దూరింది. ఎప్పుడూ వెళ్ళే దుకాణం కాబట్టి ఆ కబురు ఈ కబురు చెపుతూ నిల్చున్నారు.

"కిలో పంచదార ఇవ్వండి " హిమబిందు పంచదార కొంటోంది, రమ వెక్కుతూ శ్రీదేవితో అంటోంది, "రేపట్నుంచి మా అన్నను తీసుకొస్తానే ! "

ఆ నలుగురు అబ్బాయిలు ఆ దుకాణం ముందు గిరికీలు కొడుతూనే వున్నారు. హిమబిందు వాళ్ళు దుకాణదారుడితో ఏదో బాతాఖానీ వేసారు.

"అదుగో..... మల్లేశ్ వస్తున్నాడే ! " రమ హిమబిందుని గిరింది. శ్రీదేవికి, రమకి ప్రాణం లేచొచ్చినట్లయింది.

హిమబిందు మల్లేశ్‌ని పిలిచింది అందరూ కలిసి వెళ్ళిపోయారు "సాలీ[1] ! "" నలుగురు

1. మరదలు (ఇక్కడ తిట్టు)

కుర్రాళ్ళు నిరాశగా వెనక్కి తిరిగారు. ఒకడు తుపుక్కున ఉమ్మేసాడు

ఆ రోజు కాలేజీకి వెళ్ళేసరికి ఇంగ్లీష్ మేడం గేట్లోనే ఎదురొచ్చింది. అమ్మాయిలని తిన్నగా లేడీస్ రూంలోకి తీసుకెళ్ళింది.

అది కొత్తగా వచ్చిన డిగ్రీ కాలేజి.

అక్కడ క్లాస్‌కి మహావుంటే ఇద్దరో ముగ్గురో అమ్మాయిలు. పోకిరీ కుర్రాళ్ళు గొడవలు ఎక్కువ వుండడంతో లెక్చరర్స్‌కు అమ్మాయిలను ఎస్కార్ట్ చేసేపని అదనంగా పడింది

అది యువతీయువకుల మధ్య మర్యాదబద్ధమైన సంబంధం వుండాలని నిర్దేశించే కాలం. ఆ అమర్యాదా పూర్వక వాతావరణంలో తమ మర్యాదను కాపాడుకోవడానికి అమ్మాయిలు సహజంగానే పడరానిపాట్లు పడుతుంటారు.

ఆ రోజు అమ్మాయిలు లేడీస్ రూంలోకి వెళ్ళేసరికి నోటీస్ సిద్ధంగా వుంది.

కాలేజి ఎలక్షన్లంట. అమ్మాయిల తరుపున ఒకరు రిప్రెంజెంట్ చేయాలంట

" ఇదో తతంగం ! " తెలుగుమేడం వేళాకోళంగా అంది.

లేడీ రెప్రెంజెంటేటివ్ అవసరం ఆ కాలేజీలో లేనేలేదు. ఎందుకంటే నోటీస్‌లో తప్ప మరెన్నడూ ఆమె పేరుతో కానీ ఆమెతో కానీ అవసరమే వుండదు. ఒట్టి ఫార్మాలిటీ ! అంతే !

ఇంగ్లీష్ మేడం హిమబిందు పేరు సూచించింది. కాలేజి మొత్తంలో ఇరవై మంది అమ్మాయిలు లేరు. ఏకగ్రీవంగా హిమబిందు పేరును ప్రకటించేసారు.

అబ్బాయిల్లో ఆర్ట్స్ వాళ్ళు నిలబడ్డారు కానీ సైన్స్‌వాళ్ళు ఉత్సాహం చూపలేదు

ప్రెసిడెంట్ కోసం పోటీ చేస్తున్న వారిలో భూపాల్ ఒకడు. నరసింహం కొడుకు.

అప్పటి వరకూ ఆ కాలేజీలో ప్రతిక్లాస్‌లో బోర్డుమీద పేరు రాయడం - క్లాస్‌లో ఇష్టమున్న వాళ్ళు చేతులెత్తడం - పద్ధతిలో సులభంగా ఎలక్షన్లు జరిగి పోతుండేవి.

ఈ ఏడాది హైదరాబాద్ నుంచి వచ్చిన ఎకనామిక్స్ లెక్చరర్ ఎలక్షన్ల పంథా మార్పించాడు.

ప్రచారం మొదలయ్యింది.

విద్యార్థులు ఈ కొత్త పద్ధతి వల్ల గొప్ప ఉత్సాహంలో వున్నారు. నాయకులు, ఉపనాయకులు అన్న భావం బాగా తలకెక్కించుకున్నారు.

కాలేజీ అల్లకల్లోలంగా తయారయింది. ప్రధానంగా భూపాల్‌కు అతని ప్రత్యర్థికి మధ్య కాలేజీ రెండుగా చీలిపోయింది. కొందరు అటు కొందరు ఇటు.

మల్లేశ్, సుధాకర్ లాంటి వాళ్ళు మధ్యస్తంగా మౌనంగా వుంటున్నారు. నిజానికి, భూపాల్, అతని ప్రత్యర్థి, వాళ్ళ చుట్టూ చేరిన కొద్దిమంది భజన పరులు సృష్టిస్తోన్న విభేదాల వత్తిడే అది.

కాలేజి గోడల మీద నినాదాలు రాసారు కరపత్రాలు వేసి పంచారు సైకిళ్ళకు తోరణాలు కట్టారు. బ్యాడ్జిలు తయారుచేసి, విద్యార్థుల చొక్కాలకు పిన్ చేసారు.

అందరికి మల్లేనే కాలేజి గేట్లోకి రాగానే మల్లేశ్, సుధాకర్‌ల చొక్కాలకు భూపాల్ తరుపు వాళ్ళు బ్యాడ్జిలు పిన్ చేసారు.

మల్లేశ్ బ్యాడ్జి తీసేయబోయాడు. సుధాకర్ ఇంకా ఏం చేయాలో నిర్ణయించుకోలేదు. క్షణాల్లో వాళ్ళిద్దర్నీ భూపాల్ ముందు నిలపెట్టారు

" అరె నువ్వురా మల్లిగా ? ఎవరో అనుకొన్నా !" భూపాల్ అహంభావం ధ్వనిస్తుండగా హేళనగా అన్నాడు.

మల్లేశ్‌కు అరికాలి మంట నెత్తికెక్కింది బ్యాడ్జితీసి కింద పడేసాడు. భూపాల్ చర్రున ఒంటికాలి మీద లేచాడు.

" ఏం రా ? నేనెవరో మర్చినవా ?"

భూపాల్ కళ్ళెర్ర చేసి గద్దించాడు.

మల్లేశ్ ఏమీ మట్లాడలేదు. 'దొరకొడుకు అని పిలిపించు కోవాలనేమో ! ఎవరి దగ్గర ఈయన గద్దరి తనం ?'

" చెప్పుబే ! " పక్కనున్న భూపాల్ మనిషి మల్లేశ్‌ను నెట్టాడు.

మల్లేశ్‌కు వళ్ళు మండింది. వాణ్ణి విదిలించుకున్నాడు.

"ఓటు అడుక్కోవడానికి వచ్చినాడివి - అనుకున్నా ! " తనూ చులకన చేసినట్లుగానే అన్నాడు మల్లేశ్.

" ఏం బే ...ఈ భూపాల్ ... అడుక్కొనేటోని తీరుగ కన్పిస్తుండా ! " భూపాల్ మల్లేశ్ దగ్గరగా వచ్చి మల్లేశ్ ఛాతీ మీద చెయ్యివేసి వెనక్కి నెడుతూ అన్నాడు.

మల్లేశ్ నిర్లక్ష్యంగా తలెగరేసాడు. నెట్టినా పడకుండా నిలదొక్కుకున్నాడు.

ఈ లోగా సుధాకర్ బ్యాడ్జి తీసి కింద పడేసాడు.

భూపాల్ కోపాన్ని నవ్వుగా మార్చాడు.

"అచ్ఛా ... ! అయితే వీడా నీ దోస్త్ ... ! అట్ల చెప్పు ... గొర్ల కాసెటోనివి నీ కింత దిమాక్[1] ఏడ కెళ్ళి వచ్చిందనుకుంటి ... " విషయమంతా కనుక్కునట్లు వంకరగా నవ్వాడు భూపాల్.

సుధాకర్ భూపాల్ భేటి ఇదే. సుధాకర్‌కి ఎలా సమాధానమివ్వలో కూడా అర్థం కాలేదు. మల్లేశ్ వంక చూసాడు.

మల్లేశ్, సుధాకర్ చెయ్యి పట్టి లాగి భూపాల్‌తో గట్టిగా అన్నాడు - "అవును ! నేను గొర్ల కాసెటోన్నే ! నేనే కాదు వీడూకూడా ! మేం సేద్యం చేస్తాం చెమట చిందిస్తాం. మా కష్టం మీ కడుపు నింపుతుంది. మా కండ కరిగితే నీకు కొవ్వు పడుతుంది. మేం లేకపోతే మీరు లేరు! గుర్తుంచుకో ! "

1. మెదడు, తెలివి

మల్లేశ్, సుధాకర్ వేగంగా వెనక్కి కదిలారు నాలుగడుగులు వేసాక మల్లేశ్ గిర్రున భూపాల్ వైపు తిరిగి అన్నాడు

" మాకు ఎవ్వర్నీ అడుక్కుతినే ఖర్మ మాత్రం పట్టదు ! ఎవరి దయాదాక్షిణ్యాలకు దేబిరించే అవసరం మాకు రాదు ! "

భూపాల్ ఒక్క క్షణం బిత్తరపోయాడు తేరుకొని ముఖాన నవ్వు పులుముకొన్నాడు. నెమ్మదిగా లౌక్యంగా అన్నాడు - " అరరే మల్లీ - ఏదో తమాషాకు అన్న అంత కోపం దేనికి ? మనం మనం ఒక ఊరోల్లం - జ్ఞాపకం పెట్టుకో !

" నా పేరు మల్లేశ్ ! నువ్వూ జ్ఞాపకం పెట్టుకో ! "

మల్లేశ్, సుధాకర్ బరబరా వెళ్ళిపోయారు. భూపాల్ దృష్టి సుధాకర్ మీద పడింది.

భూపాల్ ప్రత్యర్థి ప్రతి విద్యార్థి దగ్గరికి వచ్చి బతిమిలాడాడు. దిల్లీవాలాలో స్వీట్లు తినిపించేదాకా వచ్చాడు. పోటాపోటీగా ప్రచారాలు ముగిసాయి. ఎలక్షన్లు అయ్యాయి భూపాల్ గెలిచాడు.

హిమబిందు ఇప్పుడు కాలేజికి సైకిల్ మీద వచ్చేస్తుంది.

మొదటిరోజే హిమబిందు ఇంటిదాకా తీసుకురావాల్సి వచ్చింది.

" వెధవ సైకిల్ - దీన్ని నేను మోసుకు రావాల్సి వస్తోంది "

మర్నాడు టైర్ పంక్చర్, ఆ మర్నాడు చిరిగిన సీట్.

" ఇదేవిటే బాబూ ... నాకు సైకిల్ గ్రహణం పట్టుకుంది "

తరువాతి రోజు నుంచి హిమబిందు సైకిల్ ఎక్కడికి వెళితే ఆ సైకిల్‌కి చుట్టూ మరో పది సైకిళ్ళు సిద్ధం

అమ్మాయిలు పరదాలు కట్టిన రిక్షాలలో వచ్చి కాలేజీ గేట్లో దిగే ఆ చోట వారు తలెత్తినా, కళ్ళెత్తినా, ఫక్కుమన్నా, గబగబ నడిచినా ఓ వింత . మూడు స్కూళ్ళు , రెండు కాలేజీలు వున్న ఆ సెంటర్‌లో హిమబిందు ఓ చర్చనీయాంశమైపోయింది.

అడుగులో అడుగేసుకుంటూ బెరుకు బెరుగ్గా బిత్తర చూపులు చూస్తూ - పెదవులు కదలకుండా మాట్లాడుకొనే అమ్మాయిల మధ్య చెరగని చిరునవ్వుతో నదురు బెదురు లేకుండా తిరిగే హిమబిందు ఓ స్పెసిమన్ అయిపోయింది

నిజానికి హిమబిందు ఎప్పుడూ తన హద్దులు దాటే ప్రయత్నం కూడా చేయలేదు. చాలామంది ఆమె హద్దులు చెరపాలని ప్రయత్నాలు చేస్తూనే వున్నారు.

ఆ రోజు హిమబిందు సైకిల్ మీద కాలేజీకి వెళుతూ వుంది. ఎదురుగా ఓ సైకిల్ వేగంగా దూసుకువచ్చింది. వెనక సైకిల్ క్యారియర్ మీద ఒకడు కూర్చుని వున్నాడు. ఆ సైకిల్ వస్తోన్న తీరును చూసి హిమబిందు తన సైకిల్‌ను పక్కకు తిప్పింది.

హిమబిందు ఊహించంత వేగంగా ఆ సైకిల్ ఆమె సైకిల్ మీదకు వచ్చేస్తోందా అన్నంత ముందుకు వచ్చేసింది. సైకిల్ బాగా దగ్గరికి రాగానే క్యారియర్ మీద కూర్చున్నవాడు చేతులు బార్లా చాపాడు చాచిన చేతులు హిమబిందుకు ధబాల్న తాకాయి. ఆ వేగంతో హిమబిందు ముందుకు తొట్రుపడింది గట్టిగా "ఓ" అని అరుస్తూ నోటిమీద లబలబ కొట్టుకున్నాడు చాచినవాడి చేతులు హిమబిందును అమాంతం ముందుకు తోసాయి

హిమబిందు తత్తరపోయింది హ్యాండిల్ పట్టు తప్పింది.

హిమబిందు వెళ్ళి అల్లంత దూరాన పడింది

అప్పుడే అక్కడికి వచ్చిన ఇంగ్లీష్ మేడం హిమబిందును లేపి, వెళ్తున్న వాడిని తిట్టింది, "బ్రూట్ .. కళ్ళు కనపడట్లా ... !"

వాళ్ళు సైకిల్ ఆపుకొని - వెనక్కి తిరిగి వచ్చాడు. వీళ్ళ మీదకి వచ్చినట్లుగా వచ్చి ఓ వెకిలి నవ్వు నవ్వి వెళ్ళిపోయారు

"ఇడియట్స్ . అదేం సంతోషమో ! శాడిస్ట్సు ! " ఇంగ్లీష్ మేడం వాళ్ళని తిడుతూ హిమబిందు మోచేతుల్ని కర్చీఫ్‌తో అద్దింది. లేడీస్ రూంలోకి తీసుకెళ్ళింది

"తెలుగు పాఠాలు చెప్పే ఖర్మ పగవాడికి కూడా వద్దురా తండ్రీ " తెలుగు మేడం గాల్లో దండాలు పెడుతూ లేడీస్ రూంలోకి వచ్చింది.

"ఏమైందండీ ? "

" ఆ ఆర్ట్సు స్టూడెంట్స్‌తో చచ్చే చావొచ్చింది. అసలా తెలుగు పద్యాలన్నీ మాలాంటి వాళ్ళ ప్రాణాలు తీయడానికి రాసి పెట్టినట్టున్నారు అబ్బబ్బా .." ఉస్సురంటూ కుర్చీలో కూలబడిందామె

"అయినా పద్యాల్లో అన్ని పదాలు వుంటాయి కదా ! వెతికి వెతికి బూతుమాటలే పట్టుకొని వేపుకు తింటారు వెధవలు. డస్టర్ తీసుకొని ఒక్కోడి ముఖం పచ్చడి చేయాలని పిస్తుంది. పింజారీ వెధవలు ..... ! అప్రాచ్యప్పీనుగులు !"

ఇంతలో ఇంగ్లీష్ మేడం హిమబిందు గాయం మీద టించ్చర్‌లో ముంచిన దూది పెట్టింది.

" అబ్బా ... !" మంట పుట్టడంతో హిమబిందు ఓ చిన్న కేక పెట్టింది.

" ఈ మాత్రానికేనా ? " ఇంగ్లీష్ మేడం హిమబిందును చూసి నవ్వింది.

" అవునండి ... మీ కలాగే నవ్వులాటలా వుంటుంది. మేము సిగ్గుతో చచ్చి పోతున్నాం ! " తెలుగు మేడం నిష్ఠూర పడింది.

"అయ్యబాబోయ్ ... నేను మిమ్మల్ని అనలేదండీ .. ఈ అమ్మాయిని అన్నాను అయినా మీరు భలే వారండీ. ఈ కాలేజీ కంతా టింగురంగా మంటు ఇద్దరు లేడీ లెక్చరర్స్‌మి - మనకు తోడు ఈ అమ్మాయిలు. అందరం ఒక్కమాట మీద నిలబడకపోతే ఇక్కడ నెగ్గుకురాగలమా ? " ఇంగ్లీష్ మేడం సర్ది చెపుతూ అంది. తెలుగుమేడం కుదుటపడింది.

"అన్నట్లు మర్చిపోయా ఎల్లుండి సీతాఫల్ డే ! "

" నిజం ! " ఇంగ్లీష్ లెక్చరర్ సంతోషంగా అంది, " హిమబిందూ నువ్వు లేడీస్ రెప్రెంజెంటేటివ్‌వి కాబట్టి - కాలేజీలో వున్న అమ్మాయిలందరూ వచ్చేట్టు చూడాల్సిన బాధ్యత నీది ఓకే ? "

" ఓకే మేడం " హిమబిందు హుషారుగా తలూపింది

ఆ రోజే కాలేజీ అయ్యాక హిమబిందు అమ్మాయిలందర్నీ పోగేసి విషయం చెప్పింది అమ్మాయిలందరికీ రావాలనే వుంది కానీ - ఇంట్లో అడిగి చెప్తామన్నారు. హిమబిందు ఉత్సాహం మీద నీళ్ళు చల్లి నట్లయ్యింది. మర్నాడు ఉదయాన వచ్చి రమ, శ్రీదేవి నసిగారు వాళ్ళా మాత్రం నయం మిగిలిన వాళ్ళు పెదవి కూడా విప్పలేదు.

"ఏవొచ్చిందే మీకంతా ?" హిమబిందు నిస్సహాయంగా విసుక్కుంది ఇంగ్లీష్ మేడంకి చెప్పింది

ఆవిడ అమ్మాయిలందరి ఇళ్ళకీ వెళ్ళి పెద్దలతో మాట్లాడింది చివరికి ఓ పదిమంది సిద్ధమయ్యారు. రమ, శ్రీదేవి కూడా బయల్దేరారు

సీతాఫల్ డే !

మహబూబ్‌నగర్ పట్టణంలోని విద్యార్థులందరూ ఏడాదంతా ఉత్సాహంగా ఎదురు చూస్తుండే రోజు

పిల్లలు - పంతుళ్ళు తేడా లేకుండా పాఠాలు - పరీక్షలు - అన్నీ పక్కకు పెట్టేసి ప్రకృతి ఒడిలోకి పరుగులు పెట్టేరోజు

పట్టణం చుట్టు ముట్టిన గుట్టల వరుస వాటిమీద అందంగా అమరిన సీతాఫలం చెట్లు విరగకాసి పండడానికి సిద్ధంగా వున్న సమయం అది.

ఆ సమయంలోనే పట్టణంలోని స్కూళ్ళు, కాలేజీలు వాళ్ళకి అనుకూలమైన ఒకరోజును సీతాఫల్‌డేగా ప్రకటించుకొంటారు.

సీతాఫల్‌డే ఆ పట్టణపు ప్రత్యేక పండుగ.

సీతాఫలాలు మాధుర్యం నింపుకోవడానికి తమ ప్రాంతాన్ని ఎంచుకున్నందుకు ఆ పట్టణం ఆత్మీయంగా చాటుకునే అభిమానం ఆ రోజు - సీతాఫల్‌డే !

హిమబిందుకు అది మొదటి సీతాఫల్ డే

అందరూ చెపితే వింటూ వుండేదే కానీ పాల్గొంటోంది ఇప్పుడే హిమబిందు కుతూహలంగా, ఉత్సాహంగా ఆరోజు కోసం ఎదురు చూసింది. విజయతో సున్నుండలు, రవ్వలడ్లు, పులిహోర, పకోడీలు చేయించుకుంది. రాఖీకి తెచ్చిన కొత్తడ్రస్ వేసుకుంది. సైకిల్ తుడుచుకొని సిద్ధం అయ్యింది.

మల్లేశ్, సుధాకర్ కూడా వస్తున్నారు సుధాకర్‌కి కూడా ఇది మొదటి సీతాఫల్‌డే. వాళ్ళిద్దరికి కూడా విజయ తినుబండారాలు సర్ది ఇచ్చింది. హిమబిందు వాళ్ళ కాలేజీలో అమ్మాయిలు వాళ్ళలో వాళ్ళు గట్టిగా మాట్లాడితేనే ఓ వింత. ఇక అబ్బాయిలతో మాట్లాడితే ఇక అంతే !

హిమబిందు ఇంటి దగ్గర మల్లేశ్ వాళ్ళతో మాట్లాడినా కాలేజిలో మాత్రం కాలేజీ సంప్రదాయం పాటిస్తుంది.

మల్లేశ్, సుధాకర్‌లు ఫైనల్ ఇయర్ స్టూడెంట్స్, హిమబిందు ఫస్టియర్ అందుకే కాలేజీలో తరుచూ కలిసే అవకాశం కూడా లేదు.

ఇంతలో రమ, శ్రీదేవి మరికొందరు అమ్మాయిలు వచ్చేసారు.

వాళ్ళు తెచ్చిన తినుబండారాల గురించి గలగల మాట్లాడుతున్నారు

హిమబిందుకు వాళ్ళలా మాట్లాడుతుంటే ఎంతో చక్కగా వుంది. హిమబిందుకు వాళ్ళ వాలకం అస్సలు మింగుడు పడదు. ఇంత చలాకీగా వుంటారా ... గడప దాటారంటే నోరు కుట్టేసుకుంటారు ... చెవులు మూసేసుకుంటారు. తలలు వాల్చేసుకుంటారు. చివరికి క్లాస్‌లో లెక్చరర్ చెప్పేది అర్థం కాకపోయినా సందేహాలు వచ్చినా కిక్కురు మనరు.

"వీళ్ళెట్లా బాగుపడతారూ ?" హిమబిందు అప్పుడప్పుడు ప్రసాద్ దగ్గర వాపోయేది.

" అది కాదబ్బా ... హిమబిందు సైకిల్ తీసుకొస్తుందా ? " రమ పక్కనున్న అమ్మాయిని ఆరా తీసింది.

సరిగ్గా అప్పుడే తన అమ్మానాన్నలతో హిమబిందు వాదన వేసుకుంటుంది.

"అంత దూరం నడవాలంటే కాళ్ళు నొప్పులు .. అమ్మ .. ప్లీజ్ .. అమ్మా .... మా తల్లివి కదూ .... ఈ ఒక్కసారికీ సైకిల్ తీసికెళతా .. " హిమబిందు విజయ గడ్డం పుచ్చుకొని బతిమిలాడింది.

"తల్లిని కాబట్టే చెపుతున్నా - విను. నలుగురితో పాటు నారాయణా అన్నారు - మిగిలిన వాళ్ళు ఏం చేస్తారో నువ్వు అదే చెయ్యి."

" విజ్జీ - అవతల అమెరికా వాళ్ళు రాకెట్‌లో చందమామ దగ్గరకి ప్రయాణమవుతున్నారు ఇక్కడ మనమ్మాయిని సైకిల్ మీద పిల్లల మర్రి వెళ్ళకుండా అపుదామా ? " ప్రసాద్ తన ధోరణిలో అన్నాడు.

" మీరు బట్టతలకీ మోకాలికీ లంకె వేయకండి, బిందు సైకిల్ తొక్కితే నాకు మాత్రం ఇష్టం వుండదా ? నే చేప్పేది చెప్పా. ఇక మీ ఇష్టం . మీ కూతురిష్టం ! " విజయ కోపంగా వెనక్కి తిరిగి గొణుక్కుంటూ లోపలికి వెళ్ళింది, " విజ్జీ - అంట - విజ్జీ ! అరటికాయ బజ్జీ లాగా!""

"అరటి కాయ బజ్జీ కాదు అమ్మా - మిరపకాయ బజ్జీ !"

వంటింట్లో గిన్నె ధడేల్మంది.

తండ్రీ కూతుళ్ళు కిసుక్కుమన్నారు

హిమబిందు తన స్నేహితుల దగ్గరకి వెళ్ళింది.

వాళ్ళు ఈ సంభాషణ అంతా విన్నారు.

రమ నెమ్మదిగా అడిగింది, " అయితే, నువ్వు సైకిలేసుకొనే వస్తవాబ్బ ? "
హిమబిందు అందరి ముఖాల వంకా చూసింది అవును - అంటే అందరు పిల్లల మర్రికి రావడం మానుకొని ఇళ్ళకు మళ్ళేట్లున్నారు . సైకిలా? స్నేహితులా ? హిమబిందు ఊపిరి పీల్చి వదిలింది.

"లేదు" అమ్మాయిలందరూ తేలిక పడ్డారు.

విజయ కూడా తేలిగ్గా గాలి పీల్చుకుంది.

అమ్మాయిలందరూ భుజాలకు సంచులు తగిలించుకొని బయలు దేరారు.

అబ్బాయిలు కొందరు నడుస్తూ కొందరు సైకిళ్ళ మీదా బయలుదేరారు. కాసేపు అమ్మాయిల ముందుగా, కాసేపు వెనగ్గా, కాసేపు పక్కగా కాసేపు చుట్టూ గిరికీలు కొడుతూ వాళ్ళు ముందుకు సాగుతున్నారు. కొందరు సైకిళ్ళు తొక్కుతుంటే - కొందరు సైకిల్ తొక్కకుండా, నడిపిస్తూ దాని పక్కనే నడుస్తున్నారు. ఇంకొందరు గెంతులు పెడుతూ మరికొందరు పాటలు పాడుతూ - డాన్సులు చేస్తూ - దరువులేస్తూ నడుస్తు వున్నారు.

మల్లేశ్, సుధాకర్ ఈ హడావుడి అంతా నవ్వుతూ చూస్తూ కాస్త వెనగ్గా నడుస్తున్నారు.

అమ్మాయిలు నవ్వొచ్చినా బిగపెట్టుకుంటూ -కాళ్ళునొప్పులు పుడుతున్నా కిక్కురుమనకుండా - ఏదైనా మాట్లాడు కోవాలంటే గుంపుగా గుసగుసలాడుతూ - అడుగుతీసి అడుగు వేస్తే శబ్దం రాకూడదన్నంత మెత్తగా నడుస్తున్నారు.

పెద్దాసుపత్రి దాటాక ఇండస్ట్రియల్ ఎస్టేట్ మధ్య నుండి లోపలికి వెళ్ళి ... వెళ్ళి .. ఓ మైలో రెండుమైళ్ళో నడుస్తూనే వున్నారు.

" అబ్బ మేడం - ఆ పచ్చని కొండ చూడండి ! ఎంత బావుందో ! " హిమబిందు అప్రయత్నంగా గట్టిగా అరిచేసింది.

" అదే పిల్లల మర్రి " ఇంగ్లీష్ మేడం నవ్వింది.

కాస్త ముందువెళ్తున్న అబ్బాయిలు వెనక్కి తిరిగి హిమబిందును ఓ అజ్ఞానురాలిని చూసినట్లు చూసారు.

అబ్బాయిలు గట్టు తెగిన వాగులాగా కేరింతలు కొడుతూ కిందపడుతూ లేస్తూ పిల్లలమర్రి వైపు ఉరుకులు పరుగులు పెట్టారు.

హిమబిందుకి కూడా అలాగే వెళ్ళాలనుంది, కానీ మిగిలిన అమ్మాయిలు అప్పటికే వేళ్ళాడ బడిపోయారు. ఉస్సురంటూ కాళ్ళు వత్తుకుంటూ బలవంతాన అడుగు తీసి అడుగు వేస్తూ నడుస్తున్నారు.

మేడం ల పరిస్థితి దాదాపు అంతే.

హిమబిందు ఆగి చుట్టూ చూసింది

అంతా చెట్లు. సీతాఫలం, రేగు - వీటిని హిమబిందు గుర్తుపట్టింది వాటి మధ్య ఆకుపచ్చని కొండలాగా పెద్ద మర్రిచెట్టు. చెట్టు నిండా ఊడలు. ఊడలు నేలలో పాతుకుపోయి ఒక్కో ఊడ నుంచి మరో మర్రిచెట్టు ఈ చెట్టునిండా ఊడలు. ఊడల నుంచి చెట్లు. చెట్ల నుంచి ఊడలు. దాదాపు మూడు ఎకరాల విస్తీర్ణంలో వున్న ఆది అంతం తెలియని మహావటవృక్షం పిల్లలమర్రి !

"అబ్బ "

హిమబిందు కిందపడిన మర్రి ఆకుని చేతిలోకి తీసుకుంది అది కెంపు రంగు ముఖమల్ లాంటి కొత్త మర్రి ఆకు

ఆకుపచ్చ పట్టులాంటి లేత ఆకు, నిండు ఆకుపచ్చ ముదురు ఆకు - ఎన్ని రకాల ఆకులో ! ఎన్ని ఆకులో !

ఆ ఆకుల మధ్య ఎవరో అందంగా అమర్చినట్లున్న ఎర్రటి మర్రి పళ్ళ గుత్తులు

కొన్ని కొమ్మలు ఒక కాండం నుంచి మరో దానికి వంతెనల్లా వున్నాయి. మరికొన్ని కొమ్మలు నేలకంటా వచ్చి వయ్యారంగా లేచి వంపు తిరిగి ఆకుల కిరీటం ధరించి ఆకాశాన్ని నిక్కి చూస్తున్నాయి. ఇంకొన్ని కొమ్మలు ఊగడానికి ఉయ్యాలలయ్యాయి.

కొన్ని ఊడలు నిటారుగా నేలలోకి చొచ్చుకొని పోయి ఏ శిల్పో నేర్పుగా చెక్కిన ఏకరాతి స్తంభాల్లాగా వున్నాయి.

"వేల స్తంభాల మంటపం ! " హిమబిందు తన్మయత్వంతో అనుకొంది -

"విప్పారిన ఆకుపచ్చ గొడుగు"

అబ్బాయిలు అప్పటికే కొమ్మల మీద ఉయ్యాలలూగుతున్నారు. నేలకు సమాంతరంగా వున్న కొమ్మల మీద నడిచేస్తున్నారు. తలకిందులుగా వేళ్ళాడుతున్నారు. నేలకంటివున్న కొమ్మల్ని పాకుతోన్న ఊడల్ని అమాంతం ఒక్క గెంతులో దాటాలని ప్రయత్నిస్తున్నారు.

కోతి కొమ్మచ్చులు, దాగుడుమూతలు, కబడ్డీ, నాలుగురాళ్ళాట, 'చోరాట'[1], - పిల్లల మర్రి పిల్లల సందడితో మై మరిచి పులకరిస్తోంది.

---

1 దొంగాట

ఇక అమ్మాయిలు ఓ పక్కగా ఒద్దికగా కూర్చుని వున్నారు ఇంత సందడికీ వాళ్ళు చలించడం లేదు. కళ్ళెత్తి అటూ ఇటూ చూసే ప్రయత్నాలు కూడా చేయడం లేదు

ఆ ఉల్లాస భరితమైన వాతావరణం మనిషిలోని పసితనాన్ని పచ్చబరుస్తోంది విద్యార్థులందరూ నవ్వుతూ తుళ్ళుతూ గెంతుతూ దుముకుతు ఆడుతూ గడపాలని పనిగట్టుకొని వాళ్ళెవరూ అనుకోవడం లేదు వారికి తెలియకుండానే అలా జరిగిపోతోంది

దట్టమైన ఆకుల సందుల్లోంచి చొచ్చుకొని వస్తోన్న సూర్య కిరణాలను అరచేతిలో పట్టుకోవాలని ప్రయత్నిస్తోంది హిమబిందు

ఇంగ్లీష్‌మేడం హిమబిందు నిమగ్నతను చూసి ఆశ్చర్యంగా ఏం చేస్తున్నావన్నట్టు సైగ చేసింది

అరచేతి మీది సూర్యబిందువును చూపిస్తూ హిమబిందు నవ్వుతూ రాగయుక్తంగా అంది.

"ఎ డ్రాప్ ఆఫ్ గోల్డెన్ సన్ !"

ఇంగ్లీష్ మేడం కూడా రాగం కలిపింది. "డో - రె - మి - " తనూ ఓ చిన్న పాపలా అరచేతిలో సూర్య బిందువుని పట్టుకొనే ప్రయత్నంలో పడింది.

సుధాకర్, మల్లేశ్‌లు ఎంతో ఉల్లాసంగా వున్నారు సుధాకర్ ఆప్యాయంగామర్రి కొమ్మను తడుముతూ అన్నాడు

" మా తాతయ్యగారి చెట్టు కింద వున్నట్లుంది !"

" తాతయ్యగారి చెట్టంటే .. ?" మల్లేశ్ అడిగాడు

సుధాకర్ తమ వూళ్ళోని తాతయ్యగారి చెట్టు గురించి చెపుతూ ముగించాడు, " అయితే ఇది మన ముత్తాతల తాతయ్యల చెట్టన్న మాట !"

" నిజం ! దీని పుట్టు పూర్వోత్తరాలు ఎవరికీ తేలీదు. తెలుసుకోవాలని ఎంతోమంది ప్రయత్నించారట. అలాంటి విఫలయత్నం మిగిల్చిన సమాధి అదిగో - "మల్లేశ్ సుధాకర్‌ని అక్కడ వుండే సన్యాసి సమాధి దగ్గరకి తీసుకెళ్ళాడు. "ఇతను అలాకనుక్కోవాలనే ప్రయత్నంలోనే ఎంతోకాలం ఇక్కడే వున్నాడట ఇక్కడే కన్ను మూసాడట ".

సుధాకర్ గంభీరంగా అయిపోయాడు.

" మల్లేశ్, ఎందుకురా అంత ప్రయత్నం చేయడం ? మూలాలుకనుక్కొని ఏం చేస్తారు ! జాతి పాతి అంటగట్టి అడ్డుగోడలు కడతారా ? నీదినాది అని కుమ్ములాడుకొని ఈ విప్పారిన పచ్చని గొడుగును సమూలంగా ముక్కలు ముక్కలు చేస్తారా ?ఇది ఈ రూపంలో నిలబడడానికి ఎన్ని తరాలు పట్టి వుంటాయో ! ధ్వంసం చేయడానికి తృటికాలం చాలు !"

సుధాకర్ కంఠం రుద్ధమైంది. మల్లేశ్ సుధాకర్ దగ్గరగా వచ్చాడు.

భూపాల్ ప్రెసిడెంట్ అయినప్పటికి నుంచి ఆ కాలేజీ వాతావరణం మారిపోయింది. భూపాల్ తండ్రి నరసింహం పలుకుబడి వున్న రాజకీయ నాయకులతో సంబంధాలు వున్నవాడు. అతనికి తన కొడుకు ప్రయోజకత్వం మీద గొప్ప నమ్మకం. ఆ నమ్మకమే అతన్ని కొడుకు కాలేజీ రాజకీయాల్లో వేలు పెట్టేలా చేసింది. అతనికి హైదరాబాద్‌తో ప్రత్యక్ష సంబంధాలున్నాయి.

అప్పుడు హైదరాబాద్ విద్యార్థులలో తలెత్తుతోన్న అసంతృప్తి చిచ్చును ఇక్కడ కాలేజికి రవాణా చేసాడు నెమ్మది నెమ్మదిగా కాలేజీలో నిప్పు రాజుకుంటోంది. భూపాల్ రోజురోజుకీ యువకుల్లో ప్రాధాన్యత పెంచుకుంటున్నాడు. చూస్తుండగానే కాలేజి ఆవరణ దాటి పట్టణంలోకి ప్రవేశించాడు. ఆ నేపథ్యంలో భూపాల్ దృష్టి సుధాకర్ మీద పడింది.

" అది కాదురా, మొన్న ఎగ్జాం రాస్తుంటే కాలర్ పుచ్చుకొని లేపి కాగితాలు చింపేసాడు "

" ఈ మాత్రానికేనా ? "

" మరీ ఏంట్రా - కళ్ళ బడితే చాలు అసభ్యంగా గేలిచేస్తున్నారు. "పోరడా - పోరడా పోరా పోరా .. అంటూ "

"వాడు దొర కొడుకు - దొరతనమంతా చూపెట్కుంటున్నాడు. బద్మాష్‌గాడు[1] పట్నం పారిపోయివచ్చినా అందరూ వాని బేగారోల్లం[2] అనుకుంటడు. ఒక్కసారి వాడినాయన కాళ్ళిరగ కొట్టించుకొన్నా వాడికి బుద్ధి రాలేదు బుద్ధిరాదు మూర్ఖుడు"

" వేధించుకు తింటున్నాడ్రా .. "

"వాడేం చేసినా చలించకుండా వుండడమే వాడికి మందు - ఒంటరి వాడివి అనే కదా వాడు అంత ధైర్యం చేస్తున్నాడు ! మనం కలిసి కట్టుగా వుండే ఎవ్వడూ ఏం చేయలేడు ! "

" వాడొక్కడే అయితే నీవన్నట్టే చేయొచ్చు ... "

కాసేపు ఇద్దరూ మౌనంగా వుండిపోయారు.

సుధాకర్ చుట్టూ చూసాడు. అందరూ ఎవరికి తోచినట్లు వాళ్ళు హడావుడి సృష్టించేస్తున్నారు.

"ఒరేయ్ .. ఇవ్వాళ సీతాఫల్ డే .. " ఇద్దరూ ఒక్కసారే అన్నారు. ఫక్కుమన్నారు.

" మా శివన్నయ్య, అనూరాధ, కల్యాణి ఇప్పుడిక్కడ వుంటేనా ..... " సుధాకర్ వాళ్ళని ఉల్లాసంగా జ్ఞాపకం తెచ్చుకున్నాడు.

భూషణంగారి సపోటా తోట, తమ తాటితోపు, తాతయ్యగారి చెట్టు వాటిలో తమ అల్లరి గుర్తొచ్చి నవ్వుకున్నాడు. మల్లేశ్ వాళ్ళవివరాలవీ అడిగాడు.

"వాళ్ళందర్నీ తీసుకొని ఓ సారి వద్దాం - " సుధాకర్ మల్లేశ్‌ని కూడా వాళ్ళలో కలిపేసాడు.

సుధాకర్, మల్లేశ్ కాసేపు కారణమేమీ లేకుండా పకపక నవ్వుతూ ఒకరి వెనుక ఒకరు

1. తిట్టు 2 వెట్టివాళ్ళు

చిన్న పిల్లలా పరుగులు పెట్టారు

సుధాకర్ చెయ్యి ఓ కొమ్మ మీద పడితేనో - కింద పాకుతున్న ఊడను తట్టుకొని తుళ్ళిపడబోతేనో - వేళ్ళాడుతోన్న ఊడను గభాల్న ఊపబోతేనో ఎక్కడో కొమ్మలు కదులుతున్నాయి ఆకులు గలగల మంటున్నాయి రెమ్మలు రెపరెపలాడుతున్నాయి

"మల్లేశ్ - ఓ తమాషా చూపించనా " సుధాకర్ ఓ ఊడ బలంగా వూపాడు ఎక్కడో కొమ్మలు రాసుకున్నాయి

" వ్వా న్యూటన్ ! ఎంత గొప్ప విషయాన్ని కనిపెట్టావ్ ! "

మల్లేశ్ ఆటలు పట్టించాడు

" ఇంకోటి చూపించనా . " పసి పిల్లాడిలా అన్నాడు సుధాకర్ , "అదుగో - అక్కడ పాతేసిన స్తంభాల్లాగా ఉన్నాయే ఊడలు వాటిని చూడు ! " దూరంగా చూపించాడు.

"ఉన్నాయి. అయితే ? "

సుధాకర్ మాట్లాడకుండా పరుగులు పెట్టాడు.

వరుసగా ఉన్న ఊడల్ని ఏ సంగీతవాయిద్యాన్నో కొనగోటితో మీటినట్లుగా జాగ్రత్తగా కదిలించాడు

ఊడ కదిపినప్పుడల్లా పైన ఆకులు కదిలిన సవ్వడి వస్తోంది

బలంగా కదిపినప్పుడు ఎక్కువగా - సున్నితంగా తాకినప్పుడు సన్నగా -

"చూసావా - నా అనుమానం నిజమే ఇవి సాక్షాత్తు ఆ కృష్ణదేవరాయల సంగీతం పలికే స్తంభాలకే ఇన్‌స్పిరేషన్ కావాలంటే చూడు - " సుధాకర్ ఆనందంగా అరుస్తూ ఊడలు ఊపుతున్నాడు.

"మరీ అంత అమాయకుడి లాగా కనబడుతున్నానా నీకు ? " మల్లేశ్ దగ్గరగా వచ్చి సుధాకర్ వీపునోటి చరిచాడు.

ఇద్దరు నవ్వుతూ మల్ల యుద్ధానికి దిగారు.

సరిగ్గా ఆ చెట్టు మొదట్లోనే కాస్త అటు పక్కగా అమ్మాయిలు కూర్చుని వున్నారు వీళ్ళిద్దరినీ చూడగానే హిమబిందుకి ప్రాణం లేచొచ్చింది మెల్లిగా ఇంగ్లీష్ మేడంకి చెప్పి వాళ్ళ దగ్గరగా వచ్చింది

"ఏంటి గొడవ ? "

ఇద్దరూ చప్పున మల్లయుద్ధం మాని - నిటారుగానిల్చున్నారు వస్తోన్న నవ్వును బిగపెట్టారు

"నవ్వేదేదోసరిగ్గా నవ్వకూడదూ ? "

పకపక నవ్వారు

" ఏమీ లేదు సుధాకర్ సంగీతం పలికే స్తంభాలు కనుక్కొన్నాడు వాటి సంగతి తేల్చుతున్నాం - "

"ఏవీ ? ఏవీ ?"

హిమబిందు మర్రి ఊడల్ని కదిలించింది ఆకులు మెత్తగా కదిలిన సవ్వడి

" నిజంగా ఇవి పాడుతున్నాయి ! "

" వాడే అనుకుంటే వాడిలాంటి జాతి ఈ భూమ్మీద ఇంకా ఉందన్న మాట ! " మల్లేశ్ వాళ్ళిద్దర్నీ వెక్కిరించాడు

" ఏ విత్తు లోంచి పుట్టిందో - ఎక్కడ మొదలో ఎక్కడ చివరో కానీ శాఖోపశాఖలుగా విస్తరించిన ఈ బ్రహ్మాండమైన వటవృక్షం - అణువులోంచి పుట్టి భూగోళమంతా విస్తరించి అనంతం వైపు సాగుతోన్న మానవ సంస్కృతికి ప్రతీకగా లేదూరా ? " ఎప్పుడు వచ్చారో కానీ తెలుగు మేడం ఇంగ్లీష్ మేడంతో అంటోంది.

అందరూ తలాలాడించారు.

సరిగ్గా అప్పుడే ఓ జెర్రి తన నూరు కాళ్ళ మీద లేచి మర్రిమాను మీద జరజరపాకి ఆకుల కిందికి జారుకుంది.

ఓ మానవాకారం మర్రిమాను వెనక్కి చప్పున నక్కింది. నోట్లో నములుతున్న పాన్‌ను తుపుక్కున వూసింది. మర్రి మాను ఎర్రబడింది.

మల్లేశ్ వాళ్ళు అబ్బాయిల దగ్గరకు వెళ్ళిపోయారు

హిమబిందు వాళ్ళు అమ్మాయిల బృందం వైపు వెళ్ళారు.

అమ్మాయిలు తెచ్చుకున్న తినుబండారాలు పంచుకోవడంలో తమ ఆనందం పంచుకున్నారు.

వాళ్ళకి హిమబిందు తెచ్చిన సున్నుండలు, రవ్వలడ్లు నచ్చాయి. హిమబిందుకి వాళ్ళు తెచ్చిన కర్జలు, కట్ మిర్చినచ్చాయి.

అప్పటికే అబ్బాయిలు సంచులు ఖాళీ చేసేసారు. ఖాళీ సంచులు భుజాలకు తగిలించుకొని పిల్లల మర్రి చుట్టూ వున్న గుట్టల మీద చెట్ల మీద పడ్డారు.

ఎక్కడ పడితే అక్కడ సీతాఫలం చెట్లు.

ఎక్కడో మాగిన సీతాఫలం కమ్మని వాసన అక్కడి వాతావరణంలో మాధుర్యాన్ని నింపుతోంది. మాగిన పళ్ళు ఆకుల మాటున దోబూచులాడుతూ రారమ్మని కవ్విస్తున్నాయి.

అబ్బాయిలు అందిన చెట్టును అందినట్లు దులుపుతున్నారు. కసరు పిందెలతో సహా

కనిపించిన కాయలల్లా కోసుకుంటున్నారు. సంచులు బరువెక్కుతున్నాయి కాళ్ళు నొప్పులు పుట్టేంత దూరం తిరిగేసారు

ప్రశాంత వాతావరణంలో మాగన్నుగా నిద్రపోతోన్న ఆ చెట్టు చేమ ఉలిక్కిపడ్డాయి క్షణంలో వానర వారసులు ఆ ప్రదేశాన్ని కిష్కిందను చేసేసారు. హిమబిందుకు ఉసూరు మనిపించింది

"చెట్టు కదలకుండా కొమ్మ వంచండి -

కొమ్మ విరగకుండా పూలు కోయండి ! " హిమబిందు అప్రయత్నంగా పైకే అనేసింది.

" మనకి చివరికి ఆకులు అలములు మిగిలేట్టున్నాయి పదండబ్బా పోదాం - " ఒకమ్మాయి అమ్మాయిలని తొందర చేసింది.

అమ్మాయిలు మరోవైపుకు వెళ్ళి సీతాఫలాలు సేకరించారు

కాయ దొరకనపుడు నిరాశపడుతూ - దొరకగానే సంబరపడుతూ ఒకే కాయని ఇద్దరు చూసినపుడు పోటీలు పడుతూ - గిల్లికజ్జాలు పెట్టుకొంటూ - ఒకరు చూసిన కాయ మరొకరిని కోసుకోనిచ్చి - త్యాగాలు చేసేస్తూ - ఫక్కున నవేస్తూ - అమ్మాయిలు వారి పరిధిలో వారు సరదాగా సంచులు నింపుకున్నారు.

మల్లేశ్, సుధాకర్ గుట్టమీద చాలాదూరం వెళ్ళారు. వాళ్ళకు చెట్టు మీది మాగిన మంచి సీతాఫలాలు దొరికాయి ఇంటికి రాగానే రవికి ఇచ్చారు.

హిమబిందు ఉత్సాహంగా తల్లిదండ్రులకి కబుర్లన్నీ చెప్పింది, రవిని ఊరించింది. రవివాళ్ళ స్కూల్‌లో మర్నాడే సీతాఫల్‌డే, అందువల్ల అతనంతగా ఉడుక్కోలేదు.

హిమబిందు బట్టలు మార్చుకొని - విడిచిన వాటిని విసిరేయబోయింది. బట్టలమీద ఏదో కనిపించి ఉలిక్కిపడింది. దగ్గరగా తీసుకొని చూసింది. తెల్లని చూడిదార్ వెనకంతా ఎర్రటి పాన్ మరకలు. ఎవరో పనిగట్టుకు ఊసినట్లుగా వుంది.

" ఇట్స్ ... ఎంబ్రాసింగ్ ! ఛ ... ఛ ! "

హిమబిందు రెండుచేతుల్లో ముఖం దాచుకొని మంచం మీద కూలబడింది. సిగ్గుతో చిక్క చచ్చిపోయింది.

" ఎప్పుడు పడిందో ఏమో - పాడు మరక "

పొద్దుటి నుంచి ఎక్కడెక్కడికి వెళ్ళిందో ఎవరెవరితో మాట్లాడిందో - వాళ్లలో అబ్బాయిలు అమ్మాయిలు లెక్చరర్స్ ... ఛ ! వాళ్ళంతా తనని ఎలా చూసారో - ఏమో !

" ఒక్కళ్ళైనా చూసి చావచ్చుగా ! " తనఫ్రెండ్స్‌ని తిట్టుకుంది, 'మళ్ళీ ఆదార్లో ఎలా నడవడం ? ఛ ... ఛ ... ! '

" రోజురోజుకీ మరీ సెన్సిటివ్ అవుతూన్నావే ? ఎక్కువగా ఫీల్ అవున్నావ్ . ఎవడు

చూసినా ఎక్కడ పడితే అక్కడ తుపుక్కున పాన్ ఊసేవాడే. చూడకుండా ఏ పాన్ మీదో కూర్చొని వుంటావ్ . దానికి ఇంత అనుకోవడం దేనికి ? తెల్లని గోడను చూసి ముచ్చట పడేవారు కొందరయితే ఏ మసో పూసి మరకలేసి ఆనందించేవాళ్ళు కొందరు, అది మానవ నైజం. ఏం చేస్తాం ? పదపద, భోం చేద్దువు" విజయ కూతురు పడుతోన్న ఇబ్బందికి తేలిగ్గా కొట్టి పారేసింది.

కానీ, హిమబిందుకు ముఖం చెల్లలేదు. మర్నాడు కాలేజికి వెళ్ళలేదు. రమ, శ్రీదేవి వచ్చారు.

" నువ్వు కాలేజికి రాకపోతివి. మంచి తమాషా మిస్ అయ్యావే - "

" ఏంటబ్బా ! "

" ఆ భూపాల్ గాడూ లేడూ - మన ప్రెసిడెంట్ - వాడు సురేఖను ఏదో గొడవ చేసాడు. ఇంగ్లీష్ మేడం ప్రిన్సిపాల్‌కి రిపోర్టు ఇచ్చింది. అందరి ముందూ వాణ్ణి ప్రిన్సిపాల్ తిట్టాడు చూడూ ... ! " రమ హుషారుగా చెప్తోంది.

హిమబిందు కళ్ళు ఆశ్చర్యంతో పెద్దవయ్యాయి.

"చూడాల్సిన సీనబ్బా అది, గురుడు ఎట్లా తెల్లమొహం వేసాడో - " రమ, శ్రీదేవి పకపక నవ్వారు.

"సురేఖ ని ఏమైనా ఇబ్బంది పెడతారేమోనే .. " హిమబిందు అనుమానంగా అంది.

"ముమ్మాటికీ పెట్టడు ! ఎందుకంటే సురేఖ వాడి చుట్టం కాబట్టి - "

మర్నాడు ఉదయాన్నే ముగ్గురు కాలేజికి బయలు దేరారు.

కాలేజి గేట్లో ఇంగ్లీష్ మేడం కనిపించలేదు.

అమ్మాయిలు తిన్నగా క్లాసరూంకి వెళ్ళారు

క్లాస్ నిండా స్టూడెంట్స్ వున్నారు. మౌనంగా కూర్చుని వున్నారు.

" లేటయిందబ్బా .... మనకి ! "

క్లాస్ రూం గుమ్మంలోకి రాగానే వాళ్ళచూపు బోర్డుమీద పడింది. అమ్మాయిలు ముగ్గురు స్తంభించి పోయారు. బోర్డుమీద ఓ స్త్రీ బొమ్మ వేసి వుంది. పొట్ట ఉబ్బెత్తుగా - పొట్టలో చిన్న బిడ్డ - అన్నీ సరిగ్గానే కుదిరాయి కానీ వంటిమీద బట్ట అమర్చలేదు. ఆ బొమ్మకు ఇంగ్లీష్ మేడం పేరు, బొమ్మ చుట్టూ అసభ్యకర వ్యాఖ్యలు. అమ్మాయిలు కొయ్యబొమ్మల్లా బిర్ర బిగుసుకు పోయి వున్నారు.

అది ఇంగ్లీష్ పీరియడే. ఆవిడ మరి వచ్చిందో - లేదో - వచ్చి వెళ్ళి పోయిందో - హిమబిందు చురుగ్గా కదిలింది. టేబుల్ మీదున్న డస్టర్ తీసుకొని గబగబ బోర్డు మీది బొమ్మను తుడిచేసింది.

రమ, శ్రీదేవి ఆమెను ఆపుదామనుకొనే లోపలే ఈ పని జరిగిపోయింది. క్లాసులో

అబ్బాయిలు ఒక్కరు కూడా చలించలేదు. పెదవి విప్పలేదు. మౌనంగా చూసున్నారు. చీమ చిటుక్కుమనేంత నిశ్శబ్దం. రమ, శ్రీదేవి బిక్కుబిక్కుమంటూ అందరి ముఖాల్లోకి చూసారు. ఒక్కళ్ళూ కదల్లేదు. మెదల్లేదు.

హిమబిందు తన బెంచిలోకి వెళ్ళి కూర్చుంది, రమ, శ్రీదేవి నెమ్మదిగా పక్కన వచ్చి కూర్చున్నారు. ఆ రోజు ఒక్కళ్ళు కూడా మరొకరితో మాట్లాడే ధైర్యం చేయలేదు. అవమానంతో వాళ్ళు చితికిపోయారు

ఆడపిల్లలెవరూ వారం రోజులు కాలేజికి రాలేదు. వాళ్ళ బాయ్‌కాట్‌ని కానీ నిరసనని కానీ ఎవ్వరూ పట్టించుకోలేదు. కాలేజీ కార్యక్రమాలు యథావిధిగా జరిగిపోయాయి. హిమబిందు వాళ్ళ అమ్మా నాన్నలతో అన్నీ చెప్పింది. ప్రసాద్ కూతురు చేసిన పని సరైందేనని మెచ్చుకున్నాడు. విజయ చాలా భయపడింది.

వంటరిగా ఉన్నపుడు ప్రసాద్‌ని బతిమిలాడింది, " మీకు పుణ్యముంటుంది. దాన్ని తీసుకెళ్ళి హైదరాబాద్‌లో చేర్పిద్దాం . ఏ వుమన్స్ కాలేజీలోనో సీటు దొరక్కపోదు ' -

ప్రసాద్ కూడా అషామాషీగా తీసుకోలేదు. ముంచుకు రాబోతోన్న ప్రమాదానికి ముందు ముసిరిన వాతావరణం లాగా వుంది.

"హైదరాబాద్ లో మరీ గొడవలుగా వున్నాయి విజయా .. మానాభిమానాలు వున్నవాడు రోడ్డుమీద నడిచేట్టు లేదు. గోడల నిండా ఎంత అసభ్యమైన వ్యాఖ్యలో - ఎంత అసహ్యమైన రాతలో తెలుసా ? ఛీ ........ ఛీ ...." ప్రసాద్ బాధగా అన్నాడు.

" ఇంతకీ విషయం ఏంటి ? ఏమంటారు వాళ్ళు ? "

" అసలు ఆంధ్ర రాష్ట్రం - తెలంగాణా విలీనం అయ్యి ఆంధ్రప్రదేశ్‌గా అవతరించేప్పుడేకొన్ని అనుమానాలున్నాయి. నాయకులుందరూ , కలిసి , చర్చించి - తీర్మానించి - జెంటిల్‌మెన్స్ అగ్రిమెంట్ పేరున కొన్ని ఒప్పందాలు చేసుకొన్నారు. వాటిలో నిజాం పాలనలో అభివృద్ధికి నోచుకోని తెలంగాణా ప్రాంతాన్ని అభివృద్ధి పరచడానికి ప్రాధాన్యత ఇచ్చారు. ఆ అగ్రిమెంట్ అమలు విషయంలో వారికి అసంతృప్తి కలిగింది. ముఖ్యంగా ముఖ్యమంత్రి విషయంలో, అగ్రిమెంట్ కాలపరిమితి దగ్గర పడుతుండడంతో ఈ ప్రాంత విద్యార్థుల్లో తమ భవిష్యత్తు విషయమై అనుమానాలు పొడసూపుతున్నాయి. వారి అనుమానాలను అవకాశవాదులు ఎగతోస్తున్నారు. యువశక్తికి రగుల్చుతున్నారు.ఉరుము ఉరిమి మంగలం మీద పడ్డట్టు తెలుగు తల్లికే ఎసరు పెడుతున్నారు - " ప్రసాద్ నిట్టూర్చాడు

" ఏమైనా గొడవలవుతాయుంటరా ? "విజయ భయంగా అడిగిది.

" ఏమో మరి ? ఏమైనా అన్నాదమ్ములు సామరస్యముగా పరిష్కరించుకోవాల్సిన వ్యవహారంలో సాటి ఆడపడచుల మానాభిమానాలను గోడలకు ఎక్కించడం ఏంటి ? తెలుగు వారి మర్యాదను చేజేతులా మంట గలుపు కోవడం కాదూ ? మొన్నా మధ్య హైదరాబాద్‌కు

వచ్చిన పొరుగు రాష్ట్రం ముఖ్యమంత్రి "తెలుగువారి సంస్కృతి, వారి సభ్యత ఇంత హీనమైనవా, ఇంతగా హేయమైనవా ! " అంటూ ముక్కున వేలేసుకొని వెళ్ళొట్ట - "

"మనమేం చేద్దాం ? " అప్పటికే భయంతో విజయ గుండె డొల్ల అయిపోయింది

" చూద్దాం- నేను సెలవుకోసం ప్రయత్నిస్తే దొరకలేదు. అయినా ఆకతాయిలు వున్నచోటే ఆదుకొనే వాడూ ఉంటాడు. మనుషుల్లో మానవత్వం ఇంకా చావలా .... "

"బిందుని కాలేజి మాన్పించేద్దామా ? రవిని ఏం చేద్దాం ? " విజయ ఆందోళనగా అడిగింది

" ఎంత కాలమని కాలేజీ, స్కూలు మాన్పించి ఇంట్లో కూర్చోపెడతాం ? గొడవలు సర్దుకుంటాయేమో ... త్వరలో ప్రధానమంత్రి హైదరాబాద్ వస్తారంటున్నారు. పరిస్థితి చక్కబడచ్చు. అనవసరంగా పిల్లల చదువు పాడు చేయడం ఎందుకు ? "

ఇంతలో ప్రసాద్‌కు ఏదో అర్జెంట్ మెసేజ్ తీసుకొని అటెండర్ వచ్చాడు. ప్రసాద్ అత్యవసరంగా హైదరాబాద్ వెళ్ళాల్సి వచ్చింది.

ప్రసాద్ మల్లేశ్ వాళ్ళను పిలిచి, తన కుటుంబాన్ని జాగ్రత్తగా చూసుకోమని - తాను ఎట్టి పరిస్థితుల్లో రాత్రికి తిరిగి వచ్చేందుకు ప్రయత్నిస్తానని చెప్పి - బయలు దేరి వెళ్ళి పోయాడు.

ఆ రోజు తండ్రి ఇచ్చిన ధైర్యంతో హిమబిందు తేరుకుంది

ఈ వారం రోజులుగా పోయిన పాఠాలు కలిసి చదువుకుందామని రమ వాళ్ళింటికి వెళ్ళింది. కాసేపు పాఠాల గురించి మాట్లాడి - వస్తూ వస్తూ నోట్స్ తీసుకొని వస్తోంది.

అప్పుడే వీధుల నిండా సాయంత్రం సందడి పుంజుకుంటోంది. మనుషులు నిండుతున్నారు. షికారుకి వచ్చిన జనాలు, ట్యూషన్ల నుంచి ఇళ్ళకు మళ్ళుతున్న పిల్లలు - కూరగాయలు, సరుకులు తెచ్చుకోను వచ్చేపోయే వాళ్ళు - మ్యాటినీ షో నుంచి తిరిగి వచ్చే వాళ్ళు ఫస్ట్ షో కి వెళుతోన్నవాళ్ళు - అంతా రద్దీగా వుంది.

రమ వాళ్ళిల్లు కలెక్టర్ ఆఫీస్ దగ్గర.

ఆ రోజు హిమబిందు లంగావోణి వేసుకొని వుంది.

చిలుకాకు పచ్చ జాకెట్టు - నిండు గులాబి రంగు వోణి.

లంగా కుచ్చిళ్ళు సైకిల్ చైన్‌లో పడకుండా నెమ్మదిగా నింపాదిగా వస్తోంది అలవాటయిన దారి.

కలెక్టర్ బంగ్లా - గర్ల్స్ హైస్కూల్ - బేసిక్ స్కూల్ దాటింది. బేసిక్ స్కూల్ సెంటర్‌లో రోడ్డు ఎత్తు. అక్కడ నుంచి తిన్నగా డౌన్‌లోకి వెళితే డాక్ బంగ్లా - దాటగానే న్యూటౌన్ సెంటర్.

హిమబిందు సైకిల్ డౌన్‌లో కెళుతూ వేగం పుంజుకుంది. హిమబిందు బ్రేక్‌ను వత్తిపెట్టి

కంట్రోల్ చేయాలనుకొన్నా సైకిల్ దానిపాటికది జర్రున జారిపోతోంది. సరిగ్గా డాక్ బంగ్లా గేటు ముందుకు వచ్చేసరికి సైకిల్ కంట్రోల్ అయ్యింది హిమబిందు తేలిగ్గా నిట్టూర్చింది

ఇంతలో హిమబిందు ఊహించలేనంత వేగంగా వెనక క్యారియర్ స్టాండ్ మీద ఏదో బరువు పడింది. హిమబిందు బ్రేక్ వేసి సైకిల్ ఆపబోయింది ఆ సరికే అద్దంలో వెనుక క్యారియర్ స్టాండ్ మీద పడ్డది ఆకతాయి కుర్రాడి బరువని గ్రహించింది

హిమబిందు సైకిల్ ఆపేలోగానే - హిమబిందు జాకెట్ వెనక నున్న హుక్స్‌ను అతని చేతులు పటపట లాడించాయి

మరుక్షణంలో అతను మాయమయ్యాడు.

అవమానంతో హిమబిందు మిగిలిపోయింది.

హిమబిందు రెండుగా విచ్చిపోయింది. పరాభవంతో ఆమె గుండె పగిలి పోయింది మెదడు మంచు ముద్దయింది నడివీధిలో నలుగురూ చూస్తుండగా ! ఇలా . !!

హిమబిందు ఎట్లాగో ఇంటికొచ్చిపడింది.

తల్లితో కూడా నోరువిప్పి చెప్పడానికి అవమానం వేసింది. మాటల్లేవు. గదిలోకి వెళ్ళి గొళ్ళెం బిగించుకుంది.

సరిగ్గా అదే సమయానికి - ఆ వీధి చివరునున్న సత్రం ముందు మల్లేశ్‌ను కొందరు అటకాయించారు.

"నన్ను ఎందుకు ఆపారు ?" మల్లేశ్ తన చుట్టు ముట్టిన యువకుల్ని అడిగాడు.

" అరె ....... అరే పోరడు మాట తీరు మార్చిండు - వినుర్రి - వినుర్రి " వాళ్ళు మల్లేశ్‌ను హేళన చేసారు.

ఒకడు వెనకనుంచి మల్లేశ్ జుట్టు లాగాడు. మల్లేశ్ తల విదిలించాడు.

" విషయం ఏంటి ? " మల్లేశ్ సూటిగా అడిగాడు.

" ఏంలే మల్లీ ... నీవూ మాతోన రారాదూ ? "

"రాను ! "

" ఏంబే ? నీవె వస్తలేవా ? నీ దోస్తే రానిస్తలేడా ? "

" అది మీకనవసరం - ఎందుకు ఆపారో చెప్పండి "

" నీ గదిల ఉంటడు చూడు - ఆ పోరడ్ని ఊర్లకెల్లి దెంక పొమ్మను[1] ! "

" నేనెందుకు చేస్తాను ? "

" నువ్వు మా పోరడని పని చెప్పినం. లేకుంటే మా తీరున మేం ఆ బాడ్కవ్‌ను ఈడ కెల్లి తోల్తుంటిమి - "

" వాన్ని నీ గదిల కెల్లి తోల్తవా ? తోలవా ? " ఒకడు గద్దించాడు.

1 పారిపొమ్మను

" నేను పంపను ! "

" అరెసాలా[1] - నక్రాల్ పడుతున్నావ్[2] బే ! " మరొకడు మల్లేశ్ కడుపులో బలంగా పిడిగుద్దు గుద్దాడు.

" అమ్మా " మల్లేశ్ లుంగలు చుట్టుకు పోయాడు.

" మంచిగ జెప్తున్నం - ఇను. ఆ పోరడు పొద్దుగాల ఊర్ల గిట్ల కండ్ల పడ్డడా .. ! " వాడు మల్లేశ్ ముఖంలో ముఖం పెట్టి బెదిరించాడు.

" ఓ... సాలీ[3] ... " ఒకడు గుర్తు చేస్తాడు.

" హిమబిందు ... హిమబిందు ..." పక్కనుంచి మరోడు అందించాడు.

" ఓ రండీ[3]కో ఛీ... "

" హిమబిందును ఒక్కమాట అన్నావంటేనా ? " మల్లేశ్ అన్నవాడి మీదికి ఉరికి కాలర్ పట్టుకున్నాడు.

" అరె ... గల్లా విడువు బే ! అరె లౌండే[6] -- అప్నే ఆప్‌కో సమజ్తా క్యారే ? సువర్ కె బచ్చే[7]... బద్మాష్ కైకే[8]... మాఖేలౌడే[9]... " వాడు తిడుతూ మల్లేశ్ కడుపులో మోకాలితో తన్నాడు. మల్లేశ్ కూలబడ్డాడు.

"యాద్[10] పెట్కో ... ! "

వాళ్ళు వెళ్ళి పోయారు.

❋ ❋ ❋

నీటి పారుదలశాఖ వారి కార్యాలయం.

" ఏ వైందయ్యా - ఏంది కిరికిరి ? " ఎస్. ఇ. గద్దించాడు.

" ఏం లేదుసాబ్ - మన మీద జబర్దస్తీ[11] చెయ్యనింక చూస్నరు. కేస్ పెట్టబోయినం, అంతే ! " సూపర్ వైజర్ వినయంగా నివేదించుకున్నాడు.

" జబర్దస్తీ చేయడానికి చూస్నరా ? జబర్దస్తీ చేస్నరా ? "

సూపర్ వైజర్, జె.ఇ. ఒకరి ముఖాల్లోకి ఒకరు చూసుకున్నారు. ఎస్.ఇ. అసహనంగా వారి వంక చేతిలోని కాగితం వంక చూసాడు.

" ఈ సంతకం పెట్టిందెవరు ? " రామనాథం చేసిన సంతకం మీద వేలు పెడుతూ అడిగాడు ఎస్. ఇ.

సూపర్ వైజర్, జె.ఇ. ఒక్కసారిగా తెరిపిన పడ్డారు.

" రాంనాథం అనీ - ఖతర్నాక్ ఆద్మీ[12] - సాబ్ - " సూపర్ వైజర్ హుషారుగా అన్నాడు.

" ఇంతకు మునపు పల్లెల్ల పాంట్‌షర్ట్ వేసుకున్నోడు కనిపిస్తేనే వంగి వంగి సలాం చేసెటోల్లు. ఇప్పుడు ఇంత లొల్లి చేసినరంటే - కంసే కం[13] - వాని హాథ్ అయితే వుంటది "

ఎస్.ఇ. మనసులో ఏదో అనుమానం కదలాడింది.

---

1,3,4,5,6,7,8,9, - తిట్లు 2. వేషాలు వేస్తున్నావా 10. జ్ఞాపకం 11. దౌర్జన్యం 12 ప్రమాదకరమైన వ్యక్తి 13. తక్కువలో తక్కువ

"వాని బ్యాక్ గ్రౌండ్ ఏంది ? "

" ఎక్కడ్నించో వచ్చిండు. ఇక్కడ పొలం కొనిండు. ఊల్లోల్లను పోగు జేస్తుండు. "

" ఎక్కడ్నించి వచ్చాడు ? "

సూపర్ వైజర్ చెప్పాడు.

ఎస్. ఇ. ముఖాన ఓ నవ్వు కదలాడింది.

" ఎవరి పొలం కొన్నాడు ? "

" నరసింహం దొరది ! "

" ఎవరు మన నరసింహం దొరేనా ? "

అవునన్నట్టు తలలూపారు.

"దొర ఊర్లనే వున్నాడా ? "

" ఏక్ మినిట్ సాబ్ " సూపర్ వైజర్ గబగబ బయటకు వెళ్ళబోయాడు.

"ఆగాగు ... మనమే పోయొస్తే పోదా ? "

ఎస్. ఇ. కుర్చీలోంచి పైకి లేచాడు.

రెండు జీపులు నరసింహం ఇంటివైపు దూసుకు పోయాయి.

❋ ❋ ❋

ఉదయాన్నే లేచి విజయ వాకిట్లో ముగ్గువేయడానికి వెళ్ళింది.

ఇంటిముందు సైకిళ్ళ మీద కుర్రాళ్ళ గుంపు నిలబడి ఇంటి వైపే చూస్తున్నారు. విజయను చూసి అదో మాదిరిగా నవ్వారు. వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళిపోయారు.

విజయకు ఇదంతా అయోమయంగా వుంది. విషయం ఏమిటోనని గేట్లో నిలబడి చుట్టూ చూసింది.

అంతే, ఆమె నవనాడులూ క్రుంగిపోయాయి

విజయ కంటికి ఆనినంత మేరా - వీధిలోని గోడల నిండా ఒకటే రాతలు.

అసభ్యంగా - అసహ్యంగా - ఛండాలంగా - నగ్నంగా - నీచంగా - హిమబిందు గోడల మీదకెక్కింది. మల్లేశ్ సుధాకర్‌లతో సహా.

విజయకు స్పృహ తప్పినంత పనయ్యింది. కలలో నడుస్తున్నట్లు వెళ్ళి ఇంట్లో కూలబడింది

మరికొద్ది సేపట్లో యింటి చుట్టూ ఓ గుంపు చేరింది.

కొద్ది సేపటికి విజయ పేరు - ఇంకొద్ది సేపటికి వారిప్రాంతం పేరు గోడలకెక్కాయి.

ఆ యింటికి వీధిలోని మరో ఇంటికి సంబంధాలు తెగిపోయాయి

మధ్యాహ్నం భోజనాల వేళకి గుంపు పలచన అయ్యింది. మల్లేశ్ ఊళ్ళోకి వెళ్ళి

వచ్చాడు.

వచ్చీరాగానే గేటు తాళం వేసి - విజయ దగ్గరికి వచ్చాడు.

"ఊరంతా గొడవలుగా వున్నాయి చాలామంది అందిన బస్సో రైలో పట్టుకొని వెళ్ళిపోతున్నారు. ఇప్పుడేం చేద్దాం ? "

" ఏమైనా ఎట్లా చేస్తాం ? సమయానికి బిందు వాళ్ళనాన్న ఊళ్ళోలేరు" విజయ కలవరపడింది.

మల్లేశ్ ఇంటికి బయట వైపు నుంచి తాళం వేసాడు. తమ గదికి కూడా తాళం వేసి సుధాకర్ వచ్చాడు ఆ పగలంతా అందరూ ప్రసాద్ వాళ్ళింట్లోనే వున్నారు.

వీధి గుమ్మానికి లోపల్నుంచి తాళం వేసారు కుర్చీలు టేబుళ్ళు అన్నీ గుమ్మానికి పేర్చారు.

విజయ శబ్దం రాకుండా వంట చేసింది - అందరూ ఏదో కతికామనిపించారు

చీకటి పడ్డాక గూట్లో ఒక చిన్న దీపం మాత్రం వెలిగించారు. వాతావరణం తుఫాను ముందు ఏర్పడ్డ ప్రశాంతతలా వుంది.

ఇంతలో, ఏదో శబ్దమైంది. సుధాకర్, మల్లేశ్ చెవులు రిక్కించారు

విజయ చప్పున దీపం ఆర్పేసింది.

హిమబిందు తమ్ముడిని వళ్ళోకి తీసుకొని - వాటేసుకొని కూర్చుంది చిమ్మ చీకటి, చీమ చిటుక్కుమనేంత నిశ్శబ్ధం.

ఎవరో వీధి గుమ్మల దగ్గరికి వచ్చి గొళ్ళెం లాగిన చప్పుడు.

" తాళం పెట్టుంది ! "

" ఈడ మల్లేశ్ వుండె ... ఏమయిండు ? " మాటలు బిగ్గరగా వినిపించాయి.

ఇంటి చుట్టూ అడుగుల చప్పుడు.

తలుపుల మీద దబదబ బాదుడు.

రవి బిక్కచచ్చిపోయాడు. హిమబిందును అతుక్కుపోయాడు.

లోపలున్న వాళ్ళకి తాము ఊపిరి పీల్చివదలడం కూడా స్పష్టంగా వినబడుతోంది. ఆ పనినీ శబ్దం రాకుండా చేయాలని ప్రయత్నిస్తున్నారు.

ఇంతలో వంటింట్లో ఏదో దొర్లింది. ఏ ఎలుక నిర్వాకమో -

" ఇంట్ల ఏదో చప్పుడయితంది - "

బయట నుంచి వినిపించింది.

ఇంతలో అడుగుల చప్పుడు దూరం అయ్యింది.

"హమ్మయ్య", అనుకొన్నారందరూ గుండెలు నిండా ఊపిరి పీల్చుకొన్నారు. కాస్త కాస్త ఎడమెడంగా జరిగి ముఖాలకు పట్టిన చెమట్లు తుడుచుకున్నారు. కాస్త తేలికపడ్డారు.

దడ్ !

అందరూ బిత్తర పోయారు

దడ్ దడ్ దడ్ దడ్ !

రవి ఏడుపు లంకించుకోబోయాడు హిమబిందు వాడినోరు మూసేసింది. వణికి పోతోన్న హిమబిందు చేయి కదలినప్పుడల్లా 'క్కె క్కె . మంటూ రవి గొంతు వికృతంగా వినబడుతోంది

ఇంటిమీద ఎడ తెరిపి లేకుండా రాళ్ళవర్షం, చెవులు చిల్లులు పడేలా 'గో బ్యాక్' నినాదాలు

సుధాకర్ మల్లేశ్ భయపడడం లేదు ఈ పరిస్థితి గట్టెక్కడం ఎలా అని ఎవరికి వారే ఆలోచిస్తున్నారు. "పిచ్చివాళ్ళ చేతుల్లో రాళ్ళు'" .... మల్లేశ్ మనసులోనే అనుకున్నాడు.

"వాళ్ళు ఉన్మాదంలో వున్నారు మన మౌనమే వాళ్ళకు సమాధానం -"సుధాకర్‌తో అన్నాడు.

సుధాకర్ మౌనంగా తలాడించారు

ఇంతలో ఎవరో గట్టిగా అరుస్తున్న శబ్దం దుండగల్ని మందలిస్తోన్న శబ్దం దూరమవుతోన్న అడుగుల శబ్దం. నెమ్మదిగా అన్ని శబ్దాలు నిశ్శబ్దమైపోయాయి.

" మనం ఇంట్లో వున్నామని వాళ్ళ అనుమానమేమో .. " సుధాకర్ అన్నాడు.

" ఎక్కడికైనా వెళదామా ? " విజయ కూడదీసుకొని అంది.

మల్లేశ్ కిటికీ దగ్గరికి వెళ్ళి నెమ్మదిగా తెరిచి చూసాడు.

వీధంతా నిర్మానుష్యంగా నిశ్శబ్దంగా వుంది

నెమ్మదిగా దొడ్డి గుమ్మం తలుపు తెరిచారు. నెమ్మదిగా ఒక్కోళ్ళు బయటకు నడిచారు. గోడల చాటున నక్కుతూ బసప్ప కాంపౌండ్ దాకా వచ్చారు.

దూరంగా ఏదో భళ్ళుమన్న శబ్దం.

అప్పుడే కిరాణా దుకాణం మూసేయబోతున్నారు. దుకాణదారు హిమబిందును గుర్తు పట్టాడు. వాళ్ళని దుకాణం లోకి పిలిచి - గబుక్కున తలుపు మూసేసాడు.

" ఏంది గిట్ల గల్లీల పొంటి[1] తిరుగుతున్రు ? " అతను ఆందోళనగా అడిగాడు

మల్లేశ్ విషయమంతా చెప్పాడు.

కిరాణాదుకాణం వెనుకే అతని ఇల్లు. వీళ్ళందర్నీ తన యింట్లోకి తీసుకెళ్ళాడు ఎవరో వస్తోన్న చప్పుడు.

గబగబ అందరూ అటక మీదకు ఎక్కారు.

దబదబదబ ! తలుపులు బద్దలు కొట్టినంత చప్పుడు.

---

1. వీధుల వెంట

" ఈ దిక్కుకి ఎవరన్నా వొచ్చిన్ర ? "

" ఈ టైంల ఎవ్వరొస్తరు ? ఎందుకొస్తరు ? " దుకాణదారు కోపంగా అడిగాడు. వాళ్ళు అతని కోపం పట్టించుకోలేదు. లోపలికి తొంగి తొంగి చూసారు.

" ఆ పండుకొన్నామె ఎవ్వరు ? "

కిరణాకొట్టతను ఆమెను లేపి చూపించాడు.

ఆమె అతని కూతురు గర్భిణి. పురిటికి వచ్చింది. వాళ్ళు అనుమానంగా ఆమెని పైకి కిందకీ చూసి వెళ్ళిపోయారు.

అటక మీది బూజులో దుమ్ములో సర్దుకొని కూర్చుని - ఆ రాత్రి క్షణం క్షణం ఈ క్షణం గడిస్తే చాలుననుకుంటూ గడిపారు.

తెల్లవారగానే మల్లేశ్ ఒక్కడు ఇంటికి వెళ్ళాడు.

కొంచెం సేపటికి ప్రసాద్ ఊరు నుంచి వచ్చాడు తన కుటుంబాన్ని కలుసుకున్నాడు. దుకాణదారుడికి, అతని కుటుంబానికి వారు ఎన్ని మార్లు ధన్యావాదాలు చెప్పు కొన్నారో మళ్ళీ చెప్పలేదనే అనుకొన్నారు.

అదేరోజు విద్యాసంస్థలన్నిటికి నిరవధిక సెలవులు ప్రకటించేసారు.

ప్రసాద్ కుటుంబం ఊరికి బయల్దేరారు.

మల్లేశ్ సుధాకర్ తమ యిళ్ళకు బయల్దేరారు.

విరిగిన హిమబిందు రవిల సైకిళ్ళు మాత్రం అక్కడే పడి వున్నాయి.

❋ ❋ ❋

" ఆ రాంనాథంగాడు ఎక్కడుంటడో ... ఏమో ... వెతికే లోపట ప్రాణం పొయ్యే టట్టుంది. " చౌరస్తాలో లారీ దిగిన ముఠా తమలో తాము మాట్లాడుకుంటున్నారు.

" వాన్ని ఖతంచేసే లోపట[1] ఈ అడివిల బడి మనమే ఖతమైతం " ఒకడు గట్టిగానే గొణిగాడు.

అప్పుడే ఆ ప్రాంతం వాడొకడు మేకపిల్ల భుజాన వేసుకొని వాళ్ళ ముందుగా వెళుతున్నాడు - అతని చెవిన ఈ మాటలు పడనే పడ్డాయి.

" ఇక్కర్రా ... బే ! " అతన్ని దగ్గరగా పిలిచారు.

వాళ్ళు రామనాథం వుండే చోటు వివరాలు అడిగారు.

అతను వాళ్ళు అడిగిన వాటన్నిటికీ చక్కగా సమాధానాలు చెప్పాడు. అమాయకంగా వున్న అతని ముఖం చూసి వాళ్ళు తృప్తిగా తలాడించారు. అతను చెప్పిన దారి బట్టి గబగబ వెళ్ళారు.

1. (ఇక్కడ) - వాని పని పూర్తి చేసే లోపల - ప్రాణాలు తీసేలోపల

వాళ్ళు కనుమరుగవ్వగానే ఆ మేక ఆసామి తిన్నగా బాలయ్య వాళ్ళింటికి పరుగు తీసాడు. అతను వాగు దాటుతుండగా రామనాధానికి తారసపడిన మేక ఆసామి. తన వాగులో పడిపోకుండా ఆపిన రామనాధం అతనికి బాగా జ్ఞాపకం వున్నాడు.

అర నిమిషంలో అక్కడి రైతులందరూ బాలయ్య ఇంటిముందు గుమిగూడారు. మరునిమిషంలో చేతికందిన కర్రలు పుచ్చుకొని రామనాధం ఇంటివైపు పరిగెత్తారు.

" ఏందిరా పాగలోడా[1] ఆ గుండ గాళ్ళ [2]కు తొవ్వెట్ల[3]జెప్పినవ్ ? " వారిలో ఒకడు మేక ఆసామిని మొట్టికాయ వేసినంత పని చేసాడు.

" పాగలోన్ని నేనెందుకైతా ? వాళ్ళే పాగలోల్లు ! వాండ్లకి ఏటికి పొయ్యే తొవ్వ చూపెట్న. వాండ్లు సుట్టిముట్టి వచ్చేపొద్దుకు సుక్కలెల్లాల ! "మేక ఆసామి తన తెలివినంతా ప్రదర్శిస్తూనవ్వాడు.

అందరూ అతని అభినందించారు

రామనాధం మూకుమ్మడిగా వచ్చిన రైతుల్ని చూసి తెల్లబోయాడు. వాళ్ళు ముందే నిశ్చయించుకొన్నట్లుగా ఒక్కమాట కూడా మాట్లాడలేదు.

ఎక్కడి వాళ్ళక్కడ సర్దుకొన్నారు. గొంగళ్ళు కప్పుకొని చడీచప్పుడు లేకుండా కూర్చున్నారు. ఆ చీకట్లో అంతమంది మనుషులున్న అనవాలే లేదు.

అందరి కంటి మీద అలాఅలా కునుకు వచ్చి వాలినపుడు - చాప కింద నీరులా ఆ ముఠా రామనాధం ఇంటిని చుట్టు ముట్టింది. పంటంతా కుప్పవేసి కల్లాంలో వుంది. మర్నాడో ఆ మర్నాడో మాసూలు చేయాలనుకుంటున్నారు.

ముఠాలో ఒకడు నోట్లో వెలుగుతోన్న బీడిని కుప్పమీదకు విసిరేసాడు. మెల్లిగా కుప్ప రాజుకుంటోంది.

ముఠా వాళ్ళు మునివేళ్ళ మీద నడుస్తూ ఇంటి ముందుకు వచ్చారు. మెల్లా మీద వరుసగా మూడుమంచాలు వున్నాయి.

మూడింటి మీద ముగ్గురు ముసుగుతన్ని వున్నారు.

ముఠావాళ్ళ అంచనాను బట్టి భారీ మనిషిలాగా అనిపించిన మంచం దగ్గర ఆగారు.

మంచం, కోళ్ళు పట్టుకొని మంచాన్ని పైకెత్తారు.

తుమ్మచెట్ల వైపు మెత్తగా పరిగెత్తారు.

హఠాత్తుగా దీపాల వత్తులు పెద్దవయ్యాయి.

దివిటీలు వెలిగాయి.

ముసుగు తన్నిన రైతులంతా గొంగళ్ళు విసిరేసి పెద్దపెట్టున అరుస్తూ ముఠా వెంట పడ్డారు. ఊహించని ఈ ఎదురుదాడికి ముఠా తత్తరపోయింది. మంచం కిందపడేసి పిక్కబలం చూపారు.

---

1. పిచ్చివాడా 2. రౌడీలు 3. దారి

కొందరు రైతులు కుప్ప ఆర్పడానికి వెళ్ళారు.

ముందే వూహించారు కనుక పైన కప్పిన ఎండుగడ్డిని కాస్త తడిపారు మంచు మరి కాస్త తడిపింది. మంట మందంగా సాగుతోంది. తట్టలతో మట్టి ఎత్తి పోయగానే చప్పున చల్లారిపోయింది

రైతులు తమ సాటి రైతును, అతని పంటను కాపాడుకొన్నారు. మర్నాడు పొద్దున తుమ్మచెట్ల దగ్గర శివుడికి ఓ వేట కత్తి దొరికింది



అది 1969వ సంవత్సరం.

ఇంతింతై మనిషింతై మరియు తానింతై నభోవీధిపైనంతై తోయద మండలాభ్రమున కల్లంతై ప్రభారాశి పైనంతై చంద్రునిపై కాలుమోపిన సంవత్సరం

చెట్లమీద గెంతులేస్తున్న నాటి నుండీ మనిషిని మురిపించి ముచ్చట గొలిపిన వేయి వెన్నెల రేకల జాబిల్లి ముంగిట మానవుడు నిలిచిమైమరిచిన సంవత్సరం.

చిట్టిపాపలు బుజ్జిబాబులు తమ చిన్నారి చేతులు చాచి లేలేత గొంతులతో 'చందమామ రావే జాబిల్లి రావే ' అంటూ ఎంతగా పిలిచినా వెన్నెల మామ రాలేదని - అలిగి - తమ ముగ్గురు మామయ్యలు పంపించి- చంద్రకాంతా శిలలను నేలకు రప్పించుకున్న సంవత్సరం.

నీలాకాశంలో వెల్లివిరిసిన వెన్నెలగనిని చేరుకోవాలనే స్వప్నం. దానికి సాకారం చేసుకోవాలనే ధ్యేయంతో మనిషి తన ప్రగతి పథంలో ఒక్కో మెట్టు నిర్మించుకుంటూ - వాటిని వెన్నెల మెట్లుగా మలచుకుంటూ ఆకాశానికి నిచ్చెనలు వేసి అందాల చంద్రుని అందుకున్న సంవత్సరం.

అది 1969 సంవత్సరం.

ఆ సంవత్సరం ఒక్కొక్కరికీ ఒక్కో అనుభవం మిగిల్చి కాలంలో కరిగిపోయింది.



# 6

శివుడి భార్య భారతిని కాపురానికి తీసుకొచ్చినపుడుగానీ - పురిటికి తీసుకెళ్ళడానికి వచ్చినపుడు గానీ - ఆమె అన్నదమ్ములకు రామనాథం వాళ్ళపట్ల - వారి వ్యవసాయం పట్ల ఒక అవగాహన ఏర్పడింది.

వాళ్ళు ఆ విషయాలన్నిటిని తమతో పాటు తమ వూరికి మోసుకెళ్ళారు.

కూతురి అత్తగారి గురించి గోరింతలు కొండంతలు చేసి చెప్పడం సహజమే. కానీ భారతి పుట్టింటివారు అల్లుడి గురించి, అతని కుటుంబం గురించి, అతని వ్యవసాయం గురించి పొగుడుతూ పొగుడుతూ వాటి మీద తమకు తెలియకుండానే ఇష్టం పెంచుకున్నారు.

పెళ్ళయిన ఏడాది తిరక్కుండానే పురుటికనివచ్చి పుట్టింటిలో ఆర్నెల్లుకు పైగా గడిపిన భారతి అత్తగారింట్లో తన కొత్తకాపురాన్ని మురిపెంగా తలుచుకొని నలుగురికీ ఘనంగా చెపుతూ మురిసిపోయేది.

బిడ్డను తీసుకొని అత్తగారింటికి బయల్దేరేసరికి, ఆమె అన్నదమ్ములు బావగారి ఊరిలో తమ, అదృష్టం పరీక్షించుకోవడానికి సిద్ధమయ్యారు. ఆమెతో పాటు బయలుదేరారు.

వారి కన్నా ముందుగా రత్తయ్య పెద్దల్లుడు - రైస్ మిల్లులో ఐపీ పెట్టేసి - పున్నమ్మ సలహా మేరకు రామనాథం శరణుజొచ్చాడు.

అలా రామనాథం వాళ్ళయింటి దగ్గర మరో రెండు యిళ్ళు వెలిసాయి. రెండు కుటుంబాలు కాపురానికి వచ్చాయి.

ఇక తరువాతి పంట నాటికి భారతి అన్నదమ్ముల బావమరుదులు వాళ్ళ బావమరుదులు - వాళ్ళ చుట్టాలు - స్నేహితులు - రత్తయ్య పెద్దల్లుడి అన్నదమ్ములు - వాళ్ళ బంధు వర్గం ఒక్కోరు వచ్చి చేరసాగారు. చూస్తూ వుండగానే రామనాథం వాళ్ళ యింటి చుట్టూ పూరిళ్ళు పడ్డాయి.

అది పది పదిహేను గడపలున్న చిన్న పల్లె అయ్యింది.

కొత్తగా వస్తోన్న వారు ఎదుర్కోవాల్సిన ఇబ్బందులున్నింటిని అప్పటికే ఆ ప్రాంతానికి పాతపడిన రామనాథం దగ్గర పరిష్కారం దొరుకుతోంది.

వారికి తెలియకుండానే రామనాథం కుటుంబం ఆ గ్రామానికి కేంద్రస్థానం అయ్యింది

తన చుట్టూ ఒక ఊరు ఏర్పడడాన్ని రామనాథం కుటుంబం ఆనందంగా గమనిస్తోంది.

ఇరుగు పొరుగు ఏర్పడ్డారు.

వంటరి తనం పోయింది.

కష్టాలు, సుఖాలు పంచుకుంటున్నారు.

ఏ వుపద్రవం వచ్చినా ఎదుర్కోన గలమన్న ధైర్యం వచ్చింది.

నివాస గృహాలున్నంత మేరా తుమ్మలు కొట్టి శుభ్రం చేసుకొన్నారు. పాములు తేళ్ళు తగ్గాయి.

రామనాథం వేసిన బాట ఆ వూరికి రహదారి అయ్యింది.

కమ్మరి, వడ్రంగి వచ్చి ఇండ్లు వేసుకొన్నారు. మెల్లిమెల్లిగా మంగలి, చాకలి అటువైపు రాసాగారు. కుమ్మరి వారానికో రెండు వారాలకో ఓసారి వచ్చి వెళుతున్నాడు. పశువుల కాపర్లు జీతగాళ్ళు కుటుంబాలతో, తరలి వచ్చారు.

రామనాథం ఈ మార్పునంతటినీ ఆశ్చర్యంగా గమనిస్తున్నాడు.

ఒంటరి తనం కలిగించిన అభద్రతా భావం మిగిల్చిన అనుభవంతో సంఘ జీవనానికి రామనాథం స్పష్టంగా స్పందించగలుగుతున్నాడు.

"ఒంటరిగా వున్నప్పటి నిగూఢతకూ నలుగురిలో వున్నపటి నిబ్బరానికి ఎంత తేడా ! మనిషి నలుగురిలోనూ వుండకుండా నలుగురితోను పంచుకోకుండా ఎక్కువ కాలం , మనలేడోమో !

పంచుకోవడం అనేది లేనిది మనిషే లేడు. దుఃఖాన్ని పంచుకొంటే తరగుతుంది. సుఖాన్ని పంచుకొంటే పెరుగుతుంది. అందుకే మనిషి సంఘజీవి అయ్యుంటాడు -

కావిడేసుకొని వాగుకి వచ్చేవాళ్ళు - కాలువకు వెళ్ళేవాళ్ళు. పొలాలకు బయల్దేరే బళ్ళు - ఎద్దుల అదిలింపులు - బండ్లు వెళుతున్న సందడి - జీతగాళ్ళను నిద్ర లేపడం - బుడ్డాళ్ళకి పనికి పురమాయించడం-పాలు పిండే వారి హడావుడి - ఉదయపు సందడికి సొబగులు అద్దాయి.

తుమ్మలతో తుప్పలతో బీడులాగా పడి వుండిన చేలు పంట చేలు అయ్యాయి. ఒక పొలంలో పనిచేస్తుంటే కూత వేటు దూరంలో మరో మనిషి పనిచేసుకొంటున్నాడు.

మనిషికి మనిషి తోడు.

ఏ పసిపాప ఏడుపో ఏ ముసలమ్మ రాగమో ఆ ప్రాంతాన్ని స్థబ్దత లోంచి బయట పడేస్తోంది.

ఎద్దుల రంకెలు, రైతుల అదిలింపులు, బండి చక్రాల పయనాలు - నిశ్శబ్దంలో చైతన్యాన్ని ప్రకటిస్తున్నాయి.

'ఇంతకాలం ఒంటరిగా ఎలా వుండగలిగేం ? ' రామనాథం ఆశ్చర్యపోయాడు,

'మనిషి సామూహిక జీవనాన్ని ఎందుకు కోరుకొంటాడో అర్థమవుతోంది. ఒంటరి తనంలోని నీరవత ఇప్పుడు లేదు. నిశ్శబ్దం మాయమైంది. పండగలూ, పబ్బాలు పేరంటాలు వాయినాలు ఎంత ఆనందం !'

భారతి ఆ కుటుంబంలోకి చాలా త్వరగా ఇమిడిపోయింది.

పసిపాప తల్లిపాలు విడిచింది , మెల్లిగా గడపలు దాటాలని ప్రయత్నిస్తోంది. పాపాయి రాక ఇంటిలో నవ చైతన్యాన్ని తీసుకొచ్చింది పాలాన పడ్డ కష్టమంతా పాప పసినవ్వులతో తీరిపోతోంది. భారతికి అటూ ఇటూ కేకవేస్తే పలికే అన్నదమ్ములు దాంతో దిగులు, వెలితి లాంటివి ఏవీ లేవు. పాప మూడిళ్ళలలో ముద్దులు మూట కట్టుకొంటూ ముచ్చటగా పెరుగుతోంది.

రత్తయ్య వచ్చాక ఆవరణ చక్కగా తీర్చిదిద్దాడు

ఇంటి చుట్టూ ఈతాకుల దడి కట్టాడు. కూరగాయల తోట దగ్గరికి గేదెలవీ పోకుండా దడి కట్టాడు. గేదెలకు వేసిన చావిడిలో మొచ్చువేసి - అవసరం లేసి సామానును సర్దిపెట్టాడు.

ఇంటిముందు జమ్ముతో చక్కటి పందిరి వేసాడు.

పాతదానికి పక్కగా మరొక నాలుగు నిట్రాళ్ళ యిల్లు కట్టాడు. ఇంటికి చుట్టూ ఓపికున్నంత మేరా పాదలు గుబుర్లు చెలిగేసి - పురుగు పుట్రా రాకుండా శుభ్రం చేసాడు.

ఇంటికి కొత్త కళ వచ్చింది

" బిడ్డొచ్చిన వేళ - " అంటూ సావిత్రి మురిపెంగా పాపకు మెటికలు విరిచింది.

శివుడిలో పెద్దరికం వచ్చింది. గుంభనంగా, గంభీరంగా ప్రవరిస్తున్నాడు. ఆ వూరిలో వారికి తలలో నాలుక అయ్యాడు. ఏ కష్టమొచ్చినా ఏ భయమొచ్చినా దడి దగ్గరికి వచ్చి " శివన్నయ్య - బావయ్య, శివా, శివుడూ", ఎలా పిలిచినా పరుగెత్తికెళ్ళి వారికి సహాయం చేస్తాడు.

రామనాథం ఆ వూరివారి మెదడు. శివుడు హృదయం.

ఒక వూరులో జీవించడం మొదలెట్టాక రామనాథానికి ఆలోచనా పరిధిని విస్తరించు కొనే ధైర్యం చిక్కింది.

రత్తయ్య, శివుడు వ్యవసాయం పనులన్నీ చక్కదిద్దుతున్నారు. రేగడి రామనాథానికి శివుడికి అర్థమైనంతగా రత్తయ్యకు కాలేదు. అందుకే అంత అనుభవం పండిన రైతు ఏవైనా సమస్య వచ్చినపుడు తమ్ముడి కోసమో కొడుకు కోసమో చూస్తున్నాడు.

కొత్తగా వచ్చిన వారందరూ సంప్రదాయ వ్యవసాయాన్ని కొనసాగించారు.

రామనాథం ఇన్నేళ్ళ శ్రమకు ఇన్నాళ్ళ కష్టార్జితమేమిటో అంచనా వేసుకున్నాడు వ్యయానికి తగిన ఆదాయం లేదు. శ్రమకు తగిన ఉత్పత్తి లేదు అనుభవం తప్పించి అతని కంటూ మిగిలింది భూమి.

రామనాథానికి చాలా నిరుత్సాహం కలిగింది.

" ఎంత కష్టం చేసి ఏం లాభం ? ఏదో ఒకటి చేయాలి - ఇదే కష్టంతో మరెంతో వుత్పత్తి సాధించాలి - ఎలా ? "

రామనాథం ఓ వ్యవసాయ శాస్త్రవేత్తను కలుసుకున్నాడు

భూసార పరీక్ష ఫలితాలు చూపించాడు - వారితో చర్చించాడు.

అతను నవ్వుతూ అన్నాడు, " అన్నిటి కన్నా ముందు మీరు చేయాల్సిన పని ఒకటి వుంది తుంగభద్రకు ఈ చివర నుంచి ఆ చివర వరకూ వున్న రేగడి భూములన్నింటిలోనూ మన తెలుగు వారు వ్యవసాయాన్ని చేస్తున్నారు. కర్ణాటక లోని సింధనూరు, గంగావతి, రాయచూరు, నుంచి శివాపూర్ హోస్పేట, దేశాయ్‌నగర్, బళ్ళారి, హుబ్లీ వరకు -వారు మంచి ఉత్పత్తి సాధిస్తున్నట్లు నివేదికలు వస్తున్నాయి"

"రాయిచూరు, సింధనూరు మాకు చాలా దగ్గర " రామనాథం ఉత్సాహంగా అన్నాడు

"మరింకేం అయితే ? వెళ్ళిరండి ! " ఆయన నవ్వి సాగనంపారు.

రామనాథం సింధనూరు వెళ్లాడు. అక్కడి రైతులు సంతోషంగా ఆహ్వానించారు. చాలా మట్టుకు తెలుగువారే. వారి విజయానికి రహస్యమేమిటో రామనాథం తెలుసుకున్నాడు.

విత్తనాలు, పంట, పనిముట్లు.

సంకర జాతి విత్తనాలు, ప్రతి పంట ట్రాక్టర్ల లాంటి ఆధునిక వ్యవసాయ పనిముట్లు

అక్కడి వాళ్ళు వ్యవసాయంలో ఎంతో ముందుకెళ్ళి పోయారు.

వారి అనుభవంతో పాటు విత్తనాలను మూటగట్టుకొని ఊరికి తిరిగివచ్చాడు.

ఆ క్షణం తనో విప్లవానికి విత్తనం వేస్తున్నానని రామనాథం ఊహించలేదు.

" శివుడూ - శివుడూ ... " రామనాథం అల్లంత దూరం నుంచే కేకలు పెడుతూ వచ్చాడు.

"ఏంటి బాబాయ్ " శివుడు పరిగెత్తుకుంటూ వచ్చాడు. రత్తయ్య కూడా ఏంటో విషయం అనుకుంటూ వచ్చాడు.

"ఏం తెచ్చానో చూడరా - విత్తనాలు- సంకర జాతి విత్తనాలు ఇక మన పొలాలు కొత్త పాట పాడతాయి - "

" ఏవో రావూడు - అప్పుడే ఎట్టా చెపుతా - ఇంతకన్నా మొనగాడి విత్తనాలే చూసా - కాక ఇల్లలగ్గానే పండగ్గాదు. విత్తనాలు వేయగానే పంటరాదు. అందులో మనకు తెలీని పంటయ్యే మన వలన అవుతుందటంటావా ? నాకు అనుమానమే ! ఏ వేరుశనగో, మిరపో ఏసుకొంటే తెలిసినట్టుంటది. " కళ్ళు చిట్లించి అనుమానంగా అన్నాడు రత్తయ్య.

"కానీ అన్నయ్య - అక్కడ వాళ్ళ పొలాలు ఎట్లా వున్నాయనుకున్నావు. వాటిని

చూస్తుంటే కడుపు నిండిపోయిందనుకో "

"నిజమేరా - అక్కడికి ఇయ్యి సరిపోయినయ్యి మన మట్టికి సరిపోతయ్యోలేదో - అసలే ఇదో జిత్తుల మారి భూమి " రత్తయ్య విత్తనాల మూట విప్పి విత్తనాలు పరీక్షిస్తూ అన్నాడు

" అట్లా భయపడితే ఇక వ్యవసాయం ఏం చేస్తాంనాన్నా " - శివుడు రత్తయ్య మాటకు అడ్డు వచ్చాడు

"నిజంరా శివుడూ - ప్రయోగం చెయ్యాలి కానీ దానికీ ధైర్యం వుండాలి మన తూర్పు పొలంలో ఓ నాలుగు ఎకరాలు వేసి చూద్దాం ఏమంటారు ? "

రత్తయ్యకు కూడా అభ్యంతరమేమీ లేదు

"ఒరే - శివుడూ - రేగడితో పోరాటం చేస్తుంది మనం ఒక్కరమే కాదురా, ఇక్కడి నుంచి తుంగభద్ర తీరమంతా తెలుగువారు రేగడిని సాగులోకి తీసుకొస్తున్నారు తుంగభద్రమ్మ చలువ వల్ల ఆ పక్క మంచిమాగాణాలు కూడా వున్నాయి రేగడితో పోరాడుతున్న వారిలో మనం మొదటి వాళ్ళమూ కాదు చివరి వాళ్ళమూ కాదు వాళ్ళక్కడ అద్భుతాలు సృష్టిస్తున్నారు మనమూ వారిని అందుకోవాలి - " రామనాథం కంఠంలో యుద్ధానికి బయల్దేరబోతోన్న సైనికుడి ఉత్తేజం ధ్వనించింది

"అట్లాగే చేద్దాం బాబాయ్ .. " శివుడు కళ్ళు మిలమిల మెరిసాయి

"దొందూ దొందే - దున్నపోతు ఈనిందిరా శివుడు అంటే దూడనెక్కడ కట్టేమంటావ్ బాబాయ్ అంటాడు - "రత్తయ్య గొణుక్కుంటూ వెళ్ళి ఎడ్ల ముందు జనపకట్ట ఎగేస్తున్నాడు.

రామనాథం, శివుడు ఆ పంటలో వేయాల్సిన పైర్ల గురించి చర్చించుకొన్నారు.

వాగొడ్డు పొలంలో వరి, తూరుప్పొలంలో వేరుశనగ, కాలువ పక్కన పొలంలో చెఱకు, కాలువకి ఎగువన ప్రత్తి మిగిలినదంతా జొన్న

ఇంతలో సుధాకర్ అక్కడికి వచ్చాడు.

"ఏరా సుధాకర్ - నీవేం చేద్దామనుకుంటున్నావ్ ? " రామనాథం అడిగాడు.

" ఏవుంది నాన్నా - పుస్తకాలున్నాయిగా చదువుకుంటున్నా - "

" భలే వాడివిరా - ఎప్పటి విషయాలు అప్పుడు కనుక్కోవద్దూ ? ఇందిరాగాంధీ హైదరాబాద్ వచ్చి వ్యవహారమంతా చక్కదిద్దిందని అక్కడ పేపర్లో చదివా - పి.వి. నరసింహారావుని ముఖ్యమంత్రి చేసారట. "పెద్దమనుష్యుల ఒప్పందం "కొనసాగిస్తారట అన్నిటికన్నా ముఖ్యమైంది రాష్ట్రాన్ని విశాలాంధ్రదేశంగానే వుంచాలని నిర్ణయించడం "

"అలాగా నాన్నా - కాలేజి తెరుస్తారేమో - "

"గొడవులు సద్దుమణుగుతాయనీ, పరిస్థితి చక్కబడుతుందనీ - పత్రికలవారు రాసారు మరి ! మనమూ అదే ఆశిద్దాం "

"అయితే మళ్ళీ గొడవలు రావంటావా నాన్నా ?"

" ఎలా చెప్తాంరా ? రాష్ట్ర ప్రజలందరికీ సమాన అధికారం వున్న రాజధాని నగరానికి కూడా ముల్కీరూల్స్ ఆపాదిస్తున్నారు. ప్రాంతే తరులలో అసంతృప్తి రావడం సహజమేగా ? తమ రాజధాని నగరంలోనే పరాయి వాళ్ళలాగా వేలెత్తి చూపడాన్ని వాళ్ళెలా సహించగలరు ? ఏమైనా ఈ అనుభవం రగిల్చిన - మిగిల్చిన అసంతృప్తి ప్రాంతీయ తత్వం కరడు కట్టడానికి విశాలాంధ్ర భావాన్ని బలహీన పరచడానికి హేతువుతోందేమోనని అనిపిస్తోంది. అంసతృప్తే అన్ని అనర్థాలకు మూలమంటారుగా ?"

" పాపం ప్రసాద్‌గారు వాళ్ళు ఎక్కడ వున్నారో .... " సుధాకర్ వాళ్ళందర్నీ ఆ కాళరాత్రినీ, దుకాణదారు ఔదార్యాన్ని తలుచుకున్నాడు.

"ఏమైనా ఓ ఏడాది చదువు చట్టుబండలయ్యింది" అప్పటి దాకా మౌనంగా వారి మాటలు వింటున్న శివుడు అన్నాడు.

"నిజం అన్నయ్య - ఒక ఏడాది వెనుకబడిపోయాం -" సుధాకర్ విచారంగా అన్నాడు.

"ఒక్క చదువులోనే కాదురా - సంస్కారంలోనూ అన్నింటిలోనూ - ఈ ఏడాది యావదాంధ్ర జాతి వెనకబడి పోయింది " రామనాథం బాధగా అన్నాడు.

అందరూ ఔనన్నట్లు మౌనం వహించారు.

"మరయితే పదరా సుధాకర్, నేనూ వస్తాను. బాలయ్య గారింటికి వెళ్ళి మల్లేశ్‌ను కలుద్దువు - " రామనాథం లేచి, పైపంచ దులిపి వేసుకొని బాలయ్య వారి వూరి వైపు ప్రయాణమయ్యాడు.

సుధాకర్ అతనికి అనుసరించాడు.

❋ ❋ ❋

సావిత్రికి సంతోషంతో కాళ్ళూచేతులు ఆడడం లేదు. పున్నమ్మకీ శాంతమ్మకీ తను నిర్మించుకున్నవన్నీ సంబరంగా చూపిస్తోంది.

కూరగాయల తోట - కోళ్ళగుంపు - ఇల్లు వాకిళ్ళు - దొడ్డి దోవలు -

కల్యాణి - అనూరాధ పూలమొక్కల అంతు తేలుస్తున్నారు.

కారబ్బంతులు కుదురుగా వున్న మొక్కల నిండా విరగ బూసి వున్నాయి. ముద్దబంతులు ముగ్ధమనోహరంగా నవ్వుతున్నాయి. రెక్కబంతులు అలవోకగా చిరునవ్వులు చిందిస్తున్నాయి. బియ్యబ్బంతులు పాలనవ్వులు పంచుతున్నాయి. ముద్దబంతులు ముచ్చట గొలుపుతున్నాయి.

గడ్డిచేమంతులు గుంభనంగా నవ్వుతున్నాయి. చిట్టి చేమంతులు చిలిపి నవ్వులు

రువ్వుతున్నాయి. నక్షత్ర చేమంతులు నయగారాలు పోతున్నాయి. రెక్క చేమంతులు రెపరెపలాడుతున్నాయి. సీతమ్మ వారి జడబంతులు వయ్యారంగా గాలిలో ఊయలూగుతున్నాయి. కనకాంబరాలు కళకళలాడుతున్నాయి. పారిజాతాలు, నందివర్ధనాలు, గరుడ వర్ధనాలు, చంద్రకాంతాలు, చిలుక ముక్కు పూలు, గోరింక పూలు - ముళ్ళ గోరింట - అబ్బా - అనూరాధ కల్యాణి సంతోషం పట్టేలేకపోతున్నారు. సంక్రాంతి సంబరమంతా వారి ముఖాల్లో చిందులేసింది. పద్మ, భారతి వాళ్ళకు తోడయ్యారు

సరళ కూడా వుంటే ఎంత బావుండునని అందరూ పదేపదే అనుకున్నారు.

అనూరాధను శివుడు ఆటలు పట్టిస్తుంటే భారతి అనూరాధకు సాయానికి వస్తోంది ఇద్దర్నీ వేళాకోళాడించాలని అందరూ ఓ జట్టయిపోయారు అందరి మధ్యలో శివుడి కూతురు ధాత్రి మురిపాలు మూట కట్టుకొంటోంది

ఆ ఏడాది పంటలు అనుకూలమవడంతో రైతులందరూ సంతోషంగా వున్నారు. సంక్రాంతి లక్ష్మి రైతుల గుండెలలో నాట్యం చేస్తోంది. రైతుల ముఖంలో చిరునవ్వులు చిందు లేస్తున్నాయి.

రత్తయ్య ఎద్దులకి కొత్త ముక్కుతాళ్ళు పశువులన్నిటికి పలుపుతాళ్ళూ నేస్తున్నాడు.

శివుడు బొంకూరు సంతనుండి ఎద్దుల అలంకరణ సామాగ్రి పట్టుకొచ్చాడు.

రామనాధం పంట బేరాలు సారాలు చూసుకొంటున్నాడు.

సుధాకర్ చదువు నుండి మంచి విరామం తీసుకొంటున్నాడు. ఆడవాళ్ళందరూ బూజులు దులుపు కోవడం, ఇల్లు అలుక్కోవడం ముగ్గులు పెట్టు కోవడంలో నిమగ్నమై పోయారు.

ఇల్లంతా అలుక్కున్నాక పిండివంటలు మొదలెట్టారు. బియ్యం నానేసారు. పిండి కొట్టుకున్నారు. సుధాకర్ కర్నూలు వెళ్ళి సరుకులు తెచ్చాడు. అరిసెలు, కొబ్బరి బూరెలు, తపాల చెక్కలు, కారప్పూస , బెల్లప్పూస వండారు.

వంటకాలు అవ్వగానే వంటిల్లు అలుక్కున్నారు. ముగ్గులు తీర్చుకున్నారు.

అనూరాధ, కల్యాణి ఈ పూలమొక్క దగ్గర్నుంచి ఆ పూలమొక్క దగ్గరికి సీతాకోకచిలుకల్లా తిరుగుతున్నారు.

శివుడు వాళ్లకి ఓ రహస్యం చెప్పాడు. వాగొడ్డున ఓ గోరింట చెట్టు వుందని వెళ్ళి గోరింటాకు కోసుకోమని ఆ మాట శివుడి నోట్లోంచి వచ్చీరాక ముందే అనూరాధ, కల్యాణి వాగొడ్డుకు పరుగులు పెట్టారు.

వాళ్ళు ఎటు వెళుతున్నారో, అర్థం కాక సుధాకర్ వాళ్ళను అనుసరించాడు

అనూరాధ, కల్యాణి అప్పటికే చెట్టు మీదకి విజృంభించారు. గోరింట ముళ్ళు గుచ్చుకోకుండా 'ఆకు కోస్తున్నారు దోసిలి నిండాక ఎక్కడ పోసుకోవాలో అర్థం కాక అయోమయంలో పడ్డారు

"ఇలా పొయ్యి కల్యాణీ -" అనూరాధ చటుక్కున కొంగు పట్టింది. సుధాకర్ కూడా గోరింటాకు కోసుకోవడంలో వాళ్ళకు సహాయం చేస్తున్నాడు. సుధాకర్‌కు ఓ విరిసిన గోరింట పూల గుత్తి కనపడింది. దాన్ని సుకుమారంగా కోసి చేతిలోకి తీసుకొన్నాడు. చిన్ని చిన్ని నక్షత్రాలాంటి పూలు, సుధాకర్ వాసన చూసాడు. అది-ఒక వింత సువాసన. సుధాకర్‌లో మధుర భావనలు నింపింది. దూరంగా వెళ్ళి వాగొడ్డున నిల్చున్నాడు.

వాగు కూడా సంక్రాంతి శోభ నింపుకుని వుంది. జమ్ముమీద గూడు కట్టుకొన్న ఓ బంగారు పిచ్చుక పిల్ల పక్షులతో ముచ్చట్లాడుతోంది.

తుమ్మచెట్లు పసుపు పచ్చని పూలు చిట్టి చేమంతుల్తో పోటీ పడుతున్నాయి. తెలుపులో ఊదారంగు కలిసిన తుంగపూలు, పచ్చని తంగేడుపూలు అందంగా తలలూపు తున్నాయి. సుధాకర్ గోరింట చెట్టు వైపు చూసాడు.

కల్యాణి గట్టుమీద కూర్చుని వుంది. అనూరాధ గుప్పిటలో గోరింటాకు నిండగానే తెచ్చి కల్యాణి వళ్ళో పోస్తోంది.

సుధాకర్‌కు ఎందుకనో అనూరాధను చూడాలంటే ఇబ్బందిగా అనిపించింది. తనకు ఊహ తెలిసాక మొట్ట మొదటిసారిగా సుధాకర్ అనూరాధను మామూలుగా చూడలేకపోయాడు. అది ఎందువల్లో సుధాకర్‌కి తెలియదు. కానీ అతను ఎంత ప్రయత్నించినా అనూరాధను ఇంతకు మునుపులా చూడలేకపోతున్నాడు.

"ఇంక వేసవికాలంతో తన చదువు పూర్తవుతుంది.

ఆ తరువాత .. ? "

సుధాకర్ వంట్లో ఆవిర్లు తేలాయి.

సుధాకర్ గోరింట పూలు వాసన చూసాడు.

సుధాకర్ మహబూబ్‌నగర్‌కి వచ్చాక అనూరాధను చూడడం మళ్ళీ ఇదే.

అనూరాధ వయసు వయ్యారాలు దిద్దుకుంటోంది. అనూరాధలో సొగసులు గుసగుసలాడుతున్నాయి.

ముద్ద పసుపు రంగులంగా జాకెట్టుల మీద కెంపురంగు వోణీ అనూరాధ వంటికి అందంగా అమిరింది. అనూరాధ ఓ బంగారు వన్నె తూనీగలాగా ఈ కొమ్మ నుంచి ఆ కొమ్మకు

కదులుతోంది.

సుధాకర్ తనకు తెలియకుండానే అనూరాధని కను చివరల నుండి చూడసాగాడు

అనూరాధ కాలిమునివేళ్ళ మీద లేచి కొనగోటితో గోరింటాకు గిల్లి కొంగులో పోసుకుంటోంది కల్యాణి ఏమనిందో ఏమో అనూరాధ ముక్కు విరిచి, మూతి తిప్పింది.

'అబ్బ ఎంత అందంగా వుంది ! ' సుధాకర్ అప్రయత్నంగా అనుకొన్నాడు.

సుధాకర్ చప్పున గోరింట పూలవైపు చూపు మళ్ళించాడు.

సుధాకర్ ఇంతకు మునుపు తను అనూరాధను బుర్ర ముక్కకి వెక్కిరించే వాడినని గుర్తుకురాలేదు. ముచ్చటగా ముక్కు ఎప్పుడు విరుస్తుందోనని ఓరగా చూసాడు.

అనూరాధ ఫక్కున నవ్వింది

సుధాకర్ చప్పున వాగువైపు తిరిగాడు. సుధాకర్ వూపిరి వెచ్చబడింది.

'ఎప్పుడూ చూసే అనూరాధేగా? ' సుధాకర్ అలా అనుకొని ఆ మాట మీదే వుండలేకపోయాడు

"లేదు అనూరాధలో ఏదో మార్పు వచ్చింది ".

"'ఏంటి ' చినబావా - ఆ కొంగే ననుకున్నా నువ్వుకూడా జపం చేస్తున్నా వేంటి ? " అనూరాధ నవ్వుతూ వేళాకోళంగా అంది.

వాగులో ఒంటి కాలి తపస్సు చేస్తున్న కొంగ అనూరాధ నవ్వుతో రెక్కలల్లార్చుకొంటూ గాల్లోకి ఎగిరింది.

సుధాకర్ ఉలిక్కి పడ్డాడు.

"అదేంటి బావా అంత భద్రంగా పట్టుకొన్నావ్ ? " అనూరాధ గబుక్కున సుధాకర్ చేతిలోని గోరింట పూలు లాక్కుంది

సుధాకర్ తడబడిపోయాడు. కళ్ళు వాల్చేసుకున్నాడు. సుధాకర్ ఆ పూల గుత్తిని అనూరాధకే ఇవ్వాలని అనుకున్నాడు. అది కూడా వంటరిగా సున్నితంగా, ఒక్కో పువ్వులో తన కొత్త భావాల పుప్పొడి నింపి ఇవ్వాలనుకొన్నాడు. కాని అనూరాధ అలా దుడుకుగా లాక్కుంటే వారించలేకపోయాడు. బింకంగా ఏదో అందామనుకున్నా అనూరాధ అంత సన్నిహితంగా రాగానే తబ్బిబ్బై ఒక్క మాట గొంతు పెగల్లేదు.

" అబ్బ - ఎంత మంచి వాసన బావా - తల్లో పెట్టుకొంటూ " అనూరాధ కల్యాణివైపు వెళ్ళింది, "చూసావా కల్యాణి చినబావ ఎంత మంచి గోరింట పూలగుత్తి కోసాడో - "

" ఏదీ నాకివ్వు - " కల్యాణి అడిగింది.

"కావాలంటే తీసుకో .... అనూరాధ గోరింటపూలు పైకెత్తి పట్టుకొని పరుగులు పెట్టింది.

కల్యాణి లంగా ఒడిలోని గోరింటాకు - పడిపోకుండా పరికిణీ అంచులు జాగ్రత్తగా ఎత్తి

పట్టుకొంటూ అనూరాధను అనుసరించింది

అనూరాధ అల్లంత దూరం వెళ్ళాక సుధాకర్‌ని కేకేసింది.

"కొంగ బావా - జపం మాని త్వరగా రా - చేపల పులుసు వండి పెడతాం - " గలగల నవ్వుతూ అనూరాధ ఆమె వెనుక కల్యాణి - చేలగట్ల మీద గంతులు పెడుతూ ఇంటికి వెళ్ళారు

సుధాకర్ అప్పుడు కళ్ళు విప్పార్చి వారి వంక చూసాడు తుళ్ళింతల తుంగభద్రలా పరుగు పెడుతోన్న అనూరాధను చూస్తు వుండిపోయాడు.

అప్పుడే గూట్లోంచి లేచిన బంగారు పిచ్చుక చెట్లమీద గిరికీలు కొడుతూ గాల్లోకి ఎగిరింది.

సుధాకర్ చేతికి మిగిలిన గోరింట పూల వాసన చూసుకొన్నాడు.

వెన్నెలబాల నెలవంక మీద జర్రున జారుతున్నట్లుగాఅనూరాధ క్షణంలో మాయమైపోయింది. సుధాకర్ చుట్టూ చూసాడు. ఆకుల కలకలలు పక్షుల కిలకిలలు తప్ప అంతా నిశ్శబ్దంగా వుంది. అదేమిటో కానీ ఎప్పుడూ ప్రత్యేకంగా అనిపించని అనూరాధ నవ్వు మెత్తగా, హాయిగా అందంగా వుంది.

"ఎందుకని కల్యాణి అనూరాధ తనకు ఒకలా కన్పడడం లేదు ? " సుధాకర్ ఆశ్చర్యపోయాడు -

వాగొడ్డున గరిక మీద వెల్లకిలా పడుకున్నాడు. చేతులు తల కింద పెట్టుకొన్నాడు.

నీలాకాశంలో తొలి చుక్క మిలమిల లాడగానే ఇంటిదారి పట్టాడు.

అనూరాధ వాళ్ళు రోటి చుట్టూ చేరి వున్నారు.

సందడి చేస్తూ గోరింటాకు రుబ్బు కుంటున్నారు.

సుధాకర్ తిన్నగా వెళ్ళి మెల్లా మీద మంచం వాల్చుకొని బోర్లా పడుకొన్నాడు. మెల్లిమెల్లిగా ముసురుకుంటోన్న మంచు తెరల చాటునుండి వెన్నెల మామ మెత్తగా నవ్వు తున్నాడు. నులక మంచం అల్లికల్లోంచి సాయంత్రం వేసిన ముగ్గు అస్పష్టంగా కనిపిస్తోంది. మంచుతో బరువెక్కిన గాలి మందంగా సాగుతూ పారిజాతాల పలుచని పరిమళాన్ని మోసుకువస్తోంది.

రోట్లో రుబ్బురోలు పాత్రం లయబద్ధంగా కదులుతోంది. రుబ్బుతోన్న వారి చేతిగాజులు అందంగా తాళం వేస్తున్నాయి. సన్నగా వినిపిస్తోన్న సంభాషణలు - వేళాకోళాలు - చతుర్లు విసురుకోవడం ఒక్కసారి ఫక్కుమనడం - చప్పున ఆగిపోవడం అంతలోనే మళ్ళీ కొనసాగడం ఆ అందమైన వాతావరణాన్ని మరింత శోభనిస్తున్నాయి.

సుధాకర్ అనుకోకుండానే - అనూరాధ గొంతు వినాలని ప్రయత్నం చేస్తున్నాడు.

గుసగుసలలో ముసిముసి నవ్వులలో అనూరాధ కంఠం పోల్చుకోవాలని ఎంతో మెళుకువగా చెవులు రిక్కించాడు. చటుక్కున పోల్చుకున్న అనూరాధ సన్నని నవ్వు జాబిల్లి వెన్నెల తారకలని విరజిమ్మిన అనుభూతిని కలిగించింది. గిలిగింతలు పెట్టింది మత్తిలిన కొత్త ఊహలు మధుర లోకాల్లో విహరింపజేస్తున్నాయి

"ఏంట్రా సుధాకర్ అట్టా పడుకున్నా ? మంచులో తడిసిపోవూ ? లే - లేచెళ్ళి లోపలపడుకో - " పున్నమ్మ భుజాన చరిచి మరీ సుధాకర్‌ని లేపింది.

సుధాకర్ ఒక్కసారిగా ఉలిక్కిపడ్డాడు

"అబ్బ - నువ్వా నాయనమ్మ - లోపల ఉక్కగా ఉందిలేవే - "

సుధాకర్ తన మనసులోని కలవరపాటు ముఖాన కనిపిస్తూందేమోనని అనుమానించాడు కలవరపాటు దాచుకోవలని ప్రయత్నించాడు. విఫలుడన్నాయ్యానేమోనన్న అనుమానం చిరాకుగా కోపంగా బయట పడింది.

"అదేంట్రా అలా విడ్డూరంగా మాట్లాడతావు. ఓ పక్క వణుకు పుట్టి చస్తుంటే ఇప్పుడేం ఉక్క పోస్తుందంటావే ! అయినా దుప్పటైనా కప్పు కోకుండా పడుకుంటే ఎలారా ? తెల్లారే పాటికి బిగుసుకు పోతావు - లే . .. .. లే .. ! " పున్నమ్మ వయసు మీరిన వళ్ళు గడగడ వణికి పోతోంది. చలికి పళ్ళు కరుచుకు పోతున్నాయి.

సుధాకర్ నరనరాల్లో వేడినెత్తురు ఉరకలు వేస్తోంది - కొత్త ఊహలు ఊపిరి పీల్చుకోనివ్వడం లేదు.

"కనీసం ఓ ముద్ద కతికి పడుకోరా ...... "

"నాకు ఆకలిగా లేదు నాయనమ్మ "

"పాడు పిండి వంటలు ఏవని వండుతావో . ! అయ్యి తిన్నాక పిల్లలకి ఇంక తిండెట్టా సయించుద్దీ ? " పున్నమ్మ గొణుక్కుంటు వణక్కుంటు లోపలికి వెళ్ళిపోయింది

సుధాకర్ రోటివైపు సవ్వడి కోసం చెవులు రిక్కించాడు.

అంతా నిశ్శబ్దంగా వుంది

సుధాకర్ మంచం పట్టెమీద తల ఆనించి నిద్రపోవాలని ప్రయత్నించాడు - వెన్నెల వాన మంచుతోపాటు చల్లగా కురుస్తోంది. పూలన్నీ తడిసి బరువుతో తలలు వంచుతున్నాయి.

అన్నిటికీ విరుద్ధంగా సుధాకర్ గొంతు ఎండిపోతోంది. లేచి వంటింట్లో వెళ్ళాడు. గటగట మంచినీళ్ళు తాగాడు. వంటింటికి పెద్దింటికి మధ్యన మంచాలు వేసుకొని ఆడవాళ్ళు కూర్చుని వున్నారు. భారతి, పద్మ గోరింటాకు పెడుతున్నారు అనూరాధ గోరింటాకు పెట్టించుకోవడం అప్పుడే అయిపోయినట్లుంది. కాళ్ళకు పారాణి అరికాళ్ళల్లోని చందమామలు

కదలిపోకుండా ఎలా కూర్చువాలో తెలీక సతమతమవుతోంది రెండు అరచేతుల్లోను గోరింటాకు పెట్టేసుకొని వుంది పవిటను చుట్టూ తిప్పి నడుముకు బిగించింది ముఖాన పడుతొన్న ముంగుర్లను మోచేత్తో సర్దకోవాలని ప్రయత్నిస్తోంది

సావిత్రి పళ్ళెంలో అన్నం కలిపి, ముద్దలు చేసి అనూరాధ నోట్లో పెడుతోంది

" పొలమారింది - చిన్నత్తయ్య త్వరగా మంచి నీళ్ళియ్యి - " అనూరాధ ఉక్కిరి బిక్కిరి అయ్యింది కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

సుధాకర్ చటుక్కున చేతిలోని గ్లాసును మంచినీళ్ళ బాన మీది ముకుడులో పెట్టాడు గిర్రున వెనక్కి తిరిగి రాబోయాడు.

సావిత్రి మంచినీళ్ళగ్లాసు తీసుకొని అనూరాధ నోట్లో ఎత్తి పోస్తోంది అనూరాధ మెడ వెనక్కి వంచి నీళ్ళు తాగాలని ప్రయత్నిస్తోంది.

సుధాకర్ ఒక్క క్షణం స్తంభించి పోయాడు

వెన్నెల వెలుగులో అనూరాధ అమృతం తాగుతోన్న అప్సరసలాగా వుంది తొణికిన నీళ్ళు ఆమె ముఖానా మెడ మీదా అందంగా మెరుస్తున్నాయి.

ఇంతలో ఓ ఈగ అనూరాధ ముఖాన వాలానన్న ప్రయత్నంలో పడింది అనూరాధ దాని బారి నుండి తప్పించుకోవాలనీ ప్రయత్నంలో ముక్కు విరుస్తూ మూతి తిప్పుతూ కళ్ళ చికిలిస్తూ నొసలు చిట్లించుతూ నానా తంటాలు పడుతోంది

సుధాకర్‌కు ఆమె ప్రతి ప్రయత్నం ఓ అందమైన భంగిమలా వుంది.

" అవునే - అమ్మాయ్ - ఆ సుధాకర్ ఏడీ - వంటింట్లోకి వెళ్ళాడు. ఇంకా రాలేదు అన్నం కానీ తింటాడామో ఈ గోరింటాకు గోలలో పడి పిల్లాడి విషయం పట్టించు కొన్నారూ ..." పున్నమ్మ ఓ రాగం తీసింది.

సుధాకర్ చప్పున గుమ్మం దాటి బయటకు వచ్చాడు.

" ఏంటి బావా -- నువ్వూ గోరింటాకు పెట్టుకుంటావా ? "అనూరాధ కిసుక్కున నవ్వింది

సుధాకర్ అనూరాధ వంకే చూడలేదు, కళ్ళు వాల్చుకొన్నాడు. నవ్విన క్షణంలో అనూరాధ ముఖం ఎలావుండి వుంటుందో వూహించుకుంటున్నాడు.

చిన్నప్పుడు వాళ్ళతో పోటీపడి తనూ అరచేతిలో ఓ చందమామను పెట్టించు కొనేవాడు.

అనూరాధ సుధాకర్‌ను ఆటలు పట్టించడానికి ఏదో అంది.

అందరూ ఫక్కుమన్నారు.

సుధాకర్ చెవులకి ఒక్క మాట ఎక్కలేదు. - ఏదో కలవరం అతన్ని అక్కణ్ణించి

తరుముకువెళ్ళింది

మంచులో తడుస్తూ మంచంలో పడుకొని అటుఇటూ మెసలుతుండగానే శివుడు వచ్చి లేపాడు.

" లేరా - భోగి మంటవేద్దాం - "

సుధాకర్ వెళ్ళేసరికే ఇంటి ముందు అందరూ సిద్ధంగా వున్నారు. రత్తయ్య విరిగిపోయిన పనిముట్లు వస్తువులు తెచ్చి కుప్పవేసాడు సావిత్రి ఇంట్లోని పనికిరాని వస్తువులన్నీ తెచ్చింది. అనూరాధ కల్యాణి పండగ నెల మొదలైనప్పటినుంచి రోజూ పెడుతున్న గొబ్బెమ్మలను పిడకలుగా తట్టి ఎండబెట్టారు వాటిని తెచ్చికుప్పలో వేసారు

ఎండుగడ్డి- చెక్కముక్కలు, పేళ్ళు వేసి - పైన పిడకలు పెట్టి నిప్పంటించారు

మంచులో తడిసిన ఎండుగడ్డి నెమ్మదిగా రాజుకుంది

దట్టమైన పొగమంచులో భోగి మంట ఎగిసింది.

వడవడ వణుకుతోన్న పున్నమ్మతో సహా అందరూ బోగి మంట చుట్టూ చేరారు

కల్యాణి దుప్పటిని తలమీద నుంచి తిప్పి మెడ చుట్టుగా చలిముడి వేసుకుంది.

అనూరాధ వోణి కొంగును తలమీద నుంచి తిప్పి వేసుకుంది ఆమె పరికిణి కుచ్చిళ్ళు పాదాల మీద కుదురుగా కూర్చున్నాయి. అరచేతులు విప్పార్చి - సెగకు చూపించి ముఖానికి అద్దుకుంటోంది. అనూరాధ అరచేతుల్లో పండిన గోరింటాకు భోగిమంట వెలుగులో అందంగా మెరుస్తోంది. నిజానికి అనూరాధ తన ఎర్రగా పండిన గోరింటాకు సొగసును భోగిమంటలో ఎగుస్తోన్న అగ్ని కీలలతో పోటీకి పెట్టి ఆనందిస్తూందేమోనన్నట్లుగా వుంది.

శివుడు మంటను ఎగదోసాడు. మంట గప్పున పైకి లేచింది తగ్గుతూ లేస్తున్న భోగి మంట ఎర్రటి సూర్యుణ్ణి దాచుకుని పైకి కిందికీ పడిలేస్తోన్న సముద్ర కెరటంలా వుంది

చక్కని నేవళింపులో మిలమిలలాడుతోన్న అనూరాధ చెక్కిలికి నేర్పుగా నారింజ రంగులు అద్దుతోంది.

సుధాకర్ గుండె వెచ్చ బడింది. అనూరాధ ప్రతి కదిలికనూ పదిలంగా మనసులో దాచుకుంటున్నాడు. అతనిలో కొత్త ఉత్సాహం నిండిపోయి ఉత్తేజితుడవుతున్నాడు ఆమెను సూటిగా చూడకుండా పక్క చూపులు దొంగ చూపులు చూస్తున్నాడు.

సుధాకర్‌కు మొట్ట మొదటిసారిగా తన ఆరగడుల రూపం అతని కళ్ళ ముందుకు వచ్చింది. విశాలమైన ఛాతీ - వెడల్పాటి భుజాలు - చిక్కటి మీసకట్టు - తన ప్రత్యేకతలని అతను భావించాడు. ఆ విషయం అనూరాధ ఏ మాత్రం గ్రహించిందో అతనికి అర్థం కాలేదు. ఆమె గ్రహింపులోకి రావాలని అతనికి తెలియకుండానే బోర విరుచుకుని కూర్చున్నాడు

అనూరాధ తన లోకంలో తనుంది.

సుధాకర్‌కు తను చెసిన పని ఏమిటో స్పృహ గలగానే సిగ్గుపడి పోయాడు. తడబాటును కనిపించనివ్వకుండా సెగకాచుకున్న అరచేతుల్ని ముఖానికి అడ్డుగా పెట్టుకున్నాడు.

"అదేంట్రా - సుధాకర్ - అట్లా మన్ను తిన్న పాములా మందంగా వున్నావ్ . ఈపాటికి భోగిమంట మీద నుంచి గెంతు లేసేవాడివి. వంట్లో బాలేదా ఏవిటి ? " శివుడు చనువుగా సుధాకర్ భుజం మీద చేయివేసి - ఆదుర్దాగా అడిగాడు.

సుధాకర్ తన పరిస్థితి తనకే అర్థంకాని అయోమయస్థితిలో వున్నాడు. ఏదో సిగ్గు, ఏదో బిడియం, ఏదో బెరుకు, ఏదో సందేహం అన్నీ కలగలిసిన నేపథ్యంలో అప్పుడో ఇప్పుడో సన్నని వీచిక మనసును గిలిగింతలు పెడుతోంది. కలవరంలో ముంచుతుంది సుధాకర్‌కు తన మానసిక స్థితి శివుడు గ్రహించాడమోనని కుంచించుకుపోయాడు తల మరింత వాల్చేసుకొని - ఏమీ లేదన్నట్లు సైగ చేసాడు.

శివుడు సుధాకర్ ముఖంలో కదలాడిన భావాల్ని సులభంగానే పసిగట్టాడు. యవ్వనం తన తమ్ముడిలో కలిగిస్తోన్న కలవరపాటును సంతోషంగా గ్రహించాడు. తనలో తను తృప్తిగా నవ్వుకున్నాడు. సుధాకర్ వెన్ను చరిచి - ఉత్సాహపరిచాడు మరో విషయం వైపు మళ్ళించి - చూస్తుండగానే దాంట్లో పూర్తిగా దింపేసాడు.

కానీ, అప్పుడప్పుడూ నర్మగర్భితంగా సుధాకర్ వంక కొంటె చూపులు విసురుతున్నాడు. సమయం చిక్కినపుడు సుధాకర్ వివాహ ప్రస్తావన రామనాధంతో చేయాలని నిశ్చయించుకున్నాడు.

ఆ రోజు ఉదయాన్నే మొదట మగవాళ్ళ తలంటుస్నానాలు పూర్తి చేసుకున్నారు.

శివుడి బండి ఇరుసులకు కందెన వస్తున్నాడు.

రత్తయ్య ఎద్దులను, గేదెలను కడిగి శుభ్రం చేసే పని పెట్టుకున్నాడు. శివుడు కావిడి వేసుకొని కాలువ నుంచి నీళ్ళు తెచ్చిచ్చాడు. లోటాతో సుధాకర్ ఎద్దు మీదికి నీళ్ళుపోస్తోంటే - రత్తయ్య ఎండిగడ్డితో రుద్దాడు. కొమ్ములు కడిగాడు. మూపురం తెల్లగా మిలమిల మెరిసింది.

శివుడు సంతలో కొనుక్కొచ్చిన తోలుపట్టీ మూపురం వెనుక నడుంకి వేసాడు. మెడలో మువ్వల పట్టీ వేసాడు. గంగడోలు కింద చిరుగంట గణగణమంది. కొమ్ములకు కుచ్చులు నుదుటికి తోలుపణకట్లు అలంకరించారు.

రత్తయ్య కొత్త ముక్కుతాళ్ళు బిగించాడు. పలుపు తాడు మెడకు వేసాడు.

మేలిమి ఒంగోలు జాతి ఎద్లు గిట్టలు దున్నాయి - గట్టిగా రంకె వేసాయి.

అందరి మనసులు పులకరించాయి.

రత్తయ్య ఆప్యాయంగా వాటి గంగడోలు నిమిరాడు. సుధాకర్, శివుడు బండికి వార్నీషు

వేసారు.

"ఈసారి గిత్తల కొమ్ములకు రంగు వేద్దాం అన్నయ్యా - " సుధాకర్ ముచ్చట గొలుపుతున్న గిత్తల్ని చూస్తూ అన్నాడు.

రామనాథం నాగళ్ళకు పట్టెడలు బిగించేసాడు.

రత్తయ్య మొచ్చు దులిపి, చావిడి శుభ్రం చేసాడు.

ఇంకా ఆడవాళ్ళు తలంటు కార్యక్రమాల్లోనే వున్నారు.

అనూరాధకి వత్తైన పొడవు జుట్టు. కల్యాణిది ఉంగరాలు తిరిగిన మధ్యస్తం జుట్టు. భారతిది పట్టుకుచ్చు లాంటి పొట్టి జుట్టు పద్మదీ కల్యాణిది ఒకే తలకట్టు

అందరికీ తలలకు ఆముదాలు అంటారు. వళ్ళంతా మీగడ పచ్చి పసుపు కలిపి పట్టించారు. కుంకుడుకాయలు కొట్టి నానేసారు. వంట్లో ఇంకిన మీగడ వదిలేలా సున్నిపిండితో వంటికి నలుగుపెట్టారు. తలలో ఇంకిన ఆముదం వదిలేలా కుంకుడు రసంతో తలంటు కొన్నారు.

సావిత్రి, శాంతమ్మ - వాళ్ళందరి జుట్టు చిక్కులు తీసీ సాంబ్రాణి వేసి ఆరబెట్టి జడలు వేసే సరికి - భోజనాల వేళయింది.

అందరూ కడిగిన ముత్యాల్లా కళకళలాడుతున్నారు.

పద్మ, అనూరాధ కల్యాణి భారతి వడ్డనలకు సిద్ధమయ్యారు.

భోజనాలు పూర్తి అయ్యి అవ్వక ముందే ఆరోజు మధ్యాహ్నం ఏం చేయాలో నిర్ణయం చేసుకొన్నారు. సాయంత్రం పాపకు భోగిపళ్ళు పోసే పేరంటం వుంది.

అనూరాధ, కల్యాణి ఉన్న పదిళ్ళ వారినీ పేరంటం పిలిచి వచ్చారు. ఆ తరువాత గట్ల మీద వున్న రేగుచెట్ల వెంట పడ్డారు. గంగిరేగు చెట్టున కాయలు ఎత్తు మీద ఉండడంతో వంకీ కర్రతో కోయడంలో శివుడు సాయం చేసాడు. పాలరేక్కాయులు, సీమరేక్కాయులు, నల్లరేక్కాయులు, గంగిరేక్కాయలు, చిలకరేక్కాయులు, కొండరేక్కాయులు అన్నీ కోసుకొచ్చారు.

రత్తయ్య చెరుకు గడను చిన్నచిన్న ముక్కలుగా కొట్టి ఇచ్చాడు. సుధాకర్ కి గట్లమ్మట తిరిగి ఇలాంటి పనులు చేయడమంటే మహా సరదా - ఆ పూట అనూరాధ ఎదురుగా వెళ్ళి మళ్ళీ ఇబ్బందిలో పడదలుచుకోలేదతను. చావిట్లో బండి జల్లలో గడ్డి వేసుకొని పడుకొన్నాడు. చావిడి దూలం చూస్తూ గడిపేసాడు.

సాయంత్రం అమ్మలక్కలు చక్కగా సింగారించుకొని వచ్చారు. తలంటిన తలలు నున్నగా దువ్వుకొని - దొడ్లో పూసిన పూలేవో తురుముకున్నారు. పండక్కి కొనుక్కున్న కొత్త బట్టలు సింగారించి చక్కా వచ్చారు.

శివుడు కూతురు ధాత్రికి మేనత్త పద్మ కొత్త పావడా కుట్టించింది. చిలక పచ్చ రంగు

పావడా మీద చంద్రకాంత రంగు దారంతో చిన్న చిన్న పూలు కుట్టింది. చంద్రకాంత రంగు జాకెట్టు. బొద్దుగా వున్న పాపకు బుట్ట చేతుల జాకెట్టు చక్కగా అమరింది. శాంతమ్మ చటుక్కున పాపబుగ్గన దిష్టిచుక్క పెట్టింది.

పాప బుగ్గలు సొట్టలు పడేలా నవ్వింది. పాపను పీటమీద కూర్చోబెట్టారు.

ముఖాన బొట్టు పెట్టారు హారతి పట్టారు. అక్షింతలు చల్లేరు అనూరాధ పళ్ళెంలో రేక్కాయలు, చెరుకు ముక్కలు, పటిక బెల్లం ముక్కలు, పంచదార చిలకలు పూలరెక్కలు, అన్నీ కలిపేసి తీసుకొచ్చింది.

ముత్తైదువులు పాప, తలమీద దోసిళ్ళలో భోగిపళ్ళు పోసారు పాప కిలకిలా నవ్వింది. భారతి పాప పక్కన కూర్చుంది.

పద్మ అందరికీ పసుపు కుంకుమలు ఇచ్చింది.

అనూరాధ అందరి కాళ్ళకూ పసుపు రాసింది.

కల్యాణి పాప పక్కన కూర్చుని - అందరికి భోగిపళ్ళు అందిస్తోంది.

ముత్తైదువులు తలా ఓ పాట పాడారు. ఒకళ్ళు పాడేపాట ఇంకోరికి వస్తే వాళ్ళూ గొంతు కలిపారు. చూస్తుండగానే అన్ని పాటలు బృందగానాలు అయిపోయాయి

శాంతమ్మ తాంబూలాలు ఇచ్చింది.

సావిత్రి పూర్ణాలు, కజ్జికాయలు, చిట్టిగారెలు, చక్కిలాలు విస్తట్లో పెట్టి వాయినాలుగా పంచింది.

గలగల లాడుతూ అమ్మలక్కలంతా వెళ్ళిపోయారు. బయట కూర్చుని లోకాభిరామాయణం చెప్పుకుంటున్న మగవాళ్ళకి ఆడవాళ్ళ పేరంటం హడావుడి అసూయ కలిగించింది.

"నాలుగు కొప్పులు కలిస్తే చాలు సంతోషంగా పేరంటం చేసుకొంటూ వుంటారు" రామనాథం కూడా అనుకోకుండా వుండలేక పోయాడు, "అబ్బ - ఎంత సహజంగా చక్కగా మలుచుకొన్న పేరంటం ఇది ".

అనూరాధ , కల్యాణి పాపతో సహ వచ్చి వారిని చేరారు. పేరంటం మిగిల్చిన ఉత్తేజం వాళ్ళ ముఖాల్లో స్పష్టంగా గోచరిస్తోంది. పాప పీట మీద కుదురుగా కూర్చుకుండా ఎర్రటి రేక్కాయలు అందుకోవాలని ప్రయత్నించడం - అందరూ బుజ్జగించి పీటమీద కూర్చోబెట్టడం-

పాప మళ్ళీ పరిగెత్తు కెళ్ళడం - మళ్ళీ పాపను లాక్కురావడం అన్నీ - కల్యాణి కళ్ళు తిప్పుతూ వల్లిస్తోంది.

"అవునూ - చిన్న బావ ఎక్కడ ? పొద్దున్నుంచీ కన్పించడేం ? " అనూరాధ హఠాత్తుగా అడిగింది.

శివుడు గుంభనంగా నవ్వుకుంటూ అక్కణ్ణించి లేచిళ్ళాడు. ఆ రాత్రి కూడా సుధాకర్

అభోజనంగా పడుకున్నాడు.

సంక్రాంతి నాడు తెల్లవారు ఝామునే ఇంటిల్లిపాదీ లేచారు పున్నమ్మ, శాంతమ్మ, సావిత్రి వాకిళ్ళు చిమ్మారు కళ్ళాపులు చల్లారు పద్మ, భారతి, అనూరాధ తలో ముగ్గు చిప్ప పట్టుకొని సిద్ధమయ్యారు

వారికన్నా చురుగ్గా శాంతమ్మ, సావిత్రి కదిలారు ఐదువేళ్ళ సందునా ముగ్గుపిండి జారుస్తూ - ఒకేసారి నాలుగు ముగ్గుగీతల్ని గీస్తున్నారు చక్కని చదరాలు గీసారు మూలలు కలిపారు. మధ్యలో నక్షత్రాన్ని గీసారు అన్నిటికన్నా మధ్యన వచ్చిన చదరంలో సూర్యుణ్ణి దాని పక్కని చదరంలో చంద్రుణ్ణి గీసారు.

అనూరాధ, కల్యాణి లబలబ లాడారు

"అత్తయ్య - నేను కొత్త కొత్త ముగ్గులు నేర్చుకొన్నా మీరేంటి వాకిలంతా గీసేస్తున్నారు - "

అనూరాధ చిన్న పిల్లలా కదం తొక్కుతూ ఓ రాగం తీసిది.

" మరీ నడమంత్రాలు - పండుగ పూట ఎయ్యాల్సింది ఈ ముగ్గే. రోజు వాకిట్లో ఏసుకొనే మెలికల ముగ్గులే ఈ పూట వేస్తారేంటి ? " శాంతమ్మ బరబర గీసేస్తునే గద్దించింది

" మెలికల ముగ్గులు కావు అత్తయ్య - పద్మాల ముగ్గు నేర్చుకొన్నాను"!!

"సరేలేవే - మీ ఇష్టం మేమెందుకు కాదనాలి ? " పిల్లలకు ముగ్గుల పని అప్పజెప్పి తోడికోడళ్ళు చక్కాపోయారు.

రత్తయ్య అనూరాధ పక్షం చేరి బాగా ఉబ్బేస్తున్నాడు.

" పద్మ నీవు వేసినవి మెలికల పాముల్లాగా వున్నాయి. నువ్వే బాగా వేస్తున్నావ్ - కానీయ్ అమ్మాయ్ - కానీయ్ - "

శివుడు పద్మ పక్షం చేరాడు.

"కానీవే పద్మా - అనూరాధ మళ్ళీ ముగ్గుచిప్పపట్టుకోకూడదు " అనూరాధ ఉక్రోషంతో సీతాకోకచిలుకల ముగ్గు మొదలెట్టింది.

సుధాకర్ ముగ్గులు చూస్తున్నట్లుగా చూస్తూ ముగ్గేస్తున్న అనూరాధని ఓర చూపులు చూస్తున్నాడు.

పట్టుదలగా బిగించిన పెదవులు, చురుగ్గా కదలుతోన్న వేళ్ళతో పాటు కదులుతోన్న కళ్ళు - ముగ్గు పూర్తి చేయగానే ఆ కళ్ళల్లో కదలాడే తృప్తి - పద్మ వైపు విజయ సూచకంగా విసిరే చూపు - అన్నీ సూటిగా సుధాకర్‌నే తాకుతున్నాయి.

రామనాథానికి గుండెలో - ఆశ్చర్యం ఆనందం మిళితమైన ఉద్విగ్న భావన నిండుకుంది.

"ఎంత కళ దాగుంటుంది. ఆడవారిలో -అద్భుతం ! "

అప్పుడే అనూరాధ చిలుకలు గీసేసి వాటి ముక్కులతో మామిడి పళ్ళను పట్టుకుంటున్నట్లు గీస్తోంది. ఆ మామిడి పళ్ళకు అటు ఇటూ రెండు ఆకులు.

రామనాథానికి పండిన పొలంలోని దోర కంకులను ముక్కున కరుచుకొని ఆకాశంలోకి ఎగిరివెళ్ళే రామచిలకల దండు మనసులో మెదిలింది.

'ఎంత గొప్ప చిత్రకారులీ ఆడవాళ్ళు ! ఆహా! ప్రకృతి నంతా ముంగిట్లో పరిచారు పద్మాలు, తామరలూ, మందారాలు, సీతాకోకచిలుకలు, రామచిలుకలు, పళ్ళు, పూల్లు ఆకులు పూర్ణకుంభాలు, చెరుకుగడలు - అవేనా ! ఇంకా సూర్యుడు, చంద్రుడు నక్షత్రాలు - అబ్బ .. ! ఎవరు నేర్పేరు వీళ్ళకి విద్యని ? వారి వేళ్ళల్లో ఇంత కళ ఎలా దాగి వుంటుందో ! వరుస తప్పని చుక్కలు - చుక్కల్ని అలవోకగా కలుపుతూపోయే గీతలు - చుక్కల్ని చుట్టి వేస్తూ అల్లుకొనే మెలికలు - అబ్బో - కళ్ళాపి చల్లిన వాకిట్లో ముత్యాల ముగ్గులు, ముంగిట పరుచుకొన్న ముగ్ధ సౌందర్యం - '

ఇంతలో భారతి పసుపు కుంకుమలు తీసుకొచ్చింది. గొబ్బెమ్మలు తయారు చేసారు.

అనూరాధ, పద్మ, భారతి వేసిన ముగ్గులలో కల్యాణి గొబ్బెమ్మలు పెట్టింది.

భారతి గొబ్బెమ్మల మీద పసుపు కుంకుమలతో అలంకరించింది. ఇంతలో పున్నమ్మ గుమ్మడి పూలు కోసుకొని వచ్చింది. అనూరాధ పరికిణి కుచ్చిళ్ళు చేతితో ఎత్తి పట్టుకొని, ముగ్గులు తొక్కకుండా మునివేళ్ళ మీద నడుస్తూ వెళ్ళి - తన ముగ్గుల మీద పెట్టిన గొబ్బెమ్మ తల మీద గుమ్మడి పూవు గుచ్చింది.

లేత భానుని కిరణాలతో తడిసి గుమ్మడి పూవు బంగారు కాంతితో మిలమిల లాడింది.

అనూరాధ నడుం మీద చేతులు పెట్టుకొని తృప్తిగా చూసుకుంది. పద్మకూడా ముగ్గులు పూర్తిచేసి గొబ్బెమ్మలు పెట్టేసింది

ఇంతలో కల్యాణి వచ్చి రామనాథం చేతులు పట్టుకొని ఒక ముగ్గు దగ్గర్నించి ఒక ముగ్గు దగ్గరికి లాక్కెళ్ళింది ఏ ముగ్గు బావుందో తేల్చి చెప్పమంది రామనాథం గొప్ప చిక్కులో పడిపోయాడు.

అన్ని ముగ్గులు చక్కగా కుదిరాయి. ఏది బావుందని చెప్పడం ఏది బాలేదని చెప్పడం ?

అందరూ రామనాథం వైపు కుతూహలంగా చూసారు. రామనాథం చివరికి దోరపళ్ళు ముక్కున కరిచి ఎగరడానికి సిద్ధంగా వున్నట్లు చిలుకలని చూపించాడు.

అనూరాధ సంతోషంగా చిన్న పిల్లలా ఎగిరి గంతులేసింది.

సుధాకర్ నిగూఢంగానే అంత సంతోషాన్ని పొందాడు.

"మీరెప్పుడూ దాని పక్షమే. పద్మ వేసిన రత్న కంబళి అంత బాగుంటే ! భారతి వేసిన పూర్ణ కుంభాలు చక్కగా కుదిరాయి అసలైన సంక్రాంతి ముగ్గువేసింది మేము ! " సావిత్రి, టకటక అంది.

రామనాథం అనూరాధ ముసిముసి నవ్వులు నవ్వారు -

సావిత్రి శివుడి కూతుర్ని చంకనేసుకొని వచ్చింది.

పాప సావిత్రి చంకలో కుదురుగా కూర్చోకుండా కిందరకు దూకి ముగ్గులకు అడ్డంగా పరుగులు పెట్టింది. ముగ్గులమీద చిన్నిచిన్ని పాదాల ముద్రలు పడ్డాయి. పాప తొక్క కుండా వదిలింది. చిలకల ముగ్గు ఒక్కటే

అందరూ వెంటబడి పాపని పట్టుకొన్నారు

పాప కిలకిలా నవ్వింది.

అందరూ ముద్దుగా పాప బుగ్గలు పుణికారు

అనూరాధ, రామనాథం ముసిముసి నవ్వులు నవ్వారు.

అనూరాధ, కల్యాణి బంతిపూలు కోస్తున్నారు. సుధాకర్ నెమ్మదిగా వారి దగ్గరికి వెళ్ళి పూలు కోయడంలో సహాయం చేస్తున్నాడు

అనూరాధకి సాధ్యసమైనంత దగ్గరలో వుండాలని సుధాకర్‌కి బలంగా అనిపిస్తోంది. ఆమె ఊపిరి పీల్చుకునే సవ్వడి వినగలిగేంత దగ్గరగా మంచు కాలంలో ఓ నులు వెచ్చని లేత సూర్యకిరణం లాగా అనూరాధ అతని మనసుని తాకుతోంది

"బావా .. ఏవి పడితే అవి కోయామాక ! చక్కగా విచ్చుకున్న ముద్దబంతులే కోయాలి. అరచేతిలో ఇమడాలి - చిన్న చిన్నవి కోయమాక - "అనూరాధ హెచ్చరించింది.

సుధాకర్ మంచులో తడిసి ముద్దయిన ముద్దబంతుల్ని నెమ్మదిగా కోసి గుప్పెట్లో పట్టుకున్నాడు.

"బావా- అలా పట్టుకుని వుండిపోయావేవిటి ! ఇలా వెయ్యి " అనూరాధ కొంగు చాపింది.

సుధాకర్ మౌనంగా అనూరాధ కొంగులోకి పూలు వేసాడు.

"బావా- అన్నీ పసుపురంగు బంతుల్నే కోయమాక - అవిగో ఆ పక్క నున్న నారింజ రంగు బంతుల్నీ కొయ్యి - "

"వదినా - ఆ బంతి పూలు అన్నాయి కోస్తాడు కానీ - మనం తల్లో పెట్టుకోను ఏం పూలు కోసుకుందామో చెప్పు - " కల్యాణి అనూరాధ చేతులు పట్టిలాగుతూ గారాలు పోయింది.

"ఏం బావా మరి ? "

సుధాకర్ ఏమీ మాట్లాడకుండా బంతి మొక్కల మడిలోకి వెళ్ళాడు

అనూరాధ కొంగులోని పూలు గట్టుమీద పెట్టిన చాటలో పోసింది వస్తూవస్తూ ఓ తుండుగుడ్డ తెచ్చింది సుధాకర్ దగ్గరకి వెళ్ళింది.

"బావా - ఇదుగో ఈ కండువా భుజాన వేసుకో పూలన్నీ దాంట్లో వెయ్యి " సుధాకర్ మౌనంగా తుండుగుడ్డ తీసుకొని భుజాన వేసుకున్నాడు

అనూరాధ కల్యాణి దగ్గరికి వెళ్ళబోయి - ఒక్క క్షణం ఆగింది వెనక్కి తిరిగి సుధాకర్ దగ్గరికి వెళ్ళింది

సుధాకర్ బంతిమొక్క మొదట్లోకి వేళ్ళాడబడిన ఓ పువ్వును కోసి తలపైకెత్తాడు చాలా రోజుల తరువాత అనూరాధ కళ్ళల్లో సూటిగా చూపుపడింది. సుధాకర్ తడబడిపోయాడు బలవంతంగా బంతిపూలవైపు దృష్టి మరల్చాడు

అనూరాధ కూడా ఏదో చెప్పబోయి తటపటాయిస్తూ అలాగే నిలబడిపోయింది. చివరికి గొంతు పెగల్చుకొని నెమ్మదిగా అడిగింది

"చిన్నబావా ఎందుకనీ నువ్వు నాతో మునుపటిలా వుండడం లేదు ?"

సుధాకర్ చివ్వున తలెత్తాడు. అతని వంట్లో రక్తంగా వేగంగా పరుగులు పెట్టింది. గుండె దడదడ లాడింది. ముఖం కందిపోయింది "అనూరాధ అన్నీ గ్రహించేసిందా ? అయితే తన కలవరానికి కారణం ఆమేనని చెప్పేయనా " సుధాకర్ గుండె మళ్ళీ దడదడ మంది

"చెప్పు బావా - చెప్పక పోయావంటే నా మీద ఒట్టే . "

అనూరాధ కంఠంలోనూ ఇంతకు మునుపు చిన్నతనం చిలిపి తనం లేవు. ఆడవారి కంఠంలో వుండే నిర్మలమైన నిగూఢత వుంది. ఆ కంఠం ముందు అబద్ధం చెప్పడం అసాధ్యం.

సుధాకర్ అప్రయత్నంగా అనేసాడు - "నీకు మాత్రం తెలీదూ ? నీ మూలంగానే ... "చివరి మాటలు పూర్తి చేయకుండానే మింగేసాడు. సుధాకర్ తన గొంతు తనకే పీలగా కీచుగా అనిపించింది. సిగ్గుగా తలవంచేసాడు.

ఆ మాటలు అన్నాక అనూరాధతో ఆ మాటలు ఎలా అనగలిగానా అని ఆశర్యపోయాడు. అనేసానన్న సత్యం బుర్రకి తట్టగానే అనూరాధ ఏమంటుందోనని ఆత్రంగా వంట్లోని అణువణువు అప్రమత్తం అయ్యింది.

అనూరాధ చప్పున తలవాల్చుకొంది. పెదవులు తడిచేసుకొంది. అంతలోనే తలెత్తి చుట్టూ చూసింది. కల్యాణి కనకాంబరాలు కోస్తోంది. అనూరాధ మౌనంగా కల్యాణి దగ్గరికి వెళ్ళింది.

సుధాకర్‌కి ఏం చేయలో పాలుపోలేదు. తనూ బంతిపూల మడి వైపు దృష్టి మళ్ళించాడు.

" ఆ కస్తూరి చేమంతులు, మరువం కూడా కోయండి కల్యాణి - " పద్మ గుమ్మంలో

దాకా వచ్చి కేక పెట్టింది

అనూరాధ చకచక పూలు కోసుకొని కొంగులో వేసుకొంది. సుధాకర్ ముందుకు రాకుండా నేరుగా లోపలికి వెళ్ళిపోయింది.

కల్యాణి వచ్చి సుధాకర్ కండువాలో వేసిన బంతిపూలని జాగ్రత్తగా కండువాలు అంచులు ముడేసి లోపలికి తీసుకెళ్ళింది

ఇంతలో మామిడాకులు తీసుకొని శివుడు రానే వచ్చాడు

సుధాకర్, శివుడు కలిసి మామిడాకు తోరణాలు కట్టారు.

అనూరాధ, పద్మ బంతి పూల దండలు గుచ్చుతున్నారు

ముక్కాలి పీటను ఎక్కి తోరణాలు కడుతున్న శివుడు సుధాకర్‌ని పూరమాయించాడు

"ఓరేయ్ - వెళ్ళి ఆ బంతిపూల దండ కూడా పట్టుకురారా పన్లో పని - అయి పోద్ది !"

సుధాకర్ గడప దగ్గర కాసేపు నిలబడి పోయాడు. అనూరాధ ముందుగా వెళ్ళి పూలదండలు అడగడం ఎలాగో తెలీని సందిగ్ధంలో పడి పోయాడు. అనూరాధ మౌనంగా దండల్ని చాటలో పెట్టి కల్యాణిని ఇచ్చి పంపింది

" వూ ... " ఇంతలో గట్టిగా శంఖునాదం వినిపించింది. ఎక్కడి వాళ్ళక్కడ చేతిలో పని వదిలేసి - వాకిట్లోకి పరుగు తీసారు.

వాకిట్లో వేసిన ముగ్గు ముందు జంగందేవర నిలబడి శంఖువు వూదుతున్నాడు.

మంచి ఓడ్డూ పొడుగు ముఖంలో చక్కటి తేజస్సు నుదుటిన దిద్దిన విభూతి రేకలు. వాటిమధ్యలో మూడోకంటిలా మెరుస్తోన్న ఎర్రటి కుంకుమ

కాషాయం రంగు పంచె పొడవు చొక్కా - భుజాల మీదుగా ముందుకు వేసుకున్న పొడవాటి ఎర్రని ఉత్తరీయం. తలకు చుట్టుకొన్న కాషాయం రంగు పాగా మెడలో రుద్రాక్షమాలల వరుసలు చెవులకు వేళ్ళాడుతోన్న రుద్రాక్ష కుండలాలు - ముంజేతికి జబ్బలకు వరుసలుగా చుట్టిన రుద్రాక్షమాలలు - ప్రచండ తేజంతో ముంగిట నిలిచిన పరమశివుడి లాగా వున్నాడు.

ఎడమ భుజాన వేసుకొన్న కావిడిబద్దకు అటూ ఇటూ వేళ్ళాడుతున్న ఎర్రటి జోలెలు. ఎడంచేత్తో కావిడి బద్దను కుడిచేత్తో శంఖాన్ని పుచ్చుకొని , శంఖాన్ని పూరిస్తోంటే గాలితో నిండిన బుగ్గలు ఎండలో మెరుస్తున్నాయి.

రామానాధానికి జంగం దేవర రాక చాలా ఆనందాన్ని కలిగించింది. జంగందేవర తమ యింటి వాకిట్లోకి వచ్చాడంటే ఇక ఈ తుమ్మల బీడు జనావాసం అయినట్టు లెక్క.

అందరూ బయటకు రావడం చూసి జంగం దేవర శంఖం పూరించడం ఆపి చేతిలో పట్టుకొని నిల్చున్నాడు.

"హర హర మహాదేవ శంభో శంకర " "బూ"

మళ్ళీ రెట్టించిన ఉత్సాహంతో శంఖం వూదాడు.

ఆ శబ్దానికి శివుడి కూతురు భయంతో తల్లిని గట్టిగా కరుచుకుపోయింది.

"శ్రీ శైల మల్లన్న భక్తితో కొలిచిన -

రామేశ్వర ఈశుణ్ణి దర్శించి వచ్చిన -

కాశీకి పోయి గంగ తీర్థం తెచ్చిన -

విశ్వనాధుని కొలిచి విభూతి తెచ్చిన - "బూ"

కోటిలింగాల క్షేత్రం అలంపురం చేరినా - "బూ"

" హర హర మహాదేవ శంభో శంకర - "

అందరూ అతని వైపు కుతూహలంగా కళ్ళప్పగించారు. పాప కూడా భయం తగ్గి తల్లి భుజం మీద నుంచి జంగందేవరను దొంగచూపులు చూస్తోంది.

" జంగమయ్యకు నూక పోకలివ్వండి

శంఖుతీర్థం ఆశీస్సులు పొందండి,

పంచెల చాపు పాత బట్టలివ్వండి

విభూతి పండు విరివిగా పొందండి - "బూ" "

సావిత్రి లోపలికి వెళ్ళి పాత పంచె - చొక్కా - చాటలో కొన్ని వడ్లు తీసుకొచ్చింది

అనూరాధ వాళ్ళు హరిదాసును ఎరుగుదురు. జంగందేవరను చూడడం ఇదే మొదలు.

అతను వేగంగా మాట్లాడుతుంటే నోళ్ళు అప్పగించి వింటున్నారు.

సావిత్రి చేటను అనూరాధకు అందించి జంగం దేవరకు ఇవ్వమంది.

జంగం దేవర కావిడి బద్దకు ఒకవైపు దాంట్లో ధాన్యం - మరో దాంట్లో పాత బట్టలు వేయించుకున్నాడు.

"జంగమయ్య సంతోషించాడు " "శివోహం"

" హరహర మహాదేవ శంభోశంకర సాంబశివ - "బూ" "

అనూరాధ శంఖం శబ్దానికి వెనక్కి గెంతింది.

అతను నవ్వి - అనూరాధను దగ్గరకు రమ్మని సైగ చేసాడు.

అనూరాధ అనుమానంగా అందరి వైపు మార్చి చూస్తూ బిడియంగా అతని దగ్గరికి వెళ్ళింది. జంగందేవర జోలెలోంచి ఓ చిన్న విభూతి పండు తీసి ఆమె చేతిలో వేసాడు.

" అయ్యగారి చేలు పచ్చంగ

అమ్మగారి చేయి చల్లంగ

ఇంట్లోని బిడ్డలు చల్లంగ దొడ్లోని గొడ్లు చల్లంగ."

" బూ" - జంగమయ్య అందరి ముఖాలకు విభూది బొట్లు పెట్టాడు. జంగందేవర సంతోషంగా జోలె సవరించుకుంటూ వెళ్ళి పోయాడు.

" హర హర మహాదేవ శంభోశంకర - " "బూ" -

మెల్లిమెల్లిగా శంఖనాదం దూరమయింది.

జంగందేవర మహిమలోంచి అందరూ బయట పడ్డారు.

ఎవరి పనులకు వాళ్ళు మళ్ళారు.

సావిత్రి గారెలు చేస్తోంది.

పున్నమ్మ, శాంతమ్మ పాలతాలికాలు దూసారు.

పరమాన్నం, పులిహోర, పెరుగ్గారెలు, గోంగూర పచ్చడి, గుత్తొంకాయ కూర, గుమ్మడికాయ దప్పళం, బెండకాయ వేపుడు, చిక్కుడు కాయ ఇగురు, ఉలవ చారు వండుతున్నారు. అన్నం వార్చారు. భారతి, పద్మ, వారికి సాయం చేస్తున్నారు.

అనూరాధ, కల్యాణి గుమ్మాలకు తోరణాలు కట్టడం పూర్తిచేసి, గడపలకు పసుపు రాసి, కుంకుమ బొట్లతో అలంకరిస్తున్నారు.

"బుడ్ బుక్ ! బుడు ; బుడు ; బుక్, బుడుబుక్ "

" బుడ్ బుక్కలవాడు వచ్చినట్టున్నాడు, పదండే చూద్దాం - "

గబగబ పద్మ, భారతి కొంగులకు చేతులు తుడుచుకుంటూ వాకిట్లోకి వచ్చారు. అనూరాధ పసుపు పూస్తోన్న చేతుల్తో అలాగే వచ్చేసింది. కల్యాణి అతని ఎదురుగా నిల్చుని కళ్ళప్పగించేసింది. బుడబుక్కల వాడికీ ఉదయం వచ్చిన జంగందేవరకీ ఎంతో తేడా వుంది.

బుడబుక్కలవాడు తెల్లని శుభ్రంగా వున్న సైను పంచ, తెల్లని చొక్కా వేసుకున్నాడు. నల్లని బారు చేతులకోటు - తలకు తెల్లని పాగా, పాగా చివర వదిలిన అంచులు కోటు మీద పడుతున్నాయి ఎడం భుజాన వేలాడేసుకున్న జోలె - కుడి చేతిలో బుడబుక్క

"బుడుబుక్ ; బుడు ; బుక్ , బుడబుక్"

"అంబ పలుకు - జగదంబా పలుకు
కంచిలోని - కామాక్షి పలుకు
కాశీలోని - అన్నపూర్ణ పలుకు
కంబ కంఠిఓ - కాళీ పలుకు
బుడుబుక్ ; బుడు ; బుడు ; బుక్ ; బుడుబుక్ "

అతను రామనాథం వైపు తిరిగి నడుం వంచి నమస్కారం పెట్టాడు. ఆడవాళ్ళ వైపు తిరిగి నమస్కారం పెట్టాడు.

"అయ్య మతిలో - ఆలోచనలు
అమ్మ తలుపులో - అనుమానాలు

అదిగదిగదిగో - అంబ కరుణతో

అన్నీ చెపుతా - ఆలకించండీ - "బుక్"

బుడబుక్కల వాడు మునివేళ్ళ మీద లేచి, నిలబడి అరచేతితో చెవిని గాల్లోకి విప్పార్చాడు.

ఏదో వినబడు తోన్నట్లుగా కళ్ళు చికిలించాడు. ముఖం విప్పార్చి తలను పైకి కిందికీ ఆడించాడు. ముఖం ముడుచుకొని గంభీరంగా తల వూపాడు. శ్రద్ధగా వింటున్నట్టు కళ్ళు మూసుకున్నాడు. సరేనన్నట్టు తలాడించి కళ్ళు తెరిచాడు. వింటున్న వైపుగా గాల్లోకి ఓ దండం పెట్టాడు. అందరూ అతని వైపు కుతూహలంగా చూసారు.

"అంబ పలుకు - జగదంబా పలుకు.

శ్రీ శైలం - భ్రమరాంబ పలుకు

అలంపురం - జోగులాంబ పలుకు" "బుడ్"

బుడ బుక్కల వాడు అటూ ఇటూ తిరుగుతూ - ఒక్కొక్కరి ముందు నిలబడుతూ - ఒక్కో వాక్యం రాగయుక్తంగా అంటున్నాడు.

"దొరగారి దోడ్లోన - పురి నిలిచి మురుస్తుంది "

రామనాథం, శివుడు, రత్తయ్య వైపు చూసి నవ్వారు.

"దొరసాని చావిట్లో - పాల వాన కురుస్తుంది "

భారతి సావిత్రి వైపు చూసి కళ్ళెగరేసింది.

"చిన్నవాడి చదువులు - గొప్పగ లాభం "

రామనాథం సుధాకర్‌ని తృప్తిగా చూసుకొన్నాడు. సుధాకర్ మౌనంగా తలాడించాడు.

"చిన్నదాని నుదుటిన - కల్యాణి తిలకం "

పద్మ అనూరాధ బుగ్గను కొంటెగా పొడిచింది.

అనూరాధ ముఖం మీద సిగ్గుతెర దోబూచులాడింది.

సుధాకర్ అనూరాధ వైపు ఓరచూపులు చూసాడు. అతని ముఖం ఎర్రబడింది.

"తప్పదు తల్లీ - దయదల్చాలీ " "బుడు "

బుడుబుక్కల వాడు అతను చెప్పినవన్నీ ఖచ్చితంగా అయ్యితీరుతాయన్నంత నమ్మకం కుదిరేలా నొక్కి చెప్పాడు.

ఒక్కొక్కరికి నేలకంటా వంగి వంగి సలాములు చెస్తూ రాగయుక్తంగా అన్నాడు.

"చెమటకు మాసిన - చిరిగిన చొక్కా

కప్పుకున్న పై - కండువా దొరదీ

దణ్ణానున్న - పాతబట్ట

తప్పదు నాకు - దయ దల్చాలి

బుడుబుక్, బుడు , బుక్ ; బుడుబుక్ ''

సావిత్రి నవ్వుకుంటూ లోపలికి వెళ్ళింది, ఓ పాత పంచచొక్కా మానికలో వడ్లు తెచ్చి అతని జోలెలో పోసింది. అతను చటుక్కున సావిత్రి కాళ్లకు నమస్కారం చేయబోయాడు. సావిత్రి వెనక్కి గెంతి ఆ ప్రమాదం నుంచి తప్పించుకొంది.

అతను అంతకన్నా వేగంగా కదిలి రామనాథం కాళ్ళకు నమస్కారం చేసాడు.

రామనాథం అతన్ని కోప్పడినంత పని చేసాడు.

"అంతా బాగానే వుంది కానీ ఓ అబ్బాయ్ ఆ దొర - దొరసాని అన్న మాటలు మాత్రం మాకు తగిలించ మాక - "

"ఊరి కంతా దొర మీరు - కాదు పొమ్మంటే కాకపోరు "

బుడ బుక్కలవాడు తన అలవాటయిన ధోరణిలో రాగయుక్తంగా అన్నాడు.

"దొరను కానూ సొరను కాను. నేనో రైతును అంతే నా పంట ఇంటికి వచ్చింది పండగ వచ్చింది. పండగ పూట నువ్వు నా ఇంటికి వచ్చావు. మా మంచి నువ్వు కోరుకుంటున్నావు. నీ మంచి మేము కోరుకుంటున్నాం. అంతే. తెలిసిందా ? మరోమారు దొరగిర అనవద్దు "

బుడబుక్కల వాడు బుద్దిగా తలాడించాడు.

సావిత్రి విస్తట్లో గారెలు, బూరెలు, పులిహోర, పరమాన్నం పెట్టి తెచ్చి బుడబుక్కల వాడికి ఇచ్చింది.

అతను ముగ్గు మధ్యలో ముంగాళ్ళ మీద ముడుచుకు కూర్చున్నాడు. విస్తట్లో పెట్టినవన్నీ చకచక తిన్నాడు. జోలెలోంచి చెంబు తీసాడు. మంచినీళ్ళడిగి తాగాడు. తృప్తిగా త్రేన్చి పైకి లేసాడు.

బుడబుక్కలవాడికి ఈ ఆతిధ్యం పూర్తిగా కొత్త. ఆ చుట్టూ పక్కల వుళ్ళల్లో అతనిలాంటి మర్యాద వూహించలేడు. అందుకే ఈ సంప్రదాయమంతా దొరలది తప్ప మరొకరికి సాధ్యం కాబోదని, అతను భావించాడు.

రామనాథం కోప్పడినా పట్టించుకోకుండా నేలకంటూ వంగి వంగి సలాములు చేస్తూ - అలాగే వెనక్కి వెనక్కి జరుగుతూ - దడి బయట దాకా వెళ్ళాడు.

అక్కడ లేచి నిలబడి చేతిలోని బుడబుక్కను కొద్దిసేపు మోగించాడు.

"బుడ్‌బుక్ ,బుడు ; బుడు ; బుడ్ ; బుడుబుక్"

ఆ తరువాత అతను వెళ్ళిన చోటల్లా రామనాథం ఇంట్లో అతనికి లభించిన ఆదరణను గోరింతలు కొండతలు చేసి - చెపుతూ పోయాడు.

"ఇవాళ ఏవరకీ పని తెమిలేట్టులేదు - " ఆడవాళ్ళు గొణుక్కుంటూ వంటింటి వైపు వెళ్ళారు.

మళ్ళీ అందరూ సగంలో విడిచి వచ్చిన పనులకు మళ్ళారు.

సుధాకర్ తడబడుతూ రత్తయ్యను నెమ్మదిగా కదిలించాడు.

"పెదనాన్నా ఆ బుడబుక్కల వాడు చెప్పినవన్నీ నిజాలవుతాయా "

"బుడబుక్కలాళ్ళు శక్త్యారాధకులు. ఆ ఆరాధన బలం వల్ల వారి జోస్యం నిజం అవుతుందని ఇక్కడి వాళ్ళు నమ్ముతారు" - రామనాథం కల్పించుకొని చెప్పాడు.

సుధాకర్ మౌనంగా వారి దూరంగా వాగొడ్డుకు వెళ్ళిపోయాడు.

అనూరాధ కూడా రామనాథం మాటలు వింది. ఆమె లోలోన సన్నని ప్రకంపనం మొదలయ్యి తనువంతా ఆక్రమించింది. కళ్లు వాల్చుకొంది. గోళ్ళ వంక చూసింది పసుపు తడారి పోతోంది. అనూరాధ క్షణంలో తేరుకొని - లోపలికి వెళ్ళింది.

పరధ్యానంగా వంటింటి గడపలకు, గుమ్మాల రెండు అడుగుల ఎత్తు వరకు పసుపు పూసేసింది. గుమ్మాలకు అటూ ఇటూ కుంకుమతో సూర్యుడు చంద్రుడు వేసింది. గడపలకు మూడు వైపులా వరుసగా కుంకుమతో బొట్టు చుక్కలు పెట్టింది. ఒక్కో గుమ్మం పూర్తి చేస్తుండగానే - పిండివంటలు పూర్తయిన సువాసన ఆవరణంతా ఆవరించింది పండుగ సంబరం సంతరించుకొంటోంది.

అనూరాధ గడపలకి పసుపు రాస్తూ వీధి గుమ్మం దాకా వచ్చింది. వీధి గడపకి పసుపు రాస్తూ వుంది.

సరిగ్గా అప్పుడే మల్లేశ్ వారి వాకిట్లోకి వచ్చాడు. వాకిట్లోని ముగ్గులన్నింటినీ ఆశ్చర్యంగా చూస్తూ, ఒక్కో ముగ్గు దగ్గర ఆగుతూ - ముగ్గును తొక్కకుండా జాగ్రత్తగా అడుగులేస్తూ - వస్తున్నాడు. ముగ్గుల మధ్యలో కుదురుగా కూర్చున్న గొబ్బెమ్మలు - వాటి సిగలోని గుమ్మడి పూలు - వాటి మీద పసుపు కుంకుమల సింగారింపులు చూస్తూ అతని కళ్ళు విప్పారాయి.

వీధి గుమ్మం చూసేసరికి అతని గుండె ఒక్క క్షణం లయ తప్పి - మళ్ళీ సర్దుకుంది.

గుమ్మానికి కట్టిన పచ్చని మామిడాకు తోరణాలు , వాటిమీద అందంగా వేలాడదీసిన ముద్దబంతుల దండ ముద్ద పసుపు రాసిన గడప - గడపమీదికంటూ వంగి - ఎర్రటి కుంకుమతో శ్రద్ధగా బొట్లు పెడుతోన్న అనూరాధ - !

మల్లేశ్కు విస్మయంతో పాటుఏదో వింతైన అనుభూతి కలిగింది.

నిమ్మపండు రంగు దుస్తులపై ఆకుపచ్చ వోణీ అనూరాధ ఛామన ఛాయ వంటికి చక్కగా నప్పింది

గడప పసుపు, బట్టల పసుపు అనూరాధ ముఖంలో ప్రతిఫలిస్తున్నాయి. తరుణంలో పొందికగా అమిరిన భుజాలు ఓ పక్కగా వంగి వున్నాయి. వంగిన భుజం మీదుగా వత్తైన నల్లటి జడ ఓ జలపాతంలా కిందికి దూకుతోంది.

జడలోని చేమంతులు మాల పక్కగా తొంగి చూస్తూ నవ్వుతోంది. పూలలోని ఒక్కో రేక

విడిపడి అనూరాధ జుట్టులో అక్కడోటి ఇక్కడోటి చిక్కుకొని అందంగా అమర్చిన బంగారు తీగల్లా మెరుస్తున్నాయి. జడకుప్పెలు నేలమీద జీరాడుతున్నాయి.

అనూరాధ చెవులకు వున్న పంజరాల లోలాకులు అనూరాధ ఉచ్ఛ్వాస నిశ్వాసాలకే తమాషాగా వూగుతున్నాయి. లోలాకుల బంగారు వన్నె అనూరాధ చెక్కిళ్ళ మీద లావణ్యం అద్దుతోంది.

కాటుక తీర్చిదిద్దిన ఆమె కనురెప్పలు అందంగా వాలి వున్నాయి. మల్లేశ్ వచ్చిన పని ఏమిటో మర్చిపోయాడు.

"ఆమె లేత ఎండలో ఆకుల మీదకు వంగిన ముద్దబంతిపూవులాగా వుంది" అని అనుకోకుండా వుండలేకపోయాడు.

అలా కళ్ళప్పగించి అమ్మాయిని చూడడం మర్యాద కానీ సభ్యత కానీ కాదని అరక్షణం క్రితం వరకూ ఖచ్చితంగా - నమ్మినా - ఇప్పుడా ఆ నమ్మ కాలేవీ అతని బుర్రలో లేవు. అతని మెదడంతా శూన్యమై పోయింది. ఆ శూన్యంలో ఒక్క దృశ్యమే నిండిపోయింది.

నోట్లోంచి మాట పెగల్లేదు. నాలుక తిమ్మిరెక్కినట్లుగా మొద్దుబారి పోయింది.

అనూరాధకు ఏదో అనుమానం వచ్చి గబుక్కున తలెత్తి చూసింది.

ఎదురుగా నిలుచుని గుడ్లప్పగించి తననే చూస్తోన్న మల్లేశ్‌ని గమనించి కంగారు పడింది.

తేటగా నిర్మలంగా వున్న అతని కళ్ళనీ, మొలక నవ్వు దోబూచులాడుతోన్న ముచ్చటైన ముఖాన్ని, చిక్కటి చక్కటి మీసకట్టును, మొక్కజొన్న పొత్తిలో అమిరినట్లుగా అందంగా అమిరిన పలువరుసను, కసరత్తుతో కండలు తిరిగిన పొందికైన ఛాతీని, ధీమాగా పైకి ఎత్తిన గడ్డాన్ని - వాటన్నిటినీ క్షణంలో వెయ్యోవంతులో అనూరాధ మనసులో ముద్ర వేసుకొని చటుక్కున చూపు వాల్చేసింది.

నిగూఢంగా ఆమెను తాకుతోన్న అతని చూపులు అనూరాధని కలవరంలో పడేసాయి. వాలిన కనురెప్పల మాటున అటూఇటూ చూసింది.

"ఎవరితను? వచ్చిన పనేంటో చెప్పకుండా అలా కళ్ళప్పగించాడు ? "

"ఎవరు కావాలండీ ? " అనూరాధ ఎందుకనో అతన్ని సూటిగా చూడలేకపోయింది.

ఆమె పెదవులు కంపించడమే కానీ ఆమె ఏం అనిందో అతనికి తెలియదు. కానీ చప్పున స్పృహలోకి వచ్చాడు.

ఓ మొద్దబ్బాయిలాగా నోరెళ్ళబెట్టి ఆమె వంక చూసినపుడు తనెలా వుండి వుంటాడో అతను వూహించుకొన్నాడు. సిగ్గుతో ముడుచుకు పోయాడు.

అతని ముఖం బిడియంతో కందిపోయింది. తన భావాల్ని ముఖం మీద కనిపించనీయకుండా గంభీరంగా వుండడానికి ఎంతో ప్రయత్నం చేసాడు. ఆ ప్రయత్నంలో

అతని ముఖం మరింత కందిపోయింది ఏదో మధురమైన వింతైన అనుభూతి అతని అణువణువూ ఆవరించింది. తమకంలో ముంచేసింది.

మనసుకు వదనం ప్రతిబింబం అంటారు. అతని ముఖాన కదలాడుతోన్న భావాలకు అర్థాలు వెతుక్కోలేక అనూరాధ అయోమయంలో పడింది. అర్థం వెతుక్కోవలసిన అవసరం ఏమిటో కూడా ఆమెకు తట్టలేదు.

ఒకరి ఉచ్ఛ్వాసనిశ్వాసాలు మరొకరు వినగలిగేంత దగ్గరలో వున్నామన్న స్పృహలోకి ఇద్దరూ ఒక్కసారే వచ్చారు చెరి రెండడుగులు గబుక్కున వెనక్కి వేసారు. ఇద్దరి పెదవుల మీదకి చిరునవ్వు తోసుకొచ్చింది. ఆ నవ్వు ఎదుటివారి ముఖంలో ఎలా వుంటుందో చూద్దామని ఎంత బలంగా అనిపించినా ఎవరికి వారు కళ్ళెత్తి చూసే ధైర్యం చేయలేకపోయారు.

ఆమె జడలోని కస్తూరి చేమంతులతో మరువం కలిసిన పరిమళం అతని తలపుల్ని మత్తెక్కించింది.

" మీరు .... తామర పూలు ..... ముగ్గులు ...... చిలుకలు ...... బావున్నాయి ... "

మల్లేశ్ చివరికి మాటలు పేర్చుకొంటూ ఏదో అన్నాడు.

అనూరాధ పెదవుల మీద సన్నని హాసరేఖ కదలాడింది.

"అబ్బ ! సౌందర్యమంతా ఆ సోగకళ్ళలోనే వుంది. ఈమె లావణ్యమంతా ఆ ముదురు తేనెరంగు కనుపాపల్లోనే వుంది " అనూరాధను ఓరగా చూసిన మల్లేశ్ లోలోన అనుకున్నాను.

"సుధాకర్ .... వున్నాడా ... అండీ..... "

ఎంత మెత్తగా అడిగినా అతనికి తన గొంతు తనకే బిగ్గరకే అరుస్తున్నట్లుగా అనిపించింది.

తన కంఠం కర్ణకఠోరంగా ఆ సున్నితమైన అమ్మాయి మృదువైన కర్ణభేరికి బద్దలు కొడుతుందేమోనన్న అనుమానంలో పడిపోయాడు.

అనూరాధ అతనికి సమాధానం చెపుదామని పెదవి విప్పబోయింది.

"ఎవర్నే - అనూరాధా - వాకిట్లో నించోపెట్టి మాట్లాడుతున్నావ్ ? " అంటూ రామనాథం వెనక గుమ్మంలోంచి వచ్చాడు.

అనూరాధ, మల్లేశ్ ఇద్దరూ ఒక్కసారిగా తత్తరపోయారు. తేలు కుట్టిన దొంగల్లా చటుక్కున చెరోవైపు వెనక్కు తిరిగారు.

"ఎవరమ్మాయ్ వచ్చిందీ ?" రామనాథం మళ్ళీ అడిగాడు.

"అదీ....... అదీ....... ఎవరా ? చిన్న బావ కోసం మామయ్యా ..... " అనూరాధ తడబడుతూ సమాధానం చెపుతూ గాల్లో పరిగెత్తినట్లుగా లోపలికి పరిగెత్తింది.

అనూరాధ కాలి పట్టీల సన్నని సవ్వడి మల్లేశ్ మనసులో రమ్యరాగాలు నింపేసి దూరమైంది.

రామనాథం అనూరాధ వెళ్ళినంత మేరా ఆశ్చర్యంగా చూసాడు.

"ఇంతకీ ఆ వచ్చిన పెద్ద మనిషి ఎవరా " అనుకొంటూ పందిట్లోకి వెళ్ళాడు.

ప్యాంట్ జేబులో చేతులు పెట్టుకొని - ఎప్పట్నించో పూలచెట్ల మధ్య వున్న వాడిలాగా బంతిపూలని దీక్షగా చూస్తూ నిల్చున్నాడు మల్లేశ్.

"ఎవరో అనుకొన్నా - నువ్వా అబ్బాయ్ . . రారా ... "రామనాథం అతన్ని సాదరంగా ఆహ్వానించాడు. "సుధాకర్ అటు వాగొడ్డు వైపు వెళ్ళినట్టున్నాడే - "

"నేనూ అక్కడికే వెళ్తానండి - " మల్లేశ్ సూటిగా రామనాథం ముఖంలోకి చూసే ప్రమాదంలో పడకుండా తప్పించుకుంటూ - దాదాపు పరిగెత్తుతున్నట్లుగా వాగు దగ్గరికి వెళ్ళాడు.

గాబు దగ్గర పసుపు అంటిన చేతుల్ని కడుక్కుంటున్న అనూరాధ అయోమయంలోంచి తేరుకొంటూ "ఇంతకీ ఎవరతను ? " అనుకుంటూ ఆశ్చర్యపోయింది.

చేలగట్లు మీద మెల్లిగా నడుచుకొంటూ వెళ్తున్న మల్లేశ్ కూడా ఊహల లోకంలోకి పరుగులు పెడుతోన్న మనసుకు పగ్గాలు వేసేందుకు ప్రయత్నిస్తూ - అదే ప్రశ్న వేసుకొన్నాడు - "ఇంతకీ ఆమె ఎవరు ? "

వారిద్దరికీ సమాధానం సుధాకర్ వద్దే దొరికింది.

అనూరాధ పట్ల కలిగిన కొత్త భావం రగిలించిన ఉద్రేకంలో తేలుతోన్న సుధాకర్ ఆ పూట ఆమె గురించి మల్లేశ్ దగ్గర ఎక్కువే చెప్పాడు మల్లేశ్ ఆ విశేషాలన్నిటిని వింటూ పారవశ్యంలోకి జారిపోయాడు.

మళ్ళీ మహబూబ్‌నగర్ వెళ్ళాల్సిన సమయం దగ్గర పడడంతో - తన పాలమూరి స్నేహం గురించి ఇంట్లో వారితో మరింత ఎక్కువగా చెప్పాడు.

అనూరాధ ఆ వివరాలన్నిటిని భద్రంగా మనసులో దాచుకుంది. ఆ సంక్రాంతి ముగ్గురి మనసులలో మెలికల ముగ్గులేసింది. ఊహలకు రమ్యమైన రంగులు అద్దింది.

తలపుల క్షేత్రంలో వలపు విత్తనాలు మొలకెత్తాయి.

❋ ❋ ❋

కనుమ పండుగ.

ఆ రోజు పశువులకు ప్రత్యేకం.

రత్తయ్య రామనాథం, శివుడు అన్ని పశువులను శుభ్రం చేసి వుంచారు.

సుధాకర్, శివుడు వాటిని గంటలతో మువ్వలతో తోలు పట్టీలతో పణకట్లతో కుచ్చులతో అలంకరించారు.

ఆ రోజు వాటి పండుగ అన్ని అవీ గ్రహించనట్లుగా వున్నాయి.

ఎద్దులు మోరలెత్తి చిన్న చిన్న రంకెలేస్తూ హడావుడి చేస్తున్నాయి.

గేదెలు ఆనందంగా నోట్లోని పరకను నెమరవేస్తూ, ఎద్దుల హడావుడి చూస్తున్నాయి

ఓ దూడ "అంబా " అంటూ తల్లిగేదె డొక్కలోకి దూరగానే గేదె తలవంచి నాలుకతో దాని వంటిని ఆప్యాయంగా నాకింది. బోడెద్దును ఓ పక్క రామనాథం మరోపక్క శివుడు పట్టుకొని వున్నారు.

కొమ్ముటెద్దును రత్తయ్య, సుధాకర్ పట్టుకొని వున్నారు.

ఆడవాళ్ళంతా పూజా సామ్రగితో వచ్చారు.

అనూరాధకు అన్ని పశువుల నుదుటిన కుంకుమ తీర్చిదిద్దిమని పురమాయించారు.

అప్పటి వరకూ ఉత్సాహంగా కబుర్లు చెప్తోన్న సుధాకర్ గంభీరంగా నిల్చున్నాడు. మాటలు రానట్టు మౌనం వహించాడు.

కళ్ళు వాల్చి అనూరాధ పరికిణి కుచ్చిళ్ళు చూస్తున్నాడు.

అప్పుడప్పుడు తడబాటుతో ఆమె వంక దొంగ చూపులు చూస్తున్నాడు.

ఆ రోజు లేతనీలం దుస్తులపై ఆకాశనీలం వోణితో అనూరాధ దిగివచ్చిన మబ్బు తునకలా వుంది. ఆమె కదిలినపుడు నల్లని వాలు జడ అందంగా కదులుతోంది.

సుధాకర్ తను ఏ ఇంద్ర జాలంలో చిక్కుకున్నాడో కానీ బయటకు రాలేకపోతున్నాడు. చుట్టూ పెద్దవాళ్ళు. అనూరాధను చూడకుండా వుండలేని అశక్తత - ఎన్నిమార్లు అనూరాధను చూడలేదు. మరి ఎందుకు ఇలా తన మనసు ఆమె సమక్షం కోసం ఆత్రపడుతోంది అదురుతోన్న గుండెతో ఎద్దు ముక్కు తాళ్ళు సవరించాడు. అనూరాధ కొమ్ముటెద్దు దగ్గరికి వచ్చింది.

"అబ్బా - అది అట్లా మోరపైకెత్తితే ఎట్లా బావా బొట్టుపెట్టడం ? " కాస్త దాన్ని మెడ వంచమను బావా -"అనూరాధ చిన్న పిల్లలా గారాలు పోయింది.

సుధాకర్ ఆమె ముఖంలోకి విస్మయంగా చూసాడు.

'అనూరాధా - అనూరాధా ... ఎంత మౌనంగా పలకరించుకోవాలని తన మనసు ఆరాటపడుతుందో అనూరాధ అంత అల్లరిగా కేకలేస్తోంది.' సుధాకర్ మాట్లాడకుండా ఎద్దు గంగడోలు నిమిరి- దాన్ని మెడ వంచే ప్రయత్నంలో పడ్డాడు.

"ఏంటే అమ్మాయ్ - ఆ విడ్డూరం ? కొమ్ముటెద్దు మెడలు వంచుతావా ? దాని రాజసం తీవి ఏం కాను ? వంచితే నీవే మెడలు వంచాలి - ఆ మూడు ముళ్ళు వేయించుకోను - " రత్తయ్య కొమ్ముటెద్దు మీది అభిమానంతో అనూరాధను ఎకసెక్కాలాడాడు -

"పో - మావయ్య - " అనూరాధ సిగ్గుగా అంది.

సుధాకర్ గుండె ఒక్క క్షణం ఆగి మళ్ళీ కొట్టుకుంది. అనూరాధ వైపు ఓరగా చూసాడు. అనూరాధ వూహలలో గుసగుసలాడుతోన్న వూసులు ముఖాన సిగ్గుతెరలాకమ్మి దోర

నవ్వులా మాయమయ్యాయి.

మనసులో మల్లెలు విరబూసిన మధురానుభూతి సుధాకర్‌ని చుట్టేసింది. ఆ అద్భుతమైన క్షణాల్ని అపురూపంగా మనసు పొరల్లో దాచుకొన్నాడు

పరీక్షలు పూర్తి చేసుకొని ... వేసవిలో ఆ అందమైన క్షణాల్ని అనూరాధతో సహా శాశ్వతం చేసుకోవాలన్న ఊహతో - ఊరెళ్ళి పోయాడు.

పండుగెళ్ళిన తరువాత అనూరాధ వాళ్ళు ఊరికి బయలుదేరారు.

సంక్రాంతి సంబరాలు నిశ్శబ్దమై పోయే సమయం వచ్చింది.

పున్నమ్మ, శాంతమ్మ, అనూరాధ, కల్యాణి ప్రతి ఒక్కరికి ఆ ప్రాంతాన్ని వదిలి వెళ్ళాలని ఏ కోశాన లేదు

"అందరూ వుంటే ఎంత సంతోషంగా వుందిరా శివుడు - రేపట్నించి ఎవరి గోలలో వాళ్ళం - 'రామనాథం శివుడి దగ్గర బాధ పడ్డాడు.

"ఆడపిల్లల చదువులున్నాయిగా బాబాయ్ - లేకపోతే ఇక్కడే వుంచేసే పని -

"ఏదో ఒకటి ఆలోచించి వాళ్ళనీ ఇక్కడికి తీసుకొచ్చేయ్యాలి రా - ఎంతైనా ఆడపిల్లలు ఇంట్లో కళకళలాడుతూ తిరుగుతుంటే ఆ అందమే వేరు - "

"ఏవుందీ సుధాకర్‌కి పెళ్ళి చేసేద్దాం - "శివుడు నిగూఢంగా నవ్వుతూ అన్నాడు.

" చదువు పూర్తవ్వద్దూ - "

ఇంతలో అనురాధ అక్కడకు వచ్చింది.

"ఏంటమ్మాయ్ -ఇలా వచ్చావు ? " రామనాథం వాళ్ళు తుమ్మచెట్టు కింద తూము మీద కూర్చుని వున్నారు.

"ఏం లేదు మావయ్య - పెద్ద బావని అమ్మమ్మ పిలుచుకురమ్మంటేనూ ," అనూరాధ శివుడివైపు తిరిగి అంది, "బావా - తొందరగా వెళ్ళు - అమ్మమ్మ ఒకటే గోల - "

శివుడు నవ్వుతూ లేచి అనూరాధ దగ్గరికి వెళ్ళాడు - అనూరాధ నెత్తిన చిన్న మొట్టికాయ వేసాడు.

"నాయనమ్మ సంగతేవో కానీ - నీగోల మాత్రం ఎక్కువే ... మొత్తానికి పున్నమ్మ మనవరాలివని పిస్తావ్ ....."

"చూడు మామయ్య ......' అంటూ ఓ రాగం తీస్తూ

అనూరాధ నవ్వింది. రామనాథం పక్కకు తప్పించుకుంది. రామనాథం వారిద్దరినీ మురిపెంగా చూసుకున్నాడు.

శివుడు వెళ్ళిపోయాక రామనాథం అనూరాధతో అన్నాడు.

"ఏంటో అనూరాధా - మూడ్రోజులు మురిపించి వెళ్ళిపోతున్నారు - "

"మాకు వెళ్ళాలని లేదు మామయ్య - "

అనూరాధ రామనాథం వంక సూటిగా చూడలేకపోయింది.

కొంగు చివర్లు ముడులు వేస్తూ తీస్తూ తూము మీద కూర్చుంది అనూరాధ రామనాథం దగ్గర ఒక విషయం చెప్పడానికి వచ్చింది. 'చెప్పవచ్చో లేదో - చెపితే ఎలా స్పందిస్తాడో అసలు తన మనసులో భావం సరిగ్గా గ్రహిస్తాడో లేదో ...'

" ఏమ్మా ఇంకా నీ చదువు విషయలేంటి ? "రామనాథం అడిగాడు.

రామనాథం కంఠంలో తొణికిన ఆత్మీయత ఆమె సంశయాల్ని మెల్లి మెల్లిగా దూరం చేస్తోంది. 'కానీ ఎలా ? ఎలా చెప్పడం ? ఏమని చెప్పడం ? చిన్న బావలో కొట్టొచ్చినట్లు కనిపిస్తోన్న మార్పును గ్రహించానని చెప్పానా ? ఏమని చెప్పను . ఎలా చెప్పను ? ఓహ్! ఈ సంక్రాంతి వరకూ ఎరుగని కొత్త అనుభవాలు - ముంచెత్తిన కొత్త అనుభూతులు అబ్బా ! ముఖ్యంగా చిన్నబావ .... ఎందుకంత ఆకస్మాత్తుగా మారిపోయాడు ? ముభావంగా ముఖంచాటేస్తూ ఎందుకు తిరుగుతున్నాడు ? ఒకవేళ -ఒకవేళ - తనూ అతన్ని భారతక్క పెద్దబావను చూసే దృష్టితోనే అత్తయ్యలు మామయ్యలను చూసే దృష్టితో చూడాలని ఆశిస్తున్నాడా ? అది తనవల్ల ఎలా అవుతుంది ?

చిన్నప్పటినుంచీ - పుట్టి బుద్దెరిగినప్పట్నించీ పిల్లలందరం ఒక్కచోట ఆడుతూ పాడుతూ పెరిగి - స్నేహం పంచుకొని - ఇప్పుడు హఠాత్తుగా మరో కొత్త రూపంలో తనెలా ప్రత్యక్షమవ్వగలుగుతుంది ?

అందరూ చిన్నపట్నించే తమ మేనరికం గురించి ప్రస్తావించడం తనకు మాత్రం తెలీదూ ?

భారతక్క పెద్దబావని ఎంత సహజంగా భర్తగా చూడగలుగుతుందో తన ఊహల్లోకి చిన్న బావ ఓ మిత్రుడిలాగా తప్ప మరోలా ప్రవేశించడం లేదు. ఎందుకో ? ఏమో ? అలాంటి భావం కలక్కపోవడంతో తన తప్పేం వుంది ? సుధాకర్‌ను బాధపెడుతున్నట్లా ? దీన్ని తిరస్కారంగా తీసుకొంటాడా ? పెద్దవాళ్ళంతా అసలు తన మాటను సహిస్తారా ? చిన్న బావంటే ఇష్టమే. ప్రేమ కూడా. అది కుటుంబంలోని ప్రతి వ్యక్తీ మీదా వ్యక్తమయ్యేటువంటి ఆత్మీయతతో నిండి ప్రేమ. కల్యాణిని ప్రేమించినట్లే, మామయ్యలను వదినలని ప్రేమించినట్లే పెద్దబావని ప్రేమించినట్లే ఇతన్నీ ప్రేమిస్తుంది. అంతే ! కుటుంబంలోని ఒకరిపై ఒకరికి పెనవేసుకుపోయిన గాఢానురక్తి - ఆ ప్రేమ ! ఆ ప్రేమను కాలదన్ని మరో రూపంలో సుధాకర్‌ను ప్రేమించడం తన వల్లకాదు - తన వల్లకాదు !'

రామనాథం ఏం మాట్లాడకుండా కొంగు ముడివేస్తూ గంభీరంగా కూర్చున్న అనూరాధను ఆశ్చర్యంగా చూసాడు. ఆమె ముఖ కవళికలు ఏదో అంతర్మ ధనాన్ని సూచిస్తున్నాయి. నవ్వుతూ తుళ్ళుతూ ఎగిరే పక్షిలాంటి అనూరాధని ఇంత మౌనంగా చూడడం ఇదే మొదటిసారి. రామనాథం తమని వదిలి ఊరు వెళ్తున్నందుకు విచారపడుతుందని అనుకొన్నాడు.

అనూరాధ ఏదో చెప్పబోయి చెప్పలేక తటపటాయించడం రామనాధం గమనించాడు.

మెల్లిగా అనూరాధ అరచేతిని తన చేతిలోకి తీసుకొన్నాడు.

అనూరాధ అరచెయ్యి చల్లబడిపోయి వుంది. పొడవాటి వేళ్ళు సన్నగా కంపిస్తున్నాయి.

రామనాధం ఆమె చేతిని నెమ్మదిగా తట్టాడు. రామనాధం

తడి గొంతుతో మెత్తగా అడిగాడు, "ఏమ్మా - ఎవరైనా ఏమైనా అన్నారా ? "

అనూరాధ రామనాధం అప్యాయతకి కరిగిపోయింది. 'తను చెప్పాలనుకొంటున్నది మామయ్య కొడుకు గురించి. మామయ్యకు అతనంటే ప్రాణమని తనకు మాత్రం తెలీదు - తను బద్దలయ్యే క్షణం వస్తోంది - ' అనూరాధ సోగకళ్ళల్లో సన్నటి నీటిపొర కదలాడింది.

"మామయ్యా - "అనూరాధ గొంతు ఆమెకే విచిత్రంగా తోచింది.

"చెప్పమ్మా - నా దగ్గర నీకు సందేహం దేనికి ? " రామనాధం ఆమెకు ధైర్యమిస్తున్నట్లు చేతిని నిమిరాడు.

"అదీ........ అదీ......."

రామనాధం చెప్పమన్నట్లు తలాడించాడు.

అనూరాధ అతని ముఖంలోకి నేరుగా చూడకుండా తన అరచేయి పట్టుకున్న అతని చేతుల్ని చూస్తూ - మంద్రంగా అంది.

"మామయ్యా - నాకు కల్యాణి, పెదబావ, మీరు అమ్మమ్మ అత్తయ్యలు - అందరంటే ఎంతో ఇష్టం మామయ్య - పెదబావంటే ఎంతో చిన్న బావ కూడా అంతే మామయ్య - అంతేకానీ, నేను ..... నేను చిన్నబావని మరోలా వూహించలేను మామయ్యా ...."

అనూరాధ కంఠం బొంగురు పోయింది. రామనాధం స్తంభించి పోయాడు. ఉరుము లేని పిడుగులా పడ్డ ఆ మాటలకి ఎలా స్పందించాలో తెలియని నిశ్శబ్దంలో పడిపోయాడు. తను చెప్పింది రామనాధం ఎట్లా స్వీకరిస్తాడేనోని భయంతో అనూరాధ కంపించి పోయింది. గబుక్కున తలవాల్చేసింది.

రామనాధం అనూరాధ చెప్పిన క్షణంలోనే ఆమె భావం గ్రహించాడు - " మరోలా వూహించలేను అంటే సుధాకర్‌ని భర్తగా వూహించలేననే కదా !

రామనాధం అనూరాధ నుంచి ఇలాంటి సమస్య ఎదుర్కోవాల్సి వస్తుందని కలలోనైనా ఏనాడూ ఊహించలేదు. 'పసిపిల్లలప్పటి నుంచీ అనుకున్న మేనరికం. మరి అనూరాధ మనసులో ఈ ఇంటికి కోడలవ్వాలన్న భావం ఎందుకు పడలేదు ? ఎందుకంటే అది .... మనసు కాబట్టి ! నియమ నిబద్ధతలతో నడిచే ప్రకృతి కూడా మనసుకు నిబంధనలు విధించలేదు కాబట్టి ! మనసును నిర్బంధించలేదు కాబట్టి ! మనసుకు తోచినట్లు మనిషి వుండగలడే కానీ మనిషికి తోచినట్లు మనసు వుండలేదు కాబట్టి ! '

రామనాథం ఎంతకీ మాట్లాడక పోవడంతో తను తప్పు చేసిందే మోనన్న అనుమానంతో అనూరాధ తల్లడిల్లి పోయింది. తను చెప్పకుండా వుండాల్సిమోనన్న భావంతో నీరుకారిపోయింది మెల్లిగా వణుకుతోన్న గొంతుతో అంది, "మిమ్మల్ని ఎదిరించి నేను మాట్లాడాలని కాదు మామయ్య ....."

రామనాథం తెప్పరిల్లాడు ... చలనం లేకుండా బిగుసుకుపోయిన తన అరచేతిమీద చిగురుటాకులా వణుకుతోన్న అనూరాధ చల్లని చేయిని చూసాడు. అనునయిస్తున్నట్లు ఆమె భుజం మీద తట్టాడు. గంభీరంగా తలాడించాడు.

"వాణ్ణి నువ్వు మరోలా ఊహించే ఇబ్బందిలో నిన్ను ఎప్పటికీ పడనివ్వనమ్మా - పెద్ద బావ ఎంతో నీకు చిన్న బావ అంతేనమ్మా - అంతే ! " రామనాథం కంఠం గద్గదమైపోయింది.

అనూరాధ అనుమానంగా రామనాథం ముఖంలోకి చూసింది. రామనాథం తన మనసులో చెలరేగుతున్న తుఫానును ముఖాన కనిపించనివ్వకుండా ఓ నవ్వు కింద దాచుకున్నాడు.

"నువ్వన్నదీ ముమ్మాటికీ నిజమమ్మా ... చిన్నప్పటించీ ఒకే కుటుంబంలో ఒకే కుదురులో పెరిగి మరోలాగా చూడాల్సిరావడాన్ని ఏ మనసు తట్టుకోలేదమ్మ ... తట్టుకోలేదు -"

రామనాథం మనసులోని సంక్షోభాన్ని అనూరాధ గ్రహించలేకపోలేదు కానీ ఆమె మనసు తేలిక పడింది.

రామనాథం అంటే ఇంట్లో అందరికీ అంతులేని విశ్వాసం. అతని మాట తిరుగులేని బాణం. రామనాథం తెలివి మీద నిర్ణయం మీద నిర్ధారణ మీద ఖచ్చితమైన నమ్మకం.

తను తప్పేమీ చేయలేదని అనూరాధ సమాధాన పడింది. నిమ్మళించిన మనసుతో అలాగే కూర్చుండి పోయింది.

రామనాథం తనను తాను కూడదీసుకొంటు, మౌనంగా వుండి పోయాడు. రామనాథం మస్తిష్కంలో ఓ దృశ్యం కదలాడింది. అలా ఎందుకు జరిగిందో అతనికే తెలియదు. సంక్రాంతి రోజున మల్లేశ్ వీధి గడపలో నిలబడిపోవడం - అనూరాధ తడబడుతూ ఇంట్లోకి పరుగుతీయడం - పూల మొక్కల మధ్యన నిల్చుని వున్న మల్లేశ్ వాగొడ్డుకు మీదికి గబగబ వెళ్ళడం.

అనూరాధ - సుధాకర్ - మల్లేశ్ - రామనాథానికి ఒక అంతః సూత్రం చిక్కింది.

అనూరాధ మల్లేశ్ గురించి ఏమను కొంటుంది ? ఆమె అతన్ని ఎలా ఊహించుకోగలుగుతుంది ? అతన్ని ........ ఇష్టపడగలదా ?

రామనాథం ఆలోచనలు తెగిపోయాయి. సుధాకర్ ... సుధాకర్ ... ? రామనాథం తన కొడుకు స్థానంలో మరో వ్యక్తిని పెట్టి చూడాల్సిన క్షణం తన జీవితంలో వస్తుందని ఎన్నడూ ఊహించలేదు. అతని మనసు వ్యతిరేకిస్తున్నా మల్లేశ్‌ని అనూరాధ పక్కన వూహించుకున్నాడు. మంచి ఈడు జోడు.

రామనాథం నెమ్మదిగా కూడదీసుకున్నాడు. 'అనూరాధను తామందరు కన్న బిడ్డలాగానే చూసుకొన్నారు. అనూరాధ సుధాకర్ తనకు ఇద్దరూ సమానమే - ఒకరి కోసం ఒకరిని ముక్కలు చేయడం ఎలా ? అనూరాధ నిక్కచ్చిగా తన అభిప్రాయం చెప్పేసింది. అది సత్యం. ఇక ప్రేమగా పెంచుకున్న గారాబు పట్టి ఇష్టాన్ని తీర్చేందుకు ప్రయత్నించే ఓ బాధ్యతాయుతమైన తండ్రిలా ప్రవర్తించాలి.'

"సరే అనూరాధా- ఇంక ఆ విషయాన్ని నాకు వదిలేయి. చక్కగా చదువుకో మరో ఆలోచన పెట్టుకోకు - "

అనూరాధ బుద్ధిగా తలాడించింది.

కాసేపు ఆ మాటలు ఈ మాటలు చెప్పి ఆమెను మామూలులోకంలోకి తీసుకొచ్చాడు రామనాథం.

"అవును కానీ అనూరాధా - సంక్రాంతి రోజున వచ్చాడే సుధాకర్ స్నేహితుడు అతనెలా వున్నాడమ్మా-"

అనూరాధ పరిస్థితి గుమ్మడికాయల దొంగ ఎవరంటే భుజాలు తడుముకున్నట్లు అయ్యింది.

మల్లేశ్ కళ్ళప్పగించి తన వంక చూడడం - అతని కలవరపాటును - రామనాథం దగ్గరకు రాగానే ఒకపరుగున బయటకు వెళ్ళడం - అనూరాధ కళ్ళముందు అతని అందమైన ఆకృతి కదలాడింది.

సంక్రాంతి నాటి నుంచి ఆమెకు తెలియకుండానే ఆమెలో చెలరేగుతున్న తియ్యటి సంచలనం ఆమె ప్రమేయం లేకుండానే ఆమె ముఖంలోకి దూసుకు వచ్చింది. చెక్కిళ్ళు ఎర్రబడ్డాయి. పెదవులు కంపించాయి. కళ్ళు వాలిపోయాయి. ముఖాన్ని సిగ్గుతెర కమ్మేసింది. తన మనసులోని భావాలు రామనాథం పసిగడతాడేమోన్న బిడియంతో తలని వంచేసింది.

రామనాథం ఊహించిన జవాబుకు ఆమె దోరసిగ్గు, వాలుచూపు, మొలక నవ్వు అందించేసాయి. రామనాథం సన్నగా నవ్వాడు.

"మనిషి ఫర్వాలేదు - ఓ రకంగా వుంటాడు కానీ, ఒట్టిమోటు వ్యవహారం ! " రామనాథం కావాలని అనూరాధను ఆటలు పట్టించాలనే వుద్దేశ్యంలో అన్నాడు. నవ్వుతో మిళితమైన ఆ మాటలు విని అనూరాధ కోపం తెచ్చుకుంది. ఉక్రోషంతో చటుక్కున పైకి లేచింది. మూతిముడిచి, ముక్కు విరిచి, తలవిదిల్చి, కొంగు దులిపి, చరచరా వెళ్ళింది.

అనూరాధ మల్లేశ్ పట్ల తన ఇష్టాన్ని నూటికి నూరు పాళ్ళు ప్రకటించేసింది.

రామనాథం హాయిగా నవ్వాడు.

రామనాథం అనూరాధకు మాట ఇచ్చేసాడు కానీ - దాన్ని అమలు చేయడం అన్న వాస్తవాన్ని జీర్ణించుకోలేకపోయాడు.

"అనూరాధను కన్న బిడ్డలా పెంచుకున్నాం. సరే... ఆమె ఇష్టాన్ని పూర్తి చేయాలి కానీ, సుధాకర్ - తన కన్న బిడ్డ. తన ప్రాణంలో ప్రాణం- తన శరీరంలో శరీరం - వాడికి అన్యాయం చేయడం లేదూ ? వాడి ఆశల్ని కాలరాచేయడంలేదూ ? అలా చేసే హక్కు తనకెక్కడిది ? కానీ - ఒకరు నష్టపోకుండా మరొకరు లాభపడేదెలా ? ఒకరు కోల్పోకుండా మరొకరు పొందేదెలా ! ఎవరికీ అన్యాయం జరగకుండా న్యాయం లభించదా ?"

రామనాథం నిస్సహాయంగా నిట్టూర్చాడు.

"సుధాకర్‌ది చాలా సున్నితమైన మనసు. వడగాలికి రెపరెపలాడే చిగురుటాకులా వణికి పోతాడేమో - వాడిపోతాడేమో - అయ్యే చేజేతులా కొడుకు సంతోషం తుడిచేసే దౌర్భాగ్యం తనకే ఎందుకు రావాలి ? ఈ గడ్డు సమస్య పగవాడిక్కూడా రాకూడదు ! తెలిసి తెలిసీ వాడి ముఖాన నవ్వును దోచేయడం - వాడి ఊహల ఊయలల తాళ్ళు పుటిక్కిన తెంచేయడం - వాడు అల్లుకున్న అందమైన ప్రపంచాన్ని చీకట్లో ముంచేయడం - వద్దు - ఏ తండ్రికీ ఈ గుండె కోత వద్దు - "

రామనాథం సుధాకర్ కోసం నిశ్శబ్దంగా రోదించాడు. రోజులు గడిచాయి. వారాలు నడిచాయి. మూడు నెలలు కాలంలో కలిసిపోయాయి.

రామనాథం నెమ్మదిగా హృదయాన్ని అదుపులోకి తెచ్చుకొన్నాడు. అనుభూతి ఆక్రమణను ఆలోచన తిప్పి కొట్టింది.

అది సరిగ్గా ఆ ఏడాది పంటల్ని బేరీజు వేసుకొనే సమయం.

ఇన్నేళ్ళ వ్యవసాయంలో ఈ ఏడాది ఇంటిముందు పురి కట్టగలిగాడు.

ఇంటిల్లిపాదీ స్థిరపడిన భావనలోకి వచ్చారు. ఆర్థికంగా పునాదులు ఏర్పరచుకోగలమన్న ధైర్యం చిక్కగానే సంతోషంగా కష్టపడుతున్నారు.

ఇంత మార్పుకీ కారణం - రామనాథానికి స్పష్టంగా తెలుసు. అది రామనాథం తుంగభద్ర ఎగువ నుండి తెచ్చిన సంకర జాతి విత్తనాలు. "అవును, సంకర జాతి విత్తనాలు విత్తాడు. పంట విరగ పండింది.చీడపీడలు తగ్గాయి. శ్రమకు తగ్గ ఫలితం లభించింది. పల్లె పచ్చగా నవ్వింది. ఇది శాస్త్రం చేసిన చమత్కారం. ఇన్నేళ్ళ సాంప్రదాయ సేద్యం - దేశవాళి విత్తనాలు చేయలేని పని సంకరజాతి విత్తనాలు చేసి చూసాయి.

దీని అంతః సూత్రం కుటుంబానికి వర్తించుకోవాలి.

ఎన్ని తరాలుగా తమవి కుటుంబ అంతర్గత వివాహాలు ! తనదీ తల్లిదండ్రులదీ మేనరికం. శివుడూ భారతి మేనరికం ! తరతరాలుగా అంతర్గత వివాహలే తమ కుటుంబ సంప్రదాయం.

సంప్రదాయానికి వ్యతిరేకంగా తనెందుకు ఆలోచించకూడదూ. ఈ విత్తనాలు వాడకంలోని అనుభవాన్ని కుటుంబానికి ఎందుకు ఆపాదించుకోకూడదు ?

సంప్రదాయం మేనరికం అనివార్యం అంటోంది.

శాస్త్రం మేనరికం అనర్థం అంటోంది.

సంప్రదాయమా ? శాస్త్రమా ? ముత్తాతల తాతల నుండి తన తండ్రి, అన్న వరకూ చేసిన పనినే తనూ చేయడంలో విశేషం ఏముంది ? తన విచక్షణ ఏముంది ? తనలో ఎదుగుదల ఏముంది ? తన హేతుతత్వం తనను అన్నింటికి ప్రశ్నించుకోమంది.

ప్రతి ప్రశ్నకు సమాధానం వుంటుంది. నీ ఆలోచనతో నీవే వెతుక్కోమంది. మంచి చెడు విచక్షణ నీకే వున్నాయి - మంచేదో నీవే నిర్ణయించుకోమంది

మేనరికం తప్పని వైద్య శాస్త్రం ఘోషిస్తోంది.

అది వైద్య శాస్త్రం నిర్ధారించిన ఓ విషయం మాత్రమే కాదు. మానవ భావ వికాస చరిత్రలో వేల సంవత్సరాల అనుభవంలోంచి నిర్ధారించబడిన ఓ నిజం.

శాస్త్రం ప్రతిపాదించిన సత్యాన్ని కాలదన్ని మళ్ళీ ఆ తరతరాల సంప్రదాయాన్నే పాటిస్తే - అది తన మూర్ఖత్వం కాక మరేమిటి ?

అవును, తను తన కొడుకును అన్యాయం చేయడం లేదు.

వాడు తొలి యవ్వనాకర్షణలో వుండడం వల్లనేమి - చిన్నప్పటి నుంచి వాడి మనసులో అనూరాధ వాడి కాబోయే భార్య అని ముద్రించుకు పోవడం వల్లనేమి - చాలా సహజంగా ఆమె భార్య కావాలని ఆశిస్తున్నాడు. వాడికి ఆలోచన వుంది. అనుభూతి పొరలు విప్పిచూడగల విచక్షణ వుంది. ఈ రోజు కాకపోతే మరోనాడు తన తండ్రిని అర్థం చేసుకోకపోడు. కానీవాడు అర్థం చేసుకొనే వరకూ అనూరాధ ఇష్టాయిష్టాన్ని ప్రకటించుకోకుండా వుండమనలేం కదా ? ”

రామనాథం ఒక ఖచ్చితమైన నిర్ణయానికి వచ్చాడు. ఆ నిర్ణయం ఆ కుటుంబాన్ని కుదిపివేయబోయే రెండో నిర్ణయం. ఒక ప్రాంతం నుండి మరో ప్రాంతానికి మారడమే కనుక మొదటి నిర్ణయం కాస్త కాస్త నెమ్మదిగా నైనా అందరి ఆమోదం పొందింది.

రెండో నిర్ణయం కుటుంబంలో పెనవేసుకుపోయిన ఆప్యాయత భావనలకు అనూరాగ అనుబంధాలకు సంబంధించింది. అనూభూతించే మనసులకు సంబంధించింది. స్పందించగల హృదయాలకు సంబంధించింది.

అలాగే అనూరాధ వ్యవహారంలోను రెండుసార్లు నిర్ణయం తీసుకొన్నాడు. మొదటిసారి ఆమె ప్రమేయం లేకుండా ఆమె పొలం అమ్మేసాడు. ఇప్పుడు ఆమె వివాహ నిర్ణయం చేసాడు. మొదటి దాంట్లో కుటుంబ అభ్యంతరం పెద్దగా లేదు. ఇప్పుడు కుటుంబంతో పోరాడాలి. తల్లితో, అన్నతో భార్యతో - రక్తం పంచుకు పుట్టిన కొడుకుతో. కానీ రామనాథం ఓ పట్టు పట్టాక సాధించకుండా వదిలే రకం కాదు.

లేడికి లేచిందే పరుగన్నట్లు రామనాధం శివుడు దగ్గరికి వెళ్ళి అతన్ని వెంట పెట్టుకొని బాలయ్య వాళ్ళింటివైపు వెళ్ళాడు.

"ఇదేంటి - ఇట్లా వేళాపాళ లేకుండా ఉన్న పళాన అక్కడికి బయలుదేరావ్ ? "శివుడు కాలువకల్వర్టు దగ్గరకు వచ్చినపుడు అడిగాడు.

"శివుడూ - ఇలా కూర్చుందామా కాసేపు ... " రామనాధం అప్పటికే కల్వర్టు గట్టు మీద కూర్చున్నాడు.

శివుడికి రామనాధం ప్రవర్తన ఆశ్చర్యకరంగా వుంది చేతిలో పని ఆపించి ఉరుకులు పరుగుల మీద బాలయ్య గారి వూరికి బయల్దేరదీసాడు. ఇక్కడికి రాగానే నింపాదిగా గట్టుమీద చతికిల పడడం - శివుడు మనసులోని ఆశ్చర్యాన్ని దాచుకోలేదు.

" ఏంటి బాబాయ్ - అలా వున్నావ్ ? "

"బాలయ్య గారి అబ్బాయి ఎలా వుంటాడ్రా ? "

"ఎవరు మల్లేశా? ఆణిముత్యం కదూ బాబాయ్ "శివుడు వచ్చి రామనాధం ఎదురుగా నిల్చున్నాడు.

"ఎందుకోకానీ బాబాయ్ - అతన్ని చూడగానే మనసుకి చాలా సంతోషంగా వుంటుంది. వాన వెలిసాక హఠాత్తుగా ఆకాశంలో విరిసిన ఇంద్రధనస్సును చూస్తే ఎలా సంతోషంగా అనిపిస్తోందో అలాగే అతన్ని చూస్తేనూ - ఆ మాట తీరూ - మర్యాద మన్నన ! అసలు మన సుధాకర్ అయితే అతని గురించి చెప్పకుండా అరక్షణం వుండలేడనుకో మంచి కుర్రాడు !' 'శివుడు కితాబు ఇచ్చేసాడు.

"అయితే ఇంకేం మన ఎరికలో ఓ సంబంధం చూడరాదూ ? "

"నిక్షేపంలా చూడొచ్చు. అతన్ని పెళ్ళి చేసుకొనే అమ్మాయి ఏ జన్మలోనో బంగారు పూలతో నోము నోచి వుండాలి ! ఎవ్వరైనా కళ్ళకద్దుకొని కాళ్ళు కడిగి కన్యాదానం చేస్తారు. బాలయ్యగారు ఆయన భార్యా - వారు మాత్రం - మనిషంటే ఎంత ప్రాణం ఇస్తారు ! ఒక్క కొడుకు. పంచప్రాణాలు పెట్టి పెంచుకొన్నారు. కోడలిని మాత్రం పువ్వుల్లో పెట్టి చూసుకోరూ ? " శివుడు ఎంతో విశ్వాసంగా వారిపై తన అభిమానాన్ని చాటాడు. రామనాధం ఒక్క క్షణం వృధా పోనివ్వదలచుకోలేదు.

"మరింకేం ? మల్లేశ్‌కు మన అనూరాధని ఇద్దామా ?"

శివుడికి రామనాధం ఏమంటున్నాడో ఒక క్షణం అర్థం కాలేదు.

" బాబాయ్ - ఏమంటున్నారు మీరు ? "కంగారుగా అరిచాడు.

"ఏం మాట్లాడుతున్నావో తెలిసే మాట్లాడుతున్నావా బాబాయ్ ! "

"అవున్రా - తెలిసే మాట్లాడుతున్నా . నీకు అబ్బాయి, అతని కుటుంబం అన్నీ బాగా నచ్చాయి. నాకు నచ్చాయి. మరి సంబంధం కలుపుకోవాడానికి అభ్యంతరం ఏంటి ? "

శివుడు రామనాధం హాస్యానికి అంటున్నాడేమోనని అతని ముఖంలోకి పరీక్షగా చూసాడు. గంభీరంగా వున్న రామనాధం ముఖం ఖచ్చితంగా నిజంగా అంటున్నాడని చెపుతోంది.

రామనాధం అంటే శివుడికి అమిత విశ్వాసం. వెంగళాయి పనులు చేస్తున్నాడని అందరూ వెక్కిరించిన రోజు కూడా వెన్నంటి వున్నాడు. రామనాధం ఓ నిర్ణయం తీసుకొన్నాడంటే వెనక్కి తిరగడనీ అతనికీ బాగా తెలుసు. కానీ, ఈ రోజు - సుధాకర్, అనూరాధ ఇద్దరూ తమ ప్రాణాలు.

"బాబాయ్ - ఎందుకిలాంటి నిర్ణయం తీసుకొన్నావ్ ? నువ్వసలు సుధాకర్ - తండ్రిలాగా ప్రవర్తించడం లేదు ! వాడికి అనూరాధంటే ఇష్టమనీ మీకూ తెలుసు. తెలిసి తెలిసీ వాడి మనసు చంపుతావా బాబాయ్ ! " రామనాధం మీద కోపం ముంచుకొచ్చింది. ఆ కోపం ఉద్రేకంగా మారి, బద్దలయ్యింది - శివుడు తన ఉద్రేకాన్నంతా కల్వర్టు గట్టుమీద చూపించాడు. పిడికళ్ళు బిగించి గట్టిగా గట్టునో గుద్దు గుద్దాడు.

శివుడి కళ్ళముందు తొలి వలపు ఊహలో తేలియాడుతున్న తమ్ముడు మెదిలాడు. "వాడిముఖంలోని వెలుగు చప్పున చల్లార్చే అధికారం ఎంత తండ్రైనా నీకు ఎక్కడిది బాబాయ్ ? " శివుడి ఆవేశం దుఖంలా మారింది - "బాబాయ్ - వాడి మనసు చాలా మెత్తన - వాడు తట్టుకో లేడు బాబాయ్ - ముక్కలు ముక్కలు అయిపోతాడు. అనూరాధకు మాత్రం వాడంటే ఇష్టం లేదా ?"

రామనాధం గుండె మెలి పెట్టి నట్టయింది.

రామనాధం మాట్లాడలేదు. అనూరాధకూ తనకు మధ్య జరిగిన సంభాషణ ఎవరితోనూ చెప్పదలుచుకోలేదు. శివుడికి - సావిత్రికి చివరికి సుధాకర్‌కి కూడా

"నాకు మాత్రం ఆ విషయం తెలీదారా ? "

"మరి తెలిసి తెలిసి వాడి గొంతెందుకు కోస్తున్నావ్ ? బాబాయ్ ? వాడే మవుతాడో వూహించావా? వాడిది పసివాడి మనసు. ఇంత దెబ్బ తగిలితే వాడు ఎట్లా తట్టు కోగలడు బాబాయ్ ? అందులోనూ తండ్రీ కొడుకుల మధ్య బద్ధవైరం రగల్చడం ఎందుకు బాబాయ్ ? మన వంశంలోనే తండ్రి మాట జవదాటిన కొడుకు లేడు. వాడి మనసులో ద్వేషం ఎందుకు నింపుతావ్ బాబాయ్ ? "

రామనాధం నిశ్శబ్దశ్రోత అయ్యాడు.

"అనూరాధ మాత్రం తల్లీదండ్రిలేని లోటు ఏ రోజున్న రానిచ్చామా? తోబుట్టువులా పెంచుకొచ్చామే ...."

"అదేరా నేను అనేది. తోబుట్టువులా పెరిగిన అమ్మాయిని మరో దృష్టితో చూడమని ఎలా వాడికి చెప్పాలి ?"

రామనాథం సరిగ్గా అనూరాధ అన్న విషయాన్ని ప్రస్తావిస్తూ అన్నాడు. శివుడు ఈ కొత్త వాదానికి విస్తుపోయాడు

"అందులోనూ ఇప్పుడు మేనరికాలు మంచివి కాదంటున్నారు. కూడానూ - "

"ఏంటి బాబాయ్ మంచి ? మనందరం మేనరికాలు చేసుకొని సుఖంగా లేమూ ? అయినా మా పెళ్ళిళ్ళు చేసింది మాత్రం నీవు కాదూ ? " శివుడు తన వాదనను వదలదలుచుకోలేదు.

"అవున్రా - అప్పుడు మంచి ఇప్పుడు కాదు. నేను ఇకముందు మనింట్లో మేనరికం చేయకూడదనే నిర్ణయించు కొన్నాను. "

"చిన్నప్పట్నించి ఆశలు పెంచుకున్న అనూరాధకు ఏం జవాబు చెప్తారు ? "

"అనూరాధ నా మాట కాదనదు ! "

"ఏం ఎందుకు కాదనకూడదు ? సుధాకర్ నీ కొడుకు కాబట్టి నువ్వు నిర్ణయం తీసుకొన్నావ్ ? కానీ, అనూరాధ తరుపున నువ్వులా నిర్ణయం తీసుకొంటావ్ ?"

రామనాథం నెమ్మదిగా శివుడి భుజం మీద తట్టాడు.

"శివుడు - నువ్వునా అన్న కొడుకువి. నిన్ను నేను నా పెద్ద కొడుకులాగానే భావించాను. అనూరాధ నా చెల్లెలి కూతురు. అనూరాధను పెద్ద కూతురిలాగా భావించాను. నా కూతురి తరుపున నేను నిర్ణయం తీసుకున్నాను . అంతే ! "

శివుడు మాట్లాడానికి మాటలు లేవు.

శివుడు కోపం చల్లారి పోయింది. అసంతృప్తి మిగిలిపోయింది.

"అసలు ముందు బాలయ్య గారింటికి వెళ్లి మాట్లాడాలి - వాళ్ళయిష్టాయిష్టాలు మీదేగా తరువాతి వ్యవహారం - ? " శివుడు ఇక గొడవ చేయదలుచుకోలేదు. "ఇల్లలకగానే పండగ్గాదు. అనుకోగానే పెళ్ళికాదు. అప్పుడే ఎందుకు ఆవేశపడడం ? " అనుకున్నాడు మౌనంగా రామనాథంని అనుసరించాడు.

రామనాథం పెళ్ళి ప్రస్తావన చేయగానే బాలయ్య అంగీకరించడం - పంతులుగారికి కబురు చేయడం - ముహూర్తం నిర్ణయించడం - అన్నీ ఊహించలేనంత వేగంగా జరిగిపోయాయి. వైశాఖంలో అనూరాధకు మల్లేశ్‌కు పెళ్ళి !

❋ ❋ ❋

"సదు నేర్పిన పిల్లగాడు వాన్ని అడిలగిదిలే పెట్టిందిలే - మూర్తం ఎట్ల పెట్నవ్ ? " నారాయణమ్మ బాలయ్య మీద విరుచుకు పడింది.

"లొల్లి జేయకు - వాని మనసు నాకు తెల్వదా ?"

"నీకే మెర్క. వాన్కినా తమ్మని బిడ్డంటే మనసు ఎర్కేనా ? "నారాయణమ్మ కోపంగా అంది.

బాలయ్య పకపక నవ్వాడు.

"మనసు నా కొడ్కుకుగాదు నీకని జెప్పుమల్ల ! గాపోరిని జూస్తే మల్లేశ్ వుర్కిర్కి పారొస్తడు ! "

" గా పోరికేమాయె ?"

బాలయ్య మళ్ళీ నవ్వాడు - " గా పోరి పుట్టుడే ఈత చెట్టు కింద పుట్టె. కడుపుల కడవల కడవల కల్లు పోసెటాలకు మన సేలు గౌండ్లోని పాలబడ్తయి "

"నీ ఎకసెక్కానికి ఏ మొచ్చె కానీ - కల్లు తాగనోడెవ్వడు చూపుగిట్ల " నారాయణమ్మ మేనకోడలిని వెనకేసు కొస్తూ అంది.

"మీ కల్వకూర్తి దిక్కు కత జెప్తలేను ఈ నడిగడ్డ మిందకత జెప్పు. అయిన గాని నా కొడ్కు నసీబ్ మంచిగుంది. గా రామనాథం మేనకోడలు ఎనుమంటి పిల్ల ! చిదిమి దీపం బెట్టచ్చు ! "

బాలయ్య కళ్ళముందు అనూరాధ కదలాడింది.

"ఎవ్వడు జూసిండు ? ఓ పెండ్లి చూపులా పాడా ? " నారాయణమ్మ మూతి తిప్పుతూ నిష్టూరపడింది.

"ఎవ్వరు జూస్తే ఎంత తియ్ ? అసలోడు మనసు పట్టడు. వాడు పాలమూరు పోకముందే నాతోన గా పిల్ల ముచ్చట జెప్పిండు. మనకు అందేడ్డి గాదు ఎట్ల వాని ముద్దుముచ్చట తీర్చుడని బుగులు గుండె" -

నారాయణమ్మ అనుమానంగా కళ్ళు చికిలించింది.

"గీడకూసోని ఆరాంగ [1] మాట్లాడు !"

బాలయ్య నారాయణమ్మని సావధానంగా కూర్చోపెట్టాడు.

"నీ తమ్మని బిడ్డకు పొట్ట కోస్తే అచ్చరం ముక్క ఎల్తదా ? మన మల్లేశ్ పట్నంల నేర్చిండు. నక్కకూ నాగలోకానికి ముడిపెట్టనింక అయితదా ?"

నారాయణమ్మకు తమ్ముడి కూతురి మీద మహామోజేమీ లేదు. బాలయ్య పరాచికాలను పక్కన పెట్టినా ఆ అమ్మాయి పక్కన మల్లేశ్ కాకి ముక్కున దొండపండు లాగా వుంటాడు. అది నిజమని ఆమెకీ తెలుసు - కానీ - కానీ -

"ఇంగ నీ బుగులేందో[2] తిన్నగా చెప్పరాదూ ? " నారాయణమ్మ మనసులో ఒకటి పెట్టుకొని మరోటి మాట్లాడుతుందని బాలయ్య గ్రహించాడు. ఆమెకు ఆ సంబంధమే ఇష్టం లేకపోతే రామనాథం వాళ్ళముందే కుండబద్దలు కొట్టినట్లు తిరస్కరించేది. ఏవిటీ ఆమె అనుమానం ?

"బుగులే గాదూ ? వియ్యానికి కయ్యానికి బరాబరోల్ల[3] తానకు పొమన్నారు. పొద్దునలేస్తే సేనుకు సేద్యం చెయ్యనింక పోయే మనింట్ల వాళ్ళు నీటుగీటు చెల్తాయి ? గా దస్తగిరి పెండ్లాం జెప్పులే - రామనాథం పెండ్లాం నిక్కులు నీల్గులు - "

---

1 నెమ్మదిగా 2. దిగులు 3. సమస్థాయి వాళ్ళు

"చెప్పక చెప్పక గా దస్తగిరి పెండ్లాం ముచ్చట్నే జెప్పినవ్ ? ఆమె కన్నా నీల్గెటోల్లు నడిగడ్డ మీదున్నరా? సావిత్రమ్మను నువ్వు గిట్ల వక్కపారి జూస్నవంటే - ఇడిచి పెట్టవు - నీ తీరునే మనుషలంటే ప్రాణం పెడ్తది. అడవిల ఆ యమ్మ గాబట్టి ఈడ్చు కొచ్చె - వక్క నిమ్షం సుతరాయిస్తదా? బొంగరం తీరున గిరగిరా గా పని గీపని చేస్తూనే వుంటది. అయినా గానీ వాళ్ళ కొడ్కు మన మల్లేశ్ తాన వుంటలేడా ? చదువు నేర్చినోళ్ళు - పక్క పక్క సేన్లు - మంచి సేద్యగాండ్లు మన మల్లేశ్‌కు అంతకన్న అండ ఏం గావాలె ?"

"నీ కేమాయె . నువ్వు ఏ ముచ్చటన్నా జెప్తవ్. రేపొద్దుగాలగాపిల్లకు నాకు కల్వకుంటే అత్తపోరు పెట్టిందంటరు. గీ దినం దంకా గీ నారాయణమ్మ ఒక్క మాట తిన్నదా ? నా·అత్త నేనంటే పాణమిడుస్తుంది. నా కోడాలు నా పాణం గావాలె. మన లాంచనాలు గీంచనాలు గిట్ల పక్కన పెట్టు - మన అచ్చట ముచ్చటగా పిల్లకు సమజయితదా [1] ? తిండీ తీరే అలగ్ అయె - " నారాయణమ్మ మెల్లిగా మనసు విప్పింది.

"ఆ రాంనాధం శివుడు ఎన్ని తూర్లు మన యింట్ల తినలె ? మన మల్లేశ ఆ సుధాకర్ తాన వుండబట్టి ఎన్ని దినాలయ్యె - ఒక్క దినమన్న సుధాకర్‌ని చెడ్డగా చెప్పగ ఇన్నావా ? మనసు కలవాలెగానీ గివన్నీ కావు. మల్లేశ మనసు పడ్డడు. అంతకన్నా ఏం గావాలె ? నాల్గుదినాలు కిందమీదయితము - అంతేగానీ మనసు చంపుకుంటమా - "

"నువ్వు జెప్పిన ముచ్చట నాకు సమజయింది. కానీ మగోల్లు మగోల్లు కల్సిన తీరున ఆడోల్లు కలుస్తరా ? "

"ఎందుక్కల్వరు ! ఆడోల్లే బెరీన[3] కలుస్తురు నీకు అన్మానం గిట్ల వుంటే బండి కట్టిస్తా. పోయి సావిత్రమ్మను కలిసి రారాదూ ? మూర్తం పెట్టుడే కానీ లగ్నపత్రికలు రాయలే - ఇంగా నిశ్చితార్థం చేయలే రేణ్కకు కూడా పిల్వనంప్తా - పోయి జూసి రాన్రి "

❋ ❋ ❋

నారాయణమ్మ, రేణుక వెళ్ళి సావిత్రిని కలిసివచ్చారు. సావిత్రి మర్యాద మన్నన మాటతీరు వారి అనుమానాలన్నిటిని పటాపంచలు చేసింది.

చక్కగా ముగ్గులతో అలంకరించిన ఇళ్ళు వాకిళ్ళూ చావిడి నిండుగా వున్న గొడ్డుగోదా అన్నీ ఆమెలోని సంశయాలన్నిటిని దూరం చేసాయి.

ఆ కుటుంబంతో బంధుత్వం కలుపుకోవడానికి బలమైన ఆధారాలయ్యాయి.

'గా దస్తగిరి పెండ్లాం నోట్ల మన్నుబడ ! ఆమె నీల్గులు నిక్కులు అందర్కి అంటగట్టి చెప్తది !' - నారాయణమ్మ లోలోన గొణుక్కుంది.

---

1 అర్థం అవుతుందా 2. వేరు 3 త్వరగా

సావిత్రితో పెళ్ళి విషయాలేవీ ఎత్తకుండానే వారు ఇంటికి తిరిగి వచ్చారు. అమ్మా కూతుళ్ళు కొత్త కోడలిని మనసారా ఆహ్వానించడానికి ఉత్సాహంగా సిద్ధమవుతున్నారు.

అందరూ శుభవార్తతో మల్లేశ్ రాక కోసం ఎదురు చూస్తున్నారు.

❋ ❋ ❋

"అవున్రా శివుడూ ఎప్పుడూ రాని బాలయ్యగారి భార్యా కూతురు ఇంతహఠాత్తుగా మన యింటికీ ఎందుకు వచ్చెళ్ళార్రా ? " సావిత్రి శివుణ్ణి ఆరా తీసింది.

శివుడు అనుకోకుండా నారాయణమ్మ వాళ్ళు బండిదిగగానే కంగారు పడిపోయాడు. రామనాథం తూరుప్పొలంలో కలుపు తీయిస్తున్నాడు. వెళ్ళి పిలుచుకురావాలని కూడా శివుడికి తట్టలేదు.

ఇంకా అనూరాధ పెళ్ళి విషయం రామనాథం ఇంట్లో వారితో ప్రస్తావించలేదు. రామనాథం చెప్పదలుచుకున్నపుడే చెప్తాడు తనెందుకు బయటపడాలని శివుడు వూరుకొన్నాడు.

నారాయణమ్మ వాళ్ళు రావడం ఇల్లూ వాకిళ్ళు చూసుకోవడం తిరిగి వెళ్ళిపోవడం అన్నీ చకచకా జరిగిపోయాయి.

నారాయణమ్మ వాళ్ళు కూడా పెళ్ళి గురించి ఒక్కముక్క మాట్లాడక పోవడం శివుడికి ఆశ్చర్యం వేసింది.

కల్యాణ మొచ్చినా కక్కొచ్చినా ఆగదంటారు. ఇక ఇంత దాకా వచ్చాక దాచిపెట్టడం దేనికని శివుడు పెళ్ళి విషయం బయట పెట్టేసాడు.

సావిత్రితో, రత్తయ్యతో చేయవలసిన వాదాలన్నీ చేసాడు - నచ్చచెప్పాల్సింది నచ్చ చెప్పాడు

సావిత్రి నిస్సహాయంగా తల పట్టుకుంది. గోడకానుకొని కూలబడి వుంది. రత్తయ్య కోపంతో పళ్ళు పట పట లాడిస్తున్నాడు.

రత్తయ్యకు సుధాకర్ అంటే పంచప్రాణాలు. ఈ నిర్ణయం పట్ల నష్టపోయేది సుధాకరేనని అతనికి ఖచ్చితంగా తెలుసు.

"తానా అంటే తందానా అంటూ వాడుచెప్పినటన్నిటికీ తాళం ఏత్తావ్ ! ఎందుకురా పిల్లాడి వుసురు పోసుకుంటావు ? " రత్తయ్య శివుడి మీద విరుచుకు పడ్డాడు.

శివుడు అప్పటికే ఈ వాదాలన్నీ రామనాథంతో చేసి వున్నాడు. రామనాథం సమాధానాలే ఇప్పుడు వారికి వినిపించాడు.

రామనాథం పొలం నుంచి ఇంటికి వచ్చేసరికి అందరూ బద్దలవ్వడానికి సిద్ధంగా వున్న అగ్ని పర్వతాల్లా లోలోన కుతకుత లాడి పోతున్నారు.

"ఒరేయ్ - రావుడూ - వాళ్ళ కుదురు సంప్రదాయం ఆచారం వ్యవహారం అన్నీవేరు - చివరికి తిండి తీరు మాట తీరు కట్టూ బొట్టూ అన్ని వేరు - ఇదెలా సాధ్యమవుతుంది ?" రత్తయ్య కంఠం బొంగురుపోయింది.

రామనాధంకి నవ్వొచ్చింది. సంక్రాంతి రోజు మల్లేశ్ అనూరాధల భేటి గుర్తొచ్చింది. వాళ్ళ మనస్సుల్లో వలపు మొలకెత్తడానికి ఈ కుదురు, సంప్రదాయం, ఆచారం, వ్యవహారం - ఏవైనా అడ్డొచ్చాయా ? ఓ యువతి ఓ యువకుడ్ని చూసి స్పందించినట్లే అనూరాధ అతన్ని చూసి స్పందించింది. మల్లేశూ అంతే మనసుకు లేని అడ్డంకులు మనకు మాత్రం ఎందుకుండాలి ? అన్ని వాదనలు పూర్తిగా విని అన్నాడు, " అన్నయ్యా - మనదీ వాళ్ళదీ ఒకటే సంబంధం - మనం రైతులం. రైతు కుటుంబాల్లోని అంతరాంతరాల్లో ఇంకిపోయిన ఆత్మిక సూత్రాలే వాళ్ళలోనూ వుంటాయి. వాళ్ళు మట్టినే నమ్ముకున్నారు. మనమూ మట్టినే నమ్ముకున్నాం మనందరి ఆలోచనలు అనుభూతులు , అనుబంధాలు, ఆప్యాయతలూ అల్లుకుపోయింది. ఆ మట్టితోనే. మట్టే మన మధ్యనున్న సంబంధం. మనం వాళ్ళలో కలవడానికి అంతకన్నా మరో కారణం అక్కర్లలేదు ! "

కానీ రత్తయ్య దుఃఖంతో రుద్ధమైన కంఠంతో వాపోయాడు

"సుధాకర్ - అన్యాయమై పోయాడు. "

సావిత్రి కూడా వంటరిగా వున్నపుడు కుమిలి కుమిలి ఏడ్చింది - "అనూరాధను కన్న బిడ్డలా పెంచుకొన్నాం ......."

"ఎవరు కాదన్నారు సావిత్రి - ఇకపై కూడా కన్న బిడ్డలాగే చూసుకొందాం "

రాజు కన్నా మొండివాడు బలవంతుడు. రామనాధాన్ని అతని నిర్ణయాన్ని ఎవరూ మార్చలేకపోయారు.

సుధాకర్ మల్లేశ్ ఒకేసారి మహబూబ్‌నగర్ నుంచి బయలుదేరి వచ్చారు.

మల్లేశ్ కోసం మంచివార్త సిద్ధంగా వుంది. అతను త్వరలో ఇంద్రచాపాల్ని ఎక్కుపెట్టబోతున్నాడు. జాబిల్లితో వూసులాడబోతున్నాడు. వార్త తెలిసీ తెలియగానే మల్లేశ్ సంతోషంతో తబ్బిబ్బయ్యాడు. అతను అనూరాధను కళ్ళారా చూసిన కొన్ని నిమిషాలే అయినా సుధాకర్ మొదటినుంచి చెపుతూ వచ్చిన అనూరాధ అతని కలలన్నింటిలోనూ నిండిపోయింది. తోటల్లో పరుగులు తీస్తు పకపకలాడే అనూరాధ - చేలగట్టు మీద గెంతుతూ గలగల నవ్వుతూ తుళ్ళింతల తుంగభద్ర లాంటి అనూరాధ - గడపకు కుంకుమ బొట్లు పెడుతోన్న ముద్దబంతి లాంటి అనూరాధ - ముఖాన దోబూచులాడుతున్న నునుసిగ్గును దోర నవ్వుతో దాచుకొనే అనూరాధ - సొగసైన సోగకళ్ళ అనూరాధ - మల్లేశ్ కలలన్నింటిలోనూ నిండిపోయింది.

మల్లేశ్ క్షణం ఏమారినా తన కల కరిగిపోతుందేమో - మధుర భావన చేజారుతుందేమోనని ఒంటరిగా చేనుగట్టు మీద కూర్చుని - కలల రెక్కలు కట్టుకొని ఊహాలోకంలోకి ఎగిరిపోయాడు.

❋ ❋ ❋

"శివుడు - ఇలా రా.... " రామనాథం గట్టుమీద నుంచి కేకేసాడు.

"ఏంటి బాబాయ్ - "శివుడు చేతిలో పని వదిలి రామనాథం దగ్గరికి వచ్చాడు.

మంచం మీద కూర్చుని వున్న సుధాకర్ కుతూహలంగా రామనాథం వైపు చూసాడు.

"ఇదుగో ఈ ప్రకటన చూసావా ? ట్రాక్టర్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్ వారు ట్రాక్టర్ నడపడం నేర్పిస్తారట. ట్రైనింగ్ అయ్యాక పరీక్షవుంటుందట పరీక్ష పాస్ అయితే సర్టిఫికెట్, లైసెన్స్ ఇప్పిస్తారట."

"ఎక్కడ బాబాయ్ అదీ ? "

"రత్లాం - "

"మధ్యప్రదేశ్ కదూ నాన్నా - " సుధాకర్ కల్పించుకున్నాడు.

"అవున్రా - ఇండోర్‌కి దగ్గరేనేమో - "

"సరేలే సంబడం ! ట్రాక్టర్ నడపడం నేర్చుకోవడానికి అంత దూరం ఎళ్ళాలా ? ఈ మధ్యలో వూళ్ళన్నీ వట్టిపోయాయా ? " శివుడు అన్నాడు.

"డ్రైవింగ్ నేర్పించడమే కాదురా - రిపేర్లు చేయడం కూడా నేర్పిస్తారట. పై నుంచి సర్టిఫికెట్ వున్న వారికి సబ్సిడీలు కూడా ఇస్తారట నువ్వెళ్తావంట్రా శివుడూ - "

"అంత దూరమా - ఆలోచిద్దాం లే బాబాయ్ - - తొందరేముంది ? అయినా ఉన్న పళాన ట్రాక్టర్ గోల ఎందుకు - భూమిని బద్దలు కొట్టే బ్రహ్మాండమైన గిత్తలుంటే !"

నిజానికి ఆ విషయం కన్నా ప్రధాన విషయం వాళ్ళ ఎదురుగా మంచంలో కూర్చుని వున్న సుధాకర్. ఆ సంగతి రామనాథానికి శివుడికి ఇద్దరికీ తెలుసు.

సుధాకర్ ఊర్నుంచి వచ్చి అప్పటికి మూడోరోజు. సుధాకర్‌ని చూడగానే అందరి గుండెలు నీరయ్యాయి. అతనికీ విషయం ఎవరు చెప్పాలి ? అందరి దృష్టి రామనాథం మీద వుంది. ఎప్పుడు విషయం ప్రస్తావిస్తేడేమోనని శివుడు ఆత్రుతగా ఎదురు చూస్తున్నాడు

"తొందరేవుందటేంవేమిట్రా ? వ్యవసాయ ప్రపంచం ముందుకు దూసుకు పోతుంటె మనమింకా నాగళ్ళతో పాటుపడుతూ చతికిలపడ్డాం. మనకుపయోగపడని శాస్త్రమెందుకు ! మనం వాడని శాస్త్రం సృష్టించిన పరికరాలెందుకు ?"

"నిజం నాన్నా - శాస్త్రాన్ని మనం ఎప్పటికప్పుడు మన జీవితానికి అన్వయించుకోవాలి "సుధాకర్ కల్పించుకుని అన్నాడు.

రామనాథానికి సూత్రం దొరికింది. టక్కున అన్నాడు.

"ఎవర్రా అబ్బాయ్ అన్వయించుకునేది ? మన శివుణ్ణే చూడు. ట్రాక్టర్ విషయంలో ఎంత అడ్డుపడుతున్నాడో ! ఈ విషయానికే ఇలా వుంటే ఇంక మానవ జీవితానికి సంబంధించిన విషయాలు - మాట వరసకి పెళ్ళిళ్ళ విషయం తీసుకో - మేనరికాలు తప్పని అంటున్నారా ఎవర్రా ఆ మాట వినేది ? " రామనాథం ఒక్కోమాట జాగ్రత్తగా వాడాడు.

"మేనరికాలు తప్పని ఎవరు బాబాయ్ అనేది ? " శివుడు అడ్డుపడ్డాడు.

"అవును అన్నాయ్ - ఇప్పుడు మేనరికాలు వద్దనే అంటున్నారు. మేనరికం వల్ల పుట్టే పిల్లలలో బుద్ధిమాంద్యత, మానసిక వైకల్యం శారీరక అవకరాలుఎక్కువవుతున్నాయంటున్నారు. శారీరక, మానసిక సమస్యలతో నిండిన తదుపరి తరానికి ఇలాంటి వివాహాలు మూల మంటున్నారు" అన్నాడు సుధాకర్, "శిశు మరణాలు కూడా ఎక్కువేనట - "

రామనాథం ఊపిరి పీల్చుకున్నాడు. అతడు ఆశించిననట్లుగానే జరుగుతోంది.

"అది సరేగానీ, అబ్బాయ్ మీ ఫ్రెండ్ నువ్వు పరీక్షలు ఎట్లా రాసారు ?"

"మా ఇద్దరికీ డిస్టింక్షన్ తప్పదు నాన్న కాకపోతే ఇద్దరిలో ఎవరికి ఎక్కువ మార్కులు వస్తాయోనని బెట్ కట్టుకున్నాం నాన్నా - చూడాలి... మా ఇద్దరిలో ఎవరం గెలుస్తామో .. " సుధాకర్ ఉత్సాహంగా అన్నాడు.

శివుడు ఊపిరి బిగబెట్టాడు.

"పిచ్చి తండ్రీ అనూరాధను వాడు గెలచుసుకున్నాడురా - నువ్వు ఒడిపాయావ - ఓడిపోయావ్ - " రామనాథం గుండె కలుక్కుమంది. తనకు తాను కూడదీసుకొని అన్నాడు.

"ఎవరు గెలుస్తే నేమిరా ? మల్లేశ్ గెలిస్తే నీకు మాత్రం సంతోషంగా వుండదూ ? "

శివుడు సుధాకర్ ముఖంలోకి ఆత్రంగా చూసాడు.

"నిజం నాన్నా... మా యిద్దరిలో ఎవరం గెలిచినా ఇద్దరం సంతోషిస్తాం నాన్నా. మల్లేశ్‌లో ఏదో మంత్రజాలం వుందినాన్నా - అతడిని సమీపించిన వారెంతవారైనా సరే అతని మాయలో పడకుండా తప్పించుకోలేరు నాన్నా. స్నేహం అంటే ప్రాణమిస్తాడు. స్నేహాని ప్రతిరూపమనుకో. అంతలా అతనితో ఎలా కలిసిపోగలిగానోనని నాకే ఆశ్చర్యమేస్తుంది నాన్నా... మమ్మల్ని మహబూబ్‌నగర్ వాళ్ళంతా ఏమని పిలుస్తున్నారో తెలుసానాన్నా ... రామలక్ష్మణులని - అప్పుడప్పుడు వాలి సుగ్రీవులు అని కూడా పిలుస్తారనుకోండి - అది వేరే సంగతి "ఎప్పుడూ మాటల్ని మితంగా వాడే సుధాకర్ గబగబ మాట్లాడాడు. సుధాకర్ ముఖాన నవ్వు కదలాడింది.

రామనాథం బలవంతాన ముఖాన నవ్వు పులుముకున్నాడు. "తను ఇక అసలు విషయం చేప్పేయాల్సిన సమయం దగ్గర కోచ్చేస్తోంది. నిబ్బరంగా తొణకకుండా సుధాకర్‌కి విషయం చెప్పేయాలి, చెప్పాలి, తప్పదిక.

"నిజంగా మల్లేశ్ ప్రేమించ దగ్గ వ్యక్తి ! " సుధాకర్ కళ్ళు మిలమిల మెరుస్తుండగా అన్నాడు.

"అంత మంచి వాడట్రా నీ స్నేహితుడు ? అయితే మన అనూరాధను అతనికి ఇచ్చి పెళ్ళిచేద్దామా ?" రామనాథం కుండబద్దలు కొట్టాడు.

హుషారుగా మాట్లాడుతున్న సుధాకర్‌కి రామనాథం ఏమన్నాడో గబుక్కున అర్థం కాలేదు. ఒక్కసారిగా అతనిలోని చైతన్యం మాయమైంది. అతనికి అస్పష్టంగా రామనాథం మాటలు కొన్ని వినిపించాయి.

"మల్లేశ్ కి అనూరాధకి పెళ్ళి నిశ్చయించాం. వచ్చే వైశాఖంలో పెళ్ళి ! "

మంచు కొండ పెళపెళ విరిగి సుధాకర్ మీద పడ్డట్లయింది. మనిషి మంచులా ఘనీభవించి పోయాడు. తన ముందున్న మనుషులు చెట్లు నేల ఆకాశం అన్నీ అంధకారమైపోయాయి. అగాధంలోకి జారిపోయాడు. నిశ్శబ్దంలో కూరుకుపోయాడు. సుధాకర్ ఒక్కమాట మాట్లాడకుండా లేచి వాగు వైపు వెళ్ళాడు.

రామనాథం, శివుడు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు.

శివుడు సుధాకర్ వెంట వెళ్ళబోయాడు. రామనాథం అతన్ని వారించాడు.

"వాణ్ణి కాసేపు ఒంటరిగా వదిలేయ్‌రా - "

సుధాకర్ చేలగట్ల మీదుగాఎలా నడుచుకొంటూ వచ్చాడో కానీ వాగొడ్డుకు వెళ్ళి కూలబడిపోయాడు. మెల్లిమెల్లిగా ఘనీభవించిన మంచు కరగసాగింది. సుధాకర్ వెల్లకిలా ఇసుకలో పడిపోయాడు. అతని ప్రేమయం లేకుండా కనుకొలుకుల్లోంచి కన్నీళ్ళు కాలువలు కట్టాయి. మెత్తగా ఇసుకలోకి ఇంకి పోయాయి.

వాగు, వాగులోని జమ్మి - జమ్మిపైన గూడు - గూడులోని బంగారు పిచ్చుక - అతని దుఃఖాన్ని పంచుకొన్నాయి.

నెమలి ఈకను అపురూపంగా దాచుకొనే సుధాకర్ - మర్రి ఊడల్లో సంగీతం వినగలిగిన సుధాకర్ - గోరింట పూల సువాసనూ పారిజాతాల పరిమళాన్ని ఒక్కలా అనుభూతించగల సుధాకర్ - వాగొడ్డున చలనం లేకుండా చచ్చిన శవంలా పడున్నాడు. కందరీగ ముఖాన వాలుతూ గీ పెడుతున్నా కదలకుండా పడున్నాడు.

మేనరికం తప్ప తనకూ అనూరాధకూ వేరే సంబంధం లేదా ? చిన్నప్పట్నించి పెంచుకున్న అనుబంధం అంతా ఒట్టిదేనా ! సుధాకర్ ఆక్రోశించాడు.

మెత్తని రంపం అతని హృదయాన్ని ముక్కలు ముక్కలుగా కోసుకుపోతోంది.

"అనూరాధ తనకో నీలాకాశన వెలసిన ఇంద్రధనుస్సు - అనూరాధ తొలి కిరణం తాకిడిని సిగ్గిలిన మబ్బు తునక - అనూరాధ తెల్లవారి గరిక మీద నిలిచిన మంచు ముత్యాల మాల - అనూరాధ సీతాకోక చిలుకల రెక్కల సవ్వడి వినిపించే సంగీతం - అనూరాధ

వానవెలిసాక చూరు చివరల జారిన వాన చుక్కల తోరణం - అవును - ఇంద్రధనుస్సు అందుకోలేం. మబ్బు తునకనూ అందుకోలేం - మంచు ముత్యాల మాలను అందుకోలేం - రెక్కలసంగీతం అందుకోలేం - అవన్నీ అనుభూతులు. రమ్యమైన అనుభూతులు. అనూరాధ తనకు ఓ మధురమైన అనుభూతి ఓ కమ్మని కల ! కరిగి పోతానంటోన్న కమ్మని కల ! "

సుధాకర్ ఇసుక మీద అటూ ఇటూ పొర్లాడు.

"మరి అనూరాధ ఈ పెళ్ళిని వప్పుకుందా !"

సుధాకర్ ఏ ప్రశ్న అయితే వేసుకోకూడదని భావించాడో అదే ప్రశ్న వేసుకున్నాడు. అతడి కళ్ళముందు సంక్రాంతి రోజుటి అనూరాధ మెదిలింది తను తన మనసును ప్రకటించినా అనూరాధ దూరదూరంగా తప్పించుకు తిరగడంలో అర్థం ఏమిటి ? అనూరాధకి తనంటే ఇష్టం లేదా ? సుధాకర్ మనసులోంచి చివరి ప్రశ్నను గబగబ చెరిపి వేసుకున్నాడు.

"ఒకవేళ లేదు - అని అతని మనసు జవాబిస్తే తను తట్టుకో లేనని అతను భావించాడు.

అసహనంగా ఇసుక మీద అటూ ఇటూ పొర్లాడు. అతని ఆలోచనల్లోకి మల్లేశ్ని రానీవ్వకుండా బలవంతంగా ప్రయత్నించాడు. అతడు ప్రయణమై ఇక్కడికి వచ్చేంత వరకూ ప్రాణప్రదమైన ప్రియమైన స్నేహితుడు. ఇప్పుడు అతని మీద స్నేహం స్థానంలో ఈర్ష్యద్వేషం పంచి ఇవ్వలేడు - అది అతని వల్ల కాదు !

సుధాకర్ మెల్లిగా తేరుకున్నాడు. "ప్రతి విషయాన్ని తరచి తరచి ఆలోచించి కానీ ఓ నిర్ణయం తీసుకోని నాన్న ఎందువల్ల ఇలాంటి నిర్ణయం తీసుకొని వుంటాడు ? ఊహ తెలిసినప్పటి నుంచీ ఈనాటి వరకూ తాను నోరు తెరిచి అడిగే అవసరం లేకుండా తన ముద్దు మురిపాలు తీర్చిన నాన్న - తన మనసు తెలుసుకోకుండానే వుంటాడా ? సుధాకర్ని ఎంతకీ రామనాథం మనసులో ఏముందో ఆలోచించలేకపోయాడు.

"ప్రియమైన నాన్న - ఆరాధించిన అనూరాధ - ప్రాణప్రదమైన స్నేహితుడు వీరి ముగ్గురి మధ్య నున్న అంతఃసూత్రం ఏమిటి ? " సుధాకర్కి ఎంతకూ తట్టలేదు. "కానీ వాళ్ళకోసం తన ఇష్టాన్ని ఎందుకు చంపుకోవాలి ? చంపుకోను - ఇష్టాన్ని సాధించాలి - కానీ తన చేజేతులా వాదించడానికి కూడా వీలు లేకుండా చేసుకున్నాడే - అయ్యో - "

సుధాకర్ ఎంతగా తన మనసును సముదాయించుకుందామనుకున్నా అది అతని వశం తప్పుతోంది.

అతని మనసును కుదిపిన మధుర భావన అతన్ని ఊపిరి పీల్చుకోనివ్వడంలేదు. మనసు ఆలాపించిన మంజుల రాగాలు మెత్తమెత్తగా ప్రేరేపిస్తున్నాయి. అతని మెత్తని మనస్సు ఆ చిత్రవధతో చితికి పోతోంది. అనూరాధ అంటే తనకింత గాఢానురక్తి, ప్రేమ వున్నాయని అతనికి ఆ క్షణంలోని తెలిసింది.

శివుడు ఓ సారి వచ్చి సుధాకర్‌ని చూసెళ్ళాడు. చచ్చినపాములా పడున్న అతన్ని కదిలించే ధైర్యం చేయలేక వెనక్కి వెళ్ళిపోయాడు.

వాగులో జపం చేస్తున్న కొంగలు - జపం గిపం కట్టిపెట్టి గూళ్ళను చేరాయి

బంగారు పిచ్చుక పిల్లలకి తిండి పెట్టి బజ్జో పెట్టింది. ఓ బోదురు కప్ప జమ్ములోంచి బయటకు వచ్చి పాచి పట్టిన రాయి మీద నిల్చుని వళ్ళు విరుచుకుంటోంది.

రామనాథం దూరాన నిల్చుని సుధాకర్ వంక చూసాడు. సుధాకర్ ఈ లోకంలో లేడు.

'మాటల నేర్పుతో నిన్ను బుట్టలో పడేయడం కాదురా - నా చిట్టి తండ్రీ - 'రామనాథం కళ్ళు తడిగట్టియి. చిన్నప్పట్నించి కూడా సుధాకర్ అంతే - నోరు తెరిచి ఫలానది కావాలని అడగనట్లు గుర్తే లేదు. అతని మనసు తెలుసుకొని ఇస్తే సంతోషించేవాడు, "కానీ అనూరాధను వీడు ఇంతగా ప్రేమిస్తున్నాడా ? తను నిర్ణయం తీసుకోవడంలో తొందర పడ్డాడా ? వీడు ఏమైపోతాడు ? శిధిలమై పోతాడా ? ఇది నేను తీసుకున్న నిర్ణయం కాదురా - అనూరాధ తీసుకుంది ! అది తెలిస్తే నువ్వసలు తట్టుకోలేవు ! ఆ సత్యం నాతోనే శిధిలమై పోవాలి

అనూరాధను భార్యను చేసుకోవలన్న దృష్టి పోయి లోగడ కలిసి ఆడుకున్నప్పటి మనసు బంధం నిలుపుకోవాలి. అనూరాధ పట్ల ద్వేషం ఉండకూడదు అందుకే ఆ రహస్యం తనలోనే దాచి ఉంచుతాడు.'

"సుధాకర్ " రామనాథం మెత్తగా పిలిచాడు. సుధాకర్ చివ్వున లేచి రామనాథం వైపు వీపుపెట్టి కూర్చున్నాడు. కొన్ని గంటల్లోనే వెయ్యిలంఖణాలు చేసిన వాడిలా వేళ్ళాడబడిన సుధాకర్‌ని చూసి రామనాథం గుండె కలుక్కుమంది.

"చీకటి పడింది. పురుగుపుట్రా తిరుగుతాయి - పదరా " - రామనాథం గొంతు తనకే పీలగా అనిపించింది.

సుధాకర్ అటువైపే నిల్చుని - చొక్కా చివర్లతో ముఖం తుడుచుకొన్నాడు. ఆ పని రామనాథం చూడకుండా చేయాలని ఎంతగా ప్రయత్నించినా విఫలుడయ్యాడు.

రామనాథం తల వాల్చుకొన్నాడు. మౌనంగా వచ్చి కొడుకు భుజాలు పట్టుకొని ఇంటివైపు నడిపించాడు.

ఆ మౌనంలోనే తండ్రీ కొడుకులు మౌనంగా మాట్లాడుకున్నారు.

మర్నాడు ఉదయం రామనాథం అనూరాధ వివాహ విషయాన్ని తెలియజేస్తూ - వారిని వెంటనే బయలుదేరి రావల్సిందిగా తల్లిపేర ఉత్తరం రాస్తున్నాడు.

సుధాకర్ ఎప్పుడు వచ్చాడో కానీ రామనాథం ఉత్తరం మడిచి, అతికించి, చిరునామా రాసే వరకూ మాట్లాడకుండా నిల్చున్నాడు.

రామనాథం ఉత్తరం చేతిలో పట్టుకొని - ఒక్క క్షణం ఆలోచనలో పడిపోయాడు. తేరుకొని చూసేసరికి ఎదురుగా సుధాకర్ వున్నాడు.

కళ్ళు చుట్టూ నల్లని వలయాలతో ముఖంలో గూడుకట్టుకున్న దుఃఖంతో మూర్తీభవించిన విషాదంలా నిల్చుని వున్న సుధాకర్‌ని చూడలేకపోయాడు.

"నాన్నా ..." సుధాకర్ మెల్లిగా పిలిచాడు.

రామనాథం తలెత్తి ఏమిటన్నట్లు సుధాకర్ ని చూసాడు. కొడుకు కళ్ళల్లో కళ్ళు కలిపే అవసరం రాకుండా తలతిప్పేసుకున్నాడు. సుధాకర్ ఎక్కడికో ప్రయాణమై పోతున్నాడు ఎక్కడికి వెళ్తాడు ?

"నాన్నా నేను రత్లాం ట్రాక్టర్ ట్రైనింగ్ ఇన్‌స్టిట్యూట్‌కి అప్లై చేయడానికి కర్నూలు వెళుతున్నా నాన్నా ... "

"బండి కట్టించ మంటావా ? "

"వద్దులేనాన్న - బండి వచ్చినా బొంకూరు దాకేగా ! నడిచే వెళ్తాలే - "

రామనాథం తాను వ్రాసిన ఉత్తరాన్ని కూడా పోస్ట్ చేయ్యమని సుధాకర్‌కి ఇవ్వబోయి - ఒక్క క్షణం తటపటాంచాడు. సుధాకర్ చెయ్యి ముందుకు చాపి ఉత్తరాన్ని తీసుకొని - జేబులో వేసుకొని వెళ్ళిపోయాడు. అనూరాధకు అతనికి ఇక అతను ఊహించుకున్న లాంటి సంబంధం లేదన్న చేదైన సత్యాన్ని జేబులో మోస్తూ భారమైన హృదయంతో నడిచెళ్ళాడు.

సరిగ్గా అప్పుడే రామనాథం అనూరాధకు పెళ్ళినాడు ఇవ్వాల్సిన ఆస్తి పాస్తుల్ని సరిచూసుకుంటున్నాడు.

సుధాకర్‌కి ఎంతో ఇష్టమైన వాగొడ్డుతో సహా వాగు పక్కని పొలం మల్లేశ్ పరమైపోతుంది.

సుధాకర్‌కి ప్రియాతిప్రియమైన వాగు, వాగొడ్డు - బంగారు పిచ్చుక గూడు - జపాల కొంగలు -జమ్ము - బుడగ తామరలు - గోరింట చెట్టు - అన్నీ అతనికిక పరాయివి.



# 7

" అవ్ గాని ...... వొదినె ... పెండ్లి పిల్లకు ఏం నగలు జేపిచ్చవే . ."

నారాయణమ్మ మరదలు ఆరా తీసింది.

పెళ్ళివారు సవారి కట్టిన బళ్ళలో ప్రయాణం చేస్తున్నారు.

బండిగూడులో గడ్డివేసి - గడ్డిమీద పరచిన గొంగళి మీద కూర్చున్నారు ఆ వూరు వూరంతా పెళ్ళికి ప్రయాణమైంది.

పెళ్ళి సామాను వున్న పెద్ద బండిలో నారాయణమ్మ, ఆమె కూతురు రేణుక - ఆమె అక్క, మరదలు కూర్చుని వున్నారు. లచ్చుమమ్మ కొడుకు నడుపుతున్న బండిలో కూర్చుంది. పెళ్ళి కొడుకును శివుడు వచ్చి తమ టైర్లబండిలో తీసుకొని వెళ్తున్నాడు. పెళ్ళి కొడుకు బండిలోనే మహబూబ్‌నగర్ నుంచి వచ్చిన మల్లేశ్ స్నేహితులు కూడా వున్నారు.

నారాయణమ్మ మరదలు వైపు చూసింది, "లాంచనం ప్రకారం జేపిస్తి పూస్తెలతాడు, నల్లపూసలదండ అడ్డిగ చేపించాలలే గవి చేపిస్తి. రేణ్క పెండ్లిల వాండ్ల అత్తోళ్ళు మకరకుందనాలు, సింహం మూతి కడియాలు చేయించిను - రేణ్క అవ్వి కూడా చేయించమనే "

"అవ్ వొదినె - కడియాలు కుందనాలు లేకుంటే ఎట్ల - ? "

"అమ్మా - వొదినెకు చంద్రారం చేయించేడ్డుండె - " రేణుక గారాలు పోయింది.

"మీ వొదెనకు కొడ్కు పుట్టిన పొద్దు చేయిస్తదిలే -" రేణుక మేనత్త నవ్వింది.

"అవునే - నారాయణి - నీ చంద్రారం ఉందిలే - గది మెరుగు పెట్టనింక ఇయ్యలే ? " నారాయణమ్మ అక్క ఆరా తీసింది.

"ఇస్తి - "

"మల్ల గది పెట్టరాదూ ? "

"అవ్ అమ్మ - వదినెకు మంచిగుంటది " - రేణ్క రాగాలు తీసింది

"నేను సోకు జేస్క తిరిగింది - పెండ్లి పిల్లకు పెద్తె ఏమన్కుంటారు ? " నారాయణమ్మ అనుమానం వ్యక్తం జేసింది.

"ఏమన్కుంటరు ? ఏమన్కోరు - ఇయ్యాలరేపు చంద్రారం - కాసులపేరు కోడాలికి ఒకటి తీరున చేపిస్త లేరు. ఇంటికి ఒకటి తీరున చేపిస్తున్రు. బంగారు పిరమాయె ఏం జేస్తం ? "

---

1. ప్రియం అయ్యింది - ఖరీదయింది

"అవునె అక్కా - చంద్రారం నా వంటిన పెడితే ఒకటి నా కోడాలు వంటిన పెడితే ఒకటా ? "

"అవ్‌గానే వొదినె - పెండ్లిపిల్లకు ముక్కుపుల్లలు జేపిస్తివా ? "

"ముక్కు పుల్లనా ? పెండ్లి పిల్ల ముక్కే కుట్టుకోలేదు . "

"గట్లెట్లనే ? ముక్కు పోగు పెట్టంది మూడుముళ్ళు పడరాదంటరు. ముక్కుపుల్ల పెట్టండి ముత్తైద కాదంటరు - " నారాయణమ్మ అక్క అంకిలి నొక్కుకుంది

"ఇయ్యాలరేపు ఎవ్వరు పెడ్తున్నారే పెద్దమ్మా ? మా గద్వాల్ల ఒక్క దిక్కు ముక్కు పుల్ల పెట్టుడే ఘనమైపాయె - " అంది రేణుక.

"ఇదింటివా అక్కా - పెండ్లిపిల్లోళ్ళు ఎవ్వల్లు ముక్కు పుల్లపెట్టరు - ఏమో ఏమయితాదో. మన అచ్చట గాదు మన ముచ్చట గాదు. " - నారాయణమ్మ వాపోయింది. "అయినా గాని గీసొమ్ము లెట్ల చేయిస్తి ? మాయత్త నాను - గుండ్లపేరు, సరుడు - మురుగులు - హౌసలాయన[2] పాలాయె ఆపైన బాకిపెడ్తి. వాని బాకీ తీరనింకె రెండు మూడు పంటలెల్లాయె"

"అయితే అయ్యింది తియ్ ! ఒక్కగానొక్క కోడాలు ముద్దు ముచ్చట మల్లమల్ల తీర్తదా ? " నారాయణమ్మ అక్క ఆమెను అనునయించింది.

"అవును అమ్మా - అన్న పెండ్లిల నాకు ఎర్రరాయి ముక్కు పుడక జేపిస్తనంటివి కాదే ? " రేణుకకు అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

"నేనెట్ల మరుస్త బిడ్డా - యాద్‌కున్నది.[2] హౌసలాయన తాన మీ వొదెనెకు నగలు చేపించ్చిన పొద్దే నీగ్గిట్ల చేపిస్తి-" నారాయణమ్మ కూతుర్ని ప్రేమగా చూస్తూ అంది.

ఇంతలో రామనాథం వాళ్ళ ఊరి పొలిమేరల్లోకి వచ్చేసారు. పెళ్ళికొడుకు బండి ముందు ఆగి వుంది.

వెనుక బండిలో ఎక్కిన సన్నాయి వాళ్ళు దిగి - పెళ్ళి కొడుకు బండి ముందుకెళ్ళి నుల్చున్నారు.

"ప్పీ...... ప్పీ...." సన్నాయి సవరించుకొన్నాడొకతను.

ఒకరి కొకరు సైగలు చేసుకొన్నారు.

"వాతాపి గణపతిం భజే......"

సన్నాయి మేళం పెండ్లి కొడుకు రాకను పెళ్ళి కూతురి హృదయం దాకా తీసుకెళ్ళింది.

రత్తయ్య, రామనాథం మరికొంత పెద్ద మనుషులు ఎదుర్కోలు తీసుకొచ్చారు.

పెళ్ళికొడుకును పెళ్ళివారిని విడిది ఇంటిదాకా సాగనంపారు.

పానకం బిందెలు కావిళ్ళు వచ్చాయి. విడిది ఇంటిలో ఫలహారాలు సిద్ధంగా వున్నాయి.

---

1 కంసాలి 2. గుర్తున్నది

ఆ పూట మగపెళ్ళివారు వెళ్ళి ప్రధానం చేయాలి పెళ్ళికొడుకు తప్ప అందరూ ముస్తాబయ్యి - బయలు దేరారు

పెళ్ళికొడుకు స్నేహితులు అతనితోపాటు విడిదిలోనే వుండిపోయారు

"అవున్రా, సుధాకర్ కనిపించలేదు ?" ఒకడు ఆరా తీసాడు

"ఏమోరా నాకూ కనిపించడేంటి ? "మరొకతను అన్నాడు.

" ఆడ పెండ్లోళ్ళు కదా బరువు బాధ్యతలు ష్స్ ఇంత చిన్న వయసులో ఎంత భారం మోస్తున్నాడో చిట్టితండ్రీ "'ఇంకొతను సరాదాగా అన్నాడు

అందరూ ఫక్కున నవ్వారు

మల్లేశ్ క్షణంలో వెయ్యోవంతు సుధాకర్ తన దగ్గరకి రాకపోవడం గురించి ఆలోచించాడు వెంటనే ఆ సమయాన్ని కూడా అనూరాధకే కేటాయించేసాడు

ప్రధానం తీసుకువెళ్ళిన ఆడవాళ్ళంతా బిలబిలమంటూ వొచ్చేసారు.

రేణుక ముఖం బ్రహ్మాండంగా వెలిగిపోతోంది గలగల మంటూ మాట్లాడుతూ తిన్నగా మల్లేశ్ వాళ్ళ దగ్గరకే వచ్చేసింది. మల్లేశ్‌ను అతని స్నేహితుల దగ్గర నుంచి పక్కకు లాక్కెళ్ళింది.

మల్లేశ్ నోరు తెరిచి అమాంతం గుప్పెడు చక్కెర నోట్లో పోసింది ప్రధానం అవ్వగానే ఒకళ్ళ నోట్లో ఒకళ్లు పంచదార పోసుకోవడం ఆనవాయితీ.

మల్లేశ్‌కు పొలమారినంత పనయ్యింది కంట్లో నీళ్ళు తిరిగాయి.

"అన్నా ! - మా వొదినె ఎంత ముద్దుగున్నది ! నా దిష్టే తగుల్తదేమోనని ఉప్పుగల్లు నిప్పుల్లేసి వస్తి ! "

మల్లేశ్ నోట్లో పంచదార కరిగింది. తియ్యటి జ్ఞాపకం గుండెలో మెదిలింది.

"మనం తీస్కపోయిన నిశ్చితార్థం చీరెల తామరపూవు మింద నిలుసుకున్న లక్ష్మిదేవి తీరుగ వున్నది - "

మల్లేశకి రేణుక వర్ణనలో అనూరాధను వూహించుకొనేసరికి నవ్వొచ్చింది ఆ చీర రేణుక స్వయంగా తెచ్చిన ముదురు గులాబి రంగు గద్వాల చీర

'ఆ చీరలో అనూరాధ తెలిమంచులో తడిచిన తామర మొగ్గలాగా వుండి వుంటుంది - ' మల్లేశ్ ఊహాలు అనూరాధ దాకా వెళ్ళాయి. తామర మొగ్గను తొలిపొద్దు కిరణం తడిమి వచ్చింది. మల్లేశ్ గుండె వెచ్చబడింది.

"అసలు వొదినె జడ తీరుగ ఈ నడిగడ్డ మింద ఎవ్వర్కి జడలేదు గా పిల్లను చూస్తివా" - రేణుక మల్లేశ్ మేనమామ కూతుర్ని చూపించింది. నారాయణమ్మ ఈమెనే తన కోడలిగా చేసుకోవాలనుకుంది.

ఆ అమ్మాయి హడావుడి పడుతూ అటూ ఇటూ తిరుగుతోంది

"గా జడ జూడు "

మల్లేశ్‌కు చూడక తప్పలేదు.

" మామిడిటెంకె చీకి పారేసినంక, పీచు దువ్వి జడేసిన తీర్న లేదూ - " రేణుక వర్ణనకు ఈ మారు మల్లేశ్ పగలబడి నవ్వాడు. అలా నవ్వడం అమర్యాద అని తెలిసినా ఆపుకోలేకపోయాడు. రేణుక వ్యాఖ్యానంతోపాటు ఆమె ముఖకవళికలు నవ్వును రప్పించాయి.

"గా పోరి వొదిన జుట్టు సవురం పెట్టిర్నని కూయబట్టె - కూసి వూకున్నదా ? పాపం - వొదిన ముచ్చిల గుంటల జుట్టు వూడొచ్చెటట్లు ఎనక నుంచి జడను ఒక పెరుకుపెరికే - చుప్పనాతి మొగంది ! "

"ఛ " మల్లేశ్ అవాక్కయ్యాడు' "అనూరాధ ఏమనుకుని వుంటదో ? " మల్లేశ్ తన జుట్టే పీకినంత బాధ పడ్డాడు.

"పాపం - పెండ్లి పిల్ల బిక్కమొగం పెట్టింది. కండ్లల్ల నీళ్ళు సుళ్ళు తిరిగె. పచ్చగుంటె చూసివోర్వలేరు. కండ్లల్ల నిప్పులు పోసుకుంటరు. దాని కండ్లల్ల మన్ను బడ ! "రేణుక వేళ్ళు విరిచింది. మల్లేశ్ నొసలు ఎగరేసాడు.

"వొదినె యాడ? గీ పోరి యాడ? " రేణుక పెదవి విరిచింది. "గా పోరి సోది ఎందుకుగానీ - అన్నా వొదిన జడ ఎంత తీరుగ పూలల్లిన్రనుకున్నవ్ ? గదేందబ్బా - ఆ యాద్ కొచ్చింది - వంకీల జడ అంటరంట - పాయ ఏ తీరున పోతుందో మల్లెమొగ్గల వరుస గా తీరున వంకులు తిరగుతున్నది. నల్లటి పాయల మింద తెల్లని మల్లెమొగ్గల వరుస - అబ్బ - జడ అందం చూస్తివా - అన్నా "

రేణుక తన వర్ణనతో మల్లేశ్‌కు అనూరాధను చూపిస్తోంది.

"ఏమే రేణ్క మీ అన్నను గీపొద్దు కునుకు తీయనిచ్చెటట్లులేవు - ?" ఎక్కడ్నించో రేణుక భర్త - దామోదర్ వచ్చి నర్మగర్భితంగానవ్వాడు.

చెవులప్పగించి వింటున్న మల్లేశ్ చటుక్కున తల వంచుకుని సిగ్గుపడ్డాడు.

"అరరె బామ్మర్ది గా సిగ్గులేవో పెండ్లి పిల్లను పడనియ్యి - " దామోదర్ పరచికాలాడాడు.

మల్లేశ్ ముఖం ఎర్ర బరుచుకున్నాడు.

"అవ్ అన్నా - మర్చిన - ఇక్కర్రా " రేణుక మల్లేశ్‌ను చెయ్యి పట్టుకొని భర్తకు దూరంగా లాక్కెళ్ళింది.

"వొదినెను మా అన్నకేమన్న ముచ్చట చెప్పాల్నా అని మేల మాడితి. కండ్లు ఎత్తకుండా నోరు విప్పకుండా వున్న గుప్పిటను చాచింది. రేణుక మల్లేశ్ ముందుకు తన మూసి వున్న గుప్పిటను చాచింది.

మల్లేశ్ రేణుక గుప్పిట తెరవబోయాడు, రేణుక చిన్న పిల్లలాగా అటూ ఇటూ కాసేపు పరిగెత్తింది దామోదర్ మల్లేశ్ సాయానికి వచ్చి రేణుక వెంట పడ్డాడు. మల్లేశ్ నవ్వుతూ పందిరి పంజను అనుకున్నాడు. ఇంతలో ఎవరో పెద్దవాళ్ళు వస్తుండడంతో రేణుక చటుక్కున మల్లేశ్ అరచేతులో తన గుప్పిట విప్పి - అతని చేతిని ముడిచేసింది.

"అన్నా నేపోతున్నా - పోయినంక జూస్కో -" రేణుక నవ్వుతూ ఇంట్లోకి వెళ్ళింది.

"నేను కూడా పోతున్నా - పలారం[1] పెట్టున్రు-" అంటూ దామోదరం దూరంగా వెళ్ళిపోయాడు

మల్లేశ్ గుప్పిట విప్పడానికి కాసేపు తటపటాయించాడు 'అనూరాధ ఏం పంపుంటుంది? ఏం సందేశం దాగి వుంటుంది?'

గడప మీదకు వంగి బొట్లు పెడుతున్న అనూరాధ అతని కళ్ళముందు కదలాడింది అదురుతున్న గుండెతో మెల్లిగా గుప్పిట విప్పాడు.

ఒక దొంతర మల్లెపువ్వు. దొంతర దొంతరలుగా వున్న రేకలతో చిన్న గులాబి పువ్వంత వుంది. ఆ ఒక్కపువ్వు అతని మనసును రసరమ్య లోకాల్లోనికి లాక్కెళ్ళింది.

ఆ ఒక్క పువ్వు మంజుల రాగాలు ఆలాపించింది. లలిత పల్లవలను చిగిర్చింది ఆ ఒక్కపువ్వు ఆ పూట అతని కంటిమీద కునుకు రాకుండా కాపలా కాసింది.

ఇంట్లోకి వెళ్ళిన రేణుకను అమ్మలక్కలు ఆటలు పట్టిస్తున్నారు. "అవ్‌గాని - రేణ్కా - నీవెంత చెప్పినా మీ వదిన నల్లాట్ది - కోడాలు నలుపంటే కుదురంతా నలుపు అంటరు-" నారాయణమ్మ మరదలు అనూరాధను నోటికి మూత లేకుండా వాగుతోన్న రేణుకను ఏడిపించడాన్కి అంది.

"మా వొదిన ఛామం ఛాయ! అయితే ఏమాయె! - బొంతకాకి కూడా తెల్లం గుంటది!" రేణుక వుక్రోషంగా అంది.

"మల్ల మీ అన్న తెల్లటోడు కాదే!" మరొక మాదిరి మూతిబిగ పెట్టి ఎక్కసిక్కాలాడింది.

"గా కాకి ముక్కుకు గీ దొండపండు -" రేణుక మేనత్త మేలమాడింది. రేణుకకు ఉక్రోషం ముంచుకొచ్చింది. నిస్సహాయంగా వెళ్ళి పెద్దమ్మను తన సాయనికి లాక్కొచ్చింది.

అమె రాగయుక్తంగా అంది, "ఎర్రదైనా మేడి పండు - ఇప్పితేను పురుగులుండు.

నల్లనీ నేరేడు పండు - నానా రుచూలుండు".

రేణుక ఇప్పుడే మంటూరాన్నట్లు వాళ్ళవైపు తిరిగి కనుబొమ్మ ఎగరేసింది వాళ్ళు రేణుకను చూసి కిసుక్కున నవ్వారు.

"నల్లనల్లా గుండ దానీ వొల్లదంటారేమో మీరు

నల్లరాగడి దున్ని చూడు తెల్లజొన్నలు పండవేమో-"

ఈసారి పెద్దమ్మతోపాటు రేణుక కనుబొమ్మ లెగరేసింది.

అందరూ పకపక నవ్వారు.

---

1 ఫలహారం

"ఇంక వొప్తం తల్లీ - మీ వొదినె చామంచాయ గానీ సొగసైంది-"

రేణుక విజయ సూచకంగా నవ్వింది

"అవ్‌మల్ల - మా వొదిన అంత ఎత్తున్న ఆడుపిల్ల ఈ నడిగడ్డ మింద వున్నదా? నేను గద్వాల్లనే చూడలే - ఇంగ ఆ జడ - ఆమె తలమీద పడిగె ఇప్పిన నల్లనాగు కాదూ?"

ప్రపంచంలోని మహావింతలన్ని గద్వాలలోనే వుంటాయన్నంత నమ్మకంగా రేణుక అంది.

"అవున్తల్లీ -" ఒకళ్ళు గంభీరంగా రాగం తీసారు

ఆడంగులు మళ్ళీ గలగల నవ్వారు

"అవ్ గానీ - వొదినె - వాళ్ళోల్లు ఎవ్వల్లు వంటి మింద తీరుగ సొమ్ములు పెట్టలే - గదేం ముచ్చట్నే?" రేణుక మేనత్త - రేణుక పెద్దమ్మను ఆరా తీసంది.

"గా సావిత్రమ్మ వంటినున్న సొమ్ములమ్మి సేను కొన్నది." అప్పుడే అక్కడికి వచ్చిన నారాయణమ్మ సంభాషణలో తల దూర్చింది

"గదేందే?" నారాయణమ్మ అక్క బుగ్గలు నొక్కుకుంది.

"సొమ్ములుంటే సోకుకి గానీ సేనువుంటే ఎన్ని సొమ్ముల ఎత్తు పంట పండ్తది? అంటరంట - మీ మరిది చెప్తుండె" అంది నారాయణమ్మ

"అవ్ నిజమే-"

"అదెట్లనే ఆడు మనిషన్నక సొమ్ముల సోకు చేయద్దా? అందంచందం వుండొద్దా?"

"అందం చందం ఎవ్వన్కి సుకముంటది!" నారాయణమ్మ కళ్ళముందు కంసాలి దగ్గర చేయించిన నగల బాకీ కదలాడింది

"మంచిగున్నది ముచ్చట!" అంది నారాయణమ్మ అక్క" అందరు మన తీరుగుంట్రా?"

"అవ్ గానీ వొదినె వాండ్లు పిల్లకు ఏం సొమ్ములు చేపిస్తున్రు-" నారాయణమ్మ మరదలు అన్నది.

"నేను అడిగితినా పెట్టినా? మీ అన్న ఒక్కమాట చెవిల పెట్టుండా? ఏమన్న చెప్పబోతే నీలొల్లి తోన మా దోస్తాని చెడపకు అని కసిరి కొడ్తడు-"

నారాయణమ్మ బాలయ్య మీద నిష్ఠూరపడింది.

"ఎందుకే అమ్మ ఊకే లొల్లి జేసుడు? వదిన జడ కన్నా ఆమె కండ్లకన్నా సొగసైన సొమ్ములుంటాయె?" అంది రేణుక.

"అవ్ బిడ్డా - మంచిగ జెప్పినవ్. అసలోన్కి మనసైంది. ఇంగ మనవెవ్వల్లం వొంకలెత్కనింకె-" లచ్చుమమ్మ బయటనుంచి వచ్చి వాళ్ళ పక్కన చతికిల పడుతూ అంది.

వీళ్ళు విడిదింట్లో తీరిగ్గా కబుర్లాడుతున్న సమయంలో రామనాథం వాళ్ళు వెళ్ళి పనుల్లో మునిగి తేలుతున్నారు. రామనాథం వాళ్ళు వదిలి వచ్చిన వూరినుండి - రామనాథం వాళ్ళ ఊర్లో వాళ్ళందరూ అందరు ఆ పెళ్ళింట్లోనే వున్నారు.

"ఆ పెట్రోమాక్స్ లైట్లు ఇట్టా వంటల దగ్గరికి పంపండి-" ఎవరో అరిచారు.

ఊరిలోని వంటలో చేయి తిరిగిన ఆడవాళ్ళంతా పెళ్ళి వంటకు కూర్చున్నారు. ఉళ్ళోని కత్తిపీటలన్నీ అక్కడకి వచ్చేసాయి. కూరగాయలు కోసిస్తూనే - రోటిదగ్గరో, అటూఇటూ సర్దుతూనో - రుచులు చూస్తునో - నూరుతోనే - దంచుతూనో - గరిటతో కలియ తిప్పుతునో - కట్టెలు ఎగదోస్తునో - అందరు ఆడవాళ్ళు అక్కడే వున్నారు. వరుసగా గాడులు తవ్వి - పొయ్యిలు తయారుచేసారు

పెద్ద పెద్ద అన్నం కాగులు లాంటివి మార్చడానికి - పొయ్యి మీద నుంచి దించడానికి మగవాళ్ళు సాయం చేస్తున్నారు గడ్డి మీద పంచె పరిచి వుడికిన అన్నాన్ని ఆరబోసారు. పున్నమ్మ, శాంతమ్మలుకు వంటలలోనే మునిగి పోయారు.

పద్మ, భారతి పెళ్ళి కూతురిని తయారు చేయడం - అతిథులకు మర్యాదలు చేయడం వడ్డనలు వగైరాలు చూస్తున్నారు

కళ్యాణి అనూరాధను అంటిపెట్టుకొని వుంది.

కొందరు ఆడవాళ్ళు దగ్గర ఓ ముక్కాలి పీట మీద పెట్రోమాక్స్ లైటు పెట్టుకొని పూలు అల్లుతున్నారు.

పెళ్ళి కూతురికి, పెళ్ళిమంటపానికి, వచ్చే ముత్తైదువులని ఇవ్వడానికి చాలా పూలు అల్లాలి

హుషారుగా కబుర్లు చెప్పుకుంటూ, పరాచికాలాడుతూ మాలలల్లుతున్నారు. సరళ అనూరాధకి అరచేతుల్లో గోరింటాకు పెడుతోంది ప్రధానం చేసి అప్పుడే మగపెళ్ళి వారు విడిదికి వెళ్ళిపోయారు ఈ పూటకి వారికి అక్కడే భోజనాలు వడ్డించారు.

సావిత్రి అన్నింటా తానే అయ్యి అటూ ఇటూ బొంగరంలా తిరుగుతూనే వుంది.

అనూరాధ బాబాయిలు, వాళ్ళ భార్యలు - పిల్లలు అంతా వచ్చారు ఆడవాళ్ళిద్దరూ అనూరాధనే అంటిపెట్టుకూర్చున్నారు.

"అవునే అనూరాధా - అదేం మోటు మనుషులే - ఆపళంగా జడ కుదుళ్ళొంచి వూడొచ్చేట్టు లాగింది - ఆ అమ్మాయి." పెద్ద పిన్ని ముక్కున వేలేసుకుంది.

ఆ అమ్మాయి అమర్యాద ప్రవర్తనకు అనూరాధ బాధ్యత వహించాలన్నట్టుగా వుంది. పెద్ద పిన్ని ధోరణి.

"మీ మేనమామలు ఏ మాత్రం నగలు చేయించారే"- చిన్న పిన్ని అనూరాధ మెడలో గొలుసులు సవరిస్తూ అంది.

అనూరాధ సరళవైపు ఇబ్బందిగా చూసింది. సరళ వాళ్ళంతేలే అన్నట్లు ఒక చిరునవ్వు నవ్వి తలాడించింది.

"గాజులు మిరియం పెట్టించకుండా ఇట్టా చేయించారేంటి" పెద్ద పిన్ని అనూరాధ చేయి ఎత్తి - పెట్రోమాక్స్ లైట్ వెలుతురులో గాజుల డిజైన్ పరీక్షిస్తూ - అంది.

"అవున్లే - ఏ పాత బంగారవో కరిగించి చేయించినట్లున్నారు-" పెద్ద పిన్ని విషయం కనుక్కునేసాను సుమా అన్నట్లు కనుబొమ్మలు ఎగరేసింది.

"అదేం కాదు - కొత్త బంగారమే ఆ మెరుగు చూడుక్కాయ్" చిన్న పిన్ని పెద్ద పిన్ని మాటకు అడ్డొచ్చింది.

"అవునమ్మాయ్ - సరళా - మీ నాన్నాళ్ళు అనూరాధకు ఏ మాత్రం ఇస్తన్నారేంటి?" చిన్న పిన్ని సరళని ఆరాతీసింది.

అనూరాధ బిక్కమొహం వేసి సరళవైపు చూసింది. అనూరాధ తల్లి దమయంతి పెద్ద గొలుసు పెద్ద పిన్ని మెడలో వుండటాన్ని - నాలుగు జతల గాజులను చిన్నిపిన్ని అలంకరించడాన్ని సరళ గుర్తించింది. సరళకు వళ్ళు మండిపోయింది.

వాళ్ళకి తగ్గకుండానే సమాధానం ఇచ్చింది, "మీరెరక్కుండా మా నాన్నేళ్ళేం పెడతారూ! నగలంటే మా దమయంతత్త నగలు ఎట్లాగ వుండె మీరు పెళ్లికి వస్తారు - అనూరాధకి ఆళ్ళమ్మ నగలు ఇచ్చేస్తారని - మా నాన్నాళ్ళు దీనికి బంగారమే కొనాలా .... అనూరాధ వంటిమీద వేసుకున్నవి నావి పద్మవీ-"

సరళ చివరి వాక్యం కావాలనే అబద్ధమాడింది. సరళ ఆ వాక్యాన్ని వత్తివత్తి పలికింది పిన్నులిద్దరూ గతుక్కుమన్నారు.

"పున్నమామ్మని పలకరించి వస్తాముండు" అంటూ ఇద్దరూ అక్కణ్ణించి గబగబ వెళ్ళిపోయారు.

అనూరాధ, సరళ ఫక్కుమన్నారు.

"మొత్తానికి - భలే మనుషులే అనూరాధ వాళ్ళు!"

వీళ్ళు వేళాకోళాలాడి వదిలేసినా పున్నమ్మ వాళ్ళిద్దర్ని శుభ్రంగా కడిగేసింది.

సావిత్రి వచ్చేసరికి - వాళ్ళు నగలు తీసి పున్నమ్మ చేతిలో పెడుతూ అంటున్నారు - "పెళ్ళికూతుర్ని చేసినప్పుడు ఇచ్చేద్దాం లెమ్మని అనుకున్నాం మేమొచ్చేసరికి పెళ్ళి కూతుర్ని కూడా చేసేస్తిరి -" వాళ్ళు మింగలేక కక్కలేక నిష్టూరాలకి దిగారు.

వాళ్ళు ఇక్కడికి వచ్చేముందే ఇక దమయంతి నగలకి తమకీ రుణం తెగిపోయిందని తెలుసుకొనే వచ్చారు. అక్కడికి అనూరాధ పెద్దపిన్ని దమయంతి పాపటిసేరు, చంద్రవంక, సూర్యవంకలు, ఎర్రరాళ్ళ బుట్టలు, చెంపసరాలు తన కూతురికి దాచి పెట్టేసింది. చిన్నపిన్ని - దమయంతి కల్యాణ వుంగరాన్ని నల్లపూసల గొలుసునీ మంగళ సూత్రాన్ని తాను

వాడేసుకుంటుంది. పున్నమ్మ తన కూతురికి చెందిన నగలు ఎంతో ముచ్చటపడి చేయించుకుంది. ఒక్కగానొక్క కూతురి వంటిమీద వాటిని కళ్ళారా జూసుకోకముందే దమయంతి కాలంలో కలిసి పోయింది. పున్నమ్మ కూతుర్ని తలుచుకొని కళ్ళ నీళ్ళు నీళ్ళెట్టుకుంది.

సరళ అనూరాధకు గోరింటాకు పెట్టేసింది - చేతులు కడుక్కుని వచ్చేసరికి పున్నమ్మ దమయంతి పెద్ద గొలుసును గాజుల్ని ఎర్రరాళ్ళ పట్టెడను కుంకుడు కాయరసం వేసి రుద్దుకు రమ్మని పురమాయించింది.

రామనాథం వాళ్ళు బయట మంచం వేసుకుని కాసేపు నడుం వాల్చారు. అనూరాధ బాబాయిలు రామనాథంతో కబుర్లు చెపుతున్నారు మరి కొందరు పెద్దలు కూడా వారి చుట్టూ చేరారు.

"ఏమైనా మీరీ సంబంధం కుదిర్చే ముందు మాతో ఒక్కమాటన్నా చెప్పాల్సింది-" అనూరాధ పెద్ద బాబాయ్ నిష్ఠూర పడ్డాడు.

రామనాథం అతని ముఖంలోకి విచిత్రంగా చూసాడు. దమయంతి చనిపోయాక పసి పిల్లను తమ యింటికి తీసుకొస్తే ఈనాటికి తీసుకెళ్ళింది లేదు. అనూరాధకి సంబంధించిన ఓ ముఖ్యమైన నిర్ణయం తీసుకోవడానికి వాళ్ళకేం సంబంధం?

"అబ్బబ్బా -వాళ్ళు మనుషులా? ఆ మాటతీరు - కట్టుబొట్టు - ! అయినా రొట్టెలు తినే కొంపలో పిల్ల ఏం సుఖపడుద్ది - ?" చిన్న బాబాయి తేల్చేసాడు

'వీళ్ళు మనుషులు!' రామనాథం నవ్వుకున్నాడు. 'తోడబుట్టిన అన్న చస్తే పంచడానికి ఓ వాటా మిగిలింది లెమ్మని ఆనందించే వీళ్ళు మనుషులు! ఇప్పుడు అనూరాధ తాలూకూ వాటా ఇవ్వబోతున్నారా లేదా?'

"అనూరాధకి ఏ మాత్రం ఇస్తున్నారూ?" పెద్ద బాబాయి ఆరాతీసాడు. రామనాథానికి నవ్వొచ్చింది. పెంచుకున్నదికాక పెళ్ళి చేయాల్సినదీ మీరే సుమా -'అన్న భావం పెద్ద బాబాయి ముఖంలో స్పష్టంగా కనబడుతోంది.

"మేమిచ్చేదెలాగు ఇస్తాం. కాకపోతే అనూరాధ వాళ్ళ కన్నతండ్రి ఆస్తివిషయం మీరు చెప్పాలి." రామనాథం నిగూఢంగా నవ్వుకుంటూ అన్నాడు.

"మా అన్నయ్య పేర అస్తేంవుంది? మా వదిన కట్నం కింద చేను మీరే వుంచుకుంటిరి - అసలు ఆ పొలాన్ని ఎంత పెంచారో చెప్పాలి మీరు-"

రామనాథానికి బాగా నవ్వొచ్చింది. పగలబడి నవ్వాలనిపించింది. వాళ్ళ ప్రవర్తన ఇప్పటికిప్పుడు మీదపడి రామనాథం ఆ ఆస్తి లాగేసుకుంటాడేమోనన్నట్లుగా వుంది. రామనాథానికి ఆ ఉద్దేశమే లేదు. అందుకే ఇక వాదాలకు దిగకుండా అనూరాధ కిస్తోన్న ఆస్తిపాస్తుల వివరాలు చెప్పాడు.

"అన్నీ బానేవున్నాయి - కానీ మన పక్కేమన్నా పెళ్ళికొడుకులకు కరువొచ్చిందా? ఇట్టాంటి సంబంధం చూడ్డం? అయినా మేనరికమేగా మీ అబ్బాయికి చేసుకొన్నా ఓ తీరుగా వుండేది-"

మానుతున్న పుండు మళ్ళీ కెలికినట్లయింది పెళ్ళిమంటపానికి గుంజలు పాతుతున్న సుదాకర్ కాలు గుంజతోపాటు గుంటలోకి దిగబడింది

శివుడు సుధాకర్‌ను నెమ్మదిగా పైకి లేపాడు

"జాగ్రత్తరా - పరధ్యానంగా వుంటే ఎలారా? కాస్తుంటే పలుగు కాలిమీద పడేది -" శివుడి గొంతు తడితడిగా అంది.

"పడితే కాలిమీదా కదా అన్నయ్య-"

సుధాకర్ కాలు సవరించుకొంటూ మామిడి తోరణాలు కట్టేవారి దగ్గరికి వెళ్ళాడు

శివుడు, రామనాధంవైపు చూసాడు వారిరువురి తడి చూపులు క్షణకాలం కలుసుకొని నేలకు వాలాయి

"మ్మరోలా అనుకోకండి - మనపక్క చాలా గొడవులుగా వుంది హైకోర్టు కొట్టేసిన ముల్కీ రూల్స్ కేస్‌ని ముఖ్యమంత్రి సుప్రీం కోర్టుకి పంపించారంటగా - ఆ విషయం మీద అందరూ అగబ్బుగా చెప్పుకుటున్నారు మనపక్కంతా మరో రాష్ట్రం అయితీరుతుందంటున్నారు మీరు కూడా మన పక్కకి వచ్చేస్తే పొయ్యేది. మొన్నామధ్య ఎంత గొడవ చేసారు . కనిపించిన మనిషినల్లా తరిమికొట్టిందాకా ఊరుకోలేదటగా .."

"మాకు అలాంటిదేమీ లేదు - ఓసారి అలాంటి ప్రయత్నం చేయబోయినా అందరూ కలిసికట్టుగా తరిమి కొట్టారు . "

"ఏవన్నా చెప్పండి - మనలాగా పొలంపుట్రా గొడ్డుగోదా వున్నాడికి ఈటిని ఎళ్ళ మార్చేసరికే తలప్రాణం తోకలోకొచ్చుద్ది - ఇంక ఈ పక్క ఆ పక్క అంటూ గోలలు గొడవలు చేసే తీరికెక్కడ వుండి చచ్చుది - " అప్పటి దాకా ఆ మాటలు వింటున్న ఓ ముసలి రైతు ముక్తాయించాడు.

అప్పుడే సావిత్రికి అనూరాధ ఏమైనా తినిందో లేదోనని జ్ఞాపకం వచ్చింది. గబగబ కాస్త పెరుగన్నం కలుపుకుని అనూరాధ దగ్గరకి వెళ్లింది.

అనూరాధ పిన్నులు, మరికొంతమంది కూర్చుని వెళ్ళి వారు తెచ్చిన ప్రధానం పెట్టె తెరిచి దాంట్లో వున్నవి పరీక్ష చేస్తున్నారు.

తాము కూడా యార్నాల పెట్టె సర్దాలన్న సంగతి సావిత్రికి జ్ఞాపకం వచ్చింది.

"అమ్మాయ్ అనూరాధా కాస్తట్లా నడుం వాల్చకపోయామ్మా - మళ్ళీ కోడికూసేలోగా తయారవ్వాలి" - సావిత్రి గబగబ అనూరాధ దగ్గరకి వెళ్ళి:ది. అప్పటికే నిద్రలేమితో అనూరాధ తలంతా భారంగా అయ్యింది.

అనూరాధ అరచేతుల్నిండా గోరింటాకు ఆరబెట్టుకుంటుంది సావిత్రి పెరుగన్నం ముద్దలు చేసి ఒక్కోముద్దనోట్లో పెడుతూ - మగపెళ్ళివారి సారెపెట్టెలో ఏం పెట్టారో చూస్తూవుంది

"అదేంటే సావిత్రి - ఇన్ని చీరలు పెట్టారేళ్ళు -' అనూరాధ పెద్దపిన్ని బుగ్గలు నొక్కుకుంది "పెట్టెనిండా ఎండు కొబ్బరి చిప్పలే"

"పెడితే కూడా పాపమేనా" సావిత్రికి నవ్వొచ్చింది

"వాళ్ళు చీరెలు సారెలకు ఎక్కువ ప్రాధాన్యత ఇస్తార్లే వదినా -మనల్ని కూడా కొబ్బరి కుడుకలే పెట్టమన్నారు-'''

వాళ్ళు ఒక్కోచీర బయటకు తీసారు రేణుక, నారాయణమ్మ స్వయంగా వెళ్ళి తీసుకొచ్చిన గద్వాల కొత్తకోట చీరలు - నారాయణమ్మ అక్కవస్తూ వస్తూ తెచ్చిన నారాయణ పేట చీరలు ఆడపెళ్ళివాళ్ళ కళ్ళు చెదిర్చాయి

అరచేయంత వెడల్పు జరీ బోర్డర్ల మేలైన గద్వాల చీరలు - కళకళలాడే రంగుల కొత్తకోట జరీపట్టు చీరలు - కలనేతలు కడ్డీ అంచుల నారాయణపేట నాణెంపు చీరలు అక్కసుతో వాళ్ళ కళ్ళు చిన్నవయ్యాయి.

"ఆ ... మరీ ముతక చీరలు! మన్లాంటి ముసలమ్మలు కట్టుకుంటే బావుంటయ్యి కానీ - చిన్న పిల్లలకేం బావుంటయ్యే సావిత్రి ఇయ్యి?" అక్కసంతా వెళ్ళగక్కుతూ అంది అనూరాధ చిన్నపిన్ని

"వాటికేం తక్కువమ్మా - ! ఆ చీరాల మూటలాడి దగ్గర మూడు - ముక్కలు కలిపి కుట్టించుకున్న సిలుకు చీరలయితే ముడ్డిమీద జారతా బాగుంటయి కదే కల్లాలా!" పున్నమ్మ ఎప్పుడు వచ్చిందో అనూరాధ వాళ్ళ పిన్నికి వాత పెట్టింది

"ఉన్న మాటన్నాను - ఉలుకెందుకూ?" ఆమె మూతి మూడు వంకర్లు తిప్పింది.

"అమ్మాయ్ భారతి ఇట్టారండీ - తలంబ్రాల చీరతీసి పెట్టండి. మళ్ళీ పొద్దున్నే హడావుడి అవుద్ది" - పున్నమ్మ కేకేసింది.

భారతి వచ్చి రాయంచ రంగుకు తామర రేకల బోర్డరు వున్న గద్వాల చీరను పక్కకు తీసి పెట్టారు.

"అబ్బ - వీటిని చూస్తుంటే అలానే కట్టేసుకోవాలని పిస్తుందే" - అంది సరళ -

"అవును - అరిటాకు పచ్చ చీర చూడు - " భారతి నారాయణపేట చీరను పైకి తీసింది.

"నాకు ఈ గంధం రంగు చీర నచ్చింది -" సరళ ఓ గద్వాల చీరను పైకి లాగింది

అందరూ ఎందుకునో గలగల నవ్వారు.

అనూరాధ మాటలకు నవ్వులకు ఏమాత్రం స్పందించడంలేదు

ఆమె ఈ గోలకంతా అతీతంగా అంది. సావిత్రి తినిపిస్తోన్న గోరుముద్దల మాధుర్యం ఆమెకు తెలియని దుఃఖాన్ని రగిలిస్తోంది.

"తన పిన్నుల లాంటి వాళ్ళ మధ్యన సావిత్రి లాంటి వాళ్ళు - ఆప్యాయత అనురాగం తప్ప మరేం పంచడం చేతకాని ఈ ఇంట్లోని ప్రతి వ్యక్తీ - తనకిక పరాయి వాళ్ళయి పోతారా-"

అనూరాధకు పొలమారింది.

"ఉండవే -" సావిత్రి మంచినీళ్ళు తాగించి - ఎడం చేత్తో అనూరాధ తలమీద తట్టింది

"అమ్మాయిగార్ని ఎవరో తలుచుకుంటున్నారు-" భారతి కొంటెగా నవ్వింది.

"నేను మాత్రం కాదు బాబోయ్" పద్మ హాస్యానికి చేతులు పైకెత్తేసింది.

"నువ్వు నేనూ ఏవిటే - తలుచుకొనేవాళ్ళే తలుచుకొని వుంటారు" - ఓ రాగం తీసింది సరళ.

అనూరాధ ముఖాన సిగ్గుతెర కమ్మింది. సిగ్గు కనిపించనివ్వకుండా ప్రయత్నిస్తూ అనూరాధ వారివైపు ఓ కోరచూపు విసిరింది.

"అనూరాధకి కోపం వచ్చేస్తుంది. అమ్మాయిలు జాగ్రత్త - పక్కకు తప్పుకోండి-"

పద్మ గంభీరంగా అనూరాధ ముఖంలో ముఖం పెట్టి అంది.

అందరూ ఫక్కుమన్నారు.

"చూడు .. అత్తయ్యా ..." గారాలు పోతూ ఓ రాగం తీసింది అనూరాధ

"ఇదుగో అమ్మాయ్ - గారాలు అలకలు ఇంక మా దగ్గర సాగవు. సాగనిచ్చేవాళ్ళ దగ్గర సాగించుకో - తెలిసిందా?" నవ్వాపుకుంటూ అంది సరళ.

"అబ్బ ఊరుకోండే - దాన్నికాసేపు కునుకు తీయనియ్యండి. లేకపోతే రేపొద్దున పీటల మీద తూగుతుంది. మీరు కూడా కాసేపు పడుకో కూడదు - అట్టా వసపిట్టల్లా వాగకపోతే - ' సావిత్రి లేచి వంటింట్లోకి వెళ్ళింది.

సావిత్రి గాబు దగ్గర పళ్ళెం కడుగుతూ ఉదాసీనంలో పడిపోయింది. "అనూరాధని ఎవరు తలుచుకుని వుంటారు? సుధాకర్ .... ?" సావిత్రి కళ్ళల్లో నీళ్ళు చిప్పిల్లాయి." పిచ్చి నాయన ఇంత ముద్దన్నా కతికాడోలేదో-" సావిత్రి చుట్టూ చూసింది.

సుధాకర్ శివుడు మరి కొందరు యువకులు పెళ్ళి మంటపం గుంజలకు కొబ్బరి మట్టలు కట్టి, గుంజల చుట్టూ కొబ్బరి ఆకులు అల్లుతున్నారు.

సుధాకర్ కళ తప్పిన ముఖాన్ని సావిత్రి దూరాన్నుంచే గుర్తించింది. మనసూరుకోక పెరుగన్నం కలుపుకొని గబగబ సుధాకర్ దగ్గరకి వెళ్ళింది.

శివుడు సావిత్రి కళ్ళల్లోని సూటిగా చూడలేకపోయాడు. సుధాకర్ అన్నం తిన్నాక ఇద్దరు దీక్షగా మంటపం తయారీలో నిమగ్నమయారు.

సావిత్రి కాసేపు వారి వాలకం చూసి వంటల వారిని కలుసుకుంది. సుధాకర్ వాళ్ళు మంటపానికి కొబ్బరాకులు అల్లి, తోరణాలు కట్టే సరికి ఆడవాళ్ళు అల్లిన పూల మాలలు - బుట్టలలో పెట్టుకుని బయటకు తెచ్చారు.

"రెండు మల్లెల వరుసలు ఒక కనకాంబరాల వరుస, ఒక దవనం వరుస - తెలిసిందా - జాగ్రత్తగా కట్టాలి-" శివుడు అందర్నీ పూరమాయించారు.

పందిరి గుంజలన్నిటిని కలుపుతూ మామిడాకుల తోరణాలు కట్టారు. ఆవరణంతా ఆక్రమించిన విశాలమైన పందిరి కొత్త తాటాకుల వాసన విచ్చిన మల్లెల వాసనతో కలిసి తమాషా అయిన సువాసన వస్తోంది

"ఎదుర్కోలు కెళ్ళాలి అబ్బాయ్, అది పూర్తవగానే వీరిద్దరు వెళ్ళి స్నానాలు చేయండి.

అప్పుడే చుక్కలు అటు తిరుగుతున్నాయి. ఇప్పుడో అప్పుడో వేగు చుక్క పొడి చేట్టుంది-" రత్తయ్య హడావుడి చేసాడు.

పున్నమ్మ ఆడవాళ్ళందర్నీ నిద్రలేపింది

ముత్తైదువులందరూ కలిసి అనూరాధను ముక్కాలి పీటమీద కూర్చోపెట్టి - వెన్నపూస పూసారు. సున్నిపిండితో పచ్చి పసుపు మీగడ కలిపి నలుగు పెట్టారు తలకు ఆముదం అంటి - కుంకుడు రసంతో తలంటారు సాంబ్రాణి ధూపమేసి జుట్టు ఆరబెట్టారు. చిక్కులు తీసి - పూల జడకు సిద్ధం చేసారు. సావిత్రి పూలజడ వేయడంలో ప్రసిద్ధి. ఆ పూట ఇక్కడో కాలు అక్కడో కాలు వేస్తూ మనస్ఫూర్తిగా జడవేయలేక పోయానని వాపోయింది.

భారతి పెళ్ళికూతురికి చక్కగా కుచ్చిళ్ళు పెట్టి - చీరకట్టింది. నిండు ఆకుపచ్చకు చంద్రకాంతం రంగు బోర్డరు కంచిపట్టు చీర.

పద్మ పెళ్ళి కూతురి మెడలో నగలు సర్దింది.

సరళ ఆమె చేతికి గాజులు తొడిగింది.

శాంతమ్మ ఆమె కాళ్ళకు పసుపు రాసింది.

సావిత్రి పసుపు సున్నం కలిపి, ఆమె కాళ్ళకు పారాణి పెట్టింది.

భారతి తలమీద పాపటి సేరు, పాపటికి ఆ పక్క ఈ పక్క చంద్రవంక, సూర్యవంకలు - సిం .ారించింది. తలమీద నాగరం, పూల జడలో రాళ్ళ బిళ్ళలు పద్మ పెట్టింది.

సరళ కాళ్ళకు అక్కడక్కడా రాళ్ళు పొదిగిన మామిడి పిందెల వెండి గజ్జెలు పెట్టింది.

సావిత్రి చివరికి కళ్ళకు కాటుక రేఖలు పెట్టింది. నుదుటన కళ్యాణ తిలకం తీర్చి దిద్దుతోంటే - మంటపానికి కొబ్బరాకులు అల్లుతోన్న కొడుకు కళ్ళముందు మెదిలాడు.

సావిత్రికి చేతులు వణికాయి. కాటుకను చిటికిన వేలితో తీసి అనూరాధ బుగ్గన చుక్క పెట్టింది.

కొత్త పూలతో కళకళలాడుతోన్న లతలా అనూరాధ పెళ్ళి కళతో కొత్త అందాలు సంతరించుకుంది

సావిత్రి కళ్ళనీళ్ళు సుళ్ళు తిరుగుతుంటే అనూరాధ శిరసున ముద్దాడి గబగబ అక్కణ్ణించి వెళ్ళి పోయింది

"అనూరాధ పెళ్ళి కూతురాయెనే ... మా అనూరాధ పెళ్ళికూతురాయెనే" అమ్మాయిలందరూ రాగయుక్తంగా పాడుతూ, నవ్వుతూ అనూరాధను ఆటలు పట్టిస్తున్నారు

"అచ్చం దమయంతిలా వుంది" అందరూ తల్లిని తలుచుకున్నారు.

'పండంటి బిడ్డని కళ్ళారా చూసుకొనే బాగ్గెం కన్నతల్లికి లేకపోయెనే -' అను కొంటూ పున్నమ్మ కళ్ళనీళ్ళద్దుకొంది

"అమ్మాయ్, కాసినీ పాలు అనూరాధకు తాగించడమ్మా - మళ్ళీ గౌరీపూజ దగ్గర కూర్చుంటే పెళ్ళిపీటల మీద నుంచి లేచేదాకా ఏమీ తినకూడదు -" శాంతమ్మ పాలగ్లాసుతో వచ్చింది.

అనూరాధ మనసున మధుర తంత్రులు మీటుతూ మంగళవాయిద్యాలు మోగాయి

"గౌరీపూజకి వేళవుతుంది - అమ్మాయిని తీసుకురండి -" శాస్త్రిగారు కేకేసారు.

పున్నమ్మ వాళ్ళు వస్తూ వస్తూ తమ వూర్నించి శాస్త్రిగార్ని తీసుకొచ్చారు . బాలయ్య వాళ్ళు పంతులుగార్ని తీసుకొచ్చారు.

కొబ్బరి కాయకు రవిక గుడ్డ చుట్టిన కలశంలో నీళ్ళుపోసి - మామిడాకులు అమర్చారు. మామిడాకుల పాత్తిమీద రవికగుడ్డ చుట్టిన కొబ్బరి కాయ కుదురుగా కూర్చుంది.

తమలపాకు మీద పసుపు ముద్దపెట్టి - కుంకుమ బొట్టు పెట్టారు. శాస్త్రిగారు బాసికాలు, కొబ్బరి బోండాం - పెట్టి పూజ చేసారు. పెద్దముత్తైదువ శాంతమ్మ అనూరాధ నుదుటిన బాసికం కట్టింది.

పసుపు కొమ్మును పసుపు రాసిన దారంతో ముడేసి అనూరాధ ముంజేతికి పెళ్ళి కంకణం కట్టారు శాస్త్రిగారు. సరళ కుడిచేతి గాజులు పైకి సర్దింది.

అనూరాధ దోసిలి పట్టింది. దోసిట్లో తమలపాకులు వక్కలు పెట్టారు. కొబ్బరి బోండాన్ని దోసిట్లో పెట్టారు.

అనూరాధ పెళ్ళి కూతురు అయ్యింది. పెద్దలు అందరూ వచ్చి ఒక్కొక్కరుగా అనూరాధను ఆశీర్వదిస్తున్నారు. ఈ లోగా శాస్త్రిగారు, పెళ్ళి కొడుకు బాసికం కట్టడానికి విడిది ఇంటికి బయలు దేరారు.

రత్తయ్య, రామనాథం, మరి కొంత పెద్ద మనుషులు ముత్తైదువులు పెళ్ళి కొడుకు పెళ్ళి మంటపానికి తీసుకురావడానికి ఎదుర్కోలు తీసుకెళ్ళారు

ఒక తెల్లని దుప్పటిని మధ్యలో ఒక కర్రతో పట్టుకొన్నారు ఒకరు. నాలుగు వైపులా నలుగురు దుప్పటి అంచులు పైకెత్తి పట్టుకొన్నారు మంగళవాయిద్యాలు మోగుతుండగా విడిది ఇంటికి బయల్దేరారు.

మల్లేశ్‌ను పీటమీద కూర్చోబెట్టి - బాసికం నుదుటిన కట్టారు - తమలపాకులు వక్కలు - అరటిపళ్ళు అతని దోసిలిలోపెట్టారు.

రత్తయ్య కొద్దిగా పానకం తాగించాడు.

పెద్దలందరూ దీవించారు.

పెళ్ళికొడుకును పెళ్ళిమంటపానికి తీసుకొని వచ్చారు.

అనూరాధకు అన్నదమ్ముల వరుసయ్యేవాడు వాళ్ళ బాబాయి కొడుకు ఒక్కడే వాడు పెళ్ళికి రాలేదు. శివుడే ఆ ఆనవాయితీలన్నీ పూర్తి చేయాలనుకొన్నాడు

పెళ్ళి కొడుకును పెళ్ళిపందిరి ముందు ఆపారు. ముంగిట్లో వేసిన పెళ్ళి ముగ్గు మీద తాంబాళం పెట్టారు.

పెళ్ళి కొడుకును చెప్పులు విడిపించారు. తాంబాలంలో కాళ్ళు పెట్టించారు. శివుడు చెంబుతో నీళ్ళు, భుజాన కండువాతో సిద్ధంగా వున్నాడు వంగి పెళ్ళికొడుకు మీద ఎడంచేత్తో చెంబునీళ్ళు ధారగా పోసాడు. కుడిచేత్తో కడగబోయే, లోపలే సుధాకర్ పెళ్ళికొడుకు కాళ్ళు కడిగాడు. శివుడు అతని ముఖంలోకి విస్మయంగా చూసాడు.

సుధాకర్ ముఖంలో ఏ భావమూ లేదు - శివుడు పక్కగా వున్న రామనాథం వైపు చూసాడు. రామనాథం సన్నగా నవ్వుతూ తలాడించాడు.

మల్లేశ్‌కి కాళ్ళు కడిగించుకోవడమే మహా ఇబ్బందిగా వుంది. అదీ సుధాకర్ తోనా?

సుధాకర్ శివుడి భుజం మీది కండువా తీసుకొని, పెళ్ళికొడుకు కాళ్ళు అద్దాడు

"బామ్మర్ది కట్నం - బామ్మర్ది కట్నం" ఎవరో అన్నారు. బాలయ్య నవ్వుతూ జేబులోంచి నోట్ల పొత్తి తీసాడు.

మల్లేశ్ సుధాకర్‌ని ఆప్యాయంగా ఆలింగనం చేసుకొన్నాడు శివుడు రామనాథం సంతృప్తిగా నిట్టూర్చారు.

ఎవరో పావుకోళ్ళు తెచ్చి అక్కడ పెట్టారు. తాంబాళంలోంచి నేరుగా పాదాలను పావుకోళ్ళలో దూర్చాడు మల్లేశ్.

కొయ్య పావుకోళ్ళు జారిపోతుంటే బొటన వేళ్ళతో పట్టుకోసం ప్రయత్నిస్తూ - అడుగుతీసి అడుగు వేయడంలో మల్లేశ్ అటూఇటూ వూగిపోతున్నాడు. మల్లేశ్ పడిపోకుండా శివుడు సుధాకర్ చెరోవైపు పట్టుకొన్నారు.

పెళ్ళికొడుకు పెళ్ళిపీటల మీద కూర్చున్నాడు.

పంతులుగారు పెళ్ళికంకణం కట్టి - ఏదో కార్యక్రమం చేస్తూ అన్నారు "పెళ్ళికూతుర్ని తీసుకురండి"

"వాయించండి - మేళాలు --"

అనూరాధ పెళ్ళి పందిట్లోకి అల్లన మెల్లన పిల్ల తెమ్మెరలా నెమ్మదిగా కదిలి వచ్చింది. కళ్ళెత్తి చూద్దామనుకొన్న మల్లేశ్ ఆమెను చూసి గుడ్లప్పగించేసాడు.

నీలాకాశంలాంటి నల్లని తలకట్టుపై సూర్యచంద్రుల్లా మెరుస్తోన్న సూర్యవంక, చంద్రవంకలు - ఆకాశంలో తారలన్నింటిని ఏర్చికూర్చి మల్లెల్లా మార్చి అలంకరించిన పూలజడ - ప్రకృతి శోభనంతా ప్రతిబింబిస్తూ పచ్చగా కళకళలాడుతోన్న కంచి పట్టుచీర- పాదవాటి వేళ్ళకు పూచిన ఎర్రని గోరింట మొగ్గలు, విప్పారిన దోసిట్లో తమలపాకులు మధ్య కుదురుగా కూర్చున్న కొబ్బరి బోండాం - వాలిన కళ్ళ తుమ్మెద రెక్కలు - నునుసిగ్గు దోబూచులాడుతున్న బుగ్గలలో దాగిన తామర మొగ్గలు - మల్లేశ్ కళ్ళకు అనూరాధ తెల్లవారి వెలుగులో నడిచి వస్తోన్న నవ వసంతంలా వుంది.

శాస్త్రిగారు - పంతులుగారుకన్యాదానం ముందు చేయించాలా - జీలకర్ర బెల్లం ముందు పెట్టించాలా అని చర్చల్లో పడ్డారు.

"చామంచాయైనా నీ కోడాలు చక్కట్డీ - నారాయణి" నారాయణమ్మ అక్క దూరం నుంచే మెటికలు విరిచింది.

"నే ముందుగాల్నే చెప్పలే - మా వదినె వరాల మొగ్గని-" రేణుక మురిపెంతో అంది.

వెండివో - బంగారువో పెళ్ళికొడుకు వారు అందరూ అడ్డిగ, నాను, చంద్రహారం కొప్పున నాగారాలు, సంపెంగ మొగ్గలు - రాళ్ళ బిళ్ళలు అలంకరించుకొన్నారు. చెవులకు మకర కుందనాలు, మాటీలు ఒకరిద్దరు చెవి తుమ్మె చుట్టూ జిలేబి గొలుసు అలంకరించారు. చేతుల్నిండా మట్టిగాజులు, ముందు కంకణాలు వెనుక రాళ్ళ గాజులు - ముక్కుకు అర్ధ చంద్రకారపు వెడల్పాటి ముక్కు పుడకలు. ఒంటిరాయి ముక్కు పుడకలు. బాసర అలంకరించు కున్నారు.

"అనూరాధకి మంచి అత్తారే దొరికారు -" పెళ్ళికూతురి తరుపు ఆడవాళ్ళంతా తృప్తిగా తలాడించారు.

తేటగా, నిర్మలంగా వున్న ముఖంతో - ధీమాగా చూస్తోన్న కళ్ళు-చిరునవ్వుతో విచ్చుకున్న పెదవులతో, చక్కని శారీర సౌష్టవము గంభీరమైన నడకతో మల్లేశ్ పెళ్ళికూతురి తరపు మగవాళ్ళ సందేహాల్నిటిని పటాపంచలు చేశాడు.

"ఈడు జోడూ చక్కగా కుదిరింది-" రామభద్రయ్యగారి చిన్నబ్బాయి తృప్తిగా తలాడించాడు.

"రామనాథం మరి ఆ మాత్రం ఆలోచించకుండా నిర్ణయం తీసుకొంటాడూ-" ధర్మయ్యగారి మేనల్లుడు దీర్ఘం తీసాడు.

"ఎంతైనా చెప్పండి - ఆళ్ళ అలవాట్లు ఆచారాలు మనం ఎరగం పిల్లకు పాట్లు తప్పదు. పెళ్ళినాడు మురిసినట్టు కాదు ముందుంది ముసళ్ళ పండగ-" అనూరాధ చిన్న బాబాయి అన్నాడు.

"నిజమే .... నిజమే ...." నర్సయ్య మళ్ళీ నిర్ధారించాడు

"గప్పుడ్నే పిల్ల, పిల్లగాడు జీలకర్ర బెల్లం పెడ్తుర్రే-" నారాయణమ్మ అక్క తలెత్తి నిక్కి చూసింది.

"పెద్దమ్మా తెరకూడా తీసిర్రు." రేణుక సంబరంగా అంది.

"అదేంటే అమ్మోయ్ జీలకర్రా బెల్లం నిలబెట్టి పెట్టిస్తున్నారు?" అనూరాధ పెద్దపిన్ని బుగ్గలు నొక్కుకుంది.

మల్లేశ్ అనూరాధల మధ్య పలుచనితెర పక్కకు తొలిగింది.

మల్లేశ్ అనూరాధకు ఓ మొద్దబ్బాయిలా గుడ్లప్పగించి చూడకూడదని అనుకుంటూ బలవంతంగా తనకి తాను నిగ్రహించుకొంటూ ఆమె తల మీద జీలకర్ర బెల్లం పెట్టాడు. వణుకుతున్న చేతిని మెల్లిగా పైకెత్తి కళ్ళు ఎత్తకుండానే మల్లేశ్ తలమీద జీలకర్ర బెల్లం ముద్దపెట్టింది అనూరాధ -

"కాసేపు అలాగే వుంచండి-" పంతులుగారు గడగడ మంత్రాలు చదువుతూ మధ్యలో మంత్రంలాగానే అన్నారు.

మల్లేశ్ అరచేతి కింద అనూరాధ పాపటిసేరులోని రాళ్ళు ఫక్కుమన్నాయి. అనూరాధ అరచేతి కింద మల్లేశ్ వత్తైన జుట్టు మెత్తగా నవ్వింది.

అనూరాధ ఆ జుట్టును చూడాలన్న కోరికతో సోగకళ్ళు మెల్లిగా ఎత్తింది. సరిగ్గా అప్పుడే మల్లేశ్ ఆమెవంక చూసాడు. శుభముహూర్తంలో కళ్ళు కళ్ళు కలిసాయి.

శాస్త్రిగారు ఇద్దరి మధ్య సన్నికల్లు పెట్టారు.

అనూరాధకి మల్లేశ్‌కి పంతులుగారు - శాస్త్రిగారు పోటీలుపడి చేస్తోన్న హెచ్చరికలు అర్థం అయ్యే స్థితిలో లేరు.

అసంకల్పితంగా పంతులుగారు - శాస్త్రిగారు ఆదేశించినట్లు చేసుకుంటు పోతున్నారు.

ఎడంచేత్తో చీరకుచ్చిళ్ళు కాస్త పైకెత్తి - కుడికాలుని సన్నికల్లు మీదుంచింది అనూరాధ -

పసుపురాసిన పారాణి విరిసిన అనూరాధ పలుచని పాదం బొటన వేలిని మల్లేశ్ తాకితే కందిపోతాదేమోనన్నంత సున్నితంగా తాకాడు అనూరాధ గబుక్కున కాలు వెనక్కి లాక్కుంది అతని పాదంపై జీరాడుతున్న తెల్లని పంచె అంచులు చూస్తున్న అనూరాధ - తన కాలి వెండి మువ్వల సన్నని సవ్వడి అతని హృదయంలో ముద్రవేసుకోవడాన్ని గుర్తించలేదు

"పాణిగ్రహణం చేయాలి " శాస్త్రిగారు గట్టిగా అన్నారు. అబ్బాయి చేతిలో అమ్మాయి చేతినిపెట్టి - పంతులుగారు గడగడ మంత్రాలు చదివారు.

మల్లేశ్ ధృఢమైన అరచేతితో అనూరాధ సున్నితమైన చేయి ఇమిడి పోయింది ఆమె కోమలమైన పొడవాటి వేళ్ళు సన్నగా కంపిస్తున్నాయి మల్లేశ్ ఆ కంపనాన్ని ఆపాలనే ప్రయత్నంలో మల్లేశ్ తన చేతిని మరింత వత్తి పెట్టాడు మల్లేశ్ ఆమె అరచేత పూసిన గోరింట మొగ్గలను విస్మయంగా చూస్తున్నాడు

అనూరాధ ఎర్రబడ్డ చేతిని మెల్లిగా వెనక్కి తీసుకోబోయంది. మల్లేశ్ పట్టు బిగించాడు. అతని ముఖంలో కొంటెనవ్వును వూహించుకొని అనూరాధ సిగ్గుల మొగ్గయింది పంతులుగారు ఇద్దరి చేతుల్ని గబుక్కున విడదీసారు

చుట్టూ వున్నసందడి - పెళ్ళిగోల వాళ్ళ చెవులకు పట్టడంలేదు అంతా నిశ్శబ్దంగా - ఒకరి వూపిరి ఒకరు వినగలిగేంత నిశ్శబ్దంగా వుంది

"పెండ్లి పిల్లకు పిల్లగాడు తొలిబొట్టు పెడ్తుండు "

అనూరాధ నుదుటిని మల్లేశ్ బొటనవేలు పలకరించింది. అనూరాధ ముక్కు చివరన పడిన కుంకుమ పెళ్ళి కొడుకు వణికాడు సుమా - అంటూ నవ్వింది.

"సుముహూర్తం సావధాన ... సావధాన సుమూహూర్త .."

పెళ్ళి మంత్రాలు జోరందుకున్నాయి. పెళ్ళి బాజాలు హుషారెక్కాయి. మునివేళ్ళు అనూరాధ మెడమీద మూడు ముళ్ళు వేస్తూ గిలిగింతల సంతకాలు చేసాయి. అదురుతున్న గుండెతో అనూరాధ మంగళసూత్రం కట్టించుకుంది. ఇరువురి మీద అక్షింతల జల్లు పడింది.

" పెద్ద లెవరన్నా తలంబ్రాల బట్టలు తీసుకురండి - " శాస్త్రిగారు కేకేసారు.

" తలంబ్రాల చీర తొందరగానే మార్చుకొచ్చేరే" అనూరాధ చిన్న పిన్ని పెద్ద పిన్నితో అంది. " తలవాలు పోసుకుంటున్రు - పదన్రే " రేణుక వయసు వాళ్ళంతా మంటపం చూట్టు చేరారు.

" అనూరాధ - మేమున్నాం నువ్వు ఓడిపోకూడదు - తొందర తొందరగా పోయి - "

అనూరాధకి తొందర పడాలని ఏ కోశాన లేదు. ఆమెకి ఒక్క క్షణం జారిపోయినా మధుర అనుభూతి కరిగిపోతుందని భయంగా వుంది.

మల్లేశ్ దోసిట్లో తలంబ్రాలు మీద అనూరాధ దోసిలి నిండా తలంబ్రాలు పైన జరేని కుండ పెట్టి శాస్త్రిగారు ఏవో మంత్రాలు చదివారు ఒక్కో బియ్యం గింజ నెమ్మదిగా జారేట్టు అనూరాధ సున్నితంగా చేతులెత్తి వంగిన మల్లేశ్ తలమీద పోసింది మల్లేశ్ వత్తైన జుట్టును గబుక్కున చూసేసి కళ్ళు వాల్చుకుంది

మల్లేశ్ దోసిట్లోకి తలంబ్రాలు అనూరాధ ముఖం మీద జలతారు తెరలా జారాయి

ఎంత నెమ్మదిగా పోసూకుంటూ ఆ క్షణాల్ని శాశ్వతం చేసుకోవాలని ఇద్దరూ ప్రయత్నించినా ఇంక చాలు లెమ్మంటూ తాంబాళంలో తలంబ్రాలు అయిపోయాయి.

ఇద్దరి మీద కురిసిన ముత్యాలవాన వెలిసింది ఇరువురి లోనూ మురిపాల ఇంద్రధనస్సు విరిసింది

బిందెలో ఉంగరం తీసారు తృటిలో ఒకరి చేతులు మరొకరి చేతులను పలకరించుకొన్నాయి

సంతోషసంభ్రమలతో సప్తపది నడిచారు ఈ ఆనందమయ అనూభూతులన్నీ మా సొంతమంటూ అరుంధతి నక్షత్రం వరకు చాటి వచ్చారు

" పిల్లగాడు, పిల్ల అరుంధతి సుక్క చూసచ్చిన్రు - గిప్పుడు పత్తిసాలు చేస్తున్రా లేదా ? " నారాయణమ్మ తరుపు బంధువు ఒకామే కుతూహలంగా అడిగింది.

" పత్తిసాలు చేయకుంట ఎట్లనె - అగో నారాయణమ్మ కూరాటి కుండల ముందు నిలబడ్డది. రేణ్క - చుట్టాలు అందరూ ఆడే చేరిన్రు - పంతులుపిల్ల పిల్లగాండ్లను ఆడికి తోల్కపోతుండు మనం పోదాం రాయె - " ఆమె కొంగు చెంగు నడుంలో దోపి - పెళ్ళి సంబరం లోపాలు పంచుకొను గబగబ వెళ్ళింది.

అప్పటికే పెళ్ళి కొడుకు పెళ్ళి కూతురు. కూరాటి కుండల ముందు కూర్చుని వున్నారు.

రేణుక పేడతో కింద అలుకుతుంది.

ముత్తైదువులు గళం విప్పారు.

" పన్నెండు స్తంభాల పందిరీక్రిందా
పత్తి విత్తుల గుమ్మి మెత్తైన తీసి
గోవు పెండా తెచ్చి గోలెంల కలిపీ
ఆవు పెండా దెచ్చి అలుకైన చల్లీ "

ఇంతలో నారాయణమ్మకి, ఏదో జ్ఞాపకం వచ్చి గబగబ శివుణ్ణి దగ్గరికి వెళ్ళాడు. రామనాథం ఇంట్లోకి పరుగున వెళ్ళి - దోసిట్లో ప్రత్తి విత్తనాలతో తిరిగొచ్చాడు. పంతులుగారు చాచిన పళ్ళెంలో పోసాడు.

రామనాథం వాళ్ళకి ఇది కొత్త పద్ధతి. ఇప్పటి వరకూ ఎప్పుడు చూడలేదు పిల్లా పెద్ద అందరు అక్కడే చేరారు.

రేణుక భర్త దామోదర్ ఒక చిన్న పుల్లను తెచ్చి ఆమె చేతికి ఇచ్చాడు. అది ఏదో కొమ్మను చెలిగినట్లుంది. అచ్చం నాగలి లాగుంది.

ఆ పుల్ల నాగలిని రేణుక మల్లేశ్ చేతికి ఇచ్చింది.

మల్లేశ్ నాగలి దున్నినట్లు - సాళ్ళు గీచినట్లు - ఆ పుల్లతో రేణుక అలికినచోట లోతుగా వరుసలు గీసాడు.

" నల్లనీ విత్తులు తెల్లబడరాకీ
తెల్లనీ విత్తులు పచ్చబడ రాకి
పచ్చనీ విత్తులు ఏఱ్ఱబడ రాకి
శ్రీరాముడు దున్నంగ సీత చాలేసు "-

నారాయణమ్మ కోడలి చేతికి పత్తి విత్తనాలు ఇచ్చి నాటమని చెప్పింది.

అనూరాధ బిడియంగా అటూ ఇటూ చూసింది.

" నువ్వ చెప్తెగానీ వొదినె నాటుపెట్టదన్నా - " రేణుక మల్లేశ్ డొక్కలో కొంటెగా పొడిచింది.

ఇంత మందిలో ఎలా చెప్పగలనని సందేహంలో పడి మల్లేశ్ సిగ్గు పడ్డాడు.

" అనూరాధా నాటమ్మా - " రామనాథం మెత్తగా నవ్వుతూ అన్నాడు.

" అన్నా నీవే అందించు - " రేణుక అనూరాధ చేతిలో⌒ ని వి త్తనాలు తీసి మల్లేశ్ చేతిలో పోసింది.

మల్లేశ్ విత్తనాల దోసిలిని అనూరాధ ముందుకు చాపాడు.

అనూరాధ కొనగోటితో ఒక్కో విత్తనం తీసుకొని - వయ్యారంగా వంగి - సుతారంగా నాటింది.

అందరూ అదో అద్భుత కార్యంలా కళ్ళప్పగించి మురిపెంగా పెళ్ళి కొడుకును పెళ్ళి కూతుర్ని చూస్తున్నారు.

క్షణం ఆలస్యం చేస్తే అనూరాధ ఎక్కువగా శ్రమ పడాల్సి వస్తుందేమోనన్నట్టుగా ఆమె విత్తిన మరుక్షణం - ఆమె ముందుకు మల్లేశ్ దోసిలి చాపుతున్నాడు. ఆపని ఇద్దరూ అసంకల్పితంగా చేస్తున్నారు. అది అందరికి ఎంతో అందంగా వుంది.

రేణుక ముసిముసి నవ్వుతూ - అన్నా వదినలను మురిపంగా చూస్తోంది. ఆడవాళ్ళు కొంగులు మూతికి అడ్డం పెట్టుకొంటూ నవ్వుకుంటున్నారు.

రామనాథం తృప్తిగా తలాడించాడు. ఇద్దరి మధ్య సఖ్యత పని పంచుకోవడంలోనే సహజంగా ప్రకటితమవుతుంది. అందుకే పెట్టారేమో ఈ పద్ధతి.

బాలయ్య కొడుకు కోడలిను ముచ్చటగా చూసుకున్నాడు. "నీటుగీటు పోయి పని చేయరంటివి - చూస్నవా ఎంత సొగసుగా విత్తు నాట్తుందా పెండ్లిపిల్ల " బాలయ్య నారాయణమ్మ చెవిలో చిన్నగా అన్నాడు

" అవ్ - సక్కంగ గీతగీసినట్లు - నాటుతుంది ! " నారాయణమ్మ మెల్లిగానే అంది - జరింత సోకుక్కూడా నాటుతుంది ." ఆమె మళ్ళీ అంది బాలయ్య నవ్వాడు

నారాయణమ్మతో పాటు తరుపు ఆడవాళ్ళందరూ గట్టిగా పాట అందుకున్నారు

" ముత్తైద వేసిన మూడు రోజులకు
ములుకాయి ముల్లోలె మొలుకేరుపడేను
ఐదువ వేసిన ఐదు రోజులకు
అల్లీయ పువ్వోలె ఆకేరుపడెను
బాలెంత వేసిన పాది రోజలకు
పల్లేరు గాయేలె పత్తేరు పడెను "

నాటడం పూర్తయింది. మల్లేశ్ పుల్ల నాగలితో విత్తనాలమీద మట్టి కప్పాడు అనూరాధ అందించిన నీరు చిలకరించాడు.

రేణుక పళ్ళెంలో పెరుగన్నం కలుపుకు వచ్చింది. అన్నావదినలు ఇద్దరికీ చెరో ముద్ద పెట్టింది

రామనాథం హుషారుగా చూస్తున్నాడు, " అన్నావదినలు చేను కెళ్ళి సేద్యం చేస్తున్నారు. ఆడపడుచు అన్నం పెట్టి అలుపు తీరుస్తుంది. అచ్చమైన నల్లరేగడి రైతు ఆచారం ! చేను దున్నడం విత్తనాలు ఏద పెట్టడం - మొలక ఏర్పడం - ఆకు ఏర్పడడం పత్తి ఏర్పడడం - అన్నీ అయిదు నిమిషాల్లో అయిపోయాయి ! "

రామనాథం ఆడవారి పాట పెదాలమీద మెదలుతుండగా తనలో తాను నవ్వుకున్నాడు.

" ఇంగ ఇద్దరు కల్సి సేద్యం చేయొచ్చు - అన్ని దోషాలు ఇరగడాయె " - నారాయణమ్మ అక్క పెద్దగా అంది.

" ఆడు బిడ్డకు ఏం కట్నమిస్తున్రు "

ఒకామే కుతూహలంగా రేణుక మల్లేశ్‌ల వైపు చూసింది.

రేణుక పెరుగన్నం పళ్ళెం పక్కన పెట్టి - ఇద్దరికీ మంచి నీళ్ళు తాగించింది. కొంగు బిగించి అన్నతో పాట పాడుతూనే సంబరంలోకి దిగింది. ఆడవాళ్ళు సగం మంది అన్న వైపు సగం మంది చెల్లివైపు గొంతెత్తారు.

" కోంద్ర నిస్తావన్నా కోకపెడుతావా ?"

రేణుక వైపు వాళ్ళు నిలదీసారు.

" కోంద్ర నేమిచ్చేను కోక పెట్టేను "

మల్లేశ్ వాళ్ళు సమాధాన మిచ్చారు.

" బిడ్డ నిస్తావన్న పడ్డ నిస్తావా?"

" పడ్డనేమిచ్చేను బిడ్డనిస్తాను - "

రామనాథం ఉలిక్కిపడ్డాడు " మళ్ళీ మేనరికం ఆశించే పాట - అది ఎన్ని తరాల గడిచినా వదిలేది కాదేమో - "

రామనాథం శివుడి ముఖంలోకి, అనూరాధ ముఖంలోకి చూసాడు అనూరాధ ముఖ ఒక్క క్షణం కళ తప్పింది. తల వాల్చేసుకుంది రేణుక తరుపు వాళ్ళు మళ్ళీ గొంతెత్తారు.

"నీ మాట నా మాట ఒక్కటే కాని

ఆలితో ఒకమాట అనిపించవన్నా "

రేణుక అనూరాధ చుబుకాన్ని పైకెత్తుతూ నవ్వుతూ అంది.

" తమ్మల పాకోలె తల వంచుకోని

ఇస్తనని పలుకవే ఇయ్యంపురాల"

అనూరాధ పేలవంగా నవ్వింది.

మల్లేశ్ తరుపు వాళ్ళు రేణుకను నిలదీసారు

" నీకును నాకును ఎవ్వరే సాక్షి "

రేణుక తరుపువారు మల్లేశ్ తరుపువారు ఒక్క కంఠంతో అన్నారు.

" బాసింగం గట్టిన బ్రాహ్మడే సాక్షి

పెండ్లికి వచ్చిన పెద్దలే సాక్షి'

పెద్దలందరు అక్షింతలు చల్లి వాళ్ళని ఆశీర్వదించారు. నారాయణమ్మ మంచి కొత్తకోట చీరను కోడలి చేతికిచ్చింది.

అన్నావదినల చేతులమీదుగా ఆ ఇంటి ఆడపడుచు మొదటి కానుక అందుకుంది. ప్రత్తి పువ్వుల్లాంటి పకపక నవ్వులు పందిరి నిండిపోయాయి.

రామనాథం వాళ్ళిద్దరూ వ్యవసాయం చేస్తున్నట్లే వుహించుకున్నాడు. పెళ్ళి కంకణాలు విప్పడానికి పెళ్ళికూతురు పెళ్ళి కొడుకు ఇంట్లోకి వెళ్ళారు.

ఇంటి ఆడపిల్లలు పద్మ, సరళ, కల్యాణి, వారిని గుమ్మంలోనే అటకాయించారు.

ఒకరి పేరు ఒకరు పేరు చెప్పిందాక లోపలికి రానివ్వమన్నారు. అనూరాధ తలవాల్చేసింది. అనూరాధ పెదవి విప్పకపోయినా - మల్లేశ్ పేరు చెప్పేసింది. మాకు వినిపించింది పేరు అని ప్రకటించేసారు.

రేణుక ఇది అన్యాయమని అడ్డుపడితే - వీళ్ళే పదిసార్లు మల్లేశ్ పేరు పలికి పదుగురాడు మాట పాడియో చెల్లునని నిరూపించారు.

ఇక మల్లేశ్ వంతు వచ్చింది.

అంతమంది ఆడవాళ్ళ మధ్య తను అనూరాధ పేరు పెట్టి పిలవడమా ఇన్ని రోజుల కలల్లోను అనూరాధకు అతనే నాడు పేరు పెట్టుకోలేదు. అనూరాధ అతనికో అందమైన అనుభూతి కాని ఇక పేరు పెట్టి పిలవాలి తప్పేట్టు లేదు. అక్షరం అక్షరంలో అనూరాగం పుట్టి పడుతుండుగా నోరు తెరిచాడు " అ.... "

"నూరాధ ... "అందరూ అల్లరిగా అరిచారు. గొల్లున నవ్వారు.

మల్లేశ్ అందరూ నవ్వడంతో తనే మన్నాడో తెలియక అటూ ఇటూ తత్తర చూపులు చూసాడు. ఇంత వరకు అనూరాధ ముఖం సరిగ్గా చూడలేదన్నది కూడా మర్చిపోయి - ఆమె ఏమన్నా సాయం చేస్తుందేమోనని ఆమె వైపు బిత్తర చూపులు చూసాడు

అనూరాధ మునిపంటితో పెదవి బిగిచింది - వచ్చే నవ్వును బిగిబెట్టు కుంటోంది. అదే సంకేతంగా భావించి మల్లేశ్ హాయిగా నవ్వేసాడు

శాంతమ్మ, సావిత్రి హారతి ఇచ్చి ఇంట్లోకి ఆహ్వానించారు.

గౌరీదేవి ముందు - పెళ్ళికి కట్టిన కంకణాలు విప్పించాడు పంతులుగారు

బాసికాలను విప్పించాడు శాస్త్రిగారు.

రేణుక పాలల్లో నెయ్యి కలిపి ఇద్దరికి చెరిసగం తాగించింది ఆ ఆడపిల్లలు అరిసెలు తీసుకొనివచ్చారు.

మల్లేశ్ కొరికి ఇచ్చిన అరిసెను మునిపళ్ళతో కొరికి ముద్దుగా రుచి చూసింది అనూరాధ తలనిండా, బట్టనిండా వంటినిండా నిండిన పసుపు వాడిన పూలజడతో అలసటతో బరువెక్కిన కళ్ళతో ఇక అనూరాధ ఇంట్లోకి మల్లేశ్ పందిట్లోకి వెళ్ళి పోయారు.

అప్పటికే భోజనాలు చేసి వచ్చిన వాళ్ళు గూళ్ళు గొంగళ్ళు సరిచూసుకొంటూ బళ్ళు కట్టే ప్రయత్నంలో పడ్డారు.

బంధువులు ముందెళ్ళి నవదంపతుల్ని ఆహ్వానించేందుకు తొందర పడుతున్నారు.

బాలయ్య, నారాయణమ్మ వాళ్ళకి మంచిచెడు చెప్పి పంపుతున్నారు. ముఖ్యమైన వాళ్ళు తప్పించి అందరూ బయలు దేరారు.

" చీకటిపడే లోగా ఊరు చేరుకోవాలి - తొందరగా కానివ్వండి " రత్తయ్య హెచ్చరించాడు. రత్తయ్య పాలుపిండి శాంతమ్మ చేతి కిచ్చాడు.

పెళ్ళి పందిట్లో నులకమంచం వేసారు.

పెళ్ళి కూతుర్ని పెళ్ళి కొడుకునీ అటూ ఇటూ కూర్చో బెట్టారు. ఇద్దరి మధ్య తాంబాళం పెట్టారు. తాంబాళంలో పచ్చిపాలు పోసారు. అనూరాధ అందరూ ఆడపిల్లలు ఎదుర్కోవాల్సిన విషమ ఘడియల్లో వుంది. ఆ కుటుంబం చుట్టూ అల్లుకున్న అనుబంధాల ఆప్యాయతల పందిరిలో విరిసిన మొగ్గ మల్లేశ్ ముంగిట విరియబోతోంది. చిరుగాలికి అల్లల్లాడుతున్న పూలతీవెలా అనూరాధ మనసు ఊగిసలాడుతోంది

శాంతమ్మ, రత్తయ్య అనూరాధ అరచేతులు పట్టుకొని తాంబాళంలో పోసిన పాలల్లో ఆమె మునివేళ్ళు అద్దారు. మల్లేశ్ దోసిట్లో ముమ్మారు అనూరాధ వేళ్ళను అద్దారు అనూరాధ కొనగోటిన జారిన పాలచుక్కలు మల్లేశ్ దోసిట్లో మెరిసాయి.

" అప్పగించితి మమ్మ ఒప్పుల కుప్పనిపుడు "

పెద్ద ముత్తైదువ ఒకరు విషాదంగా అప్పగింతల పాట అందుకుంది

అనూరాధ కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

రామనాధం, సావిత్రి వచ్చి అప్పగింతలు పెట్టారు. శివుడు, భారతి అప్పగింతలు పెట్టారు

అనూరాధ చెంపలకు కన్నీళ్ళు ధార కట్టాయి.

మల్లేశ్, తరువాత - నారాయణమ్మకూ బాలయ్యకూ రేణుకకూ అనూరాధను అప్పగించారు.

నులకమంచం దిగగానే తాంబాళంలో కాళ్ళు పెట్టించి తమ ఆడుపడుచు కాళ్ళు కడిగారు

రత్తయ్య పై పంచకు కళ్ళద్దకుంటూ దూరంగా వెళ్ళిపోయాడు

శాంతమ్మ కొంగుకు కళ్ళు తడుచుకుంది అనూరాధ సావిత్రిని వాటేసుకొంది మౌనంగా ఏడుస్తూ నిశ్శబ్దంగా వెక్కిళ్ళు పెట్టారు

భారతి, సరళ, పద్మ అందరూ కన్నీటి వీడ్కోలు చెప్పారు

కల్యాణి పెద్దగానే వెక్కిళ్ళు పెట్టింది.

రామనాధం కళ్ళల్లోనూ నీళ్ళు తిరిగాయి.

శివుడు గబగబ పెళ్ళి వారి బండి దగ్గరకు వెళ్ళాడు.

రామనాధం పందిరి గుంజ ఆనుకొని దూరంగా చూస్తున్నాడు. మల్లేశ్ గుండె కలుక్కుమంది.

దోరనవ్వుతో మనసుదోచిన అనూరాధ ముఖాన విషాదవీచికలు - నునుసిగ్గు దోగాడిన కళ్ళల్లో సుళ్ళు తిరుగుతున్న నీళ్ళు - మల్లేశ్ ఆమె దుఃఖంలో పాలుపంచుకుంటూ ఆమె అరచేతిని అనునయంగా తట్టాడు. నెమ్మదిగా బండివైపు నడిపించాడు. అందరూ అనూరాధ వెంట బండిదాకా నడిచారు.

" తల్లిలేనిపిల్ల - గారాబంగా పెంచుకున్నాం - మీ చేతుల్లో పెడుతున్నాం నారాయణమ్మ చేతులు పట్టుకొని కళ్ళనీళ్ళు పెట్టుకుంది.

" నాకు మాత్రం ఆడుపిల్ల లేదామ్మా - " నారాయణమ్మ అనునయించింది.

ఎద్దుల మెడలో మువ్వలు ముద్దుగా మోగాయి. బండి ఇరుసుకు కట్టిన గజ్జెలు సుట్ల ఘల్లున మోగాయి. పెళ్ళివారి బండి కదిలి పోయింది కనిపించనంతమేరా అనూరాధ వెనక్కి తిరిగి చూస్తూ చేతులూపుతూనే వుంది.

నడిగడ్డమీద ముక్కుపుడక పెట్టని మొట్టమొదటి కోడలు అత్తవారింటికి కదిలి వెళ్ళింది.

అందరూ కళ్ళు తుడుచుకుంటూ - శూన్యమైన మనస్సుతో ఎక్కడి వాళ్ళక్కడ కూలబడ్డారు.

అప్పటి వరకు వాగొడ్డున నిశ్శబ్దంగా కూర్చున్న సుధాకర్ ఇంటికి మళ్ళాడు

రామనాథం అప్రయత్నంగా పెళ్ళివారి బండి వెళ్ళిన దారిలో నడుచుకుంటూ పోయాడు కాలువ కల్వర్టు దగ్గరకి వెళ్ళి - గట్టు మీద కూలబడ్డాడు.

కళ్ళనీళ్ళు పెట్టుకొని వెనక్కి వెనక్కి తిరిగి చూస్తూ వెళ్ళిపోయిన అనూరాధ కళ్ళ ముందు కదలాడింది.

రామనాథానికి ఇంట్లో మిగిలిన పిల్లలకన్నా అనూరాధ అంటే గారాబం ఎక్కువ చెల్లెలి మీద ప్రేమంతా అనూరాధ అందుకుంది తల్లీదండ్రులు లేని పిల్లని పల్లెత్తి మాట అనకుండా పెంచుకున్నా ఎంత గారాబంలో ముంచెత్తినా - ఈ క్షణం నుంచి తాము పలకరించాలన్నా - తమ ఇంటికి రావాలన్నా పోవాలన్నా - అన్నిటికి పరాయి వాళ్ళలాగా వారి గడపముందు నుల్చుని తలవంచుకొని - అత్తగారి అనుమతి తీసుకోవాలి, వాళ్ళకి సమ్మ తమయితే తాము సంతోషించాలి అసమ్మతమయితే తలవేలాడేసుకొని రావాలి. అబ్బ - ఈ క్షణం వరకు తమ ప్రాణంలో ప్రాణం - ఈ క్షణం నుంచే తమకు పరాయిది కష్టమైనా సుఖమైనా చొరవతీసుకొని తలదూర్చడానికి లేదు. వీలుకాదు పొమ్మంటే అదేమని అడగడానికి లేదు.

పసితనం నుంచి పెంచుకున్న అభిమానాలకీ, అనుబంధాలకు ఇక వీసమెత్తు విలువలేదు ఇక ఏ పండక్కో పబ్బానికో వచ్చినా 'ఇంక వెళ్దామా అనూరాధ' అని మల్లేశ్ అన్నాడంటే ఆ పళంగా వెళ్ళిపోవడమే - రామనాథం అసహనంగా అటూ ఇటూ కదిలాడు.

" ఇవ్వన్నీ ఒక ఎత్తు. అందరు ఆడపిల్లలు అనుభవించి రాటు తేలేవే. కానీ అనూరాధ - ఆమె ఎరిగిన అలవాట్లు వేరు ఎరిగిన వాతావరణం కాదు ఎరిగిన సంప్రదాయం కాదు.

చివరికి మాట మన్నన అన్నీ పరాయివే. అనూరాధ పరాయితనంలో ఇంకి పోతుందా ? కుటుంబంతో వాళ్ళందర్ని నెగ్గుకొచ్చేంత ఇమిడిపోతుందా? ఆ నేర్పు అనూరాధకు వుందా ? ఏమో .. రామనాథం నొసలు చిట్లించాడు.

'తను ఓ ప్రయోగం చేసాడు రెండు భిన్న నేపథ్యాలను సంగమ పరిచే ప్రయోగం దానికి ఎన్ను కొంది అనూరాధను ! తమ గారాబు పట్టిని ! ఓ గిన్నిపిగ్ లాగా ఓ చుంచెలుక లాగా అనూరాధను ప్రయోగానికి పెట్టాడు ! ' రామనాథం అసహనంగా తలాడించేడు

" ఇద్దరి మనసులు స్పందించాయని పెళ్ళి చేయాలని నిర్ణయం తీసుకొన్నాడు. కానీ పెళ్లి ఇద్దరికే పరిమితమై వుంటుందా ?

ఒక వ్యక్తి వెనుక అతను పెరిగిన వచ్చిన కుటుంబం - కుదురు - చుట్టాలు - పక్కాలు - సంప్రదాయలు - ఆచారాలు - అలవాట్లు పొరపాట్లు - రుచులు - అభిరుచులు - ఎన్నెన్నో - అన్నిటితో సహా భిన్న నేపథ్యాల వధూవరులు ఒక్కచోట కలవాలి ఒక్కచోట జీవించాలి కానీ ఇదెలా సాధ్యం ? దీనికి సమాజం ఏమని నిర్దేశించింది ? ఆడపిల్లను పెళ్ళినాటివరకు బతికిన జీవితానికి సున్నా చుట్టేసి - భర్త పథాన్ని కళ్ళద్దుకోమంది ? అదెలా సాధ్యం ? ఈ రోజటి వరకు అన్నం తినడం అలవాటయిన అనూరాధ హఠాత్తుగా మానేస్తుందా ? ఆమెకు కొత్తరుచులు రుచించొచ్చు - రుచించకపోవచ్చు - కానీ ఆమె యిష్టాయిష్టాలు అక్కడ ప్రకటించ గలుగుతుందా?

తుళ్ళింతల తుంగభద్ర లాంటి అనూరాధ - ఎగిరే సీతాకోక చిలుక లాంటి అనూరాధ - ఇక పెదవి విప్పని గడప దాటని మంచి కోడలయి పోతుందా ? అనూరాధకి జీవమే ఆమె గలగల నవ్వు అత్తవారింట అలా నవ్వుతుందో లేదో - " రామనాథం నిట్టుర్చాడు

" పెళ్ళి నాటివరకూ తను జీవించిన జీవితాన్ని శూన్యం చేసుకోవడానికి అంగీకరించని ఏ ఆడపిల్లలయినా ఎదురీదక తప్పదు చూడాలి - అనూరాధ ఎలా మారుతుందో - అనూరాధ మరీ బేల పిల్ల కాదు తన ఇష్టాయిష్టాలను తనే తీర్చుకోగల శక్తి వుంది.

కానీ ఘర్షణ తప్పదు ! సంఘర్షణ తప్పదు ! "

❋ ❋ ❋

" పందిరి కొమ్మ దించాలే - బాలయ్య బావ ఎట్లబోయిండు ? "

గట్టిగా అనుకొంటూ బాలయ్య బావమరిది చింతచెట్టు కింద సమావేశమయిన పెద్దల దగ్గరికి వెళ్ళాడు.

" నేనేడికి పోతా - గీడనే కూసోని బాతాఖానీ ఏస్తున్నాం[1] - "

బాలయ్య నవ్వుతూ అన్నాడు - " పందిరి కొమ్మ దించనింకె మీ యక్క గప్పుడ్నే అట్లు గిట్ల పోసిందా ? " బాలయ్య బావమరిది వెళ్ళి బాలయ్య కెదురుగా కూర్చున్నాడు.

"ఏం ముచ్చట పెట్టిను ? " అతను ఆసక్తిగా అడిగాడు.

" ఏం ముచ్చట పెడ్తం బిడ్డా - నాల్క మొద్దుబాయె - మాటలేడెల్తయ్ ? " నారాయణమ్మ మేనమామ నిష్ఠూరంగా అన్నాడు.

" గదేందే మామ గట్లంటుండవ్ ? " బాలయ్య బావమరిది నొచ్చుకొన్నాడు.

" లేకుంటే ఏందిరా ? మీ బావ మేకల మేపిన తీర్న ఆకులు మేపి పంపుతుండు. . పెండ్లి ముచ్చట గట్ల పెట్టు . కోడిముంత లేద్ది గదేం దావతు [2]? పదారు దినాలయే - గీపొద్దు దంక పులుసుల ముక్క చూస్నమా ? యాష్టకొస్తుంది[3] గా ఆకులు అలములు తిని తిని - "

1. కబుర్లు చెప్పుకుంటున్నాం 2. విందు 3. విసుగొస్తోంది

బాలయ్య బావమరిది బాలయ్య వంక ఆందోళనగాచూసాడు పెళ్ళి కొచ్చిన అతిథులతో మాట పడడం అన్నది తమ ఇంటా వంట లేదు - బాలయ్య ఏవంటాడో నని కంగారు పడ్డాడు

" గది నా ఒక్కని బాధేనా - అందర్కీ అదే పరేషాన్ [1]- " నారాయణమ్మ మేనమామ మళ్ళీ అన్నాడు

బాలయ్య అతని బావమరిది ఊహలకు అతీతంగా పకపక పగలబడి నవ్వాడు, "మంచోన్వే - ముసలోడా । అడ పెండ్లోల్లు లగ్నం పెట్టింతాన్నుంచి పందిరి కొమ్మ దించిందాకా నీసుపాసు ముట్టరు. వాండ్ల పిల్లను చేసుకొన్నంక మనం అట్టిట్ల చూసి పోవద్దావే - '

" అవ్ . అవ్ ......"అందరు తలాడించారు

" గీ దినం మూడు యాటల్ని[2] కోయించ్నా - మీ కోడాలు పొయ్యి మిందకు ఎక్కించింటదిలేయే - బుగులు పడకు - !"

"మూడెం చాల్తయ్‌రా - " ఒకడు పెదవి విరిచాడు.

" గవి అసుమంటి ఇసుమంటి పొటేళ్ళు కావు - గీ దావతు కోసరం, మంచిగ మేపిన బలిసి ఇంతెత్తుగున్నాయ్ - " బాలయ్య చేయి ఎత్తి చూపించి, మీసం దువ్వుకున్నాడు.

" బావమరిది జర - కల్లుకుండలు ఇంటితాన దించిండ్రో లేదో - చూసి రారాదూ - " బాలయ్య బావమరిదిని పూరమాయించాడు. అతను వెళ్ళాడు.

"గదేంది - గీడ సారాదుక్నం పెట్టలే ? " ఒకతను ఆశ్చర్యంగా అడిగాడు.

"పెట్టిన్రు - గదేం సారా ? గింతకల్లు తాగితే కడుపుల సల్లంగుంటది - ఆ సారాల ఏం ఏస్తున్రో ఏమో కడుపు భుగభుగ మంటది - " బాలయ్య మామ అన్నాడు.

"అవ్ గానీ అల్లుడా - ఆడు పిల్లోల్లను పిల్సినవా లేదా ? "

"వాండ్లు ముంత ముట్టరే ..."

"గట్టెట్లనే ? కల్లు తాగని మగోడుంటడా ? " అందరూ ముక్కు మీద వేలేసుకున్నారు.

"వాండ్లు తాగరు - "

"మన పోరన్కి తిప్పలే -- " ఒకతను మల్లేశ్‌ని దృష్టిలో వుంచుకుని నవ్వాడు.

అందరూ పగలబడి నవ్వారు.

"గదేం లేదే వాడు కూడ తాగ్తలేడు " అన్నాడు బాలయ్య

"పోరడు సోకు నేర్సిండా ? " ఒకరు వేళాకోళాలాడారు.

"ఎంత నేర్చినా పదార్రోజుల పండగ నాడు తాగడా ? మేం జూస్తం - " మరొకతను పరాచికంగా అంటూ కనుబొమలెగరేసారు.

---

1 తొందర పెట్టుట, బాధించుట, వేధించుట, 2 పొట్టేళ్ళు

"మీ ఇష్టం వాని ఇష్టం - నడిమద్దెల[1] నాకేమర్క -" బాలయ్య ఇంట్లోకి వెళ్ళాడు.

నారాయణమ్మ వాళ్ళంతా వంటల్లో మునిగి తేల్తున్నారు.

మూడుపొట్టేళ్ళ మాంసం కుతకుత వుడుకుతోంది. పలావు , యాట పులుసు, యాట వేపుడు - తలకాయ మాంసం - గొరకాళ్ళు గుండెకాయ కూర, కార్జ్యం వేపుడు - కొవ్వు కూర, కైమా, నల్ల అన్నీ ఒకదాని తరువాత తయారయిన వెంటనే గుండిగలలోకి సర్ది - పక్కకు పెడ్తున్నారు.

"నారాయణీ ముందు అట్లు పోసి తెస్తివా - పందరి కొమ్మదింప్తం " బాలయ్య హెచ్చరించాడు.

"పొయ్యి మింద పెనం పెట్టన్రే - " నారాయణమ్మ మరదల్ని హెచ్చరించింది.

అనూరాధ గదిలో ఓ పక్కగా గోడనానుకొని కూర్చుని వుంది. ఆ రోజు ఉదయమే ఆమె ఊర్నుంచి వచ్చింది. ఇక వుండిపోవాలని సూట్‌కేస్‌లతో వచ్చేసింది. ఆమెను వదిలేసి రామనాథం సావిత్రి వెళ్ళిపోయారు.

రేణుక అనూరాధ పక్కన చేరింది.

"ఏంటి అంతా హడావుడిగా వుంది ? " అనూరాధ ఆరా తీసింది.

"దావత్ చేస్తున్రు - ఊర్ల అందరు వస్తరు - "

ఇంతలో ఎవరో పిల్లవాడు వచ్చి, రేణుకన పిలిచాడు - "వొదినె - అన్న మొగలి పూలంపిండు - "

"ఇక్కడతేరా - " అతను మొగలి పూలు రేణుకకు ఇచ్చి వెళ్ళి పోయాడు.

అనూరాధ ఒకటి చేతిలోకి తీసుకొంది. మొగలి రేకును ముట్టు కుంటే మాసి పోతుందేమోనని ముద్దుగా తాకింది.

"మలిచిన పసిడి రేకుల్లాగా వున్నాయి. సువర్ణానికి సువాసన అబ్బినట్లు అంటే ఇట్లానేనేమో - విన్నానేగానీ నేనింత వరకూ మొగలి పూవు చూడలా - "అనూరాధ ఆనందంగా అంది.

వదినకు తనే మొదట వాటిని చూపించానని రేణుక కూడా సంతోషించి రేకుల మధ్యలో వున్న మొవ్వను కూడా విప్పి చూపింది. మొగలి పూల పుప్పొడి మెత్తగా రాలింది.

"ఏం చేస్తారు ఈ పూలని ? " అనూరాధ విస్మయంగా అడిగింది.

"తల్లో పెట్కుంటారు - "

మొక్కజొన్న కండె అంత పొడవున్న ఈ పువ్వు తల్లో ఎలా ఇముడుతుంది ? అనూరాధ ఒకవేళ పెట్టుకొంటే ఎలా వుంటుందో తలుచుకొని నవ్వింది "కొమ్ములొచ్చినట్టు వుండదూ - "

---

1. మధ్యలో

"ఏంలె - మంచి గుంటది - మొగలి పూలతోన నీకు జడేస్త వొదినె - వేసినంక నువ్వు మల్ల మల్ల ఏయమని నావెంట పడకుంటే నా పేరు రేణ్కగాదు - "

రేణుక ధీమాగా అంది.

అనూరాధ నవ్వింది.

"అవ్ వొదినె - అప్పుడు నీకు మల్లెపూలతోన ఏసిన్రు చూడు - పూలజడ - ఆ దినం నుంచి నీకు మొగలి పూల జడ ఎయ్యాల అని అన్కుంట వస్తి, ఇయ్యాల కుదిరె. జల్దీ[1]పోయి నీళ్ళు పోస్కురా పో వొదినె - "

అనూరాధని స్నానాల గదిదాకా తోసినంత పని చేసింది.

అనూరాధకి ఈ స్నానాలగది ఎంతో నచ్చింది. తమ యిళ్ళల్లోలా తాటాకులతో ఈతాకులదో కాదు. వాళ్ళయిల్లే ఓ మట్టి మిద్దె. స్నానం గది చక్కని చిన్న గది. ఒక మూల పెద్దనీళ్ళ తొట్టి వుంది. మరోపక్క గోడలోనే పొయ్యి, దాని మీద ఇత్తడి నీళ్ళ బాన గదంతా నాపరాళ్ళు పరచివున్నాయి. చక్కగా వేణ్ణీళ్ళుచన్నీళ్ళు పక్కపక్కనే.

అనూరాధ తనివి తీరా స్నానం చేసి బయటకు వచ్చింది. బయట గోడకు ఆనించి వరుసగా కడవలు దింపి వున్నాయి. ఒకదాని మీద మూతపక్కకి తొలిగి తెల్లని నురుగు కన్పిస్తోంది. అనూరాధ మూతసరిగ్గా పెట్టింది.

'ఇన్ని కడవల మజ్జిగ చేసారు - ఎంతమంది చుట్టాలొస్తున్నారో"

అనూరాధ లోపలికి వెళ్ళే సరికి రేణుక ఒక సిరిచాప పరిచి తాంబాళంలో మొగలి పూలరేకులు విడివిడిగా పెడుతోంది. నలుగురైదుగురు ఆడవాళ్ళు కూడా అక్కడ చేరారు. మొగలి రేకులు చీల్చి - మడిచి - పూలలాకుడుతున్నారు.

అనూరాధ రాగానే సిరిచాప మీద కూర్చోబెట్టారు. రేణుక జడ కుప్పెలు పెట్టి చక్కగా జడవేసింది. ఒక్కో మొగలి రేకు - మడిచి - జడపాయ మీద కుదురుగా పెట్టి నల్లదారంతో కుట్టారు. అట్లా నెమ్మదిగా కుడిపాయ నొక మొగలి రేకు, ఎడమపాయ నొక మొగలి రేకు కుడుతూపోతున్నారు. చూస్తుండగానే నల్లనాగు లాంటి జడ చుట్టూ కుబుసంలా పసిడి మొగలి మొగ్గలు తొడుగుతోంది.

చుట్టూ చేరిన ఆడవాళ్ళు రేణుకకు సాయం చేస్తున్నారు. వారి వేళ్ళు చకచక మొగలి పూవును చిన్న చిన్న రేకులుగా చేస్తున్నాయి. కొన్ని రేకులను పూలగా మారుతున్నాయి.

నారాయణమ్మ అక్క బుద్ధిగా కూర్చోన్న అనూరాధను ముచ్చటగా చూస్తూ నవ్వుతూ రాగయుక్తంగా అంది.

"కోడలా కోడలా కొలికి ముత్యామా - "

అనూరాధ తలతిప్పడం వీలుకాక కనుచివరుల నుండి ఆమెను క్రీగంట చూస్తూ నవ్వింది.

---

1. త్వరగా

"పచ్చి పాలామీది మీగడేమాయే

వేడిపాల మీది వెన్నలేమాయే "

అనూరాధ ఇంతవరకు వంటింటి వైపే తొంగి చూడలేదు ఈ నిష్టూరాలేంటి అనుకొంటూ తెల్లబోయింది.

నారాయణమ్మ మరదలు అందుకుంది

"తేనె కుండల మీది తెప్పలేమాయే -

నూనె కుండల మీది సురుగు లేమాయే - "

అనూరాధ ముఖం పూర్తిగా పాలిపోయింది. పెదాలు తడారి పోయాయి.

రేణుక, నవ్వుతూ వారికి సమాధాన మిచ్చింది.

"అత్త నువు బెట్టిన ఆరళ్ళ వలన

అట్ల పోయి అడవిలో మానుగానైతి

మానన్న గానెత్తి మంచె లేతూరు - "

అనూరాధకి హాస్యానికి పాడుతున్నారని అర్థమైంది. రేణుక ఈడు వాళ్ళందరూ గొంతు కలిపారు.

"చెట్టన్న గానైతి చెలిగి వేతూరు

ఆకన్నగానైతి మేక లారగించు

కాయన్నగానైతి కాకు లారగించు

పండన్న గానైతి పక్షులరాగించు - "

అనూరాధ తృప్తిగా నిట్టూర్చింది. "తన అత్తామామలు అందరి లాంటివారు కారు. రేణుక కూడా పద్మ సరళలకి మల్లే తనంటే అభిమానం చూపిస్తోంది. ఇక అతని సంగతి చెప్పక్కరనే లేదు - పాపం, ఆ పాట కట్టినామెని వాళ్ళ అత్త ఎన్ని ఆరళ్ళు పెట్టిందో - అడవిలో మానై పోతానని వాపోయింది. తనాకా పాట తలుచుకునే అవసరమే రాదు '.

అనూరాధ జడను దాచుకొని మొగలి పూలజడ ముగ్ధంగా మురిసింది. రేణుక మడచి కుట్టిన పువ్వులను ఒక్కోటి జడమీద పెట్టి కుట్టింది.

"పందిరి గుంజ కాడ అట్లు పెట్టాలె - మేం పోతాం - " ఆడవాళ్ళు వెళ్ళిపోయారు.

రేణుక అనూరాధకు గోధుమ రంగు కొత్త కోట చీర కట్టించింది. వూళ్ళో వాళ్ళంతా వచ్చి అనూరాధ బుగ్గలు పుణికి వెళ్ళారు. అందరు భోజనాలకు కూర్చున్నారు. రేణుక వాళ్ళిద్దరికి గదిలోనే భోజనం తెచ్చింది. భోజనాలు అయ్యాక అనూరాధ ఒక్కదాన్ని గదిలోనే వదిలి చుట్టాలను పలకరించడానికి రేణుక బయటకు వెళ్ళి పోయింది.

అనూరాధ మొగలి పూల జడను ముందు కేసుకొని మురుస్తూ కూర్చోంది.

తాను ఈ సారి వెళ్ళీ వెళ్ళగానే కల్యాణిని ఊరించి బాగా ఏడిపించాలి. ఛ ! ఏమిటిది తనింకా చిన్న పిల్లలాగా అల్లరిగా ఆలోచించడం - కానీ మల్లెపూల జడలు వేయడంలో దిట్ట అయిన సావిత్రి అత్తయ్య కూడా ఈ జడ చూస్తే మూర్ఛపోవాల్సిందే. ఒక వెంట్రుక కూడా బయటకు కనబడకుండా ఎలా వుందో వాళ్ళకి అర్థం కానేకాదు. అనూరాధ ముఖాన విజయ సూచకంగా ఓ నవ్వు కదలాడింది.

అది మల్లెల కాలం.

విచ్చుకుంటోన్న దొంతర మల్లెలతో వెన్నెలమామ పరాచికాలాడుతున్నాడు. అందాలమామ మీద అలిగి బొడ్డు మల్లెలు మూతి ముడుచుకున్నాయి విరజాజులు ముద్దమురిపాల జాజరలు విరజిమ్ముతున్నాయి.

నంగనాచి నెరజాణల్లా ఆకులచాటున దాగిన సన్నజాజులు జాబిలి మామను సరిసోల్లాపాలలో ముంచెత్తు తున్నాయి.

అది మల్లెల వేళ.

కొత్త పెళ్ళి కూతురి తలపులు మత్తిలిన వేళ.

కొత్త కోరికలు ఆమె మదిని ముంచెత్తుతున్న వేళ.

అతని ఊహలతో ఆమె వెచ్చని ఊపిరి ఊసులాడుతున్నవేళ. మల్లెల సుగంధాల మధ్య అతనితో పంచుకున్న మధురానుభూతులు సిగ్గుతెరలుగా ఆమెను కమ్ముకుంటోన్న వేళ

వాలుజడను అల్లుకున్న మొగలిరేకుల కొత్త పరిమళం ఆమె మనసుకు మెత్తగా మత్తెకించిన వేళ.

ఆమె మంచంలో సుతారంగా పక్కకు ఒత్తి గిల్లింది.

ఆమె వాలిన సోగకళ్ళలో కమ్మని కలలు గుసగుస లాడు తున్నాయి.

మల్లేశ్ గదిలోకి వచ్చాడు.

మసగ్గా పడుతోన్న లాంతరు వెలుతురులో-

ఆమె అతని కళ్ళకు పున్నమి వేళ మొగలి పొదలో ఒదిగిన నాగినిలా కనిపించింది. బుసలు కొడుతోన్న కోడెనాగులా ఆమెను చుట్టేసాడు

ఆమె సుందర స్వప్న విహారాల్లోంచి ఒక్కసారిగా లోకంలో పడింది.

అతని దగ్గర్నుంచి - ఏదో వెగటు కంపు - ఆమె కడుపులో దేవేస్తూ .

వాక్ .. ! !

ఆమె చటుక్కున అతన్ని విదలించుకొని - పైకిలేచే ప్రయత్నం చేసింది.

అతను ఆమె భావాల్ని గ్రహించే స్థితిలో లేడు.

తమకంలో - మైకంలో - తనేం చేస్తున్నాడో తనకే స్పృహలేనిక్షణంలో .! సర్ప పరిష్వంగంలో సుకుమార మైన మొగలి పూల జడ నలిగి పోయింది. ఆమె వడలిన పూల చెండులా కుబుసం విడిచిన కోడెనాగు చేతుల్లో వేళ్ళాడ బడింది.

అతను హఠాత్తుగా స్పృహలోకి వచ్చాడు.

ఒక్కసారిగా ఆమెకు దూరంగా జరిగాడు.

'అయ్యో! తనేం చేసాడూ?'

అతను సిగ్గుతో చితికి పోయాడు. ఆమెను సూటిగా చూసేందుకు ముఖం చెల్లక మోకాళ్ళలో తల దాచుకొన్నాడు.

"ఒక్క గిలాసు తాగు బిడ్డా - కడుపుల సల్లంగుంటది! అసలే ఎండల కాలం - " ఎవరో అతని పక్కన చేరి ఆప్యాయంగా అంటున్నారు.

అతను గట్టిగా చెవులు మూసు కొన్నాడు.

అవమానంతో అణువణువూ రగిలి పోతోన్న అనూరాధ ఛర్రున గోడవైపు తిరిగింది.

ఆమె మొగలి పూజడ బుస్సున లేచింది.

ఆమె కోరచూపు అతని గుండెల్లో ఖస్సున గుచ్చుకుంది.

అతను అనాగరికుడన్న భావం ఆమె మనసులో నాటుకుంది. అదేక్షణంలో తను అనాగరికుడినన్న భావం అతని మనసులో మొలకెత్తింది.

"పందిరి కొమ్మదించినం. ఇంగ పెండ్లి ముచ్చట పూర్తాయె. . .!" బయట ఎవరో బిగ్గరగా అంటున్నారు.



# 8

"ఇంతకీ ఏంటి బాబాయ్ అక్కడి విశేషాలు -" శివుడు నెమ్మదిగా అడిగాడు.

"ఏవున్నాయిరా - ప్రత్తి తీసుకొచ్చిన లారీలన్నీ ఎక్కడివక్కడ ఆగి పోయాయి సుధాకర్‌ని రాయచూర్ లోనే వుంచి నేను సింధనూరు వెళ్ళి అక్కడి రైతులతో మాట్లాడి వచ్చా". రామనాథం ఉస్సురంటూ మంచంలో కూర్చుంటూ అన్నాడు.

"ఏం బాబాయ్ - సమస్యే మన్నా వచ్చేట్టు వుందా?" శివుడు ఆత్రంగా అడిగాడు

"అక్కడి మిల్లువాళ్ళే వాళ్ళక్కావల్సిన రకం ప్రత్తి విత్తనాలు ఇచ్చి రైతుల చేత వేయిస్తారట. పంట వచ్చాక నాణ్యత బట్టిస్తారట. మాన్లాంటి కొత్తవాళ్ళం వెళ్తే పోటీ వస్తం దేమోనని వాళ్ళు వెనకాడుతున్నారు."

"పోటీ ఎవరితో? రైతులతోనా?"

"రైతులతో నేను మాట్లాడాగా? వాళ్ళు మాన్లాంటి వాళ్ళే. నాణ్యత చూసి రేటేయ్యండి అంటున్నారు. కాకపోతే మన దస్తగిరి వున్నాడు కదా - అతను ఆకాలువ గట్టు భద్రయ్యగారి ప్రత్తికి మనప్రత్తికి ఒకే రేటు కట్టమని గొడవ పెట్టుకున్నాడు ఆ గొడవతో మన వూరి లారీలన్నింటిని ఆ మిల్లు వాళ్ళు తూకం వేయకుండా ఆపేసారు."

"అళ్ళది ఒట్టి నాసిరకం పత్తి బాబాయ్ - దాన్నీ మనదాన్నీ ఒక్క గాటిన ఎట్లాకడతాం?' శివుడు బాధపడ్డాడు.

"ఈ దస్తగిరి పెద్ద తలనొప్పి అయ్యేట్లుగా వున్నాడు."

"మన బంగారం మంచిదయితే మనకెందుకురా భయం? రాయాచూర్‌లో వుండేది ఆ ఒక్కమిల్లేనా? అందుకే సింధనూరు వెళ్ళి మనకి మొదట్లో విత్తనాలు ఇచ్చారే వాళ్ళు వేసే మిల్లు వాళ్ళని కలిసి వచ్చా - మొదటాళ్ళ కన్నా వీళ్ళు రేటెక్కువ ఇస్తున్నారు అసలు వరలక్ష్మి - ప్రత్తిలారీ వస్తుందంటేనే హారతి పట్టి స్వాగతం ఇస్తున్నారు. సుధాకర్‌ని తూకం వేయించుకొని - పైకం తెమ్మని నేను వచ్చేసా. తూర్పు పొలంలో ప్రత్తి తీయించావా?"

"నాన్న అక్కడే వున్నాడు బాబాయ్ -

"ఈవర్లైనా రాలేదు ఏం చేస్తున్నార్రా -"

"నేను ఇప్పుడే ట్రక్కు తోలుకొచ్చా - నాన్నా నేను ఒక్కసారే బయల్దేరాం - బండి రావద్దా -"

శివుడు రోడ్డు వైపు చూసాడు

రోడ్డు మీద బయ్యిన ఓ లారీ దూసుకు పోయింది.

"అబ్బ ఇంతలో ఎంత మార్పు బాబాయ్ -"

"అవున్రా శివుడూ - అసలు మనమిక్కడ ఇంత ఊరు ఏర్పడుతుందని ఊహించామా?"

"అసలంతా ఈ రోడ్డు మూలాన జరిగింది బాబాయ్ ఏ రోజు మన వూరి మీది నుంచి ఈ రోడ్డు వెళ్ళిందో - అప్పుడే మార్పు తెలిసింది - ఆ రోజు బస్సు పడింది. ఆ బస్సు పోతూ పోతూ ఎక్కడెక్కడికో ఇక్కడి కబుర్లు మోసుకెళ్ళింది - వస్తూ వస్తూ ఎక్కడెక్కడి వాళ్ళని మోసుకొచ్చింది - చూస్తూవుండగానే - యాభై గడపలున్న వూరైంది "

"మన వూరనే కాదురా - సింధనూరు పక్కకెళ్ళాంగా - అక్కడా ఇంతే. అసలీ తుంగభద్ర ఒడ్డంతా మన రైతులే కుటుంబాలు కుటుంబాలు తరలి వెళ్ళి వ్యవసాయం చేస్తున్నారు ఈ రోడ్డు ఇలాగే రాయచూర్ వెళ్తుందా - అట్నుంచి దేశాయ్ నగర్ - గంగావతి, సింధనూరు, హొస్పేట, హుబ్లీ, శివాపూర్ ఒక్కటనేమిటిలే కర్ణాటక లోలోకి చొచ్చుకు పోయారు ఈ రోడ్డు నిజంగా బీళ్ళను ఊళ్ళు చేసింది !"

శివుడు ఔనన్నట్లు తలాడించేడు.

"ఒరేయ్ శివుడు ఆ పక్క మనూరిని ఏమని పిలుస్తున్నారో చెప్పకో చూద్దాం - "

"ఏమంటున్నారు బాబాయ్ "

రామనాథం చెప్పకుండా ముసిముసి నవ్వులు నవ్వాడు.

"రాంనగర్ - అట ! "

"అబ్బో సంబడం అక్కడికది తమ పేరే ! " సావిత్రి ఎప్పుడు వచ్చిందో కానీ పక్కన నుల్చుని మూతిమూడు వంకరలు తిప్పింది.

"కాదు మరి - ! ఇక్కడికి చేరిన రైతు కుటుంబాలకు ఎక్కడిక్కెడి సంబంధాలు ఉన్నాయ్యో అందరూ "మీ వూరేది అంటే " రామనాథం గారి వూరు " అనేవాళ్ళు అదే రాన్రాను "రాంనగర్" అయిపోయింది. మరి నా తమ్ముడేగా ముందిక్కడ పునాది ఏసింది -""రత్తయ్య వచ్చి తమ్ముడి వంక మురిపెంగా చూస్తు అన్నాడు.

"ఇక్కడే కాదన్నయ్య - ఈ తీరమంతా నగర్‌లే - దేశాయ్ నగర్, నేతాజీ నగర్, గాంధీనగర్, నౌరోజి నగర్ నుంచి శ్రీ నగర్ - శాంతి నగర్ చంద్రశేఖర్ నగర్ - ఇక మన రాంనగర్ - "కాకపోతే ప్రతి పల్లె పేరుకు చివర క్యాంప్ అని తగిలిస్తున్నారు. క్యాంప్ అంటే నాల్రోజులు వుండిపోవడానికి వేసుకొనే తాత్కాలిక నివాస సముదాయం కానీ, ఇది పల్లె. నాల్రోజులు వుండి గుడారాలు పీక్కుపోయే క్యాంప్ కాదు - "రామనాథం నవ్వాడు. "ఏమో మరి ఒకనాటి ఒంటి గుడిసె వూరు ఏనాటికైనా మహానగరం అవుందేమో -"

" మీకో విషయం చెప్పనా బాబాయ్ " శివుడు సావిత్రి వంక రత్తయ్య వంకా చూస్తు నవ్వాడు "మన ఇంటి ముందుగా పెద్ద తుమ్మచెట్టు లెదూ - అది ఇక బస్‌స్టాప్ అంట దాని ఎదురుగా ఈ పూటే ఓ పెద్ద బోర్డు పెట్టారు రాంనగర్ అని ! "

"మరి ఇందాకట్నించి నన్నలా వాగిస్తారేమిరా - " రామనాథం కూడా నవ్వాడు

"అన్నట్టు బాబాయ్ - ఉన్నపళాన చిన్నపిల్లలందర్నీ పోగేసి - ఆ పంతులు గారి చిన్నబ్బాయితో బడి పెట్టించావా ? ఇప్పుడు మనమ్మాయ్ పెద్ద బాలశిక్ష, శతకాలు, ఎక్కాలు లెక్కలు, అన్నీ నేర్చేసుకుందంట. ఇంక ఏం నేర్వాలని అడగడానికి వచ్చాడ తను - మీరు వచ్చాక కలవమన్నా - "

"మనకు వీలులేదు కదా అవి చదివించాం కానీ, అబ్బాయ్ ఈ కాలంలో ఆ చదువులతో సరిపోతుందుట్రా ఈ విషయం గట్టిగా ఆలోచించాల్సిందే - " రామనాథం సాలోచనగా తలూపాడు.

ఇంతలో రత్తయ్య గాబు దగ్గర స్నానం చేసి కట్టు పంచ కట్టుకొచ్చాడు. మంచం మీద కూర్చున్నారు. సావిత్రితో "అమ్మాయ్, కాస్త పసుపు పట్రా - "

"అలాగే - బావయ్య -" సావిత్రి బుద్ధిగా లోపలికి వెళ్ళింది.

"దేని కన్నయ్య పసుపు ? " రామనాథం ఆశ్చర్యంగా అడిగాడు.

"ఏంటోరా అబ్బాయ్ - ఇటుచూడు కాళ్ళనిండా అసయ్యంగా రసికారుతోందిరా ఏనాడన్నా చిర్రున చీదెరుగుదునా చూస్తంటేనే వాంతొస్తందిరా - "

కట్టు పంచ మోకాళ్ళ దాకా లాగి రామనాథానికి కాళ్ళు చూపించాడు.

రామనాథం మనసులో ఏదో సందేహం మెదిలింది. దగ్గరగా వెళ్ళి కాళ్ళను పరీక్ష చేసాడు.

"అదేంటన్నయ్య మరీ అలా తయారయ్యాయి కాళ్ళు ! " "బోరాలేవన్నా తొక్కా వేంటి ? "

"లేదురా - శివుడు సవారి చిక్కాలెక్కుతున్నారు. నేను గంపల్లో పత్తి తెచ్చి ఏస్తన్నానే కానీ బూరేలు తొక్కలా ?"

"మరి ఇదెపట్నించి ? "

"మొన్న ఆ మధ్య పత్తి తీసిన చేలో కంప కొట్టించానా - అప్పట్నించి కలుపుకూడా మోకాళ్ళ ఎత్తున పెరిగింది. ఏ పురుగైనా పాకిందేమో లెమ్మని పసుపు పూసుకుంటున్నా - "

అప్పుడూ సావిత్రి పసుపు తీసుకొని వచ్చింది. రామనాథం అన్నతో పాటు సావిత్రిని శివుడుని కోప్పడ్డాడు.

"అంత అశ్రద్ధ అయితే ఎట్లా అన్నయ్య . సావిత్రి - నువ్వు కూడా ఏంటి అలా పుండు మీద పసుపు పెట్టడం ? ఆయింట్‌మెంట్ ఏదైనా పూయకూడదూ ! ఒరేయ్ శివుడూ - సమయం

చూసుకొని గద్వాలకో, కర్నూలుకో నాన్నని తీసికెళ్ళక పోయావా ?" రామనాథం కస్సున అరిచాడు. కాళ్ళు నిండా పొదలు - వాటి నుంచి ఈ రసి - రామనాథంకి అన్నయ్యకు రాకూడని జబ్బేమన్నా వచ్చిందేమో నని భయంవేసింది. "అలా అలా ఆ జబ్బు అన్నయ్య కాళ్ళు వేళ్ళు తినేస్తుందేమో కదా ! " రామనాథం వళ్ళు జలదరించింది.

"నాకేం లేదురా - నువ్వూరికే కంగారు పడవాకు."

"నువ్వూరుకో అన్నయ్య"

మర్నాడు తెల్లవారు జామున ఫస్ట్-బస్‌కు అన్నదమ్ములిద్దరూ కర్నూలు బయలు దేరారు

కర్నూలు జనరల్ ఆస్పత్రిలో అన్ని రకాల పరీక్షలు పూర్తి చేసేసరికి మధ్యాహ్నం అయ్యింది. మెడికల్ కాలేజీ ప్రొఫెసర్లు. విద్యార్థులు అక్కడి ఆసుపత్రిలో వైద్యులు.

అన్ని విభాగాలని చుట్టుముట్టి చివరికి ఓ అనుభవజ్ఞుడైన వైద్యుడి దగ్గర తేలారు "డాక్టర్ , ఇది లెప్రసీ అయితే కాదు కదా ? "రామనాథం రత్తయ్యకు వినిపించనంత మెల్లిగా అడిగాడు.

అందరూ పొద్దున్నుంచి అడుగుతున్నట్టే మళ్ళీ ఇతను రత్తయ్యను ఎప్పట్నించి మొదలయ్యింది, ఎలా మొదలయ్యింది, ఎప్పుడు కనుక్కొన్నారు అప్పుడేం చేసారు వగైరా వగైరా వివరాలన్నీ అడిగాడు.

అప్పటికే అందరికీ చెప్పి చెప్పి రామనాథానికి కంఠస్తం అయిపోయింది.

"ప్రత్తి తీతకు వెళ్ళినప్పటి నుంచి ఇలా అయ్యిందంటున్నారండి-"

"ప్రత్తి తీయడానికి ముందు పొలంలో కలుపు తీస్తారా?" డాక్టర్ అడిగారు.

రామనాథం అతని ముఖంలోకి ఆశ్చర్యంగా చూసాడు.

"మీకు పొలాలు కలుపులు కూడా తెలుసాండి?"

"మా నాన్న రైతు, అందులోనూ జబ్బులు లాక్కెళ్ళే అన్ని ప్రదేశాల్లోని మేము వెంటబడి వెళ్తాంగా-" డాక్టర్ నవ్వాడు," అన్నట్లు కలుపు తీసారా?"

"లేదండి . . ప్రత్తి చివరి తడి పెట్టగానే అలాగే వదిలేస్తాం-"

"అదీ విషయం - మీరు పెరిగిన కలుపులో వెలిసిపోయిన ఆకుపచ్చ రంగు - నక్షత్రాల్లాంటి తెల్లని పూలు - నేలకు మహా వుంటే అడగు అడగున్నర ఎత్తు వున్న కలుపు మొక్కను చూసారా?"

రామనాథం డాక్టర్ ఇస్తున్న వివరాలకు తెల్లబోయి చూసాడు.

"చూసినట్టే జ్ఞాపకం - "ఏం అన్నయ్య"

"అవున్రా - ఆ పాడు మొక్క ఇప్పుడు ఎక్కడ చూసినా పెరిగి చస్తంది-"

"సరిగ్గా చెప్పారు. అది కాంగ్రెస్ వీడ్ అనబడే పార్థీనియం మొక్క - ఒక అగ్రదేశం నుంచి దిగుమతి చేసుకున్న గోధుమలతో పాటు పి యల్ 420 క్రింద దానం తెచ్చుకొన్న పచ్చ జొన్నలతో పాటు మనదేశంలో ప్రవేశించింది. కళ్ళు మూసి తెరిచేంతలో దేశమంతా పాకి పోయింది అనేక అలెర్జిక్ సమస్యలకు మూలమైంది. ఈ మధ్య అలాంటి కేసెస్ చాలా చూస్తున్నాం. పచ్చిక బీళ్ళనన్నింటిని ఆక్రమించింది గొర్రెలకు, పాడి పశువులకు మేత కరువై, గోపాలుర వృత్తి పోయే ప్రమాదం ఏర్పడింది పసిబిడ్డలకు పాల కరువు ఏర్పడింది."

రామనాథం అది తననుకొన్న జబ్బు కానందుకు తేలిక పడ్డాడు రెండో ఆనందం ఏమిటంటే జబ్బేమిటో తేలింది. ఇక చికిత్స తప్పక అందుతుంది.

"మరి ట్రీట్‌మెంట్ ఏంటి డాక్టర్ గారూ?"

"నేను కొన్ని మందులు రాసిస్తాను కానీ పూర్తిగా తగ్గిపోతుందని మాట ఇవ్వను అలెర్జీ అనేది మాటి మాటికి వస్తూనే వుంటుంది అది అందరికీ రావాలనీ లేదు. ఫలాన వారికే వస్తుందని లేదు - అలెర్జీ కలిగించే అంశాలకు దూరంగా వుండడమే చికిత్స -"

రామనాథం మాన్పడి పోయాడు -

"అదెలా డాక్టర్ - అది ఒక చెట్టయితె కొట్టేసి తొలగించచ్చు కాని అంతా పెరిగిపోయిన కలుపు. దాన్నెలా నివారించగలం?"

"అదేనండి - మన దౌర్భాగ్యం - ఇచ్చింది చాలని గోధుమలు తెచ్చుకున్నాం, కానీ వాటితో పాటు సమస్యలు మోసుకొస్తాయని వూహించలేక పోయాం. ప్చ్ - " డాక్టర్ నిట్టూర్చాడు.

డాక్టర్ చెప్పినట్లుగా రత్తయ్యకు మందు వేసుకుంటే కాస్త తగ్గినట్లుగా వుంటుంది కాస్త తాత్సారం చేసినా, పొలాల మీదకు వెళ్ళినా అసహ్యంగా కాళ్ళు రసి కారుతున్నాయి.

రామనాథం కనిపించినంత మేరా పార్థీనియం మొక్కలను పీకించడమో - కాల్పించడమో చేస్తున్నాడు.

రావణాసురుడి తలలలా నాశనం చేస్తున్న కొద్ది పుట్టుకొస్తుంది.

ఒక మొక్కకు లక్ష మొక్కలు - పది మొక్కలకు పది లక్షల మొక్కలు.

నడక నేర్చిననాడే నాగలి పట్టిన రైతు బిడ్డ - గోచిపెట్టిన నాడే గొర్రు నడిపిన రైతుబిడ్డ - పొద్దు పొడిచిందగ్గర్నించీ పొద్దు గూకిందాకా పొలం తప్ప వేరే విషయం పట్టించుకోని రైతు పెద్ద - పొలం గట్టు ఎక్కడానికి కూడా సంశయిస్తున్నాడు.

వంట్లో చేవ వుండీ జవజీవాలతో మిసమిసలాడుతున్న రైతు కండలు ఇంటి ఆవరణనే పరిమితం చేసింది ఓ విదేశీ కలపు మొక్క.

అప్పుడే రామనాథం ఒక ముఖ్యమైన నిర్ణయం తీసుకొన్నాడు.

రత్తయ్య భార్య - తన వదిన శాంతమ్మతో సహా అందర్ని ఇక్కడికి రప్పించడం - శివుడి భార్య భారతిని , పిల్లల చదువుకి కర్నూలులో కాపురం పెట్టించడం పున్నమ్మను వారికి తోడుగా ఉంచడం.

❋ ❋ ❋

"ఓలమ్మో . . నన్నుసంపిండే " గోలగోలగా మాణిక్యం అరవడం వినిపించింది

అందరూ ఉలిక్కి పడ్డారు.

రామనాథం, శివుడు గబగబ ఆ పక్కకి పరుగెత్తుకు వెళ్ళారు.

"నీ నోట్ల మన్నుబడ - " మాణిక్యం తీవ్రస్థాయిలో తిట్ట బోయి రామనాథం వాళ్ళని చూసి టక్కున అరుపు ఏడుపు ఆపింది.

సవారి ఆమెని వంగ దీసి వీపు మీద గుద్ద బోతున్నాడు - అతనూ ఆగిపోయి గబగబ పక్కకెళ్ళి నిల్చున్నాడు

రామనాథం సవారి వైపు తీక్షణంగా చూసాడు,""ఏంట్రా - మాణిక్యం మీద చేయి చేసుకుంటున్నావా?"

సవారి తత్తర పోయాడు.

సవారి ఆ పూట రామనాథం ఊర్నుంచి తిరిగి వస్తాడని వూహించలేదు. తిమ్మడి అంగడిలో కాస్త ఎక్కువే తాగివచ్చాడు. రాగానే ఏదో అడిగినది చేసి పెట్ట లేదని భార్యను వంగ దీసి బాదుతున్నాడు.

అతనికి రామనాథం అంటే మహాగురి ఏం చేయాలో తోచక గబుక్కున వచ్చి రామనాథం కాళ్ళ మీద పడ్డాడు. లబలబలాడుతూ బతిమిలాడాడు.

"దొరా - నీ కాల్మొక్తా - మల్ల పారి పెండ్లంను కొట్ట -"

" వదల్రా కాళ్ళు -" రామనాథం కళ్ళు నిప్పులు చెరిగాయి.

"సిగ్గులేదురా చేసింది తప్పుపని కాక నన్నోదొరను చేసి కాళ్ళు మొక్కితే తప్పు పోతుందనుకొంటున్నావా?"-

"అసలీ మధ్య సవారి తీరే మారిపోయింది బాబాయ్. పొద్దు గూకితే చాలు ఆ తిమ్మడి అంగడికి పరుగులు తీస్తున్నాడు-" శివుడు మెల్లిగా అన్నాడు.

"ఈ దిక్కు సారా అంగడికి పోని మగాడెవ్వడు? -"

రామనాథానికి చిర్రెత్తు కొచ్చింది.

కళ్ళు పెదవి చేసి సవారిని హెచ్చరించాడు.

"అది నాకనవసరం - మళ్ళీ ఇలాంటిది చూసానంటే నిన్ను ఇక్కణ్ణించి బయటికి పంపించడానికి ఒక్క క్షణం కూడా వెనకాడను-"

రామనాథం చరచర ఇంటివైపు వెళ్ళాడు . శివుడు రామనాథాన్ని అనుసరించాడు.

"అసలు సవారనే కాదు బాబాయ్. అందరూ అట్టానే తయారయ్యాడు. మగాళ్ళు తాగి తిరుగుతున్నారు. ఆడాళ్ళని పిల్లల్ని కూలికి తోలుతున్నారు. అసలు మొన్న పత్తి తీయడానికి ఐదేళ్ళ పిల్లను కూడా తీసుకొచ్చారు. వాళ్ళను చూస్తుంటేనే కడుపు తరుక్కుపోతుంది."

"నచ్చచెప్పి - మగాళ్ళని పిలిపించక పోయ్య-"

"నేను ఆ పిల్లల్ని పంపించేసా - ఆ భద్రయ్యగారి చిన్నబ్బాయి వచ్చి పిలుచు కెళ్ళాడు అయినా ఇపుడు పత్తివేసేది మనం ఒక్కళ్ళే మేనా అటు కాలేస్తే పత్తి ఇటు కాలేస్తే పత్తి"

రామనాథం మౌనంగా తలాడించాడు

"గా తిమ్మని పెండ్లాం తాడుతెగ . . వాన్ని కొండ బోయి బొందల పెట్ట" మాణిక్యం సవారిని ఏమీచేయమని నిస్సహాయతతో - సారాకొట్టుతిమ్మడిని శాపనార్థాలు పెడుతోంది

"తత్ . .నీయమ్మ. . .నోర్మూయ్ . . "సవారి గొంతు గద్దించింది. అంతా నిశ్శబ్దంలోకి జారుకొంది.

సవారి అప్పుడప్పుడు - కల్లు తాగుతాడని రామనాథానికి తెలుసు కానీ, ఇలా తప్పతాగి మాణిక్యాన్ని కొట్టే స్థితికి వస్తాడనుకోలేదు. ఇది మొదటి సారిగా అతని దృష్టికి వచ్చింది రాత్రంతా ఆలోచించి ఓ నిర్ణయానికి వచ్చాడు.

సవారిని పిలిచాడు.

సవారికి చేసిన తప్పు తెలుసు, సిగ్గుతో రామనాథం వాళ్ళకి ముఖం చూపించలేక పోయాడు. తలవేళ్ళాడేసుకొని చేతులు కట్టుకొని ఓ పక్కగా కూర్చున్నాడు.

" నువ్వింక వేరే పని చూసుకో సవారీ - " రామనాథం గంభీరంగా అన్నాడు. సవారి దెబ్బ తగిలిన పక్షిలా విలవిలలాడి పోయాడు.

రామనాథం ఈ గడ్డ మీద అడుగు పెట్టినప్పుడే అతనూ అడుగు పెట్టాడు.

రామనాథానికి ఆ రేగడి మీద ఎంత ఆప్యాయత వుందో అతనికీ వుంది. ఉన్న పళాన వదిలేసి ఎక్కడికి వెళ్తాడు ? ఏం చేస్తాడు ? సవారికి ఏడుపు ముంచు కొచ్చింది. తలకు కట్టుకొనే సెల్లా తీసి - నోట్లో కుక్కున్నాడు.

"వాడేడికి వెళ్తాడండి - మీది మరీ విడ్డూరం - " సావిత్రి వచ్చి సవారి తరుపున వాదించింది.

"అవ్ .. అయ్యా - వాడు మల్ల గిట్ల తాగడు - గీ పారికి గుస్స చెయ్యకు - " మాణిక్యం బతిమిలాడింది.

రామనాథం మాణిక్యం వైపు కటువుగా చూసాడు.

"తాగుతాడో తాగడో వాడి తరుపున చెప్పడానికి నువ్వెవరివి ? అది వాడిష్టం - వాడిష్టం వచ్చినట్లు తాగమను. వాడిష్టం వచ్చినట్లు తన్నమను "

మాణిక్యం నిస్సహాయంగా చూసింది.

"సుధాకర్ - వెళ్ళి డబ్బు తీసుకురా - " ఎంత తేవాలో కూడా చెప్పాడు రామనాథం.

సుధాకర్ రాయచూర్లో పత్తి అమ్మి తెచ్చిన డబ్బులోంచి రామనాథం చెప్పినంత మేరా పట్టుకొచ్చాడు. రామనాథం చేతికిచ్చాడు. డబ్బు చూడగానే సవారికి ఏమూలో వున్న ఆశ కూడా

చచ్చిపోయింది. మాణిక్యం భోరుమంది. ఇక తనకు మెడ పెట్టి గెట్టింపు తప్పదని అతనికి అర్థమైంది. సవారి మనిషి మనిషి దగ్గరకి వెళ్ళి బతిమిలాడడు. " అయ్యకు మీరన్నా చెప్పర్ని" అంటూ

రత్తయ్య నా వల్ల కాదంటూ పెదవి విరిచాడు.

సావిత్రి నిస్సహాయంగా అటూ ఇటూ చూసింది.

శివుడు కోపంగా తల తిప్పు కున్నాడు.

సుధాకర్ నిర్లిప్తంగా చూస్తున్నాడు.

సవారి మళ్ళీ జన్మలో బుద్ధుంటే అట్లాంటి పని చేయనని లెంప లేసుకొన్నాడు.

"సవారి" రామనాథం గంభీరంగా అన్నాడు - "నువ్వు మీ మామకు ఓలి డబ్బు చెల్లించేంత వరకే నా దగ్గర జీతం డబ్బులు పూర్తిగా తీసుకున్నావు మధ్యలో అప్పుడింత ఇప్పుడింత వాడుకోగా మిగిలినవి ఇవి!" రామనాథం రూపాయల పొత్తిని ముందుకు చాచాడు.

"వీటితో నువ్వు రెండు పనులు చేయవచ్చు. నాలుగెకరాల పొలం కొనుక్కోవచ్చు - నాలుగు లారీల సారా తాగొచ్చు. నీ ఇష్టం - ఏదైనా చేసుకో.! కానీ గుర్తుంచుకో - మొదటి పని చేస్తేనే మళ్ళీ ఈ ఆవరణ లోని మట్టి మీద కాలు పెట్టు. రెండోపని చేయాలను కొంటే ఈ మట్టికి నీకు ఋణం తీరినట్టే బయటకు వెళ్ళు-తక్షణం".

సవారి, మాణిక్యం ఇంక లబలబలాడి పోతూ రామనాథం కాళ్ళ మీద పడ్డారు.

రామనాథం చిరాగ్గా లేచినుల్చున్నాడు, "ముందే చెప్పాను ఎన్నాళ్ళు ఇలా కాళ్ళ మీద పడుతూనే వుంటారో మీరు కాళ్ళ మీద నిలబడలేరు. నీ తప్పులు కాయనూలేను దొరనై కాళ్ళు మొక్కించు కోనూలేను. అది నా బలహీనత. ఇంక నువ్వెళ్ళొచ్చు -" రామనాథం వేగంగా పొలం మీదికి నడిచెళ్ళాడు.

సవారి, మాణిక్యం గొల్లుమన్నారు.

"ఈయన్ది మరీ విడ్డూరం -" సావిత్రి గొణిగింది.

"మీరైనా చెప్పచ్చుగా బావయ్య - ఆడిపెళ్ళాం ఆడుకొట్టు కొంటాడు తిట్టు కొంటాడు వీళ్లైతే నాలుగు మాటలు సర్ది చెప్పాలే కానీ - మనల్ని నమ్ముకున్న వారిని వున్న పళాన వెళ్ళ గొట్టే యడమేనా?"

"ఆడు నామాట వింటాడా అమ్మాయ్-"

"అరె శివుడూ నువ్వలా బెల్లం కొట్టిన రాయిలా వున్నావేంట్రా"

"ఆడు అళ్ళ బాబాయి గీసిన గీటు దాటతాడూ-? డోలెళ్ళి మద్దెలతో మొరపెట్టు కున్నట్టు ఆడికి చెప్పిఏం లాభం?

శివుడు మౌనంగా లేచి సవారి దగ్గరకి వెళ్ళాడు.

సుధాకర్ నిల్చున్న చోటినుంచి కదలకుండా నిశ్శబ్దంగా చూస్తున్నాడు. అనూరాధ విషయంలో తండ్రి మొండి నిర్ణయం తగిలిన దెబ్బనుండి అతను ఇప్పుడిప్పుడే తేరుకుంటున్నాడు

తండ్రి మరో మొండి నిర్ణయం మరోరెండు జీవితాలు - సుధాకర్ నిర్లిప్తంగా పూరుకొన్నాడు

రామనాథం వేగంగా వెళ్ళి కాలువ కల్వర్టు మీద కూర్చున్నాడు అయిదు నిమిషాల్లో శివుడు వచ్చేసాడు

"బాబాయ్ - సవారి పొలం కొంటాడంటలే బాబాయ్ - ఏద్దైనా బేరం కుదిరేదాకా డబ్బు కూడా మన దగ్గరే దాచి ఉంచమన్నాడు."

"నాకు తెలుసురా - ఆ సారాయి వాణ్ణి ఎక్కడ పీల్చి పిప్పి చేస్తుందోననే నాభయం। కోరి చేసుకొన్న భార్య ఉన్నదివొక్క పిల్ల - చక్కగా బతక్క ఆ సారా తాగితాగి ఎక్కడ కొంప గుల్ల చేసుకొంటాడో అని నాభయం - చూడు నిన్నటి దాకా మాణిక్యాన్ని వాడు పల్లెత్తు మాట అనగా మనం విన్నామా? ఎంత చక్కగా పరాచికాలడు కొంటూ గువ్వల జంటలా కువకువ లాడుతూ వుండేవారు. ఒక్కపూట తప్పతాగే సరికి పెళ్ళాం చేదయిపోయింది"

శివుడి వెనకాలే వచ్చి దొంగలాగా వెనక్కి వంగొని నిల్చున్న సవారి కళ్ళు చెమర్చాయి

"ఇప్పుడు చూడు మనం చూస్తుండగానే రోజుకొకడు బస్సుదిగుతున్నాడు పొలం రేటు పెంచుతున్నాడు ఈ విధంగా మారి పోతున్నపుడు వాడు గ్రహించుకొని పొలం ఏర్పరచుకోక పోతే - ఆ వచ్చే వాళ్ళకి గాసగాడులా సేవ చేయడానికి తప్ప ఎందుకూ పనికిరాడు-'"

ఔనన్నట్లు శివుడు తలాడించాడు.

"ఆ డొంకకి ఎడం పక్క పొలం వుంది చూడు - అది అమ్మకానికి వుందని విన్నా. నువ్వెళ్ళి దగ్గరుండి బేరమాడి వాడి పేరు రాయించు. వాడొట్టి అమాయకుడు నామీద కోపం వుంటే నాల్రోజులు వుంటుందీ పోతుంది. వాడికంటూ కొంత భూమి ఏర్పడుతుంది - వాడు గాసగాడిగా మిగిలిపోకూడదురా - సేద్యగాడు కావాలి! సేద్యగాడు!"

సరిగ్గా నాలుగు రోజులు తరువాత సవారి నేను ఇకపై సేద్యగాణ్ణి అని ధీమాగా రామనాథం దగ్గరకు వచ్చాడు

❋ ❋ ❋

"ఏమే - నారాయణి వొదినె . . .ఇయ్యాల్రేపు కండ్ల పడ్తలేవు-" రాజమ్మ వచ్చి తీరిగ్గా నారాయణమ్మ పక్కన కూర్చుంటూ అంది

"గదేందే రాజమ్మ - నువ్వే ఊర్ల లేవనె ఆ లచ్చిందేవి-"

నిష్టూరపడింది. నారాయణమ్మ "యాడికి పోతివి?"

"ఐజకు పోయింటి - మా అన్న బిడ్డకన్నది. తొట్ల[1] ఏసి బారసాల చేసివస్తి-"

"ఏంబిడ్డ?"

"ఆడుపిల్ల - ముద్దుగున్నది-"

నారాయణమ్మ తలవంచుకొని, ఇత్తడి పళ్ళెంలో కడిగిపెట్టిన తమలపాకుని చేతిలో తీసుకుంది.

"గా మల్లన్న నడిపిబిడ్డకు ఇయ్యాల రేపుట్ల ఒడి బియ్యం పెడ్తున్రంట - పొయ్యిరావాలె. "అవ్‌గాని, వొదినె -నీ కోడాలు నీల్లాడిందే[2] - " రాజమ్మ ఆరా తీసింది.

నారాయణమ్మ ముఖం పాలి పోయింది . ఏ ప్రశ్నఅయితే రాజమ్మ వేయకూడదను కుంటుందో అదే ప్రశ్న అడిగింది

మాట్లాడ కుండా తమలపాకును అరచేతిలో పట్టుకొని - చీర చెంగుతో తడి తుడుస్తోంది

"అవునె వొదినె - మల్లేశ్ పెండ్లయినంక మూడు పంట లెల్లలే - " రాజమ్మ కళ్ళు కుతూలహంగా విచ్చుకున్నాయి.

నారాయణమ్మకి చిర్రెత్తు కొచ్చింది. "తన కోడాలు నీళ్ళాడితే దీనికెందుకు - నీళ్ళాడక పోతే దీనికెందుకు - కానీ ఆమె అన్నదినిజం మల్లేశ్ పెండ్లయిమూడు పంటలేం ఖర్మ ఈ సారి పంట కొస్తే అయిదు పంటలెల్నాయి -" నారాయణమ్మ నీరుకారి పోయింది.

"అలంపురం ఎల్లమ్మ తానకు కొండపోకపోతివి[3] - " ఉచిత సలహాపడేసింది రాజమ్మ.

నారాయణమ్మ ముఖంలోకి వెలుగొచ్చింది.

"అవునే - ఎల్లమ్మ తానకు పోతే ఫాయిదా[4] వుంటదా?"

"చిన్నంగడుతున్నవు - నీకు మాత్రం రేణ్క - ఆడికి పోయినన్కనె పుట్టలె. నీముచ్చట నీవె మార్చి నవ్ - గట్లెట్ల?" రాజమ్మ ముక్కున వేలేసుకుంది.

అదీ నిజమే - నారాయణమ్మ ముఖం కళకళలాడిపోయింది. చకచక తమలపాకు మీద సున్నం రాసింది. నాలుగు పోక ముక్కలు పెట్టి కొంచెం కాసు వేసింది. ఆకు చుట్టి రాజమ్మ చేతి కిచ్చింది.

"పాపం - ఆ ముసిల్ది ముత్తవ్వ అవ్వకుండ మట్టిల కల్సె - ఇంగ నీ వన్న మనమడిని నెత్తుకో -" బోలెడంత జాలి చూపిస్తూ అంది రాజమ్మ.

నారాయణమ్మకు కాలంలో కల్సిపోయిన లచ్చుమమ్మ జ్ఞాపకం వచ్చింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి.

---

1. ఉయ్యాల 2. గర్భవతి అయ్యిందా 3. తీసుకెళ్ళకపోతివి 4. లాభం

"ముసల్ది ముసిముసిగ నవ్వుతూ ఎట్లుండె - బిడ్డొచ్చిన పొద్దు గొడ్డొచ్చిన పొద్దని వూర్కే అన్నారు - గా సెత్తెమ్మ ఎదినం నా గుమ్మంలో కాలు పెట్టిందో గా క్షణం " నారాయణమ్మ ఇంకా ఏదో అనబోయి గుప్పుమన్న సబ్బు వాసనతో చప్పున నోరుమూసింది

అనూరాధ గుమ్మంలోకి రాబోతోంది నారాయణమ్మ ప్రస్తావించిన 'గా సెత్తెమ్మ' తనే నని అనూరాధకు తెలుసు. గుడ్డ నీళ్ళు కుక్కు కొంటూ వచ్చినంత వేగంగా లోపలికి వెళ్ళి పోయింది "లచ్చుమమ్మ మామ్మకు వయసు మీరి చని పోయింది అందులో తన తప్పే మిటి, " అనూరాధకు అర్థంకాక విషాదంలో పడిపోయింది

నారాయణమ్మ అనుకోని రీతిలో అనూరాధ రావడంతో తేలు కుట్టిన ఉలిక్కిపడింది.

దొంగలా తడబడింది ఉన్న మాటంటే ఉలుకెందుకు తనేం తప్పు మాట్లాడిందని అని తనకు తానే సమాధానం చెప్పుకుంది

అనూరాధ వంటి మీది నుంచి గుప్పుమన్న సబ్బు వాసనలు వచ్చాయి

'బోగ మోల్ల తీర్న పొద్దు గూకుల సోకు చేసెటోల్ల కడుపుల కాయ ఎట్ల కాస్తది నారాయణమ్మ కచ్చగా అనుకుంది తనలో తానే నారాయణమ్మ గొంతు హెచ్చించింది

తన అపరాధ భావాన్ని కప్పి పుచ్చేందుకు రాజమ్మతో బాతాఖానీ మొదలెట్టింది. అలంపురం రేణుకమ్మ దగ్గరకు ఎలా వెళ్ళాలో - ఏవేం చేయాలో అన్ని కనుక్కొంది

"గింత ఎన్న పూసవుంటే మస్తు - వొదినె నీగ్గిట్ల అన్మానం వుంటే నీ తోన వస్తలే రాజమ్మ భరోసా ఇచ్చింది

నారాయణమ్మ ఆవిడ మంచి తనానికి ఎంతో సంతోషించింది మరో నాలుగు తమలపాకులు చుట్టి ఇచ్చింది

"అంబా" - మోరలెత్తు కొని అరుస్తూ గేదెలు వచ్చాయి.

"వొస్త వొదినె - మా పొట్టిగాడు బర్ల కొట్టు కొచ్చిండో మర్సిండో"- రాజమ్మ గొణుక్కుంటు వెళ్ళి పొయింది.

నారాయణమ్మ నిట్టూర్చింది, "ఏం జేసి - ఏం పలం[2] - అసలు కొడుకు నసీబు[3] మంచి గుంటె గిసుమంటి పెండ్లాం చిక్కుతుండెనా? సొగసు చూసి మనసప పడ్డడు గొడ్డు మోతు కడపని వానికేమెర్క? నా కొడ్కుబత్కు నాశనమైపాయె -" నారాయణమ్మ బాధపడింది.

"వాన్కి పెండ్లాం ముఖం చూడ ఏడ మనసయితది! పోయి పట్నంల సదువుకు సేరిండు". 'గా పెద్దమ్మ నా నెత్తి మింద వదిలిండు!'

"గదెందే నారాయణి - బర్లు గడప దాటె - గట్ల కూసుంటివేమి?' బాలయ్య గట్టిగా అన్నాడు.

నారాయణమ్మ లోకంలో పడింది ఎదురుగా బాలయ్య కనిపించేసరికి కోడలి మీద కోపం అతని మీదకు తిరిగింది

"కూసోకేం జేయాలె?" విసురుగా అంది

బాలయ్య ఆమె వంక ఆశ్చర్యంగా చూసాడు -

"గదేం ముచ్చట? పని జేసుకో-"

"నెత్తి మునిగే పిల్లగాల్లపని ఉన్నదాని - పొద్దులస్తమానం చేసేటందుకు -" నారాయణమ్మ హేళనగా అంది

"గట్ల లొల్లి జేస్తవెందుకు ? కోడాలు ఇన్నదంటె మనసు పాడు జేస్కుంటది - జర ముందెనక చూసి మాట్లాడు-"

నారాయణమ్మ మూతి మూడొంకర్లు తిప్పింది- "ఉన్నమాటంటే ఉలుకు పడుదెందుకు? గా కొలికి ముత్యంకి ఎర్కలేదా?" నారాయణమ్మ తన ధోరణిలో తను కొనసాగింది, "నేను ముంగట్నే చెప్పిన గా నీటుగీటు మన ఇండ్లల్ల సాగవని, నామాట ఇంటివా? నా తమ్ముని బిడ్డకు మల్లేశ పెండ్లయి నంక పెండ్లాయె. అప్పుడే బిడ్డ నెత్తె మల్ల నీల్లాడె-"

"బిడ్డలు కనుడు గూడా ఘనకార్యమా? మల్ల ఆ మాట నా ముందు ఎత్తినవంటె మంచిగుండదు మొదాల్కి కోడాలి అమ్మమ్మ పోయి సంవత్సరం కాలె కోడల్ని ముద్దుగా పెంచిందట - ఎంత బుగులు పడ్డదో చూస్నవా?"

"నేను కూడా నా కొడ్కుకు ముద్దుగా పెంచిన! వాన్కి గిట్ల పిల్లా పిచు లేకుంటె నేనెంత బుగులు పడాలె-"

బాలయ్య ఇంక ఆమెతో వాదించి లాభం లేదని ఇంట్లోకి నడిచాడు.

"గప్పుడే రేణ్కి చిన్న పిల్లగాడు ఇస్కూలు పోబట్టె - నా కొడ్కుకు ఏం గతి పట్టిరో నాయనో-" నారాయణమ్మ ఓ రాగం తీసింది.

అనూరాధ లోపలి గదిలో కూర్చుని ఏడుస్తూవుంది

సంక్రాంతి నాటి సుందర స్వప్నం - అనుకొన్నది ఆలస్యంగా అందుకున్న అందమైన అనుభూతి - ఆమె మనసులో మెదిలాయి

వాటితోపాటే పదహారు రోజుల పండుగ రాత్రి అప్రియమైన సంఘటన ఆమె తలపుల్లోని వచ్చింది. అనూరాధ ముఖం వివర్ణమైంది.

ఆనాటి మల్లేశ్ ప్రవర్తనకు ఆమె హతాశురాలైతే అతను పశ్చాత్తాపంలో కుంగిపోయాడు

సుదీర్ఘమౌనం తరువాత నవదాంపత్యపు మోహావేశం వారిరువురి మధ్యన సయోధ్య కుదిర్చింది.

ఆ అవాంఛనీయ ఘటనను జ్ఞాపకాల పొరల్లో దాచి వేయడానికే వారిద్దరూ ప్రయత్నించారు.

మల్లేశ్ ఉద్యోగ జీవితంలోకి అనూరాధ కుటుంబ జీవితంలోకి ఇమిడే విషయంపై దృష్టి సారించారు తామిద్దరి దాంపత్య జీవితం వాటిమీద ఆధారపడి వుందని ఇద్దరూ ఎవరికి వారే గ్రహించారు

మల్లేశ్‌కు చిన్నా చితక వుద్యోగం దొరకడం కష్టంకాదు కానీ, అతను ఒక నాన్ గెజిటెడ్ స్థాయిలోనే ఇమిడిపోవాలి

మల్లేశ్ ఉద్యోగ ప్రయత్నానికే వెళ్ళేనాటికి ఆంధ్రప్రదేశంలోని సగభాగం ఆందోళనలో వుంది అక్కడ ఎన్‌జివోలు దీర్ఘకాలిక సమ్మెతొ నిరసనకు దిగివున్నారు అందరిలోనూ అస్థిరత

మల్లేశ్ అలాంటి వుద్యోగం కన్నా ఉన్నతస్థాయికి వెళ్ళేందుకు ప్రయత్నించాలను కొన్నాడు. తన ఇతర స్నేహితులతో పాటు పోస్టు గ్రాడ్యుయేషన్‌లో చేరాడు అనూరాధకు అతని మధ్య రెండేళ్ళ ఎడబాటు మధ్యమధ్యలో కలుస్తూనే వున్నా ఆ కలియక ఎడబాటులోని సంతోషాన్ని పెంచుతూ పోతోంది ఒకరిపై ఒకరికి అనురాగాన్ని ఇనుమడింప జేస్తూ పోతోంది కలియక కోసం తియ్యని కలలతో ఎడబాటు లోని మధుర్యాన్ని చవి చూస్తున్నారు

అనూరాధ మల్లేశ్ పట్నానికి బయల్దేరక ముందే తను వంటింట్లోకి కాలు పెట్టింది. వంటింటిలో నారాయణమ్మ వాడే సామానంతా ఇత్తడివి రాగివి ఒక కంచు గంగాళం కూడా వుంది

సావిత్రి వాళ్ళ యింట్లో వంటకు మట్టి పాత్రలు, ఇత్తడి గంగాళాలు, బక్కెట్లు, అల్యూమినియం తపేళాలవాడుతుండేవారు, భారతి కాపురానికి జర్మన్ సిల్వర్ గిన్నెలు పట్టు కొచ్చింది

ఇత్తడి వాటిని వాడడం ఒక ఎత్తైతే శుభ్రం చేయడం ఒక ఎత్తు. చింత పండు, ఎర్రమట్టి వేసి - తోమే లోపు గూళ్ళు అరిగి పోతాయ్ - అది ఒక ఎత్తు - ఇక వంటకాలు జొన్న వారి ప్రధాన ఆహారం. వరి అనూరాధ ప్రధాన ఆహారం.

రొట్టెల్లోకి మంచి మసాల పెట్టిన కూరలు వండాలి. ఎండుమిరప కాయల కారం అనూరాధకు అలవాటయితే - పచ్చిమిరపకాయల కారం ముద్ద నారాయణమ్మ వాడేది.

అనూరాధ ఆడుతూ పాడుతూ పెరిగి వచ్చిన పిల్ల. మేనత్తల మధ్య వంట గదిలో వడ్డించడం తప్పించి మరో పని చేయాలని ఆదేశించ లేదు.

కానీ, భారతి లాగా సరళ పద్మల్లాగా పెళ్ళయాక వంటపనిలో పాలు పంచుకోవాలని ఆమె అనుకొంది

నారాయణమ్మ దుక్కి పనులు మొదలవ్వగానే పొద్దున్నే సర్ది తీసుకొని చేనుకి వెళ్ళేది అందుకు రాత్రే సజ్జ రొట్టెలు చేసుకొని తట్టలో వేసి పెట్టు కొనేది.

అనూరాధ ఆ ఆహారానికి అలవాటు పడాలని ప్రయత్నిస్తోంది. ఎప్పుడో ఓ పూట ఉదయాన ఉపాహారంలాగా సావిత్రి కూడా జొన్న రొట్టెలు చేసేది కానీ మూడు పూట్లా అవే చేసుకొని - మజ్జిగ తాగి పడుకోవడం ఆమెకు మింగుడు పడలేదు.

నారాయణమ్మ చేనుకు వెళ్ళాక పగలంతా ఖాళీయే కనుక అన్నం వండడం నేర్చుకుంది మొదటి రోజే అన్నం వార్చబోయి - వేడి వేడి గంజిని కాలి మీద వంపుకుంది.

అరికాలు బొబ్బలెక్కి మంటెత్తాయి వారం పదిరోజులు గదిలోంచి బయటకి రాలేదు బాలయ్య సున్నం తేటలో కొబ్బరి నూనె వేసి కోడలికి వ్రాయమని నారాయణమ్మ చేతికిచ్చాడు నారాయణమ్మ వచ్చేలోపలే అనూరాధ బర్నాల్ రాసుకుంది. నారాయణమ్మ ఇచ్చిన నవనీతాన్ని గూట్లో పెట్టింది.

దేనికోసమో గూట్లో చేయి పెట్టిన నారాయణమ్మ దాన్ని కాస్తా దొర్లించేసింది

"కాలు కాలిందని ఇస్తే పెట్టుకోకుండ గిట్ల గూట్లో పెట్టినవ్? అంతా నేల పాలాయె." నారాయణమ్మ నిష్ఠూర పడింది

"అది కాదత్తయ్య - బర్నాల్ రాసుకున్నాను-"

"అవ్‌లే - గా సుతారాలు మాకే మెర్క - మేము మోటు మనుషులం మోటుగానే సున్నం పూసుకుంటం!" నారాయణమ్మ విసురుగా అంది

"అదేంటత్తయ్య అలా అంటారూ - నేనిప్పుడేం అన్నానని" అనూరాధ గుడ్ల నీరు కుక్కుకొంది

"గీ ఇంట్ల రొట్టెలు అందరం తినుడే నని నీకు తెల్వదా? మల్ల అన్నమెందుకు వార్చినవ్? నీ కోసం బియ్య మేడ ఆడించుక రావాలె - దినము మూడు పొద్దుల తిననింకె బియ్యం ఏడకెళ్ళివస్తయ్"

అనూరాధ మాట్లాడ కుండా తలవంచుకుంది.

"గా దస్తగిరి పెండ్లాం ముంగట్నే జెప్పె - మీ మామ ఇంటేనా?"

నారాయణమ్మ గబగబ బయటకు వెళ్ళి పోయింది.

అ తరువాత పండక్కి సావిత్రి దగ్గరకు వెళ్ళి నపుడు మాణిక్యంతో రొట్టెలు చేయడం నేర్చుకుంది కూరలు - తొక్కులు నేర్చుకుంది.

రొట్టెలు చేయడం అనూరాధ కింకా పూర్తిగా రాలేదు. కాస్త మందంగా అంచులు చిట్లు తున్నాయి. నారాయణమ్మ క్షణాల్లో తట్టే రొట్టెను అనూరాధ రొట్టె తట్టడం - కుదరక పోవడం - మళ్ళీ ముద్ద చేసేయడం - మళ్ళీ చేయడం లెక్కన ఒక్కో పిండి ముద్దను అయిదు సార్లు తడుతోంది. నెమ్మది నెమ్మదిగా నేర్చుకుంటోంది.

ఓ రోజు పెద్ద ఇత్తడి పాత్రల్ని ఎర్రమట్టి, చింతపండు వేసి తోమడానికి తంటాలు పడుతున్న అనూరాధను చూసిన బాలయ్య, వాళ్ళ గాసగాడి పెళ్ళాన్ని అంట్లు తోమి వెళ్ళడానికి కుదిర్చాడు

నారాయణమ్మకు చిర్రెత్తు కొచ్చింది. "పెండ్లయ్యి ఇన్నేండ్లాయె - ఇన్ని దినాలు నేనెట్ల తోమితి ? గా సోకులాడికి తోమనింక ఏమె-"

"గా పిల్లకు అలవాటు లేదు - నువ్వులొల్లి జేయకు -"

"నేనే లొల్లి చేస్న - అందరు మంచోళ్ళే - " నారాయణమ్మ గొణిగింది

అనూరాధ అత్తగారి మాట తోసేయ లేక రొట్టెలతో సరి పెట్టు కోవాలని చూసింది ఇంక మొహమాటం వదిలేసి ఓ గిద్దెడు అన్నం వార్చు కుంటోంది బాలయ్య మిల్లు దగ్గర్నుంచి బియ్యం బస్తాలు తెచ్చినపుడు, నారాయణమ్మ విరుచుకు పడింది

"సిగ్గులేక కొనినవ్ ? వాండ్లకు పుట్లు పుట్లు వడ్లు పండ్త లేవా? ఓ బండి గిట్ల తోలిస్తే ఏమాయె? మన మేన్నా తింటమా ! వాండ్ల పిల్ల తిననింకెనె గాదు?"

అనూరాధ సిగ్గు పడింది. 'ఏమని వెళ్ళి తనకు తినడానికి బియ్యం తోలమని అడుగుతుంది? తన అత్తగారు తిండికి పెట్టలేనంత లేమిలో ఉన్నారా ?"

"తస్ . . నోరు గిట్ల మూసుకొంటావా - లేదా? మల్ల గిట్ల వాగినవంటె పండ్లు రాలగొట్త" బాలయ్య నారాయణమ్మ మీదికి ఎగిరాడు

నారాయణమ్మ మొగుడు తిట్టినందుకు కాదు కానీ కోడలు చూసినందుకు ఉక్రోషం వచ్చింది అది కోడలి మీది కోపంలా మారింది ఆ కోపాన్ని ఏడుపు కింద దాచు కుంటూ గొణుక్కుంటూ బయట కెళ్ళింది

"నా కొంప గుండం చెయ్యనింకె కోడలొచ్చె -"

అనూరాధ వెక్కి వెక్కి ఏడ్చింది.

'అన్నం తినడం, స్నానం చేయడం అన్నీ తప్పేనంటే ఎట్లా వేగడం?'

అనూరాధ తలెత్తి చుట్టూ చూసింది. అది కిటికీ లేని గది. ఒక్కటే తలుపు. దాని ఎదురుగా ఓ పెద్దగది - అటువైపున వంటగది పక్కనే స్నానాల గది. పెద్ద గదికి కప్పులో పెద్ద కంత చేసి ఓ కుండను అడుగు తీసేసి అమర్చారు. ఆ కుండ మూతిలోంచి వచ్చే గాలి వెలుతురే అక్కడ ఆక్రమించేది. దానిని గవాసి అంటారు. ఇక పెద్దగది ముందున్న మెట్లకు అటూ ఇటూ అరుగులు, అది మద్దిరంగం. మద్దిరంగం మీదే బాలయ్య, నారాయణమ్మ పడకలు, మెట్లు దిగితే దాదాపు ముప్పై అడుగుల పొడవు పది అడుగుల వెడల్పు వున్న హాలు। అనూరాధ పెళ్ళి అయి కాపురానికి వచ్చినపుడు అక్కడంతా చుట్టాలు పక్కలతో సందడిగా వుండేది. చుట్టాలు వెళ్ళగానే అసలు రూపంలోకి దిగింది. అది గాడిపాడు. గోడల పొడవునా నాపరాళ్ళు వరుసగానిల బెట్టిన గాళ్ళు. వాటికి ఎదురుగా వరుసగా పాతిన కట్టు గొయ్యలు. వాటికి కట్టేసిన గేదెలు, ఎద్దులు ఓ పక్కన గొర్రెలు, మేకలు రెండు కోళ్ళ గంపలు హాలు చివర పెద్ద ద్వారం. దర్వాజాకి బయట అటూ ఇటు ఎత్తైన అరుగులు.

దాదాపు బాలయ్య వాళ్ళు ఆ అరుగుల మీదే గడుపుతారు వంటయింట్లో వంట చేసుకొని పొలానికి వెళ్ళిపోయే నారాయణమ్మకి ఇంట్లో అంతగా పని వుండదు రాత్రిళ్ళు మద్దిరంగం మీద పడుకుంటారు

కానీ అనూరాధ పొలానికి వెళ్ళదు వీధి అరుగు మీద కూర్చోవడం ఇంటి కోడలికి మర్యాద గాదు.

అసలు ఆ గాడిపాడు పక్కనే మద్దిరంగం మీద మనుషులెట్లా మనగలరో అనూరాధకు అర్థం కాదు ఖచ్చితంగా అలాగే గదుల్లోనే దూరి కోడలెలా ఉండగలదో నారాయణమ్మకు అర్థం కాదు.

పశువుల రొచ్చుతో ఆవిరి తేలిన ఇంట్లో ఒక్కటి వుండాల్సి రావడం - అలా వుండాల్సి వస్తుందని అనూరాధ ఊహించక పోవడం అనూరాధను ఉక్కిరి బిక్కిరి చేసాయి మాట్లాడడానికి మరో మనిషి లేడు. తన ఈడు వాళ్ళ ఊసే లేదు

అక్కడికి వంటింట్లో కప్పుపై కూడా ఓ పగిలిన కుండ పొగ గొట్టంలా వుపయోగపడు తోంది.

మరి ఇలాంటి ఉబ్బరంలో రోజుకు రెండు పూటలు స్నానం, చేయడంలో భోగం వేషాలేమున్నాయి? అనూరాధ వెక్కిళ్ళు పెట్టింది అందులోనూ తను పుట్టి బుద్దెరిగి నప్పట్నించీ రెండుపూటలా స్నానం చేయకుండా ఏనాడన్నా వుందా? అలవాటు ప్రకారం స్నానం చేయడం కూడా తప్పేనా?

తనకు నలుగులు పెట్టి తలస్నానాలు చేయించే మేనత్తలు గుర్తొచ్చారు సింగారించి. మెటికలు విరిచే వారి ఆప్యాయత గుర్తొచ్చింది. భోరున ఏడుస్తూ కూర్చుంది.

"ఇంగో-" నారాయణమ్మ గుమ్మం దగ్గర నిలబడి గడప వంక చూస్తూ దురుసుగా అంది, "పొద్దుగాల జల్ది[1] నిద్రలేయి మల్ల నేనొచ్చి లేపగా బీసిగాడు బండి కట్టిందంకా పోలేరమ్మ తీర్న కురులు ఇరబోసుకొని తిర్గకు-"

అనూరాధ కళ్ళు వాల్చుకొని బుద్ధిగా తలాడించిది

అనూరాధ తడిచిన చెంపలు నారాయణమ్మ దృష్టిలో పడ్డాయి

ఆమెకు వళ్ళు మండింది.

"ఏం రోగమొచ్చె గట్ల పొద్దులస్తమానం ఏడ్చి మొత్తు కొననింకె? ఏడ్చి ఏడ్చి గీ కొంపకు శని పట్టించ్నవ్. ఇంగనన్న నీ ఏడ్పు ఆపురాదె"

అనూరాధ ఏడుపు దిగమింగి అటు వైపు తిరిగింది.

"పొద్దుగాల అలంపురం పోయి ఎల్లమ్మకు మొక్కాల - సమజయిందా?[2] బర్లు చేలకు మళ్ళే పొద్దు దంక పక్కల బడి దొర్లకు -" నారాయణమ్మ చరచరా వెళ్ళి పోయింది.

---

1. త్వరగా 2 అర్థమయ్యిందా

అనూరాధ ఏడుపు గీడుపు మాయమయ్యాయి అనూరాధ గుండె భయంతో నిండి పోయింది

శివాలయానికి వెళ్ళిన అనుభవం అనూరాధకు గుర్తొచ్చింది

ఆ రోజు శివరాత్రి

ఆ రోజు సాయంకాలం వరకు కటిక ఉపవాసం ఉమ్మి కూడా ఊసేయమని నారాయణమ్మ నిర్దేశించింది

సాయంకాలం కోడల్ని సింగారించి గుడికి తీసుకెళ్ళింది అది ఆ చుట్టు పక్కల పల్లెలన్నిటికి ఒకే శివాలయం ఎక్కడెక్కిడి వాళ్ళు బళ్ళు కట్టుకొచ్చారు

ఆ పూట చాల రద్దీగా వుంది ఎవరికి వాళ్ళు తొందరగా దర్శనం చేసుకొని ఉపవాసం విడవాలన్న తొందరలో వున్నారు నారాయణమ్మ కోడలి చేయి పుచ్చుకొని జనం లోంచి నేర్పుగా దూరి - గర్భగుడిలోకి వెళ్ళింది

అక్కడ ప్రతి ఒక్క భక్తుడు గర్భగుడిలోకి స్వయంగా వెళ్ళి శివలింగానికి అభిషేకం చేసే అవకాశం వుంది గర్భగుడి మహా వుంటే ఆరడుగుల పొడవు వెడల్పు వుంటుందేమో అంత ఇరుకులోనూ పూజార్లు కాక ఓ పదిమంది దాకా దూరి ఒకరి మీద ఒకరు పోటీ పడుతూ పూజా కార్యక్రమాలు నిర్వర్తిస్తున్నారు. అనూరాధ అందరి తోపులాటలో ఓ మూలకు ఇరుక్కుపోయింది

అనూరాధ ఇలాంటి ఉపవాసాలు, పూజలు పూర్తిగా కొత్త నాగుల చవితి నాడు పొలంలో వెలిసిన పుట్టలో పాలు పోయడమే కానీ ఇలా ఎన్నడు గుళ్ళల్లో పూజలు చేయడం వారి కుటుంబంలో లేదు. అందుకే కుతూహలంగా వాళ్ళు చేసేపని చూడాలనుకొంది

పూజారి గట్టిగా గంట వాయిస్తూ ఏదో మంత్రం చదువుతున్నాడు మధ్య మధ్యలో "లింగం - లింగం" - అని గట్టిగానే వినిపిస్తోంది అతని పక్కనే వున్న చిన్న పూజారి శంఖం పూరిస్తున్నాడు

ఆ పూజారి పాడిందే మళ్ళీ మళ్ళీ పాడుతూ - శివలింగం మీదకు వంగి భక్తురాలు అందిస్తుండగా గబగబ పాలు, పెరుగు, తేనె, నెయ్యి, ఒకదాని తరువాత ఒకటి గుమ్మరించ మన్నాడు చివరిగా చెంబులో నీళ్ళు పోసి, మొత్తం శుభ్రం చేసాడు శివలింగం నల్లగా నిగనిగ మెరుస్తోంది.

పూజారి భక్తురాలి చేత లింగం తల మీద పూలు పెట్టించాడు పసుపు కుంకుమ పెట్టించాడు చందనం చల్లించాడు. భక్తురాలు భక్తి పారవశ్యంతో శివలింగానికి తల తాటించి నమస్కారాలు చేసింది. చేతికి పది అగరు బత్తీలు వెలిగించి చకచక లింగం చుట్టు తిప్పి పక్కనున్న పళ్ళెంలో పడేసాడు.

హారతి పళ్ళెంలో కర్పూరం వేసి గణగణ గంట కొడుతూ గబగబ హారతి ఇచ్చేసాడు

వాళ్ళు బయటకి వెళ్ళగానె మళ్ళీ శివలింగం మీద నీళ్ళు గుమ్మరించాడు శివలింగం మీద పూలన్నీ తీసేసాడు ఇలా ఒకరి తరువాత ఒకరి అభిషేకాలు జరుగుతూ పోతున్నాయి శివలింగం అనాచ్ఛాదితమై మళ్ళీ అలంకృతమవుతోంది

మూలన చేరిన అనూరాధ మెల్లిమెల్లిగా సంకటంలో పడింది వందలాది అగరుబత్తీలు కాలుతున్న వాసన, దీపాల చమురు వాసన, గుప్పుమని వెలిగి అది మిగిల్చే బూడిద రాసి వాసన, ఆరుతోన్న హారతి కర్పూరం వాసన, కింద నేల మీద పడ్డ పంచామృతాల పైన కసాపిసా తొక్కిన పూల రెక్కల వాసన - ఎప్పటి నుంచో కొడుతున్న కొబ్బరి నీళ్ళు వాసన కలగలసి - ఆ ఆరడుగుల గదిలోని పది మంది మధ్య నలిగిన గాలి మధ్యన - ఉదయం నుంచీ ఉపవాసంతో వున్న అనూరాధ కడుపులో తిప్పేసింది అనూరాధ గట్టిగా నోరు ముక్కు కొంగుతో మూసుకొవాలని ప్రయత్నించింది వెలిగే దీపాల వేడి - మనుషుల వత్తిడి వేడి - వంట్లోని నీరసం - అనూరాధ వళ్ళంతా చెమట్లు కార్చాయి కళ్ళు తిరిగి పోయాయి. పొట్టలో తెమిలింది. వాంతి వచ్చే స్తోందేమోనన్న అనుమానం రాగానే - బయట పడాలని ప్రయత్నించింది. అభిషేకాలతో తడిచిన నేల జిబజిబ లాడు తోన్నా అత్తగారు ఏమను కుంటారోనన్న భయం పీకుతున్నా - జనాల మధ్య తోసుకొని గబగబ బయటకు వెళ్ళింది.

సరిగ్గా అప్పుడే నారాయణమ్మ వంతు వచ్చింది కోడలి కోసం చుట్టూ చూసింది ఆమె ఆలోచించుకొనే లోపలే పూజారి వాళ్ళ బుట్టలోంచి కొబ్బరికాయ తీసి అర చేతిలో పట్టు కొని, ఓ ఇనుప చువ్వతో తటాల్మని కొట్టాడు.

కుళ్ళిన కొబ్బరి నీళ్ళు విరిగిన పాలులా నారాయణమ్మ మీదచిందాయి. నారాయణమ్మకు కోడలి మీద కోపం ముంచుకొచ్చింది. జనాల్ని తోసుకుంటూ విసవిసా బయటకు వచ్చింది.

గంటసేపట్నుంచి బలవంతాన అణుచుకొన్న అనూరాధ ఇక తన వల్లకాక భళ్ళున వాంతి చేసుకుంది.

నారాయణమ్మ కోపమంతా మటుమాయం అయ్యింది. సంతోషంతో ముఖం విప్పారింది.

అనూరాధ అభిషేకానికి తెచ్చిన నీళ్ళతో నోరు పుక్కిలించింది. ముఖాన కొన్ని నీళ్ళు చిలకరించుకొని, కొంగుతో తుడుచుకుంది. చుట్టూ వున్న వీస్తోన్న చల్లగాలిలో ఊపిరి పీల్చుకుంటూ - మందలు మందలుగా తోసుకొంటోన్న జనం వైపు చూసింది.

ఎదురుగ్గా నిలబడ్డ అత్తగార్ని చూసి గతుక్కుమంది.

"అదీ . . .అదీ . . ." అనూరాధ ఏదో చెప్పబోయింది. నారాయణమ్మ ఏమి మాట్లాడకుండా ఇంటికి తీసుకుపోయింది.

అనూరాధకు ఆ గుడి సంఘటన తరువాత నారాయణమ్మ ఎలా స్పందిస్తుందోనని చాలా భయ పడింది - ఆమె అనుకొన్నట్లు కాక అత్త ఎక్కడ లేని ప్రేమ కురిపించడం మొదట నమ్మశక్యం కాకపోయినా - నిజంగానే సంతోషించింది. ఇద్దరూ కలిసి హాయిగా కబుర్లు పంచుకున్నారు నారాయణమ్మ రకరకాల పిండి వంటలు వండింది కోడలికి కొసరి కొసరి తినిపించింది స్వయంగా సింగారించి మురిసింది సరదాగా తమాషాగా రోజులు దొర్లుతున్నాయి మళ్ళీ ఏమయిందో ఏమో ఓపూట హఠాత్తుగా నారాయణమ్మ మూతి ముడిచింది

అనూరాధ ఇలాంటి ఆకస్మిక మార్పుకు తట్టుకోలేక పోయింది "అంత ప్రేమించగలిగిన ఆవిడ ఇంతగా ఎందుకు ద్వేషిస్తోంది -?" అనూరాధకు బుర్ర బద్దలు కొట్టుకున్నా అర్థం కాలేదు ఇప్పటికి కూడా

అనూరాధకు భయమేసింది. 'మళ్ళీ మరో గుడి - ఈసారి ఏం అనుభవమో-'

సరిగ్గా అప్పుడే నారాయణమ్మ ఆ సంఘటనకు గుర్తుకు తెచ్చుకుంటోంది.

"గా మల్లన్న దయతోన కోడాలు కడుపు పండిందానుకొంటె ఒకటాయె రెండాయె నాల్గు నెల్లాయె - గా ముచ్చటే లేకపాయె

గా దినం కెంచి ఎన్ని మురిపాలు తీరిస్తి - ఎన్ని తీపులువండి పెడ్తి అంతా బూడిదల పోసినట్లాయే - అయ్యో నా కొడ్కు గాపోరి పాల పడ్డడు వాని నసీబ్ మంచిగ లేదు -" నారాయణమ్మ అనూరాధను తిట్టుకొంటూ పడుకుంది

మర్నాడు కోడికూయక ముందే అలంపూర్‌కు బండెక్కి బయల్దేరారు పోయిపోయి గంటల ప్రయాణం తరువాత అలంపూర్ చేరుకొన్నారు

అలంపూరు తుంగభద్ర ఒడ్డున వెలసిన శైవక్షేత్రం, శ్రీశైల దేవస్థానానికి పశ్చిమ ముఖద్వారం అని అంటారు దక్షిణ కాశీగా ప్రసిద్ధి గాంచిన ఈ క్షేత్రంలో కోటి లింగాలు వుండేవని చెప్తారు.

అనూరాధకు ఆ విశాలమైన దేవాలయ ప్రాంగణాలు చూసేసరికి ఎన్నడు లేని ఉత్సాహం వచ్చింది. అనేకానేక చిన్న పెద్దా గుడులను చూచి ఎంతో ముచ్చట పడింది. నారాయణమ్మ, రాజమ్మ మరి కొందరు ఆడవాళ్ళు వచ్చారు. బాలయ్య, బీసిగాడు బండి తోలారు.

బండిని గుడిముందున్న చెట్టు కింద ఆపి - ఎద్దుల్ని విశ్రాంతికి వదిలారు.

ఆడవాళ్ళంతా తుంగభద్ర వైపు కదిలారు.

నిండుగా పారుతోన్న తుంగభద్ర కృష్ణలో కలవడానికి పరుగులు పెడుతోంది

కొత్త ఇల్లాలి మనసులో భర్త రూపం మెదిలింది

అనూరాధ మనుసులో ఏదో మధుర జ్ఞాపకాలు మదిలాయి, ముఖంలోకి సిగ్గు పరుగు పెడుతూ వచ్చింది.

భర్తతో పాటు ఆ నదీతీరంలో విహారాలు చేసినట్లు -

విచ్చిన పుచ్చ పువ్వులాంటి వెన్నెల రాత్రి మురిపెంగా పంచుకున్నట్లు ఆమె కలలు కంటోంది. రమ్యమైన రసానుభూతిలో ఆమె మనసు ఊయలూగుతుంది.

పరీక్షల కాలం కావడం వలన మల్లేశ్ ఇంటికి వచ్చి చాలా కాలమైంది. అనూరాధకి అతనిక వచ్చే రోజు దగ్గరకి వచ్చిందని స్పృహకలిగింది. చల్లని నీళ్ళపై చూపుడి వేలితో అతని చిత్రం గీసింది. వంగి ఆ నీటి చిత్రాన్ని ముద్దాడుదామన్నంత ఆవేశం ఆమెకు వచ్చింది. తన ఆలోచనకు తనే సిగ్గు పడుతూ - కొనగోటితో ఏటగాలికి ఎగురుతున్న ముంగురుల సవరించుకొంది. అడ్డూ అదుపులేకుండా ఎగురుతోన్న పైట కొంగును ముద్దుగా కోప్పడుతూ నడుమున బిగించింది.

"ఇక్కడ తుంగభద్ర దక్షిణాన్ని నుంచి ఉత్తరానికి ఉరకలు వేస్తుందట - సంగమం కోసం ఎందుకంత తొందరో -"

ఎందుకో వాలిన ఆమె కనురెప్పల మాటున సిగ్గుగా కదిలిన కళ్ళే చెప్పాయి.

"కండ్లు తెర్చె కలలు కట్టున్నవేంది. బిరీన[1] మున్గు - మల్ల గుడి గిట్ల మూస్తరు -" నారాయణమ్మ గట్టిగా హెచ్చరించింది.

అనూరాధ ఉలిక్కి పడింది. చుట్టూ చూసింది. తనతో వచ్చిన ఆడవాళ్ళందరూ - ఏటి నీటిలో గబగబ మునకలు వేస్తున్నారు. ఎందరో ఇతర యాత్రికులు, భక్తులు, ఆడమగ అదే మాదిరి ఏటి స్నానాలు చేస్తున్నారు.

అనూరాధ తన బట్టల వైపు చూసుకొంది. లేత గులాబి జార్జెట్ చీర. నీళ్ళల్లో మునిగితే వాటికి అతుక్కు పోయిన ఈ చీరలో తనెలా వుంటుందో అనూరాధ ఊహించుకుంది ఛ - అసహ్యంగా వళ్ళంతా కనబడుతూ -! మరో చీర కూడా తెచ్చుకోలేదయ్యే! అనూరాధ మునగ కూడదనే నిర్ణయానికి వచ్చింది. మౌనంగా ఏటి గట్టున కూర్చుని - అక్కడక్కడ సుళ్ళు తిరుగుతున్న నీళ్ళను చూస్తూ వుంది. ఏటి ఇసుకలో నున్నటి రాళ్ళను, చిన్ని గవ్వలను బుజ్జి శంఖాలను ఏరు తోంది. ఓ వట్టి వేరు గడ్డ కూడా దొరికింది.

రాళ్ళ మీద గీచినట్లు వున్న చారలు చూస్తూ వలయాలు చూస్తూ, రంగులు చూస్తూ విస్మయంలో మునిగి పోతుంది. వింత వింత ఆకారాల రాళ్ళు నున్నటి గుండ్రటి రాళ్ళు 'అబ్బ ! ఈ చిన్న రాళ్ళల్లో ఎంత సౌందర్యం ! ఎంతలావణ్యం !'

ఏటి వాలున కొట్టు కొచ్చిన రాళ్ళను ఇంత రమ్యంగా మలచిన తుంగభద్ర తరంగాల కౌశల్యం హంపి నుండి అలంపురం వరకు తుంగభద్ర తీరాన్ని తీర్చిదిద్దిన శిల్పులలో నైపుణ్యం నింపకుండా వుంటుందా?

హఠాత్తుగా అనూరాధ నెత్తిన నీళ్ళొచ్చి పడ్డాయి. అనూరాధ ముఖం మీదకు కారుతోన్న నీళ్ళను తుడుచుకుంటూ తలెత్తి చూసింది.

నారాయణమ్మ తన ధోరణిలో తను మూడు మార్లు అనూరాధ తల మీద నీళ్ళు గుమ్మరించింది.

"గీడ నీల్లల్ల మున్క లేసేటోల్లు మనుసులు కారా? ఊరోల్ల ముందు నా మాట చెవిన బెట్టని కోడాలు దొరికిందని నా తల కొట్టనింకె చేస్నవా? ఎట్ల?" నారాయణమ్మ అనూరాధకి విన్పించేట్టుగా కోప్పడింది

"అది కాదు అత్తయ్య ..." అనూరాధ నచ్చచెప్పబోయింది.

"తిక్క తిక్కంగ లొల్లి గిట్ల చేయకు. పరువు మర్యాద వున్నోల్లం మర్వకు -" నారాయణమ్మ చెంబు చకచక వూపుతూ ముందుకెళ్ళి పోయింది.

అనూరాధలో అరక్షణం ముందు వరకున్న సుందర భావనలన్నీ మటుమాయం అయ్యాయి. ఈ మధ్య పదే పదే నారాయణమ్మ కోడలి ప్రవర్తనను కించపరుస్తోంది. వినగా వినగా అనూరాధకూడా తనలో ఎన్నో లోపాలు వున్నట్లుగా భావించుకోసాగింది. అత్తతో సర్దుకు పోలేని కోడలి నయిపోయితినేనని భయపడుతోంది. ఆ ఆలోచన ఇంతింతై అనూరాధను తనను తానో అసమర్ధరాలినన్న భావనలో ముంచుతోంది. అనూరాధ తన ప్రమేయం లేకుండానే తనలో తను ముడుచుకు పోతుంది. ఏవీ చేతకాని మొద్దునని తీర్మానించుకుంటోంది.

అనూరాధ కొంగుతో ముఖం తుడుచుకొంది. బుద్ధిగానే నారాయణమ్మను అనుసరించింది.

బాల। హ్మేశ్వరుడు, జోగులాంబ లగా అక్కడ శివపార్వతులు పూజలందురు తున్నారు

బ్ర ్మ స్వయంగా ప్రతిష్టించిన లింగంగా చెప్పబడే ఇక్కడి శివలింగం జ్యోతిర్లింగాలలో ఒకటి.

ఇక్కడ నవబ్రహ్మాలయంగా ప్రసిద్ధిగాంచిన బ్రహ్మాలయలువున్నాయి. సప్తమాతృకలు గణపతితో కలిసి ఒకే రాతిమీద చెక్కిన విగ్రహాలు అనేకం. నంది మీద కూర్చున్న శివపార్వతుల విగ్రహం అలంపూర్‌కే ప్రత్యేక మంటారు. ఇక ఇసుక గణపతి ఓ ప్రత్యేకత. ముక్కోటి దేవతల ముచ్చటైన విగ్రహాలు, అనేకనేక శివలింగాలు - మోరపైకెత్తిన నందీశ్వరులు, అరమోడ్పు కన్నుల అమ్మవారు - అక్కడ విగ్రహసంపద చూసేసరికి అనూరాధని ఆనందంతో కాళ్ళు చేతులు ఆడలేదు.

'ఆ క్షణంలో' రామనాథం మామయ్య ఇప్పుడిక్కడ ఉంటే ఎంత బావుణ్ణో - ప్రతి విగ్రహం వెనుక కథేమిటో వివరించేవాడు-" అనుకొంది.

నారాయణమ్మకు విగ్రహాల అందం చూస్తూకూర్చునే తీరికలేదు. సమయం మించి పోకముందే దర్శనం చేసుకోవాలి. అనూరాధను తొందర చేసింది. గబగబ గుడిలోకి తీసుకెళ్ళింది. మైమరిచి వెన్నెల్లో విహరిస్తున్న దానిని రెక్కపుచ్చుకు లాక్కెళుతున్నట్లు అనూరాధ భావించింది.

గర్భగుడి చుట్టూ ప్రదక్షిణాలు చేయడానికి కూడా ప్రత్యేకమైన ఏర్పాట్లున్నాయి ఇక్కడే ఇసుక గణపతి, స్ఫటిక గణపతి, సప్త మాతృకల సరసన గణపతి - అన్నీ వున్నాయి

ఆ ప్రాంగణమంతా ఏటిగాలి చల్లగా గుసగుస లాడుతుంది ఏనాటి కబుర్లో కమ్మగా గుసగుసలాడుతోంది.

అనూరాధ గబగబ ఆ లోపలి కార్యక్రమం ముగించుకొని బయటకు వచ్చి పడింది

గుడి చుట్టు వున్న ప్రాకారం పొడవుగాఈ చివరి నుంచి ఈ చివరి వరకు చక్కగా చెక్కిన స్తంభాల మీది ఏక మంటపం వుంది.

"ఇది ఒకప్పటి ప్రసిద్ధ రస సిద్ధాంత పీఠం ఇక్కడి నేలపై ఆయుర్వేద ప్రాధాన్యత కలిగిన అనేక అరుదైన మూలికలు దొరికేవట. అందువలన ఆయుర్వేదం బోధించిన గొప్ప విద్యాలయం ఇది అనూరాధకు రామనాథం మాటలు గుర్తొచ్చాయి.

"ఈసారి మామయ్యతో రావాలి.' అనూరాధ అప్పటికప్పుడు నిశ్చయించేసుకొంది. రామనాథం మాటల్ని నిజంచేస్తూ - మండపాల అరుగులపై ఏనాటి రసజ్ఞానం నేర్చిన విద్యార్థులతో మూలికలను నూరిన ఖల్వాల లాగా నున్నని చిన్న చిన్న గుంటలు అనేకం కన్పించాయి. అనూరాధ అన్నిటిని తడిమి వచ్చింది. చెక్కిన స్తంభాన్ని ఒక చేత్తో ఆధారం చేసుకుని ఆ స్తంభం చుట్టూ చిన్న పిల్లలాగా గిర్రున తిరిగింది స్తంభాల మధ్యగా వంకర టింకరగా పరుగులెత్తింది. నంది కొమ్ముల మీద వేళ్ళు ఆన్చి బొటన వేలు చూపుడు వేలు మధ్యగా వాటికెదురుగా వున్న శివలింగాన్ని చూసింది.

సుల్తానుల ఆక్రమణకు ఆపడానికి కృష్ణ దేవరాయలు స్వయంగా కట్టించిన గోడను - పెట్టించిన ద్వారాన్ని చూసి వచ్చింది. ద్వారానికి అవతల నున్న దర్గాను, దర్గాలోని సమాధి మీద కప్పిన ఆకు పచ్చని వస్త్ర విశేషాన్ని పక్కన వుంచిన నెమలి ఈకల వీవెనను, పండగలలో ప్రసాదం వుంచే అతిపెద్ద ఇనుప గుండిగనూ - ఆశ్చర్యంగా చూసింది.

ఇంతటి సంతోషాన్ని పంచుకోవడానికి భర్త పక్కన లేడే అని విచారించింది. ఈ సారి వచ్చినపుడు తప్పక కలిసి రావాలని అని నిర్ణయించుకొంది. ఇక్కడికి రాగానే మల్లేశ్‌కి ఎంతగా జ్ఞాపకం వచ్చాడో రాగానే చెప్పాలనుకొంది. తనకు కలిగిన సందేహాలన్నీ రామనాథం దగ్గర తీర్చుకోవాలనుకొంది. కళ్యాణికి ఉడికించాలను కొంది.

నేల మీద పరిచిన రాళ్ళపై రాసిన దాతల పేర్లు చదువుతూ నారాయణమ్మ వాళ్ళు ఉన్న దగ్గరికి వెళ్ళింది.

"యాడికి పోతివి? గట్ల చెప్ప కుండ పెట్టకుండ పోయేడ్డేనా?" నారాయణమ్మ మంచి కోపం మీద కోడలిని కసురుకుంది.

'అవును, చెప్పిపోవాల్సింది,' అనూరాధ తప్పయిందన్నట్లు తలవంచుకొంది అనూరాధన్యూనత మళ్ళీ తనలో నిండింది. మౌనంగా ఆ గుడి స్తంభంపై చెక్కిన బొమ్మలా కూర్చుంది

"ఇగో తాంబాళం తీస్కో-" నారాయణమ్మ తాంబాళాం అందించింది. అనూరాధ మాట్లాడకుండా తీసుకుంది. తాంబాళంలో తమలపాకు మీద పెట్టిన వెన్నపూస ఎందుకో ఆమెకు అర్థం కాలేదు

"రాయే - రాజమ్మ-"ఁవారితో పాటు వచ్చిన రాజమ్మను కూడా పిలిచింది వెంటనే అందరూ బయల్దేరారు.

ఆ దేవాలయ ప్రాంగణంలో మూలగావున్న ఓ చిన్న గుడి దగ్గరకు వెళ్ళారు. దానికి ద్వారం లేదు. దేవుడెవరో తెలియడం లేదు. ఓ ఎనిమిది అడుగుల పొడవు వెడల్పు చదరంగా వున్న గుడి అది. చుట్టు చెక్కిన శిల్పాలు.

ఓ పక్కగా మనిషి దూరేంత కంత, అనూరాధ ఇక్కడెవరికి పూజ చేస్తారు అనుకుంది ఆమెకు ఆశ్చర్యం కలిగించే విధంగా ఒక ఆడమనిషి ఆ కంతలోంచి బయటకు వచ్చింది

అనూరాధ నోరు తెరుచుకు పోయింది

"ఇంగో గట్ల నుంచి దూరి గిట్ల బైటికి రావాలె - సమజయిందా?" నారాయణమ్మ అనూరాధని వుద్దేశించి అంది.

"ఓహో ఇలాంటి కంత అటుపక్క వుందన్నమాట". అనూరాధ తలాడిస్తూ అంది "అలా దూరి ఏం చేస్తారు"

"ఏం జేస్తరు? దేముడంటడు - మొక్కి వస్తరు!"

నారాయణమ్మ కసురు కొంది

అనూరాధ చప్పున పెదాలు బిగించింది.

"ఇంగా తాంబాళం ఇట్టియ్యి -" నారాయణమ్మ అనూరాధ చేతిలోని తాంబాళం లాక్కున్నట్లు తీసుకొంది.

"సుతరాయిస్తన్న వేంది? పోయి దేవుని ముంగటి బొట్టు పెట్కోన్రా-" నారాయణమ్మ ఆదేశించినట్లుగా అంది.

అనూరాధ తటపటాయించింది. తను ఇందాక ఆవిడి లాగా కంతలోంచి దూరి రావాలన్న మాట! తనొక్కటేనా? వీళ్ళంతా వస్తారా?' అనూరాధ అందరి ముఖాల్లోకి చూసింది. "ఏంది ఇంతసేపు జేస్తుంది" అన్నట్లు వాళ్ళు నారాయణమ్మ వైపు చూసారు.

"మన అచ్చటగాదు మన ముచ్చట గాదు కోరి తెచ్చుకొన్నకొరివి!" నారాయణమ్మ వాళ్ళ ముందు గొణిగింది.

అనూరాధ చప్పున కుచ్చిళ్ళు పైకెత్తి కంతలోకి దూరింది. దానిగుండా పసిపాపలా మోకాళ్ళ మీద పాకుతూ పోవాలి. అత్తపైని ఆవేశంలో దూరనైతే దూరింది కానీ అనూరాధ కాళ్ళు చేతులు చల్లబడిపోయాయి. కంతలో వెనక్కి జరగడానికి రారు. తిరగడానికి రారు. చచ్చినట్టు ముందుకు పోవాల్సిందే. తల భుజాలు వంచేసి పాకాలి. కాస్త ఎత్తినా తల రంగుమంటోంది.

నెమ్మదిగా పాకుతూవుంటే బొడ్లోంచి కుచ్చిళ్ళు జారుతోన్నాయి. ఆ మూలకి వెళ్ళేసరికి అనూరాధకి ప్రాణభయం పట్టుకుంది. అటునుంచి పక్కకు తిరిగిన కంత అంతా చిమ్మ చీకటి. ఎక్కడ అంతమవుతుందో? ఎక్కడ ఆ చివరి మూల ఎక్కడవుందో? ఎక్కడ మలుపు తిరగాలో? అనూరాధకు ఏడుపొచ్చేసింది. 'ఎవరైనా తనుదూరి వచ్చిన కంతమూసేస్తే ఇక అంతే సంగతులు - సజీవ సమాధి!' అనూరాధ కంట్లోని నీళ్ళు తుడుచుకుంది అయ్యేదేదో అవుతుంది లెమ్మని తనకు ధైర్యం చెప్పుకుంది.

వెలుతురులోంచి వచ్చిన ఆమె కళ్ళు చీకటికి అలవాటు పడ్డాయి ఆశ్చర్యంగా చీకటిలో సన్నటి వెలుతురు పడుతోంది.

అనూరాధా మెల్లిగా మలుపు తిరిగి - కొద్ది కొద్దిగా జరుగుతూ పోయింది. అక్కడ చిన్నద్వారం - లోపల దేవుడు - ముందు చిన్న ప్రమిద.

ఆ గోరంత దీపం సన్నని సందులో సూర్యబింబంలాగుంది

అనూరాధ మళ్ళీ మలుపు తిరిగింది. ఈ మలుపుకి చివరన వున్న మూలపై సూటిగ వెలుతురు పడుతుంది. అనూరాధ చకచక ఆ మూలకు వెళ్ళి మలుపు తిరిగింది. బయటకు వెళ్ళే కంత సూటిగా వుంది అనూరాధకు ప్రాణం లేచొచ్చింది. గబగబ వెళ్ళబోయి కుచ్చిళ్ళు అడ్డం పడి బోర్లాపడింది. ముఖానికి చల్లగా తగిలింది. ముక్కు చివర వత్తుకొని ఎర్రబడింది. మోచేతుల మీది లేచి - అలాగే పాకుతూ చివరిదాకా వచ్చింది

ఆమెతోపాటు వచ్చిన ఆడవాళ్ళు భుజాలు పట్టుకొని బయటకు లాగారు చీకటి సొరంగంలో ఇంతసేపున్న అనూరాధ ముఖం భయంతో పాలిపోయివుంది. ప్రతిస్వేద రంధ్రంలోంచి ఓ చెమట చుక్క తొంగి చూస్తోంది. చల్లగాలి తగలగానే ముఖంలో రక్తం వురకలు వేసింది అనూరాధ కొంగుతో ముఖం తుడుచుకొంది. బయటికంటూ వచ్చిన కుచ్చిళ్ళు మళ్ళీ సర్దుకొని దోపుకుంది. పైకి లేచిన జుట్టు వేళ్ళతో సర్దుకుంది.

"గదేందే వొదినె - నీ కోడాలు బొట్టు పెట్కరాలె -" అనూరాధ చప్పగా చల్లారి పోయింది. కంతలోంచి బయటకు రావాలన్న తొందరేకానీ, బొట్టుపెట్టుకు రావాలన్న విషయం మర్చేపోయింది

"కొంపదీసి మళ్ళీ వెళ్ళ మంటారా?" అనూరాధ వారందరివైపు బిత్తర చూపులు చూసింది.

"అయితే ఏమాయెలె - లోనికెళ్ళివచ్చె - గంతెచాలు - పదని - పదని - ఎల్లమ్మ తానకు-".

"హమ్మయ్య బతికించింది!" అనూరాధ గుండెల మీద చేయి వేసుకుంది.

అందరూ మూటాముల్లె తీసుకొని ప్రధాన దేవాలయం వైపు నడిచారు

"కానీ ఇదేంటి? వీళ్ళల్లో ఒక్కళ్ళు కూడా ఆ సొరంగంలోకి దూరడం లేదు? తను వెళ్ళొచ్చాక వీళ్ళంతా వెళ్తారనుకొందే! అదేంటో మరి!" అనూరాధ ఆశ్చర్యపోయింది

బిలబిల ముందుకు వెళ్ళిపోతోన్న ఆడవాళ్ళని వడివడిగా నడిచి కలుసుకుంది. నారాయణమ్మ, రాజమ్మ ముందెళ్ళి పెద్దగుడి ముందున్న పెద్ద వేపచెట్టు కింద ఆగారు. అనూరాధ కూడా వాళ్ళవెనకే వెళ్ళి నిల్చుంది. నెమ్మదిగా చుట్టూ చూసింది. ఆ చెట్టుకింద ఓ చిన్న గుడివుంది మహావుంటే ఓ నాలుగయిదు అడుగుల ఎత్తుంటుందేమో! దానికో మూడు అడుగుల ద్వారం - ఎవరో దానిలోకంటా వంగివున్నారు దానికి కుడివైపున ప్రధాన గుడి మండపంలోని నంది వెనుక భాగం కన్పిస్తోంది. చాలా పెద్దనంది. కాస్త అటువైపు నడిస్తే ఏనాటి రాజులో వేసిన శిలాశాసనాలు వున్నాయి.

ఇందాక చూసిన సొరంగం గుడిలాగానే ఇక్కడా పూజారులు ఎవరూ లేరు

"గీమె దగ్గర కిరికిరి పెట్టకు. ఎల్లమ్మ శక్తి చూపిస్తది గీ ఎల్లమ్మకు మొక్కినంకనె రేణ్క పుట్టె -" నారాయణమ్మ అక్కడ మంటపంలో నెమరు వేసుకొంటోన్న నంది కో, శిలాశాసనాలకో చెప్పినట్లు అనూరాధకు చెప్పింది.

"రేణ్కమ్మ[1]ను పరుసురాండు[2] గొడ్డల్తోన నరికినపుడు గీడ పడిందంటారు గీమెనే ఎల్లమ్మ." రాజమ్మ చెప్పించి వంగి పూజ చేస్తున్న వాళ్ళు వెళ్ళిపోయారు

రాజమ్మ, నారాయణమ్మ వంగారు. నమస్కారాలు చేసి లేచి నిలబడ్డారు

"ఎల్లమ్మకు దండం పెట్టు -" నారాయణమ్మ అనూరాధను హెచ్చరించింది.

అనూరాధ ఆ చిన్ని ద్వారం గుండా వంగిలోపలికి తొంగి చూసింది నిశ్చేష్టురాలై నిలబడిపోయింది. ఆమె కళ్ళముందు ఏముందో కనిపించనంత దిగ్భ్రమ చెందింది.

అక్కడ ఓ తలలేని స్త్రీ నగ్నమూర్తి విగ్రహపు మొండెం వెల్లకిలా పడివుంది. తొడలు పక్కకు విప్పారి నేలమీద ఆనివున్నాయి. ఆ చిన్న ద్వారానికి సరిగ్గా ఎదురుగా ఆ విగ్రహ మర్మ స్థానం. ఆ చీకటి గుడిలో వెలుగుతోన్న కాగడా - ప్రమిదల వెలుతురులో ఆ విగ్రహం మీద వికృతమైన నీడలు పరుస్తున్నాయి. అంతకు ముందు పూజ చేసిన వాళ్ళు ఆ విగ్రహ మర్మస్థానం మీద పసుపు కుంకుమలు చల్లారు. అనూరాధలో తెలియని భయమేదో ఆవరించింది.

నగ్నంగా స్త్రీ నగ్నత్వం!

ఇలాంటి నగ్నత్వమే వేమనను భోగినుంచి యోగిని చేసి వుంటుంది

అనూరాధ తేరుకొని పైకి లేవబోయింది.

ఆమె మీదుగా ఓ పక్కనుంచి నారాయణమ్మ, రాజమ్మ వంగారు రాజమ్మ ఇంతకు ముందు పూజచేసిన వాళ్ళు వేసిన పసుపు కుంకుమలు తుడిచేసింది.

అనూరాధ కళ్ళు మూసుకుంది.

నారాయణమ్మ అదే స్థానంలో వెన్నముద్ద వేసింది.

"ఇంగో - కోడాల - ఇంగ రేణ్కమ్మకు మొక్కి - గా ఎన్న ముద్ద నాల్కతోన నాకు -" నారాయణమ్మ అనూరాధ వెన్నుమీద మునివేళ్ళతో చిన్నగా పొడిచింది.

---

1 రేణుక ఎల్లమ్మ, పరుశురాముడి తల్లి 2. పరుశురాముడు

అనూరాధ కడుపులోంచి పేగుల గోడల్ని తన్నుకుంటూ ఏదో సెగలు పొగలు కక్కుతూ గొంతులోకి తన్ను కొచ్చినట్లయింది

"యోనిమీద వేసిన వెన్నముద్దను నాలుకతో నాకడమా? ఛూ !"

జుగుప్స, అసహ్యం - అవమానం, నిస్పృహాయత - ముంచెత్తగా అనూరాధ ఒక్కసారిగా పైకి లేచింది నారాయణమ్మనూ రాజమ్మనూ విదుల్చుకొని గుడి బయటకు పరుగులు తీసింది

శివలింగాన్ని - పూజించడానికి లేని అభ్యంతరం రేణుక భగాన్ని పూజించడానికి లేదేం - అని ఆమె ప్రశ్నించుకోలేదు అడిగితే ఇది ఎంతగా తనకు అభ్యంతరకరమో అదీ అంతే అభ్యంతరకరమని నిస్సందేహంగా చెప్పి వుండేది.

ఆ కుటుంబంలో ఇమిడిపోవాలన్న తాపత్రయం - పెద్దవారి మాట మన్నించాలని నమ్మిన నిబద్ధత - కుటుంబాన్ని కలిపివుంచే బంధాన్ని బలపరుచుకోవాలనే ప్రయత్నం - ఆమెను ఇన్నాళ్ళు అత్తగారి కోడలిని చేసాయి. ఇన్నాళ్ళు అనూరాధ లేదు. నారాయణమ్మ కోడాలు వుంది. ఆక్షణమే వారిరువురి మధ్యన వుండాల్సిన అతిసున్నితమైన ఆత్మిక బంధం పుటిక్కన తెగిపోయింది. అనూరాధ మనసులో అనార్థమైన ఓ శూన్యం ఏర్పడింది.

"గీ ఉలిపికట్టె నా కొడ్కుకేడ చిక్కె? వాన్కి మరుల మందు పెట్టి మాయ జేసె. గిప్పుడు ఎల్లమ్మకు కోపం తెప్పిచ్చె. ఎల్లమ్మ గిట్ల కోపమయితే నా కొడ్కు బతుకు ఏమయితాదిరో దేవుడో-"

నారాయణమ్మ మోకాళ్ళ మీద కూలబడి తలకు రెండు చేతుల్తో బాదుకొంది

రాజమ్మ ఆమె భుజాన చేయివేసి ఓదార్చింది

"గా పోరి మా కొంప ఆగం చేసే కదె. రాజమ్మో .." నారాయణమ్మ గుండెల మీద చేతుల్తో కొట్టుకుంటూ వాపోయింది.

అనూరాధను ఆ గుడి ప్రాంగణంలో వున్న వారంతా ఆశ్చర్యంగా చూసారు. ముఖమంతా చెమట్లు, జుట్టులోంచి విడివడి ముఖాన చెమటకు అతుక్కున్న వెంట్రుకలు - గాల్లో తేలుతున్నట్లు ఉద్వేగంగా రొప్పుతూ పరిగెత్తుతోన్న ఆమెని చూసి "గీమెకు పిచ్చిగిట్ల పట్టిందా" అని ఆశ్చర్యపోయారు.

పరుగెత్తుతోన్న అనూరాధ బయట చింతచెట్టుకింద పడివున్న ఓ పెద్దరాయికి తగిలి మోకాలి చిప్ప పగలకొట్టుకుంది. రాయిమీదే తలవాల్చి - భోరున ఏడ్చింది.

తేరుకొని రాయి పట్టుకొనిలేచింది.

రాయిమీదున్న సప్త మాతృకలు ఆమె కన్నీళ్ళ అభిషేకం అందుకొని, ఆమెను చూసి నర్మగర్భితంగా నవ్వారు.



# 9

"పేరు చెపితే కానీ లోపలికి రానీయం" సరళ, పద్మ, అనూరాధ, కల్యాణి అందరూ ముక్త కంఠంతో అరిచారు

పెళ్ళి కొడుకు సుధాకర్, పెళ్ళి కూతురు గీత గుమ్మంలోనే నిలబడిపోయారు

సుధాకర్ అల్లరిగా నవ్వుతోన్న అనూరాధ వైపు ఆశ్చర్యంగా చూసాడు. అక్కడున్న మిగిలిన ముగ్గురిలాగానే తనూ చూస్తోంది అంతే.

మౌనంగా పక్కకు చూసాడు

గీత చిరాగ్గా కనుబొమలు చిట్లించింది

' ఓ . బోర్ . ! ఇంకా పల్లెటూరి ఫార్మాలిటీసా?' గీత సన్నగా గొణుక్కుంది ఆ మాటలు సుధాకర్ చెవిన పడనే పడ్డాయి.

సుధాకర్ గతుక్కు మన్నాడు

అతను తేరుకొనే లోపలే గీత మెళ్ళోని పూలదండను మెడ వెనక్కి జారుస్తూ బిగ్గరగా అంది.

"రండి, సుధాకర్ వెళ్దాం -"

ఈసారి ఆడవాళ్ళంతా గతుక్కుమన్నారు ఒకరి ముఖాలు ఒకరు చూసుకొన్నారు.

సుధాకర్ పెళ్ళి కూతురు పేరు చెప్పలేదన్న విషయం కూడా మరిచి, వారికి దారి వదిలేసారు.

గీత నిర్లక్ష్యంగా లోపలికి నడిచింది. వెనకే సుధాకర్.

చేతిలోని హారతిపళ్ళెం అలాగే పట్టుకొని - అనూరాధ నోరు తెరిచేసింది. పెళ్ళి కూతురు లోపలి గదిలోకి వెళ్ళగానే అందరూ ఒక్క సారిగా తేరుకొని - భుజాలెగరేసారు.

"వదినా - హారతి పళ్ళెంలో డబ్బులు పెట్టలేదేంటి ?" కల్యాణి నిరుత్సాహంగా అంది.

"కర్పూరం కూడా అయిపోయింది!" సరళ పెదవివిరిచింది.

"పదండే అమ్మ నడగుదాం-" పద్మ నడుం బిగించి అందర్నీ శాంతమ్మ దగ్గర్కి బయలు దేర తీసింది.

సావిత్రి గుమ్మంలోనే ఎదురయ్యి తలో నూటపదహార్లు ఇచ్చింది. వాళ్ళంతా లోపల గదిలోకి వెళ్ళుతూ ఆ డబ్బులో ఏవేం చేయాలో మహా ఉత్సాహంగా మాట్లాడుకుంటున్నారు.

"అవునే గీతా - వీళ్ళు ముగ్గురంటే నీకు ఆడపడుచులు మీ అత్తగారు హారతి డబ్బులు ఇచ్చారు బానే వుంది. మరి ఆ అమ్మాయి వరుసెట్టా అవుద్దే?" కొత్త పెళ్ళి కూతురితో పాటు వచ్చినావిడ అనూరాధను చూపిస్తూ గట్టిగానే అంది.

అమ్మాయిల అందరి ముఖాల్లోని నవ్వుతుడిచి పెట్టినట్టు మాయమైంది.

మౌనంగా అయిపోయారు.

అనూరాధ ముఖం పాలిపోయింది. చేతిలోని డబ్బులు కల్యాణి చేతిలో పెట్టేసి చరచరా బయటకు వెళ్ళి పోయింది.

"నిజానికి వాళ్ళిద్దరు కూడా మన గీతకు సొంతాడుపడుచులు కారు. ఈ అమ్మాయి ఒక్కటే ఆడపడుచు-" ఇంకొకామె కల్యాణిని చూపిస్తూ అంది.

పద్మ, సరళ కూడా కల్యాణి చేతిలో డబ్బు పెట్టేసి బయటకు వెళ్ళి పోయారు.

కల్యాణి నిశ్చేష్టురాలైంది. ఒంటరిగా నిలబడి పోయింది అరక్షణంలో తేరుకొని తనూ వాళ్ళ - వెనుకే పరుగులు పెట్టింది.

"ఆవిడ్నే సుధాకర్‌కి చేసుకోవాలను కొంది-" గీత చుట్టం అనూరాధను గురించి ఆరా తీసింది.

కొత్త పెళ్ళి కూతురు మూతి మూడు వంకర్లు తిప్పింది.

❋ ❋ ❋

బంధువుల భోజనాలు అయిపోయాయి.

కూలీలు, గాసగాళ్ళు వాళ్ళ కుటుంబాలతో సహా - బంతిలో కూర్చున్నారు. రామనాథం బయల్దేరుతున్న వాళ్ళని సాగనంపుతున్నారు. బాలయ్య కూడా బయల్దేరడానికి బండి కట్టించమని పురమాయిస్తున్నాడు.

రామనాథం, శివుడు బాలయ్య దగ్గరకు వచ్చారు.

"నేను ట్రాక్టరు ట్రక్‌తో వదిలి వస్తానులేండి - బండిని వెళ్ళనియ్యండి -

"పెండ్లి పనుల మున్గి వుంటరు. మేం పోతంలెండి."

"అనూరాధను నాలుగురోజులు ఆగి వస్తుంది లెండి-"

"నాల్గు దినాలు గాకుంటే నెల పెట్కోండి. మీ ముచ్చట-" బాలయ్య నవ్వాడు, "ఏమైన గీ రోడ్డు పడ్డంక మా వూరు మూలకయ్యె-! గీ వూరు గిట్ల గిట్ల పెరిగి పట్నమైతదేమో"-! రామనాథం నవ్వాడు.

అప్పుడే సావిత్రి నారాయణమ్మను అడుగుతోంది.

"అనూరాధ మళ్ళీ మళ్ళీ రావడం వీలు పడదు కదండీ - నాల్రోజులు వుండి వస్తుంది లెండి -"

అనూరాధ మౌనంగా తలవంచుకొని వుంది. ఆమె సమాధానం కోసం చెవులు రిక్కించింది.

"నా యిష్టమేడుంది? ఆమె ఇష్టం - ఆమె మగని ఇష్టం -" నారాయణమ్మ మాటలోని విసురుకు సావిత్రి తెల్లపోయి అనూరాధ వైపు చూసింది

అనూరాధ ముఖం అభావంగా వుంది.

నారాయణమ్మ కోడలికి మాట మాత్రం చెప్పకుండా చరచర వెళ్ళి బండెక్కడం కూడా సావిత్రి గమనించింది.

అనూరాధ వాకిట్లో దాకా వచ్చినా అంటీ ముట్టనట్లుగా వుంది.

పెళ్ళి వత్తిడి తగ్గాక ఎక్కడి వాళ్ళక్కడ సర్దుకున్నారు. సరళ వాళ్ళు కూడా ఇప్పుడు రాంనగర్‌కే వచ్చేసారు.

పద్మ, సరళ, అలుళ్ళు వాళ్ళ ఇళ్ళకి వాళ్ళు పోయారు.

కల్యాణి, అనూరాధ కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

"ఎలా వుంటుందే కల్యాణి డాక్టర్ చదువు?"

"వొట్టి గాడిద చాకిరీ వొదినా-" కల్యాణి పెద్ద భారం మోస్తున్నట్లుగా అంది. అనూరాధ ఆశ్చర్యంగా చూసింది.

"అదేంటే అట్లా అంటున్నావ్?"

"నిజం వదినా - ఒక్కపూట చదవకుండా ఏమారామా . . .ఇక అంతే సంగతులు!" కల్యాణి తలమీద రెండు చేతులు పెట్టుకొని విచారం నటిస్తూ అంది.

అనూరాధ కల్యాణి వాలకానికి ఫక్కున నవ్వింది

పందిట్లో కూర్చున్న మల్లేశ్ అనూరాధ వంక చూసాడు.

'అలా అనూరాధ నవ్వగా తాను చూసి ఎంతకాలమైందో' - మల్లేశ్ అలా చూస్తే ఎవరైనా ఏదైనా అనుకుంటారని కూడా భావించకుండా భార్యకు కళ్ళప్పగించాడు.

"నిజం వదినా - గొంగళి పురుగులా పుస్తకాలన్నీ మేసి - మేసి కళ్ళ జోడు లావెక్కి - లావెక్కి -" కల్యాణి తమాషాగా అభినయిస్తూ చెప్తోంది.

అనూరాధ పకపక నవ్వింది. నవ్వీనవ్వీ. పొలమారే దాకా నవ్వింది. కళ్ళల్లో నీళ్ళు తిరిగాయి. తలమీద అరచేత్తో చిన్నగా కొట్టుకొంటూ తేరుకొంది. మళ్ళీ నవ్వింది.

మల్లేశ్ ఆశ్చర్యంలో మునిగి పోయాడు. ఆ కల్యాణి దగ్గర అనూరాధను నవ్వించే మంత్రమేమైనా వుందా? అడిగి తెలుసుకోవాలి!

అనూరాధ నవ్వు అతని మనసులో సన్నని ప్రకంపనాల్ని కలిగిస్తూ వారి మొదటి కలయిక దాకా తీసుకెళ్ళి ఆ తియ్యని జ్ఞాపకాల ఊబిలో పడేసింది.

"అలా మేసిమేసి - ఓ నాటికి చక్కని సీతాకోక చిలుకలా చిట్టి డాక్టరమ్మవు అవుతావులేవే-" అనూరాధ కల్యాణి గడ్డం పుచ్చుకొని హాస్యంగా వూపుతూ అంది.

"ఇదుగోండి అమ్మాయిలూ - ఆ గొంగళి పురుక్కీ ఈ సీతాకోక చిలుక్కి మధ్యన నిద్రావాస్థ ఒకటి ఏడ్చింది కదా - ఆ అవస్థ ఏదో మమ్మల్ని పడనీయండి-" పక్క మంచం మీద పడుకోవాలని ప్రయత్నిస్తున్న భారతి అంది

ఈసారి కల్యాణి అనూరాధ ఇద్దరూ పొట్ట చెక్కలయ్యేటట్టు నవ్వారు.

మల్లేశ్ ను ప్రేమ తరంగం ముంచెత్తింది.

అనూరాధ వంక మురిపెంగా చూస్తున్నాడు.

కల్యాణి మల్లేశ్‌ని చూసింది

"వదినా - -" కల్యాణి మెల్లిగా అనూరాధ డొక్కలో మోచేత్తో పొడుస్తూ అంది," అదుగో - తలెత్తిచూడు - ఎలా మిర్రిమిర్రి చూస్తున్నాడో అన్నయ్యకు నిద్ర పడుతున్నట్లు లేదు, పోయి ఏంకావాలో కనుక్కురా వదినా.!!"

"ఛ - పో ! సిగ్గులేదూ?" అనూరాధ సిగ్గుతో ముఖం ఎర్రబరుచుకొంది.

"పోనీ నేవెళ్ళి కనుక్కురానా?" కల్యాణి అల్లరిగా నవ్వింది.

"తన్నానంటేనా . . ?" అనూరాధ కల్యాణిని మొట్టికాయ వేయబోయింది కల్యాణి తప్పించుకొని నవ్వుతూ లోపలికి పరుగు తీసింది - అనూరాధ ఆమెను వెంబడించింది.

అనూరాధ వెళుతూ విసిరిన వాలుచూపుతో మల్లేశ్ తేరుకొన్నాడు.

'అనూరాధ అలా నవ్వుతుంటే ఎంత సంతోషంగా వుంది. ఎంత హాయిగా వుంది. తమ ఇంట్లో వున్నపుడు ఇలా నవ్వుతూ తుళ్ళుతూ చలాకీగా ఎందుకు వుండదు ? ఈ హుషారు - ఈ హాస్యాలు ఈ వేళాకోళాలు - ఈ ఇంటి గుమ్మందాటగానే మంత్రం వేసినట్లు మాయమై పోతాయేం? అనూరాధ తమ ఇంట్లో ఇమడలేక పోతోందా? అమ్మ ఏమైనా . . .?' మల్లేశ్ కళ్ళ ముందు నారాయణమ్మ మెదిలింది. 'అవును, ఆమె కూడా ఈ మధ్య ఎందుకనో అదో మాదిరిగా వుంటుంది. ఎందువల్ల? ఏదైనా అత్తా కోడళ్ళ వ్యవహారమా' ఛ - అనూరాధ లాంటి అమ్మాయిని ఎవరైనా కళ్ళు కద్దుకొని చూస్తారు. అందులోనూ అమ్మ! తనన్నా రేణుకన్నా ఎంత ప్రాణం! తను వూరికే ఏవేవో వూహించు కుంటున్నాడు.'

మర్నాడు పుదయం రామనాథంతో పాటు మల్లేశ్ చేలో గట్ల వెంట నడుస్తూ వెళ్ళాడు ఇద్దరు వాగొడ్డు పొలం దాకా వెళ్ళారు.

"ఇదుగో మల్లేశ్ - ఈ వాగొడ్డు నుంచి ఆ బోడి తుమ్మ చెట్టు దాకా మీ పొలమే -" రామనాథం మల్లేశ్‌కు చూపించాడు.

రామనాథం అలా అనేటప్పుడు అతని కంఠం సన్నగా వణకడం మల్లేశ్ గమనించాడు

రామనాథం వాళ్ళు ఆ పొలంలో పంట వేసేప్పుడు వరి వేసే వాళ్ళు, బాలయ్య వాము ష్తున్నాడు.

రామనాధానికి ఆ పొలానికి వున్న అనుబంధం మల్లేశ్‌కు తెలుసు అందుకే చాలా సేపు మనాధాన్ని పలకరించలేదు. రామనాథమే ముందు తేరుకున్నాడు

"అవును అబ్బాయ్ - ఇంక ఏం చేద్దామనుకుంటున్నావ్?"

"ఏవుందండీ - మళ్ళీ దుక్కులు మొదలవుతున్నాయిగా - నాన్నతో పాటు పొలంలో గుదామను కొంటున్నా -"

"అదేంటబ్బాయ్ - పోస్టుగ్రాడ్యుయేట్‌వి ప్రయత్నిస్తే మంచి ఉద్యోగం రాదూ?" ామనాథం ఆశ్చర్యంగా అడిగాడు.

"ఎంప్లాయిమెంట్ ఎక్చేంజ్‌లో రిజిస్టర్ చేయించు కొన్నాను. కొన్ని రోజులు ఆగాలి ;దండీ - ఆ ప్రవేట్ కాలేజీలో టెంపరరీ లెక్చరర్‌గా బిక్కుబిక్కుమంటూ ఎక్కడ వుద్యోగం చేయగలమండీ- అందుకే ఇంటికి వచ్చేసాను."

నారాయణమ్మ అసంతృప్తిని అనూరాధ నిర్లిప్తత గురించి సావిత్రి అప్పటికే అతనితో ప్రస్తావించింది. "ఏంటీ? అనూరాధ వాళ్ళల్లో ఇమడ లేక పోతోందా? ఏదైనా గొడవ పెట్టుకొని వచ్చిందా?" రామనాథం నొసలు ముడిపడ్డాయి "వచ్చినప్పటి నుంచి ఎంత చలాకీగా వుందో - ఆరోజు వాళ్ళ అత్తగారు భోజనాలకి వస్తే ఎందుకని ముఖం మాడ్చుకుంది?"

చివరికి అడగలేక అడిగాడు, "బాబు - అనూరాధ వల్ల ఏమైనా ఇబ్బంది - అదీ-"

"అబ్బెబ్బే - అలాంటిదేం లేదండీ -" మల్లేశ్ రామనాథం మాటలకు అడ్డొస్తూ అన్నాడు,' ' అయినా అనూరాధ నాకు ఈ మధ్య నుంచే తెలుసు. మీరు పుట్టినప్పటి నుంచి ఎరుగురు. అనూరాధలో వంక పెట్టాల్సిన గుణాలేమైనా వున్నాయా?" మల్లేశ్ ఎదురు ప్రశ్నించాడు

రామనాథం మనసు తేలిక పడింది.

"నిజమే - అనూరాధ మా అందరికి ప్రాణంలో ప్రాణం. కానీ కొత్త దాంపత్యంలో ఇమడడం అనేది సామాన్యమైన విషయంకాదు. చూడు - పెళ్ళినాటి వరకు తను గడిపిన జీవితాన్నంతా మరిచేసి - కొత్త జీవితం రచించుకోవాలి! అది ఆడవాళ్ళకు విధించిన శాసనం! ఆడపిల్ల అత్తగారింట్లో సర్దుకు పోవాలన్నది సలహాకాదు శాసనం. ఆమె అంతకు ముందు బతికి వచ్చిన జీవితమంతా శూన్యం చేసుకోమన్న ఆదేశం. ఏమనిషైనా పుట్టి పెరిగిన వాతావరణాన్ని వదిలి కొత్త వాతావరణంలో ఇమడం ఎంత కష్టం! ఆ ఎడబాటు దుఃఖాన్ని మేము అనుభవించాం ఒక ప్రాంతాన్నుంచి వచ్చి ఇక్కడ ఇమడానికి ఇంత కాలం పట్టింది. అందువల్ల అనూరాధ తెలిసో తెలియకో ఏదైనా '. ."

రామనాథం గొంతు బొంగురు పోయింది

"అలాంటి దేమీ లేదండి, అనూరాధ మీద నా తరుపు నుంచి ఎలాంటి అపవాదు లేదు ఎలాంటి అసంతృప్తిలేదు. మీకు అనూరాధ ప్రాణంలో ప్రాణం. నాకు ఇంకా ఎక్కువే ..'

❋ ❋ ❋

"మల్లేశ్, ఏందిరా పట్నంల నౌక్రీ[1] ముచ్చట చెప్తలేవు -"

బాలయ్య ఓ శుభోదయాన కొడుకును నిలేసాడు.

మల్లేశ్ తనతో పాటు పొలం కొస్తుంటే మొదటి మూడు రోజులు ముచ్చట పడ్డాడు. రామనాథం వాళ్ళ ట్రాక్టర్ తీసుకొచ్చి దున్నుతోంటే ఆశ్చర్యంగా నోరెళ్ళ బెట్టాడు.

దుక్కులు అయిపోయాయి. రామనాథంతో పాటు సింధనూరు వెళ్ళి మల్లేశ్ విత్తనాలు పట్టుకొచ్చాడు. ఇక బాలయ్య అయోమయంలో పడిపోయాడు.

కొడుకు ఉద్దేశం ఏంటో అతనికి అర్థం కాలేదు. తన తండ్రి ఆదుర్దా మల్లేశ్‌కు అర్థం అయ్యింది. తన నిర్ణయం చెప్పి కంగారు పెట్టడం ఎందుకు లెమ్మని హాస్యానికి దిగాడు.

"ఏం నాయనా-నీ కొడుకు మహాపాడిచొచ్చాడని నౌక్రీ సిద్ధంగా వుంటుందే? ఇవ్వాళ రేపు ఉద్యోగం దొరకడం కనా కష్టం. దొరికినా చేయడమూ కష్టమే-"

"మల్ల ఏం జేస్తవ్ బిడ్డా;" ఆందోళనగా అన్నాడు బాలయ్య

"మిలిట్రీల పొమ్మంటవా;"

మల్లేశ్ పరాచికానికి అన్నాడు. "పొద్దుగాల పొద్దుగా మంచి మాట చెప్పు బిడ్డా పైన తదాస్తు దేవుండ్లుంటరు-"

"అందుకే-కొద్ది దినాలు ఇక్కడే వుంటాను తరువాత వెళ్ళి ఉద్యోగం చూసుకుంట-పేరు రాయించి వచ్చేలే-" బాలయ్యకు అర్థం అయ్యేట్లు చెప్పానని మల్లేశ్ తృప్తిపడ్డాడు. నిజానికి బాలయ్యకు ఒక్క ముక్కా బుర్రకెక్కలేదు.

"ఏమయితే అయితది తియ్-సదువు నేర్చినోనివి నీ ముచ్చట నీకు తెల్వదా?" బాలయ్య కొడుకు మీద కొండంత విశ్వాసం ప్రకటించేసాడు.

"నాయనా-ముందు మనం ఎక్కడక్కడ ఏవేం పంటలు చేయాలో నిర్ణయింకుందాం-"

"గదేంది బిడ్డా- మీ అమ్మ జొన్నలు, బుడ్డలు[2] ఏద బెట్టనింకె షురుబెట్టె[3]. గిప్పుడు ఈ ముచ్చట పెట్టివి. అవ్‌గానీ, నువ్వు తెచ్చిన యిత్తులు రాంనాథమోళ్ళని కాదె? గిక్కడెందుకుపెట్నవ్?"

"అవి మన కోసమే నాయనా - రాంనాథం చిన్నాయన తోన మాట్లాడాను. మనం కూడా ఈసారి ప్రత్తి, మిరప వేద్దాం. విత్తులు కూడా చిన్నాయన తీసిచ్చాడు. అదుగో ఆ వాగొడ్డు పొలంలో ప్రత్తి వేద్దాం. వాగుకు ఇవతల జొన్న-పడమర పొలంలో మిరప ఏమంటావ్?"

"గట్లనే కొడ్కా - గా రాంనాథం చెప్పిండంటే ఇంగ ఆ మాట తిరుగులేదు. ఏ మైనా

1 ఉద్యోగం 2. వేరుశెనగలు 3. మొదలుపెట్టింది.

రాంనాధం గట్టోడు. ఎసుమంటి బీడును బంగారు రేగడి చేసిండు ఎన్నితిప్పలు పడ్డడు నాకెర్క! గీదినం ఈ నడిగడ్డ మింద ఆయనకు మించిన సేద్యగాడు లేడు. మా దోస్తాని[1] కసం[2]! ఆయన మాట ఇని చెడినోడు లేడు. నువ్వుగిట్ల ఆయన మాట తప్పకు-" బాలయ్య కొడుకుతో చెప్పాడు.

మల్లేశ్‌ను అనూరాధ మొదటిసారి కోరిన కోరిక మనసులో మెదిలింది

"రాత్రిపూట ఆ పశువుల్ని బయట ఎక్కడన్నా కట్టించే యకూడదూ - తలుపులన్నీ మూసేస్తే ఆ వాసన ఆరొచ్చు ఆవిర్లు తేలుతోంది. అయినా పశువులని కూడా శుభ్రమైన గాలి అవసరమని అంటారు కదా-" అనూరాధ మల్లేశ్ చెప్తే ఏమనుకొంటాడో అని తటపటాయిస్తూ సగం మాటలు మింగేస్తూ కోరిన మొట్ట మొదటి కోరిక.

మల్లేశ్ ఆ గది చుట్టూ చూసాడు. అది గాడిపాడు. పశువులను కట్టేసుకొనేగది. విశాలమైన ఆ గదిలో గాళ్ళు, గడ్డిమేట, చొప్పవాము, పిడకల కుప్ప, మొచ్చుమీది పాత సామాన్లు - గోడలో దిగేసిన కొయ్య ముక్కలకు వేళ్ళాడు తోన్న తోలు పట్టెడలు తాళ్ళు - అక్కడక్కడ గోడలకు కొట్టివున్న పిడకలు. మల్లేశ్ ఆ గది రాత్రి పూట ఎట్లా వుంటుందో వూహించుకున్నాడు. ఎద్దులు, ఒక ఆవు, రెండు గేదెలు, పాతిక గొర్రెలు, పది మేకలు, కోళ్ళ గుంపు.

ద్వారం మూసేస్తే కప్పులోని ఆ అడుగు తీసేసిన కుండ - గవాసి - గుండా వచ్చేదే గాలీ వెలుతురు.

అనూరాధ అన్నట్లు పశువులకి గాలి విస్తారంగా కావాలి. నిజమే. కానీ ఆమె చెప్పదలుచు కుంది అదేకాదు.

ఈ పశువుల మధ్య నలుగురు మనుషులు వున్నారు. వారికి ధారాళంగా గాలి కావాలి. స్వచ్ఛమైన గాలి.

కానీ తను పుట్టి బుద్ధెరిగినప్పటి నుంచి ఇలాగే వుంటున్నారు. మళ్ళీ అమ్మమ్మ వాళ్ళ ఇంట్లో కల్వకూర్తి వైపున ఇలాలేదు. ఈ నడిగడ్డ మీది ప్రతి యిల్లూ అంతే, అదేంటో -

"నాయనా - పశువుల కోసం ఓ కొట్టం వేద్దామా?"

"ఏం బిడ్డా, గిక్కడ గాడిపాడు సరింగ వుందిలే -"

"ఇట్లా పశువుల్ని గదిలో మూసి పెట్టడం మంచిది కాదు నాయనా, వాటికి గాలి కావాలి

"పగలంతా పొలం ఎంబటి తిర్గి గాలి పోస్కుంట లేవూ? అయిన గీడ బయలు కొట్టం పెట్టరాదు - పశుల దొంగలు ఒక్క పొద్దు వాటిని పానంతోన వుంచు తరుకున్నవా? మానాయన జమానల[3] మన కొక ఎఙ్జావు వుండె. గా దొంగ ముండ కొడ్కులు కోస్క తిన్నంక తోలుతెచ్చి - ఇంటి ముంగట ఏసి పోయిన్రు."

బాలయ్య కంఠం రుద్ధమయింది.

---

1 స్నేహం 2. ఒట్టు 3. కాలం

మల్లేశ్ కూడా బాధపడ్డాడు

"మా తాత జమాన కెల్లి పశుల ఇంట్ల కట్టున్నం చూసిచూసి ముద్దుగా పెంచిన పశుగా కసాయోల్ల పాల పడనిస్తమా? గా లంజ కొడ్కులు ఎద్దుల గూడా బత్కనియ్యరు"

"మరి రామనాథం చిన్నాయనోళ్ళు ఎట్ల చేస్తున్నారు-" మల్లేశ్ మదత ప్రశ్నవేసాడు.

"వాల్లకు మాత్రంతప్పిందా? గా షికారోల్లు దసరా పండగొచ్చిదంటే ఏరు దాటి ఊర్ల మింద పడ్తరు గా సావిత్రమ్మ కోళ్ళు ఎత్తక పోయిన్రు ఒక పారి ఆవునెత్తక పోనింక జూస్తే-శివుడు సవారి షికారోన్ని చెట్టుకు కట్టి కొట్టిన్రు

అది మొదులు వాళ్ళ తానకు పోతలేరు పాపం, గా సావిత్రిమ్మ కంటికి మింటికి ఏడ్వ బట్టె-"

"అయినాగానీ, నాయనా - వాళ్ళు భయపడకుండా బయలుచావిడి వేసుకోగా లేనిది మనం ఎందుకు వేసుకో కూడదు అంత గయితే చావిట్లో ఓ పక్కన గది వేసిస్తే గాసగాళ్ళుంటారు - నిషూగా వుంటుంది."

"చూతాం లేరా-"

"బాలయ్య పెదనాయనా -" బయటనుంచి ఎవరో కేకేసారు.

బాలయ్య - మల్లేశ్ బయటకు వెళ్ళారు

"ఏం లేదె - నీ దోస్తు తాన ఏవో యిత్తులు గిట్ల ఉండ్నవే గవి ఏదబెట్తే ఇరగపండ్తందె. నాగ్గిట్ల ఇప్పిస్తావ్?"

రామనాథం వాడుతోన్న సంకర జాతి విత్తనాలను ప్రస్తావిస్తూ అన్నాడతను

"నాకేమెర్క - ఆయనకె అడిగెదుండె-"

"గట్లంటె ఎట్లనె పెదనాయన - నీ మాటలు నీ దోస్త్ యింటడు . . " రాజయ్య భారమంతా బాలయ్య వేస్తూ అన్నాడు.

"ఇంతకీ ఏం పంట వేయాలన్నా -" మల్లేశ్ నవ్వుతూ కల్పించుకున్నాడు.

"ఏమేస్త? తెల్ల జొన్నలు - గీ రాగట్ల ఏ మెస్తం?"

"జొన్న విత్తనాలు తీసుకురాలేదు. ఈసారి వాళ్ళు ప్రత్తి, మిరప వేస్తున్నారు మరి."

"గా పంటలు నేనేడ పండిత్తు. జొన్నలయితే ఎర్క-" రాజయ్య నిరాశ పడ్డాడు. "వాము గిట్ల ఏస్నగానీ మన ముచ్చట."

"ఎప్పుడేసె పంటలె గాదె - గీ దుక్కిల ఏరే పంట ఏదపెట్టరాదె కాలవల నీళ్ళు గిట్ల వుండె" -

"గ్రాపత్తి ముంగారి పత్తి తీర్నకాదె -

"నీ కాల్మొక్త - గా వూసెంతకు, గా పత్తి చేల ఎంత చాకిరీ చేయాల? ఎన్ని మందులు కొట్టాలా? గా రాంనాధం టక్కులటక్కుల ఎరువు తెప్పించి మట్ల పోస్తుండు నా వల్ల ఏమయితదె పెద నాయనా జొన్నలు ఏదపెట్టిన మంటే - కలుపేం తీస్తమో - మంచె ఏస్కోని వడిసెల పట్టుకొని కూసున్న మంటె ఖతం, పంట ఇంట్ల వచ్చె గా రాంనాధం పడిటట్ల సుతారాల నేనేడ పడుదు-"

మల్లేశ్ బాలయ్య నవ్వారు

"మల్లయితే వొస్త పెదనాయనా గీ సేద్యం చేయనింకె యాష్ట కొస్తుంది ఎవలకన్నా గుత్త కిచ్చి - పంత్త మానిపిస్తుంది-"గొణుక్కుంటూ - రాజయ్య వడివడిగా వెళ్ళి పోయాడు

"కాలవలొచ్చినంక గీ పాట పాడ్తున్రు - ముంగల్నే మంచి గుండె ఎవ్వన్కీ పంట పండేద్ది ఫికరు లేకుండే - గిప్పుడు వాని పంట వీని పంట చూసి పరేషాన్ అయితున్రు -"

"ఆ ఆరాటం ఉండడం మంచి దేగా నాయనా- నడిగడ్డ మీద పంట ఉత్పత్తి పెరుగుతుంది-"



"లే. . . లే. . . నా రాజా -

లేపమంటామా నువ్వే లేచి వస్తావా "

ఎల్లారీశ్వరీ ఎల్లలు మరిచి బిగ్గరగా పాడుతోంది.

"ఎవఁ్రా అది" జుగుప్సతో ముఖం చిట్లించి అన్నాడు రామనాధం

"ఏమో బాబాయ్ -" శివుడు తేరిపార జూసాడు

వెన్న ముద్దలా విచ్చిన వరలక్ష్మి పత్తితో పాటు పల్లెపడుచు ఫక్కున నవ్వింది. పల్లెపడుచు సుతారంగా పత్తిని తీసింది. వయ్యారంగా వళ్ళో వేసుకుంది.

"ఇకిలించడం ఆపి జాగ్రత్తగా తియ్యి - ఎండుటాకులు పుల్లలు ఇరుక్కుంటాయి. భద్రం!" శివుడు ఆ అమ్మాయిని హెచ్చరించాడు.

ఆ అమ్మాయి బుద్ధిగా తలాడించింది.

శివుడు అంగలు పంగలేసు కుంటూ పాట వచ్చిన వైపువెళ్ళాడు. రామనాధం అతన్ని వెంబడించాడు.

ఓ పెద్ద తుమ్మ మాను చాటుకు వెళ్ళిన శివుడు రామనాధాన్ని రమ్మని పిలిచాడు. ఎవరో గానీ , తుమ్మమాను లోకి పెద్ద మేకు దిగేసి, ఓ ట్రాన్సిస్టర్ తగిలించారు.

శివుడు టక్కున దానిని ఆపేసాడు "నోరు మూసుకోవే-" దాని నెత్తిన ఓ మొట్టికాయ కూడా వేసాడు.

"ఎవరిదిరా ఇది?" రామనాథం ఇంకే ముఖం చిట్లించుకొనే వున్నాడు.

"సరళక్కాళ్ళదిలా వుంది బాబాయ్-" శివుడు దాని చేతిలోకి తీసుకొని అటూ ఇటూ తిప్పి చూస్తూ అన్నాడు

"ఇంటికి తీసుకెళ్ళి ఇచ్చిరా-" గంభీరంగా అన్నాడు రామనాథం అతని మనసులో అప్పుడికప్పుడు కట్టుకొని పాడే పల్లెవారి పాటలు మెదిలాయి. ఆ పాటల్లోని తియ్యదనం, స్వచ్ఛత, రాముడి చేత నాగలి పట్టించడం సీత చేత విత్తనాలు విత్తించడం - అబ్బ !"

ఇంతలోనే పక్కన గుడిసెలో పడుకొని వున్న ప్రసాద్ బయటకు వచ్చాడు, "ఎవ్రా పాట ఆపిందీ" అంటూ-

రామనాథాన్ని శివుణ్ణీ చూసి గతుక్కు మన్నాడు.

"మీరా మామయ్యా - ఎంత సేపయింది వచ్చి?" వినయం వుట్టి పడుతుండగా వొరిగి నిల్చుంటూ అన్నాడు ప్రసాద్.

"ఇప్పుడే-" రామనాథం నిర్లిప్తంగా అన్నడు. 'అతివినయం ధూర్త లక్షణం' శివుడు మౌనంగా ట్రాన్సిస్టర్ అతని చేతికి ఇచ్చాడు.

'పొలంలో పత్తి తీస్తున్నారు ఈయన శుభ్రంగా భోంచేసి గుడిసెలో పడుకొని గుర్రు పెడుతున్నాడు. ఏం అనాలి ఈ మనిషిని!' రామనాథం, శివుడు ఎవరి మనసుల్లో వాళ్ళు చిరాకుపడ్డారు.

'ఎంతయినా ఇంటల్లుడు-' రామనాథం తమాయించు కొన్నాడు

'తాత ముత్తాతల్నాటి పొలం అమ్మి - వీళ్ళకు పొలాలు కొనిస్తిమి, ట్రాక్టరుతో దున్నిస్తిమి. విత్తనాల దగ్గర్నించి ఎరువుల దాకా పెట్టుబడి పెడితిమి. కూలీలు గాసగాళ్ళు అంతా తమ లెక్కలోనే. ఇంక పంట చేతి కొచ్చిన్నాడన్నా దగ్గరుండి పత్తి తీయించుకోకపోతే ఎట్లా?"

"అవున్రా శివుడూ- భాస్కర్ ఎక్కడా?" రామనాథం ఆరాతీసాడు. భాస్కర్ పద్మ భర్త. ఆ యింటి పెద్దల్లుడు.

"ఆయన వేరుశనగ పీకిస్తున్నాడు మరి!" శివుడు అదో మాదిరిగా అన్నాడు.

ఇద్దరూ ఏమి మాట్లాడకుండా పత్తి చేను వైపు కదిలారు. కాస్త చదరంగా వున్నచోట ఖాళీ అయిన సూపర్ సంచులు కుట్టి తయారు చేసిన పట్టాను పరిచి వున్నారు. ప్రత్తి తీసింది తీసినట్లు గంపల్లో తెచ్చి ఆరేస్తున్నారు.

"ఏం చేద్దాం బాబాయ్ - మిరప చేలో కాయలు కోయించొద్దూ మొక్క మీదే కాయలు పండు బారి పోతాయేమో-"

"ప్రత్తి బూరేలు తొక్కేసి - రాయచూర్‌కు పంపించేద్దాం. వెంటనే మిరప కోయిద్దాం."

ట్రాక్టర్ మీద పత్తిని ఇంటికి తీసుకెళ్ళారు. వరలక్ష్మి వారి గడపలో కాలు పెట్టింది. సంసార మంతా వంటింట్లోకి సర్దుకుంది.

పెద్దింట్లో పైకప్పు దాకా పత్తినిండిపోయింది. పొలాల్లో పత్తి తీతఅయిపోగానే - ప్రత్తి తొక్కడాని - గుంజలు పాతారు

చదరంగా నాలుగు గుంజలు పాతారు చిక్కాం నాలుగు చివర్లని వాటిని ముడేసారు. గంపలతో ప్రత్తి తెచ్చి పోస్తుంటే ఒక్కొ[1]చిక్కాంలో ఇద్దరు మనుషులెక్కి - అదిమి తొక్కుతున్నారు దస్తగిరి గబగబ రామనాథం దగ్గరకు వచ్చాడు.

"గిదేంది రాంనాథం సాబ్ - ఇయ్యాల రేపు నాకు బేరమిస్త లేవు?" తన అధికారాన్నెవరో బలవంతంగా లాక్కుంటుంటే తల్లడిల్లి పోతున్నట్లుగా అన్నాడు

రామనాథం, శివుడు ముఖాలు చూసుకొన్నారు నిజమే, మొదట్లో తనకు ఇక్కడి సంతలు తెలియనప్పుడు దస్తగిరి ధాన్యం అమ్మిపెట్టాడు. ఇప్పుడు మహబూబ్ నగర్, జడ్చర్ల, పెబ్బేరు, వనపర్తి, గద్వాల - ఇటు కర్నూలు - అటు రాయచూర్ - అన్నీ బాగా తెలిసిపోయాయి అందులోనూ మనషుల బలగం పెరిగింది. రోడ్డు ఊర్లోంచిపోతోంది అది 7వ జాతీయ రహదారి నుండి గద్వాల, రాయచూర్‌ల మీదుగా కర్ణాటకలోకి వెళ్ళే లింక్ రోడ్డు లారీలు తిరిగినవి తిరిగినట్టే వుంటున్నాయి.

"దస్తగిరి, కాస్త నిదానంగా కూర్చోవయ్యా-రా-"

రామనాథం అతన్ని ఆహ్వానించాడు.

"నన్నుగిట్ల మర్సినా రాంనాథం సాబ్"-

"భలేవాడివయ్యా నిన్నెలా మర్చిపోతాను?"

మొదట్లో దస్తగిరి చేసిన సాయ్యం మర్చిపోయేది కాదు రామనాథం అనుకొన్నాడు.

దస్తగిరి శివుడు తెచ్చిన మజ్జిగ తాగి కాస్త ఉపశమించాడు.

"నీవంటే సరె - కానీ నిన్ను జూసి ఈ ఊర్ల జనమంతా నీ తొవ్వ బట్టిన్రు. నా గతి ఏమయితది నీవే చెప్పు రాంనాథం సాబ్-"

"మంచిది . . దస్తగిరీ, వాళ్ళెవరి బేరసారాల్లో నేనుగా జోక్యం చేసుకోను సరేనా? కాకపోతే వాళ్ళే వచ్చి అడిగితే మాత్రం సహాయం చేయకుండా వుండను. అది నావల్ల కాదు. ఈ ఏడు పంటలెలా వున్నాయి?"

"జొన్నలు మంచిగ పండినయ్ - రేటు లేదు. వరి రేటుంది పంట లేదు-"దస్తగిరి నిట్టూర్చాడు -"అవ్ గానీ - పత్తి మంచిగ పండిందిలే-"

'పడిందీ పాపిష్టి చూపు!' రత్తయ్య దస్తగిరిని చూసి ముఖం చిట్లించాడు.

"అవును దస్తగిరీ - ఇది వరలక్ష్మి ప్రత్తి. రేగడి లక్ష్మి. రేగడికి ప్రత్తిని మించిన పంట లేదు.'' రామనాథం సంతోషంగా అన్నాడు.

"ఎన్నెక్రాలు ఏసిన్రు-"

"మాదొక సదిహేనెకరాలు - మా పెద్దల్లుడికి నాలుగు చిన్నల్లుడిది ఆరెకరాలు, బాలయ్య వాళ్ళు ఓ ఐదెకరాలు వేసారు."

"అవ్ వింటి వింటి. మల్లేశ్ గూడా సేద్యంల మల్లిండంట - కొలువు గిట్ల చూసుకోడా?'

ఆరా తీసాడు దస్తగిరి.

"ఎన్ని చెప్పినా రైతు బిడ్డ ఒకరి కింద అణిగిమణిగి పని - చేయలేడు దస్తగిరీ - ఎమర్జెన్సీ ఎత్తేసినా - మంచి ఉద్యోగం వచ్చినా అతను వదిలి వెళ్ళడు. అది నా అనుభవం నేర్పినపాఠం."

"అందరు మీ తీరున వుంటారా? ఇయ్యాల రేపు పోరగాల్లు పట్నంల కూలి జేసిన రిక్షా తొక్కినా మేలంటున్నరు. గీ నడిగడ్డంతా తిరిగి నోన్ని తిరిగినట్టే వుంట గదా. . .ఏడ జూసిన ఏ పట్నం పోదామూ అని జూసెటోడే మీ యింట్లనే జూస్న - పట్నం వదిలి ఇట్ల వచ్చుడు-"

"మాదీ పల్లెలే దస్తగిరి-"

"ఏమయినా చెప్పుత్రి మీ తీరు వేరు-"

"ఆ సరే గానీ, నీ దగ్గర కాటా ముళ్ళు వున్నాయి కదా - తీసుకొస్తావ్? ప్రతిసారి ఆ మిల్లు దగ్గర తీసుకెళ్ళి కాటా వేయిస్తున్నాం. అంతగాయితే కాటా రేటు తీసుకుందువులే-"

"గట్లనే" దస్తగిరి గబగబ వెళ్ళి - కాటా ముళ్ళు పట్టు కొచ్చాడు.

ప్రత్తి బూరేలు రాయాచూర్ జిన్నింగ్ మిల్లుల కెళ్ళాయి. వరలక్ష్మి ప్రత్తి అనూహ్యమైన రేటు పలికింది. ఒక్క పూటలో రైతుల జాతకాలు మారిపోయాయి.

మహబూబ్ నగర్ మార్కెట్ లో మిరపకూ మంచి ధర వచ్చింది. కర్నూలు వంటనూనె మిల్లు వారు వేరుశనగలు కొన్నారు నడిగడ్డ రైతు నిలదొక్కుకున్నాడు.

మల్లేశ్ మొదటి పంటతోనే ఘన విజయం సాధించాడు. బాలయ్య తన స్నేహితుడు రామనాథం క్షణక్షణం చేసిన సహాయానికి ఒక్క ఆలింగనంతో కృతజ్ఞతలు చెప్పుకున్నాడు నారాయణమ్మ ఇదంతా కొడుకు ప్రయోజకత్వమని మురిసి పోయింది. బాలయ్య నాగలి పట్టినాక గానీ నారాయణమ్మ నడిగడ్డ మీద కాలు మోపి గానీ ఇలాంటి ఉత్పత్తి ఎరుగరు. ఆదాయమూ ఎరుగరు. వచ్చేపంట కూడా బాలయ్య, మల్లేశ్ రామనాథంతో కలిసి ప్రణాళిక వేసుకోవాలని నిర్ణయించు కొన్నారు

ఈ పంట వారి కుటుంబం పై గొప్ప ప్రభావాన్ని చూపించింది ఇన్నాళ్ళ నారాయణమ్మ సేద్యపు తెలివి వెలావెలా పోయింది. కోడలి తరుపు వాళ్ళ ప్రభావంలోకి భర్తా కొడుకు కొట్టుకు పోతున్నా నిస్సహాయంగా గుడ్లప్పగించాల్సి వచ్చింది.

పైపంట ప్రత్తి వేస్తే ఆమె పని కుడితిలో పడ్డ ఎలుకలా అవుతుంది. దుక్కులు చేయడానికి ట్రాక్టరు తీసుకొస్తారు విత్తనాలు దగ్గర నుంచి బేరాల దాకా అన్నింటి లోనూ వారి

ప్రభావం ప్రత్యక్షంగానో పరోక్షంగానో పడుతూనే వుంది.

అనూరాధ ఇంకా గర్భవతికాలేదు ఈ విషయం అటు కొడుక్కుగానీ ఇటు కోడలికి గానీ చీమకుట్టినట్లు లేదు. అనుభవించడానికి సంతానం లేకుండా ఎంత సంపాదించినా ఏంలాభం? ఏట్లో పోసు కోవాల్సిందే -!

నారాయణమ్మకు తలనరాలు చిట్లిపోయేంత ఆందోళనగా వుంది గబగబ రాజమ్మ దగ్గరకి వెళ్ళింది. ఆ మాట ఈ మాట అయ్యాక రాజమ్మే కదిలించింది.

"ఏ మాయె వొదినె - కోడాలు సంగతి - ఖబర్[1] చెప్పవైతివి-"

"ఏ ముందె చెప్పనింకె - గా దినం ఎల్లమ్మకు ఎదురుమల్లి తిరిగొచ్చె. గింక ఎల్లమ్మ ఊకుంటదా? గీమె కడ్పుల నల్సు నిలుస్తదె?" నారాయణమ్మ విచారంగా అంది.

"అవ్ వదినె - నీ కోడాలు ముట్ట[2] య్యేద్దే నీకు తెల్వదే-"

"ఏమోనే రాజమ్మ - గిన్ని సంస్రాలాయె. ఒక్క తూరి గూడా గా కొలికి ముత్తెం ముట్టయిందె తెల్వదు నాకు-"

"అడగలె-?"

"ఒకపాలి అడిగితి. ముట్టనయివా అంటి - యాదీ ముట్టలేదనే మూడు నెల్లు జూస్తి ఆర్నెల్లు జూస్తి - కడుపులే గిడుపులే - ఇప్పట్కి సంస్రమాయో - ఏందో బుగేలయి తందే రాజమ్మ-"

"నీ కోడాలు మాచికమ్మ[3] 'గిట్టనేమో కన్కుంటివా?"

నారాయణమ్మ గుండె జారిపోయింది. అలా అయ్యిండే అవకాశం వుందే మోనకి ఒక్క క్షణం ఆలోచించింది. ఏ మాటకామాట చెప్పుకోవాలి. అనూరాధను చూసిన వాళ్ళు ఆమెలో లోపాన్ని చూడలేరు. అట్లాంటి కోడలంటే ఎంత కోపమున్నా నారాయణమ్మ అలా వూహించుకోలేక పోయింది.

"నా కోడాలు గొడ్రాలే[4] కానీ మాచికమ్మ గిట్ల అయ్యిండదు-"

"గా - తులసమ్మ చిన్న బిడ్డ నీళ్ళాడె. ఇయ్యాల రేపు బిడ్డను తొట్ల ఏస్తున్రు. గా బిడ్డ బొడ్డు తెచ్చి - నీ కోడాలికి పెట్టు - మూడు నెల్లకు కడుపు రాకుంటే ఇంగ నీకు మన్మడిని ఎత్తే పొద్దు రాదు-"

నారాయణమ్మ వెంటనే తులసమ్మ ఇంటికి బయల్దేరింది.

అది పాలు పిండే వేళ.

అనూరాధ అత్త ఎక్కడి కెళ్ళిందో తెలీదు. పాట్టిగాడు రాలేదు. పశువుల దగ్గరంతా పేడకళ్ళు తీసి చిమ్మి శుభ్రం చేసింది. వాకిలి చిమ్మి ముగ్గేసింది. పాలు పిండుతూ వుంటే మల్లేశ్ వచ్చాడు.

---

1. వార్త 2. బహిస్టు 3 ఎన్నటికి బహిస్టుకాని స్త్రీ 4 పిల్లలు లేని స్త్రీ

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది మల్లేశ్ ఆశ్చర్య పోయాడు

"సుయ్. సుయ్ ." మంటూ చెంబులో పడుతోన్న పాలధార శబ్దం వినిపించి చుట్టూ చూసాడు.

అనూరాధ పాలు పిండుతోంది మల్లేశ్ మౌనంగా గుంజకానుకొని నిల్చున్నాడు

అనూరాధ ముఖాన చెమటకు అతుక్కు పోయిన ముంగురులు, మెడచుట్టు మెలిక తిప్పి వెనక్కి వేసుకొన్న జడ, పైకి దోపుకున్న కుచ్చిళ్ళు, నడుంచుట్టూ బిగించిన పైట - చక్కని శిల్పానికి ప్రాణం వచ్చి - పాలు పిండుతోన్నట్లుగా వుంది

మల్లేశ్‌కు నవ్వొచ్చింది పెదవులు బిగించి అలాగే చూస్తూ నిల్చున్నాడు ఇత్తడి చెంబు నిండా పాలు పిండుకొని పైకి లేచింది అనూరాధ. పాలనురగు చెంబులో పైదాకా వచ్చింది. వెనక్కి తిరగబోయి - మల్లేశ్‌ను చూసి తత్తరపోయింది.

"ఈ పాల చెంబు పట్టుకొన్న ఎట్లావున్నావో తెలుసా? అమృత భాండం పట్టుకున్న మోహినిలాగా-" మల్లేశ్ పరాచికంగా పాలనురుగు తీసి ఆమె చెక్కిలి మీద రాసాడు.

"చాల్లే వూరు కోండి"

అనూరాధ ముద్దుగా విసుక్కుంది-"ఎవరైనా వింటే నవ్విపోతారు."

"మరి. " మల్లేశ్ ఏదో చెప్పబోయాడు.

"ముందు వెళ్ళి దూడనొదలండి-" అనూరాధ చరచర లోపలికి వెళ్ళి పోయింది

"ఇది అన్యాయం-" మల్లేశ్ చిన్న పిల్లాడిలా నేలను తన్నాడు.

వంటింటి గుమ్మంలోంచే ఓనవ్వువిసిరేసి, లోపలికి వెళ్ళిపోయింది అనూరాధ.

మల్లేశ్ దూడనొదిలి - ఇంట్లోకి వెళ్ళేసరికి స్నానాలగది బిగించి వుంది. - మల్లేశ్ స్నానాలగది తలుపుల్ని దబదబ బాదాడు - "అనూరాధా మర్చి పోయాను- మీ చిన్నత్తయ్య నీకోసం ఏదోపంపించింది - తొందరగా - రా"

"అన్నీ అబద్ధాలే - కాసేపు వూరు కొంటారూ-"

"నీ ఇష్టం - ఆలస్యం అమృతం విషం -"

"ఏమీకాదు - నిదానమే ప్రధానం - దయచేసి మీరెళ్ళి అరుగుమీద కూర్చొండి, ఎవరైనా వస్తే బావోదు-"

"సరే నీ ఇష్టం. మీ అత్తయ్య నీకోసం పంపినవి. మంచం మీద పెడుతున్నా వచ్చి తీసుకో-"

అనూరాధ అడుగుల చప్పుడు దూరమయ్యే వరకు ఆగి, బయటకు వచ్చింది. స్నానం చేసేసి చీర చుట్టుకొని వుంది. చీరకుచ్చిళ్ళు కూడా పెట్టుకోకుండా సావిత్రీ అత్తయ్య ఏం పంపిందో - అనుకుంటూ హడావుడిగా పడకటింట్లోకి వెళ్ళింది.

దొంతర మల్లెలు, కనకాంబరాలు, మరువం కలిపి ముచ్చటగా కట్టిన మాల.

"అబ్బ!" అనూరాధ అనవలసిన మాటలు తలుపు దగ్గరున్న మల్లేశ్ అన్నాడు.

అతను తలుపులు చేరవేయబోతుంటే అనూరాధ సిగ్గుతో నవ్వుకుంటూ ముద్దుగా విసుక్కుంది.

"చాల్లెండి - మరీ చిన్నపిల్లాడిలాగా ఏవిటిదీ? సంధ్య వేళ ఈ సరసాలేంటి? నా పరువు తీసేట్టున్నారు! వదిలేస్తే ఈ పాటికి ముగ్గురు పిల్లల తండ్రి అయివుండేవారు" అనూరాధ వేగంగా అనేసింది.

"వదిలేద్దాం!"

అనూరాధకు తనేమనిందో స్ఫురించింది చప్పున తలవాల్చేసింది పూల మాలలోని కనకాంబరాలతో ఆమె చెక్కిళ్ళు పోటీ పడ్డాయి - అతని దోరనవ్వుతో దొంతర మల్లెలు శృతి కలిపాయి.

"ఇంట్ల గిట్ల ఎవ్వరులేరా? నీ కోడాలు ఏమయిందే నారాయణి" నారాయణమ్మను ఇంటి దాకా సాగనంపడానికి వచ్చిన రాజమ్మ గట్టిగా అంది.

"అత్తయ్య వచ్చినట్లున్నారు - ముందు బయటకు పదండి-" అనూరాధ రెండు చేతుల్లో మల్లేశ్‌ను బయట నెట్టేసి తలుపుగడేసుకొంది

రాజమ్మ నారాయణమ్మకు సైగ చేసి వెళ్ళింది. నారాయణమ్మ ఆ పురిటి ఇంటి నుంచి చక్రపొంగలి తెచ్చింది. కొడుక్కీ కోడలికీ అరచేతుల్లో చెరో ముద్ద పెట్టింది.

మల్లేశ్ పొంగలి తింటూ అనూరాధ వంకే చూస్తూన్నాడు

కళ్ళు వాల్చుకొని వున్న అనూరాధకి ఆ విషయం స్పష్టంగా తెలుస్తోంది కళ్ళ కద్దుకొని ముసి ముసి నవ్వులు నవ్వుతూ పొంగలి ముద్ద అమాంతం నోట్లో వేసుకుంది.

నారాయణమ్మ తేలిగ్గా గాలి పీల్చుకొంది.

అనూరాధ నోట్లో వేసుకున్నంత వేగంగా ఆ పొంగలి ముద్ద బయటకు తోసుకొచ్చింది.

అనూరాధ భళ్ళున వాంతి చేసుకొంది. ఆ పొంగలి ముద్దలో ఎండిన నరం లాంటి నల్లటి దేదో స్పష్టంగా కనబడుతోంది.

అనూరాధ అనుమానంగా నారాయణమ్మ వైపు చూసింది

నారాయణమ్మ వంగి దాన్ని చేతిలోకి తీసుకొంది.

మల్లేశ్ నొసలు చిట్లించాడు. "ఏంటమ్మా అది!"

"గా తులసమ్మ చిన్న బిడ్డ పురుడు పోస్కాలే - గా పిల్లగాని బొడ్డు తాడు-" నారాయణమ్మ మాములుగా చెప్పింది.

అనూరాధకు కడుపులో ఎవరో చెయ్యి పెట్టి కెలికి నట్లయింది.

జుగుప్సతో వొళ్ళంతా జలదరించింది లోపల్నుంచి తెములుకొస్తోంటే, కొంగు నోటికి అడ్డం పెట్టుకొని లోపలి గదిలోకి ఒక్క పరుగుతీసింది.

'అంటే ఆవిడ కావాలనే ఆ బొడ్డుతాడును చక్రపొంగలిలో పెట్టి ఇచ్చిందా? అనూరాధ కళ్ళల్లో ఇంకా ఆ అలంపురం సంఘటన మసక బారలేదు

అనూరాధకి కోపం, అవమానం, అసహ్యం, ముంచెత్తాయి వళ్ళంతా భగభగ మడింది 'ఆ రోజు జరిగిన విషయం తనెవరితో ఫిర్యాదు చేయలేదు పెద్దవారి మర్యాద తప్పకూడదన్న తన నిబద్ధత వల్ల ఇన్నాళ్ళు తను ఆవిడ చేసినవన్నీ సహిస్తూనే వచ్చింది కానీ! మర్యాద నిలపడం అంటే అవమానాన్ని అణుచుకోవడమేనా? అసలు ఆవిడ ఉద్దేశం ఏమిటి? ఎందుకివన్ని చేస్తోంది? ఆ విషయం తనతో సూటిగా ఎందుకు చెప్పదు? ఇన్నాళ్ళు ఆవిడని ప్రశ్నించకపోవడంమే తన తప్పు! తన భర్తతోనో మరొకరి తోనో చర్చించక పోవడమే తన తప్పు! ఇప్పుడడగాలి - ఆవిడ ఎందుకలా చేస్తోంది? తన దోషమేంటి?'

"నువ్వెందుకట్లా చేసావమ్మా?" సరిగ్గా అప్పుడే మల్లేశ్ తన తల్లిని నిలదీస్తున్నాడు.

"గదేంది - కొడ్కా - గట్ల కోపమయితవ్ - అంతా మీ మేలుకే చేస్తి నాయనా - గా పోరిని ఎల్లమ్మ తానకు కొండబోతే వుర్కుర్కి వచ్చె - గీ పొద్దు గిది మింగిస్తమను కొంటి -" నారాయణమ్మ వాపోయింది.

పోరి ఎవరో మల్లేశ్ అనూరాధకు ఇద్దరికీ తెలుసు. మల్లేశ్‌కు ఎల్లమ్మ దగ్గర ఏం చేస్తారో కూడా తెలుసు అనూరాధను ఆ స్థితిలో ఊహించుకొని వణికిపోయాడు. తల్లి మీద ఇంతెత్తున కోపం వచ్చింది పళ్ళ బిగువన అణుచు కొంటూ అడిగాడు, "అనూరాధను ఎందుకట్లా సతాయిస్తున్నావ్?"

"నేనేడ సతాయిస్తి బిడ్డా - గిదంతా నీకు బిడ్డలు పుట్టనింకెనే చేస్తిగాని గా పోరి మింద నాకేమి జగడా?"

అనూరాధ మంచం కోడు పట్టుకొని కూలబడింది బయట ఏం మాట్లాడు తున్నారో ఆమెకివినబడలేదు.

"ఇవన్నీ తనకు పిల్లలు పుట్టడానికి చేసిందా ? తను పిల్లల్ని కంటుంది! కనదు! ఆవిడెవరు నిర్ణయించడానికి? ఇలా అంటే తానెప్పుడో స్పష్టంగా చెప్పేసి వుండేదిగా. 'ఎప్పుడు పిల్లల్ని కనాలో మేమిద్దరం నిర్ణయించుకుంటాం. మీరు నిశ్చింతగా వుండండి' అని నన్నింతగా అవమానించిందే తన కొడుకు నెందుకు ఒక్కమాట అనలేదు? పిల్లల్ని కనే నిర్ణయం తన ఒక్కదాని మీదా ఆధారపడి వుంటుందా? ఇద్దరూ నిర్ణయించుకోవాలి - అని ఆమెకు మాత్రం తెలీదూ? అది మనసులో పెట్కుకొని - తనని ఎన్ని మాటలంది? మాచికమ్మ! గొడ్రాలు! గొడ్డుమోతు! భోగంది! మరుల మందు పెట్టి ఆమె కొడుకును మాయచేసింది! శని ముండ!" అనూరాధ వళ్ళు మండిపోతోంది. "ఛీఛీ! నేనావిడ్ని క్షమించను - ఎన్నటికీ క్షమించను!" ఆ అగ్నిలో అత్తకు కోడలి మధ్య మిగిలి వున్న ఏ కొద్ది పాటి సంబంధం, కూడా లేకుండా దగ్ధమైంది. కోడలికి అత్త ఓ శూన్యమై పోయింది.

'అత్తనీవు పెట్టిన ఆరళ్ళ వలన
అట్ల పోయి అడివిల మానైన గానైతి'

ఒకనాడు రేణుక పాడిన పాట - అనూరాధ చెవుల్లో ప్రతిధ్వనించింది.

'మానును ఎందుకవుతాను? నేను మానును కాదు మనిషిని! మనిషి గానే వుంటాను!'

# 10

❋ ❋ ❋

"శివుడు, ఆరుదడి చేలో కలుపు తీయించాలిరా-" రామనాథం గుర్తు చేసాడు

"అవును బాబాయ్ - అయిదెకరాల చేలో నిన్న మందు కొట్టించానా - పొద్దున్నే నీళ్ళొదలమని సవారికి చెప్పిపంపాను వెళ్ళాడో లేదో - అవి చూసుకొని ఆరుదడి చేను కెళ్తాలే " శివుడు మోటర్ సైకిల్ తుడుస్తూ అన్నాడు

"సరేరా - అనూరాధాళ్ళ పొలంలో ఏదో పురుగు కనిపించందట పొద్దున బాలయ్య కబురు చేసాడు అదేంటో చూసుకొని నేనూ అటొస్తాలే-"

"భలే వాడివి బాబాయ్ - అంతదూరం ఎలా వస్తావ్?"

"ఇన్నాళ్ళు ఎలా వచ్చే వాళ్ళంరా?"

"అప్పటి సంగతి సరే. ఇప్పుడు బుల్లెట్ వుంది కదా బాబాయ్. అయితే ఇద్దరం కలిసే వెళ్దాంలే-" శివుడు పెట్రోల్ ట్యాంక్ మూత తెరిచాడు.

ఒక్కసారి పెట్రోల్ వాసన గుప్పుమంది.

"ఒరేయ్. . .నీకు బుల్లెట్ కొనిచ్చింది - దూరపు పొలాలు సరిగ్గా చూసుకొంటావని. నన్ను ఎక్కించుకు తిప్పు తావని కాదు - తెల్సిందా?"

"నీకు సుఖపడే యోగం లేదు బాబాయ్-" శివుడు తమాషాగా పెదవి విరిచాడు. ఓ పుల్ల తీసుకొని పెట్రోల్ ట్యాంక్‌లో ముంచి ఎంత పెట్రోలుందో పరీక్షించాడు.

"గా శివయ్య బండి ఎక్కకయ్య - ఒక్కపారి ఎక్కిన్రంటె బొక్కలు బయటి కెళ్తయ్ -' ' సవారి ఎప్పుడొచ్చాడో కానీ ఓ స్టేట్ మెంట్ జారీ చేసాడు

రామనాథం నవ్వాడు. శివుడు కూడా నవ్వాడు.

"అది సరేగానీ పొలానికి నీళ్ళు వదిలావా లేవా?' శివుడు ఆరా తీసాడు.

"వదిల్తి. కానీ గా భద్రం గారి చిన్న కొడ్కు వచ్చి కిరికిరి[1] పెట్టె జర వాని ముచ్చట సూడాలె "

"ఏమంటున్నాడు?" రామనాథం అడిగాడు.

శివుడు పెట్రోల్ డబ్బా తెచ్చి - గరాటుతో ట్యాంక్‌లో పోసాడు సవారి చటుక్కున డబ్బా అందు కొని మూత పెట్టాడు

"ఎప్పుడుండ్దే - గా కాల్వ వాని బాబు తవ్వించిండనుకుంటడు "

"సర్లే - నువ్వులేని పోని గొడవకు దిగకు - శివుడొచ్చి మాట్లాడతాడు-" రామనాథం సర్ది చెప్పాడు

శివుడు పెట్రోల్ ట్యాంక్ మూత బిగించాడు బుల్లెట్‌ను అటూ ఇటూ కుదిపి - ఓ నేల కంటా వంచి - స్టాండ్ వేసాడు పెట్రోల్ ట్యాంక్ చుట్టూ పాతబట్టతో తుడిచాడు.

"సవారీ అన్నం తిన్నావా? తినకపోతే నా క్యారియర్ వుంది కానీ ఎళ్దాం పద -"'శివుడు స్టాండ్ దీసి - బుల్లెట్ పందిరి బయటకు నెట్టు కొంటూ వెళ్ళాడు శివుడు బుల్లెట్‌ని ఒక్కకిక్ కొట్టగానే గబగబ సుధాకర్ వచ్చాడు

"అన్నయ్యా - మోటర్ సైకిల్‌ని నేను తీసుకెళ్తా!"

ఎవరూ ఎదురు ప్రశ్న వేయలేనంత నిక్కచ్చిగా వున్నాయి ఆ మాటలు ఎప్పుడూ సుధాకర్ అలా మాట్లాడలేదు.

శివుడు-రామనాథం వైపు చూసాడు. రామనాథం నిర్ఘాంతపోయి వున్నాడు సుధాకర్ గంభీరంగా బుల్లెట్ హ్యాండిల్ మీద చేయి వేసాడు. శివుడు హ్యాండిల్ మీద తన చేయిని వదిలేసి - నెమ్మదిగా వెనక్కి నిల్చున్నాడు.

సుధాకర్ బుల్లెట్ ఎక్కి కూర్చున్నాడు.

రెండు కిక్స్ కొట్టగానే స్టార్టయింది. హారన్ వేసాడు. లోపల్నించి చెప్పులు టపటప లాడించు కొంటూ గీత వచ్చింది.

సవారి నోరు తెరుచుకుంది.

పలుచని అమెరికన్ జార్జెట్ చీర - భుజం దిగిన చిన్న కొంగు - పొట్టి చేతుల జాకెట్లు - చెవులకి పెద్ద పెద్ద రింగులు - మెరుస్తోన్న పెదాలు - కొత్తరకంగా మడిచిన ముడి - భుజాన తగిలించుకున్న ఎర్రటి వ్యానిటీ బ్యాగ్ - గుప్పు మంటోన్న అత్తరు వాసన

రామనాథం, శివుడు ఒక్క క్షణంలోనే ముఖాలు తిప్పుకున్నారు.

గీత ధనధనా అడుగులతో నేలను కదం తొక్కుతూ బుల్లెట్ దగ్గర్‌కి వెళ్ళింది. సవారి తెరుచుకున్న నోరును చప్పున మూసుకున్నాడు. అనూరాధనో భారతినో కుతూహలంగా అడిగినట్లు గానే గీతనీ అడిగాడు.

"యాడికమ్మ పోతున్రు?"

గీత ముఖం చిట్లించింది.

"అమ్మ ఏంటి అసహ్యంగా? దొరసాని అన్లేవూ?" గీత కసిరింది.

సవారి బిత్తరపోయాడు. ముఖం వివర్ణమైంది. రామనాథం శివుడు గీతధోరణిని చూసి

విస్తుపోయారు. సుధాకర్ నిమ్మకు నీరెత్తి నట్టు మౌనంగా వున్నాడు.

"సాని ఏంటి సాని - అసయ్యంగా అమ్మ అన్లేవూ-"

ఒకనాడు సావిత్రి సవారిని మందలించడం రామనాదానికి, సవారికి ఇద్దరికీ జ్ఞాపకం వచ్చింది.

ఆ ఇంటి ఆడవాళ్ళు ఎన్నడూ అలా ప్రవర్తించలేదు. మర్యాద మన్ననే వారి మాట తీరు.

'ఈమె సావిత్రి కాదు!' రామనాథం నిట్టూర్చాడు.

ఆడవారిని మందలించడమూ కోడళ్ళనూ కోప్పడడమూ। ఆ ఇంట్లో ఎవరికి అలవాటు లేదు. అయినా రామనాథం కటువుగా అన్నాడు.

"పెద్దవాణ్ణి పట్టుకొని ఆ విసిరేమిటమ్మాయ్"

"వయసొస్తే చాలదు - కాస్త బుద్ధీ జ్ఞానం వుండాలి!"

గీత అదే విసురులో పందిరి గుంజకు సమాధానం చెప్పంది

సవారి వైపు చర్రున చూస్తూ తిరిగి హెచ్చరించినట్లుగా అంది-

"ఈసారి మాట్లాడేటప్పుడు కాస్త వళ్ళు దగ్గర పెట్టుకొని మాట్లాడు!" సవారి చేతులు కట్టుకొని తెచ్చి పెట్టుకొన్న వినయంతో అన్నాడు.

"గట్లనే దొర్సానీ - గట్లనే దొరా -"

"పదండి సుధాకర్!" సుధాకర్ నడుంచుట్టూ చేయి వేస్తూ వయ్యారంగా అంది గీత బులెట్ బుర్‌న దూసుకు పోయింది. సైలెన్సర్ పొగ గుప్పున వెనక నిలబడి పోయిన వాళ్ళ ముఖాన కొట్టుకొంది.

❊ ❊ ❊

"అన్నయ్యా. . ."

కల్యాణి వీధి గుమ్మంలోంచే కేకలు పెడుతూ లోపలికి వచ్చింది.

"సైరన్ లాగా ఆ అరుపేమిటే కల్యాణీ - ఆగు .. కొస్తాగు..." భారతి నవ్వుతూ అంది.

"ముందిది చెప్పు - అన్నయ్య వచ్చాడా రాలేదా?"

"ఏవిటో అన్నయ్య గారితో అంత పనీ?' భారతి నవ్వుతూనే ధీర్ఘం తీసింది.

"పెదనాన్న జున్ను పంపిస్తానన్నాడు. పెద్దమ్మతో గోరింటాకు రుబ్బి పంపించమన్నా-"

"అమ్మాయ్ కల్యాణీ - నాకు తెలియక అడుగు తాను - ఇలా గోరింటాకు అదీ పెట్టుకెళితే మీ కాలేజీలో ఎవ్వరూ నవ్వరా? అయినా, డాక్టరమ్మల చేతికి గోరింటా కేమిటి-! ఎదురుగా అనక పోయినా వెనక నైనా పల్లెటూరి గబ్బిలాయ్ అని వెక్కిరిస్తారు లే-"

"అనుకోని - అది వాళ్ళ ఖర్మ! ఇంతకీ అన్నయ్య గోరింటాకు తెచ్చాడా లేడా?"

"వస్తే కదా తేవడానికి!"

"రాకపోవడం ఏంటి? మన బుల్లెట్ లక్ష్మి నివాస్ హోటల్ ముందు ఆపి వుంటేనా కళ్ళారా చూసా-" కల్యాణి నమ్మకంగా వత్తి చెప్పింది

"ఈ కర్నూల్లో ఎన్ని బుల్లెట్లు లేవూ? దేన్ని చూసావోలే - పదకాఫీ పెట్టిస్తాను"

"కాదొదినా - నెంబర్ కూడా చూసాను-"

"చూస్తే చూసావు కానీ పద - సున్నుండలు చేసాను తిందువుగానీ పిల్లలు ఆటల్నించి వచ్చారంటే నీకు పిసరు కూడా మిగల్చరు."

భారతి వంటింట్లోకి వెళ్ళిపోయింది

కల్యాణి నిరాశగా లోపలికి వెళ్ళి పుస్తకాలు సర్దుకుంటోంది. ఇంతలో ఎవరివో మాటలు వినిపించి బయటకు వచ్చింది

సుధాకర్, గీత గుమ్మంలో నుల్చుని లోపలికి రాకుండానే ఏవో మంతనాలు చేస్తున్నారు గీత మాటి మాటికి ముఖం చిట్లిస్తోంది.

కల్యాణి వారి వంక ఆశ్చర్యంగా చూస్తూ అంది.

"అదేంటి గీతొదినా- అక్కడే నిల్చున్నారు - లోపలికి రండి." వంటింటి గుమ్మం వైపు తొంగిచూస్తూ భారతిని కేకేసింది- "భారతొదినా చిన్నొదినాళ్ళొచ్చారు "

భారతి సంతోషంగా గబగబ కలుపుతోన్న కాఫీని వదిలి బయటకు వచ్చింది

"అదేంటమ్మాయ్ - గీత - అక్కడే ఆగిపోయారు రండిరండి. సుధాకర్ నువ్వేంటి కొత్త వాడిలాగా - "

సుధాకర్ మొహమాటంగా లోపలికి వచ్చాడు.

కల్యాణికి చప్పున ఏదో గుర్తొచ్చింది.

"అవునన్నాయ్ - పొద్దున నువ్వు లక్ష్మీనివాస్ దగ్గరకి వచ్చావా?"

సుధాకర్ పట్టుపడ్డ దొంగలాగా తెల్లమొహం వేసాడు. వాళ్ళు కర్నూలు వచ్చి అప్పటి మూడు రోజులయింది. లక్ష్మీనివాస్ లోనే వున్నారు. ఇంటికి వెళ్ళకుండా ఊరువెళితే బావోదని సుధాకర్ - ఎవరికీ సంజాయిషీ ఇచ్చుకోవాల్సిన అవసరం తమకు లేదని గీత - చిన్న యుద్ధం చేసుకొన్నారు. చివరికి సుధాకర్ జేబు ఖాళీ అయ్యే స్థితి రావడంతో ఈ పూటకి ఇంటికి రావాలని నిశ్చయించుకున్నారు.

సుధాకర్ గీత ఒకరి ముఖాలు ఒకరు తేరిపార చూసుకొన్నారు.

భారతి, కల్యాణి, కూడా వారి ముఖాల్లో కదలాడిన భావాల అర్థం తెలుసుకోలేక తడబడిపోయారు.

కల్యాణి తేరుకొని - వాతావరణాన్ని తేలిక చేయడానికి ఓ నవ్వు నవ్వుతూ అంది,

"సరేవదినా, పెదనాన్న నా కోసం ఏం పంపించాడు? జున్ను పంపిస్తాన్నడే పంపలా? పెద్దమ్మ గోరింటాకు రుబ్బించలా?"

"అవన్నీ మోసుకు రావడానికి ఇక్కడ నీ నౌకర్లెవరూ చేతులు కట్టుకు సిద్ధంగా లేరు !" గీత ఛెర్నా కోలాతో చరిచినట్లుగా విసురుగా అంది.

కల్యాణి బిత్తర పోయింది. ఇంతవరకూ ఎవరూ ఆమెని అంత చులకనగా తీసిపారేసి మాట్లాడలేదు. గిర్రున వెనక్కు తిరిగి గదిలోకి వెళ్ళింది

భారతి కూడా గీత ధోరణి మింగుడు పడలేదు. ఆ ధోరణి ఆమెకు కొత్త గీత మాటలకు ఎలా స్పందించాలో కూడా వారికి తెలియదు భారతి మౌనంగా లోపలికి వెళ్ళి కాఫీ తెచ్చి ఇచ్చింది.

సుధాకర్ కాసేపు వున్నాక, మెల్లిగా వంటగది గుమ్మంలోకి వచ్చి భారతితో అన్నాడు

"వదినా, నీ దగ్గర డబ్బేమయినా వుందా?"

భారతి సుధాకర్ వైపు ఆశ్చర్యంగా చూసింది-

సుధాకర్ తలవాల్చుకొని కాలి బొటన వేలితో గడప గీకుతున్నాడు ఇంత వరకు ఇలా సుధాకర్ ఎప్పుడూ అడగలేదు 'ఏం అవసరం వుండి వుంటుంది?' భారతి ఆశ్చర్యపోయింది 'కర్నూలుకు వస్తూ డబ్బు తీసుకురాకుండా ఎలా వచ్చాడు'

కానీ, ఏమి ప్రశ్నించకుండా అల్మేరా లోంచి ఓ వంద రూపాయిల కాగితం తీసి ఇచ్చింది, "కల్యాణి పుస్తకాలు కొనుక్కోవాలని అంది. ."

సుధాకర్ మౌనంగా వెళ్ళి పోయాడు. గీత అతని వెంటే వెళ్ళింది

అది మూడు గదుల ఇల్లు.

వంట గదిలో కొన్ని వంట సామాను తప్పించి మరే ఇతర అలంకరణలు ఆ ఇంటికి లేవు.

ముందు గదిలోనూ మధ్యగదిలోనూ పడుకొనేప్పుడు చక్కగా చాపలు పరుచుకొని, పొద్దునే చుట్టి మూలలకు పెట్టు కుంటారు.

భారతి పిల్లలతో పాటు పద్మ పిల్లలిద్దరూ, సరళ కూతుర్లు - ఇక్కడే వుండి చదువు కుంటున్నారు.

భారతి పిల్లలందర్ని వేసుకొని వంటింట్లోనో ముందిట్లోనో గడుపు తుంది. మధ్య గదిలో రెండు అల్మేరాలు - కల్యాణి పుస్తకాలకీ రికార్డులకీ. కల్యాణి రాత్రి పొద్దు పోయేదాకా చదువు కుంటూనోరికార్డు వేసుకుంటూనో వుంటుంది. ఆమె చదువుకొని సమయంలో అందరూ అటు ఇటూ పడి ఆడుకుంటూ వుంటారు.

భారతికి కల్యాణి చదువు విలువ తెలుసు. పిల్లలకీ ఆ విలువని నేర్పిస్తుంది. అయినా పిల్లలు కదా - పిల్ల చేష్టలతో ఆ పుస్తకాల్లో బొమ్మలు చూడాలనో పుస్తకాలు కదిలిస్తూనే

వుంటారు. భారతి అన్నింటిని అల్మేరాలో సర్దేసి, తాళాలేసి బొడ్లో దోపుకుంది ముగ్గురాడ పిల్లలు ముగ్గురు మగ పిల్లలు, అందరూ పసివాళ్ళు, స్నానాల దగ్గర నుంచి చదువు దాకా అన్నీ భారతి చూసుకోవాలి. భారతికి క్షణం తీరిక లేదు. వున్నమ్మ వున్నపుడు ఇంటి పనిలో సాయం చేసేది. ఇప్పుడు కల్యాణి చదువులో తీరిక చేసుకొని సహాయం చేస్తుంది ఇప్పుడు రాంనగర్‌లో వున్న వాళ్ళంతా ఆపనికి ఈపనికి కర్నూలుకి వచ్చి - ఇంట్లో వుండి పోవడం మాములై పోయింది

అందరూ భోజనాలు చేసి పడకేస్తుంటే సుధాకర్, గీత వచ్చారు. కల్యాణి లోపలిగదిలో చదువుకుంటూ వుంది. భారతి లేచి మళ్ళీ వంట ప్రయత్నంలో పడింది

"వద్దులే వదినా, భోజనాలు అయిపోయాయి -" సుధాకర్ వచ్చి చెప్పాడు.

భారతికి గీత ప్రవర్తన మీద నిజంగానే కోపమొచ్చింది చీటికి మాటికి సుధాకర్ వచ్చి చెప్పకపోతే గీత లోపలకి వచ్చి, మాట్లాడొచ్చుగా - అదేంటి పరాయి చుట్టంలాగా ముందు గదిలో మూతి ముడుచు కుని కూర్చుంటుంది - ఇంతకీ వీళ్ళీ పూటకి వుంటారా?"

భారతి ఒకసారి కల్యాణి గదిలోకి వెళ్ళి చూసింది కల్యాణి నిమగ్నంగా చదువు కుంటోంది. భారతి వెళ్ళిన అయిదు నిమిషాలైనా తలెత్తలేదు. భారతి - మెల్లిగా బయటకు వచ్చి ఓ గ్లాస్ పాలు కలుపుకెళ్ళి ఇచ్చింది

"ఏంటమ్మాయ్ - కల్యాణి - ఇంతపొద్దు పోయే దాకా చదువు తున్నావ్?"

"పరీక్షలొస్తున్నాయిగా వదినా - ఈ అనాటమి అంత సులభంగా బుర్రకెక్కదు - ఈ నైటవుట్ చెయ్యాల్సిందే! అదీ విషయం-"

"మరీ పొద్దుపోయే దాకా చదువుకోమాక, అంతగయితే తెల్లవారుఝమున లేపుతాలే -" భారతి పాలగ్లాసు తీసుకొని వెళ్ళిపోయింది.

ముందు గదిలో పిల్లల మధ్యన గీత కొయ్య బొమ్మలా కూర్చుని వుంది.

"పడుకోపోయావా గీతా?" భారతి మృదువుగా పలకరించింది.

"ఎక్కడ పడుకోవాలి?" గీత కసిరి నట్టుగా అంది.

భారతికి అదో సమస్యకాదు, పిల్లల పక్కన దిండేసుకుని పడుకుంటుంది. అదే వుద్దేశంతో గీతతో అంది.

"మనం ఇక్కడ పడుకుందాం గీతా, కల్యాణి ఎలాగూ నైటవుట్ చేస్తా నంటోంది. ఇబ్బంది వుండదు, సుధాకర్ లోపలి గదిలో పక్క వేస్తాను."

"ఆయనక్కడా నేనిక్కడా - మీకేమన్నా మతిపోయిందా?" భారతికి నిజంగానే మతి పోయింది. ఓ పూట చుట్టం చూపుగా వచ్చి ఇంత పచ్చిగా ఎవరూ మాట్లాడ లేదు.

"కల్యాణి చదువు కుంటోందిగా గీతా - ఏదో పుస్తకం అవసరం వస్తుంది కదా . . ." నెమ్మదిగా సంజాయిషీ చెప్పినట్లుగా అంటోంది

''అయితే మాత్రం? ఆ పిల్లకంటే తెలీదు - ఇద్దరు పిల్లల తల్లి మీ కన్నా తెలివుండద్దూ? గీత మళ్ళీ విసుక్కుంది

భారతి ఆమె ముఖంలోకి విచిత్రంగా చూసింది ఇక తప్పేటట్టు లేదని లేచి వెళ్ళింది కల్యాణికి సర్ది చెప్పింది ఆమెకు కావాలసిన పుస్తకాలన్నీ తీసుకొని, ముందుగదిలోకి వచ్చారు.

పొద్దున బారెడు పొద్దెక్కినా పిల్లలు బడికెళ్ళినా - బిడాయించుకున్న ఆ గది తలుపులు తెరుచుకో లేదు కల్యాణి ఏప్రాన్, బట్టలు లోపల వుండి పోయాయి కాలేజీ టైం అయిపోతోంది కల్యాణి అసహనంగా అటూ ఇటూ పచార్లు చేస్తోంది తలుపు కొడదామన్న కోరికను బలవంతంగా అణచు కొంటూ వేళ్ళు విరుచుకొంటూ కాలు గాలిన పిల్లిలా భారతి చుట్టూ తిరుగుతోంది

కల్యాణి క్లాస్ మేట్స్ కూడా వచ్చేసారు వీళ్ళంతా రోజు కలిసే కాలేజికి వెళ్తారు. ''కల్యాణీ తొందరగా రావాలి - మనం అంత దూరం నడిచేళ్ళేసరికి ఫస్ట్ పీరియడ్ అయిపోతుంది. ఇవ్వాళ్ళ అనాటమి ప్రొఫెసర్ - క్లాస్ వుంది -'' వాళ్ళు ముక్తకంఠంతో హడావుడి చేసారు

“వదినా, నేనీపూట కాలేజికి రానని చెప్పేస్తాలే-'' కల్యాణి గొంతు బావిలోంచి మాట్లాడు తున్నట్లుగా వచ్చింది

''భలే దానివే - పరిక్షల ముందు కాలేజ ఎలా మాన్తావ్? అరరే - నాబట్టలు కూడా లోపలే వుండి పోయాయే-! పోనీ ఈ ఒక్క పూటకు లంగా వోణీలో వెళ్ళి పోరాదు-''

“లేదొదినా - చీర కట్టు వెళ్ళాల్సిందే - అందులోనూ ఏప్రాన్ లేకుండా ఎలా?''

ఇక తప్పదు తలుపు కొట్టాల్సిందే - భారతి తలుపు కొట్టడానికి తలుపు దగ్గరగా వెళ్ళింది. గీత చటుక్కున తలుపు తీసుకొని బయటకు వచ్చింది. భారతి అమాంతం గుమ్మంలోకి పడబోయి తమాయించు కొంది. కల్యాణి గబగబ లోపలికి దూరి - ఏప్రాన్ తెచ్చుకొంది. క్షణాల్లో చీర వంటికి చుట్టు కుని, పరుగులు పెట్టింది

“ఏవిటో పరుగులు-” భారతి నిట్టూర్చి - సుధాకర్ వాళ్ళకు టిఫిన్ చేయడానికి వంటింట్లోకి వెళ్ళింది.

చపాతీలు చేసి, టిఫిన్ చేయడానికి గీత పిలుద్దామని వెళ్ళిన భారతి చెవిలో పడకూడని మాటలే పడ్డాయి.

“చూసారా - మీ వదిన్ది ఎంత లేకి బుద్దో! మనం పడుకుంటే తలుపు సందులోంచి చూస్తోంది. ఛీఛీ - ఛండాలపు మనుషులు!”

“హవ్వ!” భారతి నోరు నొక్కుకుంది.

గీత అంత అసభ్యంగా ఎలా ఆలోచిస్తోంది. ఛఛ - గీత తలుపు తీసేసరికి తను గుమ్మంలో వున్న మాట వాస్తవమే - కానీ దాన్నిలా చిత్రిస్తోందే - ఆ నాలిక చీలికలవ్వకుండా ఎట్లావుంది.?''

“ఆ కల్యాణికి ఖచ్చితంగా చెప్పండి! మీరు చెప్పక పోయినా నేను చెప్తాను

ఆవిడక్కావల్సిన సామాగ్రంతా బయట పెట్టుకోమనండి!"

ఆజ్ఞ జారీ చేస్తోన్న రాణీ గారి కంఠంలా వుంది గీత కంఠం.

భారతి గిర్రున వెనక్కి తిరిగి టిఫిన్ పక్కకు పెట్టింది. 'తిన్నప్పుడే తింటారు-' కచ్చగా అనుకొంది.

తోడికోడళ్ళ మధ్య అగాధం ఏర్పడింది.

భారతి పిల్లలకి పన్నెండు కల్లా భోజనం తీసుకెళ్ళాలి. అప్పుడే పదిన్నర అయిపోయింది.

భారతి గొణుక్కుంటూ వంట ప్రయత్నంలో పడింది. పదకొండు గంటల కట్లా సుధాకర్ ఏకంగా భోంచేసి వూరెళ్ళి పోయాడు.

"హమ్మయ్య - వీళ్ళెళ్ళి పోయారా భారతొదినా - ఇంక హాయిగా వూపిరి పీల్చు కోవచ్చు. ' కల్యాణి గలగల అంటూ పుస్తకాలు తన అల్మేరాలో పెట్టుకోవడానికి వెళ్ళింది.

ఎదురుగా కూర్చున్న గీతను చూచి తత్తర పోయింది.

వంటింట్లోకి వెళ్ళి "ఏవిటీ - ఈవిడగారు ఇక్కడ తిష్టవేసింది" మెల్లిగా భారతి చెవిలో గొణిగింది.

"నాకేం తెలుసు నువ్వే అడుగు-"

భారతి పకోడీలు ప్లేట్లో పెట్టి కల్యాణి ముందుకు జరిపింది.

"ఎన్నాళ్ళుంటుందేం?" తెలీదన్నట్లు భారతి భుజాలెగరేసింది.

పదిహేను రోజులుండి, అటునుంచి అటే పుట్టింటికి పంపించివచ్చాడు సుధాకర్. గీత వెళ్ళిన తరువాత కర్నూలు చిరునామాకు ఓ ఉత్తరం వచ్చింది. గీత తల్లి అవ్వబోతోందని.

❋ ❋ ❋

"ఏరా శివుడూ - వెళ్ళినాడివి ఒంటరిగా వచ్చావ్?" రామనాధం ఆత్రంగా అడిగాడు.

"ఎక్కడ బాబాయ్, ఒక్కడూ కూలికి రావట్లా - మన నోట్లో మాట వుండగానే మరోడు వచ్చి లాక్కెళ్తన్నాడు. ఈ బూరేలు తొక్కడమే వీళ్ళకి కొత్తయిపోయె - అన్నీ నేర్పిస్తిమి. ఇప్పుడు ఒక్క వెధవ ఈ పక్క తొంగి చూడట్లా -" శివుడు ఉస్సురంటూ మంచంలో కూలబడ్డాడు.

"అట్టాగంటే ఎట్టారా? ఏదోటి చేయొద్దు మరీ?" రత్తయ్య వాళ్ళ దగ్గరికి వచ్చాడు.

"పని ఎద్దడి. ఎవడు చూసినా వాడిపని ముందు కావాలను కునే వాళ్లే - పత్తి ఏసే వాళ్ళు ఇంతమంది పుట్టగొడుగుల్లా పుట్టు కొచ్చారు గానీ కూలీలు ఎక్కణ్ణించి పుట్టుకొస్తారు? అందులోనూ బూరేలు తొక్కడానికి మగాళ్ళే కావాలయ్యే-"

"అట్లా అయితే ఎట్లా అన్నాయ్? మొన్నా చిట్టిబాబు గారి వరలక్ష్మి క్వింటాలు 1500 పలికిందంట. ఇంత దాకా ఆరేటు ఎరిగి - చూద్దుమా? ఊళ్ళో అందరి పత్తీ రాయచూర్ నెళ్ళిపోతోంది." సుధాకర్ ఆత్రంగా అన్నాడు.

"ఆ పైపొడు మురాకి చెప్పొచ్చాలేరా - ఎల్లుండి వస్తామన్నారు "

"మంచాడివే - ముందామాట చెప్పకూడదూ-" రత్తయ్య నిట్టూర్చాడు

"ఏంరంధో కానీ పోయిన పంటతో పొలిస్తే కూలీరేట్లు మూడింతలయ్యాయి ఈ రకంగా పెరుగుతూ పోతే ఇక పత్తి పండించి నట్టే"

"వాళ్ళ టెక్కు కూడా ఎంత పెరిగిందనీ-"

"అది కాదురా శివుడూ - ఆ వరలక్ష్మికి బ్రహ్మాండమైన రేటుంది. మన పత్తి వెన్న ముద్దలా ఎంత మంచి పత్తి - ఎట్లాగయినా మార్కెట్‌కు తీసుకెళ్ళాల్రా - ఆ సవారిని, కురపనీ కేకేయి అంతగయితే అన్నయ్య వదినా సావిత్రి పత్తి గంపల్లో అందిస్తారు మనం నలుగురం బూరేలు తొక్కుదాం "

"అవున్నాన్నా, అదేనయం, ఇప్పుడొస్తారు అప్పుడొస్తారని ఎక్కడ కాచుకొనివుంటాం-"

"పెద్దింటి దూలాల్దాకా వరలక్ష్మి పత్తి కూరి పెడితిమి చావిట్లో హెచ్‌ఫోర్ అనుకో కూడదు గానీ - ఎండలకాలం - అసలే ఈ బయలు పొలాల మీద సుడి తిరిగిందంటే పట్టాన ఆగదు. అమాంతం ఇళ్ళకప్పుల్నే లేపుకు పోద్ది-"

"చెప్పడం మర్చి పోయా నాన్నా - మొన్న ఎరువులకొట్టతను కనబడి బాకీ గుర్తు చేసాడు నేను వరలక్ష్మి రేటు చెప్పాను. మనకి ఎకరానికి పదిహేను క్వింటాళ్ళు పండదూ-" సుధాకర్ అడిగాడు

"ఆ ! నికరం !" అన్నాడు శివుడు ఈ ఏడాదితో మన కష్టాలు గట్టెక్కుతాయి."

"ఓ నాలుగెకరాలు కొనుక్కోవాలిరా - అనూరాధకి ఇచ్చింది పోగా ఇప్పుడు మనకెంతా మిగిలింది ముప్పై ఎకరాలేగా? ఊళ్ళో మిగిలిన పొలం అమ్మిన డబ్బులు పెట్టి అల్లుళ్ళకు చెరిపది ఎకరాలు కొనిస్తివి. మనమే దిగడిపోయాం-"

"అట్లాగే అన్నయ్యా" రామనాథం ఆనందంగా అన్నాడు

"నాలుగెకరాలేం ఖర్మ నాన్నా ఏకంగా పదెకరాలు కొందాం" శివుడు నవ్వుతూ రత్తయ్య వంక చూసాడు.

"సరే - మాటలకేమెచ్చెగాని. లెండిరా - లేచి - గుంజలు పాతండి. అబ్బాయ్ శివుడూ నువ్వు ఆ గుంజలు తెచ్చి ఇట్టా ఎయ్యి - సుధాకరూ నువ్వెళ్ళి చిక్కాలు పట్టుకురా" రత్తయ్య క్షణాల్లో పెళ్ళిసందడి తెచ్చేసాడు.

"మొత్తానికి భలేవాడివినాన్నా - నువ్వు ఒక్కడివీ పది మంది పెట్టు"

"ముందు నువ్వు పదరా - మాటలు తరువాత-"

రామనాథం నవ్వుతూ లేచాడు.

రామనాథం, రత్తయ్య గుంజలు పాతడానికి పందిరి ముందు గుంటలు తవ్వే లోపల శివుడు, సుధాకర్ అందిన తుమ్మ కొమ్మలు చెలిగి సిద్ధంగావుంచిన గుంజలు పట్టు కొచ్చాడు.

సుధాకర్ గుంటలో గుంజను దిగేస్తే - రత్తయ్య పూడ్చాడు

శివుడు రామనాథం మరో గుంజను నాటారు.

నాలుగు గుంజలు చదరంగా నాటారు. చిక్కాం తీసుకొచ్చి నాలుగు మూలలు మోకుతో గుంజలను బిగించి కట్టారు.

పెద్ద పెద్ద గంపలు తీసుకొచ్చారు సావిత్రి, శాంతమ్మని కేకేయడానికి సుధాకర్ వెళ్ళాడు. వెళ్ళినట్టే క్షణంలో వచ్చాడు

రామనాథం, రత్తయ్య, శివుడు ముగ్గురు గంపల్లో నింపి చిక్కాంలో పత్తి వేసారు.

ఓ పావు వంతు చిక్కాంలో పత్తి వేసాక - శివుడు, రామనాథం చిక్కాం తాళ్ళు పట్టుకొని లోపలికి దిగారు. వాళ్ళు కాళ్ళతో చిక్కాం లోని పత్తిని అణగతొక్కుతోంటే బూరేం నిండుతోంది. రత్తయ్య, సుధాకర్ గంపలతో పత్తి తెచ్చి పోస్తున్నారు.

చిక్కాంలోని పత్తి ఎత్తి వేయడంలో సన్నటి దూది పీచు గాలిలో కలిసి ఊపిరి తిత్తుల్లోకి చేరుతోంది. వంటినిండా తలకిందా ప్రత్తే.

"ఏంట్రా - మీ పిన్ని వాళ్ళింకా రాలేదూ-?" రామనాథం పత్తి తొక్కుతూ అన్నాడు.

"ఏరా - సుధాకర్ - కేకేసి రాలా?" శివుడు సుధాకర్‌ని అడిగాడు.

"చెప్పాను అన్నాయ్ - కూర తిరగమోత పెట్టేసి వస్తామన్నారు."

"ఎక్కడి కెళ్ళావో ఆ మాణిక్యాన్ని కేకేసుకురమ్మని పంపాను"

"మరి సవారి, కురుప ఏదీ?"

"కురుప లేడు. సవారి స్ప్రేయర్‌లో పెట్రోలు పోసి, తుడుస్తున్నాడు. అవగానే రమ్మని చెప్పాను."

"అప్పుడే చిక్కాం నిండిపోతుంది - కాటా ఏయించాద్దేమా"

"బాబాయ్ - ఆ దస్తగిరికి కబురెడదమా?" శివుడు ఉత్సాహంగా ఎగిరి ఎగిరి గెంతూతూ పత్తిని చిక్కాంలోకి అణగదొక్కుతూ అన్నాడు.

"ఒరేయ్ - లేడికి లేచిందే పరుగు అన్నట్టు ఏంటా తొందర? ఓపక్క గదిలోని పత్తన్నా చిక్కాలకు తొక్కద్దూ?"

అందరి ఉత్సాహం ఉవ్వెత్తున లేస్తోంది. ఇంకా రాని సావిత్రి శాంతమ్మల మీద వేళాకోళాలాడుతూ పత్తి గబగబ తొక్కుతున్నారు.

రత్తయ్య, సుధాకర్‌లు ఓ పక్క శివుడూ రామనాథం ఓ పక్క పోటీలుపడి పని చేస్తున్నారు.

పరాచికాలు - హాస్యాలు నవ్వులు -

ఇంతలో పొలాల మీద సుడిగాలి తిరిగింది. అది వేగంగా సుళ్ళు తిరుగుతూ ఊరి

మీదకి మళ్ళింది ఇళ్ళు కప్పుల మీది జమ్మును , వాముల్లోని ఎండు గడ్డిని, దూదిపింజల్ని గిరగిరా తిప్పేస్తూ ఇళ్ళనీ చుట్టేసింది

"ఊళ్ళో ఇళ్ళన్నీ ప్రత్తితో నిండివున్నాయి ఆడవాళ్ళు బయట పొయ్యి పెట్టుకొని వండుతున్నారు

"శివుడూ - పొయ్యిల్లో నిప్పులన్నాయోమో చూడంర్రా - సుడిగాలి తిరుగుతోంది-" రామనాధం హెచ్చరిస్తూ వంటింటి వైపు వెళ్ళాడు

అప్పటికే వాళ్ళ పొయ్యిలు ఆర్పేసి వున్నాయి.

"అమ్మాయ్ - సుడి తిరుగుతోంది పొయ్యిలు ఆర్పండి-"

సావిత్రి దడి మీద నుంచి పక్కింటి అమ్మలక్కలందర్నీ హెచ్చరించింది శాంతమ్మ మరో పక్క పరుగు తీసింది.

శివుడు కూడా గబగబ అందర్ని హెచ్చరించాడు

అప్పుడే మాణిక్యం సందేళ దీపాలు వెలిగించు కోను బుడ్డి సరి చేసు కుంటోంది గుడ్డ వత్తికి కిరసనాయలు అందడంలేదు.

సవారి స్ప్రేయర్‌లో పోసి పక్కగా పెట్టెళ్ళిన పెట్రోల్ డబ్బా చూసింది బొంకూరు సంతకు పోతేకానీ కిరసనాయలు దొరకదు.

"గడ్డి నూనె" అంటూ ఒకడు సైకిలేసుకొని కిరసనాయిలు అమ్మడానికి వస్తాడు .

"దొంగ ముండ కొడ్కు - చటాకు[1] నూనె పొయ్యనింకె చారానా[2] తీస్కొంటడు" మాణిక్యం గొణుక్కుంది. "గింత తీస్కుంటే ఏమయితది?"

మాణిక్యం కిరసనాయిలుగా 'చక్కగా పెట్రోలు డబ్బా తీసుకొచ్చి బుడ్డిలోకి వంచుకోబోయింది. పొయ్యిలోని నిప్పు ఒక్కసారిగా భగ్గుమంది. క్షణాల్లో ఇంటి చూరు అంటుకుంది. సుడిగాలి మంటను మరింత ఎగదోసింది.

ఇంటి దూలాల కంటూ వున్న వరలక్ష్మి పత్తి చురచుర అంటుకుంది భుగభుగ మండింది. ఇంటి వాళ్ళ గుండెలు భగ్గుమన్నాయి. పక్కయిళ్ళకెళ్ళిన రామనాధం, శివుడు, సావిత్రి పరిగెత్తు కుంటూ వచ్చారు. ఊళ్ళో అందరూ పరిగెత్తు కొంటూ వచ్చారు. కడవలు తీసుకొని కాల్వవైపు కొందరు వాగువైపు కొందరు దొరువు వైపు కొందరు పరుగులు పెట్టారు.

శివుడు గబగబ ఇంటి పైకెక్కి, కడవలతో అందిస్తోన్న నీళ్ళు కప్పు మీద గుమ్మరించాడు. రామనాధం, సవారి చెరో వైపు నుంచి కప్పు పైకి ఎగబాకారు.

భగభగ మంటలు కప్పును కమ్ము కొచ్చాయి. ఎండిన తాటాకుల పందిరి వాసాలతో సహా కాలి కుప్ప కూలింది.

---

1 50 గ్రాములు 2. పావలా

హాహాకారాలు పెడుతూ కప్పు మీదికి నీళ్ళు విసిరారు

కొందరు తమ యిళ్ళను భద్రం చేసుకోవడంలో మునిగి పోయారు.

కొందరు చావిడి మీదకు ఎక్కి - నిప్పు రాజుకోకుండా దాని కప్పు మీద నీళ్ళు గుమ్మరించారు. వంటింటి కప్పు మీదా నీళ్ళు గుమ్మరిస్తున్నారు

రామనాథం వాళ్ళ ఇంటికప్పు విరిగి ప్రత్తిలో కూలిపోయింది.

అందరూ హాహాకారాలు పెట్టారు ఆడవాళ్ళు గొల్లుమన్నారు. ఊరి వాళ్ళు కొందరు రామనాథాన్ని, శివుణ్ణి బలవంతం మీద రెక్కలు పట్టి ఈడ్చు కొచ్చారు. సవారిని రత్తయ్య వెళ్ళి లాక్కొచ్చాడు.

రామనాథం పండించిన తెల్ల బంగారం మాడి మసి బొగ్గయింది ఇన్నాళ్ళ శ్రమ బూడిదలో పోసినట్లయింది

అందరూ బిడ్డ పోయినట్లుగా గుండెలు బాదుకుంటూ ఏడ్చారు ఎంత ఏడ్చినా వారి కన్నీరు గుండెలో మంటలనైనా ఆర్పలేక పోయింది.

సవారి పెళ్ళాన్ని చావబాదాడు

"అయ్యా, అది గడ్డినూన[1]నుకొంటి - గిట్లయితదని నేనను కోలే"- మాణిక్యం గుండెలు బాదుకుంటూ మంటలో దూకబోయింది.

సావిత్రి, శాంతమ్మ, వెనక్కి లాక్కొచ్చారు

సుధాకర్ పాటు ఊళ్ళో వారందరూ సవారిని వాడి కుటుంబాన్ని రామనాథం ఇంట్లోంచి తరిమేస్తారనే అనుకొన్నారు. రామనాథం ఆ వూసే ఎత్త కుండా మాణిక్యాన్ని ఓదార్చాడు. సుధాకర్‌కి వళ్ళు మండి పోయింది

"నిక్షేపం లాంటి పత్తి ! ఆ తెలివి తక్కువ దాని వలన మాడి బొగ్గయింది. ఇంకా వాళ్ళనిట్లా వెనకేసు కొస్తావేంటి నాన్నా"

"తెలివి తక్కువదని నువ్వే అంటున్నావ్ కదరా-" రామనాథం గంభీరంగా అన్నాడు. "చూరు అంటుకుంటే అంటుకుంది. మన మాణిక్యం చీర అంటుకోలేదు. సంతోషించు-"

'నిన్నెవరూ బాగు చేయలేరు' సుధాకర్‌కి ఏడవాలో నవ్వాలో అర్థం కాలేదు.

చకచక ఎదగాల్సిన వాళ్ళు చప్పున కూలబడిపోయారు. ఆడవాళ్ళ వంటి మీద బంగారాలు కర్నూలు షరాబ్ బజార్ కెళ్ళాయి. కొత్త మోటర్ సైకిల్‌ను ఎరువుల కొట్టు వాడు వేసుకు తిరుగుతున్నాడు. పొలాల మీద ట్రాక్టర్ మీదా అప్పులకు వెళ్ళారు.

ట్రక్కుల కొద్దీ ఎరువులు మింగిన రేగడి - పసిపాపలాగారాలుపడి సాగించుకున్న వరలక్ష్మి మాతప్పేం లేదని చేతులెత్తేసాయి.

"ఇన్స్యూరన్స్ చేయించి వుండాల్సింది" అధికారులు పెదవులు విరిచారు.

---

1 కిరసనాయిలు

రత్తయ్య అల్లుళ్ళిద్దరూ మెరుగు పడ్డారు. భార్యల వంటి మీద పెద్ద గొలుసులు దిగేసారు

మల్లేశ్ పంట అమ్మి డబ్బు రాగానే పెట్టుబడి వరకు వుంచుకొని మిగిలిన డబ్బుతో రామనాథం దగ్గరకు బయలు దేరాడు

అనూరాధ తన నగలన్ని మూటకట్టి భర్త చేతికిచ్చింది. "వాళ్ళు కష్టంలో వున్నారు ఇవి అక్కరకు వస్తాయేమో-"

మల్లేశ్ ఆమె వంక ఆశ్చర్యంగా చూసాడు

"మీ కిష్టమైతేనే ఇవ్వండి నా బలవంతమేమీ లేదు-"

మల్లేశ్ డబ్బు, నగలతో సహా రామనాథం వద్దంటున్నా - నచ్చచెప్పి ఇచ్చి వచ్చాడు.

"గిట్ల పత్తి పండ్తుంటే పూరిగుడిసెల నిల్వదు, నా మాట ఇనుకోన్రి. సున్నం మిద్దె కట్టున్రి" బాలయ్య రామనాథం దగ్గర గోలచేసాడు.

తనే స్వయంగా దగ్గరుండి గానుగ తవ్వించాడు.

సున్నంరాళ్ళు, ఇసుక తోలించాడు.

వడ్రంగి కొయ్య ఇరుసు చేసాడు వడ్డెర వాడు రాతి చక్రం చెక్కిచ్చాడు. గానుగ సిద్ధమైంది.

నడిగడ్డ ఎద్దులు చొప్ప నములుతూ సున్నంలో ఇసుకను చక్కగా మెదిపాయి.

తుంగభద్ర ఒడ్డునున్న పుల్లూరు దగ్గర్నుంచి చదరంగా వుండే బండరాళ్ళు తెచ్చారు.

నిప్పురవ్వ పడే అవకాశం లేకుండా మూడు పెద్ద హాళ్ళ సున్నం మిద్దె తయారయ్యింది.

రత్తయ్య అన్ని పనులు స్వయంగా చూసుకున్నాడు. అతనికి చేతినిండా సరిపోయే పని దొరికింది. మళ్ళీ పెద్దింటిని కట్టాడు.

మళ్ళీ ఏడాది ప్రత్తి పంటకు విత్తనాలు నాటారు.

గీత కూతురితో పాటు కాపురానికి వచ్చింది. గీత మెడలోని బంగారాన్ని భద్రంగా కొంగు చాటున సర్దుకొని గుండెల మీద చేయి వేసుకొని నిట్టూర్చింది.

"హమ్మయ్య - బతికి పోయను! నా బంగారం గట్టిది కాబట్టి సుధాకర్ ఆ మంటల జోలికి వెళ్ళాలా-"

❋ ❋ ❋

"మల్లేశ్, మీ నాయన రాలె-"

అప్పుడే లారీ దిగి వళ్ళు విరుచుకుంటున్న మల్లేశ్ వీపున చరిచాడు రాజయ్య.

మల్లేశ్ ఉలిక్కి పడ్డాడు. వీపున చరిచిన వాళ్ళ వైపు గిర్రున తిరిగాడు.

"ఓ రాజన్నా - నువ్వా? ఏమి ఇట్లా వచ్చావ్?"

"గా దస్తగిరి తోనవస్తి - నీ ముచ్చట చెప్పవూ?"

"నేను, రాంనాథం చిన్నాయనా వచ్చాము. వాళ్ళ లారీ వెనకొస్తోంది. నీ వెప్పుడు వచ్చావు?"

"నేను గిట్ల వచ్చి నాల్గినాలాయె - ఒక్కడు మాట జెప్పలేడు- పత్తి దింపి లారీ వోడు సక్కంగ పోయుండు - ఏం జేసుడో ఏమో దిక్కు తోస్త లేదు-"

"ఎవరెవరు వచ్చారు?"

"కేసన్న వచ్చిండు, హనుమంతు వచ్చేడ్దుంటె - రాలె -"

"దస్తగిరి ఏడి?"

"ఏమో? ఇక్కడ్నే వుండె యాడకి పోయిండొ ఆయన కొక బేరమా? నడిగడ్డంతా కొన్నడు"

"అవునూ, వచ్చి నాల్గు రోజులయినా పత్తి ఎందుకు అమ్మలేదు?"

"నాకేమెర్క? దస్తగిరి వస్తడు ఇంగ గీ పొద్దు బేరం అయితట్టు లేదంటడు పోతడు వాకిటి కాడకుక్క తీరున గా పత్తి బూరేల ముంగట పడివున్నం. చిన్కురాల్తదో - ఎండ పడ్తదో ఏమెర్క? గాడ్డి కొడ్కులందరు బీడి తాగెటోల్లె - ఏ బీడి పడ్డగాని గా రాంనాథమోల్ల తీరున గోచి కూడ నిప్పుల్ల ఏసుడె-"

"అవునవున్న ! ముందు విషయమేంటో కనుక్కుందాం - పద."మల్లేశ్‌ను రాజయ్య అనుసరించాడు.

రామనాథం వాళ్ళు లారీ దిగేసరికి మిల్లు బయట రోడ్డు పక్కన బారులు తీరిన ప్రత్తిలారీలు చూసి తెల్లమొహాలు వేసారు

వీరిలారీ ముందు సుమారు పది పదిహేను లారీలున్నాయి. రామనాథం ఒక్కో లారీ చూస్తూ ముందు కెళ్ళాడు

మల్లేశ్ వాళ్ళు పత్తి వేసు కొచ్చిన లారీ కూడా ఆ వరుసలోనే వుంది. రామనాథం అక్కడికి వెళ్ళేసరికి మల్లేశ్ వచ్చాడు.

"ఏంటి విషయం?"

"పక్కన జిన్నింగ్ మిల్లులో సమ్మె చేస్తున్నారు - ఎక్కడి పత్తి అక్కడ నిలబడి పోయింది-

"ఇప్పుడేం సమ్మె?"

"వాళ్ళకి బోనస్ ఇవ్వాలంట-"

"ఇన్ని పత్తి లారీలు, రోడ్డు మీద ఆపేసి చేయలంటానా సమ్మె-" రామనాథం చిరాకు

పడ్డాడు

"మరి ఇప్పుడే కదండీ వాళ్ళకి సరియైన సమయం-"

"ఏం సరియైన సమయం? మన ప్రాణాలన్నీ పెట్టి చెమటోడ్చి పండించుకొచ్చిన పంట - ఇలా రోడ్డు పక్కన దిక్కుదివాణం లేకుండా పడి వుంటే ఎలా? ఏ ఆకతాయి వెధవో ఓ చిన్న నిప్పురవ్వ వేస్తే చాలు మన బ్రతుకులన్నీ బుగ్గి పాలవ్వడానికి-" రామనాథం అసహనంగా అన్నాడు.

మల్లేశ్ మాట్లాడలేదు

"మొదలయ్యి ఎన్ని రోజులయ్యిందంట?"

"నాలుగు రోజులు అయ్యిందంటున్నారు. నిన్ననే రిలే నిరాహారదీక్ష కూడా మొదలెట్టాడు"-

"ఇప్పుడిప్పుడే ఆగదా?"

"ఏమో మరి? ఎంత ఆలస్యమైనా వాళ్ళు అనుకొన్నది సాధించాలంట"

"నిరారదీచ్చంటే ఏంది మల్లేశ ? " రాజయ్య కుతూహలంగా అడిగాడు

"అన్నం నీళ్ళు ముట్ట కుండ కూర్చుంటారన్నా-"

"నాల్గుదినాలయ్యె నేను రొట్టెతిని! గా ఉడిపి హోటలకు పోతే బేకంటడు బేడంటడు సమజయిన పొద్దు తినొచ్చు తియ్- అన్నడు కేసన్న - ఇద్దరం నాల్గు దినాల బట్టి గా పంపుల నీల్లు తాగుతున్నం - మల్ల మాదీ నిరారదీచ్చ కాదె?" రాజయ్య కచ్చగా అన్నాడు

రామనాథం నిర్ఘాంత పోయాడు

"ఏ పొద్దుల ఏ సుట్ట ముక్క పడ్తదో ఏ బీడి ముక్క పడ్తదో బుగులు పడి బుగులు పడి - గా పత్తి చిక్కాల మింద కుక్క కాపల కాస్తున్నాం - మా లొల్లి ఎవడు ఇనాలె వొక్కన్కి మన ముచ్చట తెల్వదు. గా దస్తగిరి అట్లొస్తడు. ఇట్లపోతడు బేకార్‌గా గీ పత్తి బేరాల పెట్న -" రాజయ్య వాపోయాడు.

"భలే వాడివే రాజయ్య - ఈ మిల్లు లేకపోతే మరో మిల్లు లేదేమిటి? అక్కడిన్నించి బయ్యర్లు వస్తారేమో చూద్దాం-"

"లేరు చిన్నాయనా - నేను కనుక్కొని వచ్చాను. మిగిలిన రెండు మిల్లుల్లోనూ ఇదే పరిస్థితంట. ఇంకోటి వుంటే వాడు రేటు బాగా తక్కు వేస్తున్నాడంట-"

"రేటు ఏ మాత్రం వుందేం"

"ఈ మిల్లు వాళ్ళు సమ్మె మొదలయ్యే దాకా క్వింటాల్ వరలక్ష్మికి 950 నుంచి వెయ్యి రూపాయలదాకా వేసారంట. "ఇప్పుడా కొనే ఒక్క మిల్లువాడూ 600 లోపే వేస్తున్నాడంట!"

"అన్యాయం!"

రామనాథం ముందు రాజయ్య వాళ్ళ పత్తి చిక్కాల దగ్గరకు వెళ్ళాడు. తమ వాటి దగ్గర

కాపలా వున్నాడు

రాజయ్యను కేసన్ననూ వెంట పెట్టుకొని వెళ్ళమని మల్లేశ్‌ను పంపించాడు

వాళ్ళు తిని మాట్లాడు కొంటూ వచ్చారు

"గీ రాయచూర్ల అన్ని ఇసిత్రమే మల్లీ - గింత అన్నంల పప్పు నీల్లు పోసిన్రు - గదెందో పేరు చెప్పిన్రు - ఐదురూపాయలు తీసుకొన్రు-"

"ఏం తినిపించావేమిటి?" రామనాధం నవ్వుతూ అడిగాడు

"బిసిబిళే బాత్-" మల్లేశ్ నవ్వాడు, "మేమెళ్ళే సరికి ఏమీ లేవు. మన రైతులు, లారీల డ్రైవర్లు క్లీనర్లు అందరూ అక్కడే పడి వున్నారు. మీరు కూడా ఏవైనా తినొస్తే పోద్ది-"

"ముందు ఈ విషయం తేల్చుకోవాలి ఎంత సేపని పత్తిని ఆరు బయట పెట్టుకొని వుంటాం?"

రామనాధం, రాజయ్య మిల్లు గేటు దాకా నడుచు కొంటూ వెళ్ళారు పైదాకా వున్న పెద్దపెద్ద ఇనుపగేట్లు తాళం బిగించి వున్నాయి. లోపల ఏం జరుగుతుందో తెలియడంలేదు

రామనాధం గేటుకు చెవి అన్చి వినాలని ప్రయత్నించాడు తన ప్రయత్నానికి తనే నవ్వుకొని విరమించు కొన్నాడు

ఇంతలో రాజయ్య గేటు కున్న గుబ్బలు పట్టుకొని గేటు పైకి ఎగబాకేడు రామనాధాన్ని పైకి ఎక్కమని సైగ చేసాడు

రామనాధం కూడా పంచెపైకి ఎగగట్టి - గేటు పైకెక్కాడు. లోపల టెంటు కింద పూలమాలలు వేసుకొని నలుగురైదుగురు కూర్చున్నారు వాళ్ళ కి మద్దతుగా టెంట్ చుట్టూ కార్మికులు చేరారు.

ఆగి ఆగి నినాదాలు ఇస్తున్నారు. ఎవరో వారికి ఫలహారం పొట్లాలు కాఫీలు పంచుతున్నారు. రామనాధం ఆ టెంట్ మీద రాసివున్న డిమాండ్లు చదవాలని ప్రయత్నించాడు. తెల్లబ్యానర్లమీద ఎర్ర అక్షరాలు మెరుస్తున్నాయి. దాదాపుగా అన్నీ కన్నడంలోనే వున్నాయి. ఇంతలో లోపల మిల్లు కార్మికులు గడ్డితో చెసిన ఓ దిష్టిబోమ్మను తగలబెట్టారు. తగలబెట్టిన మంటలోకి అట్టలు అవీఇవీ విసిరేసారు. మంట పైదాకా ఎగిసి గేటుపై నుంచి - కాంపౌండ్ వాల్‌పై నుంచి స్పష్టంగా కనిపిస్తోంది.

బయట పడిగాపులు కాస్తోన్న రైతులందరూ, ఏం వుపద్రవం వచ్చిపడ్తుందోనని గుండెలు బాదుకొంటూ లారీలు వెనక్కు మళ్ళిస్తున్నారు. ఆ హడావుడిలో ఒక లారీ ఇరుక్కుపోయింది-ఎక్కడి లారీలు అక్కడ నిలబడిపోయాయి.

రైతులు లబలబ లాడుతూ ముందు నుంచి వెనక్కి పరుగులు తీసారు కొందరు మంట అంటుకునే అవకాశం లేకుండా నీళ్ళు చల్లుదామంటే-కొందరు తూకం పెరుగుతుందని కావాలని చల్లామని అంటారని - వారి ప్రయత్నాన్ని విరమింపజేసారు.

కొందరు యువకులు ఉద్రేకంతో వూగిపోతున్నారు తలుపు బద్దలు కొట్టాలంత ఆవేశంలో వున్నారు

"మరో గత్యంతరం లేదా?" మల్లేశ్ అసహనంగా అన్నాడు

"ఆదోని వెళ్దామా?" రామనాథం అంటుండగానే-మిల్లుగేట్లు బార్లా తెరుచుకున్నాయి

లోపల్నించి ఆనందంగా అరుచుకొంటూ-కేకలు పెడుతూ కార్మికులంతా బయటకు పరుగులు పెడుతూ వచ్చారు

"హ్హా హ్హా " అంటూ అరుస్తూ - కన్నడంలో ఏదో పాటలు పాడుతూ చిందులేస్తూ ఆగిన లారీల మీదుగా వెళ్ళారు బహుశా వాళ్ళ యజమానికి అనుకుంటా- 'కిషన్‌చంద్ జిందాబాద్' అంటూ సంతోషంగా అరుస్తున్నారు

పత్తి బూరేలనూ కావలించుకొని పడుకొన్న రైతులు వాళ్ళ వంక నీరసంగా చూసారు "ఇంక నన్నా తమకు మోక్షం లభించదా?" అడుగంటిన ఆశతో మిల్లువైపు చూసారు

మిల్లు గేట్లు మళ్ళీ మూసుకున్నాయి ఈ క్షణం అక్షణం అనుకుంటూ రైతులు ఎదురుచూస్తుండగానే పొద్దుపోయింది. చీమ చిటుక్కుమన్నా ఉలికులిక్కి పడుతూ రైతులందరూ పత్తి మీద పంచ ప్రాణాలు పెట్టుకొని రాత్రి జాగారం చేసారు

పొద్దున తొమ్మిది గంటలకి తీరిగ్గా ఒక్కో వర్కరు వచ్చారు మిల్లులోకి వెళ్ళారు పదింటికి ఒక్కో లారీని మార్కెట్ అవరణంలోకి పంపించారు. ఒక్కో లారీ లోడును దింపేసి, బయటకు వెళ్తోంది.

లారీ ఛార్జీలు కట్టడానికి కూడా రైతులు దగ్గర డబ్బుల్లేవు, మిల్లు వాళ్ళు ఎంత త్వరగా ప్రత్తి బేరం ముగిస్తే-రైతులు వాళ్ళకి డబ్బులిస్తారు. ఖాళీ లారీల డ్రైవర్లు క్లీనర్లు దూరంగా వెళ్ళి, తృప్తిగా బీడీలు, సిగరేట్లు ముట్టించి - దుమ్ము పీలుస్తున్నారు.

ఇద్దరు ఉద్యోగులు వ్యాపారుల తరుపున ఒక్కో రైతు పంటనీ పరిశీలించి-రేట్లు వేస్తూ వస్తున్నారు. కొందరు ఉద్యోగులు ప్రతి ప్రత్తి బూరేం నుంచి చేత్తో పత్తి బయటకు లాగి- దూది నాణ్యతను బట్టి రేటేస్తున్నారు. ఇద్దరూ కన్నడంలో గుసగుసలాడుతున్నారు. రైతులు ప్రాణాలు ఉగ్గ బెట్టుకొని వాళ్ళ వంక చూస్తున్నారు.

రామనాథం వాళ్ళ ప్రత్తికి 600 చిల్లర వేసారు. మల్లేశ్‌కూ అటుఇటూగా అంతే-

రామనాథం ఎదురుతిరిగాడు-

"ఏంటయ్యా ఇదీ -నిన్న గాక మొన్న వెయ్యిరూపాయలేసి ఇప్పుడు 600 ఏంటి?"

"అది మొన్నటి రేటు. ఇప్పుడు రేటు పడిపోయింది-" అతను నింపాదిగా అన్నాడు.

"ఇంత హఠాత్తుగా ఎట్లా పడిపోయాయండి? పడినా ఇంత తేడా ఎందుకుంటుంది?"

"మీరు మొన్నే తీసుకురావాల్సింది-" అతను మరింత నింపాదిగా తప్పంతా వాళ్ళమీదకు తోస్తూ అన్నాడు. ఇంతలో రైతులందరూ వాళ్ళ చుట్టు ముట్టారు-

"నీకండ్లు గిట్ల మూస్కపోయినాయిరా? నాల్గుదినాలయ్యే గిక్కడకుక్కలు తీరున కాపలా గాయబట్టి-" రాజయ్య కల్పించుకొని కోపంగా అన్నాడు.

"మీరెప్పుడొస్తే మాకెందుకూ? మీరు ఎప్పుడు సరుకు ఇచ్చారో ఆ పూట రేటే వేస్తాం-" నిర్లక్ష్యంగా జవాబిచ్చాడతను.

"అరె బాడ్కవ్-" రాజయ్య తిడుతున్నాడు.

ఆ కన్నడ వ్యాపారి గ్రహించేలోపలే మల్లేశ్, కేసన్న వచ్చి పక్కకు లాక్కెళ్ళారు.

రామనాథం వాళ్ళతో సామరస్య ధోరణిలో అన్నాడు, "ఇదెక్కడి న్యాయమండీ? మేం సరుకు తీసుకొచ్చి నాలుగు రోజుల పైనే అయ్యింది. కనీసం మార్కెట్ ఆవరణలోకైనా రానీయక పోతిరి. టన్నుల కొద్దీ పత్తి - ఒక్కనిప్పురవ్వ చాలదూ - మా బ్రతుకులన్నీ - బుగ్గి చేయడానికి! ఈ వారం రోజులు రైతులందరం ఎన్ని తిప్పలు పడ్డామో వూహించండి. ఇంతా చేసి ఇప్పుడు రేటు తెగ్గోస్తే ఎట్లాగండి?"

"అదంతా మాకేం తెల్సు? మాసేటు చెప్పాడు, రేటు వేస్తున్నాం?"

"మధ్యలో మీసేటు మాట ఎందుకెత్తుతారు? దొంగలు దొంగలు రాజ్యాలు పంచు కున్నట్లు మీరు మీరూ ఏకమై మమ్మల్ని దోచుకు తింటారు - ముమ్మరం చూసి మీరు సమ్మెకు దిగుతారు. నాలుగు రోజులు సాగదీసి మీ సేట్ మీకు బోనస్ ప్రకటిస్తాడు. మీ సేట్ ఉదారతకు మీరు జేజేలు కొడతారు- మీ సేటు అతని లాభల్లోంచి తీసి పంచు తున్నాడా? లేదు. అతని లాభం అతనికి చెక్కు చెదరకుండా అందుతుంది. మీ బోనస్ మీకూ అందుతుంది. మధ్యన నష్టపోయేది మేము. మాధర తెగ్గోసి మీ జేబులు నింపు కుంటారు. మీరు నిజంగా కార్మికుల క్షేమం కోరేవారయితే మేమూ కార్మికులమే మరి మా రేటు తగ్గిస్తుంటే ఎలా వురుకొంటారు ? మీరు, మీ సేటూ, మిల్లులు అన్నీ బతికేది మేం పండించిన పంట మీదే - ఈన కాయక ముందే గోతి కాడ నక్కల్లా దోచుకోడానికి సిద్ధమవుతారు - వచ్చి ఒక్క ఎకరం పత్తి పండించి చూపండి. అప్పుడు తెలుస్తుంది మా కష్టలేంటో. నువ్వు కాకపోతే మరోడి దగ్గర అమ్ముకుంటాం - పంట మాది అవసరం మీది. మేం అడిగిన ధరవేస్తే ఒప్పుకుంటాం. లేకపోతే -" రామనాథం మిగిలిన రైతుల వైపు తిరిగాడు "పదండ్రా బళ్ళారో, ఆదోనో పోదాం-"

రామనాథం ఉద్రేకంగా ఊగిపోవడం చూసి రైతులంతా తెల్లబోయారు. వాళ్ళ విషయం అర్థమయింది.

అందరూ రామనాథం దగ్గరకి వచ్చేసారు. మర్కెట్ యార్డ్‌లోని వ్యాపారులు ఉద్యోగులు ఒక్క నిమిషంలో పక్కకు వెళ్ళి మాట్లాడు కున్నారు. మళ్ళీ బయటకు వచ్చి - ఏడు వందల యాభై రూపాయలు ప్రకటించారు. గుడ్డిలో మెల్ల. రైతులందరూ సమాధాన పడ్డారు.

ఆవేశంలో బళ్ళారి వెళ్దామని అన్నాడే కానీ, కాస్త నిమ్మళించాక రామనాథం అలా వెళితే ఏం జరుగుతుందో ఊహించాడు. ఆ వ్యాపారులకు వాడుకగా పత్తి వేసే రైతులు వుంటారు. అదనంగా సరుకు వచ్చిపడితే రేటు తగ్గిస్తారు. మొదలుకే మోసం!

బళ్ళారి వెళ్ళాలన్నా మళ్ళీ లారీ ఛార్జీలు అవుతాయి ఇప్పటికే లారీల వాళ్ళు వారం రోజుల బట్టీ సరుకు అన్‌లోడ్ చేయకుండా అట్లాగే వున్నాందుకు ఎక్స్‌ట్రా డబ్బుడగుతున్నారు.

రామనాథం కూడా అదే ఆలోచించాడు.

వ్యాపారులు సావధానంగా ఆలోచించారు.ఈ ప్రాంతాలలో పత్తిని విస్తారంగా పండించడం లేదు సంకర జాతి ప్రత్తి పంట మరీ తక్కువ అందులోనూ వరలక్ష్మి లాంటి ప్రత్యేక వంగడాల పత్తికి మంచి డిమాండ్ వుంది

వంద రూపాయలు అటూ ఇటూ అయినా వారికి జరిగే నష్టమేమీ లేదు.

ఇక వారం రోజుల్నించి పరాయి వూళ్ళో పడిగాపులు కాస్తూ నిరాశతో నీరసించి పోయిన రైతులు ధర చెప్పగానే చప్పున కూలబడ్డారు. ధర విషయంలో రామనాథం తమని గట్టెక్కించేస్తాడని నమ్మారు.

అందరూ అతనికి మద్దతుగా నిలబడ్డారు. వ్యాపారులను కొందరు యువకులు అటకాయించ బోయారు. రామనాథం వాళ్ళకు వెనక్కు లాగాడు.

మధ్యాహ్నం భోజనాలయ్యాక నడిగడ్డ రైతులందరి ప్రత్తికి రేట్లు వేసారు రామనాథానికి, మల్లేశ్‌కు మంచి ధర పలికింది. రాజయ్యది అతనితో పాటు దస్తగిరి తెచ్చిన పదిమంది రైతుల పత్తి వంద రూపాయలు కూడా పలకలేదు.

అందరూ లబలబలాడుతూ రామనాథాన్ని చుట్టు ముట్టారు దస్తగిరి పరిస్థితి గమనించి చల్లగా జారు కున్నాడు. రామనాథం మళ్ళీ ఆ మిల్లు ఉద్యోగుల్ని నిలేసాడు.

"ఇదెక్కడి అన్యాయం?"

వాళ్ళు మహాధైర్యంగా జంకు గొంకూ లేకుండా అన్నారు-

"మీరే వచ్చి చూడండి. ఇది ఏం పత్తో? ఏ ముంగారి పత్తో పట్టుకొచ్చి వరలక్ష్మి రేటు వేయమంటే ఎట్లా వేస్తాం? ఏ పరిగ పత్తో!" రాజయ్య కేసన్న నిర్ఘాంత పోయారు.

రాజయ్య అమాంతం ఆ అన్నవాడి మీదకు పులిలా లంఘించాడు.

"నీ యమ్మ - ఎక్కువ తక్కువ వాగిన వంటేనీ పీక తెగ్గోస్తా నాకొడకా! అన్ని అన్ని బండ్లల్ల ఎరువు తెచ్చి పోసి పెంచితే ముంగారి పత్తాంటావ్? నీనోట్ల మన్నుబడ!" రాజయ్య అతని మీద పడి కలపడ్డాడు.

రామనాథం వాళ్ళిద్దర్నీ విడదీసాడు.

"వుండు రాజయ్య - నీ కేవన్నా పిచ్చెక్కిందా?"

రాజయ్య రెక్క బుచ్చుకు పక్కకు లాగాడు. మల్లేశ్ కేసన్న రాజయ్యను పక్కకు లాక్కెళ్ళారు.

"మన్నించండి - ఏదో ఆవేశంలో. . ."

అతని తరుపున రామనాథం క్షమాపణలు చెప్పాడు.

"ఏందయ్యా ఆవేశం? వచ్చి చూడండి ఎలాంటి పత్తో! పత్తి నాణ్యత తెలియకుండానే మేం వ్యాపారం చేస్తున్నామను కొంటున్నావా?" అతను కోపంతో వూగి పోయాడు.

రామనాథం రాజయ్య వాళ్ళ బూరేం నుంచి ప్రత్తి తీసి పరీక్షించాడు. అది నిక్కచ్చిగా ముంగారి ప్రత్తి గింజ కూడా సరిగ్గాలేదు చూస్తుంటే వరలక్ష్మి పరిగ ప్రత్తికన్న హీనంగా వుంది.

రాజయ్యతో సహా అందరూ మోసపోయారు. వాళ్ళు వేసిన ప్రత్తి హైబ్రీడ్ ప్రత్తి కాదు

"మీకు విత్తనాలు ఎవరిచ్చారు రాజయ్య-" రామనాదం అడిగాడు.

"గా లంజకొడ్కు - దస్తగిరి తెచ్చిచ్చిండు. వాన్ని బొందల పెట్ట నా కడపు కొట్టిండు -" రాజయ్య శోకాలు పెట్టాడు

"ఇత్తులు ఇచ్చిండు ఎరువులు బాకి పెట్టించిండు. బండ్లబండ్ల ఎరువు తెచ్చి పోస్తె. గింతెత్తెదిగె. పురుగు గిట్ల కండ్ల పడితే బాకిసాకి చేసి మందులు చల్తిమి. ఎక్రాకు మూడు క్వింటాళ్ళ పత్తెలెల్లలే - ముంగటి పంట గంతే నన్నడు - వాని నోట్ల పురుగులు పడ! ముంగారునుకోలే - నా కొంప కూలెరో-!" రాజయ్య ఏడుపులు తుడవుల మధ్య ఏకరు పెట్టాడు.

దస్తగిరి ఆ క్షణంలో అక్కడుంటే ఉద్రేకంలో ఊగిపోతున్న రైతులు అతన్ని భరతం పట్టేవారే "వాడు మా కంట్ల గిట్ల పడాలే " కేసన్న పళ్ళు పటపట కొరికాడు.

"నాణ్యత చూసి రేటు వేయమన్నారుగా? వేసాం - మరింక సరుకు దింపి - ఆఫీసు కొచ్చి డబ్బులు తీసుకోండి -" వ్యాపారులు గిరున వెనక్కి తిరిగాడు.

రాజయ్య అమాంతం వాళ్ళ కాళ్ళ మీద పడ్డాడు.

"మీ కాల్మొక్త మమ్మల ముంచొద్దు - పాడు పత్తి పంట - దాని మొగంల ఎంత ఎరువు తెచ్చి పోసిన - ఎన్ని మందులు చల్లిన నా పెండ్లాం పుస్తెల తోన అమ్ము కున్నా - నా బతుకు నాశనం చేయొద్దు - నీ కాల్మొక్త జర చూసిపో - నీ అలుబిడ్డలు నా ఆయుసు పోసుకుంటారు "

రాజయ్య వారి కాళ్ళు మీద పడి రోదిస్తున్నాడు.

రైతులందరూ కళ్ళ నీళ్ళు పెట్టారు.

రామనాధం గుండె కెలికి నట్లయింది.

వ్యాపారులు కూడా ఏంచేయలో తోచని నిస్సహాయ స్థితిలో రామనాధం వైపు చూసారు

రామనాధం నెమ్మదిగా వెళ్ళి రాజయ్యకు లేవదీసాడు. మల్లేశ్ మరో పక్క చేరి అతన్ని ఓదార్చారు. పైపంచనోట్లో కుక్కు కుంటూ గోడుగోడున ఏడ్చాడు రాజయ్య.

"పులిని జూసి నక్క వాత పెట్కున్న తీరున మిమ్మల జూసి - గా దస్తగిరి పాలబడ్తి - నేనేం చేతురో-"

రాజయ్య రామనాధాన్ని వాటేసు కుని ఏడ్చాడు.

"మన నసీబ్‌ల గిట్ల రాసుంది - ఏం జేస్తమే -"

ఓ రైతు కర్మ సిద్ధాంతం జ్ఞాపకం తెచ్చుకొని ఓదార్చాడు

"నసీబ్ గాదు గిసీబ్ గాదు - గొర్రెల తీరున గా దస్తగిరి మాటలకు బుర్రలూపుడే మా నెత్తి కొచ్చింది." కేసన్న అతన్ని కొట్టి పారేసాడు.

"అవ్ - గొర్రె కసాయోణ్ణి నమ్మతాదని ఊకే అంటారే-"

"గింత మందిమి వుంటిమి - పక్కవూర్ల ఏమయిందో ఒక్కల్లు పోయి సూడలే గా రామనాధం మనకేమన్నకొత్తోడా? గీ పత్తి తెచ్చినోడు అయిన. ఒక్క దినమన్నా పొయి - గిట్ల రావయ్యా వచ్చి పొలాల చూడువయ్యా అంట పిల్చుంటే వచ్చెటోడు గాదె -" నారాయణయ్య వాపోయాడు.

"ఇప్పుడు ఎన్ని అనుకోని ఏం లాభం?" మల్లేశ్ పెదవి విరిచాడు.

"పైపంటకు సింధనూరు నుంచి మంచి విత్తనాలు తెచ్చిపెట్ట మంటారా?

రామనాధం వారి నుద్దేశించి అన్నాడు

రామనాధం వాళ్ళ పొలాలన్నింటిని వెళ్ళి ఒక్కసారన్న చూసి వచ్చుంటే బావుండేదని బాధపడ్డాడు. తన పక్క వూరి రైతులు ఇంత ఘోరంగా మోసపోతారని అతను ఊహించలేక పోయాడు.

"మీ కాల్మొక్తం ఇంగ గా పత్తి మాట ఎత్తొద్దు. గీ పంట దుడ్లు కొంద బోయి ఏట్ల బోసినం మల్లమల్ల ఏట్ల మున్గం-" అందరూ అటూ ఇటూ అదే మాట చెప్పేసి ఇళ్ళముఖాలు పట్టారు.

రామనాధం వాళ్ళకు ప్రత్తిని ఎంతోకంతకు అమ్మగలిగామనన్న తృప్తి కూడా మిగుల్చుకో కుండా ఇళ్ళకు మళ్ళారు. నడిగడ్డ ప్రత్తి రైతుల్ని విషాదం ముంచెత్తింది.

❋ ❋ ❋

"ఓ రామన్నో - ఓ శివన్నో - జల్దీ రాన్రి - గా రాజయ్య మందు తాగిండు." ఎవరో ఒకతను అరుస్తూ పొలానికి అడ్డం పడి వచ్చాడు.

రామనాధం, శివుడు ఉన్న పళంగా పరుగులు తీసారు. వాళ్ళు వెళ్ళేసరికే రాజయ్య నురుగులు కక్కు తున్నాడు. ముఖం కమిలి పోయింది. మనిషి ఎగశ్వాస మీదున్నాడు.

రామనాధం ట్రాక్టరు తెమ్మని శివుణ్ణి పురమాయించాడు.

శివుడు ట్రాక్టరుకు ట్రక్ తగిలించుకొని ఉరుకులు పరుగుల మీద వచ్చాడు. ట్రక్‌లో గొంగడి పరిచి రాజయ్యను పడుకోబెట్టారు. రాజయ్య భార్య గుండెలు బాదు కొంటూ శోకాలు పెడుతోంది. బంధువులు ఊరి వాళ్ళు ట్రక్కు నిండా ఎక్కారు.

రాజయ్య గుడ్లు తేలేసాడు వళ్ళు స్వాధీనం తప్పినట్లు వేళ్ళాడి పోతోంది ఎండ్రిన్

గొంతులోంచి కడుపులోకి పోతూ పోతూ మిగిల్చిన మంటతో విలవిలలాడి పోతున్నాడు.

రామనాథంతో పక్కనే కూర్చుని పైపంచతో రాజయ్య నోట్లోంచి కారుతున్న నురుగు తుడుస్తూ అతని భార్యను ఓదార్చు తున్నాడు.

రాజయ్య పెదవులు కదులుతున్నట్లుగా అనిపించి రామనాథం చెవి అన్చాడు, "ఇత్తులు. .ఇత్. .త. .ఉ. .లు. . ."

రాజయ్య ప్రాణం గాలిలో కలిసిపోయింది.

రామనాథం చేతుల మీద ఓ జీవం నిర్జీవమై పోయింది.

రామనాథం చల్లగా చల్లారి పోయాడు. మెల్లిగా రాజయ్య తలను కిందకు దించాడు కను రెప్పలు మూసాడు.

రాజయ్య భార్య గొల్లుమంది. శివుడు ట్రాక్టర్ ఆపి వెనక్కి తిరిగి చూసాడు.

రామనాథం రాజయ్య ప్రాణం పోయిందని సైగ చేసాడు

ట్రాక్టర్ ఆపారు. అందరూ రాజయ్య మీద పడి ఏడ్చారు

"గా బాడ్కవ్ పెండ్లం పుస్తెలు తెగ - వాని ఇంట్ల పీనుగెల్ల వాన్ని బొందల పెట్ట-"

దస్తగిరిని తిడుతూ - తిట్లు మధ్య ఏడుస్తూ వున్నారు రామనాథం శివుడు వాళ్ళకు ట్రక్కులో ఊరికి పంపి వచ్చారు.

రామనాథం తల్లడిల్లి పోయాడు.

రాజయ్య మాటలే అతని చెవుల్లో ప్రతిధ్వనిస్తున్నాయి.

"విత్తులు - విత్తులు-!" రామనాథం అప్రయత్నంగా పైకే అన్నాడు.

'మాహా మంత్రికుల పంచ ప్రాణాలు ఏడేడు సముద్రాల అవతల దీవి మీది మంత్రాల మర్రి తొర్రలో పంచ వన్నెల రామ చిలుక కడుపులో దాచి వుంచినట్లుగా రైతుల పంచ ప్రాణాలు విత్తనాల్లో వుంటాయి.

వేసే విత్తనాల్ని బట్టి పంట వుంటుంది.

పంటను బట్టే రైతు వుంటాడు.

ఈ నడిగడ్డ మీద మరో రైతు విత్తనాల కారణంగా ప్రాణాలు తీసుకోవడానికి వీల్లేదు.

విత్తనాల వేటలో అటు పరిగెత్తి ఇటు పరిగెత్తి అలసి పోకూడదు.

ఇట్లాంటి నాసిరకం నకిలీ విత్తనాలు కానీ దస్తగిరి లాంటి దళారులు కాని నడిగడ్డ రైతును నాశనం చేయకూడదు.

కేసన్న లాంటి రైతులు రేగడిని వాముకో జొన్నలకో వేరుశనగలకో పరిమితం చేయాలన్న ఆలోచనను విరమింపజేయాలి. ప్రత్తిపంట పట్ల వున్న భయాల్ని పోగొట్టాలి.'

'అందుకు నేనే ఎందుకు పూనుకో కూడదు? ప్రత్తికి ప్రాణమైన విత్తనాల్ని నేనే వాళ్ళకి

అందిస్తాను. నడిగడ్డ రేగడిలోని ప్రత్తి విత్తనాలు నడిగడ్డ లోంచి తెల్లబంగారం తవ్వితీయాలి తుంగభద్ర ఎగువనున్న గ్రామాల్లాగే ఈ ప్రాంతాన్ని ప్రత్తి పండించే ప్రాంతాన్ని చేయాలి''' రామనాథం మరో మొండి నిర్ణయం తీసుకొన్నాడు.

నిర్ణయం తీసుకున్న మర్నాడే సింధనూరు వెళ్ళాడు తనకు ఎప్పుడూ సంకర జాతి విత్తనాలు ఇచ్చే పెద్దరైతుతో చర్చించాడు. హైదరాబాద్ వ్యవసాయ విశ్వవిద్యాలయంలోని శాస్త్రజ్ఞులను కలసుకొన్నాడు. ఆంధ్రప్రదేశ్ సీడ్ సర్టిఫికేషన్ ఏజన్సీ వారి ప్రత్యేక అనుమతి కోరాడు. వాళ్ళు కొత్త ప్రాంతాల్లో ప్రయోగాలు చేయడానికి ఉత్సాహవంతులైన రైతుల కోసం చూస్తున్నారు. రామనాథం రాక ఉభయ లాభదాయకం అయ్యింది ప్రయోగ దశ కింద మూడు ఎకరాల పర్మిట్ సంపాదించి మూడు ఎకరాలకు సరిపడా ఫౌండేషన్ సీడ్ తీసుకొని ఇంటికి తిరిగి వచ్చాడు రామనాథం.

ఆ క్షణం నడిగడ్డ మీద విత్తనాలు ఉత్పత్తి చేసే బృహత్ కార్యానికి విత్తు నాటింది

రామనాథం తిరిగి వచ్చే సరికి దుక్కులు చివరి దశలో వున్నాయి ఆరుదడి చేలో ప్రత్తిని సుధాకర్ చేత ఆదోని మిల్లుకు పంపించాడు. అక్కడ ప్రొద్దుటూరు ప్రత్తి వ్యాపారులు వరలక్ష్మిని ఆనందంగా ఆహ్వానించారు. నడిగడ్డ నాణ్యమైన ప్రత్తి మీద వారి దృష్టి పడింది. చూస్తుండగానే దశలు మార్చేసే ప్రత్తి పంట తెలుగుదేశం నలుచెరుగుల్నించి రైతుల్ని ఆకర్షించింది. ఎక్కడెక్కడి వారు తుంగభద్ర తీరానికి తండో పతండాలుగా తరలివచ్చారు ఒక్క రాంనగర్ లోనే పాతిక క్రొత్త కుటుంబాలు వచ్చి చేరాయి. రాంనగర్‌లో చూస్తుండ గానే వంద గడపలు పూర్తయింది.

నడిగడ్డ పొలాల రేట్లు అమాంతం పెరిగి పోయాయి. కొత్త వారితో పాటే దస్తగిరి మళ్ళీ ఆ వూళ్ళల్లో కాలు మోపాడు.

నడిగడ్డ రైతుల అమాయకత్వం వల్లో దస్తగిరి చాకచక్యం వల్లో అతని ప్రాధాన్యత ముందెన్నడు లేనంతగా పెరిగింది. కొత్తగా వస్తున్న వారికి పొలాలు బేరం చేసి పెట్టడం దగ్గర్నుంచి అక్కడ ఇమడడం వరకు సాయం చేస్తూ వారికి ఆప్తుడయ్యాడు.

ఇటు నడిగడ్డ రైతులు సేద్యానికి వంగని భూములను మంచి ధరలో అమ్ముకునేసి ఊపిరి పీల్చుకుంటున్నారు. కొందరు వున్న పొలాన్ని వచ్చిన వారికి మగతాకిచ్చేసి - ఆ పొలాల్లోనే పనిచేస్తున్నారు. వీరు మగతా డబ్బుతో పాటు సేద్యం చేస్తున్నందుకు డబ్బు గడిస్తున్నారు ఈ లావాదేవీలన్నిటికి మధ్యవర్తిగా దస్తగిరి నడిగడ్డ వారికి ప్రీతి ప్రాతుడైపోయాడు.

ప్రత్తి పండించడం మన వల్ల కాదు.

అది వారికి తెలిసిన విద్య, అందిన కాటికి చాలు అంటూ వారు రాజీ పడిపోయారు.

కొత్తగా వచ్చిన వారు అప్పుచేసో సొప్పుచేసో పెట్టుబడికి డబ్బుతో సహా సిద్ధంగా వస్తున్నారు. వచ్చిన ఏడే తమ అదృష్టం అటో ఇటో తేల్చుకోవాలన్న ఆశతో డబ్బుకి వెనకాడ కుండా పొలంలో ఎరువులు మందులు గుమ్మరించేస్తున్నారు.

ఇది మగతాకి పొలాలిస్తున్న వారికి అందిన మరో సౌకర్యం

ప్రత్తి పంట అయ్యాక సొంత దార్లు పొలం చేసుకోవడం మొదలెట్టగానే జొన్నలైనా వేరుశనగలైన ఇంకేదైనా విపరీతంగా దిగుబడి సాధిస్తుంది దీనికి కారణం ప్రత్తి చేలల్లో వేసిన ఎరువులని వాళ్ళు సులభంగానే గ్రహించారు దాంతో మగతాకి మగతా - పొలంలో సారానికి సారం లభిస్తుందని మరింత ఉత్సాహంగా పొలాలను మగతాలకు ఇస్తున్నారు

రామనాథం వాళ్ళు కూడా ఆ ఏడాది మగతాల కింద కొంత తీసుకొన్నారు. రత్తయ్య అల్లుళ్ళిద్దరికి గత సంవత్సరం పండిన పంటతో ఎక్కడలేని ధైర్యం వచ్చేసింది వాళ్ళు కొంతపొలం మగతాకి తీసుకొన్నారు

శివుడు, సుధాకర్ ఒకళ్ళు మార్చి ఒకరు ట్రాక్టర్‌తో దుక్కులు చేసారు కొన్ని చోట్ల అలస్యం తట్టు కోవడానికి సవారి, రత్తయ్య నాగళ్ళతో దుక్కి చేసారు.

రామనాథం రాగానే నాట్ల ప్రణాళిక వేసుకోవడం కోసం వాళ్ళు ఎదురు చూస్తున్నారు

సుధాకర్ సింధనూరు వెళ్ళి అన్ని పొలాలకి సరిపడా విత్తనాలు తెస్తారని అందుకు భిన్నంగా రామనాథం ఓ కొత్త ప్రతి పాదనతో వచ్చాడు. అందరూ ఫలితాలు అనుభవించే ఉత్సాహంలో ఉండగా రామనాథం ఓ ప్రయోగం చేయడానికి పూనుకొని వచ్చాడు.

రామనాథం ఇంటికి వచ్చే సరికి అప్పుడే రత్తయ్య పొలం నుంచి ఇంటికి వచ్చాడు. ఎద్దులకి దాణా పెడుతున్నాడు

"అదేంట్రా శివుడూ - అన్నయ్యను పొలానికి ఎందుకు వెళ్ళ నిచ్చా? పార్థీనియం అలెర్జీ అని తెలియదూ ?" రామనాథం శివుణ్ణి కేకలేసాడు.

"నా మాట వింటాడూ ? తిట్టే నోరు తిరిగే కాలు ఊరుకోదని అంతగా అయితే మందు రాసుకుంటాను లెమ్మని బయల్దేరాడు. కల్యాణి ఏదో కొత్త ఆయింట్‌మెంట్ పంపించిందంట -"

"అది కూడా నిజమేరా శివుడూ - పొద్దు గూకులూ పొలంలో వళ్ళు విరుచుకొనేవాడు పొద్దస్తమానం ఇంట్లో ఏమని వుంటాడు ?"

"నువ్వే అలాగంటే ఇంక నాన్నని నేనలా అడ్డు పడగలను బాబాయ్-" శివుడు నవ్వాడు.

"నాకో ఆలోచన వచ్చిందిరా - అన్నయ్యాను మరో పనిలోకి పెట్టాలి - జెర్సీ ఆవులు కొంటే ఎట్లా వుంటుందంటావ్ ?"

"ఆటిని చూసుకోడం కష్టమంటారుగా బాబాయ్-"

"కష్టమను కొంటే అన్నీ కష్టమేరా - ఈ సారి పంట డబ్బుతో అన్నయ్యకు మంచి ఆవులు కొందాం - అలాగే రెండు గేదెలు కూడా -"

"ఎప్పుడొచ్చారు నాన్నా -" సుధాకర్ ముక్త సరిగా పలకరించి వాళ్ళ ఎదురుగా కూర్చున్నాడు

రామనాథం అతనితో కాసేపు నంద్యాల మిల్లు గురించి వివరాలు అడిగాడు

మాట్లాడుతున్నా సుధాకర్ అంటీ ముట్టని తత్వం రామనాథం శివుడూ ఇద్దరూ గ్రహించాడు సుధాకర్ మాటల్లో ఆర్ద్రత లేదు లోతులేదు అప్ప చెప్పిన పనిని పూర్తిచేసి చేతులు దులుపు కొనే ఉద్యోగి ధోరణి ఉందే కానీ, తన పని తాను చేసుకుంటున్నాన్న స్పృహ కనిపించడం లేదు

రామనాథం, శివుడు ముఖాముఖాలు చూసుకున్నారు

"అవును బాబాయ్, ఆ విత్తనాలేంటి తీసుకురాగానే అంత భద్రంగా దాచావ్ ?"

"అది ఫౌండేషన్ సీడ్‌రా - పేరంటల్ సీడ్ అనీ కూడా అంటుంటారు "

"అంటే ?"

"నేను తెచ్చిన విత్తనాల్లో రెండు రకాలున్నాయి ఒక రకం ఫిమేల్ - అంటే తల్లి విత్తనాలను కుందాం. రెండో రకం మేల్ తండ్రి విత్తనాలు -"

"విత్తనాల్లో తల్లీ తండ్రీ ఏమిటి ?" శివుడు తెలియకే అడిగాడు

సుధాకర్ కూడా కుతూహలంగా చూసాడు రామనాథానికి ఆశించిన స్పందన దొరికింది. ఉత్సాహంగా చెప్పాడు.

"ఆ తల్లికి ఈ తండ్రికీ పుట్టే పిల్లలే మనం వాడే వరలక్ష్మి విత్తనాలు !"

శివుడు పూర్తి అయోమయంలో పడి పోయాడు.

సుధాకర్ కు కూడా అర్థం కాలేదు

"ఫిమేల్ ప్రత్తి మొగ్గలను మేల్ ప్రత్తి పుప్పొడితో సంకర పరచడమే క్రాసింగ్ అంటారు. క్రాసింగ్ చేసిన తరువాత వచ్చిన ప్రత్తిలోని విత్తనాలు - అటు ఫిమేల్‌లోని గుణాలు కొన్ని మేల్ లోని గుణాలు కొన్ని - కలబోసుకొని - రెండింటి శక్తిని నిగూఢ పరుచుకొని - సంకర జాతి విత్తనాలు అవుతాయి. ఇంగ్లీష్‌లో హైబ్రీడ్ సీడ్స్ అంటారు అవునూ సుధాకర్, హైబ్రిడై జేషన్ గురించి నువ్వు చదవలేదూ -"

"బోటనీ లో చదివాను - కానీ దీన్ని పొలాల్లో ఎలా చేస్తారు ? ఒక్క పత్తి మొక్క లెక్కలేనన్ని మొగ్గలు వేస్తుంది అన్నింటిని క్రాస్ చేస్తూ కూర్చుంటారా ? గొంగట్లో వెంట్రుకలు పీక్కున్నట్లుంది వ్యవహారం-" సుధాకర్ తేలిగ్గా కొట్టి పారేసాడు

"ప్రయోగం చేయాలిరా -"

"చేసిన ప్రయోగాలు మహా గొప్పగా తగలడ్డాయ్ - మళ్ళీ కొత్తవి చేయాలి కాబోలు ' సుధాకర్ కసురు కొన్నట్లుగా అన్నాడు. రామనాథం శివుడు బిత్తర పోయారు

సుధాకర్ కి అనూరాధ పెళ్ళి నిర్ణయం అప్పటి నుంచే తండ్రి మీద తిరస్కార భావం మొదలయ్యింది.

అనూరాధను కోల్పోవడం వల్ల ప్రేమను పొందలేక పోయాడు. మల్లేశ్ ఆమెను పొందడం వల్ల స్నేహాన్ని కోల్పోయాడు. గీతను పెళ్ళి చేసుకోవడం అతని మనసులో శూన్యతను తగ్గించక పోగా ఆమె ప్రవర్తన ఆ శూన్యాన్ని మరింత పెంచింది. సుధాకర్ సున్నిత తత్వానికి ఆమె అహంకారానికి ఎంత ప్రయత్నించినా పొంతన కుదుర్చుకో లేక పోయాడు అది రాను రాను రామనాథం పట్ల అయిష్టాన్ని పెంచుతోంది. తిరస్కార ధోరణి అతని సభ్యతా సంస్కారలను చిటికిన వేలితో తన్ని పారేస్తోంది.

"అదేవిట్రా, సైన్స్ స్టూడెంట్‌వి ప్రయోగం చేయడానికి నిరుత్సాహ పరుస్తావే ? ప్రయోగం చేస్తేనే ఫలితం వస్తుంది. ఆ ఫలితం ప్రగతికి సోపానం అవుతుంది చెట్లుమ్మట తిరిగిన రెండు కాళ్ళ జంతువుని చంద్ర మండలం దాకా నడిపించింది ఒక్కో ప్రయోగ ఫలితమే కదరా ?"

సుధాకర్ ముఖం చిట్లించాడు.

"అనసరంగా వేటి కేటికో లంకెలు పెట్టకండి ! ఏంటి మీరు చేసిన ప్రయోగాలు సాధించిన ఫలితాలు ? ఎక్కడ వేసిన గొంగడి అక్కడే వున్నట్లు వుంది ఇంట్లో పరిస్థితి. మనవూరు వదిలి వచ్చిన తరువాత ఇక్కడ బావుకుందేవిటో చెప్పండి. తుమ్మల్లో తుప్పల్లో పలకరించే మనిషి లేకుండా అడివి మనుషుల్లా బతికి నందుకు ఫలితం ఏం మిగిలింది ? వచ్చిన్నాడు కొన్న చేను తప్పించి మళ్ళీ ఒక్క ఎకరం చేను కొన్నారా ? ఒక్క ఏడు పంట నాశనమయితే తట్టుకోగలిగామా ? బుల్లెట్‌ను కూడా అమ్ముకుంటిమే ! ఆడవాళ్ళ నగలు, పొలాలు అన్ని తాకట్టు పెడితిమే ! ఆ అనూరాధ మహా ఉదారంగా నగలు తీసిచ్చిందిగా ఈ యేడు కూడా నగలు తిరిగి ఇవ్వగలమో లేదో - మరి ఆమె ఊరుకుంటుందా ? ఆమె భర్త ఊరుకొంటాడా ? అత్తగారు వూరుకొంటారా ? ఛ - మొన్న సరళక్కాళ్ళాయన నాముందే సరళక్కను పుచ్చుకొని ఎంత మాటన్నాడో తెలుసా - "మీ కన్నారింటికి వెళ్ళేప్పుడు నగలవీ పెట్టుకొని వెళ్ళమాక, మళ్ళీ మీ బాబాయి ఓ అర్నెల్లు అరువుస్తావా అమ్మాయ్ అప్పు తెచ్చుకొంటాను అంటాడు - " అని అన్నాడు. నాకయితే అక్కడికక్కడే చచ్చిపోవాలని పించింది ? ఛీ - ఇంత బతుకు బతికీ ఆడపిల్లల ముందు చేయిచాచి నట్లయింది. ఎప్పుడూ ఆడపిల్లల చేయి పుట్టింటారి చేయికన్నా కింద వుండాలని అంటారు. మన విషయంలో తిరగబడింది - "

సుధాకర్ ఏకబిగిన ఆవేశంగా అన్నాడు

సుధాకర్ చెప్పినవి వాస్తవమే. కాదనలేక మౌనం వహించారు శివుడు రామనాథం.

"కానీ, ప్రసాద్ అంత మాటన్నాడా ? " రామనాథం ఆలోచనలో పడ్డాడు.

"అంటాడు ఎందుకు అనడూ ? పాలుపోసి పెంచుతుంటిమి. పొలాల దగ్గర్నించి

అంతా మన సామ్మేగా ! కష్టంలో వున్నపుడు సాయం చేస్తే ఏం పుట్టిమునుగుద్దంటా ? అసలు ఈనాడు అల్లుళ్ళు కాస్త పచ్చగా వున్నారంటే మన పుణ్యాన - '' శివుడు చిన్న బావ మీద కోపంతా వెళ్ళగక్కాడు

''ఏమైనా దీపమున్నపుడే ఇల్లు చక్క బెట్టుకోమన్నారు. మొన్న ఆదోనిలో అందరూ ఈ ఏడు కూడా ప్రత్తి మంచిధర పలుకుతుందని అనుకుంటున్నారు ఇలాంటిప్పుడు కాస్త నిలదొక్కుకోకుండా మళ్ళీ ఇంకో ప్రయోగం ! ఏ మెడకాయ మీద తలకాయ వున్నవాడు చేయడు !''

సుధాకర్ చివరి మాటలు వెక్కిరింతగా అని విసురుగా లేచెళ్ళాడు. రామనాధం ఉత్సాహం ఎప్పుడో చప్పగా చల్లారిపోయింది శివుడి వైపు ఏమంటావన్నట్లు చూసాడు

''బాబాయ్ - వాడన్నదీ నిజమే ఈ యేడు మగతాకి కూడా తీసుకొని సాగు చేయాలనుకుంటున్నాం బావలిద్దరూ మనకన్న ముందే పాలం కౌలుకు తీసుకొని సిద్ధంగా వున్నారు వాళ్ళకీ మనమే పెట్టుబడి పెట్టాలి ఎకరానికి ఎకరా పెరుగుతున్న కొద్దీ ఖర్చు పెరుగుతుందిగా బాబాయ్ - '' శివుడు ఒక్క క్షణం ఆగి అన్నాడు - ''నష్టాల్లో మునగనీ - భరిద్దాం ఏమైనా కానీ, నువ్వు వేసే అడుగు ముందుకే ఉండాలి బాబాయ్ - నీవు వెనకడుగు వేస్తే నేను సహించలేను ! ''

రామనాధం సంతోషంగా శివుడిని కావలించుకున్నాడు.

''శివుడు , నీ ప్రోత్సాహం లేకపోతే నేను లేనురా - ''

రామనాధం, శివుడు ఉత్సాహంగా కొత్త ప్రత్తి చేను ఎక్కడ వేయాలో చర్చించుకొన్నారు

అనూరాధకు ఇచ్చిన వాగొడ్డు పాలానికి ఆనుకున్న మూడు ఎకరాలు వేద్దామని నిర్ణయించుకున్నారు.

ఆ పూట భోజనాల దగ్గర సుధాకర్ ముందు తమ నిర్ణయాన్ని ప్రకటించేసారు.

తరువాతి రెండురోజులు రామనాధం బ్యాంక్ పనుల మీద కర్నూలు వెళ్ళాడు శివుడు ఆరుదడి చేలో విత్తనాలు నాటిస్తున్నాడు.

మూడో రోజున రామనాధం, శివుడు ఫౌండేషన్ సీడ్‌ను తీసుకొని పాలానికి వెళ్ళారు.

పాలంలో చక్కగా చాళ్ళు దున్ని వున్నాయి తడిపెట్టి వుంది.

రామనాధానికి ఏదో అనుమానం వచ్చింది.

ఇంతలో అక్కడ బోదెలు మళ్ళిస్తున్న కురుప పరుగు పరుగున వచ్చాడు

''ఏంటి కురుపా ? పనులెలా సాగుతున్నాయ్ ?''

''ఏముందయ్యా - ఇత్తులు నాటి ఈ పొద్దుకు మూడోదినం రెండు దినాలు చూస్కోని పడిత్తులు నాటేద్దుంది.''

రామనాధం - శివుడు నోటమాట రాక, శివుడు మెల్లిగా అడిగాడు ''విత్తనాలు ఎవరు నాటించారు ?''

"చిన్న బాబు - "

"సుధాకర్ చెప్పా పెట్టకుండా ఇలా చేసాడేంటి ? "

శివుడు పైకే అనేసాడు - కొడుకు పనితో రామనాథం కుంగిపోయాడు మౌనంగా దూరంగా నడుచుకొంటూ వెళ్ళాడు.

శివుడు రామనాథాన్ని అనుసరించాడు.

వాగొడ్డు పొలంలో దుక్కులు చేయిస్తున్న మల్లేశ్ వాళ్ళిద్దర్నీ గమనించాడు. గబగబ వారి దగ్గరికి వచ్చాడు.

"నేనే మీ దగ్గరికి వద్దామనుకుంటున్నాను - రండ్రండి -" తన పొలంలోకి ఆహ్వానించాడు

మల్లేశ్‌ను చూడగానే రామనాథం, శివుడు ఇద్దరు తేరుకున్నారు.

"ఏంటి చిన్నాయన సీరియస్‌గా వున్నారు ? ఏదైనా ప్రాబ్లెమా ?" శివుణ్ణి చనువుగా అడిగాడు మల్లేశ్

"ఆ ఏం లేదబ్బాయ్ - నేనో ప్రయోగం చేయాలనుకుంటున్నాను నా కొడుకులు నేను చేసినవి చాలు పొమ్మంటున్నారు -" రామనాథం సమస్యని తేలిగ్గా ప్రస్తావించాడు

"భలే వాళ్ళండి. కొత్త ప్రయోగాలు చేస్తుంటూనే కదండీ - జీవితంలో మార్పు వుండేది. లేకపోతే అంతా మోనోటోనస్‌గా అయిపోదూ - ?"

రామనాథానికి ఆశ్చర్యం కలిగించే విధంగా మల్లేశ్ మాటల్లో అనూరాధ కంఠం వినిపించింది. ఆ మాట తీరూ - ఆ స్పందించే తీరూ అంతా అనూరాధే. ఆరునెలల్లో వారు వీరవుతారంటారు. నిజమేనేమో - రామనాథం మల్లేశ్ ముఖంలోకి పరిశీలనగా చూసాడు.

తేటగా నిర్మలంగా వున్న అతని ముఖం రామనాథానికి ఏదో తెలియని ధైర్యాన్ని ఇచ్చింది

"ఇంతకీ మీ ప్రయోగానికి ఏం కావాలి ? "

"భూమి ! "

"ఇదుగోండి - మీరు బీడు నుంచి మాగాణం చేసిన భూమి. మీకు నచ్చిన ప్రయోగాలు చేసుకోండి ! "

రామనాథం విస్మయంతో శివుడి వంక మల్లేశ్ వంక మార్చి మార్చి చూసాడు.

"మీ మీద మా నాన్నకు ఎంత నమ్మకముందో, నాకూ అంతే నమ్మకముంది మీరంటే అనూరాధకు ఎంత అభిమానమో నాకూ అంతే అభిమానం - ఈ భూమి మీది, మీ అనూరాధది. మీరే ప్రయోగం చేసుకోవడానికైనా అనూరాధ ఆనందంగా ఇవ్వరా ? నేనూ అలాగే ఇస్తున్నాననుకోండి - " మల్లేశ్ రామనాథం పట్ల తన విశ్వాసాన్ని ప్రకటించేసాడు.

అతని అభిమానానికి రామనాథానికి కళ్ళు చెమ్మగిల్లాయి ఆలోచించి చెప్తాను లెమ్మని ఇంటికి వచ్చేసాడు.

మల్లేశ్ అతని కుటుంబం ప్రత్తి పంటతో బాగుపడ్డారు.

అనూరాధ అతను కోరి వరించిన భార్య, బాదరబందీలు భాద్యతలు లేవు. ఉద్యోగం కూడా అనుకోకుండా వున్న వూళ్ళో తల్లిదండ్రుల దగ్గర వుంటున్నాడు.

"అంతగా ఆలోచించడం దేనికి బాబాయ్ ? చేయలనుకున్న పని చేసి తీరాల్సిందే మన పొలాలన్నీ నాట్లు అయిపోయాయి ఎక్కడైనా మగతాకి తీసుకోవాలి. అదేదో అనూరాధ చేనే తీసుకుందాం తెలిసినట్టుగా కూడా వుంటుంది నాలుగడుగులు వేస్తే పొలం "

మర్నాడు మల్లేశ్‌తో చెప్పి మూడు ఎకరాలు మగతాకి ఒప్పించారు

మల్లేశ్ కూడా విత్తే దగ్గర్నుంచి అన్ని పనులు శ్రద్ధగా పాలుపంచుకుంటున్నాడు.

రామనాథం, శివుడు పొలంలోకి దిగి స్వయంగా విత్తనాలు నాటారు

మేల్ విత్తనాలను ఒక మడిలో ఏద పెట్టేసారు

ఫిమేల్ విత్తనాలను మిగిలిన పొలమంతా నాటారు.

అనూరాధ పెళ్ళిలో ఆడవాళ్ళు పాడినట్లుగా -విత్తనం వేసిన మూడు రోజులకు ములుకాయ ముల్లోలె మొలక ఏర్పడింది ఐదు రోజులకు అల్లీయ పువ్వోలె ఆకు ఏర్పడింది

ఫిమేల్ ప్రత్తి చక్కగా చాళ్ళు పట్టింది.

మేల్ ప్రత్తి మడి నిండా నల్లరేగడి చిగురాకు పచ్చను పులుముకుంది.

రామనాథం శివుడు పొలమంతా తిరిగి తృప్తిగా చూసుకొన్నారు. మల్లేశ్ కూడా వచ్చివారితో పాటు పొలమంతా తిరిగాడు. మల్లేశ్ నెమ్మదిగా శివుడితో చెప్పాడు

"అనూరాధకు వంట్లో బావుండడం లేదు. మిమ్మల్ని చూడాలని గొడవ చేస్తోంది - "

శివుడు అటునుంచి అటే మల్లేశ్‌తో బాటు వెళ్ళాడు.

అనూరాధ మంచంలో కరుచుకుపోయి ప్రాణాలు కళ్ళల్లో పెట్టుకున్నట్లుగా వుంది. శివుడు అదే వేగంతో ఇంటి కొచ్చి ట్రాక్టర్‌కు ట్రక్కు తగిలించుకొని, సావిత్రిని ఎక్కించుకొని అనూరాధ వాళ్ళింటికి వచ్చాడు. సావిత్రి నారాయణమ్మతో అనూరాధను నాల్రోజులు తీసుకెళ్తామని చెప్పి - ఇంటికి తీసుకొచ్చింది.

"ఇంతకీ అనూరాధకి ఏంటీ జబ్బు ? " రామనాథం సావిత్రిని వచ్చీరాగానే ఆత్రంగా అడిగాడు.

"ఆడాళ్ళందరికీ వచ్చే జబ్బే - వేవిళ్ళు ! " సావిత్రి ముసిముసి నవ్వులు నవ్వింది.

❋ ❋ ❋

అణువణువుగా అమ్మను కావాలి అని గాఢంగా భావించినపుడే అనూరాధ తల్లి అయ్యే విషయం గురించి ఆలోచించింది.

నారాయణమ్మ ఎన్ని మొక్కులు మొక్కినా - ఎన్ని పూజలు చేసినా - కోడలిని ఎన్ని శాపనార్థాలు పెట్టినా - కొడుకు మీద ఎంత జాలి కురిపించినా - ఆ భార్యా భర్తలు ఇక తల్లిదండ్రులు అవుదామని మనసారా వాంఛించినప్పుడే ఆ కుటుంబంలోకి బుజ్జి పాపాయిని ఆహ్వానించే నిర్ణయం తీసుకొన్నారు.

ఆ నిర్ణయం అమలు పరిచాక అనూరాధ సంక్షోభంలో పడి పోయింది

తల్లి కాబోతోన్న ఆనందం కన్నా నారాయణమ్మ ప్రవర్తనను సహించ లేని దౌర్బల్యం ఆమెను మానసిక వత్తిడికి గురిచేస్తోంది రోహిణి ఎండలకు కాగి కాగి వున్న నేల మీద పడిన నీటి చుక్కల్లాగా ఆమె ఆనందం ఆవిరి అయిపోతోంది

అందుకు భిన్నంగా పడుతోన్న ప్రతి వాన చుక్కను ఆత్రంగా తాగే కాగిన నేల లాగా నారాయణమ్మ క్షణక్షణం అమితానందాన్ని పొందుతోంది

ఇంక తన కొడుకు పున్నామ నరకం నుంచి బయట పడేసే నలుసు నేల మీద పడబోతోందన్న వార్త ఆమె చెవిలో పడగానే ఆనందంతో మతి పోయినట్లయింది

కోడలిని అపురూపంగా చూస్తూ తన శాయశక్తులా సేవ చేయలన్న తాపత్రయంలో పడింది.

సరిగ్గా అదే అంశం అనూరాధను చికాకులో పడేసింది ఏ నోరయితే తనను నానా తిట్లు తిట్టిందో - తన కొడుక్కు పట్టిన శని అని శాపనార్థలు పెట్టిందో - ఆ నోరు అంతులేని ఆప్యాయతను కురిపిస్తుంటే - ఆ ఆకస్మిక మార్పు అనూరాధను కఠిన పాషాణాన్ని చేసింది

నారాయణమ్మ గొప్ప ఉత్సాహంతో చక్ర పొంగలి చేసిపెడితే అనూరాధకు బొడ్డుతాడు మింగించాలని ఆవిడ చేసిన ప్రయత్నం గుర్తొచ్చి వాంతి వస్తోంది.

చక్కగా భక్ష్యాలు చేసి మంచి నెయ్యిరాసి పాలు పోసి ఇస్తే శివరాత్రి నాటి శివాలయం ఇరుకు గర్భగుడిలో అనుభవం కళ్ళ ముందు కాస్తోంది.

జొన్న రొట్టెలు చేసి, చింతకాయతొక్కు, వెన్న ముద్ద వేసుకొస్తే అలంపురం ఎల్లమ్మ ముందు జరిగిన అవమానం కడుపులో తెమిలించేస్తుంది

అనూరాధ ప్రమేయం లేకుండానే నారాయణమ్మ సేవలన్నింటి నిర్ద్వందంగా తిరస్కరించేసింది

" నా మనమనికి నా కోడాలు తీరున పొడుగు, నా కొడుకు తీరున రంగు వస్తదిలేయే " అంటూ నారాయణమ్మ అమ్మలక్కల దగ్గర ఆనందంగా చెపుతోంటే -

"గా దిక్కు కోడలని బుద్ధిగడ్డి తిని తెచ్చుకుంటిమి. గీ నసీబ్ వేరోల్లకు వద్దు - దండం పెద్ద - గా దిక్కు కోడలు తెచ్చుకోని కోరి కొంప గుండం చేస్తిమే - ఒడ్డూ పొడుగూ చూసి మరల మందు పెట్టి నా కొడుకు ను బుట్టల పెట్టె - వాన్ని శని తీరున పట్టె" నారాయణమ్మ గాల్లోకి దండాలు పెడుతూ వచ్చేపోయే వాళ్ళ దగ్గర వాపోయిన సంగతులు మనసులో మెదులుతున్నాయి

రోజురోజుకి వేవిళ్ళ ప్రభావం అనూరాధ మీద పెరుగుతోంది అన్నం వుడుకుతోన్న వాసనను కూడా సహించలేనట్లుగా వుంది పరిస్థితి నోట్లో పోసుకున్న నీళ్ళతో సహా వాంతి చేసేసుకుంటోంది అనూరాధ తన చేసుకు తిన గలిగితే తింటోంది లేకపోతే పస్తుంటోంది మనిషి నీరసంతో మంచంలోని ఆకారమై పోయింది

శివుడు, సావిత్రి ఆమెను రాంనగర్ తీసుకొచ్చారు అనూరాధకు ఒక్కసారిగా గాలి పోసుకున్నట్లయింది.

నోట్లోంచి మాట రానంత నీరసంలో వున్న అనూరాధ మెల్లి మెల్లిగా కోలుకుంది

చూస్తుండగానే కొంచెం వళ్ళు చేసి, నునుపెక్కింది

ఇంట్లో వాళ్ళ ఆప్యాయం, గర్భవతి పట్ల చూపించే ప్రత్యేక శ్రద్ధ ఆమెకు ఔషధాల్లా పనిచేసాయి.

మల్లేశ్ అడపదడపా వచ్చి పోతున్నాడు

బాలయ్య కూడా రామనాథాన్ని కలవడానికి వస్తూ కోడలిని చూసి పలకరించి వెళ్తున్నాడు పెళ్ళయ్యాక ఇంత కాలం ఇక్కడ వుండడం ఇదే

నారాయణమ్మ ఎత్తి పొడుపులు ఏమి చేతకాని దాని నన్న న్యూనతలో అనూరాధను వుంచాయి ఆ చేతకానివన్న పనులు ఆమెకిక్కడ ఆదరణ నిస్తున్నాయి

భక్ష్యాలు చేయమనీ, పేణీలు చేయమని అడిగి అడిగి చేయించుకుంటున్నారు కూరలు, వంటలు అన్నీ కొత్త రుచులు - సావిత్రి శాంతమ్మ అడిగడిగి స్వయంగా ప్రయోగాలు చేస్తున్నారు.

అనూరాధ రాక సుధాకర్‌ని సంక్షోభంలో పడేసింది

ఓ అర్థంకాని విషయంలా తప్పించుకు తప్పించుకు తిరుగుతున్నాడు. సుధాకర్ కూతురికి చివరి పోలియో డోస్ వేయించడానికి కర్నూలు వెళ్ళిన గీత మళ్ళీ వెనక్కిరాలేదు సుధాకర్ రోజు రాత్రి బస్సుకు కర్నూలెళ్ళి ఫస్ట్‌బస్సుకు ఇంటికి వస్తున్నాడు

ఆ ఏడు ప్రత్తి పొలాలన్ని బాగా వున్నాయి.

రామనాథం వాగొడ్డు పొలంలో ప్రయోగాత్మకంగా నాటిన ప్రత్తి చేను బాగా ఎత్తు ఎదిగింది రెమ్మ రెమ్మలో మొగ్గలు తొడుగుతోంది. పచ్చని పత్రదళాల మధ్యన పసుపు పచ్చని మొగ్గలు రామనాథం ప్రయోగానికి సిద్ధంగా వున్నాయి.

పువ్వుల్లో పరాగ సంపర్కం అనేది చాలా ప్రాకృతికంగా, సహజంగా జరిగిపోతుంది గాలి, తుమ్మెదలు, సీతాకోకచిలుకలు - కేసరాల్లోని పుప్పొడిని అండవాహిక మీద అద్దుతాయి పువ్వు కాయగా మారడంలో జరిగే ఈ ముఖ్యమైన పరిణామం ఎవరి ప్రమేయం లేకుండానే ఎవరి దృష్టిలో పడకుండానే జరిగిపోతూ వుంటుంది

ఇప్పుడు ప్రకృతికి విరుద్ధంగా పువ్వును కాయగా మార్చే క్రమంలోని ప్రధాన కార్యమైన పరాగ సంపర్కాన్ని మనిషి తన చేత్తో చేయడానికి పూనుకున్నాడు.

సుధాకర్ అన్నట్లు, ఇది ప్రయోగశాలలో ఒక శాస్త్రజ్ఞుడు టెస్ట్‌ట్యూబ్‌ల మధ్య కుండీలలో పెంచిన మొక్కలతో చేసి సాధించవచ్చు దానిని బయట పొలం మీద సాధించే పనిని రామనాథం చేపట్టాడు

మొగ్గల్ని క్రాస్ చేయడంలో ప్రధాన సమస్య ఆ పని చేయడానికి సరిపోయేంత మంది మనుషులు

మేల్ ప్రత్తి వేసినంత మేరా పోగా- మిగిలిన పొలమంతా ఫిమేల్ ప్రత్తి వుంది దీంట్లో కొన్ని వందల చాళ్ళు - చాళ్ళలో వరుసదీరిన మొక్కలు - మొక్క మొక్కనా లెక్కలేనన్ని మొగ్గలు కనీసం 60 నుంచి 70 మంది మనుషులు పని చేయాలి

రామనాథం కుటుంబం మొత్తం పొలానికి వచ్చారు.

అలెర్జీ సమస్యకు పక్కకు తోసిసి రత్తయ్య - గర్భిణినని లెక్కచేయకుండా అనూరాధ- అలిగి వెళ్ళిన సుధాకర్ ఆసక్తితో వచ్చారు

బాలయ్య, మల్లేశ్ వారిని కలిసారు

అందరూ కలిసి ఒక ముప్పై మంది మనుషుల్ని సేకరించుకురాగలిగితే వారి గాసగాళ్ళు వాళ్ళ కుటుంబాలు జత అయ్యారు.

యుద్ధానికి సిద్ధమై సైన్యాధిపతి ఆదేశం కోసం లేచివున్న సైనికుల్లా వారందరూ రామనాథం చెప్పబోయే విషయం కోసం ఎదురు చూస్తున్నారు రామనాథం ఏ విషయం చెప్పకుండానే పైటేళ భోజనాలయ్యాయి.

రామనాథం కొందరిని పొడవాటి తుమ్మముళ్ళు తుంచుకు రమ్మని పురమాయించాడు

తను పూర్చించి తెచ్చి ఇంట్లో పెట్టిన అట్టపెట్టెను తెమ్మని శివుడిని పంపించాడు రామనాథం.

విచిత్రమేమిటో చూడడానికి సూర్యుడు నడికెత్తికొచ్చి తొంగిచూసి ఎంతకు సందడి మొదలవ్వక పోవడంతో మెడనొప్పి పుట్టి కొంచెం పక్కకు జరిగాడు

రామనాథం అందర్ని ఫిమేల్ పత్తిచేలోకి పిలిచాడు.

ఒక మొక్క ముందు నిలబడ్డాడు.

అందరు మొక్క చుట్టూ చేరారు. రామనాథం వెనుక పక్కన నిల్చున్నవాళ్ళు కొందరయితే, భుజాల మీద నుంచి తొంగిచూసే వాళ్ళు కొందరు

ముడుచుకొన్న మూడు పత్రదళాల మధ్యన ముచ్చటగా విచ్చిన లేతపసుపు ప్రత్తిమొగ్గ ముద్దుగా నవ్వింది.

రామనాథం మునివేళ్ళతో పత్రదళాలను సున్నితంగా తొలగించాడు.

బొటనవేలి కొనగోటితో మొగ్గ పీఠభాగాన్ని గుచ్చి, నెమ్మదిగా వృంతం మీద నుండి మొగ్గను తొలగించాడు. మొగ్గతో పాటు కేసరాలు కూడా తొలగేంత జాగ్రత్తగా - అండాశయం

నొక్కులు పడనంత సుకుమారంగా ఆ పని పూర్తి చేసాడు

ఆ మొగ్గను తీసి, నోరు తెరుచుకొని చూస్తోన్న సవారి అరచేతిలో పెట్టాడు

వృంతం మీద అండాశయం, అండవాహిక ఒంటరిగా నిలబడ్డాయి ప్రతిమొగ్గ ఎమాస్క్యులేషన్ పూర్తయింది

ఊర్నించి తెచ్చిన చిన్న పేపర్ కవర్‌ను ఎమాస్క్యులేషన్ పూర్తిచేసుకొన్న ఫిమేల్ మొగ్గ పై నుంచి తొడిగాడు తుమ్మ ముల్లుతో కాడ మీదుగా మొగ్గ తొడిమకు కవర్‌ను పిన్ చేసాడు

"మళ్ళీ ఈ కవరెందుకు బాబాయ్ ?" శివుడు ఆశ్చర్యంగా అడిగాడు

"కీటకాల వల్ల గానీ గాలివల్లగానీ మరో విధంగా గానీ వేరే పూల పుప్పొడి ఈ మొగ్గ మీద పడకుండా వుండడానికి"

సుధాకర్ ఈ కార్యక్రమమంతా చూసి నొసలు విరిచాడు

"ఒక్కో మొగ్గని ఇంత సుతారంగా చేస్తూ పోవాలంటే ఇంక అయినట్టే" అందరికీ అట్లాగే అనిపించింది అందరి ఉత్సాహం చల్లారిపోయింది

రామనాధం నాలుగయిదు సార్లు మొగ్గలు తీసి క్రాసింగ్ చేసి చూపించాడు

ఒక్కొక్కరు ప్రయత్నించి చూసారు మొగ్గలు తీయడం చాలా సుకుమారమైన పని కొందరు అండాశయానికి గోరును గుచ్చేస్తే మరికొందరు ఏకంగా ఛిద్రం చేసేసారు మరికొందరు వృంతం మీద నుంచి అండాశయంతో సహా మొగ్గను గిల్లేసారు కొందరు మన వల్ల కాదని చేతులెత్తేసారు ఇంకొందరు కూలివద్దు పాడు వద్దు అని దులుపేసుకొని చక్కా పోయారు.

రామనాధం పూర్తి నిరాశలో మునిగి పోయాడు.

ఇది ఒక్కడి వల్ల అయ్యేపని కాదు. అందరు నిమగ్నమవ్వాలి అందరూ శ్రద్ధగా జాగ్రత్తగా చేయాల్సిన పని.

ఒక్కొక్కరూ వెళ్ళి పోతుంటే రామనాధానికి ఏడుపు ముంచుకొచ్చినంత పనయ్యింది

"నేను ముందే చెప్పానా ఇది మాటల్లో తేలికేగానీ చేతల్లో కాదనీ !" సుధాకర్ ఎలాంటి మొహమాటం లేకుండా పైకే అనేసాడు కానీ అతనిలోనూ తండ్రి రక్తం వుంది ఒక పని మొదలెట్టాక వెనకడుగు వేయడమన్న దానిని అతనూ ఎరగడు

దాంతో స్వయంగా ఒక మొక్క ముందు నిలబడి - మొగ్గలు తీసే ప్రయత్నంలో పడ్డాడు

అప్పటికే కుటుంబ సభ్యులంతా ఆ ప్రయత్నంలో వున్నారు ఎన్నో మొగ్గల్ని తుంచేసి ఎన్నింటినో ఛిద్రం చేసి - మరి కొన్నిటిని అమాంతం విరిచేసి - మొత్తానికి దారిలో పడ్డారు రామనాధం ఒక్కొక్కరి దగ్గరికి వెళ్ళి, బతిమిలాడుతూ బామాడుతూ - మొగ్గలు తీసి చూపిస్తూ వివరిస్తూ తన ధ్యేయం సాధించేందుకు పోరాడుతున్నాడు

చివరికి పదిమంది కూలీలు మిగిలారు

నమ్మిన బంట్లు, సవారి, కురపలాంటి వాళ్ళు నాగలి దున్నడం లాంటి మొరటు

పనులు తప్ప ఇలాంటి సున్నితమైన పనులు చేయలేరు కూలీలు వెళ్ళిపోతున్నారన్న దుగ్ధతో ఏమీ చేయలేని నిస్సహాయతతో సవారి పరిగెత్తు కెళ్ళి మాణిక్యాన్ని కూతుర్ని కేకేసుకొన్నాడు మొరటు పనులతో బండ బారిన మగవారి చేతులకన్నా సున్నితమైన పనులు చేయగల ఆడవారికి ఈ పని సులభంగా వంటబట్టింది పువ్వులకు స్త్రీలకు ఉన్న ప్రాకృతిక సంబంధంమేదో వారిలో ఉత్సాహాన్ని నింపింది

మెల్లిమెల్లిగా ఒక్కొళ్ళు చాళ్ళు పట్టారు సంధ్యవేళకి మెల్లిగా కొన్ని చాళ్ళు చేయి పెట్టకుండానే మిగిలిపోయాయి

కూలీలలకు డబ్బు లిచ్చి, కుటుంబమంతా ఇంటికి మళ్ళారు

"వొట్టి మనిషివి కూడా కాదు గట్లమ్మట జాగ్రత్తే - "అంటూ సావిత్రి అనూరాధను ఇంటికి తీసుకెళ్ళింది

రామనాథం వంటరిగా ఆ పొలం గట్టుమీద కూర్చుండి పోయాడు

సింధనూరు వెళ్ళి ఓ చేత్తో డబ్బులు పడేసి మరోచేత్తో విత్తనాల సంచి తెచ్చుకోవచ్చు ఎందుకొచ్చిన గొడవ !

రామనాథం మనసు అతన్ని ప్రశ్నించింది

వ్యవసాయ విశ్వవిద్యాలయంతో ఓ శాస్త్రజ్ఞుడు చూపిస్తే తన చూసి మురిసిపోయి చకచక నేర్చుకుని బోర విరుచుకున్నట్లు కాదు -వీళ్ళందరికి నేర్పించడం !

రామనాథం ఆ రోజు ఓ చేదు పాఠం నేర్చుకున్నాడు

"మరి వాళ్ళెలా ఈ పని చేయగలుగుతున్నారు ఇది చేయలేని పని మాత్రం కాదు"

మర్నాడు ఉదయాన్నే శివుడూ సుధాకర్ వెళ్ళి కూలీలను బతిమిలాడి తీసుకొచ్చారు. బాలయ్య మల్లేశ్ కొంతమంది కూలీలను తీసుకొచ్చారు

ఈ పూట చేయ్యాల్సిన పని మరోటి వుంది.

రామనాథం గట్టుమీద నిలబడి పొలమంతా చూసాడు ఫిమేల్ మడుల్లో చక్కగా విచ్చిన లోటాల్లాంటి పసుపు పచ్చని ప్రత్తిపూలు రామనాధాన్ని చూసి పగలబడి నవ్వాయి నిన్న మధ్యాహ్నాం చేసి, పెట్టిన, తెల్ల కవర్లు వాటిముందు పాలిపోయి తెల్లమొహం వేసినట్లున్నాయి నాకు విరుద్ధంగా చేసి నిలుస్తావా అంటూ ప్రకృతి పరిహాసించింది.

రామనాథం గుండెల నిండా ఊపిరి పీల్చుకున్నాడు.

"నాకు ఈ రేగడి మీద విశ్వాసం వుంది. ఆ ప్రత్తి మీద విశ్వాసం వుంది నా విశ్వాసం మీద విశ్వాసం వుంది. నేను సాధించి తీరుతాను ! "

ఆ పూట ఏం చేయాలో చెప్పమన్నట్లు వాళ్ళు ముఖాలు పైకెత్తి నిల్చున్నారు

ఆ ముఖాల్లో నిన్నటి ఉత్సాహం లేదు కుతూహలం లేదు అయిష్టమైన పనికి నిర్దేశించినపుడు వ్యక్తమయ్యే అ భావమే వుంది.

క్రాసింగ్ చేయకుండా మిగిలిన మొగ్గలు పువ్వుల్లా విచ్చిపోయి వున్నాయి. ఆ పువ్వుల్ని తుంచేయాలి

"దిగుబడి తగ్గుతుంది !" సుధాకర్ గోలపెట్టాడు

"అలా ఎమాస్కులేషన్ చేయని పువ్వును ఒక్కదాన్ని వదిలినా మన ప్రయత్నం విఫలమైనట్టే !" రామనాథం హెచ్చరించాడు, "ముందే ఒక్క మొగ్గనైనా వదలకుండా చూసుకోవాలి !"

మేల్ పత్తి అప్పుడే పూలు పూస్తోంది

రామనాథం కొందరిని మగ పూలు కోసుకు రమ్మన్నాడు.

ఆడవాళ్ళంతా ఆనందంగా వెళ్ళి పూలు కోసుకు వచ్చారు

క్రితం రోజు క్రాసింగ్ చేసి తగిలించిన పేపర్‌కవర్‌ను తీసేసి, కవర్‌ను, ముల్లును భద్రం చేసుకోమన్నాడు రామనాథం

రామనాథం శివుడి చేతిలోంచి మగపువ్వును తీసుకొన్నాడు

పువ్వురెక్కలు కిందికి వంచాడు ఆడపువ్వు అండవాహిక మీద మగపువ్వులోకి పుప్పొడిని అద్దాడు.

పరాగ సంపర్కం (క్రాసింగ్) పూర్తయింది

క్రాసింగ్ చేసిన తరువాత చిన్న ట్వైన్ దారం ముక్కతో ఆ తొడిమ మీద గుర్తు కోసం ముడెయ్యాలి ఈ పూట పని పైటేళ పనితో పోలిస్తే సులువు. చకచక చేయొచ్చు

మళ్ళీ మధ్యాహ్నం ఆ పూట ఫిమేల్ మొగ్గలను ఎమాస్కులేషన్ చేయాలి

ఇది ఒక్కపూట కూడా అటూఇటూ కాకుండా చేయాల్సిన పని

వారం రోజులు గడిచేసరికి క్రాసింగ్ చేయకుండా పూసేసిన పూల సంఖ్య నెమ్మదిగా తగ్గుతూ వచ్చింది

మొదట క్రాసింగ్ చేసిన మొగ్గల్లో అండవాహికలు వాడిపోయి రాలిపోతున్నాయి అండాశయం నెమ్మదిగా నిండునవుతోంది రోజులు గడిస్తే అది పిందె అవుతుంది పిందె కాయ అవుతుంది

అనూరాధకు నెలలు నిండుతున్నాయి అయినా ఆసక్తిని అణచుకోలేక ట్వయిన్ దారాల బండిల్ నుండి దారాన్ని చిన్న చిన్న ముక్కలుగా కత్తిరించడం రామనాథం చెప్పినట్లుగా కూలీల హాజరు వివరాలను రిజిస్టర్‌లో వ్రాయడం లాంటి పనులు చేస్తోంది

శివుడు ఇటు వాళ్ళ పొలాల మధ్య అటు బావగార్ల పొలాల మధ్య తల తిప్పలేనంత పని వత్తిడితో వున్నాడు. తమ పొలాలలోనన్నా ఒకరోజు అటూఇటూ పనులు చేయించుకోవచ్చు కానీ - బావగార్లు ఓ పూట అటూఇటూ అయినా వ్యంగ్యపు చురకలతో అలకలతో విసిగించి చంపుతున్నారు.

వాళ్ళ వ్యంగ్యాలన్నింటికి రామనాథం చేపట్టిన విత్తన ఉత్పత్తే మూలమవుతోంది

''వాళ్ళ సొమ్మేదో పోయినట్లు ఎందుకేడ్చి చస్తారు '' శివుడు లోలోపలే గొణుక్కున్నాడు.

శివుడికి తన యిద్దరు అక్కలంటే ఎంతో అభిమానం అందులోనూ వారి కుటుంబాల్లో ఆడపిల్లల చుట్టూ ఎంతో ఆప్యాయతను అల్లుకుంటారు ఫలాన యింటి ఆడపడుచులు ఏనాడు కంట తడిపెట్టకూడదని ఆశిస్తారు శివుడు ఆ భావాలన్నీ పూర్తిగా బుర్రకు ఎక్కించుకున్నాడు. బావగార్లు ఏం చేసినా సహిస్తాడు ఎన్ని వ్యంగ్యాలు పడుతోన్నా తేలిగ్గా నవ్వేస్తాడు వాళ్ళ వ్యంగ్యాలు బావబావమరుదుల మధ్యన వుండే చతుర్లులాగా తమాషాగా వుండవు కుయుక్తితో కుళ్ళుతో నిండి వుండే ఆ మాటలంటే శివుడికి వళ్లు మంట ఆ మంటేదో తనే అనుభవిస్తూ రామనాథాన్ని అతని ప్రయోగంలో వదిలేసాడు

రామనాథం పూర్తిగా వాగొడ్డు పొలం దగ్గరే గడుపుతున్నాడు ఏదైనా పురుగు సోకిందనో చీడపీడ తగిలిందనో చెపితే ఆ పూట వెళ్ళి, చూసి, ఏ మందు వేయాలో - ఏం మోతాదో చెప్పివస్తున్నాడు శివుడు, సుధాకర్ వ్యవసాయంలో ఆరితేరాన్న ధీమా అతన్ని అతని పనిలో పూర్తిగా నిమగ్నమయ్యేట్టు చేసింది కలుపులు తీయించడం, నీళ్ళ కట్టడం లాంటివి వాళ్ళిద్దరూ చేసేస్తున్నారు. ఎరువులు వేయడం, మందులు కొట్టడం రామనాథం సూచిస్తున్నాడు

రామనాథం ఆ పొలంపై దీక్షబూనినట్లు నిమగ్నమవడంతో సుధాకర్ లెక్కలు, బ్యాంక్ పనులు చేసుకొంటున్నాడు.

ఇంకా పొలాల మీది అప్పులు తీర్చలేదు ! ఆడవారి బంగారం ఇంటికి రాలేదు ఎరువుల కొట్టులో రోజురోజుకీ ఖాతా చిత్రగుప్తుడి చిట్టాలా పెరుగుతోందే కానీ తరగడం లేదు కర్నూల్లో పిల్లల చదువులు తెలియకుండా భారమవుతున్నాయి ఒక పక్క రామనాథం కూలీలకు చేస్తోన్న ఖర్చు చూస్తే సుధాకర్ కళ్ళు తేలేస్తున్నాడు ఎక్కడెక్కడి డబ్బు సరిపోవడం లేదు. ట్రాక్టరును అద్దెకిస్తున్నారు. దానిమీదా అప్పు తెచ్చారు

సుధాకర్‌కు ఎరువుల కొట్టుకు వెళ్ళాలంటే ముఖం చెల్లడం లేదు బావగార్లు కోరిన ఎరువునో పురుగుల మందునో తెచ్చియ్యడంలో ఓ పూట ఆలస్యం అయినా అదేదో సుధాకర్ కావాలని తాత్సారం చేస్తున్నడని నిందలు వేస్తున్నారు. కనిపిస్తే చాలు కాకుల్లా ఎత్తి పొడుస్తున్నారు. గీత కర్నూలు వదిలి ఇంటికి రావడం లేదు. సుధాకర్ పరిస్థితి రోజురోజుకి కుటుంబ భారమంతా నెత్తికెక్కించుకొన్నట్లయింది. తండ్రితో చెప్పలేని చిన్న చిన్న కుటుంబ సమస్యలు అతన్ని ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. ఆ చికాకు అణుచుకోలేనప్పుడు తల్లిమీద తండ్రి మీద విసుర్లు విసురుతున్నాడు

వీటిన్నిటికన్నా ఎదురుగా వచ్చి తిరుగుతున్న అనూరాధ అతనికి మరో సమస్య అయ్యింది. ఆమెను చూసినపుడల్లా ఆమె నగలు తెచ్చుకున్నామన్న విషయంతోపాటు తిరిగి

ఇవ్వలేదన్న సంగతి ముల్లులా గుచ్చుకుంటోంది మల్లేశ్ చూపించిన ఉదారత అతని వళ్ళంతా కారం రాసినట్లువుతుంది

మెల్లిమెల్లిగా తండ్రికి తనపట్లకన్న మల్లేశ్ పట్ల అభిమానం ఎక్కువవుతోందన్న భావన సుధాకర్ మనసులో ప్రవేశించింది నెమ్మదిగా ఆ భావన పెరిగి పెరిగి అతని మెదడును తొలిచేస్తోంది

మనిషి చాలా అసహనంగా తయారయ్యాడు కదిలిస్తే కస్సు మంటున్నాడు.

పొలాలన్నీ బాగా వున్నాయి. కొత్తగా వచ్చిన రైతులు ఉత్సాహంగా ఉన్నారు

కర్నూలు ఎరువుల కొట్టులో గుమాస్తాగా పని చేస్తూ వుండిన తిరుపాలును దస్తగిరి నడిగడ్డకు పట్టుకొచ్చాడు

ఇద్దరూ కలిసి ఎరువుల కొట్టు పెట్టారు

కొత్తగా వచ్చిన రైతులందరిని దస్తగిరి వాక్చాతుర్యంలో ముంచి తిరుపాలు కొట్లో తేలుస్తున్నాడు

పని ఎద్దడప్పుడు కూలీల అవసరం గణనీయంగా పెరిగింది ఎవరి పనివారు తొందరగా ముగించుకోవాలని ఒకరి మీద ఒకరు పోటీలు పడుతూ కూలీరేట్లు పెంచేసారు. మిగతా రేట్లు పెంచేసారు.

ఆ వచ్చిన వాళ్ళల్లో రామనాధం కుటుంబం లాంటి రైతు కుటుంబాల వాళ్ళు వున్నారు వ్యాపార కుటుంబాల్నుంచీ వచ్చినవాళ్ళు - పెద్ద గాసగాళ్ళు కుటుంబాలు - ఎద్దుల బేరగాళ్ళు - ధాన్యం బేరగాళ్ళు -చిన్న చిన్న ఉద్యోగాలు వదిలేసి వచ్చినవాళ్ళు - ఎందరెందరో వున్నారు. రకరకాల మనుషులు. రకరకాల నేపథ్యాలు వాళ్ళ నేపథ్యాలను బట్టి ఏర్పడ్డ విభిన్న మనస్తత్వాలు చాలా మటుకు బంపర్ లాటరీ కొట్టినట్లుగా అమాంతం వరలక్ష్మి కురిపించే ధనరాసి మీది దృష్టి పెట్టుకొని వచ్చారు

విపరీతంగా డబ్బు వెదజిమ్మగల వారి ధోరణి ముందు పాత వాళ్ళంతా వెలాతెలా పోయారు

"వైట్ గోల్డ్ రష్" సమయం.

రామనాధం కుటుంబం, వారి విశాలమైన ఇళ్ళూ, వాకిళ్ళు, గొడ్లతో కళకళతోన్న చావిడి అన్నింటికి మించి వారి మాటంటే ఆ చుట్టూ పక్కల ప్రాంతాల్లో వున్న విలువ వారిలో కొందరికి కన్ను కుట్టించక పోలేదు.

రామనాధం కుటుంబాన్ని ఆదర్శంగా తీసుకున్న వాళ్ళు కొందరైతే వాళ్ళ నెలాగైనా అణగదొక్కి తాము ఊరికంతా గొప్ప అనిపించుకోవాలనే వాళ్ళు కొందరు తయారయ్యారు.

కొంతమంది రామనాధం వాళ్ళపట్ల నడిగడ్డ మీద వున్న గౌరవాన్ని కూడా భరించలేక పోయారు. పరోక్షంగా ప్రత్యక్షంగా హేళనచేసి చులకన చేసి మాట్లాడుతూ తమ కుతి

తీర్చుకుంటున్నారు

అట్లాంటి కుళ్ళు మోతు తనంతో కుతకుతలాడుతున్న ఓ ముదిత ముచ్చటగా స్టేట్‌మెంట్ ఇచ్చేసింది, "రామనాథం గార్ని చూడండీ - ఎంత చక్కగా దొర లాగా వుండరూ - వాళ్ళావిడ ఆ పళ్ళు పొడుచుకొచ్చి, బొమికలు వెళ్ళ బొడుచుకొచ్చి అచ్చం పీనుగు లాగుంటుంది అసలు రామనాథం గారికి తగిన పెళ్ళామే కాదు ! "

ఆమె కస్తూరి

ఆమె భర్తతో పాటు ప్రత్తి వేసుకోవడానికి ఆ ఊరు వచ్చింది రామనాథం వాళ్ళ అరుదడి చేను కెళ్ళే దారిలో యిల్లు ఆమె రాక ఒక విధంగా ఆ గ్రామంలో చిన్న సంచలనం సృష్టించింది ఆమెతో పాటు ట్రాన్సిస్టర్‌ను తెచ్చుకుంది భర్త పొలానికి వెళితే పాటలు పెట్టుకొని వీధిలో వచ్చేపోయే మగాళ్ళకి పేర్లు పెడుతూ కూర్చోనేది చూస్తుండగానే ఆ యింట్లోకి భద్రయ్య గారి చిన్నబ్బాయ్ - చిట్టిబాబు దూరడం మొదలెట్టాడు

మగవాళ్ళు ఆమె ఇంటిముందు దారి మార్చి మరోవైపు వెళ్తున్నారు

మెల్లిమెల్లిగా మనుషుల మధ్య రాజకీయలు తలెత్తున్నాయి.

పాతవాళ్ళతో ఏ విషయం చెప్పబోయినా రామనాథం గారిని అడిగి చెప్తామని చెప్పడం కొత్తగా వచ్చిన వాళ్ళ వళ్ళు మండిస్తోంది "ఏం ఆ రామనాథం అంత పొడిచేసాడా ? మా మాట ఎందుకు వినరు ? "

మాట పట్టింపులు, పంతాలు నెమ్మదిగా బిగుసుకుంటున్నాయి కొత్తగా వచ్చిన శేషయ్య, లింగయ్య, సుబ్బయ్యలతో భద్రయ్య గారి చిన్నబ్బాయ్ - చిట్టిబాబు కలిసాడు

నలుగురు చేరి పొలం గట్లమీద ఏ తుమ్మ చెట్టు కిందో పేకడూతూ తీరిగ్గా రామనాథం ప్రాధాన్యతను తగ్గించే ప్రణాళికలు వేస్తున్నారు

రామనాథం వాళ్ళకు ఇవేవీ తెలియవు

బాగున్నావా అంటే బాగున్నావా అని పలకరించడం - తమ పని తాము చేసుకొంటూ పోవడం - వాళ్ళగోలలో వాళ్ళు మునిగి వున్నారు

రామనాథం హైబ్రీడ్ సీడ్ చేను క్రాసింగ్ వేగంలోకి చేరుకుంది కూలీలు అలవాటు పడుతున్నారు ఇప్పుడు పాతిక నుంచి ముప్పైదాకా వస్తున్నారు

రామనాథం క్రాసింగ్ చేయించడంతో పని అయిపోదు క్రాసింగ్ హైబ్రీడ్ విత్తనాల ఉత్పత్తిలో ప్రధానమైన పని. ఇంకా కొన్ని ముఖ్యమైన పనులు ముందున్నాయి.

❊ ❊ ❊

"వదినా, ఇప్పుడెట్లా ? అనూరాధ వొదినకి గది ఏర్పాటు చేయొద్దూ " కల్యాణి ఆందోళన పడింది

కల్యాణి యిప్పుడు గైనికాలజీ పాఠాలు చదువుతోంది, ఒక గర్భిణి స్త్రీ ప్రసవానికి ముందు ఎంతటి సున్నితమైన మానసిక శారీరక స్థితిలో వుంటుందో భట్టీయం వేస్తోంది

అనూరాధ ప్రసవానికి కర్నూలుకు వస్తుందనగానే, ఆమెకు అనుకూలమైన పడకను, విశాలమైన గదిని ప్రశాంతమైన వాతావరణంతో అందించాలన్న కృత నిశ్చయంతో వుంది

కల్యాణి కొత్తగా చెప్పకపోయినా భారతికీ ఆ విషయం తెలుసు గర్భిణీ స్త్రీ ని మొదటి రోజునుండే ప్రత్యేకమైన శ్రద్ధతో చూడాలన్న విషయం ఆమెతో పాటు కుటుంబంలోని అందరూ నమ్ముతారు భారతి రెండు కాన్పులప్పుడు ఇటు అత్తవారింటిలోనూ అటు పుట్టింటిలోనూ అపురూపంగా జరిపించుకుంది

ప్రసవానికి ముందు పదిరోజులు ఎలాంటి స్థితిలో వుంటారో ఆమెకు అనుభవ పూర్వకంగా తెలుసు అలాగే ప్రసవం జరిగిన వెంటనే. కాబట్టి అనూరాధ కోసం ఉన్నంతలో చక్కని సౌకర్యాలు అందిచాలని భారతి తాపత్రయ పడుతోంది

ఇక వదినామరదళ్ళ ఉమ్మడి సమస్య గది

గీత వచ్చి ఒక గదిని ఆక్రమించనప్పటినుంచీ - ఆ ఐదుగురు పిల్లలతో పాటు భారతి, కల్యాణి అటు ముందుగదిలోనో ఇటు వంటింట్లోనో గడుపుతున్నారు

అనూరాధను ముందింట్లోనో వంటింట్లోనో వుంచే ప్రసక్తే లేదు "వారు పదిరోజులేగా గీతొదిన్ని బయట పడుకోమను - కొంపేం మునగదులే - " కల్యాణి భారతితో అంది

భారతి కూడా అదే అనుకుంది పదిరోజుల భాగ్యం ఎక్కడ పడుకున్నా వెళ్ళమారిపోతుంది అందుకే గీతను అభిప్రాయం అడిగి నిర్ణయించుకోవాల్సినంత పెద్ద సమస్య అక్కడ ఆమెకి ఏమీ కనిపించలేదు.

బొంగుల బజారు కెళ్ళి ఓ మంచం ఫ్రేము, నవారు కొనుక్కొచ్చింది. ఓ ఆదివారం పూట కల్యాణి, భారతి కలిసి నవారు అల్లారు

"ఆవిడకి చేతగాదూ " కల్యాణి గీత నుద్దేశించి భారతి దగ్గర గొణిగింది

కట్టులేని నోరు కట్టలేని ఏరు లాంటిదంటారు గీత కాపురానికి వచ్చిందగ్గర్నుంచి నోరు పారేసుకుంటూ పూచిక పుల్లకూడా ఎత్తి అటూ ఇటూ పెట్టకుండా జరిపించుకుంటుంది ఇటు భారతి గానీ అటు అత్తగార్లుకానీ ఆమె విపరీత ధోరణికి వెనక్కి తగ్గి లేనిపోని గోలెందుకు ఈ పనేదో మనం చేసేస్తే పోదా - అంటూ సర్దుకుపోతున్నారు ఇంత చిన్న యింటికి మరో మనిషి ఎందుకు చిటుక్కున చేసుకొంటే నిమిషాల పని - అంటూ భారతి పని మనిషికి కూడా పెట్టుకోకుండా గిరగిర చేసుకొంటూ వుంటుంది

గీత గద్దరితనం చూస్తుంటే కల్యాణికి వళ్ళుమంట

ఆమె ముందు ఏమీ అన్లేక భారతిముందు వెళ్ళగక్కుతుంది

"ఏం చూసుకొని ఆమెకీ విరగబాటు ?"

"ఏమన్నా చూసుకొని మరీ విరగబడాలేంటి ? ఆ బుద్దే అట్లాంటిది " ఆరోజు మధ్యాహ్నం గీత చిన్న పిల్లనేసుకుని మరీ సినిమాకి బయల్దేరింది

భారతి, కల్యాణి ప్రశాంతంగా అనూరాధకు గది సర్దుకున్నారు దండం మీద వేళ్ళాడుతోన్న గీత బట్టలన్నీ మడిచి సర్దారు మూలనున్న బూజులు దులిపి, గది కడిగి - ఆర బెట్టారు కిటికీ పక్కగా నవారు మంచమేసి పరుపు దిండూ వేసారు కొత్త దుప్పటి పరిచారు ఆ గదిలో రెండు పెద్ద అల్మేరాలు వున్నాయి

కల్యాణి మెడిసిన్ పుస్తకాలన్నిటికి గీత ముందుగదిలో పడేసింది కల్యాణి ముందుగదిలో వున్న చోటే సర్దుకుంది

ఇన్నాళ్ళూ ఈ గదిలోకి రావాలంటేనే కల్యాణికి వళ్ళుమంట - ఈ పూట ఎలాగు వచ్చింది కనుక అల్మేరాలు కూడా సర్దుదామని తెరిచింది

అల్మేరాల్లో కావాల్సినంత ఖాళీ వుంది ఒక అరలో గీత చీరలు ఒకఅర పాప గౌన్లు ఇట్లా వరుసగా సర్దివున్నాయి అవి అరలో పావు వంతు కూడా లేవు

కల్యాణి చక్కగా వాటిన్నింటిని రెండు అరల్లో సర్దేసింది అనూరాధకు కావాల్సిన అద్దం, దువ్వెన వగైరాలు పుట్టబోయే పాపాయి కోసం కొన్న పౌడర్, సబ్బు, వగైరాలు సర్దింది ఒక అర ఖాళీగా వుంచి, అనూరాధ వచ్చాక ఆమె సామాగ్రి అమర్చుదామనుకొన్నారు. అక్కడైతే అనూరాధకి చక్కగా అందుబాటులో వుంటాయి

కల్యాణి ఒక అమూల్‌బేబీ క్యాలెండర్ ఒక మర్ఫీ బేబీ క్యాలెండర్ తెచ్చి మంచానికి ఎదురుగా వేళ్ళాడదీసింది.

భారతి, కల్యాణి తమ నైపుణ్యానికి తామే ఆశ్చర్యపోయారు. గది చక్కగా హాయిగా వుంది

"మనం ఈ పక్కన చాపేసుకొని పడుకోవచ్చు - " భారతి సంతోషంగా వుంది

"ముందు ఆ చాప ఇట్లా ఇయ్యి వదినా - కాసేపు కూర్చుందాం - "కల్యాణి చాప పరుచుకొని గోడకానుకొని కూర్చొని హాయిగా గాలి పీల్చుకొంది

"అబ్బ - చదువుకొనే మూడ్ వచ్చేస్తొందిదినా - "

భారతి నవ్వుతూ వెళ్ళి అనూరాధకు పుట్టబోయే బిడ్డ కొన్న సాంబ్రాణిని పొడిచేసి ఓ సీసాలో పోసుకొచ్చింది అల్మేరాలో సర్ది వెనక్కి తిరిగేసరికి, గీత గాజుల స్టాండ్ కనిపించింది - అల్మేరాలో పెట్టి - వంటింట్లో పని చేసుకోవడానికి వెళ్ళింది.

కల్యాణి ఓ లావాటి పుస్తకం పట్టుకొచ్చి - ప్రశాంతంగా చదువుకొంటుంది

టీ తీసుకొచ్చిన భారతిని కల్యాణి ఆరాతీసింది

భారతి చెపుతుండగానే గీత చెప్పుల్ని చటచట లాడిస్తూ వచ్చింది వచ్చీరాగానే తన గదిగా భావిస్తోన్న గదిలో జరిగిన మార్పులు చూసి ఇంతెత్తున ఎగిరిపడింది

వ్యానిటీ బ్యాగును ఓ మూలకు విసిరేసింది పాపను ఓ మూల కుదేసింది ఆ విసురుకు పాప ఏడున్నొక్క రాగం మొదలెట్టింది.

మంచం మీది దుప్పటి తీసి వుండ చుట్టి ముందు గదిలోకి విసిరింది ఆ వెంటనే దిండు పరుపు బయటకు పడ్డాయి

అల్మెరా రెక్కల్ని దడాదడా దభామని కొట్టింది. లోపల చక్కగా సర్దిన చీరల్ని - జాకెట్లని, బట్టలన్నీ వుండలుగా చుట్టి కసికసిగా గదంతా విసిరేసంది

గాజుల స్టాండ్ తీసి గోడకు కొట్టింది.

కల్యాణి భారతి ఆమె ప్రవర్తనకి ఎలా స్పందించాలో తెలియక స్థాణువుల్లా కూర్చుండి పోయారు బట్టలు మీద కొచ్చి పడుతున్నా చాప మీద నుంచి లేద్దామన్న స్పృహే వారికి రాలేదు.

భారతి ముందుగా తేరుకుంది

"ఏంటమ్మాయ్ గీతా అది - "అంటూ కప్పెగిరేలా ఏడుస్తున్న పాపను ఎత్తుకోబోయింది

గీత భారతి చేతిని విసిరికొట్టింది - "దాన్ని ముట్టుకోమాకు"

కల్యాణి కోపంతో పళ్ళు పటపట నూరుతూ విసురుగా చేతిలో పుస్తకాన్ని చాప మీద పడేసింది భారతి కల్యాణి ధోరణి చూసి గబుక్కున తొందరపడకన్నట్లు చేయి పట్టుకొంది.

గీత ఆవేశంతో రొప్పుతూ అనూరాధ కోసమని సర్దిన అద్దాన్ని దువ్వెనలని విసిరిసిరి కొట్టింది అద్దం కల్యాణి తలమీదుగా వెళ్ళి గోడకు తాకి భళ్ళు మంది. పౌడరు గోడల మీదంత పడింది తిలకం సీసా నేలమీద పగిలి అటూ ఇటూ తిలకం దొర్లింది.

ఇక కల్యాణికి చిర్రెత్తు కొచ్చింది.

భారతి చేయి విదిలించి గబగబ గీత దగ్గరికి వెళ్ళింది.

"ఏంటొదినా - నీ కేమైనా పిచ్చెక్కిందా ? "సూటిగా అడిగిం ది .

"ఏయ్ కల్యాణి - మర్యాదగా మాట్లాడు. ఎవర్నడిగి నా గదిలోకి వచ్చారు. నా సామాన్నంతా కదిలించారు. -" గీత ఆవేశంగా ఏదో అనబోయింది.

"ఇదేం మహారాజుల భవంతి కాదు. అద్దె కొంప. వున్నదాంట్లో సర్దుకోవాలి. ఆరుగురు పిల్లల మధ్యలో అనాటమి పరీక్షకు ఎలా ప్రిపేరవుతుందన్న సెన్స్ నీకు వుంటే బానే వుండేది "

కల్యాణి కూడా ఆవేశంగా అంది.

"మర్యాద ఇచ్చేవాళ్ళకే పుచ్చుకొనే అర్హత వుంటుంది. అయినా నీ గదేమిటి ? గది ? ఇదసలు నేను చదువుకొనే గది - నువ్వొచ్చి బైఠాయించింది కాక - పెత్తనాలు చేస్తున్నావ్ - " కల్యాణి కస్సుమంది

"కల్యాణి నువ్వురుకో - " భారతి కల్యాణిని వెనక్కిలాగింది,

"అది కాదమ్మా గీతా - ఈ పూట అనూరాధ వస్తోంది కదా తనకి పడుకోవడానికి అదీ వుండొద్దూ - "

"అనూరాధ వస్తే ఏంటి ? మహారాణి గారు వస్తుందని పట్టెమంచం పట్టు పరుపు సిద్ధం చేయాలా ?" గీత వ్యంగ్యంగా అంది

"అబ్బే అవసరం లేదు - ఆ పెసర్లంకలో చుట్టు గుడిసెలో పుట్టి పెరిగిన మహారాణిగారికి అవసరం కానీ మాలాంటి వాళ్ళ కెందుకు ?" కల్యాణి అంతే తీవ్రంగా అంది

తన పుట్టింటివారి విషయం ఎత్తేసరికి గీత కాస్త తగ్గింది

"కల్యాణి - నువ్వు కూడా ఏంటీ - " భారతి బతిమిలాడింది

"ఊరుకో వదినా - అసలు నువ్వేమీ అనకుండా ఈవిడిగారిని నెత్తికెక్కించుకున్నావ్ ఇప్పుడు అంత కొంప మునిగే పని ఏం చేసామని గదంతా చిందర వందర చేసింది ? ముందా విషయం అడుగు - "

"నా - ఖర్మ కొద్దీ వచ్చిపడ్డానీ కొంపలో - ఒక్క రోజున్నా సుఖపడి చచ్చానా - చూసి చూసి నా గొంతు కోసారు - " గీత వాళ్ళిద్దరితో మాట్లాడకుండా తనలో తాను అనుకొంటూ ఏడుస్తూ ముక్కుచీదుతూ సాంబ్రాణి వుంచిన సీసానెత్తి విరిసికొట్టింది

"ఏంటమ్మాయ్ గీతా - నువ్వుకూడా ! కల్యాణంటే చిన్నపిల్ల ఒక పిల్ల తల్లివి - నీకు ఓపిక లేకపోతే ఎట్లా - ? అనూరాధ ఏమన్నా ఇక్కడే వుండిపోతుందా కాన్పు అవ్వగానే ఊరికి వెళ్ళిపోతుందిగా - ఈ నాల్రోజుల భాగ్యానికి ఇంత రాద్ధాంతం ఎందుకమ్మాయ్ - కాస్త సర్దుకుంటే ఇట్టే వెళ్ళమారుతుంది కదా - " భారతి గీతకు నచ్చచెప్పే ధోరణిలో అంది

"చాట భారతం ఇంక ఆపుతావా ? అసలు నీ బోడి పెత్తనం ఎక్కువయి పోతుంది. అసలు నువ్వెవరే నాకు నీతులు చెప్పడానికి ? చెపితే నా అత్తగారు చెపుతుంది నా మామగారు చెపుతారు - నీ పెత్తనం కింద అణిగి మణిగి వుండాల్సిన ఖర్మేం నాకు పట్టలేదు - " గీత తన ధోరణిలో అరుస్తూ పోతుంది

భారతికి తల దిమ్మెక్కిపోయింది

మొట్ట మొదటిసారిగా ఆమె అత్తామామలు గీత అత్తామామలు వేరు అన్న సంగతి స్ఫురించింది

"కల్యాణి నా ఆడపడుచు మేము మేమూ ఏదైనా అనుకుంటాం మధ్యలో నీకేంటి ?'

కల్యాణికి చర్రున కోపమొచ్చింది గీత అడ్డగోలు వ్యవహారం చూస్తుంటే ఆమెకు కంపరమెత్తు కొస్తోంది

"ఆడపడుచు ! ఇంకోసారి ఆ మాటన్నావంటే ఊరుకునేదిలేదు. ప్రత్తి దానికి పెత్తనం గిత్తనం అంటున్నావే మరి ఇక్కడ ఎందుకున్నావ్ ? వుండాల్సిన అవసరం ఏవుంది ? మీ అత్తామామ దగ్గరే వుండకపోయా - తిండికి తిమ్మరాజు పనికి పోతురాజువి వదిన ప్రాణానికి

తగులుకున్నావ్ ఏమీ లేనమ్మ ఎగెరిగి పడుతుందని ఊరికే అన్నారు '' కల్యాణి ఇంకా విసురుగా అంది - ''ఇప్పుడే చెప్తున్నా విను నీ కన్నా ముందు ఇది నా గది నా ఇష్టమొచ్చినట్లు చేసుకుంటాను. ఉండాలను కొంటే వుండు - లేదంటే ''

''కల్యాణి ! '' అప్పుడే గుమ్మంలోకి వచ్చిన సావిత్రి గద్దించింది కల్యాణి చప్పున వెనక్కి తిరిగింది

సావిత్రి వెనుక అనూరాధ నిల్చుని వుంది ఇద్దరు విషయమేంటో అర్థంకాక అయోమయంగా చూస్తున్నారు

ఏడుపు కోపం మిళితమై రొప్పుతున్న గీత - ఎప్పుడు గట్టిగా మాట్లాడి ఎరుగని కల్యాణి చేస్తోన్న వాదన - తెల్లబోయి నిల్చున్న భారతి - చిందరవందరగా పడివున్న గది వాళ్లకేం అర్థం కాలేదు.

భారతి తేరుకొంది

''రండత్తయ్య - రా అనూరాధ - ఏంటీ నాలుగ్గంటల బస్సుకు వచ్చారా ? ''గబగబ వాళ్ళదగ్గరకు వెళ్ళి చేతుల్లోని సంచులు తీసుకొంది

కల్యాణి వచ్చి బుట్టలు అందుకొంది

గీతవిసవిసా బాత్‌రూంలోకి వెళ్ళిపోయింది

సావిత్రి వెళ్ళి నేలమీదే కూర్చుని బిత్తర చూపులు చూస్తున్న పాపని ఎత్తుకుంది

కల్యాణి అనూరాధకు ముందుగదిలోనే కూర్చోబెట్టి కబుర్లు చెప్తోంది

భారతి, నెమ్మదిగా గది తలుపులు మూసేసి - సావిత్రితో విషయం చెప్పింది ''అనూరాధతో అనమాకు'' సావిత్రి మెల్లిగానే హెచ్చరించింది ఇద్దరు మౌనంగా గదంతా సర్దారు.

సావిత్రి కర్నూలుకు బయల్దేరి వచ్చేటప్పుడే గీతను ఇంటికి పంపిద్దామన్న వుద్దేశంతో వచ్చింది శాంతమ్మ ఒక్కటి ఇంటిపని, వంట పని చేసుకోవడం కష్టం పై నుంచి పాడి పని.

అనూరాధ ఇంట్లోని అ సహజ వాతావరణాన్ని ఇట్టే పసి గట్టింది ముఖం మాడ్చుకొని మాట్లాడకుండా బిగదీసుకు కూర్చున్న గీతను చూడగానే ఏదో గొడవ జరిగిందనిపించేట్టుగానే వుంది ఇంతవరకు ఆ ఇంట్లోని ఆడవాళ్ళెవరూ ఇలా ముఖాలు మాడ్చుకోవడం అనూరాధ చూడలేదు.

సావిత్రి గీతకి ఊరెళ్ళమని చెప్పడానికి కూడా సాహించలేదు. ప్రసవానికి వచ్చిన అనూరాధ ముందు అనవసరంగా గొడవలు పడి ఆమె మనసు కష్టపెట్టకూడదనుకొన్నారు. అనుకున్నది అనుకున్నట్టు జరగడం వుండదు.

భారతి తన అలవాటు ప్రకారం సావిత్రికి ఖాతాపుస్తకం చూపించింది భారతి కర్నూలుకు వచ్చేప్పుడే సావిత్రి ఓ ఖాతా పుస్తకం ఇచ్చి పంపింది. ఇంట్లో జమా ఖర్చు తెలిసినట్టు వుంటుందని ''ఇదంతా మీ మామయ్య ఆడిటరీగిరి నిర్వాకం - '' నవ్వుతూ భారతికి లెక్కలు వ్రాయడం చూపించింది

భారతి కూడా సావిత్రి గానీ రామనాథం కానీ ఏనాడు అడకపోయినా తనే సెలవలకి వచ్చినపుడల్లా సావిత్రికి చూపిస్తుంది -

ఆ పూట లెక్కల చూపిస్తూ వుంటే "గీత తీసుకున్నవి" అంటూ వ్రాసిన డబ్బంతా కూడి సావిత్రి నోరెళ్ళ బెట్టింది

"ఇదేంటే భారతీ ఇలా విచ్చల విడిగా ఖర్చుపెట్టడం ? ఏం చేస్తుంది డబ్బులన్నీ ? "

"రోజు ఏవో ఫ్యాషన్లు మారుతూ వుంటాయి. కదత్తయ్యా - " భారతి నిర్లిప్తంగా అంది

"చూసారా - అత్తయ్య - ఈవిడిని కాదంటే ఎంత కుళ్ళో - ఆడ మనిషన్నాక ఎప్పుడు కాస్త శుభ్రంగా వుండకపోతే ఎట్లా అత్తయ్య ? " ఎప్పుడు వచ్చిందో కానీ గీత కళ్ళలో బొటబొట నీళ్ళు కార్చేస్తూ ముక్కు బరబరా చీదేస్తూ భారతిని దెప్పిపొడిస్తూ ఓ రాగం తీసింది "మీకేం తెలుసత్తయ్య వీళ్ళతో నేనెట్లా వేగుతున్నానొ - ఈ మహాతల్లి కేమో పెళ్ళయ్యి మొగుడు దగ్గరలేక - నేనూ నా మొగుడూ సుఖంగా కాపురం చేసుకుంటే చూడలేక కళ్ళల్లో నిప్పులు పోసుకుంటుంది మేం గదిలో వున్నామంటే ఎప్పుడూ తలుపు సందులోనూ, కిటికీ సందుల్లోనూ చూసి ."

భారతి ఏడుస్తూ బయటకు వెళ్ళిపోయింది

"ఆ కల్యాణికి ఇంకా పెళ్ళి పెటాకులు లేవు - నేను నా మొగుడు మాట్లాడుకొన్నా వళ్ళంతా కళ్ళు చేసుకొని చూస్తుంటుంది - ఛీఛీ లేకిమంద ! అయినా మనలో మాట వెన్నుముదిరి పోవట్లా - ఆ కల్యాణికి ఓ సంబంధం చూడకూడదూ - "

గీత చివర్లో ఓ దీర్ఘం తీసింది.

'హవ్వ - కనీసం కల్యాణి నా కూతురని కూడా గీత కెట్లా గుర్తులేదు. నోటికెంత వస్తే అంత మాట్లాడేయడమేనా ?' సావిత్రి నోరు నొక్కుకుంది.

"నేనెంత తిప్పలు పడి వీళ్ళకి కాపలాలు కాస్తున్నానుకొన్నారూ ? అసలు ఇంటికి వచ్చే మగాళ్ళందరితో ఈ వదిన ఇక ఇకలు పకపకలుతో ఎట్లా కులుకులు పోతుందో - క్లాసుమేట్స్ అంటూ ఆ మరదలు ఎట్లా కులుకుతుందో మీరు కనక చూస్తేనా - "

గీత చెంప చెళ్ళు మంది. కల్యాణి పళ్ళు పటపట లాడిస్తూ చరచర బయటకు వెళ్ళిపోయింది

కుసంస్కారం ఎంత నీచంగా మాట్లాడిస్తుందో కళ్ళారా చూసిన అనూరాధ నిశ్చేష్టురాలై పోయింది. ఆమె మనసులో తెలియకుండానే అత్తరూపం మెదిలింది. 'కుసంస్కారానికి ఓ ప్రాంతంలో పని లేదు. మనిషెక్కడ వుంటే సంస్కారమెక్కడ వుంటే పక్కనే కుసంస్కారం వుంటుంది.'

అనూరాధ నిట్టూర్చింది.

❋ ❋ ❋

"ఒరే సవారీ - ఇక్కర్రా ' తిమ్మడు సారా కొట్టు ముందు నుంచి కేకేసాడు

సవారి ఒక్క క్షణం తటపటాయించాడు

"నువ్వే ఇక్కర్రా - " తిమ్మడ్ని పిలిచాడు

తిమ్మడు ఓ ముఖ్యమైన పని మీద సవారిని కలవాలనుకొంటున్నాడు పని తనది కనుక బుద్ధిగా సవారి దగ్గరికి వెళ్ళాడు

"ఎక్కణ్ణో పోయొస్తున్నవ్ ? " సవారిని పరామర్శించాడు

"చేల మందు కొట్టిన, గీపొద్దు నీళ్ళిడిసివస్తి - "

"ఏమేస్తివి ? "

"బుడ్డలు[1]"

"అవ్‌గాని, ఇక్కర్రా - జర ఆరాంగ మాట్లాడేదుంది నీతోన - " అంటూ కాలువ కల్వర్టు మీదికి తీసుకెళ్ళాడు.

ఇద్దరూ ఎదురు బొదురుగా కల్వర్టు ఆ గట్టు మీదొకరు ఈ గట్టు మీదొకరు కూర్చున్నారు.

"అవ్‌గాని, నువ్వు ఇయ్యాల రేపు గీ దిక్కు వొస్తలేవూ - " తిమ్మడు నెమ్మదిగా అడిగాడు

"గీ దిక్కు రానింకె నాకేం పనుంది ? "

"మంచి సారా వచ్చె నిన్ననే లారీ దిగింది - కాపుసారా - ఒక్క సీసా తాగ్తవా" ?

"నేను తాగ్తలేను గీ పొద్దు ముచ్చట్నా - ఎప్పుడో ఇడిస్తి - " సవారి కళ్ళముందు రామనాధం మెదిలాడు. "నీకు గిట్ల తెల్వదా ? మల్ల కొత్తగ అడుగుడేంది ! "

"గౌండ్లోని తానకు పోతవనుకుంటి "

సవారి ఏం మాట్లాడలేదు

"మల్ల పొద్దస్తమానం ఏం జేస్తున్నావ్ ? "

"అయ్యోల్ల పొలం పనులు - నా సేను సేద్యం చేస్కోవాలలె తీర్తదాతియ్"

"అవ్ లే - నీవు సేద్యగానివి గాదూ - "

"అవ్ తిమ్మ - ఆ పొద్దు అయ్యకోపం చెయ్య బట్టి గింత పొలం కొంటి - పంట పంటకు నా బిడ్డకు సొమ్ము ల్జేయిస్తి "

"ఎంత సేనుందె నీకు ? "

"ముంగట నాల్గెక్రాలు కొంటి ఇప్పుడు మెల్లంగ పదెక్రాలు జేస్తి" -

"ఇంగ కొనలేవు - ఒక్క పొద్దుల సేలు పిరమైపాయె [2] - " తిమ్మడు పెదవి విరిచాడు

"అవ్ గాని నీ వెందుకు పిల్చినవ్ ? గా ముచ్చటేందో జల్దీ చెప్పు మల్ల పోవాలె -"

"ఏం లేదురా సవారీ - రాంనగర్ కాల్వ పక్కన ఒక్క దుక్నం పెట్టమని - నువ్వు గిట్ల చూస్కుంటావ్ రా -"

సవారి చివ్వున లేచి నుల్చున్నాడు. కోపంగా అరిచినట్లు అన్నాడు

---

1 వేరుశెనగలు  2 ఖరీదైపోయె

"నీకే మన్న తిక్కగిట్ల పట్టిందా ? రాంనగర్ల తాగెటోల్లు ఎవ్వరు ? నువ్వు ఇక్కడోల్లను చెర్చింది గాక గా వూర్ల మురలం పెడతావ్ ?"

తిమ్మడు పగలబడి నవ్వాడు

సవారి కోపం అంతా ఆశ్చర్యంగా మారి పోయింది

"ఒరే పాగలోడా, లారీ సారా దిగిందంటె ముందుగాల సగం సరుకు మీ రాంనగర్‌కు పంప్త - సమజయిందా ? వాల్లు ఇండ్లల్ల కూసోని తాగుతున్రు - చేలల్ల కూసోని తాగుతున్రు గుడిసెల్ల దూరి తాగుతున్రు - ఇంటివా ?"

సవారి తెల్ల మొగం వేసి చెవులప్పగించాడు

"గా కస్తూరి ఉంది చూడు - " తిమ్మడు కన్ను గీటాడు, "గామె వూర్ల కొచ్చి నంక నాయాపారం నిలబడ్డది ఎనక తలుపులోంచి గా చిట్టిబాబు ఆమె ఇంట్లో దూరుతుండు ముందు తలుపులోంచి నా సారా సీసా దూరుతుంది "

"పోయి పోయి గా పాడు మొగం దాని మాట ఎత్తినవ్ ? మొగున్ని చేనికి తోలి రండోణ్ణి పిల్సుతది"-

"ఇయ్యాల రేపు జమాన ముంగట తీరుంగ లేదు పత్తి ఏసెంటందుకు వొచ్చిన్రు చూడు గీ లింగయ్య చిట్టయ్య - సాంబయ్య వోల్లంతా గా రాంనాథం వాళ్ళ తీరుగలేరు పత్తి పంటల దుడ్లు మస్తుగ ఎల్తున్నాయ్. వొకన్ని జూసి ఒకడు తాగ మర్లిండు "-

సవారికి చిరచిర కోపమొచ్చింది రామనాథం పేరును కొత్త వారితో కలిపి వుచ్ఛరించడం సవారికి చిరాకు పుట్టించింది

"అవ్ గాని - నీ ముచ్చట చెప్పు-"

"ఏమున్నది ? సారాకొట్టు నడుపురా - నా తీరుగ బాగు పడ్తవ్ - నీకు సప్లై గిట్ల నేను చేస్తా - లాభాలు బరాబర్ తీస్కుందం-"

"నేను సెడిందె మేలు ! నన్ను గిట్లనే ఇడ్సు -" సవారి చకచక కాలువగట్టు పడ్డాడు.

"నా తీరున బాగు పడ్తవ్ - ధుత్ - నీయమ్మ !" సవారి గొణుకున్నాడు

"పాగలోడు" తిమ్మడు తుపుక్కన పక్కకు ఊస్తూ గొణుకుంటూ,

"ఒరే సవారిగా - మా దొరొస్తుండు నేను సారా దుక్నం పెడ్తున్న - పోయి మీ దొర తోన చెప్పురా-"

గట్టిగా అరిచాడు తిమ్మడు.

సవారి చిరాగ్గా ముఖం చిట్లించి చరచర వెళ్ళిపోయాడు -

"దొంగ ముండ కొడుకు - వాడు చెడింది కాక నన్ను గిట్ల చెడమంటుడు" సవారి తిట్టు కుంటూ వెళ్తుంటే మళ్ళీ ఎవరో కేకేసారు.

"సవారి - జర ఆగురా-"

"మల్ల ఎవ్వడు పిల్వ బట్టిండు ?" సవారి చిరాగ్గా వెనక్కి తిరిగాడు పొలాలకు అడ్డం పడి రొప్పుతూ రోజుతూ సవారిని ఆగమని సైగచేస్తూ దస్తగిరి పరుగెత్తు కొంటూ వస్తున్నాడు

"వీడు మల్ల పల్లెల దూరిండా ?" సవారి నోరెళ్ళ బెట్టాడు

"ముంగట కన్నా బలిసిండు[1]-" దస్తగిరి ఇంతకు ముందు కన్నా బాగా నునుపుతేలాడు

గ్లాస్కో పంచలోంచి కనబడుతున్న అతని కాళ్ళకు సవారి ఆశ్చర్యంగా చూసాడు

"మంచిగున్నవా ?" దస్తగిరి ఆప్యాయతంతా ఒలక బోస్తూ అన్నాడు

"నాకేం మంచి గున్న ? నీ తీరు చూస్తున్న - దుబ్బగయినవ్ - అవ్‌గానీ గా కాళ్ళు కన్పడేట్టు పంచలు కట్నవేమి ?" సవారి పకపక నవ్వుతూ అన్నాడు

"మంచిగ లేవురా - ఇయ్యల్రేపు పత్తేయనింక వచ్చేటోల్లంతా గిదె కడ్త లేరా ?" దస్తగిరి ఉక్రోషంగా అన్నాడు

సవారి నవ్వుతూనే దస్తగిరిని పై నుంచి కిందికి పరిశీలనగా చూసాడు

తుమ్మ చెక్కకు పంచె చుట్టి దిష్టి పిడత తగిలించి నట్లున్నాడు దస్తగిరి

"గా లింగయ్య తెచ్చిండు దుడ్లు మస్తుగయి తయంట గివి కొననింకె -" దస్తగిరి చిన్న పిల్లాడిలా అన్నాడు.

"నాకే మెర్క ? నేనే మన్న వాల్ల పొంటి తోక తీర్న తిరిగ్నవా ?" సవారి దస్తగిరికి ఓ చురక అంటించాడు

"సరెగాని - నీ సేద్య మెట్లుంది ? ఏ మెస్నవ్ ?" సవారి చెప్పాడు

"ఆ . గా బుడ్డలు ఏ మెల్తయ్ తియ్ - " దస్తగిరి పెదవి విరిచాడు

"నా మాట ఇన్న వంటె నీకు మంచి బేరం చూపెడ్త"

"ఫాయిదా లేదు[2]. నువ్వెన్ని జెప్పినా నేను నీకు బేర మివ్వ. అయ్యోళ్ళు పడమటి చేల బుడ్డలు పెట్టిన్రు . వాల్ల తోన నావి సంతకు తోల్త"

"నీ కడుపు చల్లగుండ ! నేను జెప్పేడ్డి బుడ్డల బేరం గాదురా ! నీ సేను ! ఇయ్యలరేపు ఎంత మందికి సేలు బేరమిప్పిచ్చా - నీ ఏడెక్రాలకు డెబ్బై వేలిప్పిస్తా. మల్ల మల్ల అంత దుడ్లు చిక్కె బేరం దొరుకు తాదిరా - " దస్తగిరి సవారి మేలు కోరే వాడిలాగా ఆప్యాయత వొలక బోస్తు చనువుగా అన్నాడు.

సవారికి అప్పుడు అర్థమైంది. ఇంతవరకు ధాన్యం బేరగాడు కనుక తన చేలోకి వేరుశనగల విషయం మాట్లాడుతున్నాడనుకొన్నాడు. అసలుకే ఎసరు పెడుతున్నాడే వీడు-

" నాకేమవసరం ? నేనమ్మ !"

"గా బుడ్డలు - జొన్నలు - ఎన్ని దినాలేస్తవ్‌రా ? పత్తి ఏస్నవంటే దుడ్లు మస్తుగ వొస్తయ్

---

1. లావెక్కాడు 2. లాభంలేదు

- పత్తి ఏసేద్దీ నీ తరమా నా తరమా ? ఎన్ని దుత్తు దాని మొకంల కొట్టాలె - పత్తి ఏస్నవా నీ సేను బంగారం - కాదన - మన చేత కానప్పుడు మంచి బేరం చిక్కంగనే అమ్ముకుంటే నాల్దినాలు పిల్లపాపలు పచ్చంగుండరా '

" తూ నీయమ్మ -" సవారి గొణుక్కుంటూ తుపుక్కున పక్కకు ఉమ్మేసాడు ' పంట మీదున్న సేనును అమ్మక తినమంటవ్ ?"

"ఏమిరోయ్ - నోరుగిట్ల పెరగబట్టే - గా రాంనాధంని జూస్కోని కండ్ల పార కమ్మినట్టుంది ఎంతయినా మనం మనం ఒక దిక్కోల్లం మనం ఒకమాట మిందుండాలె - మంచి బేరం - నీ బిడ్డకు పెండ్లి జేయచ్చు -"

"సేనమ్మి గాని పెండ్లి చేయలేనా - ఎట్ల ? అయినా గాని మావోల్లు ఓలిఇస్తరు మా పొట్టి గా సావిత్రమ్మ పున్నాన నాల్గు ముక్కలు సదవ నేర్చింది మా పొట్టిని అసుమంటి ఇసుమంటోన్కి స్తనా ? ఎవ్వడైతే సేద్యం చేసి నా సేనును నిలబెడ్తడొ వాన్కె ఇస్త"

"అది అయ్యేడి ముచ్చట గాదులె - మీ వోళ్ళల్ల ఎక్కడ దొరకాలె అందరు గాసగాళ్ళు కారె -"

"ఓ - దొరా - గిట్లిను - గా కాలం పాయె - మా వోళ్ళు సేద్యం నేర్చిన్రు, సదువు నేర్చిన్రు నా తీరున నా పూడూరు సుట్టాలు గా రాంనాధమయ్య మాట ఇనుకోని సేలు కొన్నారు గీ పొద్దు సేద్య గాని తీరున రొమ్ము ఇరుచు కున్న మంటే అయన మాట ఇన బట్టె గీ పొద్దు సిగ్గు శరం లేకుండా మనం మనం ఒక దిక్కు అనుకుంట సుట్టరికం కల్ప నింకె వచ్చినవ్ ? ఏం రా మమ్మల మల్ల గాస గాళ్ళు చేసి గాని వొదలవా ? నీ పెండ్లం పుస్తెలు తెగ -! గా రాజయ్య వుసురు పోసుకొంటివి - మల్ల ఎవ్వల ముంచ నింకె ఈడ అడుగు పెట్టినవ్ - నీయమ్మ -!" సవారి తిట్లు లంకించుకొన్నాడు

"చిల్లరోని తానకు చిన్న పిల్లల తానకు పోరాదకి ఊకే అన్నార్రా - నాబుద్ధి గడ్డి మేసి నీ మేలు కోరి నందుకు మంచి పారం చెప్పినవ్ - ధుత్ - నీయాలి !" దస్తగిరి కూడా అదే తరహాలో తిట్టాడు అంతలోనే అతనికి అవతలి పార్టీ వారు ఆ చేను బేరం కుదిరిస్తే ఇస్తామన్న కమీషన్ కళ్ళ ముందు మెదిలింది.

ముఖాన ఉమ్మేసినా తుడుచుకు పోయే గుణం వున్నవాడు. కాబట్టే ఇన్నాళ్ళు వీళ్ళ మధ్య నెగ్గుగురాగలుగు తున్నాడు

సవారి మీద బుస్సున లేచిన కోపాన్నంతా - బలవంతంగా అణుచుకొని నెమ్మదిగా అన్నాడు

"మల్ల ఓ పారి సోంచాయించు[1] - బేరం మంచిగుంది లేదంటవా - వాళ్ళకే మగతానియ్యి - మంచి రేటిప్పిస్తా-"

"మల్ల చెప్తున్న ఇను ! నా పానమన్న ఇస్తగాని నా సేను ఇవ్వ ! ఇస్తినంటే నా బిడ్డకే ఇస్త - సమజయిందా[2] ?"

సవారి గర్జించాడు.



1 ఆలోచించు 2 అర్థమయ్యిందా

"పిన్నీ . పిన్నీ.. " శివుడు కేకలేస్తూ ఇంట్లోకి వచ్చాడు ఈ మధ్య కాలంలో శివుడంత సంతోషంగా వుండడం ఇంట్లో ఎవ్వరూ చూడ లేరు చిన్న పిల్లాడిలా పరుగెత్తు కొంటూ వచ్చి, తలకు గుమ్మం కొట్టుకోబోయి - తమాయించుకొని - ద్వార బంధం పట్టుకొని లోపలికి చూస్తూ కేకలేసాడు.

"ఏమయిందిరా ?" సావిత్రి గబగబ వచ్చింది

అప్పుడే దూడలొదల బోతోన్న రత్తయ్య, పాల తపేలాలు సిద్ధం చేస్తోన్న శాంతమ్మ పరుగు పరుగున వచ్చారు

గట్టు మీద కూర్చుని కూతురి వంటికి వెన్న పూస పట్టిస్తోన్న అనూరాధ కూడా కుతూహలంగా తలెత్తి శివుడి వైపు చూసింది

"మన వూరికి కరెంటు వచ్చేస్తోంది - పిన్నీ ! ఈ పూటే డిపార్టుమెంట్ వారి లారీ వచ్చి సిమెంట్ స్తంభాల్ని మన యింటి ముందే దించి వెళ్ళింది-"

"నిజంగా శుభవార్త రా - వుండు నీ నోట్లో ఇంత పంచదార పోస్తాను -" సావిత్రి గబగబ లోపలికి వెళ్ళింది.

"అంతా నీ కూతురు పుట్టిన వేళావిశేషమే అనూరాధ" శాంతమ్మ అనూరాధ కూతురి బుగ్గలు పుణికింది

కూతురితో పాటు అనూరాధ సంతోషంగా నవ్వింది

"అమ్మాయ్, సావిత్రి ఓ నిమిషం ఉండు గభాల్న పాలు పిండు కొస్తా కానీ, కాసిని సగ్గుబియ్యం మేసి పాయసం చేద్దువు."శాంతమ్మ గబగబ వెళ్ళింది

"ఏంటింత ఆలస్యం. అవతల పాలకేంద్రం మూసేస్తారు తొందరగా కానీయి మన పాల తపేలాలు ముందెళ్ళాల -" రత్తయ్య శాంతమ్మను తొందర చేసాడు.

"సంబడమే- ! అబ్బాయి ఆ ఆవుల్ని గేదెల్ని కొనిచ్చి మిమ్మల్నట్టా పనిలో పడేయ బట్టి కానీ లేపోతే మా పాణాలు తోడేద్దురు-" శాంతమ్మ పాల తపేల తీసుకొని ఆవు దగ్గరకి వెళ్ళింది.

గోబర్ గ్యాస్ ట్యాంక్ లో పేడ వేసి కలుపు తోన్న బీసిగాడు కిసుక్కున నవ్వాడు.

"ఒరేయ్ - బీసి ! పదారు పళ్ళు కన్పించాయ్ గానీ - ఆ పేడలో ఓ కడవ నీళ్ళు పోసి తగలడు -" శాంతమ్మ కస్సుమంది.

బీసిగాడు ఆమె కోసం పట్టించు కోకుండా మళ్ళీ నవ్వాడు.

"రేపట్నించీ పేడంతా పెంట పోగు పాలేగా-" శాంతమ్మ ఓ దీర్ఘం తీసింది.

"ఆ గోబర్ గ్యాస్ పున్నాన రెండు, లైట్లు ఎలుగు తున్నాయ్-"

"ఆ - ఆ కరెంట్ వచ్చుద్దీ చచ్చుద్దీ-"

"సందేళ ఏంటా మాటలు ?"

"మరే !" శివుడు వచ్చి అన్నాడు "నాన్న అన్నమాట కూడా నిజమేనమ్మా - తూములు తెచ్చి వేసెళ్ళాక కాలువలు ఎన్నాళ్ళకు వచ్చాయను కున్నావ్ ? కాకపోతే ఎప్పటికో ఓ అప్పటికి వస్తాయన్న ధైర్యం అంతే !"

"ఒరేయ్ శివుడూ - కాస్తీ పాలు కేంద్రంలో పోసిరారా- మీనాన్న అప్పుడే కేకలేస్తన్నాడు -"" శాంతమ్మ చిక్కటి నురగ పైదాకా వచ్చిన పాల తపేలాను అందించింది

శివుడు పాలు తీసుకొని కేంద్రానికి వెళ్ళాడు

పాలకేంద్రానికి రామానాధమే ధరఖాస్తు పెట్టాడు

గద్వాల నుంచి పాల వ్యాను వచ్చి పొద్దున్నే ఖాళీ క్యాన్లు వేసి వెళ్తుంది. క్యాన్లలో పాలు సేకరించాక మళ్ళీ గద్వాల తీసుకెళుతుంది పాల కేంద్రం ఉద్యోగి ఓ చిన్న టేబుల్ మీద పాలసాంద్రతను కొలిచే పరికరాలు పెట్టుక్కూర్చున్నాడు. తీసుకెళ్ళిన వారి పాలు కొలిచి పోసుకొనే ముందు - పరీక్ష నాళికలోని కొన్ని పోసి - పిల్లర్‌తో ఏవో రసాయనాలు వేసి అటూ ఇటూ కుదిపి టెస్ట్‌ట్యూబ్ స్టాండ్‌లో కాసేపు కదలకుండా వుంచుతున్నాడు

ఆ తరువాత రీడింగ్ చూసి - తెచ్చిన పాలకి రేటేస్తున్నాడు. ఏ పూట ఆ పూట కొత్తగా ఈ పద్ధతులు పాటించాల్సిందే.

"ఎంత రేటు ? " శివుడు కుతుహలంగా అడిగాడు

"రెండ్రూపాయలు "

"ఇంత చిక్కటి పాలకా ? కర్నూల్లో మా వాళ్ళు మూడు రూపాయలు పెట్టి కొంటున్నారు వొట్టి నీళ్ళు - "

"మేమేం చేయం సాబ్ ?" అతను నవ్వాడు.

ఒక్కొక్కళ్ళుగా పాలు తీసుకురావడంతో శివుడు పక్కకెళ్ళి నిలబడ్డాడు

పంట సొమ్ము చేతికందుతున్న తరుణం ఈ యేడు ప్రత్తి పంట అందర్నీ ఒడ్డున పడేసింది.

కొత్తగా ఆ ఊరికి వచ్చిన రైతులు మొదటి పంట ఫలాన్ని అందుకున్న వారు మరీ ఉత్సాహంలో వున్నారు.

శివుడు కాసేపు వచ్చేపోయే వాళ్ళని పలకరిస్తూ అక్కడే వున్నాడు. నెమ్మదిగా ఇంటివైపు వెళ్ళాడు. దడి మీదుగా పాలతపేలాను శాంతమ్మ చేతికి అందించి - బస్‌స్టాండ్‌లా వ్యవహరించబడే తుమ్మ చెట్టు కిందికి వెళ్ళాడు.

వాళ్ళు ప్రత్తి కోసం సున్నం మిద్దె కట్టినపుడు మిగిలిన లావాటి రాళ్ళను రత్తయ్య ఆ చెట్ల చక్కగా పరిచాడు. ప్రయాణికులు కూర్చోనేందుకు వీలుగా వుంది.

రోడ్డు ఈ చివర్న నుంచి ఆ చవర వరకు రత్తయ్య నాటిన వేపచెట్లు బాగా ఎత్తు ఎదిగాయి.

"నమస్తే అన్న మంచిగున్నవా ? " ఒకతను పలకరించాడు

శివుడు అతని వంక ఆశ్చర్యంగా చూసాడు. మసక చీకట్లో ఆ మనిషి ఎవరో పోల్చుకోలేక పోయాడు

"నేనన్నా - మానాన్న కుండలు తెస్తుండె చూడు - మా నాయన ఎనక వస్తుంటి - " అతను నవ్వాడు

"అరె - నువ్వా ఎంత పెద్దాడివయ్యావ్ ? గుర్తేపట్టలేక పోయా-"అవునూ - ఈ గిన్నె లేంటి ? " శివుడు ఆశ్చర్యంగా అతని పక్కన తట్టలో వున్న పెద్ద పెద్ద జర్మన్ సిల్వర్ గిన్నెల్ని చూపిస్తూ అడిగాడు

"అవ్ - అన్నా - ఇయ్యాలరేపు కుండ లెవరు కొంటుర్రు - పత్తి చేలకు మందులు కొట్టి - ఆ డబ్బాలు ఏసి గిన్నెలు కొట్టుర్రు - ! నేను గిట్ల అట్లనే గిన్నెలు అమ్ముతున్నా - " నవ్వాడతను

"నీ వ్యాపారం ఎలా వుందేం ?"

"మంచి గున్నది "

ఇంతలో లారీ వేగంగా వచ్చి వాళ్ళింటి ముందు ఆగింది. శివుడు గబగబ దాని దగ్గరికి వెళ్ళాడు.

లారీ క్యాబిన్ లోంచి రామనాథం సుధాకర్ దిగారు

"జాగ్రత్త , జాగ్రత్త - " శివుడూ వారికి చేయి అందించాడు.

"ఏంటి బాబాయ్ - వెళ్ళి నాళ్ళు వెళ్ళి నట్టే ఎళ్ళారు ? "

"జిన్నింగ్ అదీ అవ్వద్దంట్రా ? అందులోనూ మనవి ప్రత్యేకంగా వేయించాలయ్యే - పది బస్తాలు దించుకుందాం "

శివుడు - సుధాకర్ గోతాన్ని అటూ ఇటూ పట్టుకొని తెచ్చి ఇంట్లో పడేసారు.

అన్ని గోతాల్ని దింపేసి లారీ వెళ్ళిపోయింది.

"ఎవరిదో ప్రత్తిలారీ - సరుకు దింపేసి ఈ పక్కకి వస్తుంటే దాంట్లో వేసుకొని వచ్చేసాం. మళ్ళీ లారీ ఖర్చేందుకు లెమ్మని ? "

"ఎన్ని క్వింటాళ్ళయ్యాయిరా ? " శివుడు సుధాకర్ని వుద్దేశించి అడిగాడు.

"పది క్వింటాళ్ళు నికరం - "

"అంటే ఎకరానికి నాలుగు క్వింటాళ్ళ మాట ! "

"అవున్రా ! ఆ సింధనూరు వాళ్ళు ఎకరానికి ఎనిమిది క్వింటాళ్ళ విత్తనాలు తీస్తన్రా - " రామనాథం దిగులుగా అన్నాడు

"ఎక్కడలేనాన్నా - ఆ కూలీలకి ఇంకా క్రాసింగ్ చేయడమే కుదరకపోయే - క్రాసింగ్ చేస్తున్న మొగ్గల కన్నా వదిలేస్తున్న మొగ్గలే ఎక్కవయి పోతున్నాయి. - వచ్చే ఏడాది మనం కూడా పుంజుకుంటాంలే నాన్నా " అన్నాడు సుధాకర్

శివుడూ - రామనాథం ఒకేసారి ఆనందంగా ముఖాలు చూసుకొన్నారు.

"అయితే వచ్చే ఏడాది కూడా హైబ్రీడ్ సీడ్స్ కోసం ప్లాట్ వేద్దామంటావ్ !"

"మాట వరసకన్నాను ! " సుధాకర్ తీవ్రంగా అన్నాడు

"స్నానాలు చేసిరండి - భోజనాలు వడ్డిస్తాను - "

సావిత్రి వచ్చింది

అది రైతులందరూ పంట డబ్బు అందుకొని నిమ్మళించే సమయం పని వత్తిడి నుంచి తేరుకొని విశ్రాంతి తీసుకొనే సమయం పిల్లల పెళ్ళిళ్ళు పేరంటాలు చేసుకొనే సమయం బంధువుల్ని మిత్రుల్ని కలిసి వచ్చే సమయం

వరి పండించిన వారు గడ్డివాము వేసుకొని - పురులు కట్టుకొని ధాన్యం ఆరపోసుకొంటూ వుండే సమయం

పత్తిపంట రైతులు పరిగపత్తి పీకేస్తున్నారు పత్తి కంప కొట్టేసి - ఇళ్ళకు తెచ్చి - పంటకు గాను చక్కగా పేర్చిపెడుతున్నారు కొందరు పిల్లపిసరో - పశువుల మేతొ దేలల్లో వేసి నింపాదిగా ఇళ్ళల్లో విశ్రాంతి తీసుకొంటున్నారు

సరిగ్గా అదే సమయంతో రామనాథం వాళ్ళయిల్లు పని వత్తిడిలో మునిగి వుంది

అందులోను ఆ పని వారింతకు మునుపెన్నడు చేసిన పని కాదు పిల్లలతో సహా కల్యాణి, భారతి సెలవలకు ఇంటికి వచ్చారు సరళ, పద్మ వాళ్ళపిల్లలతో పాటు ఇక్కడే వుంటున్నారు అల్లుళ్ళు - భాస్కర్, ప్రసాద్ భోజనాలకి అదీ ఇక్కడికే వస్తున్నారు అనూరాధ ఇంకా అక్కడే వుంది

గీత అంటీముట్టనట్లుగా ఏ సీంతుమ్మ చెట్టు కిందో కూర్చుని, వస్తూ వస్తూ తనతొ పాటు తెచ్చుకున్న డజన్ల కొద్దీ నవలలని చదివే పనిలో మునిగి వుంది.

గీత కూతురు ఇప్పుడు చక్కగా నడవ గలుగుతోంది. కనుక పిల్ల బాదరబందీ కూడా గీతకు లేదు అందరి పిల్లలతో పాటూ ఆ పాప కింద పడుతూ మీద పడుతూ ఆడుకుంటోంది అందర్లోకి అనూరాధ కూతురు చిన్న దవడంతో అందరి మురిపాలు అందుకొంటోంది

అటుపోతూ ఇటుపోతూ మల్లేశ్ వచ్చి కూతుర్ని చూసుకెళుతున్నాడు.

ఇల్లంతా పెళ్ళిసందడి లాగా వుంది

రామనాథం జిన్నింగ్ చేయించుకుని వస్తూవస్తూ సీడ్ సర్టిఫికేషన్ ఏజన్సీ వారికి - ఈ విషయాన్ని తెలియజేస్తూ టెలిగ్రాం ఇచ్చి వచ్చాడు.

వాళ్ళ తరుపున ఒక ఉద్యోగి వచ్చి ఆ బస్తాలోంచి ఈ బస్తా లోంచి - నమూనాలు సేకరించాడు.

రామనాథం వాళ్ళ ప్రయోగం ఎంతవరకూ ఫలించిందీ తెలియజేసే పరీక్ష జెర్మినేషన్ టెస్ట్ కోసం ఆ విత్తనాలు వెళ్ళాయి.

జెర్మినేషన్ టెస్ట్‌లో ఆ విత్తనాల్లోని మొలక శాతం, శుద్ధత తెలుస్తాయి సేకరించిన సాంపిల్స్ లోంచి వంద విత్తనాలను నాటి అవి మొలిచిన తరువాత - ఎన్ని రోజులకు మొలిచినదీ - ఎన్ని మొలిచినదీ - మొలిచిన మొక్కలన్నీ ప్రస్తావించిన సంకర జాతికి చెందినవేనా - మరే యితర జాతి విత్తనాలు కలిసాయా - అన్నింటిని పరీక్షించి - ఓ రిపోర్ట్ ఇస్తారు. ఇదిగ్రోఅవుట్ టెస్ట్

ఆ రిపోర్ట్‌ల ఆధారంగా సాంపిల్ తీసుకొచ్చిన సీడ్‌ను మార్కెట్‌లో విడుదల చేసేది చేయనిది ఏజన్సీ నిర్ణయిస్తుంది

ఏజన్సీ వారి టెస్ట్‌లో నెగ్గిన సీడ్‌ను వారి సంబంధిత సీడ్ ఆఫీసర్ సమక్షంలో ప్యాకింగ్ చేయాల్సివుంటుంది ప్రత్తి సంచి మీద ఏజెన్సీ వారు ఇచ్చిన రిపోర్టు ప్రకారం వివరాలన్నిటిని తెలియజేసే ట్యాగ్ ఒకటి ఉండాలి ప్రత్తి ట్యాగ్ మీద సీడ్ ఆఫీసర్ సంతకం తప్పనిసరిగా వుండాలి సీడ్ ఆఫీసర్ సమక్షంలో ప్రతి విత్తనాల సంచి సీల్ చేయాలి.

ఏజెన్సీ వారు రిజెక్ట్ చేసిన సీడ్‌ను హైబ్రీడ్ సీడ్‌గా మార్కెట్‌లో విడుదల చేయడం శిక్షార్హమైన నేరం

పొలం మీద హైబ్రీడ్ సీడ్స్ ఉత్పత్తి కోసం వేసిన ప్రత్తి ఏ దశ నుండైనా మార్కెట్‌లో అమ్మకానికి వున్న దశ వరకు ఎప్పుడైనా ఏజెన్సీ వారు ఆ సీడ్స్‌ను టెస్ట్ చేయవచ్చును.

హైబ్రీడ్ సీడ్స్ ఉత్పత్తిలో క్రాసింగ్ కున్నంత ప్రాధాన్యత ప్యాకింగ్‌కు వుంటుంది

రామనాథం జెర్మినేషన్ టెస్ట్‌కు సాంపిల్స్ పంపినప్పుడే - తనూ ఓ తట్టలో మట్టి వేసి - వంద విత్తనాలు నాటాడు.

అట్లాంటి మూడు తట్టలను ఎండలో పెట్టకుండా పందింట్లో పెట్టి నీళ్ళు చల్లుతూ వచ్చాడు.

తన మొదటి ప్రయత్నం రిజెక్టు అవుతుందని నిర్ణయానికి వచ్చేసాడు.

కానీ, వారం నాటికి ఆ సీడ్ జెర్మినేషన్ టెస్ట్ పాసయినట్లు ఏజెన్సీ వారు టెలిగ్రాం ద్వారా తెలియజేసారు.

సీడ్ ఆఫీసర్‌ను కలిసి లాట్ నంబర్లు తీసుకోమని కూడా తెలిపారు.

మహబూబ్‌నగర్‌లో ప్రత్తి విత్తనాలకు సంబంధించి ప్రత్యేక ఆఫీసర్ లేరు.

హైదరాబాద్ హెడ్ ఆఫీస్‌లో రామనాథం పండించిన పది క్వింటాళ్ళ ప్రత్తి విత్తనాలకి పర్మిట్ గ్రాంట్ చేస్తూ ఇచ్చిన ఉత్తర్వు తీసుకున్నాడు. వాళ్ళే లాట్ నంబర్లు జారీ చేసారు ఆ నంబర్లతో ట్యాగ్‌లను ఇచ్చారు.

సీడ్ ఆఫీసర్ ఫలాన తేదీన వస్తారని, అలోగా గ్రేడింగ్ చేసి, సిద్ధంగా వుండమని చెప్పారు

విత్తనాల సంచి సైజు దగ్గర్నుంచి సీల్‌వేసే లక్క వరకూ అన్నింటిలోనూ ధృవీకరణ సంస్థ ఏజెన్సీ వారి నియమ నిబంధనలని పాటించాలి ఏ ఒక్క విషయంలో ఉల్లంఘించినా చట్ట ప్రకారం క్షమించరాని నేరం

రామనాథం సుధాకర్ తెల్లని బట్ట తాను ఒకటి తెమ్మని పురమాయించాడు

భారతి వెళ్ళి వాళ్ళ అన్నయ్య వాళ్ళింటి నుంచి పాత కుట్టు మిషను తెప్పించింది

ఏజెన్సీవారు సూచించిన కొలతల ప్రకారం తానులోని గుడ్డను కత్తిరించి, సంచులు కుట్టారు.

ఇక ఆ విత్తనాలకు పేరు పెట్టి - ఓ ఎంబ్లెం తయారు చేసి - ఆ సంచుల మీద ముద్రించాలి.

రామనాథం ఆ ప్రయత్నంలో పడ్డాడు

❋ ❋ ❋

ఆ రోజు అనూరాధ కూతురికి అన్నప్రాసన

ఇంట్లో వున్న వారందరూ సంతోషంతో ఆ పనిలో పడ్డారు

పాయసం, పరమాన్నంతో సహా రకరకాల వంటలు వండడంతో ఆడవాళ్ళు మునిగి పోయారు.

మల్లేశ్ ఉదయాన్నే వచ్చాడు

అనూరాధ ఇంక ఈ కార్యక్రమం కూడా పూర్తి చేసుకొని అత్తారింటికి వెళ్దామని నిర్ణయించుకొంది

సున్నం మిద్దెలో పరిచిన నాపరాళ్ళు చల్లగా వున్నాయి

అందరూ చుట్టూ చేరి, పాపను నేలమీద బోర్లా పడుకోబెట్టారు పాపకు కాస్త దూరంలో ఓ పుస్తకం, పెన్ను, డబ్బులు, పాయసం గిన్నె, ఓ గొలుసు వరుసగా పెట్టారు. పాప పొట్ట మీద పాకుతూ దేనీ దగ్గరికి వెళ్ళుందోనని అందరూ ఉత్సాహంగా చూస్తున్నారు

పిల్లలందరూ పాప ముందు చేరి చప్పట్లు కొడుతూ గోలగోలగా అరుస్తున్నారు. "ఛీ ఛీ ."

"బుచ్చీ .. ఇటు రామ్మా ."

"కాదు........ ఇలా రామ్మా"

"ఈ పుస్తకం పట్టుకో - "

"ఆ గొలుసు పట్టుకోమ్మా - "

పాప అయోమయంగా అటూ ఇటూ చూస్తూ అనూరాధ వళ్ళో దూరుతోంది.

కల్యాణి అప్పుడు పీడియాట్రిక్స్ పారాల్లో వుంది. పాపను అమాంతం పెకెత్తి - అమ్మో అంటూ కింద పడేసింది

"అనూరాధ వదినా - దీంతో కష్టమేనే - ఐదో నెలవచ్చేసరికి పుట్టినప్పటి బరువు డబుల్ అవ్వాలా - ఇది నాలిగింతలు బరువెక్కి నట్టుంది ఇంకా పేరెట్లాగు పెట్టలేదుగా - మాయా శశిరేఖ అని పెట్టు - " కల్యాణి వేళాకోళాలాడుతూ అంది

"పోవే పాడుపిల్ల - పసి దానికి అలా దిష్టి కొడతావ్ - " శాంతమ్మ కోప్పడింది

"డబుల్ రోటి --"శివుడి కొడుకు ఆకాశ్ పాపని వెక్కిరిస్తూ బుగ్గగిల్లాడు

"ఊ ."పాప ఉంగా  కొట్టింది "అదుగో అత్తా, పాపకి ఆ పేరు నచ్చేసింది పిల్లలందరూ చప్పట్లు కొట్టారు

"అవును మామయ్య - పన్లో పని మా అమ్మాయికి ఓ పేరు పెట్టు మామయ్య - అనూరాధ రామనాథాన్ని ఉద్దేశించి అంది

"అడక్క అడక్క నాన్ననే అడిగావ్ ! ఇది భూమి, వాడు ఆకాశం వాడు సూర్యుడు ఆమె ఎండ ఈమె ఏరు ఆయిన గాలి ఈవిడ ఆకు - ఇంక మీ అమ్మాయికి మిగిలింది గట్టుపుట్ట - రెండింటిలో ఏది నచ్చితే , అది పెట్టుకో ! " కల్యాణి ఆటలు పట్టిస్తున్నట్లుగా అంది అందరూ నవ్వారు

ధాత్రి, ఆకాశ్, ఆదిత్య, రశ్మి, సరిత , హరిత, పవన్ - వుడుకున్నారు.

"పోవే అన్నిటికీ వేళాకోళాలే - " అనూరాధ ముద్దుగా విసుక్కుంది

"బాబాయ్ అనూరాధ కూతురితో పాటు మన విత్తనాలకీ పేరు పెట్టాలి - " శివుడు కల్పించుకొని అన్నాడు

"నీకెప్పుడూ ఆ గోలెరా " సావిత్రి శివుణ్ణి ముచ్చటగా విసుక్కుంది రామనాథం ఆలోచనలో పడ్డాడు అనూరాధ కూతురికి ఏం పేరు పెట్టాలి -

పాప పేరు ఆ దిక్కు ఈ దిక్కు శుభసంగమన్ని స్ఫురించాలి. పాపకు పెట్టాల్సిన సరియైన పేరు విశాలాంధ్ర - రామనాథం నవ్వుకున్నాడు.

హృదయాల స్పందనకు ప్రాంతం, కుదురు, సంప్రదాయం, ఆచారం, వ్యవహారం - అడ్డురావని నిరూపణకు పాప ప్రతీక

రెండు విభిన్న నేపథ్యాల సంగమ సాధనలోని సంఘర్షణను అధిగమించగలిగిన ఆప్యాయతకు ప్రేమకు పాప ప్రతిరూపం

కల్లా కపటాలను పటాపంచలు చేసి, మానవుల అందర్నీ కలపగలిగిన మహత్తర శక్తి గల ప్రేమ భావనకు పాప నిరూపణ.

అవును, పాప విశ్వమానవ ప్రేమ కాంక్షించే వారందరి భావన. ఈమె భావన.

రామనాథం సంతోషంగా పాపవైపు చూసాడు.

"నువ్వు నా పరువు తీయమాకే - వెళ్ళు - వెళ్ళి ఆ పుస్తకం తీసుకోవే పెద్దయ్యాక చక్కగా చదువొస్తుంది - నా బుజ్జివి కదూ - "అనూరాధ పాపమీదకు వంగి అంటోంది.

రామనాథానికి చటుక్కున ఏదో స్ఫురించింది

గబగబ లోపలికి వెళ్ళి గుప్పెడు ప్రత్తి విత్తనాలు తెచ్చి పాపముందు కుప్పలా పోసాడు

"పాప, ఇప్పుడు నీవేం ముట్టుకుంటావో ముట్టుకొమ్మా "పాప తలెత్తి రామనాథం వైపు చూసి బోసినోరు తెరిచి నవ్వింది మెల్లిగా పొట్టమీద పాకి తన ముందున్న వాటినన్నిటిని అటు ఇటు చూసింది

పెద్ద దానికి మల్లే తల ముందుకు వెనక్కు వూపింది

మళ్ళీ తలపైకెత్తి చకచక ముందుకు జరిగింది పిల్లలందరు ఉత్కంఠగా ఎదురు చూస్తున్నారు

"చూస్తుండు, పాప గొలుసు పట్టు కుంటుంది ! " గీత అంది

"నా స్టైత్ పెడతాను పట్టుకోవే - " కల్యాణి తమాషాగా అంది.

"పెద్ద డాక్టర్‌మ్మవుతావు - కల్యాణి దిగ్రేట్ లాగా - "

"పాయసం గిన్నె పట్టుకోమ్మా - జీవితమంతా పాయసంలాగా తియ్యగా వుంటుంది. " సావిత్రి అంది

పాప ఓ క్షణం అందరివైపు చూసి బోసినవ్వులు నవ్వింది. చకచక పాకుతూ నేరుగా విత్తనాల కుప్ప దగ్గరికి వెళ్ళింది.

ఎడం చేతిమీద వంటి బరువంతా వేస్తూ - పక్కకు వంగి - కుడి చేత్తో విత్తనాల కుప్పను చిందర వందర చేస్తూ కేరింతలు కొట్టింది

పిల్లలంతా సంతోషంగా చప్పట్లు కొట్టారు

పాప వాళ్ళ ఉత్సాహం చూసి, తనేదో ఘనకార్యం చేస్తోన్నట్లు బోసినవ్వులు నవ్వుతూ ఆ కుప్పను చెల్లా చెదురు చేస్తోంది.

రామనాథం ముఖం వెలిగిపోయింది. గుండె వుప్పొంగిపోయింది.

అనూరాధ ఏదో అంటూ పాప బుగ్గను ముద్దాడింది. మల్లేశ్ కూతుర్ని ఎత్తుకొని బుగ్గలు పుణికాడు

పాపమళ్ళీ కిందికి దూకాలని ప్రయత్నిస్తోంది.

పాప నరానరాల్లో ప్రవహిస్తోన్నరైతు రక్తం విత్తనాల్ని గుర్తించింది. ఆ రక్తమే తరతరాలుగా విత్తనాల్లో రైతు దాచి వుంచిన మమతానురాగాలను స్పందింపజేసింది విత్తనాల్లో రైతు జీవితం వుంది. విత్తనాల్లో రైతు ఆశ ఆనందం వున్నాయి. విత్తనాల్లో రైతు పెంపు సొంపు వుంది విత్తనాలే రైతు మనుగడకు మూలం.

రామనాథం మోకాళ్ళ మీద కూర్చుని,నేలమీద చెల్లా చెదురుగా పడివున్న విత్తనాలన్నిటిని పోగుచేసి గుప్పిట్లోకి తీసుకొన్నాడు విప్పార్చిన రామనాథం వెడల్పాటి దోసలి నిండా నల్లటి ప్రత్తి విత్తనాలు, రామనాథం అణువణువునా ఆనందం గెంతు లేసింది

గబగబ తల్లి అస్థికల మీద వేసిన మామిడిచెట్టు దగ్గరికి వెళ్ళాడు. చెట్టు కాయలు కాస్తోంది.

రామనాథం తన దోసిలిని చెట్టు కుదురు మీద ఆన్చాడు.

ఒకనాడు ఇదే దోసిలి నిండా నల్లరేగడి మట్టిని నింపుకొని తల్లిని అర్థించాడు. అన్నను బతిమిలాడాడు. మేనమామలను గెలిచాడు.

రామనాథం వళ్ళు పులకరించింది.

“అమ్మా నేను ఈ గనిగడ్డ నుంచి ఈ విత్తనాలు తవ్వి తీసాను ఈ విత్తనం మళ్ళీ రేగడిలో నాటుతాను. ఆ తుంగభద్రమ్మ ఆ విత్తనాన్ని తనివితీరా లాలించి - ముద్దాడుతుంది. పులకరించిన విత్తనం మొలకై నవ్వుతుంది. మొక్కై పెరుగుతుంది. కొమ్మలుగా శాఖలుగా విస్తరిస్తుంది. మొగ్గలై పూవ్వులై కాయలై ప్రత్తిలా విప్పారుతుంది.

ప్రత్తి !

చైనాకు పట్టులా ఈజిప్టుకు జనుములా మన భారతావనికి ప్రత్తి ! సింధూనాగరికత నాటికే వస్త్ర రూపం దాల్చి “వెబ్స్ ఆఫ్ వోవెన్ విండ్” అంటూ పాశ్చాత్యుల్ని ఆశ్చర్యంలో ముంచెత్తి మన్ననలు పొందిన భారతీయ ప్రత్తి.

అలెగ్జాండర్ దిగ్రేట్‌ను అతని అనుచరులను అచ్చెరు వొందించిన భారతీయ ప్రత్తి

పూలు గుత్తుల్ని దాల్చివున్న భారతీయ పొదలుగా గ్రీకు దేశస్థుడు నియర్ ఛస్ వర్ణించిన ప్రత్తి -

ప్రత్తి కాయలు, “విథిన్ విచ్ దేర్ ఈజ్ ఎలాంబ్, హావింగ్ ఫ్లీస్ ఆఫ్ సర్‌పాసింగ్ బ్యూటీ అండ్ ఎక్సెలెన్స్ ” అంటూ హెరెడోటస్ కాలం నుండీ పాశ్చాత్యుల నోరెళ్ళ బెట్టించిన “వెజిటబుల్ లాంబ్ ” భారతీయ ప్రత్తి !

ప్రత్తితో వడికిన నూలు - నూలుతో నేసిన వస్త్రం - అమాంతం ఒక ఉంగరంలోంచి దూర్చేయ గల నేతపని నైపుణ్యం - అగ్గి పెట్టెలో మడిచి చూపగల సామర్థ్యం - క్రీస్తు శకం ఆరవ శతాబ్ధం నాటి అరబ్బు వర్తకుల ఆనందపుకితాబు అందుకొన్న ప్రత్తి !

నాణ్యతలో అందంలో మార్కోపోలో అభినందనలు అందుకున్న ప్రత్తి !

క్రీస్తు తరువాత నాళ్ళలో మాత్రమే స్పెయిన్ చేరిన ప్రత్తి - రవి అస్తమించిన బ్రిటిష్ సామ్రాజ్యంలో 13వ శతాబ్దంలో కేవలం క్యాండిల్ - విక్ లా ప్రవేశించిన ప్రత్తి - ఈస్ట్ ఇండియా కంపెనీ వారికి లాభాల పంట పండించిన ప్రత్తి -

పారిశ్రామిక విప్లవ ఫలితాలతో మూకుమ్మడి భారతావని నేత కార్మికుల్ని - అంధకారంలో ముంచి భారతదేశాన్ని దాస్యంలో నెట్టి, ఇంగ్లండ్‌కు చేరిన టన్నుల కొద్దీ భారతీయ ప్రత్తి - మహాత్ముని రాట్నం మీద నూలై మహత్తర శక్తిలా విజృభించి ఆ ఓటమెరుగని బ్రిటిష్ సామ్రాజ్య వాదుల్ని తరిమి తరిమి కొట్టిన ప్రత్తి -

నేను సృజించిన ఈ విత్తనాల్లోని ప్రతి విత్తు మీదా నా వారసత్వాన్ని నింపి - నాటుతాను

నా ఈ విత్తనాల్లోంచి వెలువడే ప్రత్తి -

పాపాయికి మెత్తని పొత్తిళ్ళు అవుతుంది.

ముసలమ్మకి వెచ్చని రజాయి అవుతుంది.

శ్రమ జీవికి చెమట తుడిచే తుండు అవుతుంది

వయ్యారి భామకు వంటిమీద కోక అవుతుంది.

ఇక్కడున్న కల్యాణికి భూగోళానికి ఆ పక్కనున్న చలపతికి శస్త్రచికిత్సలో అద్దే దూదికి గాజు గుడ్డ అవుతుంది

దేశం కోసం ప్రాణం ఒడ్డే ఏ వీర సైనికుడినో క్షత గాత్రుడైన వేళ కన్న తల్లిలా కట్టు అవుతుంది.

ఈ విత్తనాలన్నిటికి ప్రాంతం లేదు. దేశం లేదు. భాష లేదు లిపిలేదు కులం లేదు మతం లేదు అడ్డంకులు లేవు. అదుపు లేదు

ఇంత మట్టి అంత నీరు ఉన్న చోటల్లా నా ఒక్కో విత్తనం అనంతం అవుతుంది.

ఇంతై ఇంతింతై నా ఈ విత్తనాలు ఒకనాటికి విశ్వమంతా వ్యాపిస్తాయి

నా ఈ నడిగడ్డ నల్లరేగడిలో తెల్లబంగారమవుతుంది.

ఇంక ఏ రాజయ్య నా కళ్ళముందు విత్తులకోసం విలపించడు.

విలపించనివ్వను. ఇది నా భావన.

ఇవి నా రేగడి విత్తులు !"

రామనాథం మనసులో ఆశలు అంకురించాయి. ఆనందం చిగురించింది. ఉత్తేజం ఉప్పొంగింది.

కొడుకు ఆనందంలో పాలుపంచుకొంటున్నట్లు మామిడి చెట్టులా మిగిలిన పున్నమ్మ - ఆనందిస్తున్నట్లుగా ఆకులు గలగల మన్నాయి.

"మామయ్య , ఇంతకీ మా అమ్మాయికి పేరు పెట్టావ్ కాదూ ? "అనూరాధ గారాలు పోతూ రాగం తీసింది.

"భావన ! " రామనాథం పాప బుగ్గలు పుణికాడు.

"మరి మన విత్తనాల పేరు ? " శివుడు క్షణం ఆలస్యం లేకుండా అడిగాడు.

"రేగడి విత్తులు"



# 11

"రేగడి సీడ్స్ "

"నాణ్యమైన సంకర జాతి ప్రత్తి విత్తనములు "

"నడిగడ్డ సీడ్ ప్రాసెసింగ్ సెంటర్"

"రాంనగర్

"అలంపూర్ తాలుకా "

"మహబూబ్‌నగర్ జిల్లా"

సుధాకర్ విత్తనాల సంచుల మీద ముద్రించుకు వచ్చిన వివరాలు చదువుతున్నాడు.

"అదేంట్రా - విత్తులు అని అంటే సీడ్స్ అని ఛాయించావ్ ? "శివుడు సుధాకర్ వేగానికి అడ్డం పడ్డాడు.

"అవున్రా అబ్బాయ్ - ఇంగ్లీష్‌లో సీడ్స్ అని వ్రాయించు తెలుగులో విత్తులు అని రాయి " రామనాధం కూడా అన్నాడు.

"ఎలా వ్రాసినా, చివరికి మనాళ్ళ నోళ్ళల్లో విత్తులుగానే మిగులుతాయితే నాన్నా - " సుధాకర్ నవ్వాడు.

సుధాకర్‌లో ఈ కొత్త పని ఎంతో కొంత మార్పు తెచ్చింది.

పెద్దల్నుంచి పిల్లలదాకా ఉత్సాహంగా పని పంచుకోవాలని ఎదురు చూస్తున్నారు.

ఇంట్లో వాళ్ళందరితోపాటు సవారి, మాణిక్యం కొత్తగా పెళ్ళయిన వాళ్ళ కూతురు, అల్లుడులతో సహా పందిరి కింద చేరారు.

రామనాధం సూపర్ కాయితాలు చింపి కుట్టించిన పట్టాని పందిట్లో పరిపించాడు.

సుధాకర్, శివుడు విత్తనాల సంచి తెచ్చి మధ్యలో గుమ్మరించాడు.

రామనాధం పిల్లల్ని పెద్దల్ని భోజనాల బంతికి కూర్చోబెట్టినట్లు రెండువరసలుగా కూర్చోబెట్టాడు.

రత్తయ్య అందరి ముందుతలో లోసన[1] నిండా విత్తనాలు తెచ్చి కుప్పలాపెట్టాడు.

రామనాధంతో సహా అందరూ ఒక్కొ కుప్పముందు కూర్చున్నారు.

---

1 DISH

కుప్పలోని ఒక్కో విత్తనాన్ని జాగ్రత్తగా చూసి తప్పలుతాలులు, విరిగిపోయినవి నొక్కు పోయినవి ఏరి వేసారు.

ఈ ఏరి వేయడమే గ్రేడింగ్

"ఈసారి జిన్నింగ్ చేసేప్పుడు జాగ్రత్తగా వుండాలిరా సుధాకర్ - చూడు విత్తనాలు ఎట్లా విరిగి పోయాయో - " రామనాథం విరిగిపోయిన వాటిని చూపిస్తూ అన్నాడు.

"జిన్నింగ్ అంటే ఏంటి తాతయ్య " దాత్రి కుతూహలంగా అడిగింది.

"జిన్నింగ్ అంటే ప్రత్తిని దూదిగా విత్తనాలుగా విడదీయడం అంతే ! "

"మీరా దూదంతా ఏం చేసారు - ? "

"ఆ దూది పెట్టి మనవరాలికి మంచి చీర నేసి పెట్టమన్నాడులేవే మీ తాత" సావిత్రి సరదాగా అంది

"పో - నాయనమ్మ - ఎప్పుడూ పిచ్చిమాటలే - నేనేమన్న చీర కట్టుకుంటానా ? "ధాత్రి ఆరిందాలా విసుక్కుంది

"ఎవరు చక్కగా విత్తనాలు ఏరితే వారికి సాయంత్రం పరమాన్నం"రత్తయ్య ప్రకటించేసాడు.

"దంచినమ్మకు బొక్కిందే కూలనీ - పిండి దంచినాళ్ళకే పరమాన్నమని మీ మామయ్యతో చెప్పవే అమ్మాయ్- " అనూరాధతో అన్నట్టు రత్తయ్యను వేళాకోళామాడింది శాంతమ్మ.

"అవునూ వదినా మన పేరిందేవి ఏది ? " గీత ఎక్కడన్నట్లు - భారతిని సరళ మెల్లిగా అడిగింది.

"నాకేం తెలుసు ? ఏ సీంతుమ్మచెట్టు కింద కూర్చుని ఏ నవలా రాజాన్ని నములుతోందో ? " భారతి అభావంగా అంది.

"చిన్నబావా - నా విత్తనాల కుప్పలోంచి తప్పలుతాలులు పూర్తిగా ఏరేసాను. మరికొన్ని పోయి - " అనూరాధ చిన్న పిల్లలా అంది.

సుధాకర్ చిన్న పిల్లవాడిలాగానే అందరి కన్నా ముందు ఏరినందుకు అనూరాధను ఆనందంగా అభినందించాడు.

మరోకుప్ప విత్తనాలు తెచ్చి పోసాడు.

గ్రేడింగ్ అయిన తరువాత - పిల్లలందర్నీ సరళ వాళ్ళింటికి తరిమేసారు.

శివుడు వెళ్ళి భారతి వాళ్ళ అన్నగారింటినుంచి ఓ పాత కుట్టుమిషను పట్టుకొచ్చాడు.

ఇంతలో సీడ్ ఆఫీసర్‌ను వెంట బెట్టుకొని మల్లేశ్ వచ్చాడు. "అలంపూర్ చౌరస్తాలో నిలబడి రాంనగర్ గురించి ఆరా తీస్తుంటే - నాతోపాటు తీస్కొచ్చా ?

సావిత్రి, శాంతమ్మ - వంటావార్పులు, చేయాలంటూ గబగబ లోపలికి వెళ్ళారు.

"అబ్బ ! ఏం వూరండీ ! వచ్చే సరికి తల ప్రాణం తోక్కి వచ్చింది అందులో ఇతను లారీ ఎక్కించుకు వచ్చాడు - " సీడ్ ఆఫీసర్ వాపోయాడు.

ఆయనకు వసతి, వేణ్ణీళ్ళ స్నానం చూపించారు.

"ఇలా అయితే ఆలస్యం అయిపోతుందండీ - నేను మళ్ళీ సింధనూరు వెళ్ళాలి ఇది మాకు పని వత్తిడి సమయం కదా - " సీడ్ ఆఫీసర్ సౌమ్యంగా నవ్వాడు, " నేను స్నానం అదీ చేసివచ్చేలోగా ట్యాగ్స్ ఇస్తాను స్టాంప్స్ కొట్టి వుంచండి - "

సుధాకర్ గబగబ స్టాంప్ ప్యాడ్, స్టాంప్స్ పట్టుకొచ్చాడు.

"వేరీగుడ్, అన్నీ సిద్ధంగా వున్నాయన్న మాట ! "

సీడ్ ఆఫీసర్ తన సంచిలోంచి ట్యాగ్స్ తీసాడు. ప్రత్తి రకం, జెర్మినేషన్ టెస్ట్ వివరాలు, రేటు వగైరా స్టాంప్స్ ఎక్కడెక్కడ వేయాలో ఒక ట్యాగ్ మీద వేసి చూపించాడు.

"ఈ లోగా కాటావేయడం కూడా మొదలెట్టండి - అన్నట్లు గ్రేడింగ్ పూర్తయ్యిందా ? "

"అయ్యిందండీ - "

సుధాకర్ కిలో విత్తనాలు తూయగల బ్యాలన్స్, తూకంరాళ్ళు పట్టుకొచ్చాడు సీడ్ ఆఫీసర్ ఒక కిలోరాయి చుట్టూ విత్తనాల సంచి చుట్టి బ్యాలన్స్ పళ్ళెంలో వేసాడు.

"ఎందుకే అమ్మాయ్ అనూరాధా అట్టా రాయిచుట్టూ సంచి చుట్టాడూ ? "అప్పుడే గుమ్మంలోకి వచ్చిన శాంతమ్మ బుగ్గలు నొక్కుకుంది

"ఈ పక్క విత్తనాల్ని సంచిలో పోసి తూకమేస్తాంగా అత్తయ్య ఆ సంచీ ఈ సంచీ సరిపోతుందన్నమాట - "

రామనాథం పిల్లలందరితో పాటు ట్యాగ్స్ మీద స్టాంప్స్ కొట్టే పనిలో పెట్టాడు.

శివుడు గ్రేడింగ్ చేసిన-విత్తనాల్ని పట్టా మీద పోసాడు.

రామనాథం ఏజెన్సీ వారు సూచించిన మోతాదులో విత్తన శుద్ధికై ఫంగస్ రాకుండా వైరం, క్రిమికీటకాలనుండి రక్షణకు హైడ్రాన్ మందులను విత్తనాలపై చల్లాడు శివుడు, సవారి మందును విత్తనాలతో కలసేట్టు బాగా కలియ తిప్పారు. ముద్రించుకు వచ్చిన విత్తనాల సంచుల్లో ఆడవాళ్ళంతా విత్తనాలు నింపుతున్నారు.

సుధాకర్ బ్యాలన్సు దగ్గర కూర్చుని ఒక్కో సంచిని కాటా వేస్తున్నాడు. ఇంతలో సీడ్ ఆఫీసర్ స్నానాదులు ముగించుకు వచ్చాడు.

ధాత్రి స్టాంప్స్ కొట్టినంత వరకు ట్యాగ్‌లు తెచ్చి అతనికి ఇచ్చింది. అతను ప్రతి ట్యాగ్ మీద సంతకం పెడుతున్నాడు.

భారతి కుట్టుమిషన్‌లోని దారం ఎక్కించింది.

అనూరాధ తూకం వేసిన విత్తనాల సంచి మీద ట్యాగ్‌ను పెట్టి భారతికి అందించింది

భారతి మిషన్ మీద సంచి మూతి కుట్టేసింది.

కుట్టిన సంచులన్నిటిని ఆకాశ్ శివుడి వాళ్ళ దగ్గరికి చేరేసాడు.

శివుడు బొగ్గుల కుంపటి మీద లక్క కరగేస్తున్నాడు. ఒక కర్ర ముక్కతో కరిగిన లక్కను కుట్టిన విత్తనాల సంచికి ట్యాగ్‌ను ఇరువైపులా వేసాడు.

మల్లేశ్ వేడిలక్కమీద సీడ్ ఆఫీసర్ ఇచ్చిన సీల్‌ను వేసాడు

మొదటి సంచి ప్యాకింగ్ పూర్తయింది.

సీడ్ ఆఫీసర్ సంచి బరువు ఓ సారి తూకం వేసి చూసుకున్నాడు. తృప్తిగా తలాడించి పక్కకు పెట్టాడు.

ఆ రాత్రి భోజనం చేసి గడ్డపెరుగు వేసుకొని భోంచేసి ఆఫీసర్ తృప్తిగా తలాడించాడు.

అలంపూర్ బేనిషాలు తిని ఆనందంలో మునిగిపోయాడు

✻ ✻ ✻

రామనాథం మొదటి సంచి తీసుకొని తిన్నగా రాజయ్య వాళ్ళింటికి వెళ్ళాడు.

శివుడు అతన్ని అనుసరించాడు.

రాజయ్య భార్య రొట్టెలు తడుతోన్న శబ్దం గుమ్మంలోకి వినిపిస్తుంది.

రామనాథం సందేహిస్తూనే రాజయ్య కొడుకును పిలిచాడు.

రాజయ్య కొడుకు హనుమంతు బయటకు వచ్చాడు. రామనాథం విత్తనాల సంచిని అతనికి ఇచ్చాడు అతను అయోమయంగా ఏంటని అడిగాడు. శివుడు చెప్పాడు. హనుమంతు తల్లి లోపల్నుంచి కేకేసింది.

"ఎవల్లొచ్చిన్రా - "

"శివన్నోల్లు "

"ఏందంట ? "

"ఇత్తులు ఇస్తున్రు ! "

"ఏమి త్తుల్రా ! "

"పత్తి త్తులు - ! "

రాజయ్య భార్య దడదడ బయటకు వచ్చింది.

రామనాథాన్ని చూసి ఏడుపు ముంచుకొచ్చి దభాలున నేలమీద కూలబడింది.

"ఏంది వయ్యా - రామన్నా - నీ చేతుల్ల నా మగని చావు చూస్తివి మల్ల పత్తిత్తో లే గీయిత్తులు ఇయ్యనింక వచ్చినవ్ ? గా దస్తగిరి ముండ కొడ్కు నా పుస్తె తెంపె - "

దీనంగా అంటూ ఆమె ఏడుపెత్తుకొంది.

రామనాథం విచారంలో పడ్డాడు.

"అట్లా కాదమ్మ - ఇవి నాణ్యమైన విత్తనాలు అప్పట్లా కాదు - " శివుడు సర్దిచెప్పబోయాడు

"చిన్నోన్వయినా నీ కాల్మొక్త ! మల్ల గా ముచ్చట నా యింట్ల పెట్టకు గింత జొన్నలేస్కొని ఇన్ని రొట్టెలు తింట సుకంగుంటిమి లేకుంటే కందులో, వామో, ఆముదలో, కుసుమలో -గా పత్తి ఏసుడు ఎందుకొచ్చినో - నా కొంప ఎందుకార్పెనో - ఓరి హనమంతో - నీ నాయన ఎట్లుండె - గడెం ఏస్తే గీత గీసినట్టు - వడిసెల పడితే పిట్టకు గింజ దక్కనట్టు-కోత కోస్తే గింజ నేలరాలనట్టు - గా పత్తి నా బతుకు గుండం చేసె - నేనేం సేతురో - " ఆమె నెత్తిన చేతులు పెట్టుకొని ఏడ్చింది

రామనాథం నిరాశలో మునిగి పోయాడు ఆమె పత్తి పంట వేయడానికి ఏ కోశాన ఒప్పుకొనేటట్టులేదు

"గా దస్తగిరి బాడ్కవ్ - ఉన్న ఇల్లు పీక్కపాయె - పొలం తాకట్టుందంటడు బాకిసాకి కట్టుమని ఇయ్యాలరేపు ఇంటి సుట్టూ ముట్టు తిర్గుతుండు వుండెడ్డంతా వాడె తినె ఇంగ నాకాడ ఏముందిరో - నాయనో - "

ఆమె మళ్ళీ ఏడ్చింది

"ఈ సంసారమెట్టా ఈదుర్నో - "

రామనాథం కళ్ళు చెమ్మగిల్లాయి

"అట్లా కాదమ్మ - అప్పుడు దస్తగిరి నాసి రకం విత్తనాలిచ్చాడు. అవి అసలు హైబ్రీడ్ జాతివే కాదు. ఇదుగో హైబ్రీడ్ విత్తులంటే ఇట్లా వుండాలి - " రామనాథం సంచి ఎత్తి ఆమెకు ట్యాగ్ సీల్, ఆఫీసర్ సంతకం చూపించాడు.

ఆమె శోకాలు పెడుతూ ,ముక్కు ఎగబీలుస్తూ అటో చూపు ఇటో చూపు వేస్తోంది.

హనుమంతు శ్రద్ధగా రామనాథం చెప్పేది వింటున్నాడు.

రామనాథానికి ఆమె స్పందనారాహిత్యం మరింత నిరాశలోకి తోస్తోంది. హనుమంతు అక్కడున్నాడన్న విషయం కూడా మర్చిపోయాడు. ఆమెను అనునయిస్తున్నట్లు నెమ్మదిగా అన్నాడు.

"మీరప్పుడు ఆ తిరుపాలు కొట్లో చెడామడా ఎరువులన్నీ వాడి అప్పుల్లో పడ్డారు. ఎరువులు ఎలా వాడాలో మందులు ఎప్పుడు చల్లాలో అన్నీ నేను చెపుతాను. మీకు రేగడి వుంది. నేను విత్తులు ఇస్తాను. అందరం కలిసి నడిగడ్డను గనిగడ్డ చేద్దాం - "

"నీ వెన్నన్నా చెప్పు - రామన్నా గా పత్తి ఈ నడిగడ్డను శనిగడ్డ చేసి ఇడస్తది - నా బొందిల పానం వుండగ గా పత్తిత్తులు ఏదపెట్టను నీ కాల్మొక్త - నా పాలికి నన్నిడుసు - నా మగన్ని గా పత్తిమింగె - నా బిడ్డల గా పత్తికి బలిపెట్ట - బతికుంటే గింత బలుసాకు తింటన్న ఓ రామన్నా - నీకు దండం పెడ్తా - " ఆమె శోకాలు పెడుతూ రామనాథం కాళ్ళ మీదపడి దండాలు పెట్టింది,

"ఉలవేసి ఊరకుండక పత్తేసి పరేషానెందుకయితవని పెద్దోల్ల సుద్దులు ఊకే చెప్పిన్రా ? "

రామనాథం దుఃఖంలో మునిగిపోయాడు ఆమెను ఎలా ఓదార్చాలో అర్థం కాని సంక్షోభంలో పడిపోయాడు నెమ్మదిగా కూడదీసుకుంటూ అన్నాడు

"అమ్మా - నువ్వను కొన్నట్లు - ప్రత్తి పంటలో దోషం లేదు

ప్రత్తి పంటను ఎర వేసి మీ జీవితాల్తో ఆడేవాడిలో దోషముంది రేగడికి ప్రత్తి కొత్త కాదు రైతుకు ప్రత్తి కొత్త కాదు - నడిగడ్డ రైతుల పెళ్ళిళ్ళలో వేసే పత్తిసాళ్ళే దీనికి సాక్షి నా మాట నమ్మండి ఎక్కడెక్కడి నుంచో రైతులను ఇక్కడికి లాక్కొస్తోంది - ఆ ప్రత్తి పంటే వాళ్ళందరూ పండించగా లేంది నీ వెందుకు పండించలేవు ? నీ కొడుకు ఎందుకు పండించలేడు ? "

ఆమెఎంతకీ శోకంలోంచి తేరుకోలేదు

మరింత గట్టిగా భర్తను తలుచుకొని పొగిలిపొగిలి ఏడుస్తోంది

"ఇంకో రోజు వద్దాంలే బాబాయ్ - పద " శివుడు రామనాథంతో నెమ్మదిగా అన్నాడు

ఇద్దరూ మౌనంగా బయటకు నడిచారు రామనాథం కళ్ళముందు కమిలిపోయిన ముఖంతో, నోట్లోంచి కారుతున్న నురుగతో -

"యిత్తులు - యిత్తులు -"అంటూ ప్రాణం వదిలిన రాజయ్య మెదిలాడు. గుండెలు బాదుకొని ఏడుస్తోన్న రాజయ్య భార్య కళ్ళముందు కొచ్చింది. అతని గుండె పట్టేసి నట్లయింది

"తన భావన ఒక రూపం దిద్దుకోకముందే చెరిగి పోతుందా ? "రామనాథం ఆక్రోశించాడు

"ఒక్కళ్ళను వప్పించలేక విఫలం చెంది వెనక్కు తిరుగుతున్నాను. ఇంకా కేసన్న, తిక్కన్న, నారాయణప్ప - మిగిలిన వాళ్ళందరూ ఎలా ఒప్పుకొంటారు ? ఒక్కసారి దెబ్బ తిన్నాక మళ్ళీ ప్రయత్నించడానికి అంత భయమా ? మరి నా శ్రమంతా బూడిదలో పోసినట్లేనా ? ఈ రేగడి విత్తులు - ఎవరి ఆదరాన్ని పొందవా ? ఊళ్ళో రైతులందరు సింధనూరు నుంచో మరో చోటనుంచో విత్తనాలు తెచ్చేసుకుని వుంటారేమో - మరి వీటిని ఏం చేయాలి ? నా కల పూర్తికాక మునుపే కరిగిపోతుందా ? అయ్యో - "

రామనాథం అడుగు తీసి అడుగు వేయడం భారమవుతోంది.

మెల్లిగా నడుస్తున్నాడు. చేతిలో వున్న విత్తనాల సంచి అంత కంతకు బరువెక్కుతోంది ఇంతలో వెనుకనుంచి ఎవరో పరిగెత్తు కోస్తోన్న ధ్వని వినిపించి, శివుడు ఆగాడు

"శివన్నా - " హనుమంతు రొప్పుతూ రొజుతూ వచ్చి శివుడి దగ్గర ఆగాడు, "శివన్నా - చిన్నాయనకు చెప్పు యిత్తులు నేను తీస్కుంటా " -

❋ ❋ ❋

అనూరాధ అత్తగారింటికి బయల్దేరే సమయం వచ్చేసింది. శాంతమ్మ, సావిత్రి వుత్సాహంగా పిండివంటలు చేయడంలో నిమగ్నమయ్యారు.

అనూరాధ అన్యమనస్కంగా వుంటోంది అలజడిలో కొట్టు మిట్టాడుతోంది.

కానుపుకు వచ్చి - చాలా రోజులయ్యింది ఈ కొద్ది మాసాల కాలం తనకు నచ్చిన వాతావరణం - తనకు నచ్చిన మనుషులు - తనకు నచ్చిన అలవాట్లు ఆచారాలు - తనకు నచ్చిన పరాచికాలు - పరిహాసాలు కానీ, వీటన్నీటికి తనకీ వున్నది. తాత్కాలిక సంబంధమే. తను ఏనాటికైనా వీడ్కోలు చెప్పేసి వెళ్ళిపోవాల్సిన ఓ అతిథి మాత్రమే. తనను వీళ్ళందరు ప్రేమించగలరు - ఆప్యాయత పంచగలరు ఆవేదన పంచుకోగలరు

కానీ, తను వీళ్ళతో కలిసి నివసించలేదు. వీళ్ళలో జీవించలేదు. అది సమాజంలోని పద్ధతి. అంతకు మునుపు ఏ మాత్రం తెలియని ప్రపంచంలో ఇమిడి పోవాలి. ఆ ఇమడడంలో భరించాల్సిన మానసిక ఘర్షణకు ఎవరూ పట్టించుకోరు. ఇప్పటికి బిడ్డ తల్లి నయ్యాను. తల్లి నవ్వడంలో ఎంత అవమానించబడ్డాను. ఎంతగా ఆక్రోషించాను ఎంత ఆందోళన పడ్డాను - ఒక్క బిడ్డ పుట్టుకతోనే అవన్నీ వదిలేసిందా ? ఆనందం ఎలా పొందగలను ? అత్తా కోడళ్ళ మధ్య ఘర్షణ అతి సామాన్యమైన విషయం అంటారు కానీ, తనేం ఘర్షణ పడింది ? ఆవిడ చెప్పినవన్నీ చేయాలనే చూసింది. అన్నం తినడం మానేసింది రొట్టెలు తింటోంది. ఆ కుటుంబం లోని ప్రతి అభిరుచిని అర్థం చేసుకోవాలనే ప్రయత్నిస్తోంది అలవాటు చేసుకోవాలని ప్రయత్నోస్తోంది - కాని ఘర్షణ తప్పడం లేదు - ఎలా - ఏం చేయాలి ? రేపటి నుంచి ఆమె పాప దగ్గరకు వస్తే - ఆ పాప కోసం తను భరించిన అవమానాలన్నీ జ్ఞాపకం వస్తాయి. ఆమె మీద అప్రియతే తప్ప ఆప్యాయత పుట్టదు. కుటుంబంలో ఒక వ్యక్తిని ద్వేషిస్తూ వుంటే తనా కుటుంబంలో ఇమడగలుగుతుంది ? ఆమెతో స్నేహమయ సంబంధం తను నెలకొల్పుకోలేదా ? తను ఓడిపోతుందా ?" అనూరాధ కనుబొమలు చిట్లించింది.

"ఏంటమ్మా - అనూరాధా - అంతగా ఆలోచిస్తున్నావ్ - "

అనూరాధ ఉలిక్కిపడి లోకంలోకి వచ్చింది.

రామనాథం వచ్చి ఆమె ఎదురుగా కూర్చున్నాడు.

"అబ్బే, ఏం లేదు మామయ్యా - " బలవంతంగా అనూరాధ ముఖాన నవ్వు పులుముకుంటూ అంది.

"ఏవీ లేకపోవడేమిటి ? నీ ముఖం చూస్తే తెలియడం లేదూ - ఎలా వాడిపోయిందో - " రామనాథం కళావిహీనంగా అనూరాధ ముఖంలోకి పరీక్షచూస్తూ అన్నాడు.

అనూరాధ పేలవం గా నవ్వింది.

"ఏం జరిగిందమ్మా - నా దగ్గర దాపరికం దేనికి ? మల్లేశ్‌తో ఏమైనా ......"

"ఛ ... ఛ ! అలాంటిదేం లేదు - "

"మరి వాళ్ళమ్మతో .... ? "

అనూరాధ మోకాళ్ళమీద తలపెట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది

"ఏంటి అనూరాధ ఇదీ - చిన్న పిల్లలాగా - ఊరుకో - " రామనాథం అనూరాధ తల నిమురుతూ ఓదార్చాడు.

అనూరాధ తేరుకొని తేలికపడింద

"ఏం జరిగిందమ్మా ? నాకు తెలిసి ఆవిడ మంచి మనిషే - మనుషలంటే ప్రాణం పెడుతుంది మరి సమస్యేంటి ?"

"ఆమె మంచిదే. నేను మంచిదాన్నే నేనేమయినా చెపుదామంటే ఆ - అత్తా కోడళ్ళ గొడవలు మామూలేలే - అంటారేమోనని ఇన్నాళ్ళు సంశయించాను కానీ ఈ పూట . " అనూరాధ కళ్ళు తుడుచుకుంది

"అనూరాధ అక్కడే నువ్వు పొరపాటు పడ్డావ్ ? అత్తగారింట కొత్త వాతావరణంలో ఇమడడంలో ఘర్షణ సహజమే. కొత్త వ్యక్తుల మధ్య సామరస్య సంబంధాలు ఏర్పరచు కోవడంలో కోడలు ఎంతగా ఘర్షణను అనుభవిస్తుందో అత్త అంతగానే అనుభవిస్తుంది. దురదృష్టవశాత్తు మన సమాజంలో కోడలిపైన ఆ భారమంతా పడేసి సర్దుకోమని నిర్దేశించి విఫలమైతే దోషిగా నిలబెడుతుంది కానీ ఎప్పటికైనా గుర్తుంచుకో ప్రతి పనికి ఒక పరిధి వుంటుంది. అలాగే భరించే శక్తి నీకెంత వున్నా అది నీకు అపాయకారి అయ్యేంత సహనం వుండకూడదు. అలాంటి సహనాన్ని నూరిపోయబట్టే - మన ఆడపిల్లలు కిరసనాయిలు పోసి నిలువుగా దగ్ధం చేస్తున్నా - సహనంగానే భరిస్తున్నారు.

ఇది దురాగతాల - దృష్టంతమే - నిజానికి ప్రతి కుటుంబంలోని కొత్తగా వచ్చే ఆడపిల్ల ఆ కుటుంబంలోకి ఇమడడానికి పడే ఘర్షణలో ఎన్నో సున్నితమైన అంశాలను దగ్ధం చేసుకుంటుంది.

అది మానవ జాతికే అవమానం" -

"నేను శాయశక్తులా ప్రయత్నిస్తున్నాను మామయ్య - కానీ ఆమె ఉనికినే భరించలేకపోతున్నాను. ఆమె ఆ నాలుగేళ్ళలో పిల్లల కోసం నన్ను ఎన్నెన్ని మాటలు దెప్పిపొడిచిందో - ఎలాంటి పనులు చేయించిందో - చివరికి -చివరికి అలంపురం ఎల్లమ్మ - అదే రేణుక దగ్గరకి కూడా తీసుకెళ్ళింది - " అనూరాధ ముఖం ఎఱ్ఱ బడింది.

రామనాథం మౌనంగా తలాడించాడు.

"అవమానాలు సహించాను. నన్ను, నా కదిలికల్నీ, నా చేతల్ని అన్నింటికీ ఆమె అసహ్యించుకొంది. నేను వచ్చిన కుటుంబాన్ని, కుదురును, ప్రాంతాన్ని, సంస్కారాన్ని అన్నింటికీ ఆమె అసహ్యించుకొంది. ఇంతమందిలో అల్లారుముద్దుగా అపురూపంగా అన్నుల మిన్నగా పెరిగిన నాకు అక్కడ ఎదురైంది అడుగడుగునా అవమానం - అసహ్యం !

ఈ రెండింటి మధ్య ఇమడంలో ఎంత ఒత్తిడి ఎంత ఘర్షణ !

ఎంత నలిగి పోయి వుంటానో ఊహించుకోండి మామయ్య - అది నన్ను దోషిని చేసింది. న్యూనతలో పడేసింది.

మీరందరూ నాకు మనుషుల్ని ప్రేమిచడమే నేర్పించారు. ఎవరినైనా ద్వేషిస్తూ ఎక్కువ కాలం ఉండడం నాచేత కాదని నాకు అనుభవపూర్వకంగా తెలిసింది.

ఆమె కొడుకును అమితంగా ప్రేమిస్తూ - ఆమెకు ద్వేషించడం నా వల్ల కాదు కాని ఏం చేయను ? ఆమెను ప్రేమించనూలేను - ద్వేషించనూ లేను. ఈ అన్నార్ధభరిత సంబంధానికి అర్థం ఏవుంది ? నన్నేం చేయమంటావ్ మామయ్యా - నువ్వే చెప్పు - "

"అమ్మా -అనూరాధా - మానవ సంబంధాల్లో సమన్వయం సాధించడంలో ఘర్షణ అనివార్యం తరం తరం మధ్య తండ్రీ బిడ్డల మధ్య అన్నదమ్ముల మధ్య, భార్యాభర్తల మధ్య - అత్తా కోడళ్ళ మధ్య - అన్ని మానవ సంబంధాల్లోనూ ఈ ఘర్షణ తప్పదు. ఇది మానవ మనస్తత్వాలకు సంబంధించిన అంశం. ప్రతి మనిషిదీ ఒక నిర్దిష్ట మనస్తత్వం. ఒక విశిష్ట వ్యక్తిత్వం. అలాంటి మరో మనిషితో సంపర్కానికి వచ్చినపుడు - ఇరువురి మనస్తత్వాలను బట్టీ సమన్వయం కుదుర్చుకోవడం సాధ్యమవుతుంది. ఈ క్రమంలో ఎవరివారు కొంత కోల్పోక పోక తప్పదు. అవతలి వారి నుండి కొంత స్వీకరించకా తప్పదు.

మనిషి సామూహికంగా జీవించడానికి నిర్ణయించుకున్నపుడే ఈ సత్యాన్ని గ్రహించాడు. దురదృష్టవశాత్తు వైవాహిక సంబంధాల్లో సామరస్యం సాధించుకోవడంలో ఆడపిల్ల అనాటి వరకూ తన జీవించి వచ్చిన జీవితాన్ని కోల్పోవలసి వస్తుంది - "

"అది ఎలా సాధ్యం మామయ్యా - పెళ్ళి వరకూ నేను జీవించిన జీవితమంతా మిథ్య అంటే నేనెలా ఒప్పుకొంటాను ? అది నా బంగారు బాల్యంతో ముడిపడింది అందమైన యవ్వనంతో అల్లుకున్నది. అందరి అభిమానాలలో ఆప్యాయతల్తో పెనవేసుకొంది. దాన్ని నేనెలా శూన్యం చేసుకొంటాను - ? "

"చేసుకోవద్దు ! వాస్తవం ఇది అని చెప్తున్నాను - ! "

"అయితే మాత్రం ! నేను వారి కోడల్ని మాత్రమేనా ? నా కంటూ వేరే సంబంధాలుండవా "

"సరిగ్గా అదే నేనూ అంటున్నాను నీవు వారి కోడలివి మాత్రమే కాదు. కానీ నువ్వు ఓ ఆదర్శ ప్రాయమైన కోడలివి కావాలనే తాపత్రయంతోనే అంత సంఘర్షణ అనుభవించావు. నీకు అయిష్టమైన పనులు కూడా చేసావ్ - ఏం ? నిజం చెప్పు - నారాయణమ్మ కోడలు మంచిది అన్ని అనిపించుకోవాలన్న తాపత్రయం నీకు లేకపోతే నువ్వు ఇవ్వన్నీ భరిస్తావా ? "

అనూరాధ తెల్లబోయి రామనాథం ముఖంలోకి చూసింది.

"నువ్వు - అనూరాధవని మర్చిపోయావు నువ్వు ఒక కోడలివి మాత్రమే కాదు - ఒక బిడ్డవు, ఒక మనమరాలివి, ఒక భార్యవు, ఒక తల్లివి, ఒక యువతివి - ఒక స్నేహితురాలివి, ఒక బంధువును - అన్నీ మర్చిపోయావు ఇవే కాకుండా వ్యక్తి పరమైన ఈ సంబంధాలే కాకుండా వృత్తిపరంగా సమాజపరంగా నీవు నిభాయించుకోవాల్సిన సంబంధాలెన్నో వున్నాయి నీలోని వివిధ పార్శ్వలన్నీ మర్చిపోయావు ఇది చెప్పు - నువ్వు ఎల్లకాలం ఒక కోడలిగానో లేదా ఎల్లకాలం ఒక భార్యగానో వుండిపోతావా ? ఇవన్నీ నీ చుట్టూ వున్న మనుషులతో నువ్వు ఏర్పరుచుకొనే విభిన్న సంబంధాలను బట్టి నిన్ను నీవు మార్చుకోవూ ? కాసేపు భార్యవు అవుతావు కాసేపు మేనకోడలివి అవుతావు. కాసేపు మనమరాలివవుతావు. కాసేపు తల్లివి అవుతావు కొద్దిసేపు అమ్మమ్మవూ నాయనమ్మవు - అన్నీ కలిపిన నువ్వు ఎప్పటికీ అనూరాధవి ! నువ్వు ఒక మనిషివి ! "

అనూరాధ విస్మయంగా చూస్తోంది రామనాథం కొనసాగించాడు - "ఈ సంబంధాలన్నీ మొక్కబడిగానో యాంత్రికంగానో పోషించాల్సిన పాత్రలు కావు క్షణక్షణం జీవించాల్సిన పార్శ్వాలు. రమ్యంగా అందంగా మలుచుకోవాల్సిన పార్శ్వాలు.

ప్రతి మనిషిలోనూ వుండే ఆలోచన, వివేచన, అనుభూతి నీలోనూ వున్నాయి. స్వయం సత్తాక ప్రతి పత్తిని సాధించగల సామర్ధ్యం నీకూ వుంది నీలో నిబడీకృతమై వున్న శక్తులన్నిటిని ప్రకటించగల స్వేచ్ఛ నీకుంది అది సాధించగల నేర్పు నీకుంది

ఆ సాధన కోసం నువ్వుపోరాడాలి. ఆ పోరాటం ఓ భార్యగానో ఓ తల్లిగానో, ఓ స్త్రీగానో పరిమితం చేసే సంకుచిత పోరాటం కాకూడదు 'నువ్వు మనిషిలా పోరాడాలి. ఓ మనిషిలా సాధించాలి. ఓ మనిషిలా నిరూపించుకోవాలి "

అనూరాధ ముఖం విప్పారింది.

"నీ మీద అరాచికాలు జరుగుతుంటాయ్ - దౌర్జన్యాలు జరుగుతుంటాయ్ దురాగతాలు జరుగుతుంటాయ్ - వీటన్నిటి ఎదుర్కోవాలి. నీ మీద పెత్తనం ఎవరైనా చలాయించాలని ప్రయత్నిస్తే వీటన్నిటిని నిర్ద్వంద్వంగా ఖండించాలి. చేసేది ఎవరైనా నువ్వు ఎదిరించు.

అది వ్యక్తులైనా సమాజమైనా మతమైనా - రాజ్యమైనా నీ మీదా నీ ఆలోచనల మీద సవారి చేసే అధికారం కానీ - నీ పరిధి కుంచింపజేసే అధికారం కానీ - ఎవ్వరికీ లేదు - "

"నన్నేం చేయమంటావ్ మామయ్యా - "

"నువ్వేం చేయాలో నువ్వే నిర్ణయించుకో. అది నీ అభిరుచిని బట్టి అవకాశాన్ని బట్టి వుంటుంది. నువ్వేం చేయాలో నేను చేపితే నీ స్వయం నిర్ణయశక్తి ఏం వుంది ? కానీ ఒకటి గుర్తుంచుకో స్వయంగా నిర్ణయాలు తీసుకొంటున్నపుడు దాని పూర్వపరాలను భరించే శక్తితో పాటు భవిష్యత్ ఫలితాలవల్ల కలిగే పరిణామాలను గెలుపు ఓటమిలను భరించే శక్తి నీకు ఉండాలి."

"అంటే - ? "

"నిన్ను నీవు నిర్మించుకోవాలి ! నీ నిర్ణయాల ఫలితాలకు నువ్వే బాధ్యురాలివన్నది గుర్తుంచుకోవాలి కానీ, నీ నిర్ణయాల వలన మరొకరికి హాని జరగకూడదు. నష్టపోకూడదు. నీకు నీవే నిర్ణయించుకోవడం వలన నీ జీవితంలో ఏనాటికైనా ఎడారి పొడలు మిగుల్చుకోకూడదు"

"నీలో విచక్షణవుంది. మంచినీ చెడునీ విడదీసి చూపగల హేతుత్వ శక్తి వుంది ఈ శక్తే ప్రతి మనిషిని జంతుజాలంలోంచి ముందుకు నడిపించింది. - "

"ప్రతి మనిషికి ఆశక్తే వుంటే మా అత్తయ్య అంత మూఢంగా ఎందుకు ప్రవర్తిస్తుంది ? " అనూరాధ అడ్డొచ్చింది

"ఆమెలో మాత్రం ఎందుకు లేదు ? ఆమె పిల్లలు పుట్టడం లేదు కారణం ఏమిటని ప్రశ్నించుకుంది అమెకు ఆమెకు ఏదో సమాధానం దొరికింది దాన్నే అమలు పరిచింది !"

"అది మూర్ఖత్వం - "

"అట్లాంటి సమాధానాలు పొందేవాళ్ళు మన సమాజంలో నూటికి తొంభై తొమ్మిది మందున్నారు. కాకపోతే అందుకు భిన్నంగా ఆలోచించగలిగిన ఆ ఒక్కరే పిల్లలు పుట్టడానికి కారణాలేమిటో కనుక్కోవడం నుంచి - పిల్లలు ఎప్పుడు పుట్టాలో నిర్ణయించుకొనే వరకు శాస్త్రాన్ని నడిపారు. ఆమె ఇంకా పిల్లలు పుట్టడం మనిషి చేతుల్లో పని అని నమ్మే స్థితిలో లేదు అదీ విషయం - "

"మరి నేనెలా ఆమెతో సమన్వయం కుదుర్చుకోవాలి - "

"ముందు నువ్వు ఆమె లాంటి వాళ్ళే ఈ సమజాంలో ఎక్కువగా వున్నారన్న వాస్తవాన్ని అంగీకరించు. ఆమెతో సహనంగా సానుభూతితో అర్థం చేసుకో. నీ ప్రయత్నం మిగిలిన తొంభై తొమ్మిదితో పాటు ఈమెను మార్చేది అయివుండాలి. శక్తినంతా ఈమె ఒక్కదాన్ని మూఢత్వంలోంచి బయట పడేయడానికే వెచ్చించడంలో అర్థం లేదు. మరింత విశాల దృష్టితో ఈ సమస్యను అర్థం చేసుకోవాలి. దాని పరిష్కారం కూడా సంకుచితంగా వుండకూడదు - "

"నువ్విందాకే అన్నావే - ద్వేషిస్తూ ఎక్కువ కాలం వుండలేననీ అదీ నిజమేనమ్మ - ఎవర్నీ ద్వేషిస్తూ వుండడం మానవతత్వమే కాదు. ప్రేమించడం మనిషి సహజ లక్షణం. ప్రేమ ద్వేషం ఈ రెండు విరుద్ధ స్వభావాలు మనిషిలోనే వున్నాయి. ప్రేమతో పెనవేసుకున్న మానవ సంబంధాలన్నీ ఆనందాన్ని పంచుతాయి. మనకు తెలిసి ప్రేమను ప్రేయసీ ప్రియులకే పరిమితం చేస్తూ వుంటారు - ఎంత సంకుచిత దృష్టో చూసావా ? ప్రేమ విశ్వవ్యాప్తమైనవి. అది ప్రేయసీ ప్రియుల మధ్య ప్రేమ మాత్రమే కాదు. అన్నిటా ప్రేమ నింపుకోవాలి. ఈ ప్రకృతిని ప్రేమించాలి. నీ వృత్తిని ప్రేమించాలి. ప్రేమించడం తెలిసిన వాళ్ళే విశ్వమానవ కల్యాణానికి మూలమవుతారు.

ద్వేషం పునాదుల మీద నిలిచే ఏ సామ్రాజ్యమైన కుప్పకూలి పోవలసిందే ద్వేషం మనిషిని మాడిమసి చేస్తుంది ప్రేమ జీవం పోస్తుంది అన్యాయాన్ని ఎదిరించడానికి ద్వేషాన్ని ఆయుధంగా చేసుకోకూడదు. దాని ఫలితమూ ద్వేషపూరితమైనదే అవుతుంది న్యూటన్ మహాశయుడు అన్నట్లుగా మనం చేసే ప్రతి పనికీ ఎదుటి నుండి అదే రకం ప్రతిచర్య వుంటుంది మనం ద్వేషిస్తూ ద్వేషాన్నే పొందుతాంది. ప్రేమిస్తే ప్రేమను పొందుతాం

ద్వేషాన్ని రగిల్చి రక్తపాతాలు చేసి మానవ ప్రవృత్తిని కుళ్ళ బొడిచే ఏ పోరాటాలైనా ఎంత గొప్ప విజయాన్ని సాధించామని విర్రవీగినా - మనిషికి జంతు స్థాయిలోనే దిగ జార్చుతాయన్నది నిజం దిగ జార్చడమే కాదు ఎదగనీయకుండా అక్కడే వుంచుతాయి

విద్వేషం, విధ్వంసం, ఇవన్నీ జంతువులకి చెల్లుతాయి మనుషులకు కాదు కాకపోతే మానవ సంస్కృతిని సర్వనాశనం చేస్తాయి. మానవ నైజాన్ని పతనం చేస్తాయి - అవి సాధించడానికి వేసిన మార్గాలు - "

అనూరాధ ఆలోచనలో పడిపోయింది

"ఏంటీ మామకోడళ్ళు మంతనాలాడుతున్నారు ? " ఇంతలో శివుడు నవ్వుతూ అంటూ వాళ్ళ దగ్గరికి వచ్చాడు

"ఆ - ఏం లేదురా అబ్బాయ్ - "

"ఆ - అనూరాధ ఇదుగో - నీ నగలు తీసుకో ! ఇప్పుడే సుధాకర్ బ్యాంక్ నుంచి తెచ్చాడు. సూట్‌కేస్‌లో సర్దుకో - "

శివుడు అనూరాధ చేతికి నగలు పెట్టి వున్న టిఫిన్ బాక్స్ ఇచ్చాడు.

అనూరాధ బాక్స్ మూతతీసి వాటిని పరీక్షగా చూసింది.

తన తల్లి నగలు, తన అత్త నగలు - వీటితోపాటు కొత్త పెళ్ళికూతురిగా ముడేసుకొన్న మధురానుభూతులు - అమ్మమ్మ ప్రేమ, మేనత్తల మురిపెం, అత్త అభిమానం - అనూరాధ ఒక్కొ నగను పరిశీలనగా చూస్తోంది.

"నంగనాచి తీరున ఒక్కమాట చెప్పకుండ పెట్టకుండ మీ వోల్లకు నగలిచ్చినావ్ ? ఎవర్నడిగినవ్ ? ఒక్కగా నొక్క కోడల్నివని ఎంత ముద్దుతోన చేపిస్తి ! గా హౌసలయాన[1] ముకంల మూడు పంటలు గింజలు పోస్తి - నా అత్త బంగారం నా చంద్రారం - రేణ్క ముచ్చట పడ్నగా మరక కుందనాలు కంకనాలు - అన్నీ కొండపోయి[2] వాల్ల ఇంట్లపోస్నావ్ - "నారాయణమ్మ గద్దింపులు జ్ఞాపకంవచ్చి అనూరాధ ఉలిక్కిపడింది.

"అత్తసొమ్ము అల్లుని దానం అంటే గిదే - నీకు బుద్ధిలేక ఇచ్చినవ్ మల్ల వాల్ల దిమాక్ ఏమాయే - ఆడుపిల్లకు సొమ్ములు పెడ్తరా ?

---

1 కంసాలి 2 తీసుకెళ్ళి

ఆమె తాన్నుంటి సొమ్ములు గుంజు కుంటరా ? మల్ల సదువుకున్నోల్లు ! సదువులెందుకు సంకనాకనింకె !

కోరి కోరి కొరివితోన నెత్తి గీక్కునట్టాయె - మొదలుకుగా రాంనాధమోళ్ళ పత్తంతా నిప్పుల్ల పడె -ఇంగ గీ సొమ్ములు ఎప్పట్కి ఇంటికి రావాలె - ఎప్పుడు నీ వంటిన మెర్వాలే - నా కొంప ఆగమాయె నా కొడ్కుకు శనిపట్టె - వాన్ని ఫకీరోన్ని చేసి వదల్తావే సైతానమ్మె - పీర్ల పండగనాడు నిప్పుల గుండలం నడిచినట్లాయె - నా కొడ్కు బత్కు"

అనూరాధ నెమ్మదిగా ఆ నగలను ఒక్కొక్కటీమునివేళ్ళతో కదిలించింది

"వంటి మీద పైనుంచి కిందికి దిగేసుకుంటే ఏం ఒరుగుద్ది? ఓ పెంపా? సొంపా?" సావిత్రి ఎప్పుడూ అనే మాటలు గుర్తొచ్చాయి

అనూరాధ ఆలోచనలో పడింది

"బాబాయ్ నువ్వు, తొందరగా రావాలి అవతల పక్కవూరి రైతులు వచ్చారు నీ కోసం ఎదురు చూస్తున్నారు-"

"ఎవర్రా వచ్చింది?"

"కేసన్న, సోమన్న, నాయణప్ప చిన్న కొడుకు, తిక్కన్న, తిమ్మన్న, ఇంకా మరి కొందరు రైతు యువకులు - మన హనుమంతు తీసుకొచ్చాడు."

"ఎవరు రాజయ్య కొడుకు హనుమంతే-! ఏవిటో విషయం?"

"రేగడి విత్తులు కావాలంట-" శివుడు నవ్వాడు.

రామనాధం ఉత్సాహంతో అతనితోపాటు కదిలాడు.

"మామయ్య - ఒక్క నిమిషం," అనూరాధ వెనుకనుంచి పిలచింది,

"ఎంటమ్మా?" రామనాధం ఆగి, ఆమెవంక చూసాడు

"ఇవి నీ దగ్గరే వుంచేయి మామయ్య-" అనూరాధ నగల బాక్సను రామనాధం చేతికి అందించబోతూ అంది.

"దేనికమ్మా?" రామనాధం ఆశ్చర్యంగా అడిగాడు

"ఇది నాకు అవసరం అనిపించడం లేదు. నాకు అవసరం వున్నయ్యి నీ దగ్గర వున్నాయి. ఇవి తీసుకొని అవి ఇవ్వు?".

"ఏమిటవి?"

"రేగడి విత్తులు"

❋ ❋ ❋

``శివుడూ, ఈ యేడు మనకి ఎక్కువ ఫౌండేషన్ సీడ్ పర్మిషన్‌కు పెట్టాంరా - ఎక్కడెక్కడ వేద్దామంటావ్?''

రామనాథం శివుడు ఇంటిముందు వేపచెట్ల కింద కూర్చుని మాట్లాడుకుంటున్నారు

``ఇప్పటికే కూలీల ఎద్దడి వుంటే మళ్ళీ ఎక్కడ ఏస్తాం బాబాయ్? పెట్టుబడి కూడా పెరగదూ?''

``అట్లా అనుకుంటే ఎట్లాగరా? చూడు ప్రత్తిలో ఎన్ని మార్పులో వచ్చాయిరా? సువిన్ కళ్ళు తిరిగేలా మూడువేలు పలికింది అంతా సువిన్ వెంటపడ్డారు ఉత్పత్తి పెరిగింది రేటు అమాంతం మూడువందల యాభైకి పడిపోయింది ఈ ధరలు తాటాకుల మంటల్లా గుప్పున పెరగడం చప్పున తరగడం - అసలు ఈపూట వరలక్ష్మి ఐదువందల ఆరువందలకి పడిపోయింది కదా-''

``మరి విత్తనాలు ఏ రకం ఉత్పత్తి చేద్దామని?''

``మనకి ఎప్పుడూ బ్రీడర్ సీడ్ ఇస్తారే సైంటిస్ట్ మూర్తిగారు - వారితో పాటు మధ్యప్రదేశ్ వెళ్ళోచ్చాన్రా - JKHY–I అనీ JKHY–II అనీ రెండు కొత్తరకాలు - వాళ్ళు ఆంధ్రప్రదేశ్‌లో ప్రయోగించి చూద్దామనుకుంటున్నారట అవి తెచ్చాను.''

``అదేంటి బాబాయ్ - అక్కడ ప్రయోగిస్తే చాలదూ - మన వాతావరణం వాళ్ళ వాతావరణం ఎంత తేడా? అక్కడి విత్తనాలు మన దగ్గర ఎట్లా దిగుబడి నిస్తాయో-''

``అదే కదరా తెలుసుకోవల్సింది మూర్తిగారు వచ్చి మధ్య మధ్యలో చూస్తామన్నారు. మన నేల వేరు, మన వాతావరణం వేరు మరి దిగుబడి ఎట్లా వుంటుందో చూసుకోవాలి-''

``ఆ పని మనం ఎందుకు చేయాలి బాబాయ్? మన కేమన్నా జాగీర్లు పడి వున్నాయా? కావలసినంత పంట పండించుకొనేందుకు మన భూములు సరిపోవట్లా - వూళ్ళో మగతాకి కూడా దిమ్మ తిరిగే రేట్లున్నయి. సుబ్బరంగా తెలిసిన పంట వేసుకొని, దిగుబడి పెంచుకొని ఆదాయం తెచ్చుకోక, మళ్ళా కొత్త దెందుకు బాబాయ్-''

``ఒరేయ్, అనకూడదు కానీ, నీకు నీ తమ్ముడికి నేనేం చెప్పినా కాదనడం మామూలయిపోతుందిరా-'' రామనాథం నిష్ఠూర పడ్డాడు. చిన్నబోయిన రామనాథం ముఖం చూసి శివుడు నెమ్మదిగా అన్నాడు -

``అట్లాగని కాదు బాబాయ్ - నిన్న కాక మొన్న వచ్చిన వాళ్ళు మనముందే ఇళ్ళు కట్టారు ఇంటికో ట్రాక్టరు మనిషికో బుల్లెట్ - ఆడవాళ్ళ వంటిమీద నగలు - మనమూ కష్టపడుతున్నాం. కానీ ఎక్కడ వేసిన గొంగడి అక్కడిలాగానే వుంది పరిస్థితి. ప్రతి ఏడాది వచ్చే ఆదాయంలో నువ్వు ఏదో ఓ కొత్త ప్రయోగం అంటావ్. అదక్కడకి సరిపోతుంది. మన పిల్లలు ఎదిగొస్తున్నారు వాళ్ళ చదువులు, పెళ్ళిళ్ళు - వరుస మొదలవుతుందిగా. ఇళ్ళు వాకిళ్ళు అమర్చు కోవద్దా-''

రామనాథం శివుడి ముఖంలోకి విస్మయంగా చూసాడు.

శివుడు మాట్లాడలేదు - ఇంట్లో ఒక్కోరి అసంతృప్తిని అతని కంఠంలో ఇంట్లో వారందరి అభిప్రాయాలను కలిపి తనదిగా చెప్పాడు అవును అందరూ ఎందుకు చెడ్డ కావాలి అయ్యేదేదో తనొక్కడే అవుతాడు - "

"నమస్తే రాంనాథం సాబ్ - "

రామనాథం శివుడు తలెత్తి చూసారు

పంతులుగారి చిన్నబ్బాయి

"నమస్తే - నమస్తే - ఏంటి బాబూ ఇట్లావచ్చావ్ ? బడి ఎట్లా వుంది ? " రామనాథం ఆత్మీయంగా పలకరించాడు.

"బడి ఎక్కడెడండీ ? నా పెద్ద బాలశిక్ష, ఎక్కాలు శతకాలు, తెలుగు పుస్తకాలు చదివేదెవరండీ ? కర్నూలులో మంచిమంచి కాన్వెంట్లొచ్చాయి. పిల్లలంతా అటే వెళ్ళి పోతుండిరి "

" మా పిల్లలు కూడా వెళ్ళారుగా - " శివుడు అందించాడు

"తప్పదండీ - మా పిల్లల్నే గద్వాల్లో మా పెదబావగారింట్లో వుంచి చదివిస్తున్నాను - ' ' అతను నవ్వాడు, " అందులోనూ వచ్చిన ఆసాములందరూ వాళ్ళ పిల్లల్ని మరోచోట హాస్టళ్ళలో చేర్చే వస్తుండిరి "

"నిజమే నండి, మనవుళ్ళో సెలవుల్లో తప్ప బడిరోజుల్లో పిల్లలు చూద్దామన్న కనిపించదు - "

"ఇంతమందిమి ఉండి ఒక బడి నడపలేకపోతిమి - " రామనాథం విచారంగా అన్నాడు.

"మీరు మంచి కోరే మమ్మల్ని పిలిపించారు ఇట్లా వాకిలి ఇచ్చారు. కానీ మేమే నిలబెట్టలేకపోతున్నాం - " అతను కూడా బాధపడ్డాడు.

"ఇప్పుడేం చేద్దామని ? "

"మీ దగ్గరకి వచ్చింది ఆ పని మీదేనండి - మా మామగారు మాకిచ్చిన మడిచెక్క వుంది మగతాకి ఇస్తూ వస్తున్నాం. మీరు సహాయం చేస్తా నంటే నాటు వేద్దామని - "

రామనాథం అతని వంక ఆశ్చర్యంగా చూసాడు.

"మీరు హాలికులవుతారా ? "

"ఈ భారతావని మీద గర్వంగా తలెత్తుకు తిరగ గలవాడు ఒక్క రైతే నన్నారట వల్ల భాయి పటేల్ - నేనూ రైతు నవ్వాలని నిశ్చయించు కున్నానండి -"

అతని కంఠంలో విశ్వాసం గుసగుస లాడింది.

రామనాథం, శివుడు ఆనందంగా ఒకరి ముఖాలు ఒకరు చూసుకున్నారు.

"కాకపోతే " అతను నసిగాడు, "మా నాన్న వున్న పొలాన్ని మగతాకి ఇచ్చిందే కానీ ఏనాడూ సేద్యం చేయలేదు నాకు కాడి మేడి కూడా తెలియదు మీరు నా వెనక వుంటానని మాటిస్తే చేలోకి దిగుదామని -"

"భలేవాళ్ళే - మీరు ప్రత్యేకంగా చెప్పాలా - మీకేం సందేహం వచ్చినా సాయం కావాల్సినా మా శివుడుకికబురంపండి మా వాడు ఏ పనైనా సొంతపనిలా చేస్తాడు. -"

"అది వేరే చెప్పాలండీ - కానీ, మరో విన్నపం -"

"ఏంటండీ ?"

"నాకు కొన్ని రేగడి విత్తులు ఇవ్వగలరా ?"

"భలేవాళ్ళే-" రామనాథం నవ్వాడు " శివుడూ, వెళ్ళి ప్యాక్ చేసిన విత్తనాల సంచిటు పట్రా-"

ఇంతలో రోడ్డు మీద కొత్త ట్రాక్టర్ రావడం కనిపించింది

"ఎవర్రా అబ్బాయ్ ఆ వచ్చేది ?"

"ఏమో బాబాయ్ -"

ట్రాక్టరు తిన్నగా వారి దగ్గరకే వచ్చింది

ట్రాక్టరు దిగి వచ్చింది హనుమంతు రాజయ్య కొడుకు. శివుడు గబగబ ట్రాక్టరుకు ఎదురు వెళ్ళాడు.

"శివన్నా, ఎట్లున్నది కొత్త ట్రాక్టరు -" కొత్త ట్రాక్టరు చూపిస్తోన్న హనుమంతు ముఖం తళతళ మెరుస్తోంది.

"బ్రహ్మాండంగా వుంది "

'ఒక్కసారి నువ్వెక్కి బండితోలన్నా - నాక్కలిసి వస్తుంది" హనుమంతు శివుణ్ణి ఎక్కి, ట్రాక్టర్ నడుపుతున్నారు

ట్రాక్టర్ నడుపుతున్నా ఎద్దుల బండి తోలడమనే మాటను రైతు వదలలేదేమో - రామనాథం నవ్వుకున్నాడు

రామనాథం దగ్గరకి రాగానే హనుమంతు గబగబ వచ్చి అమాంతం కాళ్ళ మీద పడబోయాడు. "ఛ... ఛ... ఇదేంటబ్బాయ్" రామనాథం హనుమంతును లేపి ఆలింగనం చేసాడు.

"గా దినం మీ మాట ఇని బాగుపడ్తి నా బిడ్డలు మంచిగ ఇస్కూల్ పోతున్రు. నేను ఇల్లు వాకిలి కడితి మా అమ్మా దుఃఖం పాయె. అంతా మీవల్లే -" హనుమంతు కళ్ళు మిలమిల మెరుస్తుండగా అచ్చంగా ఆ ఆంజనేయస్వామి రాముల వారికి ప్రకటించి నంత విశ్వాసాన్ని ప్రకటించేసాడు.

"భలే వాడివనే నేను చేసేది ఏ ముంది ? ఆ పూట మీ అమ్మ వద్దని వారిస్తున్నా ధైర్యం చేసి నిర్ణయం తీసుకున్న వాడివి నువ్వు. కొత్తపని చేయడానికి ధైర్యం వుండాలి ఆపని పట్ల ప్రేమ వుండాలి అవగాహన వుండాలి నిజాయితీగా నిబద్ధతతో కృషిచేస్తే ఎందుకు విజయం సాధించరు ?

నేను నీ శ్రమకు సాటి రైతుగా సాయం చేసానే గానీ, మరో ఘన కార్యమేమీ చెయ్యలా - అంతా నీ కష్టార్జితం "

రామనాథం నవ్వుతూ హనుమంతు భుజం తట్టాడు

"మీ రెనన్నా చెప్పండి మీ మాట మాకు గురి -"

ఇంతలో సావిత్రి వాళ్ళు బయటకు వచ్చారు.

"పిన్నీ మన రాజయ్య గారి అబ్బాయ్ హనుమంతు ట్రాక్టరు కొనుక్కొచ్చాడు -" శివుడు పరిచయం చేసాడు

సావిత్రి సంతోషంగా ట్రాక్టరును చూసింది. గబగబలోపలికి వెళ్ళింది

పంతులు గారబ్బాయిలో హనుమంతు రాక ఎంతో ఉత్సాహాన్ని నింపింది. గొప్ప ఉల్లాసంలో రామనాథం అందించిన రేగడి విత్తులు తీసుకొని ఇంటికి వెళ్ళాడు.

హనుమంతు గబగబ ట్రాక్టరు దగ్గరకి వెళ్ళాడు.

"ఇదో శివన్నా, చిన్నాయనా ఈ స్వీట్లు తీసుకోండ్రి - వస్త వస్త పుల్లా రెడ్డి దుక్నంల తెచ్చిన -" హనుమంతు స్వీట్లు ప్యాకెట్టు తెచ్చాడు.

ఇంతలో సావిత్రి, శాంతమ్మ ఓ తాంబాళం తీసుకొచ్చారు దాంట్లో పచ్చి వుండ్రాళ్ళు, కొబ్బరి కాయ పసుపు కుంకుమలు, హారతివ్వడానికి దీపపు కుందులు, పూల దండ వున్నాయి సావిత్రి ట్రాక్టరు ముందు భాగాన పసుపు తో గుండ్రంగా వ్రాసింది. మధ్యలో కుంకుమ బొట్టు పెట్టింది.

రామనాథాన్ని పిలిచి కొబ్బరి కాయ కొట్టించారు. కొబ్బరి నీళ్ళు ట్రాక్టర్ ముందు వార పోసారు. బండికి హారతిచ్చారు ఒక్కొక్కళ్ళు పచ్చి వుండ్రాళ్ళు గుప్పిళ్ళలో తీసుకొని బండి మీదకు విసరారు

"శివన్నా, ఇగో గీ ఎద్దు బొమ్మ చూస్తివా - మీట్రాక్టరును చూసి పెట్టిస్తి -" హనుమంతు ట్రాక్టరు ముందు భాగాన అమర్చిన చిన్న సిల్వర్ ఎద్దు తలను సంతోషంగా చూపించాడు.

శివుడు దగ్గరకు వచ్చి ముట్టుకొని చూసాడు.

"ట్రాక్టరు వచ్చిందని ఎద్దులను మరవడం మన వల్ల కాదు బాబూ-" రామనాథం అన్నాడు "ఈ నాటికీ ఎద్దుల పని ఎద్దులకే వుంటోంది."

"అసలు ఎద్దులు లేని దొడ్డి రైతు దొడ్డి కానేకాదు-"

రత్తయ్య వచ్చి అందుకున్నాడు.

హనుమంతు అందరికీ పుల్లారెడ్డి స్వీట్లు పంచారు

"కర్నూలు నుంచి బండి తీసుకొని నేరుగా ఇట్లేవస్తి" హనుమంతు రత్తయ్యా ఏదో అడిగితే అంటున్నాడు- "ట్రాక్టరు తోలుడెట్లనో శివన్న నాకు ముంగట్నే నేర్పిండు -"

హనుమంతు శివుడి దగ్గరకు వచ్చి అన్నాడు, "శివన్నా - ఏ పొద్దులన్న నా బండి కావాల్నంటే వచ్చి తీస్కపో - ఇంక ఇది నీదేనను కోరాదూ -"

"అలా తొందర పడి అనేవు అబ్బాయ్ - నీ కొత్త బండి మీద మహామోజు పుట్టు కోస్తోంది - ఇంక మాది చావిట్లో పడేసి నీదే వేసుకు తిరిగేస్తా -" శివుడు అల్లరిగా అన్నాడు

"అంత కంటెనే అన్నా - గిదంతా నువ్వు చిన్నాయాన పెట్టిన దయ కాదూ-"

"అబ్బాయ్ హనుమంతూ -" రామనాథం అడ్డొచ్చాడు, "ఎప్పుడు కూడా విశ్వాసం వుండాలి కానీ మూఢ విశ్వాసం వుండ కూడదు వ్యక్తి పూజ మూఢ విశ్వాసం వ్యక్త మీద గౌరవం వుండాలి మూఢ విశ్వాసం వుండ కూడదు ఎప్పుడైనా నేనేది చెప్పినా నీ బుద్ధిని బట్టె నీ విచక్షణను బట్టి నీకు మంచేదో దాన్ని గ్రహించు కోవాలి చెడేదో వదిలేసు కోవాలి అంతే కానీ, 'మా రాంనాథం చిన్నాయన చెప్పిండు - చేసితీర్త' అన్న గుడ్డి నమ్మకం పెంచు కోవద్దు, ఎందు కంటే నీ హేతుత్వ శక్తి నీకు వుంది. నీ అనుభవాలు నీకు వున్నాయి ఒక పని చేయలో లేదో నిర్ణయించు కొనే స్వేచ్ఛ, ప్రజ్ఞ నీ కున్నాయి ఆ నిర్ణయాధికారం నీ చేతుల్లోనే వుండ నివ్వాలి - తెల్సిందా?"

హనుమంతు బుద్ధిగా తలూపాడు

"మీరట్టా ఏక బిగిన చెపితే అతనికి ఏం అర్థమవుతుంది-" సావిత్రి గొణిగింది

"ఆ హనుమంతూ చె ్ప ్కం మర్చి పోయాను ఈ సారి హైబ్రీడ్ సీడ్స్ ఉత్పత్తి చేస్తావా ? మీ వూళ్ళో మా మల్లేశ్ అనూరాధ వేస్తున్నారు కదా ? నువ్వు ఎందుకు వేయకూడదు ?"

హనుమంతు ఆలోచన లో పడ్డాడు, "మల్లేశన్న వదిన మంచిగ చేస్తున్రు - నా వల్ల ఏడయితది ?"

"మళ్ళీ కొత్తపని చేయడానికి అనుమానమా ? ఎందుకు ? వాళ్ళు చేయగా లేనిది నేనెందుకు చేయలేనని ప్రశ్నించుకోవెందుకు ?"

హనుమంతు ఇంతకు మునుపు అయితే బుర్ర చకచక వూపేసేఎ దే - రామనాథం మాటలు విన్నాడు కాబట్టి కాసేపు ఆలోచించాక బుర్ర చకచక వూపేసాడు.

రామనాథం అతనికి ఫౌండేషన్ సీడ్ ఇచ్చి సాగనంపాడు.

హనుమంతు వెళ్ళిన కొద్ది సేపటికి సుధాకర్ వచ్చాడు విషయాలన్నీ విన్నాడు. ఇంతెత్తున ఎగిరి పడ్డాడు.

"ఏంటి నాన్నా మీరు చేసే పనులు ? రోజురోజుకీ చిన్న పిల్లాడి వాలకం అవుతోంది ఆ చిట్టి బాబుతో మొదట్నించి మనకి వైరమే కదా - తెలిసి తెలిసి అతనికి ఫౌండేషన్ సీడ్ ఇచ్చారు మనం ట్రెయిన్ చేసిన కూలీలందర్ని ఆయన పట్టు కెళ్ళాడు. మళ్ళీ మనం కొత్త వాళ్ళను

వెతుక్కొని పని నేర్పించాల్సి వస్తోంది - కూలీలకు నాలింగితల రేటు పడేస్తున్నాడు అతనిది ఒక ప్లాటు మనవి ఆరేడు. అతని కేం నష్టం ? మనమేగా పెట్టుబడి ఎక్కువ పెట్టాల్సింది ?''

"అయితే ఏమంటావ్ రా ? మనం తప్పించి ఇంకెవరూ సీడ్ వేయకూడదంటావా ?'

"అలా అని నేనేమి అనడంలా - పరిస్థితేమిటో చెప్తున్నా ఇప్పుడీ హనుమంతుకి సీడ్ ఇచ్చి పంపించావ్ - అప్పుడు అనూరాధ వాళ్ళు ఇదే సమస్యలో పడతారు, కూలీలకు ఎవరు ఎక్కువ ఇస్తే వాళ్ళమ్మట పడిపోతారు కానీ, పని ఎవరు నేర్పించారు అని గుర్తు వుంచుకుంటారా ఎప్పటికప్పుడు కొత్త వాళ్ళకి పని నేర్పించడం ఎంత కష్టం ? అందులోనూ వూరేమన్నా కూలీల అక్షయ పాత్రా ? కావాల్సినంత మంది పుట్టుకు రావడానికి ?''

"నిజమే సుధాకర్, కానీ మనం ఆధునిక వ్యవసాయంలోకి అడుగులేస్తూ పక్క రైతుల్ని అట్లా ఎలా వదిలేద్దాం ?''

"అవ్వన్నీ నాకు తెలియదు వాళ్ళేమన్నా మిమ్మల్ని నేర్పించమని బతిమిలాడు తున్నారా ! కృతజ్ఞతన్నా చూపిస్తున్నారా ? మీరు మార్కెటింగ్ కోసం ఎంత కష్టపడుతున్నారు ? ఈ చిట్టి బాబు గాడు మీరు వెళ్ళిన చోటికే వెళ్ళి మీ పేరు చెప్పుకొని తన సీడ్ అమ్ముకుంటున్నాడు అది మనల్ని క్షణక్షణం మార్కెట్ వెతుక్కొనే పనిలో పడేస్తోంది గుర్తు పెట్టుకోండి - అంతే కాదు - ఆ చిట్టి బాబు ఏ వెధవ పనులు చేస్తాడో - ఏ ఛండాలం చేస్తాడో, అంతా మనకు మనవూరికి మన నడిగడ్డకు అంటగడతారు. మళ్ళీ మనం మార్కెట్‌లోకి ఏ మొహం పెట్టుకు వెళతాం ?''

సుధాకర్ టకటక అని విసురుగా లోపలికి వెళ్ళాడు రామనాథం స్తబ్దుడై పోయాడు 'నిజమే, సుధాకర్ చెప్పిందంతా నిజమే ఒక సంచి విత్తనాలు అమ్మడం ఎంత కష్టం ? ఒక సబ్బు బిళ్ళనో మందు బిళ్ళనో అయితే ఓ సారి ప్రయత్నించి చూద్దాం లెమ్మని వాడుకుంటారు కానీ విత్తనాల మీద పంట ఆధారపడుతుంది. విత్తనాలు కొనడానికి ఏ రైతు తొందర పడి నిర్ణయం తీసుకోడు.

అదునులో విత్తనం నాటక పోతే ఆ యేడు రైతు పంట పోతుంది. ఏదో ఒక విత్తనాలు తీసుకొని నాటేస్తే దిగుబడి వస్తుందో రాదో చీడలు పీడలు ఎట్లా తగులు కుంటాయో ఏయే పురుగులు ఆశిస్తాయో-తెలియని కొత్త రకం విత్తనాలు వేసి ప్రయోగం చేయడానికి రైతు ధైర్యం చేయడు. అది అతని బ్రతుకుతో చెలగాటం.

కానీ తను వెళ్ళిన ప్రతి చోట ఎంతగా నచ్చచెప్పినా ప్రతి వాడూ సంప్రదాయ సేద్యాన్నే నమ్ము కుంటానంటున్నాడు. దేశవాళీ పంటల్నే పండిస్తున్నా నంటున్నాడు

ఒక్కో వూరిలో శివార్లలోంచే తరిమేస్తున్నారు - "భలే చెప్పొచ్చావు లేవోయ్'' అంటూ

ఒక్కోవూరిలో అంతా విని ఓ హరికథా కాలక్షేపం చూసినంత ఆనందించి తమ పనులకు తాము వెళుతున్నారు

ప్రతి వూరిలోనూ ఎవరో వులిపి కట్టె వుంటాడు. వాడు ధైర్యం చేస్తాడు సంప్రదాయాలకు భిన్నంగా ముందడుగు వేస్తాడు ఒక పంట పోతే పోయింది వస్తే లాభం వస్తుంది పోతే అనుభవం వస్తుంది అనుకుంటాడు. వాడి మొండి ధైర్యంతో సంప్రదాయ పద్దతుల సంకెళ్ళు తెగుతాయి. ప్రయోగం చేయడానికి భయపడ్డ వాళ్ళే ఫలితాలు అందు కోవడానికి పరిగెత్తుకొస్తారు. శివార్లలోంచి వెళ్ళ గొట్టిన తనను ఊళ్ళోకి రానిస్తారు

ఆ ఉలిపి కట్టెను అందరూ మరిచి పోతారు. తనూ ఈ వూళ్ళో అలాంటివాడే అది సహజ పరిణామం పరోపకారార్థ మిదం శరీరం అని అందరం అనుకున్నా పరాయి వాడికి నష్టం వచ్చినపుడు ఓదార్చక పోయినా సాయ పడక పోయినా - లాభం వచ్చినపుడు పంచుకోవడానికి అందరూ పరుగులు పెడతారు అందుకే ప్రయోగాలు అతి కొద్ది మంది చేస్తారు ఫలితాలు లెక్కకు మిక్కిలి అనుభవిస్తారు ఇది లోక నైజం - సుధాకర్ ఆవేశం సహజమే - చిట్టిబాబు ప్రవర్తన సహజమే.

చిట్టిబాబు మనకు పోటీ అవుతున్నాడని నేను తరువాత అడుగు వేయ కుండా నిలబడి వాడితో యుద్ధం చేస్తానా ? అది నా వల్ల కాదు. విజయం సాధించిన వంగడాల్ని వాళ్ళు ఉత్పత్తి చేయనీ - నేను మాత్రం ఈ కొత్త వంగడాన్ని ప్రయోగించి తీరాల్సిందే ' రామనాథం నిర్ణయించు కొన్నాడు

రామనాథం కొత్త వంగడం వేసిన ప్లాటులో ఎప్పటి కప్పటి పరిణామాల్ని ఆ విత్తనానికి జన్మనిచ్చి శాస్త్రజ్ఞుడికి ఉత్తరాల్లో తెలియ జేస్తూనే ఉన్నాడు

శివుడు, సుధాకర్ మిగిలిన వ్యవసాయమంతా చూసుకుంటున్నారు ఆ యేడు మల్లేశ్ అనూరాధ మంచి ఉత్పత్తి సాధించారు.

సుధాకర్, మల్లేశ్ ఆదోని వెళ్ళి ప్రత్తిని జిన్నింగ్ చేయించుకు వస్తున్నారు. గ్రేడింగ్, ప్యాకింగ్ పనులన్నీ అందరూ కలిసి చేస్తున్నారు

రామనాథం ఒక సంచిలో విత్తనాలు సర్దుకొని రేగడి వున్న చోటు కల్లా వెళ్ళి రైతులను కలుస్తున్నాడు. వెళ్ళ గలిగిన కిసాన్ మేళాలను, రైతు సదస్సులకు అన్నింటికి వెళ్తున్నాడు ఎక్కడో ఓ ఉలిపి కట్టె రామనాథం తెచ్చిన సంకర జాతి వంగడాల వైపు ఆసక్తి చూపు తోంది

ఆ యేడు మంచి పంట మీద వున్నపుడు, అలాంటి ఉలిపి కట్టెలందర్నీ ఆహ్వానించి, రాంనగర్‌లో రైతుసదస్సు నిర్వహించాడు మూర్తిగారు మరి కొందరు శాస్త్రజ్ఞులు వచ్చారు

విత్తనాలు నాణ్యతను గురించి, వాటి ప్రాధన్యతను గురించి వారికి వివరించారు వారం రోజులు పొలాల్లో తిరిగిన తరువాత, వీళ్ళు వాడుతున్న ఎరువుల వివరాలు, వంగడాలు తట్టుకొనే చీడల పీడల వివరాలు - పట్టుకొనే వాటి వివరాలు తెలుసు కొన్న తరువాత ఎన్నో సందేహాలు తీర్చుకొన్న తరువాత - కొందరు కొత్త నిర్ణయాలు తీసుకొనే ధైర్యంతో ఊళ్ళకు మళ్ళారు.

వాళ్ళందరూ ఎంతో మెలుకవతో తీసుకోవాల్సిన నిర్ణయమది

ఎందుకంటే నడిగడ్డ వాతావరణం, అచ్చం ఇలాంటి మట్టి మరో చోట వుండొచ్చు వుండక పోవచ్చు దానివలన ఇక్కడ అధిక దిగుబడి నిచ్చే వంగడానికి మరోచోట దిగుబడి లేకపోవచ్చు దాని వలన ఇక్కడ అధిక దిగుబడినిచ్చే వంగడానికి మరో చోట దిగుబడి లేక పోవచ్చు అలాగే ఇక్కడ దిగుబడి లేని వంగడం మరోచోట విజయం సాధించవచ్చు

ఆ ఏడాది అనూరాధ కూతురు బడికి వచ్చింది

బాలయ్య ప్రత్తి సేద్యం బాగా నేర్చు కున్నాడు శివుడు, సుధాకర్ ఎప్పుడూ సాయం చేస్తునే వుంటారు

అందుకనే రామనాథం ఒక నిర్ణయం తీసుకున్నాడు బాలయ్య వాళ్ళయింటికి వెళ్ళి చెప్పాడు

"వచ్చే ఏడు మార్కెట్ బావుంటుందని నాకనిపిస్తుంది ఇక్కడ పండించే సీడ్ సరిపోక పోవచ్చు మల్లేశ్ అనూరాధలన్ను మహబూబ్ నగర్ పంపిద్దాం - ఏ వంటారు ?"

బాలయ్యకు రామనాథం మాట రామబాణం

"ఏ మంట ? ఇక్కడ మనం చూస్కుందం వాండ్లని అక్కడికి పంపుదాం -"

"మా కోడాలు జేస్న సేద్యం నేను చేయలేక పోతి ఆమె నేర్పితే ఆ సుతారాలు నేర్చుకుంటి. మల్ల ఈ సేను సోకుకు మే మిద్దరం మస్తు ! వాల్లు పాలుమూర్ల సంసారం పెట్టుడే మేలు. బిడ్డను ఇస్కూలుకుగిట్ల పంపాలా -" ఈ మాటలు నారాయణమ్మ అంది

రామనాథం ఆనందంగ అనూరాధ వైపు చూసాడు

నారాయణమ్మ కోడలి వైపు ముచ్చటగా చూస్తోంది నా కోడలు నా కన్నా బాగా సేద్యం చేయగలదని ఆమె మనస్ఫూర్తిగా వప్పుకొంది ఆమె అనూరాధను అనూరాధగా గుర్తించింది. వాళ్ళ మధ్య ద్వేషం ఆవిరయింది

అనూరాధ అత్త వైపు చూసి అంటోంది, "భలేవాళ్ళు అత్తయ్య మీరు. సేద్యంలో మీ కన్నా నాకేం ఎక్కువ తెలుసని ? కాడి మేడి అంటే ఏమిటో కార్తెలు ఋతువులు అంటే ఏవిటో నాకు నేర్పింది మీరు -"

"బానే వుంది అత్తా కోడళ్ళ వ్యవహారం !" మల్లేశ్ నవ్వాడు. రామనాథం హాయిగా నవ్వాడు. 'అత్తా కోడళ్ళు ఒకరి పనిని ఒకరు గౌరవించు కుంటున్నారు ఒక మనిషిని అతను చేసిన పని ద్వారా గుర్తించడం గౌరవించడం అంటే ఆ పనిని గౌరవించి,నట్టే. అతను కాలంతో కలిసిపోవచ్చు. పని మిగిలిపోతుంది-' రామనాథం పైకి అన్నాడు, "సరిగ్గా, నేను మీ ఇంటికి మొదటిసారి వచ్చినపుడు లచ్చుమమ్మ మామ్మ - నా కోడాలు నాటు పెడితే గీత గీసి నట్టు - అని ఎంత ప్రేమగా అనిందో అదే ప్రేమ ఇప్పుడు మీ అత్తా కోడళ్ళ మధ్య కనిపిస్తోంది -"

"అవ్ - వాల్లు వాల్లు మల్ల మంచోళ్ళే - మధ్యల మనల్నే పాగలోల్లను చేస్తరు - బాలయ్య పరాచికంగా అన్నాడు.

"నీ మాటలకేమొచ్చె -" నారాయణమ్మ మూతి మూడొంకర్లు తిప్పింది

అశోకుడు తన కూతురు సంఘ మిత్రకు బోధి వృక్షపు కొమ్మనిచ్చి బౌద్ధాన్ని ప్రపంచ వ్యాప్తం చెయ్య మని పంపినపుడు ఎలా అనుభూతించాడో కానీ, రామనాధం రేగడి విత్తులను ఇచ్చి అనూరాధను పాలమూరు పంపించినపుడు సాక్షాత్తు ఆ చంద్రుని మీద కాలు మోపినంత ఆనందాన్ని పొందాడు

శివుడు సుధాకర్‌లతో సహా వెళ్ళి స్వయంగా వాళ్ళ చేత మొట్ట మొదటి సీడ్ ప్లాంట్ వేయించాడు

"మళ్ళీ ఇక్కడ వారికి ఈ పని నేర్పిస్తాం. మరొకడు వచ్చి వాళ్ళను తీసుకెళ్ళాడు మళ్ళీ నేర్పుతాం ఇంకొకడు వస్తాడు మనం చూస్తుండ గానే తామర తంపరలా ఈ విత్తులు ఎక్కడెక్కడికో విస్తరిస్తాయి -"

రామనాధం తన వారందరితో చెప్పాడు -

"ఈ క్షణం నుంచి గుర్తుంచుకోండి కేవలం రేగడి సీడ్స్ మాత్రమే రేగడి విత్తులు కావు. ఆ తుంగభద్ర తీరం నుంచి ఈ పిల్లల మర్రి వరకు వెలువడే ప్రతి విత్తు రేగడి విత్తు -"

"ఎవరి పిచ్చివారికి ఆనందం " సుధాకర్ మనసులో గొణుక్కున్నాడు



# 12

"ఎవ్రా అది - ఆగు - ఆగరా " శివుడు పొలాల మధ్య నుంచి గబగబ పరిగెత్తుతోన్న మనిషిని చూసికేకేసాడు.

శివుడు పిలుపు వినగానే అతను మరింత జోరుగా పరిగెత్తాడు

తిన్నగా పొలం మొదట్లో వున్న గుడిసెలో దూరాడు. "చేలో కొట్టాల్సిన మందు డబ్బాలున్నాయి. దొంగ వెధవ - ఒక డబ్బా ఎత్తు కెళ్ళినా చాలదూ ? "

ఆ పొలాన్ని సరళ భర్త ప్రసాద్ చూసుకుంటున్నాడు -

"ఓ పక్క క్రాసింగ్ అవుతుంది - ఈ మహానుభావుడు ఎక్కడున్నాడో " శివుడు గొణుక్కుంటూ గుడిసెవైపు వడివడిగా నడిచాడు.

గుడిసెలోకి దూరిన వాడు చటుక్కున బయటకు వచ్చి - శివుడ్ని చూడగానే సూబాబుల్ చెట్ల మధ్యకు పరిగెత్తాడు.

శివుడికి ఏదో అనుమానం వచ్చి వాణ్ణి వెంబడించాడు.

వాణ్ణి దొరకబుచ్చుకొని నిలేసాడు.

"ఏంట్రా - ఏంటా పరుగు ? నీ చేతుల్లో ఏమిటి ? "

వాడి ముఖం చెమటతో తడిసి ముద్దయిపోయింది. వీపు వెనుక పెట్టుకున్న చేతుల్ని మరింతగా బిగించాడు.

శివుడు వాడిని అమాంతం వంచేసి, వాడి చేతిని మెలిపెట్టాడు చేతిలోని సంచి లాక్కున్నాడు. "ఏముందిరా దీంట్లో - "

సంచి తెరిచాడు.

నువాక్రాన్ డబ్బా.

వాడు శివుడిని విదుల్చుకు పోబోయాడు

"ఎంత ధైర్యంరా నీకు! మా పొలంలోకే వచ్చి పురుగుల మందు ఎత్తుకెళ్తావ్" శివుడు వాడిని తన్నబోయాడు.

"వాల్లు ఇచ్చిన్రు - తీస్కపోతున్నా - నడుమ నన్నెందుకు కొడతావ్ ?"వాడు నిర్లక్ష్యంగా చేయి విదిలించుకొన్నాడు.

"ఎవర్రా ఇచ్చింది ? "

"ప్రసాదు దొర - గుడిసె లోపట వున్నాడు పోయి అడుగు - "తలబిరుసు సమాధానం ఇచ్చాడు

శివుడు చర్రున కోపం వచ్చింది

"పదరా - పద - ఆయన సంగతీ నీ సంగతీ - తేలుస్తా ! మాదర్ చెద్[1] అనీ !

శివుడు వాణ్ణి చొక్కా పట్టుకొని బరబరా గుడిసె దగ్గరికి లాకెళ్ళాడు

గుడిసెలలో కూలీల సద్ది మూటలన్నీ పెట్టి వున్నాయి

గుడిసె మధ్యలో గుంజకు తగిలించిన రేడియో బిగ్గరగా పాడుతోంది

"ఆరేసుకోబోయి పారేసుకున్నాను - హరీ హరీ "

టర్కిటవల్ పరుచుకొని ప్రసాద్ వళ్ళు పయి తెలియకుండా అడ్డంగా పడివున్నాడు వంటి మీది లుంగీ ఎటుపోయిందో అతనికి స్పృహ లేదు ఏదో లోకంలో వున్నాడు

ఓ పక్కన సగం నమిలేసి వదిలిన మిరపకాయ బజ్జీలు కొరికి నట్టున్న పచ్చిమిరపకాయలు

చెల్లాచెదురుగా పడివున్న సారా సీసాలు

శివుడు పాతేసిన గుంజలా నిలబడిపోయాడు

చేయి పట్టు వదిలేసాడు. వాడు చల్లగా పారిపోబోయాడు

"లమ్డీకొడకా - ఆయనట్టా పడివుంటే నీ కెవర్రా మందు డబ్బా లిచ్చింది".

"గిప్పుడు పండిండు[2] నేను సారా సీసాలు తెచ్చినపుడు మెలుకవతోన వుండె ఆయన దుడ్లు లేవని గివి కొండబోమన్నడు[3] - "

శివుడు పటపట పళ్ళు కొరికాడు "ఛ - అసలు బంగారం మంచిదయితేగా! వీళ్ళని అని ఏం లాభం - "

"పోరా దొంగ వెధవా - మళ్ళీ ఈ పక్క కనిపించావంటే తాటవలిచేస్తాను - " శివుడు వాణ్ణి వదిలేసాడు.

బతుకు జీవుడా అంటూ వాడు పరుగులు తీసాడు.

శివుడికి ప్రసాద్ బుర్రపగల కొడతామన్నంత కోపం వచ్చింది.

పొలంలో సుమారు అరవైమంది కూలీలు పనిచేస్తున్నారు వీడు వళ్ళు తెలియనంతగా తప్ప తాగి గుడిసెలో బురదలో పందిలాగా దొర్లుతున్నాడు.

ఛీ !

శివుడు మౌనంగా అక్కడున్న క్రిమిసంహారక మందులన్నీ గోనెసంచిలో వేసుకొన్నాడు.

---

1 తిట్టు 2 నిద్రపోయాడు 3. తీసుకెళ్ళమన్నాడు

సంచిని భుజాన వేసుకొని - గట్లమ్మట పడ్డాడు

శివుడి కోపానికి చేలగట్లు గతగత లాడిపోతున్నాయి

"కల్లు తాగి వచ్చి పెళ్ళాన్ని కొట్టాడని సవారిని ఇంట్లో నుంచి వెళ్ళగొట్ట మన్న రామనాధం ఇంటి అల్లుడు పొలంలో తప్పతాగి పొర్లుతున్నాడు - ఛ ఓ పరువు మర్యాద వున్నవాడు చేసే పనేనా ఇది ? ఎన్నేళ్ళు తామీ గడ్డ మీద అడుగు పెట్టి ! ఒక్కసారైనా మాట అనిపించుకున్న పాపాన పోయామా ? దరిద్రుడు - వీడి మూలంగా ఎన్ని మాటలు పడాల్సివస్తుందో"

శివుడి కోపానికి తగ్గట్టు సరిగ్గా ఊళ్ళో అడుగు పెట్టగానే ట్రాక్టరు కనిపించింది

"బియ్యం ఆడించుకు రమ్మని బొంకూరు పంపానే - వీడింకా ఇక్కడే చచ్చాడేంటి?" విసుగ్గా ట్రాక్టరు వైపు గబగబ వెళ్ళాడు

"అదెంటీ అక్కడాపాడు ? " శివుడు కోపంగా ముందుకు వెళ్ళాడు.

ట్రాక్టరు డ్రైవర్ దిగి ఓ బియ్యం బస్తా తీసి కిందవేసాడు

"దొంగ సచ్చినాడు ఒక్కసారి వంటరిగా వదిలేసే సరికి ఏకంగా బస్తానే దింపేసుకున్నాడు - అడ్డగాడిద - "

"ఏంటీ బస్తా ఇక్కడేసావ్ ?" శివుడు ఉరిమినట్లుగా అన్నాడు.

డ్రైవర్ గతుక్కుమన్నాడు శివుణ్ణి చూసి ఏం సమాధానం చెప్పాలో తెలియక తడబడిపోయాడు. బిత్తర చూపులు చూస్తూ మాటలు వెతుక్కుంటున్నాడు.

అసలే కోపంగా వున్న శివుడికి వాడి వాలకం చేసేసరికి వళ్ళు మండిపోయింది. చేతిలోని గోనె సంచి పక్కన పడేసి వాడిని తన్నడానికి వాడి మీదకులంఘించాడు.

"మాదర్ చెద్ - అమాంతం బియ్యం బస్తా ఎత్తుకెళ్ళామనుకున్న వంటరా ? " శివుడి పిడిగుద్దు వాడి వంటిని తాకకముందే వాడు కేకేలేసాడు.

"వోయమ్మో - చస్తిరో ! బుద్ధి గడ్డితిని మీ ఇంట్ల పనికి కుదిరితి కస్తూరమ్మ ఇంట్లో బస్తా దింపకపోతే భాస్కరయ్య తంతానన్నాడు. దింపానని నువ్వు తంతున్నావ్ ? ముందు నుయ్యి వెనక గొయ్యి ఎటు దూకి చావను ? "

శివుడు కోపం చప్పున చల్లారిపోయింది.

"భాస్కర్ బావయ్య బియ్యం మూట కస్తూరి ఇంట్లో వేయమన్నాడా ? "

"అవును - మొన్న కందులు అంతకు ముందోసారి బియ్యం వేయించాడు. మమ్మల్నేం చేయమంటారండీ - మీరేది చెపితే అది చేసేవాళ్ళం - "

"మెత్తనాకు మేసి మేసి ఈ అల్లుళ్ళుకు చేదుతిత్తి మొలిసింది - "శివుడు పళ్ళు పటపట లాడించాడు.

"ఎక్కువ తక్కువ మాట్లాడకు పద యింటికి " శివుడు కోపాన్నంత అణుచుకున్నాడు. బియ్యం బస్తాని అమాంతం ఎత్తి ట్రక్‌లో పడేసాడు. తను మోసుకొచ్చిన గోనె సంచిని కూడా వేసాడు. మౌనంగా ట్రాక్టర్ ఎక్కి స్టీరింగ్ పట్టుకొన్నాడు.

"తప్పయింది, మళ్ళీ బుద్ధుంటే వారి మాట వినను - "

అతని మాట వినించుకోనట్లు శివుడు ముఖం గంభీరంగా పెట్టాడు. 'తప్పతాగి దొర్లే చిన్న బావ - కస్తూరి ఇంట్లో దూరే పెద్ద బావ, మరి అక్కలు ? వాళ్ళేలా వున్నారు ? 'శివుడికి ఏనాడూ వాళ్ళు బావల గురించి ఫిర్యాదు చేయడం అన్నది జ్ఞాపకం లేదు వాళ్ళకి బావల వేషాలు తెలీవా ? తెలిసినా ఊరుకున్నారా ? "

శివుడు సరళ వాళ్ళింటి ముందుకు రాగానే ట్రాక్టర్ దిగాడు డ్రైవర్‌ని ట్రాక్టర్ ఇంటికి తీసుకుపొమ్మని చెప్పి - తిన్నగా వాళ్ళింట్లోకి వెళ్ళాడు సరళ ఏదో పని చేసుకుంటోంది

శివుడు వంటింట్లోకి వెళ్ళి ఆమె ఎదురుగా కూర్చుని - ఆమె వంట అయ్యేంత వరకూ ఏవో మాట్లాడుతూ కూర్చున్నాడు

సరళ బాగా చిక్కిపోయి వుంది కళ్ళ చుట్టూ నల్లని వలయాలు మాట్లాడుతున్నా కళ్ళు వీధి గుమ్మం వైపే వున్నాయి మాటల్లో శివుడు ఎప్పుడు ఇంటికి వెళ్తాడా అన్నట్టు ఆత్రం కనపడుతోంది

శివుడు ఎంతకీ కదలక పోవడంతో తనే తల్లి దగ్గరికి బయల్దేరింది ఆమె తడబాటు - భయం శివుడికి స్పష్టంగా అర్థమయ్యాయి

"ఎన్నాళ్ళుగా మనసులో మధనపడుతొందో ఒక్కపూట పెదవి విప్పింది కాదు - " శివుడు బాధ పడ్డాడు

"అది, సరేగానీ - తమ్ముడూ - గేదెలు బేరం పెట్టారంట నిజమేనా ?" సరళ ఏదో ఒకటి మాట్లాడాలన్నట్టు అంది

"ఆ - నాన్నకి కళ్ళకు శుక్లాలు కమ్మాయి. మొన్న ఆ ఎఱ్ఱిపడ్డ నాన్న కాలును చితకతొక్కేసింది. అమ్మ అంతే. వయసు మీరుతోందిగా - "

ఇంతలో పద్మ వచ్చింది. ఆమె సరళలాగానే వుంది.

శివుడు ఏదో మాట వరుసకి సంభాషిస్తున్నా లోపల దహించివేస్తున్న బడబాగ్ని ఎప్పుడైనా బద్దలయేట్టుంది.

"ఆ మహానుభావుల్ని కట్టుకొని వీళ్ళిద్దరూ ఏం బావుకున్నారు ? ఆ రైసు మిల్లు గొడవలు - కట్నం చాల్లేదన్న గొడవలు - అక్కడ వున్నపుడు అట్లా వేపుకు తిన్నాడు పెద్ద బావ - ఇక షోకులు షికార్లు - బడి ఎగ్గొట్టడం - చీట్ల పేకలో మునిగి వేధించడం - చిన్న బావగారి నిత్యకృత్యం - అవన్ని ఇక్కడికీ మోసుకొచ్చారు. ఇప్పుడిప్పుడే కాస్త తెరిపిన పడ్డాం. ఇళ్ళు వాకిళ్ళు ఏర్పరచుకుంటున్నాం. కానీ సుఖమేది ? ఆడపిల్లలు లోలోపల కుమిలి పోతోంటే తన ఇంటికెళ్ళి శాంతంగా నిద్రపోగలడా ? అయినా పిల్లలు పెళ్ళీడుకొస్తున్నారు - పెద్దబావకి ఇదేం బుద్ధి ? ఆ కస్తూరి ఇంటికి వెళుతున్నాడని పద్మక్కకి తెలిస్తే గుండాగి పోదూ ? ఛ ! ఇన్నేళ్ళ కాపురం ఎట్లా మంటగలుపుతాడు ? దరిద్రుడు ! "

సరళ చాలా అసహనంగా వుంది

భర్త ఎలాంటి స్థితిలో ఇంటికి వస్తాడో ఆమెకు తెలుసు శివుడు వచ్చి బైరాయించాడంటే ఆయనకు తోడు పద్మవచ్చి కూర్చుంది.

"ఎన్నాళ్ళయిందిరా - ఇలా తీరిగ్గా కూర్చుని కబుర్లు చెప్పుకుని - "పద్మ సంతోషంగా అంటోంది.

"అవునక్కా - ఈ సీడు పని మొదలెట్టాక క్షణం తీరికి దొరకడం లేదు "

"అసలు అనూరాధ వచ్చి ఎన్నాళ్ళయిందిరా ? మరీ నల్లపూసయి పోయింది. ఎంతయినా దానితీరే వేరులే - మనము ఓ పూట వెళ్ళి సాయం చేసేట్టు లేదు, పొలం - ఇల్లు పిల్లలు - సరేగానీ తమ్ముడూ కల్యాణి ఎట్లా వుందిరా ? " పద్మ ఆప్యాయంగా అడుగుతోంది.

సరళకి క్షణక్షణానికి ఆందోళన పెరిగిపోతోంది.

శివుడికి తాగిన వాళ్ళంటే పరమ చిరాకని ఆమెకు తెలుసు దుడ్డు కర్ర తిరగేసి తన్నినా తంతాడు -

"కల్యాణి వాళ్ళు హాస్పిటల్ కడతన్నారంటక్కా ? ఏమిటో వాళ్ళకి అసలే తీరిక లేని బతుకులు - మనకేమో వాళ్ళలోకం అర్థం అయిచావదు "

"అవున్రా తమ్ముడూ - ఆ రోజులు పోయాయి. పండగొస్తే ఎంత సంబరంగా వుండేది ! ఆటలు పాటలు పేళాకోళాలు అన్నీ పోయాయిరా - " పద్మ వాపోయింది -

"సరళక్కా ఏంటలా వున్నావు ! వంట్లో బాలేదా ? " శివుడు ఆమె ముఖంలోకి పరిశీలనగా చూస్తూ అన్నాడు.

"ఎలా వున్నాను ? బానే వున్నానే ! " సరళ తడబడుతూ పట్టిపట్టి అంది

సరళ చటుక్కున పైకి లేచింది గబగబ నవారు మంచం తీసుకెళ్ళి పందిట్లో వాల్చింది. పక్కకి మంచినీళ్ళు చెంబు పెట్టి - తాళం కప్ప పట్టుకొచ్చింది.

"తమ్ముడూ - అమ్మోళ్ళని చూసి చాలరోజులయింది - పద వెళ్దాం - " సరళ గబగబ అంది.

"భర్త తప్పు బయట పడకుండా ఎంత చక్కగా దాచాలని ప్రయత్నిస్తోంది ! నవ్వాలా ఏడవాలా ? "

ఇంక ఆమెని బాధపెట్టడం ఇష్టం లేక పైకి లేచాడు.

"అది సరేరా తమ్ముడూ - ఆ పాల కేంద్రం మూసేస్తున్నారంట నిజమేనా "

"అవునక్కా - ప్రతి వక్కడూ ఆ తెల్లారగట్ట బస్సులో కర్నూలుకు పాలు పంపించేస్తున్నారు. కేంద్రమోళ్ళు ఎంత ఇస్తున్నారు ? అదే కర్నూలులో నాలుగింతలు రేటు వస్తోంది - "

"అవున్రా - భారతి అదే అంటుంది - అక్కడ పాలు కవర్లలలో అమ్ముతారంటగా ఆ పాల వాసన చూస్తే డోకు వస్తుందని అంటోంది - "

సరళ గబగబ ఇంటికి తాళాలు వేసింది రామనాథం వాళ్ళ యింటివైపు నడిచింది శివుడు, పద్మ నెమ్మదిగా ఆమె అనుసరించారు.

"గేదెలు బేరం పెట్టావంట నిజమేనారా ? "

"అవునక్కా - కానీ నాన్నతో అనమాక ఆయన బాధపడతాడు - అవునూ బావగార్లేమిటి ఇంకా పొలాన్నుంచి రాలేదూ ?"

"ఏమిటోరా తమ్ముడూ మీరా సీడుపని పెట్టినప్పటి నుంచి మీ బావగారికి క్షణం తీరడం లేదు పొద్దుపోయిందాకా అక్కడే సరిపోతుందా ? మీరా మోటర్ సైకిల్ కొనిచ్చారు కాబట్టి ఓ రకం లేకపోతే ఆ గట్లమ్మట - పుట్లమ్మట - ! హమ్మె - ఏ పురుగైనా ముడితే నా బతుకేం కాను - " పద్మ అమాయకంగా అంటోంది

'పిచ్చిఅక్కా - ఏ పురుగో ముట్టడం కాదు - నీ మొగుడే ఓ విషప్పురుగు' శివుడు బాధగా అనుకున్నాడు

ఇంతలో ఎవరో గబగబ పరిగెత్తు వచ్చారు

"శివన్నా - శివన్నా - జల్దీరా - ప్రసాద్ దొరను చెట్టుకట్టి కొడ్తున్రు."

సరళ గొల్లుమంది పద్మ ఓదార్చుతోంది శివుడు కదలకుండా రాయిలాగా నిలబడ్డాడు

"జల్దీరా అన్నా - వాళ్ళ చేతుల్ల కొడవళ్ళు - వసి గొయ్యిలు గిట్ల వున్నాయి ఒక్క దెబ్బ పడితే గజబైపోతది జల్దీనడువన్నా "

'పాపం పండింది' - శివుడు కచ్చగా అనుకున్నాడు.

"ఆళ్ళకేం పోయేకాలంరా - పొలానికి వెళ్ళిన మనిషిని చెట్టుకు కట్టేయడం ఏంటి ? సరళ లబలబలాడింది - " అలా బెల్లం కొట్టిన రాయిలా నిలబడతవేంరా ? వెళ్ళరా శివుడూ - మీ బావని ఏం చేస్తారో మోటు మంద

"వాళ్ళేం మోటు మంద కాదు ఈయనేం చేసాడో - " శివుడు కచ్చనంతా మాటల్లో ఒలికించాడు.

సరళ చివ్వున తలెత్తి శివుడి వంక చూసింది ఆమె కళ్ళల్లోని కోపజ్వాలలో శివుడిని మలమల మాడ్చేట్టు వుంది.

శివుడు తాపీగా అతన్ని విషయమేంటో ఆరా తీసాడు.

"ఏం లే అన్నా - సద్దిమూట తీసుకోనింకె పొట్టి గుడిసెలకు పోయిందంట ప్రసాద్దొర - గా పిల్ల - చేయి పట్ట పోయిండంట - " అతను చెపితే ఏమంటారో అన్నట్టు ఆపి ఆపి చెప్పాడు

"అవును - ఇక్కడివాళ్ళు ఇస్తే ప్రాణం ఇస్తారు. తీస్తే ప్రాణం తీస్తారు - "శివుడు మొదటిరోజు ఈ గడ్డ మీద అడుగు పెట్టినపుడు రామనాథం అన్న మాటల్ని గుర్తుకు తెచ్చుకొన్నాడు."వళ్ళు దగ్గర పెట్టుకోకుండా పిచ్చి వేషాలేస్తే సన్మానం తప్పదు. నువ్వెళ్ళు - సరళకు వళ్ళు మండిపోయింది.

"శివుడూ - నీ వాలకం నాకు అర్థం కావట్లా - అవతల మనిషిని చెట్టుకు కట్టేసి వున్నారంటే తాపీగా ధర్మపన్నాలు పలుకుతావేంటి ? " పద్మ శివుణ్ణి మందలించింది.

"ఏం చేయమంటావ్ ? "శివుడు కసురుకున్నారు

"నీ మాటంటే వాళ్ళకి గురి, నువ్వు చెప్పితే వదిలేస్తారు కోపంలో వున్నాళ్ళ మధ్యలో ఒక్కడూ - ఏమన్నా జరిగితే మన సరళ గతేం కానూ "

"ఏమీ కాదు - నాలుగు దెబ్బలు పడితే చిన్న బావకు పట్టిన దెయ్యం వదులుతుంది ఇది సుఖపడుతుంది " నింపాదిగా అన్నాడు

సరళ తమ్ముడి వంక చూసి చీదరించుకున్నట్లుగా అంది,

"నువ్వింత నీచుడవనుకోలేదురా! బావమరిది బ్రతుక్కోరతాడంటారు చచ్చినాపర్లేదని ఎట్లా వదిలేస్తున్నావ్ రా ! "

సరళ రయ్యిన రామనాధం దగ్గరికి పరుగుతీసింది

వళ్ళంతా చెమట్లు కారుతూ ముఖమంతా జుట్టు చెల్లా చెదురుగా పడి, కన్నీళ్ళు కారిపోతుంటే భయంతో వణికిపోతూ భీభత్సంగా వున్న సరళని చూసి రామనాధం కంగారు పడ్డాడు

సరళ గబగబ విషయం చెప్పింది

రామనాధం వెంటనే పొలం వైపు వెళ్ళబోయాడు శివుడిని చూసి పిలిచాడు - "రారా శివుడూ "

"బాబాయ్ - నేను చేయ లేని పని వాళ్ళు చేస్తున్నారు నువ్వు వాళ్ళకి అడ్డం వెళ్ళావా - నా మీద ఒట్టే ! " శివుడు రామనాధాన్ని ఆపాడు.

"అది కాదురా - "

"నువ్వేం చెప్పకు నాలుగు తగిలిస్తే కానీ వాడు బాగుపడడు. ఇలా జరగడం అదీ మన మంచికే ననుకో - "

రామనాధం మౌనంగా ఇంట్లోకి వెళ్ళిపోయాడు.

సరళ రామనాధం కూడా భర్తను విడిపించడానికి వెళ్ళకపోయేసరికి నడియింట్లో కూర్చుని గుండెలు బాదుకుంటూ ఏడ్చింది.

ఆడవాళ్ళందరూ శివుణ్ణి, రామనాధాన్ని ఒప్పించడానికి శతవిధాలుగా ప్రయత్నించారు

"ఆ పొట్టి స్థానంలో మన యింటి ఆడపిల్ల వుంటే ఏం చేస్తాం సావిత్రీ ? "

రత్తయ్యకి విషయం ఏంటో అర్థం కాక చెవుడొచ్చిన చెవుల్ని విదిల్చుకుంటూ వినాలని ప్రయత్నిస్తున్నాడు.

"ఏవయిందిరా ? " మధ్యమధ్యలో పీలగొంతుతో ప్రశ్నిస్తున్నాడు.

"ముసలాడివి - నువ్వు - నోరు మూసుకు కూర్చోలేవూ ? " శాంతమ్మ విసురుగా అంది.

"అవున్లే, మమ్మలెప్పుడు సరిగ్గా చూసుకున్నారని - పదేళ్ళ తరువాత పుట్టినా పోయేది. ఆ కల్యాణిని ఎంత బాగా డాక్టరమ్మను చేస్తిరి. డాక్టరు అల్లుడని తెచ్చుకుంటిరి మమ్మల్ని చదువు సంధ్యలు లేకుండా ఇట్టాంటి ఇళ్ళల్లో పడేస్తిరి - ఎంతయినా మీ కూతురు మీ కూతురే పరాయి ఆడపిల్ల పరాయిదే - " సరళ ముక్కు చీదుతూ రామనాధాన్ని సావిత్రిని ఎత్తి పొడిచింది

"సొంతబిడ్డ పరాయిబిడ్డ అని పేరు చేసి బాబాయి వాళ్ళని ఎత్తి చూపించావంటే - నా కన్నా పెద్దదానివని చూడకుండా నాలిక చీరేస్తాను ! ఏవను కుంటున్నావో ! నీ మొగుడు దరిద్రపు పనిచేస్తే దానికి ఇట్లా అర్థం పర్థం లేకుండా వాగడం దేనికి ? " శివుడు సరళ మీదికి ఇంతెత్తున లేచాడు.

"నువ్వూరు కోరా శివుడూ - "

రామనాధం నచ్చజెప్పబోయాడు -

"ఏంటి బాబాయ్ ఊరుకొనేది - వాళ్ళ మొగుళ్ళ నిర్వాకాలు వీళ్ళకు తెలీయదా ? మొదట్లోనే తుంచేస్తే ఇంతదాకా వచ్చేవాళ్ళా ? ఒక్క పూటన్నా మనతో అన్నారూ ? చావనీ - వాళ్ళ ఖర్మకి వాళ్ళనే చావనీ ! ఆ ప్రసాద్ బావ నువాక్రాన్ డబ్బాలిచ్చి సారా సీసాలు తెప్పించుకుంటున్నాడు. తప్పతాగి పాలాన పడి పందిలా దొర్లుతున్నాడు - ఇక ఈవిడ మొగుడు - "శివుడు విసురుగా పద్మ వైపు తిరిగాడు.

పద్మ ముఖంలో కత్తివాటుకు నెత్తురు చుక్కలేదు

కొంగు నోటికడ్డం పెట్టుకుని కుళ్ళికుళ్ళి ఏడ్చింది.

శివుడు తన ఉద్రేకాన్నంతా చప్పున అణుచుకున్నాడు.

"పుట్టాంటారులేని అనాధనుకొంటాను. అసలునాకే తమ్ముడే లేడు చచ్చాడను కొంటాను ఒరేయ్ - ఇంటి అల్లుడ్ని పంది గింది అంటావ్‌రా ?

ఆయ కిష్ట వచ్చినట్లు ఆయన చేసుకొంటారు. నువ్వువరిరా అడగడానికి ? ఇన్నాళ్ళు మీరు చేసిన మర్యాద చాలు - మళ్ళీ ఈ యింటి గడప తొక్కితే నేను చచ్చినంత వొట్టే "సరళ గబుక్కున గడపలోకి వెళ్ళింది - "రావే - పద్మక్కా ఈ యింటి ఆడపిల్లలకు మంచి సన్మానమే దక్కుతుంది. వెర్రి మొహం వేసుకొని - అక్కడ నిలబడతావే - ధా - " సరళనానాయాగీ చేసీ పద్మని కూడా లాక్కెళ్ళింది.

సావిత్రి, శాంతమ్మ యిద్దరి వెంటపడి కాళ్ళా వేళ్ళా పడి బతిమిలాడు తున్నారు. "ఆడి మాటలకే మొచ్చే - మీరు మనసుపాడు చేసుకోకండమ్మ" సరళ సావిత్రి చెయ్యి విసిరి కొట్టింది.

"వాడంటే - సరే ' మొదటి నుంచీ మాట పెళుసు - మరి బాబాయ్ ఒక్క మాటన్నా

అన్నాడా ? ఎందుకంటాడు ? ఆయనకేం ? డాక్టర్ అల్లుణ్ణి తెచ్చుకున్నాడుగా ! ఇంక మామోటు మొగుళ్ళేం ఆయనకు కళ్ళకుఆనతారు ? కాని మేమూ పదేళ్ళ తరువాత పుట్టినా పోయేది ? ఏ డాక్టరీయో చదివేవాళ్ళం ? ఏ ఇంజనీర్ మొగుడ్నో కట్టుకునేవాళ్ళం ! కల్యాణి లాగా ముడ్డి తిప్పితూ తిరగే వాళ్ళం ! ”

సరళ కోపంలో ఇష్టమొచ్చినట్లు అరుస్తోంది. పద్మ మౌనం చూసి రామనాథం ఆశ్చర్యపోయాడు.

“వీళ్ళలో ఇంత అసంతృప్తి - అసూయ వున్నాయా ?

శివుడు ఏ మాత్రం ఆశ్చర్యపోలేదు. అతనికి బావలకన్నా అక్కల మీద కోపంగా వుంది.

“ఏంవాళ్ళను బతిమిలాడేది ఇవతలకు రండి - ” సావిత్రిని శాంతమ్మను గదమాయించాడు.

రామనాథం మౌనంగా లేచి శివుడి దగ్గరకు వచ్చాడు.

“ఒరేయ్ శివుడూ - ప్రసాద్ ప్రాణం మీదకు వస్తుందేమో - నే వెళ్తాను ” - శివుడు ఏమీ మాట్లాడలేదు - కోపంగా పద్మవాళ్ళింటికి వెళ్ళాడు. రామనాథం వెళ్ళే సరికి ప్రసాద్ మత్తు వదిలే లాగా చచ్చే తన్నులు తన్ని వదిలారు.

రామనాథంని చూడగానే వాళ్ళు ఉద్రేకాన్ని అదుపులోకి తెచ్చుకొని, “మీ మొగం చూసి వీన్ని పాణాల్తోన యిడిసినం” వాళ్ళు రామనాథం దగ్గరికి వచ్చారు ప్రసాద్ దెబ్బ తిన్న పాములా వేళ్ళాడబడుతున్నా - ఇంతసేపు సాయానికి రాని మామ దగ్గరికి రాగానే కోపంతో బుసలు కొట్టాడు.

“చింత ఛచ్చినా పులుపు చావదు - ” వాళ్ళు అనుకొంటూ వెళ్ళి పోయారు.

రామనాథం ప్రసాద్ కట్లువిప్పి - ట్రాక్టర్ ఎక్కించుకుని ఇంటికి తీసుకువచ్చాడు.

ప్రసాద్ విదిలించుకొని తమ యింటికి వెళ్ళబోయాడు.

రామనాథం స్వయంగా తీసుకెళ్ళి యింట్లో పడుకోబెట్టి పరిచర్యలు చేసాడు. ఆడవాళ్ళంతా అక్కడే వున్నారు.

సరళ ముక్కు చీదుతూ - శివుణ్ణి రామనాథాన్ని తిడుతూ మొగుడికి వేణ్ణీళ్ల కాపడం పెడుతుంది. సావిత్రి పలకరించబోయినా బతిమిలాడినా విసిరివిసిరి కొడుతోంది.

శివుడు పద్మ వాళ్ళ పందిట్లో గట్టు మీద కూర్చున్నాడు.

పద్మ సరళ వేసినట్లే చక్కగా మంచమేసి, పరువేసి పెట్టింది. శివుడు ముసుగుపెట్టి పడుకున్నాడు. మంచం కోడు పక్కన పెట్టిన మంచినీళ్ళు తాగుమదామని వంగాడు. రెండు బాక్సుల్లో అన్నం కూడా వుంది !

“వీళ్ళనే మనాలి ! ” శివుడికి అక్కలద్దర్ని తలుచుకొని జాలి, కోపం రెండు కలిగాయి.

మౌనంగా పెరుగన్నం తిని, ముసుగు పెట్టి మెలుకవగానే పడుకున్నాడు.

సరిగ్గా అర్ధరాత్రి దాటిన తరువాత కస్తూరి ఇంటి నుంచి పిల్లిలాగా అడుగులో అడుగువేస్తూ భాస్కర్ వచ్చాడు ఆ చిన్న అలికిడికే శివుడు ముసుగులోంచి మెల్లిగా చూసాడు.

భాస్కర్‌ను బాగా దగ్గరగా రానిచ్చాడు కప్పుకున్న దుప్పటి తీసి అతని మీద ముసుగువేసాడు. భాస్కర్‌కి విషయమేంటో అర్ధంకాక గింజుకున్నాడు శివుడు అలాగే లాక్కెళ్ళి, పందిరి వాసంలాగి, ఇష్టమొచ్చినట్టు బాదాడు. భాస్కర్ అరవడానికి కూడా భయమేసి నోరు నొక్కుకున్నాడు. దెబ్బల్ని ఇక భరించలేక ముసుగు తీసుకొనేందుకు ప్రయత్నిస్తూ అరిచాడు.

"ఒరేయ్ - నేనురా - భాస్కర్‌ని కొట్టకండి - భాస్కర్‌ని - "

శివుడు కొట్టడం ఆపి, ముసుగు తొలగించాడు.

"అరే - నువ్వా ? పెద్దబావా ? అర్ధరాత్రి ఇంట్లో దూరుతుంటే ఎవరో దొంగనుకున్నా - దెబ్బలు బాగా తగిలాయా ? "

అమాయకంగా అడిగాడు శివుడు - "అక్కని పిలుస్తావుండు కాపడం పెడుతుంది - "

శివుడు అదే పోతపోయాడు.

భాస్కర్ దెబ్బలకన్న అవమానంతో చితికిపోయాడు. ఇంత బతుకు బతికి ఇంటెనక చచ్చినట్లు బావమరిది చేత - తన్నులు తినడమా . రేపొద్దున తోడళ్ళుళ్ళ ముందు తల ఎత్తుకు తిరిగేదెలా ? ఊళ్ళో తెలిస్తే ఏమన్నావుందా ? ఆగబ్బుగా చెప్పకోరూ ?

"ఒరేయ్ శివుడూ - " భాస్కర్ పళ్ళు పటపట కొరికాడు, "నా ముందు లాగులు వేసుకొని తిరగేవాడిని నీకింత పొగ్రరా ? "

* * *

"వదినా, బడితెరుస్తారు కదా - పిల్లల బట్టలవీ ఇస్తావా - సర్దుకుంటాం - " భారతి నెమ్మదిగా అడిగింది.

సరళ పిల్లలు హైస్కూలుకు వచ్చారు. పెద్ద పిల్ల పదో తరగతి.

పద్మ కొడుకును ఇంటర్ చేర్చాలి. కూతురు తొమ్మిది.

భారతి అందరి పిల్లల్ని చదువులకని తన దగ్గర పెట్టుకొని పదేళ్ళపైనే అవుతోంది. యల్.కే.జీ దగ్గర్నుంచి కాలేజీలకు వచ్చారు. శివుడు పిల్లలు హైస్కూలుకు వచ్చేసారు.

"ఏవమ్మా - .. నంగనాచీ మొగుడు మక్కెలిరగ తంతే పెళ్ళాం వచ్చి మందు రాస్తుందా ! చాల్లేవమ్మా - నీ దగ్గర పెట్టిఅసలు మా పిల్లలు పాడయిపోయారు. బుద్ధిగడ్డితిని నీ కింద వదిలాం కానీ - చక్కగా నేనే చదివించుకుంటే ఎంత బాగా చదివేవాళ్ళు - "

సరళ భారతిని ఎత్తి పాడిచింది. 'ఇన్నేళ్ళు గడిచినా పిల్లల్లో పిల్లలాగా నెగ్గుకొస్తోంది. ఒక్కపూట కూడా ఎవరి గురించి ఫలాన ఇబ్బందులు పడ్డానని ఇంట్లో వారితో చెప్పలేదు. తన తిప్పలేవో తనుపడి అందర్నీ గట్టెక్కిస్తోంది. మొగుడను కోకుండా సంసారమనుకోకుండా వాళ్ళకు ముడ్డినుంచి మూతిదాకా చేసిందానికి ఇదా సన్మానం ?' భారతికి ఏడుపు ముంచుకొచ్చింది.

"అదేంటి వదినా ? అట్లా అంటావ్ ! మీ పిల్లలకి ఏం తక్కువ చేసాను ? నా పిల్లలకి ఏం ఎక్కువ చేసాను ? అందర్నీ ఒకలాగా చూసుకోలేదని పిల్లల్ని చెప్పమను చూద్దాం - "

"చెప్తార్లేమ్మ మా బాగా - మా కళ్ళు పెట్టి మేం చూడట్లా - ఆ సుధాకర్ కూతురికేమో పట్టులంగా లేస్తారు. మా పిల్లలకేమో చీటి గుడ్డలు కుట్టిస్తారు. అంత గతిలేని వాళ్ళా మా పిల్లలు ? " ఎప్పుడూ ఏమి అని పద్మ ఎత్తి పొడిచింది.

"గీత సంగతి మీకు తెలుసుగా వదినా - నా వల్లేదైనా లోటు జరిగితే చెప్పండి . గీత తరుపున నేనేం చెప్పగలను - "

"అవున్లేమ్మా - తోడికోడళ్ళిద్దరూ బాగానే సాగిచ్చుకుంటారు ! అక్కడికి ఆడ పిల్లలం మేమే దిగడిపోయాం "

పద్మా మూతి తిప్పింది.

"కల్యాణికేం తక్కువ ? మన రాతే ఇలా తగలడింది ! ఓ పదేళ్ళుపోయాక పుట్టినా ఎట్టా చచ్చే వాళ్ళమో - "

"మాటి మాటికీ కల్యాణితో ఎందుకు పోల్చుకుంటావొదినా - ఆ అమ్మాయి కష్టపడి చదువుకుంది డాక్టరయింది. నేను డాక్టర్నవ్వమంటే అవుతానా ? ఎవరు చేయగలిగేది వాళ్ళు చేస్తారు. మనమెందుకూ వూరికే అనుకోవడం ? "

"అవున్లే - ఆవిడ నీ ముద్దుల ఆడపడుచు కదూ - వెనకేసు కొస్తావ్ - ఆవిడంటే ఏ రోగమో రొప్పో వచ్చినపుడు ఉపయోగపడుద్ది మాతో ఏం ఉపయోగం ? అంతేలే - "

" ఛ ! మనిషితో ఏదైనా ఉపయోగముందనే ఇష్టపడతమా - ఏంటొదినా ఆ మాటలు - "

"అంతేలేమ్మా - మేమేదో పల్లెటూరి మొద్దురాచిప్పలం మా మాటలిట్లాగే వుంటాయి నువ్వేమో పట్నం మనిషివయ్యే - నీ సోకులు నీ నీటు మాకెక్కడ వస్తాయి - ! " ఓ దీర్ఘం తీసింది సరళ. భారతి నోట మాట పెగల్లేదు.

"ఇన్నెందుకు - మా పిల్లల్ని మాలాగే మొద్దురా చిప్పల్లాగా పెంచుకుంటాం - నీవు వద్దూ నీ పెంపకం వద్దు - అయినా మమ్మల్ని కాదనుకున్నాక మా పిల్లలు కావల్సి వచ్చావా? నా కొడుక్కు నీ కూతుర్ని కట్టాలని ఏదైనా పథకాలేస్తున్నావేమో నీ ఆటలు మా దగ్గర కాదు ! నీ మొగుడికి చెప్పు - ఏ రోజైతే అక్కలు కాదనుకొని మా వాళ్ళమీద చెయ్యెత్తాడో ఆ రోజే మాకు వాడికీ సంబంధం తెగింది. సిగ్గులేకుండా మళ్ళీ ఏ మొహం పెట్టుకొని నిన్ను మా దగ్గరికి రాయబారం పంపాడు? - మా పిల్లల బాగోగులు మేం చూసుకుంటాం - నువ్వింక దయచేయి !"

భారతి బిత్తరపోయింది.

"మళ్ళీ మా పిల్లలతో మాట్లాడినట్టు తెలిసినా ఊరుకోను ! తెల్సిందా ! "

భారతి ఏడుస్తూ గదిలోకి పరిగెత్తింది.

శివుడి మీద కోపంతో తన మీద విరుచుకు పడ్డారని ఆమెకీ స్పష్టంగా తెలుసు పిల్లల చుట్టూ అల్లుకున్న అభిమానం అంతా వదులుకోవాలన్న నిజం భారతికి ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. మంచంలో బోర్లా పడుకొని వెక్కివెక్కి ఏడ్చింది.

సావిత్రి, శాంతమ్మ ఎంత చెప్పినా బతిమిలాడినా ఏడుస్తూనే వుంది

"సర్లే - మా గొప్పపని చేస్తున్నావ్ ! వాళ్ళ పిల్లలు వాళ్ళిష్టం వచ్చినట్టు చేసుకొంటారు. మధ్యలో నువ్వెందుకు శోకాలు పెట్టేది మంచి తనానికి పోయి ఇన్నాళ్ళు వాళ్ళ బాధ్యత మోసిందే బుద్ధి తక్కువ. వాళ్ళ పాటికి వాళ్ళని వదిలేస్తే అప్పుడు తెలిసేది-"

శివుడు భారతిని కోప్పడ్డాడు

"మీకేం మీరెన్నన్నా అంటారు ఇంత మంది పిల్లల్ని పెట్టుకొని వచ్చేపోయే జనాలకి వండి పెడతా - నేనెన్ని తిప్పలు పడ్డానో మీ కెవరికన్నా తెలుసా ? ఏ సెలవలకో నేను ఇక్కడికి రావాలసిందే కానీ - ఎట్లా వున్నావ్ ఏం చేస్తున్నావ్ అని ఒక్కసారన్నా అడిగారా ? ఏ పూటన్నా అటు తొంగి చూసారా ? మొగుడను కోకుండా సంసారమను కోకుండా ఇన్నాళ్ళు చేసిన అడ్డ చాకిరీకి ఇదా సన్మానం !"

భారతి బద్దలయ్యింది

శివుడు ఆమె ముఖంలోకి విస్మయంగా చూసాడు.

"ఆ గీత ! అరక్షణం కూచోనిస్తుందా నిల్చోనిస్తుందా ? ఆమె మొగుడుతో ఆమె నిక్షేపంగా కాపురం చేసుకొంటోంది - పిల్లల్ని మన పిల్లలకన్నా మెరుగ్గానే పెంచుకుంటోంది. పూచిక పుల్లతీసి అవతల పెట్టదు. రోజంతా చాకిరీ చేసినా - ఇంటికి వచ్చేపోయే వాళ్ళందరితో సంబంధాలు అంటగట్టి పీడించి చంపుతుంది ! ఆవిడ ఎత్తి పొడుపులు చీదరింపులు ఛఛ!" భారతి మంచంకోడును పట్టుకొని వెక్కి వెక్కి ఏడ్చింది.

శివుడు ఆమె ఎదురుగా కూలబడ్డాడు.

'భారతి, తన భార్య - పెళ్ళయి ఇన్నేళ్ళు కావస్తోంది. ఆమె మనసులో ఎంత అసంతృప్తి వుందో తనకు తెలియదు. ఎంత ఆవేదన-వుందో తనకు తెలియదు -'

శివుడు ఆమెను ఓదార్చలేక పోయాడు. భారతి ఏడ్చి ఏడ్చి తానే తేరుకుని మళ్ళీ అంది.

"ఆ కల్యాణి వున్నపుడు ఏదో కాస్త వెళ్ళబోసుకోను మనిషి అంటూవుండేది. ఇంత మందికి చాకిరీ చెయ్యడం ఒక ఎత్తు. ఆ యిల్లు పరాయిదేమో అనిపించేట్టుగా ఆ గీత చేసే గోల ఓ ఎత్తు ఎప్పుడెప్పుడు పారిపోదామా అనిపించినా - పన్నెత్త కుండా నెగ్గు కొచ్చాను. ఎందుకు ? నాకే తెలియదు. పిల్లలు - చదువులు - అంతే ! ఏళ్ళూ వూళ్ళూ గడిచాయి. నాలోకంలో నేను పడి కొట్టుకున్నందుకు మంచి పేరే దక్కింది. - చివరికి సెలవలకి వచ్చినా పిల్లలే - ఆ గ్రేడింగ్ చేయడం - ప్యాకింగ్ చేయడం - సీడ్ ఆఫీసర్లకి వండి పెట్టడం - ఒక్క పూటన్నా పక్కనే వున్న మా పుట్టింట్లో నాల్రోజులు వుండివచ్చానా ? లేదు. ఇదే కొంప ఇదే చాకిరీ - లేదు - లేదు -

ఇన్నాళ్ళు నేను ఒక్క పూట కూడా చాకిరీ చేస్తున్ననని అనుకోలేదు. ఇప్పుడు అనుకొంటున్నాను. నేను చేసిన చాకిరీ అంతా బూడిదలో పోసిన పన్నీరయ్యింది. నేను కూడా ఆ గీతలాగానే ఆ సరళలాగానే పద్మఅక్కలాగానే మొగుళ్ళనీ సంసారమనీ తాపత్రయ పడితే బాగుండేదని !''

భారతి ఊపిరి పీల్చుకుంది. శివుడికి ఏం సమాధానం చెప్పాలో తోచలేదు మౌనంగా తల వేలాడేసాడు. భార్య పట్ల - ఎప్పుడూ ప్రత్యేకంగా ఆలోచించని శివుడిలో భార్య పట్ల బోలెడంత జాలి పుట్టు కొచ్చేసింది. జాలి ప్రేమలాముంచెత్తింది

"నువ్వేం చేస్తావులే - వాళ్ళ బుద్ధులు అట్టాంటివి ! వాళ్ళున్నారని మన మెందుకు బాధపడడం ? పిల్లలు బాగు పడ్డారు అదేగా కావాలసింది !'' శివుడు అనునయంగా అన్నాడు.

"అవును పిల్లలు బాగు పడ్డారు ! రేపట్నించి వాళ్ళను వెంటేసుకు తిరిగే తల్లులు బాగుపడ్డారు. మధ్యలో నేనే రెంటికి చెడ్డ రేవడి అయ్యాను. రేప్పొద్దున పిల్లలు మాత్రం వాళ్ళ తల్లుల పాడిన పాటే పాడరనే ముంది ?''

"ఒకళ్ళు మెచ్చి మేక తోలు కప్పుతారని మనమేదైనా పని చేస్తామా భారతీ ? పిల్లలు మనల్ని మర్చితే మర్చిపోయారు మనం మర్చిపోంగా - ఇంక ఆ సంగతి వదిలేయి -''

"ఎట్లా వదిలేసేదండీ -? పిల్లలు - పిల్లలు వాళ్ళ కోసం ఎంత తపించానో అంతా కలలా కరిగి పోతుందంటే - నేను భరించ లేకపోతున్నాను-'' భారతి మళ్ళీ వెక్కిళ్ళు పెట్టింది.

శివుడికి బాధగానే వుంది 'కానీ ఏం చేయగలను' శివుడు మౌనంగా అనుకొన్నాడు

"అసలిదంతా మీ వల్ల వచ్చింది ! తగుదునమ్మ అంటూ వెళ్ళి ఆ భాస్కరన్నయ్యను ఎందుకట్లా బాదడం ? కొట్టిన మీరేమో అందరికీ చెడ్డయ్యారు - ఆయనేమో మంచాడే - ఆ ప్రసాదన్నయ్యను మాత్రం -! ఎందుకట్లా వదిలేసారు ? కనీసం సరళ మొహం చూసైనా అడ్డం పోవచ్చుగా ? ఇంత చేసీ చేయని వాళ్ళం అయ్యాం - అందరి చేత మాటలు పడాల్సివస్తోంది. అయినా మనిషికి అంత తొందరపనికి రాదండీ-''

శివుడికి చర్రున కోపం వచ్చింది. గభాల్న లేచి నిల్చున్నాడు.

"అవును ! అంతా నా వల్లే వచ్చింది ! ఆళ్ళిద్దరూ మహానుభావులే నేనే చెడ్డవాణ్ణి - అనుకోని - అందరూ అనుకోని !నేనేం అనుకోను ! నేనేం కానిపని చెయ్యాలా - నేనేం గుడిసెల్లో దూరలా -! ఈ రోజు దాకానిప్పనే - నిప్పులా వుంటా ! తలెత్తుకు తిరిగానే కానీ తలదించుకునే పని ఏనాడు చేయాలా ! మనసులో ఒకటి చేతలో ఒకటి - నావల్ల కాదు-''

శివుడు చరచర బయటకు వెళ్ళాడు.

"అంతా నా రాత ! నా మాట ఏనాడన్నా చెవిన పెడితే కదా ఈ నాడు నాలుగు ముక్కలు చెప్పుకోవడానికి -'' భారతి ముక్కు ఎగ బీల్చింది.

❋ ❋ ❋

"ఏదైనా పని చేసేముందు ముందువెనుకా ఆలోచించు కోవాలి ! ఎంతతోస్తే అది చేసేయ్యడమే -" సుధాకర్ విసుక్కున్నాడు.

శివుడు నిర్ఘాంత పోయాడు. రామనాథం వంక చూసాడు.

"ఏంట్రా సుధాకర్ - ఆ దూకుడు ? నెమ్మదిగా మాట్లాడ లేవూ ?"

"నాదే దూకుడు ! కాని వాళ్ళందర్దీ పాకుడే !" సుధాకర్ కస్సుమన్నాడు

"ఇప్పుడు చూడండి - ఏడాది పొడవునా ఆ బావయ్యలిద్దరికీ ఎంత పెట్టుబడి పెట్టాం ఎంత చాకిరీ చేసాం - ఇప్పుడు జిన్నింగ్ మిల్లు నుంచే చిట్టి బాబుకి విత్తనాలు తోలారు. పైనుంచి, ఇన్నాళ్ళు మనం వాళ్ళకి అన్యాయం చేసామంట - వాళ్ళ చేత గాసం చేయించుకున్నామని కనిపించినాళ్ళందరి దగ్గరగా వాగుతున్నారు. ఊరంతా గబ్బు పట్టి పోయాం కదా ! పరువు మర్యాద ఏ పూటైనా తప్పి ఎరుగుదుమా ?"

"ఏదిరా పరువూ మర్యాదా ? పొలాల గట్లమ్మట తాగి దొర్లడమా ? గుడిసెల్లోకి దూరడమా ? సిగ్గులేదూ - వాళ్ళని వెనకేసుకు రావడానికి !" రామనాథం అంతకన్నా గట్టిగా అరిచాడు

"అసలు నీ అలుసు చూసుకొనే ఆన్నయ్య ఇట్లా తయారయ్యాడు. అట్లా తన్నడం వల్ల వాళ్ళేమన్నా బాగుపడ్డారా అంటే అదీ లేదు అంతకు ముందు చాటుమాటుగా ఎట్లా చచ్చేవాళ్ళో కానీ ఇప్పుడు అడ్డూ అదుపు లేకుండా బట్టబయలు గానే చేస్తున్నారు. కర్నూలులో ఎవడు పట్టినా మీ బావను ఫలాన బార్ దగ్గర చూసామని చెప్పేవాళ్ళే - చివరికి బిల్లులు ఎగేస్తంటే నన్ను నిలేస్తున్నారు. అక్కడికి నేనేదో తాగి తందనాలాడుతున్నట్టు వాళ్ళ నోళ్ళు నొక్కాల్సి వస్తుంది. ఇంకా కస్తూరి ముండ ! అదీ కర్నూలు చేరింది. తన్ని చెడ్డవడమే కానీ - ఏం బావు కున్నట్టు? నడిగడ్డ మీద మన కుటుంబమంటే ఎంత గౌరవం ! ఒక్క దెబ్బతో అంతా మంట కలిసింది - ఛఛ !"

సుధాకర్ ఏక బిగిన తిట్టాడు.

శివుడు మౌనంగా తలవంచుకొని కాలువ గట్టు మీదికి వెళ్ళిపోయాడు.

రామనాథం శివుడి వాలకం చూసి చాలా బాధపడ్డాడు. కొడుకు మీద విరుచుకు పడ్డాడు -, "నువ్వన్నవన్నీ నిజమేరా - కానీ శివుడిని పట్టుకొని ఎంత మాటంటే అంత మాట అనెయ్యడెమేనా ? వాడు తప్పుడు పని ఊహించనైనా ఊహించడు. ఎవరైనా చేస్తే సహించడు. అది వాడితత్వం. చేసిన పని మంచిదా చెడ్డదా అని వాదాలొద్దు. ఆ పని చేసేసాడు. అయిపోయింది. ఒక్క విషయం నువ్వాలోచించు. మన యింట్లో యింతమందిమి ఉన్నామే - శివుడు - భారతి సంసారం గురించి ఒక్కళ్ళ మన్నా ఆలోచించామా ? వీడి పాటికి వీడు చేలో ఎద్దులా పని చేసుకు పోతుంటే - భారతి ఇంట్లోని పిల్లల్నందర్నీ వేసుకుని గంగి గోవులాగా నెగ్గు కొచ్చింది. ఇన్నేళ్ళలో ఒక్క నాడన్నా వాళ్ళు మాట జారారా ? ఊహ్ మాత్రంగా ఏదైనా పొరపాటు

చేసారా ? వాళ్ళు సమిధలు - ఈ సంసారంలో కాలి పోయిన కొవ్వొత్తులు. ఈ పూట ఆవేశానికో కావేశానికో పోయి చిన్న పొరపాటు చేసానుడను కొందాం - ఆ మాత్రానికే వాడిని ఇంత రాద్ధాంతం చేయాలా -"

"అది కాదు నాన్నా - మీరు కాస్త ప్రాక్టికల్ గా ఆలోచించండి ఈ ఏడు మన మార్కెట్ పుంజుకుంటుంది. ఉన్నపళంగా వాళ్ళ పాతిక ఎకరాల విత్తనాలు ఆ చిట్టి బాబు గాడి పరం అయ్యాయి. ఇప్పుడేం చేస్తాం ? అందులోనూ కూలీలు దొరికి చావట్లేదు. చిన్నా పెద్ద పని మనమే బుజ్జగించో బతిమిలాడో చేయించు కోవాలి. మనకు మాత్రం మనుషులె వరున్నారు ? పెదనాన్న పెద్దవయసు వచ్చి మంచంలోంచి కదల్లేక పోతుండె - పెద్దమ్మ అటు ఇటుగా అంతే. రెండు నెలల్లో గ్రేడింగ్ చేయాలి - ప్యాకింగ్ చేయాలి - మనుషులేరి ? బావలిద్దరితో పాటు అక్కలు, పిల్లలు - వాళ్ళ బంధువులు అందరూ కర్నూలు పోయి కూర్చున్నారు. మన బలగం ఎంత తగ్గిందో చూడు నాన్నా - అన్నయ్య మీద నాకు మాత్రం కోపం ఎందుకుంటుంది. నాన్నా - ఈ యింట్లో ఈ నాడు అందరం కాస్త పచ్చగా వున్నామంటే అది అన్నయ్య పుణ్యానేనని నాకు మాత్రం తెలీదూ -"

"నిజంరా - రామాయణంలో అసలు గొప్పతనం లక్ష్మణుడిదంటారు. రాముడు ఎన్ని కష్టాలు పడినా భార్యా భర్తలు కలిసి పంచుకున్నారు. లక్ష్మణుడు చేసిన త్యాగం ఎంత గొప్పది ! ఆ అజ్ఞాత నాయకి ఊర్మిళ త్యాగం ఎంత గొప్పది !" రామనాథం కంఠం మంద్రంగా పలికింది. "ఆ సరే ! నువ్వన్నట్టు ప్రాక్టకల్ గానే ఆలోచిద్దాం పాతిక ఎకరాల సీడ్ కావాలి అంతే కదా - ఇంకెవరి దగ్గరైనా దొరుకు తుందేమో ఆలోచిద్దాం. ఏమంటావ్ ? అన్నట్టు, గీతని సెలవలు ఇచ్చీ ఇవ్వంగానే పుట్టింటికి పంపే అలవాటు మాన్పియ్యి. పని చేసే రోజుల్లో మన బలగంలో ఒక మనిషి పెరుగుతారు -"

రామనాథం లేచి శివుడు వెళ్ళిన వైపు వెళ్ళాడు.

శివుడు కాలువ కల్వర్టు మీద కూర్చుని నీళ్ళు లెని కాలువలోకి వదులుతున్నారు. మిగిలిన నీళ్ళు అక్కడక్కడ నీటి గుంటల్లాగా ఏర్పడ్డాయి. జమ్ము కాలువల్నిండా పెరిగి పోయింది. కాలువ గట్టుకు రెండు వైపులా గుబురులాగా కాంగ్రెస్ వీడ్ పెరిగివుంది.

'అవును, బావయ్యలను కొట్టాను. కొట్టేప్పుడు నేనేం ఆలోచించ లేదు. నా అక్కలు ఎంత కుమిలి పోయి వుంటారో ఊహించుకున్నాను. ఎంత బాధను అణుచుకుని అలా కరడు కట్టివుంటారో ఊహించుకొన్నాను. తప్పు చేయడం కన్నా తనువు చాలించడం మేలని నమ్మే ఈ కుటుంబంలో పుట్టి - అట్లాంటి మొగుళ్ళకు పెళ్ళాలుగా ఎంత మధన పడి వుంటారో ఎంత ఛిద్రం అయి వుంటారో ఊహించు కొని కొట్టాను.

పరాయి ఆడదాని దగ్గరకి వెళ్ళి వచ్చిన భర్త తిన్నాడో లేదో నని తపించి - అన్నం కలిపి సిద్ధంగా వుంచే ఆ అమాయకత్వాన్ని తలుచుకొని కొట్టాను.

తప్పతాగి వచ్చిన మొగుణ్ణి బయట పడి పరువుతీస్తాడేమోనని గుట్టుగా గుండెల్లో దాచుకున్న ఆ దౌర్భాగ్యాన్ని తలచుకొని కొట్టాను

నా అక్కలు మా మధ్యే తిరుగుతూ - నవ్వుతూ తుళ్ళుతూ - అంతటి బడబాగ్నిని బయట పడనివ్వకుండా ఎలా భరించారో తలుచు కొని కొట్టాను

అవును ! అక్కలు నన్ను ఈసడించుకొన్నా - భార్య ఎత్తి చూపినా -తమ్ముడు దెప్పిపొడిచినా - నాది తప్పుకాదు నేను తప్పుచేయలేదు వాళ్ళని తన్నడం కాదు ఆడ పిల్లల్ని అంతలా మెత్తగా ముక్కలు ముక్కలు చేసినందుకు - జీవితంలో సుఖమనేది ఎరక్కుండా చేసినందుకు - నరికి పోగులు పెట్టినా పాపం లేదు పాపం లేదు !

కానీ బాబాయ్ - ? బాబాయ్ - ఎందుకని ఏమీ మాట్లాడడం లేదు ? తప్పని కానీ ఒప్పని కానీ చెప్పడం లేదు. సుధాకర్‌కి ఖండించడం లేదు'

శివుడికి ఒక్కసారిగా అపరాధభావన ముంచెత్తింది

'అవును - సుధాకర్ చెప్పింది నిజం వాడు నిలకడగా నిల్చుని ఆలోచిస్తాడు తను తన్నినందు వల్ల వాళ్ళేమన్నా బాగుపడ్డారా ? అక్కల బతుకులు బాగుపడ్డాయా ? పైనుంచి ఇన్నాళ్ళుగా ఒక్క మాట మీద నడిచిన సంసారం ముక్కలు అయ్యింది - నా మూలంగా నా మూలంగానే ఇదంతా జరిగింది. పాపిష్టి కోపం - ఎందు కొస్తుందో ఏమో-"

శివుడు దుఃఖంలో మునిగి పోయాడు.

రామనాథం మెల్లిగా శివుడి పక్కకు వచ్చి నిల్చున్నాడు శివుడు భుజం తట్టి మెల్లిగా అన్నాడు.

"ఏంట్రా - శివుడూ మరీ చిన్న పిల్లాడిలాగా - అప్పుడే జుట్టు కూడా తెల్లబడుతోంది - ఇంకా పసివాడి వాలకం పోనివ్వవు -"

రామనాథం శివుడి మనసును తేలిక పరచడానికన్నట్లు నవ్వుతూ అన్నాడు.

"అవును బాబాయ్, వయసు పెరిగినా బుద్ధి మాత్రం పెరిగి చావట్లేదు !" శివుడి చెంపల మీద జలజలనీళ్ళు జారాయి.

"ఏంట్రా శివుడూ అదీ - " రామనాదం ఓదార్పుగా అతని భుజం నిమిరాడు.

"నా మూలంగా నిండు సంసారం ముక్కలవుతోంది కదా బాబాయ్-" శివుడు కంఠం బొంగురు పోయింది.

"నీకేవయినా పిచ్చెక్కిందా ఏంటి ? తప్పుచేసింది వాళ్ళు. అలాంటి దేవన్నా జరిగితే వాళ్ళ మూలంగానే - కానీ తప్పును దండించిన వాడివి నీవెలా కారణమవుతావు ? వాళ్ళెప్పట్నించో వేరు పోవాలని ఆలోచనలో వున్నట్టున్నారు. వాళ్ళ పబ్బం గడిచింది పక్కకు తప్పుకున్నారు. వాళ్ళ తప్పులు కనపడనివ్వకుండా నిన్ను నానాయాగీ చేసి దోషిగా నిలబెడుతున్నారు ఇంత మంది నిన్ను కొట్టావు కొట్టావు అంటున్నారే - ఎందుక్కొట్టావు అని ఒక్కళ్ళన్నా పరామర్శించారా ? కాబట్టి

- వదిలేయి. మన అమ్మాయిల బాధ వూహించు కొనే మన మింత చిత్రవధను అనుభవిస్తున్నాం. కానీ అదేంటో వాళ్ళ మొగుళ్ళు వాళ్ళకు మంచాళ్ళే మనమే చెడ్డాళ్ళం. అంతేలే లోకం తీరు ! నువ్వెందుకు బాధ పడ్డం ?"

"అది కాదు బాబాయ్ - ఆ పిచ్చిమొహాలకి మొగుళ్ళ మీది భ్రమతో వాస్తవమేమిటో కళ్ళకనిపించడంలా - మీ మీది గౌరవంతోనో భయంతోనో ఇక్కడ కాస్త అణిగిమణిగి వుండేవారు. ఇప్పుడు ఆ కర్నూలు చేరి ఏవేం వెలగబెడుతున్నారో - మన సుధాకర్ చెప్తూనే వుండె - అందులోనూ పట్నంలో సంసారమంటే సామాన్యమా ? బియ్యం దగ్గర్నించి పప్పు ఉప్పుల దగ్గరదాకా కొనుక్కు తినాల్సిందేగా ? వేడి మీద నా లోజులు బాగానే వుంటుంది. వాళ్ళక్కడ కూర్చుని ఇక్కడ చేసే వ్యవసాయం ఏం వ్యవసాయం ? పొలాలు తప్ప వాళ్ళకు వేరే ఆదాయాలు ఏవున్నాయి ? చక్కటి పిల్లలు - వీళ్ళ వేషాలు పట్టించు కోకుండా ఇంత కాలం పెంచితిమి. ఇప్పుడు పిల్లల ముందే ఈ దగుల్బాజీ పనులన్నీ చేస్తుంటే చూసి చెడి పోరూ -" శివుడు గబగబ అన్నాడు, "నేనూ అలా చేయకుండా వుండాల్సింది, ఏడ్చేదేదో ఇక్కడే ఏడ్చిచచ్చే వారు -"

"నువ్వు అలా చేయడమే మంచిదిరా - ఆ ప్రసాద్ మొన్న పొట్టి చెయ్యి మాత్రమే పట్టుకున్నాడు. అట్లాగే చూసీ చూడ కుండా వదిలేసి వుంటే మరేదైనా చేసి వుండే వాడు కాదూ ? మన పొలంలోకి మరో ఆడపిల్ల ఏ ధైర్యంతో అడుగు పెడుతుంది ? జరిగిందంతా మన మంచికే ననుకోరాదూ ? మన అమ్మాయిలు మన దగ్గరకి రాకపోరూ - మనం సాయం చెయ్యకుండా వుండలేం - నాల్రోజులు గడవనీ - వాళ్ళకు తెలిసోస్తుంది !

"పద ఇంటి కెళ్దాం-"

❋ ❋ ❋

"కల్యాణి వాళ్ళు కారు కొన్నారంటగా -" గీత ఓ దీర్ఘం తీసింది.

సుధాకర్ ఆమె వంక చిరాగ్గా చూసాడు.

"అవున్లెండి - మన్లాగా మట్టి పిసుక్కొనే వాళ్ళా ఏం ? డాక్టర్లయ్యే డాక్టర్లు ! "

సుధాకర్ కర్నూలుకు వెళ్ళే హడావుడిలో వున్నాడు.

పందిట్లో భారతి వాళ్ళు మిషను మీద సంచులు కుడుతున్నారు. వాటన్నిటిని తీసుకెళ్ళి ప్రింటింగ్ కు ఇవ్వాలి. గ్రేడింగ్, ప్యాకింగ్ ఇంకా చాలా పన్లున్నాయి. అప్పుడే రోహిణీ కార్తె వచ్చేస్తుంది. తొలకరి నాటికి మార్కెట్‌కు విత్తనాలు వెళ్ళిపోవాలి.

సుధాకర్ గీత మాటలు పట్టించుకోకుండా పందిట్లోకి తొంగి చూసాడు.

సావిత్రి, శివుడి కూతురు ధాత్రి తెల్లబట్ట తానును ముక్కలుగా కత్తిరిస్తున్నారు. ఆకాశ్ కుట్టినవి కుట్టినట్లుగా పక్కన పెడుతున్నాడు. శాంతమ్మ సంచులు తిరగేసి - పక్కన పెడుతోంది. శివుడి వంద సంచుల్ని లెక్కబెట్టి పురి కొసతో కట్టలు కడుతున్నాడు. రామనాథం విత్తనాల సంచి మీద ముద్రించాల్సిన అంశాల్ని ఓ కాగితం మీద వ్రాస్తున్నాడు.

సుధాకర్ చుట్టు చూసాడు. సుధాకర్ పిల్లలిద్దరూ గట్టు మీద కూర్చుని కారప్పూస నములుతున్నారు.

"అట్లా కూర్చోక పోతే మీరూ ధాత్రి, ఆకాశ్‌లతో పాటు ఏదో పని చేయకూడదూ -" సుధకర్ తన పిల్లల్ని కోప్పడ్డాడు.

"హు !" సుధాకర్ కూతురు నేలను తాటించి తన్ని లోపలికి వెళ్ళి పోయింది.

"తల్లి బుద్ధులు - ఎక్కడికి పోతాయ్ -" సుధాకర్ గొణుక్కున్నాడు.

"అన్నయ్యా కుట్టడం అయినంత వరకూ గోనెసంచిలో వేసేయకూడదూ - నేను బయల్దేరాలి -" శివుడిని వుద్దేశించి అన్నాడు.

పద్మ సరళల కుటుంబాలు లేని లోటు స్పష్టంగా కనిపిస్తోంది. ధాత్రి ఆకాశ్ పిల్లల్ని మరీ మరీ తలుచుకుంటున్నారు.

"ఇప్పుడు ఆదిత్య వుంటేవా -!"

"ఇదే హరిత అయితేనా -?" అంటూ-

పెద్దవాళ్ళు మౌనంగా పనులు చేసుకుంటున్నారు.

" ఆ సంచిట్లా అందియ్యి-"

"కత్తెరిలా ఇయ్యి-"

"ఇవిగో మీ నాన్నకి అందివ్వు -"

ఆ నిశ్శబ్దంలో ఎవరినీ ఉద్దేశించని మాటలు కొన్ని వినబడుతున్నాయి.

"నాన్నా, మల్లేశ్ రాలేదూ ?

ఈ పూట వస్తానన్నాడంటగా ?"

సుధాకర్ రామనాథాన్ని ఆరా తీసాడు.

"ఏమోరా మరి !"

సుధకర్ లోపలికి, వెళ్ళి గీతను కేకేసాడు.

"నువ్వొక్కదానివీ ఎందుకట్లా అంటీ ముట్టనట్లుంటావ్ ? కళ్ళు కనిపించక పోయినా పెద్దమ్మ చూడు ఏం చేస్తుందో -"

"అవునేలెండి - అందరూ నన్నే అనండి " గీత ముక్కుచీదింది.

"చాల్లే ఆపు-! వీళ్ళ దగ్గర కాకపోతే అలా గ్రేడింగ్ దగ్గర కూర్చోవచ్చు కదా -? పద - నీ నవల కూడా తెచ్చుకో చదువుకుందువు-" సుధాకర్ గీతను తొందర పెట్టాడు.

పెళ్ళయాక మొట్ట మొదటి సారి గీతను పనికి పురమాయించాడు. గీత కదం తొక్కుతూ అసహనంగా సుధకర్ వెంట నడిచింది. అప్పుడే సూపర్ కాగితం పరుచుకొని - కూలీలు వచ్చి వరుసలుగా కూర్చుంటున్నారు.

"ఇదుగో గీతా, ఇవి $JKHY_1$ విత్తనాలు అవి $H_4$ చూసావా సంచుల మీద స్పష్టంగా రాసివున్నాయి. ఒక రకం విత్తనాలు గ్రేడింగ్ పూర్తయ్యి - సంచుల్లోకి ఎత్తేసాకే - రెండో రకాన్ని పోయించు తెలిసిందా ? వాళ్ళ పాటికి వాళ్ళు విత్తనాలు ఏరుతుంటారు. నువ్వు నిక్షేపంగా నీ నవల చదువుకో -"

గీత కేమీ అభ్యంతరం లేదు ఆమె ఓ పెద్ద గిన్నె నిండా కారప్పూస తెచ్చుకొంది. గోడవారగా మంచం వాల్చుకొంది. బోర్లా పడుకొని కారప్పూస నములుతూ నవల చదువు కుంటోంది.

నవల మంచి రసపట్టులో వుంది.

ఇప్పుడు హీరో హీరోయిన్‌ని ఏం చేస్తాడో ఏమో -

గీత గోళ్ళు కొరుక్కుంటూ ఉత్కంఠగా చదువుతోంది.

"గా సంచులు పోసేస్నం - ఇంగ ఏవి పొయ్యాల ?" మద్దిలేటి గీతను ప్రశ్నించాడు.

"అవిగో - ఆ పక్కన వున్నాయే నాలుగు సంచులు అవి పొయ్యి -"

గీత కళ్ళు తిప్పకుండానే సమాధానం చెప్పి - నవలలో మునిగిపోయింది.

మద్దిలేటి అప్పటికే పట్టా మీద కుప్ప వేసిన $JKHY_1$ విత్తనాల్లో $H_4$ విత్తనాలు సంచులు గుమ్మరించాడు.పై నుంచి కిందికి కలిపి, ఒక్కో కూలీ ముందు తట్టెడు విత్తనాలు కుప్పగా వేసాడు వాళ్ళు తప్పలు తాలులు ఏరడంలో మునిగి పోయారు.

సుధాకర్ మోటర్ సైకిల్ క్యారియర్ కి గోనె సంచి బిగించి కట్టాడు.

ఓ మారు గ్రేడింగ్ వైపు చూద్దామని అటు వచ్చాడు.

గీత నవల్లో పడి సుధాకర్ వచ్చిందే గమనించలేదు.

సుధాకర్ పట్టా మీద ఇంతెత్తు కుప్పను చూసి ఆశ్చర్య పోయాడు. ఏదో అనుమానం వచ్చి విత్తనాలు అరచేతిలోకి తీసుకొని చూసాడు. $JKHY_1$ - $H_4$ కలిసినట్టున్నాయి.

"మద్ది లేటి - ఎక్కడి విత్తనాలురా ఇవి ?"

"అగో అక్కడున్న సంచుల్లోటివి !"

"ఏదీ సంచు లిట్లా చూపించు-"

మద్ది లేటి తెచ్చాడు, కొన్ని $JKHY_1$ వి మరి కొన్ని $H_4$ వి, సుధాకర్ కుప్పకూలి పోయాడు.

పాతిక క్వింటాళ్ళ విత్తనాలు !

కిలో నూట యాభై రూపాయల దాకా ధరపలికే $JKHY_1$ ఇప్పుడు అయిదు రూపాయల పాటి చెయ్యదు ! కమర్షియల్ సీడ్ కింద కూడా అమ్ముకోవడానికి కూడా పనికి రాదు - ఏ నూనె గానుక్కో పంపి పత్తి చెక్క తెచ్చి పశువులకు వెయ్యాల్సిందే!'

నిమిషాల్లో లక్షల్లో నష్టం !

సుధాకర్‌కి చర చరా కోపం వచ్చింది గీత ఇంకా బోర్లా పడుకొని చదువు కుంటూనే వుంది.

సుధాకర్ గోనె సంచులు తీసుకెళ్ళి ఆమె మీదకు విసిరి కొట్టాడు.

గీత దిగ్గున లేచింది. ఆమెకి విషయమేంటో అర్థం కాలేదు.

"ఒక్కటంటే ఒక్క నిమిషం - ఏడాది కష్టాన్ని ఏట్లో కలిపావు కదా -"

"నేనేం చేసాను ?" గీత అయోమయంగా అడిగింది.

"ఇంకేం చెయ్యాలి ? చెయ్యాల్సిదంతా చేసావు ! అసలు మొదట్నించీ నువ్వింతే -! ఏదో నీ ఇష్టమొచ్చినట్లు నువ్వు బతుకు తున్నావులే నీ యిష్టాయిష్టాల్లో నేనెందుకు కల్పించు కోవాలని నీ పాటికి నిన్ను ఒదిలేసా కానీ నువ్వు - నీకు వప్ప చెప్పిన ఒకే ఒక పనిని సర్వనాశనం చేసావు. ఒక్క నిమిషం - ఒక్క నిమిషం ఆ గోతాం మీది పేరు చదువుంటే - లక్షలు నష్టపోయే వాళ్ళం కాదు - నీ నిర్లక్ష్యం విలువ నాలుగు అక్షలు !-"

"అర్థమయ్యేటట్టు చెప్పండి - నేనేం అంత కాని పని చెయ్యలే -"

"నువ్వెందుకు చేస్తావ్ ? నేనే చేసాను నీకు పని అప్పచెప్పి -! అసలు ఈ ఇంట్లో నువ్వెట్లా దాపురించావో నాకర్థం కాదు, పెళ్ళయి ఇన్నేళ్ళయింది - పెద్దమ్మనీ, అమ్మ, వదిన్న, చివరికి ధాత్రి వాళ్ళను చూసైనా పని అంటే ఏంటో నేర్చుకోవచ్చుగా - చిన్న పిల్లవా ? కొత్త పెళ్ళి కూతురివా ? అన్నీ మహజరుగా దొరసానిలా జరిపించు కుంటావ్ ! వాళ్ళ మంచి తనం నీకు అలుసై పోయింది. ఛీ !"

సుధాకర్ కోపంతో కుతకుతలాడి పోతున్నాడు గీత ఇన్నేళ్ళలో సుధాకర్‌ని ఎప్పుడు అలా చూడలేదు. సుధాకర్ ముఖం ఎర్రబడి పెదవులు వణుకుతున్నాయి. గీత అతని ముఖానికి కళ్ళప్పగించింది. చుట్టూ నిల్చున్న కూలీలు కూడా సుధాకర్ వాలకానికి బిత్తరపోయి చూస్తున్నారు. మద్దిలేటి తనకి చచ్చే తన్నులు తప్పవని నిర్ణయానికి వచ్చేసాడు. వున్న చోటే నిల్చుని గడగడ వణుకు తున్నాడు.

గీత మాత్రం నిర్లక్ష్యంగా తలెగరేసింది.

సుధకర్ మరింత కోపాన్ని ఎగదోసింది.

"అక్కడ అనూరాధ చూడు - నీ ఈడుదే కదా ? మల్లేశ్ కన్నా ఎక్కువ పని చేస్తోంది. ఆయన మార్కెటింగ్ చూస్తుంటే ఈమె ప్రొడక్షన్, ప్రాసెసింగ్ చూస్తోంది. మేమందరం చేసే పని వాళ్ళిద్దరు చేసి చూపిస్తున్నారు -"

అనూరాధ మాటెత్తే సరికి గీతకు చిర్రెత్తు కొచ్చింది.

"అవున్లెండి - ఆమె లాగా పని చేయడమూ చేత కాదు. వచ్చే పొయ్యే మగాళ్ళందరి తోనూ పూసుకుంటూ రాసుకుంటూ వగలాడిలా కులకడమూ చేతగాదు -"

గీత చెంప చెళ్ళు మంది.

"అనూరాధని ఇంకో మాటన్నావంటే - నాలిక చీరేస్తాను ! జాగ్రత్త !"

"అనూరాధ ! అనూరాధ !! అనూరాధ !!! దాని మీద అంత ప్రేమ వున్నోళ్ళు మరి నన్నెందుకు కట్టుకున్నారు - దాన్నే కట్టుకుని ఊరేగాల్సింది !"

గీత గొంతు చించు కొని అరిచింది.

"అవును ! అనూరాధను చేసుకొన్నా బావుండేది. పుడితే పిచ్చి పిల్లలు పుట్టే వాళ్ళు ! అంతేగా ! నేను పిచ్చాణ్ణి మాత్రం అయ్యే వాణ్ణి కాను !" సుధాకర్ అంత కన్నా గట్టిగా అరిచాడు.

ఏ అగ్ని పర్వతం పేలలేదూ - ఏ భూగోళం బద్దలవ్వలేదూ - కానీ అదే వేగంతో సుధాకర్ బద్దలయ్యాడు.

సుధాకర్ గిర్రున వెనక్కు తిరిగాడు.

స్థాణువులై నిల్చున్న రామనాథాన్ని, మల్లేశ్‌ను చూసి గతుక్కు మన్నాడు. క్షణంలో తేరుకొని, తల తిప్పు కున్నాడు. చరచర బయటకు వెళ్ళి పోయాడు.

"మనసు దాని మీదా కాపురం నాతో - నా బతుకు బండలు చేసారు -" గీత అరుస్తూనే వుంది.

❋ ❋ ❋

"బుజ్జమ్మా - కూలాళ్ళను తీసుకురమ్మంటే ఏంటీ ఇంత చిన్న పిల్లల్ని పట్టుకొచ్చావ్ ? అయిదేళ్ళున్నా ఉన్నాయో లేదో -" అనూరాధ మేస్త్రీ బుజ్జమ్మను కోప్పడుతోంది.

"గదేం పనమ్మా - నీడన కూసోని బియ్యమేరినట్టు ఇత్తులు ఏరుడే. గీ పిల్లలు మంచిగ చేస్తరు -"

"వాళ్ళు మంచిగా చేస్తారో - ఎట్లా చేస్తారో నాకెందుకు ? పదేళ్ళలోపు పిల్లలు మా పనిలో దిగడానికి వీల్లేదన్నారు మామయ్య - అయినా చూస్తూ చూస్తూ వాళ్ళకి పనేంచెప్తాం-"

"ఇయ్యాల రేపు గీ పిల్లలే మంచిగ జేస్తున్రమ్మ - వాళ్లకు కూలిస్తం ? అది కొండ బోయి అయ్యలకిస్తరు. వాల్లు తాగి తందనాలాడ్తరు. పనికి పోకుంటే చంపక తింటరు. ఏం జేస్తరు -"

"వాళ్ళ గోల నాకనవసరం. ముందు వాళ్ళందర్ని పంపించేయి పెద్దళ్ళాని పందిట్లోని రమ్మను -"

బుజ్జమ్మ పిల్లల్ని పంపి వచ్చింది.

వెళ్ళిన పిల్లల్లో ఇద్దరు ముగ్గురు గోడకు కొట్టిన బంతుల్లా తిరిగొచ్చారు. పక్కనే వారి తల్లులు.

"ఏం రాములమ్మ - ఏంటి ఇట్టా వచ్చావ్ ?" వచ్చినా వాళ్ళలో ఒకర్ని పరామర్శించింది అనూరాధ

"ఏందమ్మా మా పొట్టిని[1] ఎనక్కి తోలిన వంట !"

"తోలక ? అంత పిల్లతో పన్జేయించుకోమంటావా ?"

"గా పోరి[2] ఎంత పన్జేస్తదను కొంటవ్ - ఇంట్ల బాసాన్లు తోమ్తది -గొర్లు కొట్టక పోతది - బాయిల కేంచి నీల్లు తెస్తది - కసువులూడస్తది ! గీ పని ఎంత పనమ్మ - అట్ల పందిటి కింద కూసోని ఇత్తులేరుడు ! మా పోరి సక్కంగ చేస్తది -"

అనూరాధ ముఖం చిట్లించింది.

"అవ్ మా రజియాను మొన్న కలుపు గిట్ల పంపితి."

"మా గోకారిని ఆ సంగ్రం క్రాసింగుకు పంప్తమను కుంటి -"

"మీరను కొంటే సరిపోతుందా ? " అనూరాధ కస్సుమంది.

"ఏందమ్మో - తెల్సినోళ్ళు మంచిగ దుడ్లి స్తరని మీ దగ్గరకు పంపినా. గా భూపాలు దొర పిల్వనంపిండు - నువ్వు వద్దు రావద్దంటే ఎవ్వరు నీ ముంగట నిల్వరు - రజియా - ఇంగరా షబ్నా - ఛలోనా "

రజియా, షబానా, గోకారి అందరూ వాళ్ళ అక్క చెల్లెళ్ళతో సహాపని వదిలేసి వెళ్ళారు.

"వెళ్ళనీ -" అనూరాధ గొణుక్కుంది

"అవ్ అమ్మా - ఇయ్యాల్రేపు మంచి చెప్పుడే తప్పయి తుంది -" బుజ్జమ్మ విచారం వ్యక్తం చేస్తూఅంది

"గా భూపాలు దొర ఏమని సీడు చేను పెట్టిందో ఎక్కడెక్కడోల్లను గుంజక పోతుండు. పోరిలకు పట్టులంగాలు కొనిస్తుండంట. స్టీలు క్యారియర్లు కొనిస్తుండు" బుజ్జకమ్మ బుగ్గలు నొక్కొకుంది, "మేస్త్రీలకు సారా గిట్ల పోపిస్తుంట" అనూరాధ కళ్ళు పెద్దవి జేసింది.

"వాల్లదే సారా కొట్టాయె - ఇంగ పోపియ్యక ఏం జేస్తరు ?" బుజ్జమ్మ వేళ్ళు విరిచింది.

"గా రజియా తల్లి జూస్నవామ్మా - వళ్ళో బిడ్డ కడుపుల బిడ్డ - ఇంగ వాళ్ళ కడుపుల గింత రొట్టె ముక్కగెట్ల పెడ్తది - పుట్టిన పిల్లను పుట్టినట్లు చేల్ల పెడ్తది. వాళ్ళు తెచ్చింది మొగుడు సారా కొట్ల పోస్తడు. పెండ్లాం కాన్పులకు పోస్తది. రజియా చూడమ్మ పాపం ఎట్ల బక్కంగ పోయుంటరో -" అనూరాధ విషాదంలో మునిగిపోయింది. మౌనంగా తలాడించింది.

అనూరాధకి చిరాగ్గా వుంది. పనికి వచ్చినాళ్ళకి విత్తనాలు ఇచ్చి గ్రేడింగ్ చేయిస్తోంది. ఇంతలో చడీ చప్పుడు చేయ్యకుండా రజియా, గోకారి వచ్చి ఆమె వెనకగా నుల్చున్నారు

"అమ్మా - అమ్మా -" వాళ్ళు నసిగారు.

అనూరాధ గిరుక్కున తిరిగి చూసింది.

"మళ్ళీ వచ్చారేంటి ? నేను పన్లోకి తీసుకోనని చెప్పానా -"

---

1, 2. అమ్మాయి

ఇద్దరూ గబుక్కున అనూరాధ కాళ్ళ మీద పడ్డారు గోడు గోడున ఏడ్చారు

"అమ్మా నీ కాల్మొక్తం - నీ తాన పని మాన్తె వేరే తానకు పంప్తరు - గా భూపాల్ దొర తాన వుండే మేస్త్రీ తాగొస్తడు మమ్మల చూస్తే గిచ్తడు గిల్తడు గా షబ్బునైతే గలీజు గలీజు చేసిండు పోకుంటే మా నాయన తాగొచ్చి సచ్చేటట్లు తంతడు పోతే వాడు సంపక తింటడు వాల్లిచ్చే పట్టు లంగ లొద్దు - టీలు టిపిన్లొద్దు - నీ తాన వుంటం - మమ్మల సంపక తిన్నట్టే -"

అనూరాధకు ఏడుపు ముంచు కొచ్చింది 'అంత స్పష్టంగా చెప్తున్నారే - మరి వాళ్ళ తల్లిదండ్రులు మనుషులా కసాయిలా ? ఎలా వాళ్ళను పనులకు పంపుతున్నారు ? రజియా చిన్న పల్లేవీ కాదు మంచి చెడు విషయాలు తెలుస్తున్నాయి -" అనూరాధకు గుండెలో కెలికి నట్లయింది.

"ముందు పైకి లేవండి - సరేలే - మీ అమ్మాళ్ళు నొచ్చి మాట్లాడ మనండి -" అనూరాధ చెపుతూనే వుంది.

వాళ్ళ అమ్మలతో పాటు నాన్నలూ దూసుకొచ్చారు. పిల్లలరెక్కలు పుచ్చుకొని బరబరా లాక్కెళ్ళారు పిల్లలు గింజుకుంటూ కేకలు పెడుతున్నారు - "వదలగ్రని - ఛోడ్‌దో" మిగిలిన కూలీలంతా చుట్టు ముట్టే సారు.

"పిల్లల్నలా లాక్కెళ్తారేంటి ? నిల్చుని మాట్లాడలేరూ -" అనూరాధ గద్దించింది.

"మ పిల్లల సంగతి మాకెర్క - నడుమ నీవెందుకు మాట్లాడ్తవ్ ?" ఒకడు ఎదురు ప్రశ్నించాడు.

"ఏంటయ్యా - నీకెర్క ? పిల్లలట్లా మొత్తుకుంటుంటే -"

"మొత్తుకుంటరు ! ఎన్ని దినాలు మొత్తుకుంటరు. ఒక దినం వారం దినాలు - పది దినాలు - ఖతం ! పనిల పడ్తరు. గీడ చేయనింక మజా మీదున్నోళ్ళు భూపాలు దొరతాన ఎందుకు జేయరు ? వాల్లు మీకన్నా ఐదురూపాయలు ఎక్కవిస్తుగ్రు - బస్ ! ఫికర్ లేకుండా దినం గడుస్తది -"

"సిగ్గు లేదూ ? దుక్క లాగా వున్నావు - నువ్వొవక్కడివి కూలికొస్తే ఇద్దరు పిల్లల కూలి డబ్బులొస్తాయి. వాళ్ళని పనిలో పెట్టి నువ్వు కులాసాగా ఆ సారాలో పడి క్కొట్టు కొంటా వంటావ్ ! నీ పెళ్ళామేమో పిల్లల్ని కంటూ వుంటుంది ! నీ కొంప నంతా మోయాల్సింది ఆ పిల్ల లేగా ? వాళ్ళనలా చాకిరీకి పంపే అధికారం నీకెక్కడుంది.!"

"ఓ రాధమ్మో - ఇంటున్నమని రామానం తీరున చెప్పుకొస్తున్నవే ! కూలికి పోంది వాళ్ళకు కూడేడి కెల్లి వొస్తది? గుడ్డ ఏడికెల్లివొస్తది ? కూలికి పంప కుండ సుతరాయించి వాల్లను కొంపల పెట్కోని ఏం చేయాల ? ఏం మేపాలా ? ఆకలికి గంజి పోయాల్నా చంపాల్నా - మంచిగ జెప్పొచ్చువ్ - పోమ్మా - ఇస్తే పని ఇయ్యి - లేకుంటే ఇచ్చె తానకు పోతం. గీ పాలముర్ల నీ వొక్క

దానివి పిలుస్తున్నావా ? ఇంగ జూడు - నా నెత్తి మీది బొచ్చున్నంత మంది వున్నరు కూలీకి పెల్చేటోళ్ళు - ఇంగ నీవు పెల్చినా మా పోరిలు రారు వచ్చిన గానీ పది రూపాయలు ఎక్కవయియ్యాల సమజయిందా !''

పిల్లలను నేల మీద ఈడ్చుకొంటూ - రానని మొండికేసిన వాళ్ళ చెంపలు పగలకొడుతూ - పిల్లల ఏడ్పుల మొత్తు కోళ్ళ మధ్య వాళ్ళు వెళ్ళిపోయారు

అనూరాధ నిస్సహాయంగా చూస్తూ వుండి పోయింది

'వాళ్ళు వాళ్ళ పిల్లలు - అది వాళ్ళ నిర్ణయం'

''తిక్క ముండలు - బేకార్‌గా లొల్లి చేసిగ్రు - నేను గిట్లయితే మంచిగ పోతుంటి ఈడే మున్నది ? అక్కడ వాల్లు సిన్మా గిట్ల చూపిస్తుగ్రంట దుడ్లు మస్తుగ ఇస్తుగ్రంట - కాళ్ళకు గజ్జెలు చేపిచ్చు కుంటింటి -'' ఒకమ్మాయి పక్కనామెతో గట్టిగా అంటోంది

అనూరాధ విసురుగా లోపలికి వెళ్ళిపోయింది

''తాగుబోతు వెధవలు ! పిల్లల్ని కని డబ్బు సంపాదించే యంత్రాల్లా తయారు చేస్తున్నారు. అసలిట్లాంటి వారికి పిల్లల్ని కనే అధికారమే వుండకూడదు ఎవరు వారిని ఈ భూమ్మీద పడేయ్యమన్నారు ? ఎవరు వారి బాల్యాన్ని దోచుకోమన్నారు ? ఈ అసంతృప్తి వాళ్ళని అరాచక శక్తులుగా తయారు చేయదూ ? సంఘం పరిస్థితి నానాటికీ తీసికట్టు నాగం భొట్లు అన్నట్టుగా ఎందుకు తయారవ్వదు ? ఏమైనా అంటే చట్టాలు, సంఘాలు పనికి ప్రేరేపిస్తున్న వారి మీద పడతాయి అసలు ఆ పిల్లల్ని పనికి ప్రేరేపిస్తున్న అంశాలేంటి ? పేదరికం - ఆకలి ఇంకా ఎన్నైనా చెప్పొచ్చు - అన్నింటి కన్నా ముందు కనిపించేది పెద్దల బాధ్యతా రాహిత్యం ఈ రోజుల్లో రైతు కూలీకి మగ వాడికి రోజు చెల్లించేది యాభైరూపాయల పైనే - ఆడవాళ్ళకీ నలభై అయిదు, నాగలి వేసుకొస్తే నూట యాభై దాకా అడుగుతున్నారు. మళ్ళీ దుక్కి దుక్కికి రేట్లు పెంచుతూనే వుండిరి. గంపెడు పిల్లల్ని కని - సంపాదించిన డబ్బు సారా కొట్లో పోసి - పలకా బలపం పట్టాల్సిన వాళ్ళ చేతిలో తట్టా కొడవలి పెట్టి పంపిస్తున్నారు - ఇది ఎవరు తీర్చాల్సిన సమస్య ? పని చేయించు కొనే వాళ్ళా పని చేసే వాళ్ళా - ప్రభుత్వాలా - ప్రజలా - సంఘమా -? ఎవరువారిని అర్థం చేసుకోవాలి - అయ్యో - పసితనం అనేది లేకుండా పోతుందే ! నేనొక్క దానిని పనికి రావద్దన్నందు వల్ల ఈ సమస్య తీరిపోతుందా ?

వాళ్ళు మరో చోటికి వెళతారు - మరో రకంగా వాడుకో బడతారు-'' అనూరాధ అసహనంగా తలాడించింది.

'బోడిముండ, ఆ రజియా తల్లి ఎంతెంత మాటలనింది -! కనికని పిల్లల్ని కంటానే వుంటది. దేశం మీదకు వదులు తుంది - ఇట్లాంటి వాళ్ళందరూ కుటుంబ నియంత్రణ ఎందుకు పాటించదు ? అజ్ఞానం - అపోహలు - వాటికి మూలం నిరక్షరాస్యత ! ఇంక ఈ సమస్యలన్నీ ఎక్కడ తేలేది ? '

అనూరాధ ఏమీ చేయలేని నిస్సహాయతతో తల విదిలించింది.

'తన ఒక్కదాని వల్ల ఏం జరుగుతుంది ? కానీ ఏదైనా చేయాలి .

మద్య నిషేదం ఏదన్నా మార్పును తెస్తుందని ఎదురు చూస్తే దొంగతనంగా తాగడం కోసం ఎక్కువ డబ్బులు కావలిసివస్తున్నాయి. ఆర్జన పరులైన పిల్లల మీద వత్తిడి పెరుగుతోంది. విచక్షణా రహితంగా వ్యసనాన్ని జీవితం చేసుకున్నవాడు కుటుంబ పెద్దగా పెత్తనం చలాయించడమే మన పిల్లల దౌర్భాగ్యం. పెద్దల దుర్బలత్వానికి పిల్లలు ఎర అవుతున్నారు. ఒక వ్యసనాన్ని మానుకో లేక పోయిన వారు పిల్లలు ఆర్జన అనే ఒక సౌఖ్యాన్ని ఎలా వదులు కుంటారు ? ఒక దృక్పథాన్ని మార్చుకుంటారా ? సారాపోరాటాన్ని గేలిచేసారు. హాస్యాస్పదం అన్నారు. వీగి పోతుందన్నారు. ఈ నేపథ్యంలో పెచ్చరిల్లిన అవినీతి దృష్ట్యా సాధించిన విజయం పాక్షికమే కావచ్చు - కానీ ఒక వ్యసనం పట్ల సామాజిక దృక్పథం ఏవిటో సామాజిక స్పందన ఏవిటో ప్రకటితమైంది అలాగే, పిల్లల ఆర్జన పట్ల సామాజిక దృక్పథం ఏమిటో ప్రకటించాల్సిన సమయం వచ్చింది. పిల్లల గురించి ప్రేమగా ఆలోచించాల్సిన సమయం వచ్చింది. వారి బాల్యపు ముగ్ధత్వాన్ని వారి స్వేచ్ఛనూ స్వచ్ఛతనూ వారి జీవన పసిమిని కాపాడాల్సిన సమయం వచ్చింది పెద్దల పెత్తనాన్ని దౌర్జన్యాన్ని, నిలదీసే సమయం వచ్చింది.

పిల్లల గురించి నిజాయితీగా ఆలోచించాలి పిల్లల సమస్యలకు మూలం ఏమిటో తరచి చూస్తే - నిక్కచ్చిగా అది పెద్దల బాధ్యతారాహిత్యమే !"



"ఈ భావనని ఇన్నేళ్ళొచ్చినా వివరం రాలేను. రేపో మాపో ఎంసెట్ రాయబోతోంది ఇంకా నోట్లో అన్నం పెడితే పెట్టించు కుంటుంది -" అనూరాధ కూతుర్ని ముద్దుగా విసుక్కుంది.

"అయినా అదేం చేస్తుందిలే - పాపం ఆ చదువులట్లా తగలడ్డాయి ఏవి ఎంసెటో ఏమో - నెల్లూరు దాకా వెళ్ళింది. అక్కడ ఎండలెక్కు వంటారు ఎట్లావుందో ఏవిటో - ఈ అల్మేరా నిర్వాకమంతా ఆ భాస్వంత్ గాడి పని అయ్యుంటది. వీడు రోజు రోజుకి అల్లరి వాడవుతున్నడు. పోనిలే - ఇంకెన్ని రోజులు - వచ్చే ఏడు ఇంటరు - మళ్ళీ చదువులు - పరీక్షలు - ఎంసెట్ - నేను మాత్రం చేసే ఘనకార్యమే ముంది ? సర్దుకుంటాలే -"

అనూరాధ బట్టలన్నీ మడిచి ఒక్కొ అర సర్దుతూ వచ్చింది. అన్నింటి కన్నా పైది మల్లేశ్ అర.

'మహానుభావుడు ! ఇంట్లోని అసలు సిసలు పసివాడు. వాళ్ళన్నా నయం - నా భయానికో భక్తికో కాస్త చెప్పిన మాటన్నా వింటారు ! ఈయన గారి అర చూస్తే కుక్కి బిగించిన చాకలాడి మూటలాగా వుంది ! మొత్తానికి మంచాళ్ళే - ఒక్క అలవాటయినా మార్చగలిగానా ?'

అనూరాధ మురిపెంగా విసుక్కుంటూ అరలోని బట్టలన్నీ తీసి మంచం మీద పడేసింది

బట్టలతో పాటు బరువుగా పడిన నల్లటి ప్యాకెట్లు చూసి దిమ్మెర పోయింది

ప్రీమియర్ మాల్ట్ విస్కీ -

మల్లేశ్ తనకు తెలియకుండా - తాగుతున్నాడా ? టి విలో సినిమాలనీ అర్ధరాత్రి దాకా కూర్చుని చేసే ఘనకార్య మిదా ? రోజంతా ఆ కూలాళ్ళతో వేగి - అలసి పోయి పదింటికే నిద్రపోతోంది ఆయన నింపాదిగా తనకు నచ్చే పని తను చేసుకొంటున్నాడు !'

అనూరాధ స్థాణువులా కూర్చుండి పోయింది

ఇన్నేళ్ళ దాంపత్య జీవితంలో ఏ అప్రియమైన సంఘటనకు ఆమె జ్ఞాపకాల్లోకి రానీయ కుండా ఏమార్చు తుందో ఆ సంఘటన స్పష్టంగా ఆమె కళ్ళముందు కొచ్చింది.

పరువాల పడచు పదాహారు రోజుల పండుగ -

ముత్తెకించే మరులు గొలిపే మొగలి పూల జడ-

అతను .. అతను .....!

అనూరాధ తల పేలి పోయినట్లనిపించింది.

అబద్ధం ! అంతా అబద్ధం !

అతను నన్ను అవమానించాడు - నా అనుభూతుల్ని అగౌరవపరిచాడు. నా అయిష్టాలు అతనికి అప్రియమైన వనుకొంది కానీ అతని ధోరణిలో అతను తన పనులు చేసుకుపోతున్నాడు

కానీ, ఆయకిష్టం వచ్చినట్టు ఆయన చేసుకుంటాడు - మధ్యలో తానెవరు ?

తానెవరు ?

ఇన్నేళ్ళ అనురాగమయ అనుబంధంలో ఈ ప్రశ్నేంటి ?

మొట్ట మొదటి చూపులోనే ఏర్పడ్డ బంధం - ఇద్దరూ కలిసి పంచుకున్న ఎన్నెనో ఆనందాను భూతాలు. ఆ ఆరాధన బలం వల్ల అతని తల్లి మ్యూఢత్వాన్ని ఎదుర్కొన గలిగే శక్తి - ఆచారం వ్యవహారం మాట మన్నన అన్నీ వేరైన కుటుంబంలో ఇమిడి పోగల సామర్థ్యాన్ని ప్రాణం పోసిన అతని ప్రేమ - అన్నీమోసం ! ఛ !

అనూరాధ విసురుగా తల తిప్పుకుంది.

మంచం మీద చెల్లా చెదురుగా పడివున్న బట్టలు - పక్కనే వున్న నల్ల అట్టపెట్టె వివర్ణమైన అనూరాధ ముఖం - అప్పుడే వచ్చిన మల్లేశ్‌కు పరిస్థితంతా చక్కగా తొక్క వలిచిన పండులా అర్ధమైంది. ఒక్కో షర్టు మడతేస్తూ -

"ఏంటి - అంత కోపంగా వున్నావు !" నెమ్మదిగా అన్నాడు. "వాటిని చూసేవా ?"

అనూరాధ ముఖం చిట్లించింది.

"అవి సీడ్ ఆఫీసర్ల కోసం తెచ్చినవి -"

అనూరాధ మాట్లాడలేదు

"నువ్వు నమ్ము నమ్మకపో - అది సీడ్ ఆఫీసర్ల కోసం తెచ్చినవి - ట్యాగ్‌ల మీద సంతకం పెట్టాలి కదా -"

"సీడ్ ఆఫీసర్లేమి తాగితందనాలాడరు. నేనూ ఎరుగుదును. చక్కగా భోజనం పెడితే - రోజంతా కూర్చుని సంతకాలు పెడతారు -"

మల్లేశ్ పెద్దగా నవ్వాడు.

"ఎప్పుడి విషయం నువ్వు చెప్పేది ! ఆ గడ్డ పెరుగు - అలంపూర్ బేనీషాల సీడ్ ఆఫీసర్ విషయమా ? ఆయన రిటైరయిచాలా కాలం అయ్యింది మేడం ! అసలు ట్యాగ్‌లు తెచ్చిస్తుంటే సంచులకు కుట్టిస్తున్నావ్ కానీ - అవి ఎక్కడ సంతకం పెడుతున్నారో చూసావా ? చక్కగా గెస్ట్ హవుస్‌లో కూర్చుని - పెట్టింది తింటు - తెచ్చింది తాగుతూ - ఇచ్చింది పుచ్చుకుంటూ పెడుతున్నాడు ? అర్థమైందా ? ట్యాగ్‌కు రూపాయి నుంచి ఐదురూపాయలు ! గడ్డ పెరుగు సీడ్ ఆఫీసర్ల్ లాంటి వాళ్ళు కాదు వీళ్ళు - వీళ్ళకు వారి విలువ బాగా తెలుసు - బీవీ జాన్ - అబ్ జమానా ఖరాబ్ హై !" మల్లేశ్ నవ్వాడు అనూరాధ మరింత గంభీరంగా అయ్యింది.

"తాగించి, తినిపించి, చెల్లించు కోవాల్సిన అవసరం ఏమోచ్చింది ?"

"రెండు నెలల్లో విత్తనాలన్నీ ప్యాకింగ్ అయి మార్కెట్‌కి వెళ్ళాలా ? తామరతంపరలా ఇంత మంది విత్తన వ్యాపారులు - మరి వాళ్ళ ప్రాధన్యత ఆటోమాటిక్ పెరిగి పోతోంది.

ఎవడు వారి డిమాండ్లు తీరిస్తే వారికే ముందు సంతకాలు - వానికే ముందు మార్కెట్‌ని వెళ్తాయి. ఇదీ ప్రస్తుతం జరుగుతోంది పోటీ - పోటీ - అంతే !"

అనూరాధ ఏమీ మాట్లాడ లేను.

మల్లేశ్ ఆమె వంక చూస్తూ వుండి పోయాడు.

అనూరాధ ముఖం ఎప్పటి వలె తేజోమయంగా లేదు. కళ తప్పి వుంది. ఆ అప్రియమైన సంఘటన అనూరాధకే కాదు అతనికీ గుర్తుంది. సౌందర్య గనులు ఆమె సోగకనులు ఆ పూట అతని గుండెల్లో గుచ్చిన కోరచూపులు ఇంకా పదునుగానే వున్నాయి.

ఇద్దరికీ మాట్లాడు తున్న దానికి మనసులో మొదలు తోన్న దానికి పొంతన లేదని తెలుసు.

'అనూరాధ తన గురించి ఏమను కుంటోంది? ఇంకా ఆమె మనసులోంచి ఆ సంఘటన మాసిపోలేదా ? ఎన్నేళ్ళు గడిచి పోయాయి. ఇప్పుడు అనూరాధకి సంజాయిషీ యిచ్చు కోవాలా ? కానీ తను అశక్తుడు. అనూరాధ ముందు ఏ మాటనూదాచలేడు. ఆమె కళ్ళల్లో సౌందర్యంతో పాటు మరేదో శక్తి వుంది. ఆ కళ్ళలోకి చూస్తూ అబద్ధం ఆడడం అసాధ్యం.

పెళ్ళి ప్రధానం నాడే మొరటుగా జడ పట్టుకు లాగిన మేనకోడలు పదహారు రోజుల

నాటి ఆ సంఘటన పిల్లల మీది వెర్రి ఆపేక్షతో అలంపురం ఎల్లమ్మ దాకా తీసుకెళ్ళిన అమ్మ - తన కళ్ళ ముందే బొడ్డు తాడు మింగించ బోయిన మూర్ఖత్వం - ఏ పండగైనా పబ్బమైనా పెళ్ళైన పేరంటమైనా అది ఆమెకు నచ్చని వాతావరణం పులుము కుంటాయి. అనూరాధ ఈనాటి వరకూ తన అప్రియత్వాన్ని బయట పెట్టలేను అందరితోనూ కలివిడిగా మెసలు కుంటోంది అయిష్టమైన వాతావరణం లోంచి యిష్టాన్ని ఎలా సంపాదించుకో గలిగింది ? అది ఆమె ప్రజ్ఞ. బహుశా ఆప్యాయతల్ని మాత్రం స్వీకరించి వుంటుంది. లేకపోతే తన బంధువులందరిలోని కొత్త వ్యవసాయ పద్ధతుల్ని ప్రచారం చేయగలిగే వారేనా ? ప్రతి మగవాడి విజయం వెనుక స్త్రీ వుంటుందంటారు. తన విషయంలో మాత్రం ఇంత వరకూ సాధించింది విజయం అని భావిస్తే తన పక్కన తన విజయం పక్కన అనూరాధ వుంది ఇది ఇద్దరి సాధన ఇది ఇద్దరి తపన. ఎంతగా ఆమెను ఆరాధించాడో - అంతగా ఆమెను అందుకున్నాడు ఇదంతా ఎలాంటి పొరపొచ్చాలు లేకుండా ఎలా సాధ్యమైంది ? ఎన్నో నిర్ణయాలు తీసుకునేపుడు అభిప్రాయ బేధాలు వచ్చాయి. ఎవరిదో ఒకరిచే నిక్కచ్చిగా అమలు కాలేదు. తనది కొంత ఆమెది కొంత ఇద్దరికీ మనశ్శాంతి ఆమెదో తనదో నిర్ణయాలు పూర్తిగా అమలు చేయలేదన్న అసంతృప్తే కలిగి వుంటే మనస్తాపం మిగిలేది ఆ సందర్భం రాలేదు అనూరాధకు తెలుసు ఒక విషయం మీద నిర్ణయం తీసుకోవడంలో ఏదైనా పరిష్కారం ప్రస్తావించడం - చర్చించడం - నిర్ణయించడం - వేరు ఏదో ఓ నిర్ణయాన్ని తీసేసుకొని మొండిగా దాన్నే అమలు పరచాలని పట్టు బట్టడం వేరు

మొదటి దాంట్లో ఇద్దరి మధ్య సంయమనం పెరుగుతోంది.

ఎదుటి వాళ్ళను కించ పరిచే రెండో దాంట్లో ఇద్దరి మధ్య అగాధం ఏర్పడుతుంది

తను అనూరాధ వల్ల ఎంతో సౌఖ్యాన్ని పొందాడు. సంతృప్తిని పొందాడు.

కానీ అనూరాధ ?

తమలో ఇమిడే ప్రయత్నంలోనే ఆమె శక్తియుక్తులన్నీ ధార పోసింది.

ఆమె తను పుట్టిపెరిగిన వాతావరణంలో అయితే మరింత గా వికసించే దేమో మరింతగా విప్పారేదేమో-

అసలు తను ఆమెను కలిసి వుండక పోతే -'

మల్లేశ్ అనూరాధ వైపు చూసాడు.

అనూరాధ నేల వైపు సూటిగా చూస్తోంది. ఆమె మనసులో ఏముందో ఏమో ముఖంలో ఏ భావమూ పలకడం లేదు. రాయిలా శిల్పంలా కూర్చుని వుంది.

'ఆమె ముఖంలో ఆనందం లేదు. సంతృప్తి లేదు. ఏదో తీవ్రమైన వత్తిడి-

మల్లేశ్ మౌనంగా ఆలోచనలో పడ్డాడు.

'సుధాకర్ -! అవును ! నెమలి ఈకను అపురూపమైనదిగా భావించగలిగే సుధాకర్ మర్రి ఊడల్లో సంగీతం వినగలిగిన సుధాకర్ - ఎన్నో సుందర భావాలు - సున్నిత భావాలు

అవును - సుధాకర్ అనూరాధను మరింత బాగా చూసుకొని వుండేవాడు తను అతన్ని తెలుసుకోలేక పోయాడు. నిన్న - నిన్న - ఎంత ఆవేశంగా బయట పడ్డాడు. ఇంత కాలం గడిచినా - అతనిలో అంత గాఢానుభూతి వుందంటే - ఎంతగా అనూరాధను అభిమానించి వుంటాడో - ఎంతగా ఆరాధించి వుంటాడో ! ఎక్కడో పొరపాటు జరిగింది. తను వీరి మధ్య ఎలా వచ్చి పడ్డాడు ? తనేం చేయగలడు ? తను ఊడల్లో రాగాలు వినలేడు. అనూరాధ అనుభూతులకు స్పందించలేక పోయాడు - ఆమెకు తను తగిన వాడు కాదు - కాదు - సుధాకర్‌ని పెళ్ళాడివుంటే తనవారందరి మధ్య వారి ఆప్యాయతానురాగాల మధ్య ఆనందంగా వుండేది. ఇంత వత్తిడి అనుభవించేది కాదు ఇంత మనస్తాపం మిగిలేది కాదు అందమైన సీతాకోక చిలుకలా ఆనందంగా గాలిలో పల్టీలు వేస్తూ -'

తను అనుకున్నవన్నీ అనుకున్నట్టుగా జరిగిపోయాయి. ఎక్కడా అసంతృప్తి లేదు. కానీ ఇన్నాళ్ళ లోనూ తను మొద్దు బుర్రకి తట్టనే లేదు. తను సుధాకర్ లాంటి మంచి స్నేహితుడ్ని కోల్పోయాడు. అది గుర్తించడానికి ఇన్నేళ్ళు పట్టింది ! కారణమేమిటో కూడా తను తరచి చూడలేదు. తన ధ్యాసలో తను తన లోకంలో తను వున్నాడు. తనది వొట్టి మట్టి బుర్ర !'

"అనూరాధా -" మల్లేశ్ నెమ్మదిగా పిలచాడు ఆ కంఠంలో ఏ భావం లేదు. నిమ్మళంగా పారుతోన్న నిండు ఏరు లాగ వుంది.

"నువ్వు సుధాకర్‌ని పెళ్ళి చేసుకొని వుండాల్సింది !"

అనూరాధ నిర్ఘాంత పోయింది.

మల్లేశ్ కళ్ళు వాల్చేసుకొని బయటకు వెళ్ళి పోయాడు.

అతనికి అప్పుడు జ్ఞాపకం వచ్చింది.

తనతో పాటు ఊరు నుంచి వచ్చిన రామనాథం వరండాలోనే కూర్చొని వున్నాడని

అతను తమ సంభాషణ విని వుంటాడని మాత్రం మల్లేశ్ ఊహించలేక పోయాడు. గబగబ గ్రేడింగ్ వైపు వెళ్ళి పోయినా రామనాథం కూడా అనూరాధ లాగే నిర్ఘాంత పోయాడన్న విషయం గమనించ లేదు.

అనూరాధని మల్లేశ్ ఏమన్నాడో అర్థం అయ్యేసరికి మెదడు మరో సారి మొద్దు బారింది.

"ఒకే ఒక్క మాట !"

ఎంత మాట !

ఇన్నాళ్ళ తమ దాంపత్యాన్ని అన్యోన్యతను అనుమానంలో అయోమయంలో పడేసేటు వంటి మాట ! ఏనాడైనా అలాంటి భావం వున్నట్లుగా కానీ వ్యక్తమయిందా ? మరి మల్లేశ్ అలా ఎందుకు అన్నాడు. తన తిప్పలేదో తను పడింది. అవన్నీ కుటుంబంలో ఇమిడేక్రమంలో సహజమేనని తను భావించింది. అవి తనకు కొన్ని అనుభవాల్ని నేర్పి కాలంలో కలిసి పోయాయి.

అప్పటికీ ఇప్పటికీ వసివాడనిది తమ ఇద్దరి సంబంధం.

సుడిగాలిలా చుట్టేసిన పడుచు మోహా వేశాల్ని దాటారు ఏవో మధురాను భూతుల ుంచి గంధాల్ని దాచుకొని మంద్రంగా వీస్తోన్న పైర గాలి తమ మధ్యన సంబంధం

ఓ కొత్త నేపథ్యంతో వారి లోకి అడుగు పెట్టిన తనను చుట్టాలు పక్కాలు ఎన్నో ునుమానాలతో ఆహ్వానించారు. అవన్నీ నెమ్మదిగా కరిగి పోయాయి. ఘర్షణ వత్తిడి వున్న మాట ాస్తవమే -

కానీ ఆ ఘర్షణకూ వత్తిడికీ అతని అనుబంధం అతీతమనే తను భావించింది

పసి పిల్లాడిలా మారాం చేస్తూ - బుజ్జి బాబులా గారాలు పోతూ - అల్లరి పిల్లాడిలా ులిపి పనులు చేస్తూ - మొండి పిల్లాడిలా అలిగి కూర్చుంటూ - గిల్లి కజ్జాలు పెట్టుకొని ునందిస్తూ - పరీక్ష రాస్తున్న వాడిలా పట్టు బట్టి సాధిస్తూ - అతను అప్పటికీ ఇప్పటికీ - ుతనే !

అతనితో అందుకున్న అపరిమితమైన ఆనందం - అంతులేని ఆప్యాయం అందమైన ునుభవం - అన్న తనకు ప్రియమైనమే. రమణీయమైనవే ఆ మనోహర ప్రపంచంలో మరొకరిని ఊహించనైనా ఊహించలేదు.

అతని స్థానంలో అతనే !

మర్వెవరు ఇమిడే ప్రశ్నేలేదు - !

ఇది తొలి చూపు నుంచే తను ఎరిగిన సత్యం

కానీ, సుధాకర్ బావను గురించి అతనెలా అనగలిగాడు !

తనేనాడు సుధాకర్ బావను మరో విధంగా ఊహించ నైనా ఊహించ లేదే ుతనెందుకు అంత మాట అనగలిగాడు ?

నిజమే, తను అతని పట్ల వున్న అవ్యాజ్యమైన ప్రేమాను రాగాల్ని ఏనాడు వ్యక్తపరచ లేదు.

అతన్ని తను అన్ని విధాలుగా - అన్ని పార్శ్వాలుగా - గాఢంగా - ఇష్టపడుతుంది అది వ్యక్తపరచడానికి మాటల్లేవు.

మాటలు అవసరమని తనే నాడు అనుకోలేదు.

ఒక మౌనం, ఒకసైగ, ఒక స్పర్శ, ఒక శ్వాస - ఒక నవ్వు - తన కెన్నో చెప్పాయి. నిశ్శబ్ధంగా తామెంతో సంభాషించు కున్నారు. కానీ ఇప్పుడు -

తను అతని పట్ల తన అభిప్రాయాన్ని ప్రకటిస్తూ సంజాయిషీలు చెప్పుకోవాలా ! వాదనలు చేయాలా ?

అది ఇన్నాళ్ళ దాంపత్యానికే అవమానం -

తమ సంబంధం లోని ఆర్ద్రతనే ఆవిరి చేస్తుంది అందంగా అల్లుకున్న అనుబంధాల్ని చిన్నా భిన్నాం చేస్తుంది.

అది తన వల్ల కాదు !

అనూరాధ ముఖం ఎర్ర బడింది.

❋ ❋ ❋

"ఈ రెండు వేలూ నేను తీసుకుంటున్నా - పాటూరు చీర కొనుక్కోవాలి" గీత ఏగోడకో కూర్చికో చెప్పినట్లు అంది.

సుధాకర్ ఆమె వంక పరిశీలనగా చూసాడు.

గీత ముఖంలో ఏ భావమూ లేదు

'ఇన్నేళ్ళు గడిచినా ఈమె తత్వం తనకు మింగడు పడదు -' సుధాకర్ నిట్టూర్చాడు -

"నీ ఇష్టం -" ముక్త సరిగా అన్నాడు.

"అవున్లెండి ! అంతా నా ఇష్టమే -! ఏనాడన్నా ఓ చీరో ఓ నగో తెచ్చి - ఇదిగో గీత నీ కోసం ! అన్న పాపాన పోయారూ ? ఓ ముద్దూ లేదు ఓ ముచ్చట లేదు - అంతా నా తలరాత పిల్లలు పెళ్ళీడు కొస్తున్నారు ఇంక ఈ బతుకిట్లా వెళ్ళ మారి పోవల్సిందే -" గీత బరబర ముక్కు చీది - చకచక లోపలికి వెళ్ళింది

హఠాత్తుగా వడగళ్ళ వాన కురిసి - అంత హఠాత్తు గానే వెలిసింది. సుధకర్ అపరాధ భావంలో మునిగి పోయాడు

'నిజమే, గీత అన్నట్లు తను ఓ చీర తోనో ఓ నగతోనో తన అనుభూతిని వ్యక్త పరచ లేదు అనుభూతి మాటల కందనిది. పువ్వు విరిసినంత సహజంగా అది వ్యక్తమవ్వాలను కొంటాడు. గీత అంటే తనకున్నభావమేంటో అనుభూతులేంటో తనకే స్పష్టంగా తెలీదు. ఆమెకి భౌతిక పరమైన వ్యక్తీ కరణ అంటే ఇష్టం. తనకు ఆత్మిక బంధమంటే -! తను భౌతికాంశాలతో తన అనుభూతిని వ్యక్త పరచలేడు. అది తన అశక్తత ! తన అసమర్థత ! గీత తన వల్ల ఎంతో అసంతృప్తికి లోనయిందేమో - తెలియదు దాన్ని పూడ్చగల భౌతికాంశాలన్నిటికి ఆమె సమకూర్చు కొనే అవకాశం యిచ్చాడు. ఆమె యిష్ట ప్రకారం నవలలు చదువుకుంటూ అలా అలాగడి పేసింది. కానీ ఎందుకనో - భార్య భర్తల మధ్య ఏర్పడాల్సిన గాఢానుభూతి కానీ లోతైన బంధం కానీ తమ మధ్య ఏర్పడలేదు. తను ఎంతగా ఆమెకు దగ్గర కావాలని ప్రయత్నిస్తుంటే అంత దూరంగా నెట్టేస్తోంది. ఎన్నేళ్ళు ఈ సంఘర్షణను అనుభవించాడు. ఇప్పుడు ఆ బంధం ఒక అలవాటయి పోయింది ఆర్ద్రత, ఆత్మీయతల అవసరం లేకుండా పోయింది.

సుధకర్ నిట్టూర్చాడు.

"ఎందుకు మమ్మీ, అన్నిటికి డాడీ మీద అలా విరుచుకు పడతావ్ ?" లోపలి గదిలో సుధాకర్ కూతురు గీతను నిలదీస్తోంది. "చెప్పదేదో కాస్త నెమ్మదిగా చెప్పవచ్చుగా !"

"అవున్లే ముందొచ్చిన చెవుల కన్నా వెనకొచ్చిన కొమ్ములు వాడి అని - నిన్న కాక మొన్న కళ్ళు తెరిచిన దానివి నువ్వు నాకు నీతులు చెప్పొచ్చావ్ -! అయినా కులుకుతూ నిక్కుతూ నీలుగుతూ - ఆ అనూరాధ లాగా మాట్లాడం నా చేత కాదు !" గీత అనూరాధ అన్న మాటను నొక్కి పలుకుతూ నిష్ఠూరంగా అంది.

'అనూరాధ !'

సుధాకర్ ముఖాన చిరునవ్వు కదలాడింది

'అనూరాధ అనురాధే గీత గీతే పాపం - గీత అనూరాధ చుట్టూ ఏవేవో అపోహలు అల్లుకున్నట్లుంది ఆమెకి అనూరాధ అర్థం కాదు తమ అనుబంధం అర్థం కాదు

ఏనాడైతే అనూరాధకు తనకు మధ్య నున్న సంబంధం ఏవిటో స్పష్టమయిందో - ఆ నాటి నుంచి అనూరాధ తనకు కేవలం అనూరాధే ! మరోటి కానే కాదు -!

అయితే,

తుళ్ళింతల తుంగభద్రలా - చిరునవ్వుల సీతాకోక చిలుకలా - మసక వెన్నెల్లోకి మబ్బు తునకలా - అనూరాధ తనలో కలిగించిన అందమైన అనుభూతి మాత్రం అబద్ధం కాదు - నిజం ! ప్రియమైన నిజం !'

"ట్రింగ్ .ట్రింగ్ "

సుధాకర్ ఒక్కసారిగా ఆలోచనల్లోంచి బయట పడ్డాడు

ఆదోని నుంచి ఫోన్ -

సుధాకర్ నిర్ఘాంత పోయాడు

నందిగామ నుంచి ఫోన్

సుధాకర్ నీరుకారి పోయాడు

గుంటూరు నుంచి ఫోన్

సుధాకర్ వణికి పోయాడు

మరో ఫోన్‌కు అవకాశమివ్వకుండా గబగబ రాంనగర్ బయల్దేరి వెళ్ళాడు.

❊ ❊ ❊

"ఏవయ్యా సురేషు - ఎక్కడికీ ప్రయాణం -" రామనాథం తుమ్మ చెట్టు కింద నిల్చుని బస్సు కోసం ఎదురు చూస్తున్నా యువకుడిని పలకరించాడు.

"నెల్లూరు వెళ్తున్నానండీ -"

"నెల్లూరా ? దేనికీ ? చుట్టాలున్నారా -?"

"లేదండీ - రామతీర్థం దగ్గర పొలం బేరం చేద్దామని -"

"ఇక్కడుండి - అక్కడ వ్యవసాయం ఏం చేస్తావయ్యా -"

"అక్కడికే వెళ్ళి పోదామనండి మనాళ్ళు ఇప్పటికే పొలాలు కొన్నారు. ఆ లింగయ్య సుబ్బయ్య వాళ్ళు లేరూ - వాళ్ళతో పాటే నాకూ పొలం బేరం చేసి పెట్టారు -"

"ఏవేం పంటలేస్తున్నారేం అక్కడ ?" శివుడు నింపాదిగా అడిగాడు

"పంట లెక్కడన్నాయ్? ఇప్పుడక్కడ పొలాలన్నీ చెరువులే - చేపలు రొయ్యలు బంగారం అన్నా - బంగారం !" సురేష్ కళ్ళు మిలా మిలా మెరిసాయి

"మరి ఇక్కడ చేలేం చేస్తున్నా ?"

"బేరం పెట్టేసా నండి -" అతను హుషారుగా అన్నాడు - "మీకు తెలుసో తెలియదో మనూళ్ళో పది పదిహేను కుంటుంబాలు ఇప్పటికే నెల్లూరెళ్ళి పోయారు. మరో అరడజను మందిమి వెతుకులాట లోనే వున్నాం. పొలాలన్నీ బేరాలు పెట్టాం."

"బేరాలు ఎవరు చూస్తన్నారేం ?"

"దస్తగిరి "

"ధర ఎలా పలుకుతుంది ?"

"ఆ తెల్లదోమ వచ్చి పడక ముందు మనూళ్ళో రేట్లు ఎట్లాగుండేవేంది - వాటి పుణ్యాన ఊర్లో సగానికి సగం పొలాలు అమ్ముకు పోయారా - రేట్లు అమాంతం పడిపోయాయి. నేను ఎంత చెప్పినా మానాన్న వినలా - మొదట్లో అమ్ముకున్నా పోయేది - ఇప్పుడిక్కడ నాలుగెకరాలు అమ్మితే కానీ అక్కడ ఓ ఎకరం కొనలేం - అక్కడ రోజురోజుకీ ఓ రేటు లెక్కన పెరిగిపోతోంది జనాలు వేలం వెర్రిగా ఆ చెరువుల మీద పడ్డారనుకోండి -" సురేష్ ఏకబిగిన చెపుతున్నాడు.

'మరి ఆ వేలం వెర్రి జనాల్లో ఈయన మాత్రం లేడూ ?'

రామనాథానికి నవ్వొచ్చింది

"అవున్లే - ఇక్కడ వ్యవసాయం మాత్రం ఎక్కడేడ్చి చచ్చింది ? ఆ కాలువలకి ఒక్క పంటకి నీళ్ళొదలడమే గగన మైపోయే - అదీ ఎప్పుడు వదులుతుందో - వదిలాక మన వంతు ఎప్పుడొస్తుందో -"

"వంతుల వారీ నీరందినా ఫర్వలేదు శివన్నా - ఆ సూపర్వైజర్ మరీ దగుల్బాజీ వెధవ - కనీసం చెకింగ్ అన్నా చేస్తన్నాడూ ? ఎప్పుడూ ఆ కర్నూలులో పడుంటాడు. మరి కాపురం అక్కడ ఉద్యోగం ఇక్కడయ్యే - రోజు రోజుకీ వ్యవసాయం చేయడమే గగన మైపోతుంది. అందుకేగా ఆ తీర ప్రాంతం వాళ్ళు శుభ్రంగా చేలు చెక్కేసి చెరువులు చేస్తున్నారు -" చివరి మాటలంటున్నాడు సురేష్ కంఠంలో ఎక్కడలేని విశ్వాసం తొంగి చూసింది. తీర ప్రాంతం వారి తెలివితేటల ముందు మనం వెలావెలా పోతామన్నంత ఖచ్చితంగా అన్నాడు.

"ఏమైనా చక్కగా సేద్యం చేసే భూముల్ని చెరువులు చేయడం నాకు నచ్చ లేదబ్బాయ్ -" రామనాథం అడ్డొచ్చాడు.

"ఎంత చేసినా ఈ సేద్యాల్లో ఏం బావుకుంటన్నా మండీ ? కూలీల రేట్లు అమాంతం పెరిగిపోయె - గడెం వెయ్యడానికి ఒక్కడు రోజుకు నూట యాభై రూపాయలు అడుగుతుండె. కూలీకీ వస్తే మనిషికి యాభైకి తక్కువ లేదు నీళ్ళు సమయానికి అందవు. ఎవడు సూపర్ వైజర్‌కు లంచమిస్తే వాడి పొలం తడుస్తుంది. అందరికీ తెలిసిందేగా - ఎవరి తొందర వాడిది. లంచాల రేట్లు మనిషి మనిషీకి పెరుగుతున్నాయే కానీ తరగడం లేదు. ఎరువులు - మందుల

రేట్లు గురించి ఏం చెపుతాం ? మీరే చెప్పండి - ఇంత పెట్టుబడి పెట్టి ఇంత చాకిరీ చేసి మనం బావుకునే దేముంటందీ ?" సురేష్ ఆవేశంగా అన్నాడు

"సీడు వేసామంటే - మనం నాటు పెట్టేదాకా ఆగి, పక్క పొలంలో కమర్షియల్ వేస్తున్నారు ఎసోలేషన్ దెబ్బ తింటంది పై నుంచి రైతుల మధ్య తగాదాలు -

"సీడు వేస్తన్నాం కదరా ఎందుకట్టా చేస్తున్నారంటే డబ్బులియ్యి - దున్నేసి మరో పంట వేస్తామంటున్నారు ఇదో తలనొప్పి అయిపోయింది "

రామనాథం అతని వంక విస్మయంగా చూసాడు తన ముందు పుట్టి పెరిగిన వాడు

"మా నాన్న దగ్గర ఎప్పటి నుంచో మొత్తు కుంటన్నా మన కొద్దీ వ్యవసాయం మరో పని చూసుకుందామని - వింటాడా - సరే ఎలాగో ఇప్పటికి వప్పించా ఇప్పుడు పొలాలు రేట్లు లేవు అందరూ అమ్ముకు పోదామనే రంధి తప్ప - కొనే వాళ్ళెవరు లేరు - అసలు మానాన్నకి ఎక్కడా దొరకనట్టు ఇక్కడే పొలాలెట్టా దొరికాయో -"

రామనాథం ఆశ్చర్యంగా అతని వంక గుడ్లప్పగించాడు

ఇంతలో రయ్యిన బస్సు వచ్చింది

"నేనెళ్తన్నా బాబాయ్ - వస్తా అన్నాయ్ -" సురేష్ పరుగు పరుగున వెళ్ళి దూరాన ఆగివున్న బస్సెక్కాడు ఆ పరిగెత్తడంలో అతనేదో జార విడుచుకున్నాడు

అదేమిటో అతనికీ తెలియదు - అతన్నే చూస్తూ నిల్చున్న రామనాథానికి తెలియదు

"జనాలకి ఏరంధి పడితే ఆ రంధే ! ఒక్కొక్కరు ఎంత వెర్రిగా వచ్చి పడ్డారో అంత వేలం వెర్రిగానే వెళ్ళి పోతున్నారు. చూస్తుండ గానే ఎంత తేడా ! వచ్చారు. గబగబ మేడలు మిద్దెలు కట్టారు ట్రాక్టర్లు బుల్లెట్లు కొన్నారు. తెల్లదోమ వచ్చింది రెండేళ్ళు - అన్నీ అమ్ముకున్నారు అప్పులకు చెల్లేసుకున్నారు. వెళ్ళిపోయారు అంతా కలలా లేదూ బాబాయ్ -" శివుడు వెళ్తోన్న బస్ వైపే చూస్తూ అన్నాడు.

రామనాథం మౌనంగా తలాడించాడు.

"సురేష్ అన్నాడని కాదు కానీ బాబాయ్ . ఇట్లా సీడు పొలాల పక్కన కమర్షియల్ రకాలు వేసి బ్లాక్‌మెయిల్ చేయడం ఎక్కువయిపోతోంది - ఆ కాడికి మన అల్లుళ్ళు మాత్రం ? అట్టాగే చేసి మనల్ని ముప్పతిప్పలు పెట్టలా ? కడుపు చించుకుంటే కాళ్ళ మీద పడుతుంది. ఉన్నపళాన పాతిక ఎకరాల సీడు చేను కమర్షియల్ క్రింద వదిలితిమే ..."

రామనాథం అన్యమనస్కంగా ఊకొట్టాడు.

రామనాథం చుట్టూ చూసాడు.

రత్తయ్య వచ్చిన కొత్తల్లో నాటిన వేపచెట్లు పండు బారి వున్నాయి. నీటిలేమి వలనో ఏమో చెట్లు చేమా పేలవంగా తయారయ్యాయి. ఎక్కడ చూసినా పార్థీనియం, పిచ్చి మొక్కలు, జిల్లేళ్ళు - జెమ్ముళ్ళు - తుమ్మలు, వాటిలో కూడా జీవం లేదు.

"అట్లా చెరువు దాకా పోయొద్దాం రారా -"

రామనాథం ముందుకు దారి తీసాడు. శివుడు అనుసరించాడు.

"చెరువులో నీళ్ళెందుకో వాసనొస్తున్నాయి. నోట్లో పోసుకోలేం. పొలాలకి వాడ్డం మానేసి చాలా రోజులయి పోయె -" శివుడు అంటున్నాడు

"అందుకే కదరా వెద్దాం అంది -"

రామనాథం ముందుకు నడిచాడు

అది రామనాథం, శివుడు స్వయంగా తవ్విన దొరువు వారి ఒంటి గుడిసె వూరు అయ్యే క్రమంలో వారి దొరువు వూరి చెరువు అయ్యింది. చూస్తుండగానే చెరువు మీద ప్రతి ఒక్కరి పెత్తనం వచ్చి కూర్చుంది.

రత్తయ్యకు కాలు చెయ్యి ఆడినంత వరకు ప్రతి వేసవిలోనూ చెరువు ఎండగట్టి శుభ్రం చేసి - నీళ్ళు నిల్వ చేసేవాడు. ఇప్పుడు నీళ్ళే తక్కువ వస్తున్నాయి. వచ్చీ రాగానే చెరువుకు నీళ్ళు వదిలే వాళ్ళే కానీ - దాన్ని పరిశుభ్రం చెయ్యాలన్న స్పృహ ఎవరికీ లేదు. చెరువు గట్టు మీదంతా చెట్లు పెరిగి పోయాయి. నీళ్ళలో రాలిన ఆకులు కుళ్ళి చెరువుకు కలుషితం చేస్తున్నాయి. భరించలేని దుర్గంధం. అక్కడున్న నీటిని బయటకు వదిలే వసతి కూడా లేదు. వాగు ఎండి పోయింది. ఎండిన వాగులోకి వదిలినా ఏట్లో కలిసి - ఏటి నీటిని దుర్గంధ భరితం చేస్తుంది.

రామనాథం రెండు నిమిషాలు కూడా నిల్వలేక పైపంచతో ముక్కు మూసుకొని ఇంటి దారి పట్టాడు.

"నేను ముందే చెప్పా కదా బాబాయ్ - పశువులు కూడా ముట్టి అన్నడం లేదు. అసలు వాతావరణంలోనే ఏదో మార్పువచ్చింది బాబాయ్ - స్వచ్ఛమైన చల్లని గాలి వీచి ఎంత కాలమైందో - ఇంతకు మునుపు కన్నా వేడిక్కి పోయింది." శివుడు నిస్పృహగా అన్నాడు.

"అన్ని పల్లెలూ ఇట్లాగే తయారయ్యాయి -"

ఇంతలో వేగంగా తుప్పల్ని దాటుకుంటూ వస్తోన్న సుధాకర్ కనిపించాడు.

"ఏవిటీ వీడింత ఉరుకులు పరుగుల మీద వస్తున్నాడు ?" రామనాథం నొసలు ముడేసాడు.

శివుడు గబగబ ముందుకు నడిచాడు

"ఏంటీ సుధాకర్ హడావుడి ?"

సుధాకర్ అలుపు ఆపుకొని, ఆందోళనని అణుచుకుంటూ అన్నాడు.

"నాన్నా - మన విత్తనాలు మొలకెత్త లేదంట -"

మాట పూర్తి అయ్యి అవని క్షణంలో సుధాకర్ ఆందోళన మిగిలిన వారిని ఆక్రమించేసింది.

"మన విత్తనాలు మొలకెత్తక పోవడమేమిటి ?" రామనాథం కంగారుగా అడిగాడు.

"అదే నాకూ అర్థం కావట్లేదు. ఆదోని నుంచి, నందిగామ నుంచి ఫోన్లొచ్చాయి. రైతులు

డీలర్ల మీద తిరగబడ్డా రంట - ఇదెట్లా జరిగిందో నాకు అర్థం కావట్లా - కాళ్ళు చేతులు ఆడడం లేదు. ఎన్నేళ్ళుగా మన విత్తనాలు ఎక్కడెక్కడికి పంపుతున్నాం - ఎప్పుడూ లేదిలాంటి సమస్య-" సుధాకర్ కణతలు నొక్కుకున్నాడు

"ఏదో తేడా వచ్చింది !" రామనాథం భ్రుకుటి ముడిచాడు.

"కొంపదీసి పైన కొనుగోలు చేసిన విత్తనాల వల్లయితే కాదు కదా ?"

శివుడు గబుక్కున అన్నాడు.

అందరూ గబగబ ఇంటికి వెళ్ళారు.

పుస్తకాలు తీసి ఏయే లాట్ నంబర్లు ఎక్కడికి పంపారో తనిఖీ చేసారు.

"అవి పై విత్తనాలే. మనం పండించినవి కావు "

"రైతులు గొడవలు బాగా చేస్తున్నారా ?"

"చేయరూ మరి ! వాళ్ళ పొలాల్లో పెట్టిన పైరు చూస్తే కడుపు మండిపోదూ -"

"అసలు లెట్లా జరిగింది ? మన దగ్గర ఆవిత్తనాలేమైన మిగిలి వున్నాయా ?"

"ఆ - కర్నూల్లో రెండు సంచులుంటె పట్టు కొచ్చా -"

సుధాకర్ గబగబ మోటర్ సైకిల్ లోంచి తీసిచ్చాడు.

రామనాథం సంచి మీద పరిశీలనగా చూసాడు.

"చూడు నాన్నా - సీడ్ ఆఫీసర్ సంతకం వుంది - కాబట్టే అగ్రిమెంట్ కుదుర్చు కున్నా ఇదేమో ట్రుత్ ఫుల్ సీడు."

రామనాథం ట్యాగ్ చింపి పక్కన పెట్టాడు. సంచి కుట్లు విప్పి చూస్తే వాటిలో నాసిరకం గింజలు కలిసినట్లు స్పష్టంగా కనిపిస్తున్నాయి.

"ఇవి ఎవరి దగ్గర తీసు కొన్నది -"

సుధాకర్ చెప్పాడు - "మల్లేశ్ పంపించాడు -"

మరో సంచి మీద ట్రూత్ ఫుల్ సీడ్ ట్యాగ్ వుంది అది వ్యాపారి సంతకంతో ప్యాక్ చేయబడింది - ట్యాగ్ మీద స్పష్టంగా JKHY1 అని వ్రాసివుంది. జెర్మినేషన్ టెస్ట్ ఫలితాలు అన్నీ బ్రహ్మాండంగా వున్నాయి. ఆ సంచిలో వున్నవి MC 5 విత్తనాలు.

JKHY1 కేజీ మూడొందలు దాకా చేస్తే అవి ఆ రూపాయలు చేస్తాయి !

రామనాథం చెవులకి ఏ మాటలు వినిపించడం లేదు. కళ్ళకు ఏ దృశ్యమూ కనిపించడంలేదు. నకిలీ విత్తనాల బారిన పడి ఎండ్రిన్‌తో పరిష్కారం చూసుకొన్న రాజయ్య మెదులు తున్నాడు.

"కొంప మునిగింది !"

"అరచేతిలో పెట్టి చూస్తే తెలిసి పోతుంది."

నువ్వెట్లా వాటిని బేరమాడావ్ ?" శివుడు సుధాకర్ మీద విరుచుకు పడ్డాడు.

"నాకు ముందు చూపించిన సంచిలో JKHY1 విత్తనాలే వున్నాయి నేను వాటిని నేరుగా డీలర్ల దగ్గరకి పంపమని చెప్పా. ట్యాగ్ మీద స్పష్టంగా రాసివుంది.

చక్కగా ప్యాక్ చేసాడు. సంతకమూ చేసాడు ఇంక ఎవరు ఊహిస్తారు ? ఇట్లాంటి దౌర్భాగ్యపు పని చేస్తాడని !"

"అయితే మాత్రం - బయటి సరుకు తీసుకున్నప్పుడు జాగ్రత్తగా చూసుకోవద్దూ -" శివుడు కోపంగా అరిచాడు." "అంతా నా తప్పయినట్లు అరుస్తావే ? ఒక్కో సంచి తీసి చూస్తాడా ఎవ్వడైనా ? విత్తనాలు చూసాను. ప్యాక్ చేసి పంపమన్నాను ఆ వెధవసచ్చినాడు మోసం చేస్తే నాతప్పేంటి ?" సుధాకర్ ఇంకా గట్టిగా అరిచాడు, "అసలంతా నీ వల్ల వచ్చింది ! ఏనాడన్నా బయటి సరుకెరుగుదమా ? ఆ బావయ్య లిద్దరినీ తన్ని తరిమితివి -"

"మరే - నేనే దగ్గరుండి JKHY1 - H4 కలేసి - కమర్షియల్‌కు కూడా పనికి రాకుండా చేసా -" శివుడు వత్తి పలుకుతూ అన్నాడు. సుధాకర్‌కి వళ్ళు మండిపోయింది.

"అదినా తప్పుకాదని నీకూ తెలుసు - నన్నెందుకు అనవసరంగా ఎత్తి పొడుస్తావ్ ? అదట్లా జరిగిపొయ్యింది. అంతే !"

"మరి బావయ్యలు వెళ్ళి పోవడమూ నాతప్పు కాదు ! అదట్లా జరిగి పోయింది -అంతే !"

రామనాథం చిరాగ్గా తలెత్తాడు. "ఒరేయ్ - పోట్లగిత్తల్లా ఏంటా కుమ్ము కోవడాలు ? అసలు విషయం వదిలేసి చిన్న పిల్లల్లా తగువు లేసుకుంటున్నారా ?"

శివుడు, సుధాకర్ తామేం చేసారో గ్రహించారు చప్పున తలదించుకున్నారు.

"సుధాకర్ రైతులెవరయినా - రాజయ్య లాగా ...." రామనాథం గొంతు బొంగురు పోయింది.

"అదేమో తెలియదూ - మన డీలరే గుండె నొప్పని హాస్పిటల్లో చేరాడట -"

"ముందా విషయం కనుక్కో వద్దూ - ఎంత మంది రైతులు వీటి బారిన పడ్డారో - ఎంత మంది రాజయ్యలు ."

రామనాథం గొంతు పెగల్లేదు "పద.." చరచర మోటర్ సైకిల్ దగ్గరకు నడిచాడు.

మోటర్ సైకిల్ ఎక్కబోతూ - మళ్ళీ వెనక్కి తిరిగి శివుణ్ణి కేకేసాడు

"చెక్ బుక్ తీసుకురా - శివుడూ -"

సుధాకర్ ముఖం చిట్లించాడు.

❋ ❋ ❋

"చెక్ పవర్ ఆయన చేతిలో వుండ బట్టేగా బరబరా గీసేసి వాళ్ళ ముఖాన కొట్టాడు " సుధాకర్ గొంతు విచిత్రంగా పలికింది

"ముసలాయనకి రోజురోజుకి చాదస్తం పెరుగుతోంది -" గీత గొంతు ఎప్పటి లాగే వుంది

సుధాకర్ కి ఎప్పుడూ అసహ్యతను కలిగించే ఆ గొంతు ఎందుకో ఆప్తంగా ఆత్మీయంగా అనిపించింది.

అలాంటి మరికొన్ని మాటలు కోసం అతని మనసు ఆమె వైపు తిరిగింది

"లేకపోతే - ఎవరన్నా ఇలా చేస్తారా ? మనమెందుకు ఈ నష్ట పరిహారం చెల్లించుకోవడం - ఆ తంటాలేవో డీలర్లు పడతారుగా - రైతు లేమైనా మనల్నేరుగుదురా పెడుదురా ?" గీత ఓ దీర్ఘం తీసింది.

'నిజమే - గీత అన్నట్లు తమకు రైతులకు ఏమిటి సంబంధం? కాస్త నెమ్మదించే వరకూ మౌనంగా వుంటే పోయేది. డీలర్లు వాళ్ళ పాట్లేవో వాళ్ళు పడే వాళ్ళు. మళ్ళీ పంటకు మంచి విత్తనాలు పంపితే సరిపోయేది ఈ మాత్రం భాగ్యానికి ఎంత డబ్బు వాళ్ళ ముఖాన పోసాడు ? దేశంలో ఎవరైనా ఇలా చేసి వుంటారు? ఎవరికీ లేని ధర్మదత్తత అంతా మనకే ! మనమేన్నా మోసం చేస్తే అనుకోవచ్చు - అది వాడెవడో చేసింది - మన చేతుల మీదుగా పంపిణీ అయ్యింది -'

"వాడి మీద కేసు పెట్టారు. బానే వుంది. అది ఎప్పటికీ తేలేది ? అసలే వాడి ఆస్తులన్నీ పెళ్ళాం మీద రాయించేడంటగా ? ఒక వేళ కేసు గెలిచినా మనకేం చెల్లిస్తాడు -" గీత వ్యవహార్త లాగా మాట్లాడు తోంది. "ఇంతకీ ఆ కేసు ఏమైనా ఉద్ధరిస్తదా లేకపోతే వున్న సొమ్ము ఆ లాయర్ల పాలు చేస్తున్నామా ?"

"ట్యాగ్ మీద వాడి సంతకం వుందిగా - వాడెక్కడికి పోతాడు ? వాడి యింటిని కూడా కోర్టు వారు సీల్ చేసారు. ఈ కేస్ తేలే వరకు వాడి ఆస్తిపాస్తులు అమ్మకానికి పంపరాదని నాన్న ఆర్డరు సాధించాడుగా -"

"సాధించాడు .....సాధించాడు ముసలాడు బతికి నన్నాళ్ళు అందర్నీ సాధించుకు తింటానే వుంటాడు " గీత మూతి మూడు వంకర్లు తిప్పింది

సుధాకర్ అసహనంగా కదిలాడు.

"అసలు తెలివున్నాడే అయితే ఆ వచ్చినపుడే కర్నూలు శివార్లో ఓ ఎకరమో రెండెకరాలో కొని పడేయకూడదు. ఆ వూళ్ళో మాకు పొలాలున్న యన్న ఘనతే కానీ ఎర్ర ఏగానీ పాటి చేయవు. అదే ఇక్కడయితే సెంటయినా కుంటయినా బంగారమే - అయినా అన్ని విధాల నష్ట పోయింది మనమే. ఆ అనూరాధ చూడండి. తెలివిగా మొగుడితో పాటు పాలమూరు చేరింది. ఆస్తి పాస్తి అక్కడే సమ కూర్చుకుంది. పట్నంలో పెరిగే ధరే కాని తరిగేది లేదయ్యే - మన

రాతలేమో ఆపల్లెలో పడి రోజురోజుకీ పాతాళానికి అంటుతోంది కడుపులో చల్ల కదల కుండా ఆ అనూరాధ - దాని మొగుడు కాలం గడుపుతారు. మనమే అటూ చాకిరి చేసాం ఇటు సుఖమూ లేదు" గీత ఇన్నాళ్ళుగా కుటుంబ భారాన్నంతా తనే మోసినంత బరువుగా నిట్టూర్చింది

సుధాకర్ ఆమె మాటలకు ఆశ్చర్యంలో మునిగిపోయాడు

'నిజమే ! తనెప్పుడు ఇలా ఆలోచించలేదు. ఇన్నాళ్ళూ కర్నూలులో వున్నా - ఓ అద్దె కొంపే కాకపోతే చిన్నింట్లోంచి కాస్త పెద్దింట్లోకి మారారు అంతే పొలాలు వున్నాయి వుంటే రేట్లు లేవు. ఎకరాల బూకరింపే కానీ ధర పలకడంలేదు ఊళ్ళో ఉండే పరిస్థితి రోజురోజుకీ అడుగంటుతోంది తాగడానికి కూడా మంచి నీళ్ళు లేవు ఆ కాలువలు వదిలేది ఒక్క పంటకే ఆ సమయంలో తప్పించి మిగిలి నప్పుడు పడతా లేస్తా పైపాడు కెళ్ళి నీళ్ళు తేవల్సిందే ఆ కరెంట్ ఉండే దాన్ని కన్నా పోయేదెక్కువ - ఇంక ఆవూరు వదిలెయ్యాల్సిన సమయం వచ్చింది

"పదండి, మీతో పాటు నేనూ వస్తాను ఆయనతో వ్యవహారమేంటో తేల్చి వస్తాను ముందు చెక్ పవర్ మీరు ఇప్పించుకోండి. అన్నీ నెమ్మదిగా సద్దు మణుగుతాయి "

"అన్నయ్య తోనూ మాట్లాడొద్దూ -"

"ఆయనతో ఏంటి మాట్లాడేది ? ఆ ముసలాయన తానా అంటే ఈయన తందాన అంటాడు - ఇంక పని అయినట్లే - వెళ్ళి నాళ్ళం వెళ్ళినట్లే చేతులూగించు కొంటా రావాలి -"

"నిజమే"

"అందులోనూ వాళ్ళిద్దరూ ఆయనకు సొంత కొడుకు కోడళ్ళయ్యే ! మనమే పరాయి వాళ్ళం ! ఏ రోజెన్నా మన పరంగా ఆలోచించాడా ! అన్నిటికీ పక్కనేనుకొని - శివుడూ - శివుడూ - అంటూ ఆయన్ని నెత్తికెక్కించుకు తిరుగుతాడు. సొంత కొడుకును కోడలిని పరాయి వాళ్ళని చేసుకొనే వాళ్ళను నేనెక్కడా చూడలేదు -"

❋ ❋ ❋

"సుధాకర్ చెక్ పవర్ తీసుకుంటున్నాడంట -" మల్లేశ్ కంఠంలో ఏ భావమూ లేదు

"అయితే ?" అనూరాధ ఆశ్చర్యంగా అంది.

"ఇన్నాళ్ళు మనం చేసిందంతా రేగడి సీడ్స్ పేరు మీదే మార్కెట్ చేస్తున్నాం కదా - ఇప్పుడు పెద్దాయన మాట కాకుండా సుధాకర్ పెత్తనం కింద మనమెక్కడ నెగ్గుకొస్తాం ?"

"అదేంటి విచిత్రంగా మాట్లాడు తున్నారు -?" అనూరాధ మల్లేశ్ వైఖరికి తెల్లబోయింది.

"నీకన్నీ విచిత్రం గానే వుంటాయ్. దేన్ని కళ్ళు విప్పి చూడలేవు. ఆ కల్యాణి చూడు అందరి కన్నా చిన్నది ఎంత తెలివిగా పబ్బం గడుపు కుంటుందో -"

"మీరనే దేదో నా కర్థం కావట్లా -"

"ఎలా అర్థం అవుతుంది ? నీకు తెల్లని వన్నీ పాలయ్యే - డబ్బుల్లేవు డబ్బుల్లేవు మీరే సర్దుకోండి - మనకు నీతులు చెప్పారా ? అక్కడ కల్యాణి చూడు నర్సింగ్ హోం కడుతోందట -"

"వాళ్ళు ఎప్పుడో కట్టుకున్నారుగా - కొత్తేవుంది ?"

"కొత్తదే - పైన ఇంకో అంతస్తు వేస్తున్నారట -"

"వేసుకోవచ్చు - అందులో మనం ఉలిక్కి పడాల్సింది ఏముంది? కల్యాణి భర్త సర్జన్. తను గైనికాలజిస్ట్. ఆ మాత్రం సంపాదించు కొని వుండరేంటి ? అయినా, నాకు తెలిసి మొదటి సారి కట్టినప్పుడు కూడా లోన్లు తీసుకున్నారు -"

"నేనూ అలాగే అనుకున్నా - కానీ మామా అల్లుళ్ళు నాటకాలాడారు . మనల్ని వెర్రి మొహాల్ని చేసారు ఇన్నాళ్ళ కష్టార్జితం తీసుకెళ్ళి వాళ్ళ పరం చేస్తున్నారు "

"మీరు మాట్లాడేదానికి అర్థం పర్థం లేదు. మనకి తెలియని డబ్బు ఎక్కడిది ? ప్రొడక్షన్ చేస్తుంది మనం. మార్కెటింగ్ చేస్తుంది మనం. మన మెరుగ కుండా ఎక్కడ్నించి డబ్బు వచ్చి పడుతుంది ? ఒక వేళ కల్యాణికి ఇచ్చినా అది మామయ్య ఇష్టం మధ్యలో మన మెవరం అడగడానికి ?"

"అలా అనే ఆయన అందర్నీ నమ్మించి మోసం చేస్తున్నాడు. ఎవరు చూస్తారు ఆ లెక్కలు పక్కలు? కల్యాణి ఆయన కూతురు. సుధాకర్ ఆయన కొడుకు. సుధాకర్ బావమరుదులు ఎంత పెద్ద పెద్ద కోళ్ళఫారాలు నడుపుతున్నారో చూసావా? వాళ్ళే మాత్రం డబ్బున్న వాళ్ళో మనకి తెలీదూ ? మరి వాళ్ళకి పెట్టుబడి ఎక్కడిది ? సుధాకర్ ఇచ్చిందేగా ? మరి ఈ విషయం మీ మామయ్యకు తెలీదు ? తెలుసు తెలిసీ వూరుకొన్నాడు. ఎందుకంటే ఆయన కొడుకు కాబట్టి. మనమెవరం ? ఆపదలో వున్నారని వంటి మీద నగలతో సహా వూడ్చి వారి చేతిలో పెట్టేస్తివి. ఏం బావుకున్నావ్ ? నీ విషయమే ఆయన పట్టించు కోలేదు. ఆయనకి ఆయన కూతురుంటే చాలు - నువ్వక్కర్లేదూ - పద్మక్కర్లేదూ సరళక్కర్లేదూ -"

పద్మ, సరళల పేరెత్తే సరికి అనూరాధ మనసులో ఏదో అవమానం కదలాడింది

"పద్మ, సరళాల్ల మాటలెందుకు మధ్యలో -" చిరాగ్గా అంది.

"వాళ్ళు మనం ఒక్కటే కాబట్టి వాళ్ళు ఆయనకి అన్న పిల్లలు - నువ్వు చెల్లెలి కూతురివి. ఎంత చేసినా పరాయి వాళ్ళు -"

అనూరాధ మల్లేశ్ ధోరణికి నిర్ఘాంత పోయింది. 'అయినట్లో పరాయి సొంతం - అందులోనూ మామయ్య -!'

"మనం పిచ్చి మొహలేసుకుని ఇలాగే గానుగెద్దుల్లా చాకిరీ చేస్తున్నాం - మీ మామయ్య మనల్ని అన్యాయం చేస్తునే వున్నాడు. ఈ ఏడు అంత నష్టం ఇంత నష్టం అన్నాడా ? ఆ కల్యాణికి లారీడు బేతం చర్ల పాలీష్ రాళ్ళు పంపాడు మీ మామయ్య తెలుసా ? ఇంతకంటే సాక్ష్యం ఏంకావాలి ?"

అనూరాధకి మల్లేశ్ వైఖరి చూస్తుంటే మెల్లిమెల్లిగా అసహ్యం కలుగుతోంది.

'మామయ్య మీద ఆరోపణలు ! వాటిని నిరూపించడానికి రుజువులా సాక్ష్యాలా ?'

"మీకు నిజంగానే పిచ్చెక్కింది. బేతంచర్ల రాళ్ళు దేశమంతా వాడతారు ? కల్యాణి నర్సింగ్ హోంలో వేసుకుంటే మనకెందుకు ? మానితే మనకెందుకు ? మామయ్య ఇంట్లో ఖర్చులతో సహా అణా పైసలతో రాసి వుంచుతాడు. ప్రొడక్షన్ వివరాలున్నాయి. మార్కెటింగ్ వివరాలతోను తేల్చిచూసుకోండి సరిపోతుంది. అంతే కానీ ముందు వెనుక ఆలోచించ కుండా మామయ్యని ఏ మాట పడితే ఆ మాట అనకండి ఒక వేళ మామయ్యే స్వయంగా చిన్న బావకి చెక్ పవర్ ఇవ్వాలను కుంటే కల్యాణికి సాయం చేయాలను కుంటే ఎంతో ఆలోచించి నిర్ణయించుకుని వుంటాడు.

నాకు మాత్రం ఎలాంటి అభ్యంతరం లేదు -"

"నువ్విలా అంటావని ప్రసాద్ ముందే చెప్పాడు."

"ప్రసాద్ ? ఏ ప్రసాద్ ? " అనూరాధ నొసలు ముడిచింది.

"ఇంకెవరు మీ సరళా వాళ్ళ ప్రసాద్, భాస్కర్‌తో కూడా కలిసే వచ్చాడు-"

"ఊ ! ఇదన్నమాట సంగతి ! ఆ ప్రసాద్ బెంగుళూర్ లో రియల్ ఎస్టేట్ బిజినెస్సులు పెట్టడానికి, షేర్లు కొనుక్కొని దాచుకోవడానికి డబ్బెక్కడి దంట ? ఈ భాస్కర్ రొయ్యల చెరువుల్లో తగలేసింది - ముండల మీద తగలేసింది ఎక్కడి సొమ్మంట? సిగ్గులేకుండా చిప్ప చేతిలో పట్టు కొచ్చి పెట్టుబడి పెట్టించుకొని నాలుగు డబ్బులు వెనకేసుకొని - అవసరం వచ్చిన రోజున మొహం చాటేసిన ఆ మహాను భావులు మంచాళ్ళు. మామయ్య స్వార్థపరుడు. మారుతీ కారులో తిరుగుతూ ఏసిరూంలో పడుకుంటున్న నువ్వు మాత్రం కష్టపడు తున్నావు. మామయ్యకు మాట మాత్రం తెలీయకుండా ఫైనాన్సుల్లోనూ సిటి బస్సుల్లోనూ పెట్టుబడి పెట్టిన నువ్వు మాత్రం సత్యసంధుడివి. ఆయన అబద్ధాల కోరు. మనకు అన్యాయం చేసాడు ! ఎందుకండీ నా నోరు తెరిపిస్తారు ? నా నగలిచ్చాను. అంతకు వెయ్యింతలు నాకు అందింది. ఈ విద్యా ఈ నేర్పు ఈ బిజినెస్ ఈ మార్కెట్ అన్ని ఆయన వారసత్వ సంపదే. డబ్బు ఓ ఏడు వస్తుంది ఓఏడు పోతుంది. కానీ ఆయన స్ఫూర్తి ఆయన సృజన అంత అశాశ్వతమైనవి కాదు. గుర్తుంచుకోండి. డబ్బు వెనక పరుగులు పెట్టే తాపత్రయంలో ఆడబ్బు వెనక వున్న నైతిక బలాన్ని మర్చిపోకండి. ఏ రైతుల కైతే మామయ్య నష్ట పరిహారం కట్టి - మనందరి చేత ఛీ అనిపించుకుంటున్నాడో - ఆ రైతుల నమ్మకమే ఆయన విశ్వాసం ఆయన పెట్టుబడి. ఆయన లాభం. అదీ - మనం సాధించాల్సింది -" అనురాధ కోపం చూసి మల్లేశ్ విస్తుపోయాడు.

"ఆ దశమగ్రహాలు మళ్ళీ కనిపిస్తే చెప్పండి. కల్యాణి భర్త చూసి వాళ్ళు పడే న్యూనత - అతని మీద అసూయ వాళ్ళ నట్లా కుంచింపజేస్తున్నాయి. వీళ్ళు బిజినెస్సులో నానాగడ్డి కరిచి ఏనాటికైనా కోటేశ్వరులు అవుతారేమో - కానీ కల్యాణి, ఆమె భర్త సామాజికంగా అందుకొనే

గౌరవం - వాళ్ళు తల కిందులుగా తపస్సు చేసినా సాధించలేదు. వాళ్ళు కుళ్ళుమోతు బుద్ధితో కుయుక్తితో కల్యాణి వాళ్ళను చికాకు పెట్టచ్చేమో కానీ వాళ్ళు మూటగట్టుకోబోయె కీర్తి ఈక కూడా పీకలేరు నాకు తెలుసు కల్యాణి, ఆమె భర్త ఈ సమాజం కోరుకొనే మంచి వైద్యులు ఇప్పుడు వైద్యం పెట్టుబడితో ముడిపడివుంది. ఆపెట్టుబడి కోసం వాళ్ళు దిగ జారే పరిస్థితి రానివ్వ కూడదు. ఒకవేళ మామయ్య ఇన్నాళ్ళు వాళ్ళకి సాయం చేయకపోయినా - నేను చెప్పి సాయం చేయమంటాను. ఒక మంచి పనిలో మన డబ్బు వినియోగించబడితే అంతకన్నా కావాల్సిందేముంది ?" అనురాధ ముఖం గంభీరంగా వుంది.

" నీకు చెప్పినా గోడకు చెప్పినా ఒకటే - " మల్లేశ్ విసురుగా అన్నాడు," చివరికి ఆయన ఆయన పిల్లలు బాగానే వుంటారు. మనమే నట్టేట్లో మునుగతాం-"

" ఏ ఏట్లో ? ఏసిరూంలోని ఏట్లోనా ? మారుతి కారులోని ఏట్లోనా ?"అనూరాధ వ్యంగ్యంగా అంది.

"నువ్విలాంటి దానివి కాబట్టే నా బతుకుకిట్లా ఏడ్చింది-"

మలేశ్ చిరాగ్గా బయటకు వెళ్ళాడు.

అనురాధ దెబ్బ తగిలిన పక్షిలా కూలబడింది.

❋ ❋ ❋

" మనమెంతా చెప్పినా వాళ్ళు నమ్మట్లేదు బాబాయ్ - ఎక్కడో దాచి పెట్టాం అనుకుంటున్నారు. అందులోనూ ఆ ప్రసాద్, భాస్కర్ పక్కన చేరి బాగా ఎక్కించారు -"

"చెప్పేవాళ్ళు చెప్తార్రా - వినేవాళ్ళకు ఉండొద్దా బుద్ధి !" రామనాథం చిరాకు పడ్డాడు.

"ఈ అల్లుళ్ళతో ఒక బాధ పడ్డామా ! ఎన్నడో కాలంనాడు జరిగిన పెళ్ళిళ్ళు వాళ్ళవి. కాలం కలిసొచ్చి కష్టపడి కల్యాణి డాక్టర్‌యింది. సరళ పద్మాళ్ళప్పుడు చదివించే అవకాశం లేదు. కల్యాణి అప్పుడు అవకాశం వుంది చదువుకుంది. డాక్టరు కాబట్టి డాక్టర్ సంబంధం చూసాం. పెళ్ళయ్యాకే ఆ స్పెషలైజేషన్లు చేసుకుంటిరి. ఎన్ని తిప్పలు పడి వాళ్ళ స్థాయికి వచ్చారో మనం కళ్ళారా చూస్తూనే వుంటిమి. ఆ గీత లాగా వంటి నిండా సుద్దలు సుద్దలు బంగారం దిగేసుకుందా ? ఆ అల్లుళ్ళలాగా దొంగతనంగా బిజినెస్సులు చేసారా ? ఈ మల్లేశుల్లాగా రోజుకోరకం కారుల్లో తిరుగుతూ జల్సాలు చేస్తున్నారా ? వాళ్ళ పని వాళ్ళు చేసుకుంటున్నారు. మనవేదో కట్నమిచ్చాం. అది పెట్టుబడి పెట్టుకొన్నారు. నర్సింగ్ హోం కట్టుకున్నారు. పసుపు, కుంకుమల కింద ఇచ్చిన పొలం వాళ్ళొచ్చి చేయరు కనుక మనమే చేసి పంట డబ్బులు పంపుతున్నాం. ఇది చెప్పు - ఆ మాత్రం కూతురు కోసం చేయకూడదా ? అన్నింటినీ అందరికీ సంజాయిషీలు ఇచ్చుకోవాలా ? అసలు మొదట్నించే ఆ ప్రసాద్ వాళ్ళకు కల్యాణి భర్తను చూస్తే ముడుచుకుపోతారు. అది వారిలోని న్యూనత - అది ఈర్ష్యగా ప్రకటిస్తారు. ద్వేషంగా బహిర్గతం చేస్తారు. అంతే - కానీ ఈ గోలంత డబ్బు కోసం కాదు -"

"ఏదైనా బాబాయ్ - ఇంత బతుకు బతికీ ఇంటెనక చచ్చినట్లు ! ఆ అల్లుళ్ళంటే సరే - వాళ్ళ వ్యవహారం మనం ఎరిగిందే కానీ సుధాకర్ ... ? అనురాధ .... ? వాళ్ళు . వాళ్ళెందుకిలా ప్రవర్తిస్తున్నారు?" శివుడు గొంతు బొంగురుపోయింది

రామనాథం మౌనంగా వుండిపోయాడు

'అన్యాయం జరిగింది - అన్యాయం జరిగింది. అని వారంటున్నారే అలాంటి అన్యాయమేదైనా జరిగి వుంటే శివుడికే, శివుడు కుటుంబానికే ఈ రోజటికీ ఈ పల్లెలో - కనీసావసరాలు తీర్చలేననిదిగా తయారయిన పల్లెలో - వయసుడిగి పోయిన తమందర్ని పెట్టు కొని వుంది వాడే. ఆ భారతి ఈ కుటుంబంలో ఓ సమిధ అయిపోయింది. ఎవరికి వాళ్ళు దొరికింది దొరికినట్లు దాచుకొనే యావలో పడ్డారు. మన మూలమేంటి? మనం ఏస్థితి నుండి ఈ స్థాయికి వచ్చాం? అందులో ఎవరెవరు ఎట్లాంటి త్యాగాలు చేసారు? అన్నది వాళ్ళకు అక్కర్లేదు. అన్నయ్య అల్లుళ్ళిద్దరూ అట్లా కొడుకు తన మీద గుడ్డి విశ్వాసంతో - ఇంకా తనను అట్టి పెట్టుకొని వున్నాడు- ఇప్పు;డు ఏం చేయాలి? ఈనాడు ఈ స్థితికి వచ్చామంటే అది ఏ ఒక్కడి ఘనతో కాదు. ఎవరి మటుకు వారు చేసిన కృషి ఫలితం చూస్తూ చుస్తూ దాన్ని చిన్నా భిన్నాం చేయాలా? నిందారోపణలు - రుజువులు - సాక్ష్యాలు - సంజాయిషీలు - ఛ!'

రామనాథం శివుడి వంక చూసాడు.

'ఎవరికి వారికి సౌఖ్యంగా సౌకర్యంగా ఎప్పటికప్పుడు డబ్బు అందుతున్నంత కాలం తన మాట చెల్లింది. ఇప్పుడు ఇబ్బందులొచ్చాయి. వాతావరణంలో మార్పు వలన అయితేనేమి నీటి ఎద్దడి వల్లనైతే ఏమి పంట దిగుబడి సగానికి సగం పడిపోయింది. కూలీల ఖర్చు పెట్టుబడి వ్యయం పెరిగిపోయింది. ఇంక వ్యవసాయం లాభదాయకం కాదు. అది స్పష్టం. ఇలాంటి ఆర్థిక అనిశ్చిత తలెత్తినప్పుడు తాను పనికిరాని వాడయ్యాను. తనపనులు చేతకాని పనులయ్యాయి తన భావాలు లౌక్యంలేని వయ్యాయి.'

"ఎందుకు బాబాయ్ ఇట్లా జరుగుతోంది? ఎక్కడొచ్చింది తేడా?" శివుడు బాధగా అన్నాడు.

"లేకపోతే ఎల్లకాలం మనరెక్కలకిందే వుంటారట్రా? వాళ్ళకీ రెక్కలొచ్చాయి. ఎగిరి పోవాలను కుంటున్నారు అంతే -"

"కానీ గూడు శిథిలమై పోతుంది బాబాయ్-"

"అంతే రా - అది మానవ నైజంలోనే వుంది. స్వహితం అది ముదిరి స్వార్థమవుతుంది. స్వార్థపరుడికి మంచీ చెడూ విచక్షణ వుండదు. నైతిక విలువలు గడ్డిపోచలు. వాడిపని జరిగి తీరాలి. జరిపించు కోవడానికి ఏ మార్గమైనా అనుసరిస్తాడు. సక్రమమా అక్రమమా అని వాడు ఆలోచించడు."

"మన ముందు పెద్దాళ్ళయి, మన తిప్పలన్నీ చూసి - మన శ్రమనంతా అంత తేలిగ్గా ఎట్లా తీసి పారేస్తారు ? ప్రతి ఒక్కడూ వాడు లేకపోతే ఇదంతా జరిగి వుండేది కాదన్న అహంభావం పెంచుకున్నాడు. ప్రతి ఒక్కడి పెదాల మీద ఒకటే మాట - నేనీ యింటి గాసగాడ్ని ! ఎందుకుని అంటున్నారో కానీ వాళ్ళన్న మాట నిజం వాళ్ళల్లో గాసానికి పని చేసి గాసం పుచ్చుకొని చేతులు దులుపు కొని - మరోపనికి వెళ్ళే వాళ్ళ మనస్తత్వం వుందే కానీ, ఇది మా పని అన్న మమేక భావన లేదు మొక్కుబడిగా చేసానంటే చేసాను అంతే -"

"అంతేరా ! అంతకాక ఇంకే ముంది ? శక్తి కొద్దీ పని చేద్దాం అవసరం మేరకు అనుభవిద్దాం - అన్న విధానం మనకే కాదు మహామహా మేధావులందరూ సిద్ధాంతీకరించినా - ఆచరణలో విఫలమాయ్యారు. ఎందుకు ? మనిషిలో వున్న స్వహితం అన్న తత్వం వల్లనే. అవసరం మేరకే కాదు - అంత కన్నా ఎక్కువ సంపాదించాలి దాచుకొనో, పొదుపు చేసుకొనో, భద్రం చేసుకొనో విలాస వంతంగా విశ్రాంతి మయ జీవితాన్ని గడపాలి అదీ మనిషి కోరిక. అందుకే ఈ పరుగులు. వ్యవసాయంలో ఓ ఏడు పండు తుంది ఓ ఏడు ఎండుతుంది దాని మీద ప్రేమ - అంతులేని ఆప్యాయం వున్నపుడే వ్యవసాయంలో మమేకం పొందుతాం కానీ ఇప్పుడు - శ్రమకన్నా ఎక్కువ ఫలితం రావాలి. వాడి విలాసమయ, విశ్రాంతి మయ జీవితం మరింత సౌఖ్యంగా మలుచు కోవాలి.

అందుకే పరుగులు - డబ్బు వెంట పరుగులు ఆ పరుగుల్లో వాళ్ళు జారి విడుచు కుంటున్న దేంటో తెలుసుకోలేరు. కొన్ని వందల ఎకరాల మాగాణం - పినాకినీ జలాల తడిసి మొలగొలుకుల ప్రాణం పోసే నెల్లూరి మాగాణం - ఆ స్వార్థ పూరిత మనుషులు తొందరపాటు వల్లనే చేపల చెరువులై చివరికి ఎందుకూ కొరగాకుండా పోయింది. మన కళ్ళ ముందే మనం చూస్తుండ గానే - ఇది జరిగి పోయింది.

పత్తి పంట - పరుగులు! షేర్ మార్కెట్ బూం పరుగులు ! - రొయ్యలు చేపలు - పరుగులు ! ఈ పరుగులన్నీ - ఎండ మావుల వెనకనీ తెలుసుకొనే లోపలే ఎంత మంది కుప్ప కూలిపోతున్నారు ? ఎన్ని జీవితాలు అతలాకుతలం అవుతున్నాయి. అయినా పరుగులు ఆగవు. పరిగెత్తి పరిగెత్తి అలిసి పోయినప్పుడు కానీ అర్థం కాదు - ఏమేం జారవిడుచు కొని తను పరుగు పందెంలో పడ్డాడో -"

రామనాథం నిట్టూర్చాడు.

"అయ్యా"-

రామనాథం తలెత్తి చూసాడు.

సవారి ముఖంలో కత్తి వాటుకు నెత్తురు చుక్కలేదు. ఏదో ఆందోళనలో వున్నట్లు చాలా అసహనంగా వున్నాడు. అటూ ఇటూ కదులుతున్నా ఊరుకూరికికే నిట్టూర్చు తున్నాడు.

"ఏవయ్యింది సవారీ - ఎందుకట్లా వున్నావ్ ?"

"నా అల్లుడు మా పొట్టిని తన్ని పంపిండు "

సవారి గొంతు బొంగురు పోయింది.

"దేనికి ?"

"సేను అమ్మక రమ్మంటుండంట -"

రామనాథం శివుడూ ఒకరి ముఖం లోకి ఒకరు చూసుకున్నారు

"బాడ్కవ్ ! నాల్గు అచ్చరం ముక్కలు నేర్పిండని - పెబ్బేరు కెల్లి సంబంధం చేస్తి గీ పొద్దు ఈ పల్లెల ఏమున్నది ? పట్నం పోదాం - సేను అమ్మమంటుండు. నా బిడ్డను తన్ని తరిమిండు మొదాలుకి గా పొట్టి నీళ్ళాడె -"

"ఏం చేద్దామను కుంటున్నావ్ ?"

"పొట్టి మొగం జూసి సేను బేరం పెట్టే నా గతేం కావాలె. మల్ల గాసగాని తీర్నకి వోనెంట వీనెంట పోవాలె ఇప్పుడు ఈ బొక్కల్ల సారమున్నాదా ? సత్తు వున్నదా ? ముసలోన్నయితి."

"నువ్వే పండిస్తానని చెప్పు -"

"గా ముచ్చట పూర్తాయె. పైసా ఆదాయం రాదు పెట్టుబడి పెట్టనంటుండు. సేను అమ్మి పట్నంల కిరాణాదుక్నం పెడ్తడంట -"

"గడెం వేసి వాడు గల్లా పెట్టెముందు ఏం కూర్చుంటాడు ? సరేలే వాడిష్టం," రామనాథం ఓ క్షణం ఆగి అన్నాడు, "వాడికి ఎంత డబ్బు అవసరం అంట -"

సవారి చెప్పాడు. "ఆ డబ్బు నేనిస్తాను. కానీ, తిరిగి ఇచ్చేయాలని చెప్పు - లేకపోతే విచ్చల విడిగా ఖర్చు పెట్టేస్తాడు. ఆ చేనుకి ఇంకా బేరం కుదర్లేదని చెప్పు"

సవారి సంతోషంగా వెళ్ళి పోయాడు.

మౌనంగా చూస్తున్న శివుడు నెమ్మదిగా అన్నాడు.

"బాబాయ్ - మరి మన పొలం అమ్మ కుండా ఎలా కాపాడు కుందాం ?"

కొద్ది సేపు మౌనం తరువాత శివుడు అన్నాడు, "ఆ సవారి అల్లుడి మీద నాకు నమ్మకం లేదు బాబాయ్ - వట్టి తిరుగు బోతు. మళ్ళీ ఇస్తానన్న డబ్బులు తీసుకెళ్ళి ఎక్కడో తగలేస్తాడు. మళ్ళీ నెలతిరిగేలోగా ఆ చేను బేరం పెట్టక పోతే అప్పుడగండి -"

"ఏం చేస్తాం ? మనకు తోచింది మనం చేసాం. ఇక ఆ పైన వారిష్టం !"

ఇంతలో రయ్యిరయ్యిన జీపులొచ్చి ఆగాయి.

రామనాథం, శివుడు లేచి వాకిట్లోకి వెళ్ళే లోపలే - వాళ్ళు లోపలికి వచ్చేసారు.

రెండు జీపుల జనం - వాళ్ళ మధ్యలోంచి అటు ఇటూ ధృఢమైన గన్‌మెన్‌లు వెంటరాగా నరసింహం, అతని కొడుకు భూపాల్ వచ్చారు.

"నమస్తే నమస్తే రామనాథం సాబ్ -"

ముఖమంతా నవ్వుపులుము కొని అంత దూరాన్నుంచే నమస్కారాలు పెడుతూ నరసింహం రామనాథం వైపు వచ్చాడు.

రామనాథం అతన్ని సాదరంగా ఆహ్వానించాడు

శివుడు ఆ గన్‌మెన్స్‌ను వాళ్ళను, వాళ్ళ డేగ చూపును, సఫారీ సూట్లను పేల్చడానికి సిద్ధంగా వున్న గన్స్‌ను చూస్తున్నాడు

"వీడు నా కొడుకు - భూపాల్ ఈ సారి ఈ నడిగడ్డ మీద నుంచి ఎలక్షన్ల నిలబడ్తుండు-

రామనాథం నవ్వుతూ తలాడించాడు.

"నేనెట్లా పార్లమెంటుకు పోతున్నా - వీడు అసెంబ్లీకి పోవాల • మీరు వీన్కి ఓటు వేయాల -"

"దాందే వుంది - అలాగే" - రామనాథం ఎన్నికల ప్రచారానికి వచ్చే అభ్యర్థులందరికి చెప్పినట్లే పొడిగా చెప్పాడు.

"అలాగే అంటే కాదు తప్పక వేయాలె • అంతే కాదు మీరు మా తోన వచ్చి మా వానికి ఓటు వేయమని చెప్పాలె-"

"అలా ఎలా చెప్తాను ? ఓటు వేయడం అనేది వేసేవాళ్ళ ఇష్టం -"

"అలా అంటే కాదు. ఈ నడిగడ్డ మీద మీకు వున్న పలుకుబడి తెలుసు. మీరు ఒక్క మాట చెపితే చాలు. తరువాత మేంచూసుకుంటాం "

"చూడండి - ఇప్పుడీ వూళ్ళో మనుషులే లేరు. ఇంక ఎవరికి చెప్తాను ?"

"అట్లా అంటే కాదు - మీరు మావాడి వెంట వుండాలి - అయినా మనుషులు లేకపోతే ఏమి ? ఓటర్ల లిస్టు వుంది చాలు !"

రామనాథం నొసలు ముడి పడ్డాయి. ఇతన్ని మొదటి సారి చూసి పాతిక ఏళ్ళ పైనే అయ్యింది. మళ్ళీ ఇదే చూడడం. అప్పటికీ ఇప్పటికీ ఏమీ తేడాలేదు. అదే అహం. కాకపోతే మనిషి మీద వయసు ప్రభావం కనిపిస్తోంది. భూపాలు కూడా అచ్చం తండ్రిలాగే వున్నాడు. కాకపోతే నరసింహం పంచె లాల్చీ వేసుకుంటే ఇతను పైజామా లాల్చీ వేసుకున్నాడు.

"వస్తున్నరా ? లేదా ?"

భూపాలు గొంతు హెచ్చింది.

రామనాథం విసురుగా లేచి నిల్చున్నాడు, "క్షమించండి - ఓటు ఎవరికి వెయ్యాలి అన్నది ఎవరికి వారు నిర్ణయించుకోవాల్సిన విషయం . నేను ఎవరో ఒకరికి ప్రచారకుడిగా మారను - జనాల్ని వెంటేసు కొని వారిని గుడ్డి వాళ్ళుగా చేసి నాకళ్ళతో చూడమని నేను చెప్పను వాళ్ళు కళ్ళు తెరిచి చూడగలరు. చూస్తారు."

"చివరి మాట అంతేనా ?"

"అంతే !"

"ముందే చెప్తున్నాం - తరువాత పరిణామలకు మేం బాధ్యులం కాం"

"ఇంటి కొచ్చి బతిమిలాడితే నీల్గుతున్నావ్ - నీ సంగతి చూడకుండ వదిలి పెట్టం -

వాళ్ళంతా గిర్రున వెనక్కి తిరిగారు. చరచర బయటకు వెళ్ళారు

"అనవసరంగా ఘర్షణ పడ్డావేమో బాబాయ్-"

రామనాధం మాట్లాడ లేదు.

ఆ ఎలక్షన్లలో భూపాలునికి పోటీగా కర్నూలు నుంచి వచ్చిన అభ్యర్థి నిలబడ్డాడు. మూడోవాడు ఎప్పుడూ నడిగడ్డకు ప్రాతినిధ్యం వహించే నడిగడ్డ అభ్యర్థి ఇతను ఇండిపెండెంట్‌గా పోటీచేస్తున్నాడు.

భూపాల్, అతని ప్రత్యర్థి ప్రధాన పార్టీలకు చెందినవారు. వారిద్దరికీ నడిగడ్డ ఓటర్లు కొత్త. ఎలా ఆకర్షించాలో తెలియని అయోమయంలో పడ్డారు.

సారా వాగులై పారింది. డబ్బు వెదజల్లబడింది. పార్టీల పెద్దలు రోజుకొకసారి నడిగడ్డ ప్రజలను పలకరించిపోతున్నారు. ఆళ్ళగడ్డ బాంబులు నడిగడ్డను చేరాయి. కాకలు తీరిన బంట్లు నడిగడ్డ మీద స్వైర విహారం చేస్తున్నారు. నయాన భయాన ఓటర్లను తమ వైపు తిప్పుకోవడానికి ఎవరికి వారు విశ్వప్రయత్నాలు చేస్తున్నారు. ఇండిపెండెంట్ అభ్యర్థి వాళ్ళ ధాటికి తెల్లమొహం వేసాడు. శివుడు ఆ వూళ్ళో ఇంకా మిగిలి వున్న కొద్ది మంది ముసలీముతకలను ట్రాక్టరు ఎక్కించుకొని పోలింగ్ కేంద్రానికి బయలుదేరాడు.

శివుడు వాళ్ళు వెళ్ళే సరికే పోలింగ్ మొదలయ్యింది. అందరూ వరుసలో నిలబడ్డారు. తన వంతురాగానే శివుడు బూత్ లోపలికి వెళ్ళాడు.

భూపాల్ వాళ్ళ జీపొచ్చి ఆగింది.

భూపాల్ దిగి ఓ పక్కగా నిల్చున్నాడు.

అతని మనుషులు దడదడ బూత్ లోపలికి వెళ్ళారు.

శివుడు అప్పుడే ఓటువేసేసి, బ్యాలెట్ పేపర్ మడుస్తున్నాడు.

ఒకడు దురుసుగా దానిని లాక్కున్నాడు.

"ఇండిపెండెంటుకు ఏసిండు"

"ఎవడుబే నువ్వు?"

"గా రామనాధం అన్నకొడుకు-"

"వీడేసిండంటే ఇక్కడోల్లందరూ ఆ ఇండిపెండెంట్ కేసుంటడు-"

ఒకడు ఆ పేపర్‌ను ముక్కలు ముక్కలుగా చింపేసాడు.

శివుడు అక్కడున్న అధికారిని పిలవబోయాడు.

శివుడి కాలరు పట్టుకొని దౌర్జన్యంగా దబదబ బయటకు లాక్కొచ్చారు.

ఇంకొకడు బ్యాలెట్ బాక్సులో ఆసిడ్ గుమ్మరించేసాడు.

ఎలక్షన్ల అధికారి, ఇద్దరు పోలీసులు అందరూ ఎక్కడి వారక్కడ నిమ్మకు నీరెత్తినట్లు మౌనంగా నిల్చున్నారు వాళ్ళ చూపులు భూపాల్ అనుచరుల చేతుల్లోని ఆయుధాలు మీదున్నాయి

"యం పి గారి కొడుకు-గెలిస్తే మినిష్టర్ అవుతాడు" ఎవరికి వాళ్ళు మనసులో అనుకున్నారు

రామనాథానికి విషయమేంటో అర్థంకాలేదు

శివుడ్ని పొట్టలో గుద్దుతూ తెచ్చి బయట తుమ్మ చెట్టు కింద పడేసారు చుట్టూ చేరి ఒకడి దగ్గరునుంచి ఒకడు మార్చుకొంటూ పిడిగుద్దులు గుద్దుతున్నారు. తుపాకీ మడమలతో మోకాళ్ళతో కొడుతున్నారు.

రామనాథం వేగంగా వాళ్ళ మధ్యకు దూసుకెళ్ళాడు అప్పుడే ఓటేయడానికి కర్నూలు నుంచి వచ్చిన సుధాకర్ అంతకన్నా వేగంగా భూపాల్ దగ్గరికి వెళ్ళాడు

శివుడితో పాటు రామనాథానికి దెబ్బలు తగులుతున్నాయి.

"ఎక్కణ్ణించో వచ్చిన్రు-ఇక్కడ పొలాలు కొన్నరు మమ్మల్నే ఎదిరిస్తార్రా-ఈడకెళ్ళి తరిమితే కానీ మీకు బుద్ధిరాదు!"

రామనాథం ఒకడి చేతిలోని కర్రకు చేయి అడ్డం పెట్టి గట్టిగా అరిచాడు

"ఒరేయ్-ఎక్కణ్ణించో వచ్చింది మేము కాదురా మీరు! మేమీ గడ్డ మీద బతకబట్టి మూడు దశాబ్దాలపైనే అవుతుంది

మేం నడిగడ్డమీద అడుగు పెట్టిన రోజు మీదొర నడిగడ్డ బయటకు అడుగుపెట్టాడు.

ఇంతకాలం మా తిప్పలు మేం పడ్డాం. మా బతుకులు మేం బతికాం

ఇన్నాళ్ళ తరువాత వచ్చి-మళ్ళీ మా మూలాల్ని తవ్వుతారంట్రా-అసలు మీకూ ఈ గడ్డకు సంబంధమేంటి? మా చెమటతో తడిసి ఈ గడ్డ గని గడ్డ అయ్యింది. మీ దొర ఏంచేసాడురా? ఆ సారా కొట్లుపెట్టి కష్టం చేయాల్సిన కండల్ని డొల్ల చేసాడు. చెమట చిందాల్సిన చోట సారా పారించాడు. ఆయనకేం నష్టం జరగలేదు. ఆయన యం.పి. అయ్యాడు. కానీ ఇక్కడి రైతులు కూలీలు అయ్యారు. తాగుబోతులు అయ్యారు. మళ్ళీ ఈ రోజు వచ్చి మమ్మల్ని ఈ గడ్డ నుంచి వేరు చేసే మాట్లాడే హక్కు ఆయనకెడిది ? మీకెక్కడిది ? "

"నాన్నా నువ్వూరుకో-" సుధాకర్ రామనాథాన్ని పక్కకు లాక్కెళ్ళాడు భూపాల్ ఆవేశంతో అతని మనుషులు పక్కకు వెళ్ళారు. ఎలక్షన్లు రద్దయ్యాయి. రీపోలింగ్ సన్నాహాలు మొదలయ్యాయి.

***

"వయసు పెరుగుతున్న కొద్దీ మీకు పిచ్చి ముదురుతుంది - నరసింహంగారంతటి మనిషి స్వయాన మనింటికి వచ్చి అడిగితే ఆయనతో సరేనంటే ఏం పోయేది ? అన్నింటికి ఏదో ఒక ఘన కార్యం చేసేది ప్రాణం మీదికి తెచ్చుకొనేది -" సుధాకర్ రామనాథం మీద ఇంతెత్తున ఎగిరాడు

"అదేంట్రా సుధాకర్ అట్లా అంటావ్ ? నరసింహం గురించి నాకు తెలీదు. అతను సారా ఎలా పారించాడో చూశావా ? ఎన్ని కుటుంబాలు ఆ సారా బారిన పడి నాశనమై వుంటారో - అతను ఎలాగు ఎం. పిఅయ్యాడు. ఇక కొడుకు కూడా ఎమ్మెల్యేని చేస్తే -"

"చేస్తే ? నీ సొమ్మేం పోతుంది ? అసలు ఆ సారా కోసమే వాళ్ళీ ఏడు ఇక్కడ నిలబడుతోంది ! మన రాష్ట్రంలో మద్యం నిషేధించారు. ఇది రాయచుర్ రోడ్డా - వాళ్ళు కర్ణాటక నుంచి దొంగ రవాణా చేసుకొనే వీలు కోసమే ఇక్కడ కొడుకును నిలబెట్టాడు. కూపస్థమండూకంలా నీవు ఎరిగిన ప్రపంచం నుంచే లోకాన్నీ చూడకు నాన్నా - లౌక్యంగా చూడు. నువ్వు కాదన్న మాత్రాన భూపాల్ గెలవకపోడు వాళ్ళ వ్యాపారానికి నడిగడ్డను మార్గం చేసుకోక మానడు. భూపాల్ నాకు కాలేజీ రోజుల్లోంచి తెలుసు ఎలా గెలవాలో అతనికి బాగా తెలుసు అదే జరిగితే రేపొద్దున మన పరిస్థితేంటో ఆలోచించారా ? రోజురోజుకీ చాదస్తం పెరుగుతోందే తప్ప తరగడం లేదు -" సుధాకర్ విసుక్కున్నాడు.

"వాళ్ళేం చేస్తార్రా - మనకింత అండవుంటే ?"

"ఏం అండ ? ఆ కేసన్న, హనుమంతు - సవారి అల్లుడు - వీళ్ళు కాక వూళ్ళోని జనాలందర్నీ శివుడన్నయ్య స్వయంగా బూత్ దగ్గరకి తీసుకెళ్ళాడే వీళ్ళల్లో - ఒక్కడన్నా - ఒక్కడంటే ఒక్కడన్నా ఆ దుండగులకు అడ్డం పడ్డారా ? అంతా నీ భ్రమ నాన్నా - ప్రతి ఒక్కడూ ఏరు దాటి తెప్ప తగలేసేవాడే. రేపొద్దున భూపాల్ కుండే పలుకుబడి, గౌరవం - నీ కుంటాయను కున్నావా. ఒట్టి భ్రమ అంతే -"

"అయితే నన్నేం చేయమంటావ్ రా ?"

"ఏమీ చేయద్దు, మౌనంగా వుండు, నేనే ఆ భూపాల్ తరుపున ప్రచారం చేస్తా -"

"నువ్వా ?"

"ఏం అక్కడ మల్లేశ్ నరసింహం తరుపున చేయలేదూ ? లౌక్యం నాన్నా లౌక్యం. ఇవ్వాళ రేపు మంచికి చోటు లేదు - వాడెంతటి వాడంటే మనం ఎదురు తిరిగితే - ప్రాంతీయ విభేదాలు సృష్టించి కట్టు బట్టలతో తరిమి తరిమి కొడతాడు. వాడామాత్రం ఘనుడు !"

"తుంగభద్ర అవతలి వడ్డున బాంబుల వర్షం కురుస్తుంది. ఈవలి వడ్డు శాంతి పవనాలు వీస్తూ వుంటాయి. ఆవతలి ఒడ్డు రాళ్ళ సీమ. ఈ వలి ఒడ్డు నడిగడ్డ. కానీ, వాళ్ళు తమ స్వార్థం కోసం దీనిని నెత్తుటిగడ్డగా మారుస్తారా ? అసలు వాళ్ళెవర్రా మన మీద పెత్తనం చేయడానికి ?"

"నాన్నా, నువ్వు మళ్ళీ మొదటికి వస్తున్నావ్ - వాళ్ళెవరో ఇవ్వాళ పోలింగ్ బూత్ దగ్గరే బయట పడింది కదా ! వాళ్ళ చేతుల్లో మారణాయుధాలున్నాయి. మన చేతుల్లో లేవు. ఇంకో విషయం నాన్నా. మనం మరో ముఖ్య నిర్ణయం తీసుకోవాలి నేను కర్నూలులో స్థలాలు చూస్తున్నాను. మన పొలం నరసింహం గారు తీసుకుంటాన్నారు. ఇవ్వాళో రేపో అగ్రిమెంట్‌కు వస్తామన్నారు -"

నెత్తిన పిడుగు పడ్డట్లు రామనాధం, శివుడు ఎగిరిపడ్డారు.

"ఏంట్రా సుధాకర్ నువ్వనేది ?"

"ఏముంది నాన్నా - ఉన్నమాటే అంటున్నాను. మనం ఇక ఇక్కడ వ్యవసాయం చేయలేం. కూలీల గొడవలు - కాలవల మీద గొడవలు ఆ ఆఫీసర్ల చుట్టూ చాకిరీ లంచాలు అవన్నీ అటు వుంచండి - ఆ నరసింహంతో ప్రతి రోజు గొడవ పెట్టుకుంటూ మనం బ్రతకలేం దౌర్జన్యం చేయడం మన వల్లకాదు. అప్పుడు చల్లగా పక్కకు తప్పుకోవడమే మంచిది. అందులోను ఈ వూళ్ళో ఇంకేం మిగిలింది. ముసలాళ్ళు తప్ప -"

"ఆ నరసింహం చేలు కొని ఏం చేస్తాడట ?" శివుడు విరుచుకు పడ్డాడు.

"ఏం చేస్తాడో మన కెందుకు ? చేను మరుగున వుంటుంది కదా సారా బట్టీ పెడతా రేమో -"

రామనాధం ఏమీ మాట్లాడలేదు. కోపంగా లేచి బయట కెళ్ళాడు.

శివుడు సుధాకర్‌తో ఘర్షణ పడుతున్నాడు

వూరంతా నిశ్శబ్దంగా వుంది. ఒకప్పుడు మనుషులతో కళకళలాడిన వూరు ఇప్పుడు కళావిహీనంగా వుంది.

ఇళ్ళకప్పులు ఎన్నాళ్ళ క్రితం కప్పినవో ఎండకు ఎండీ వానకు తడిచీ ఇప్పుడో అప్పుడో కూలేటట్లు వున్నాయి.

ఆ కప్పుల మీద ఒకప్పుడు శోభాయమానంగా పెరిగిన నవరత్నాల తీగలు లేవు. రాధా మనోహరాలు లేవు. కాకర బీరసొర గుమ్మడి - ఏవీలేవు. ఏ కప్పు మీద నుంచి పొగ లేవడం లేదు. ఏ చావిట్లోంచి ఎద్దుల రంకెలు వినబడడం లేదు. ఊరులో చైతన్యం లేదు జీవం లేదు. అసలు ఊరేలేదు.

మరి తనెందుకు ఇంకా ఊరిని పట్టుకు వెళ్ళాడ్డం ? రామనాధం కళ్ళు తడిగట్టాయి.

ఎవరికైనా ఎప్పటికైనా మనుగడ కోసం జీవిక కోసం ఒక ఊరిని వదిలి మరో ఊరికి పయనమై పోక తప్పదు.

కానీ ఇది తన ఊరు. తను చూస్తుండగానే తన చుట్టూ ఏర్పడిన ఊరు. తను కళ్ళ ముందే ఒక్కోరు నిష్క్రమించడాన్ని గమనించడం ఎంత బాధ. వచ్చినపుడు ఒకరూలేరు. కానీ అప్పుడు భయం లేదు. బాధ లేదు. ఊరిలోంచి ఒక్కోరూ వెళుతూ వుంటే తన హృదయాన్ని

ముక్కలు చేసి వాళ్ళ వెంట తీసుకెళుతున్నాడు. ప్రపంచం దృష్టిలో నాలుగు నాళ్ళు వెలిగి చప్పున ఆరిపోయిన ఈ ఊరు కొందరికి తియ్యటి జ్ఞాపకమైన కొందరికి వ్యథాభరిత అనుభవం. అన్నీ చూసి అన్నీ అనుభవించి ఉన్న పళాన వదిలి వెళ్ళడమే - ''

రామనాధం తిన్నగా పొలం దగ్గరికి వెళ్ళాడు. పున్నమ్మ అస్థికల మీద వేసిన మామిడి చెట్టు మహావృక్షమై వుంది రామనాధం మెల్లిగా వంగి మట్టిని చేతిలోకి తీసుకొన్నాడు.

'ఈ మట్టి - ఈ రేగడి - లోనే తన తల్లి ఒరిగింది. ఈ రేగడి తల్లిలా లాలించింది. ఈ రేగడి ఓ తండ్రిలా తనకు పాఠాలు నేర్పింది ఓ స్నేహితుడిలా ఓదార్చింది దీనికీ తనకూ వున్న సంబంధం ఒక్క సంతకమేనా ? తన కొడుకు సులభంగా ''అగ్రిమెంట్'' రాసుకుందా మంటున్నాడు ? ఏమని రాస్తాడు అగ్రిమెంట్ ? తన ప్రాణాన్ని అమ్ముతాననా ? తన తల్లిని ధారదత్తం చేస్తానా ? తన తండ్రిని పరాయి పాలు చేస్తాననా ? '

రామనాధం చెంపలు తడిగట్టాయి

'జంతు ప్రపంచానికి ఆవలగా మనిషి వేసిన మూడడుగులు భాష, వ్యవసాయం, లిపి అంటారు. ఈనాటికి మనది వ్యవసాయ ప్రధాన దేశం. వ్యవసాయమే మన జీవనాధారం. కానీ ఈనాడు మట్టి మీద మమకారం లేదు వ్యవసాయం మీద ఆప్యాయం లేదు. ఎక్కడ చూసినా వ్యాపార దృష్టి - వ్యవసాయాన్ని వ్యాపార దృష్టితో చూస్తే ఎలా ? ఓ ఏడు ధనం కురుస్తుంది. ఓ ఏడు కొట్టుకు పోతుంది. ఆటుపోట్లకు తట్టుకుని నిలబడితేనే రైతు.

ఉద్యోగస్తుల్లా నెల తిరిగే సరికి జీతాలు, ఉద్యోగం మానితే కూడా పెన్షల్లు ఉండవు ఏ పంటకి ఆ పంట పండించాలి. ఏ నిమిషానికి ఆ నిమిషం వళ్ళు విరుచుకోవాలి. వ్యవసాయం పెట్టుబడి పెరిగిపోతుంది. వాణిజ్య పంటలు డబ్బులు కురిపిస్తున్నాయి. ఆహారపంటలు పట్ల ఆసక్తి తగ్గుతోంది. ఇక నిత్యావసర సరుకులు ధర ఆకాశాన్నంటక ఏమవుతాయి ? పెరిగిపోతోన్న జనాభా - ఆహార సమస్య - ఆహార ఉత్పత్తి పై ఆసక్తి సన్నగిల్లడం - ఇంక దేశం ఏం బాగుపడుతుంది ? వ్యవసాయమే అన్నిటికి మూలమని నమ్మేతనకు భిన్నంగా తన కొడుకు ఆలోచిస్తున్నాడు. వ్యవసాయం వద్దు, వ్యవసాయంతో వ్యాపారం చేద్దామంటున్నాడు. ఇప్పుడు ఏం చేయాలి ? కొడుకు మాటలు, వాదనలు అన్నీ సరిగ్గా ఒకప్పుడు తనూ తన కుటుంబంతో చేసినటు వంటివే. అప్పుడు తాను సుఖంగా గదిలో కూర్చుని చేసే పనిని వదులు కొని శ్రామిక కష్టాన్ని పెట్టుబడిగా పెట్టాల్సిన వ్యవసాయమే ఎంచుకొన్నాడు.

ఇప్పుడు అతను శారీరక కష్టం నుంచి తప్పించుకుని గదిలో కూర్చుని కష్ట పడదామంటున్నాడు ! నిజమే ! వాడన్నట్లు ఇందులో తను ఏం బావుకున్నాడు ? ఇన్నాళ్ళు కష్టం వల్ల ఏం సాధించాడు ? అందరిలోనూ అసంతృప్తి, ఆరోజుకారోజు సుధాకర్ ఏమన్నాడు ? ''నాన్నా నువ్వసలు తెలివి తక్కువ నిర్ణయం తీసుకొన్నావు .ఇక్కడికి రాకుండా ఏ కోయంబత్తూరో వెళ్ళుంటే ఈపాటికి ఓస్పిన్నింగ్ మిల్లు ఓనరువై వుండే వాడివి . మనలాగే సామాన్యమైన రైతు కుటుంబాల్నించి వెళ్ళిన తెలుగు వాళ్ళందరూ ఈనాడు కోటేశ్వరులు''

అవును, తనది తప్పుడు నిర్ణయమే అని అనుకుంటే మరి ఆ నాలుగెకరాల భాగ్యం నుంచి ఇంతదాకా చేసి ప్రయాణమంతా అబద్ధమైనా ? ఈ ప్రయాణంలో తనెక్కడా సంతోషాన్ని అందుకోలేదా ? ఆనందాల అంబరాలు అందుకోలేదా అవును. ఈ ప్రయాణంలో దుఃఖాన్ని చూసాడు. సుఖాన్ని చూసాడు వీళ్ళకు దుఃఖాలే జ్ఞాపకం వున్నాయి. సుఖాలు మరిచిపోయారు. నిజానికి సుఖానికి ఆనందానికి నిర్వచనాలు ఎవరిని వారిచ్చుకొనేవి. తనకు సంతోషాన్ని కలిగించిన అంశం సుధాకర్‌కి విషాదం కావచ్చు. తన కొడుకే కాబట్టి తన మాదిరిగానే స్పందించాలని ఏముంది ?

తను ఎక్కడైనా పొరపాటు చేసాడా ? వీళ్ళందర్నీ ఒకే గాట కట్టాలనీ - ఒకే చోట ఉంచాలనీ - ఎలా సాధ్యమవుతుంది ?

ఎవరికి వారు విడిగా వుంటే ఎక్కువ ఫలితాన్ని సాధించివుండవచ్చునని భావిస్తారేమో - తమ నిర్ణయాల ఫలితాలు ఎలా పరిణమించినా అది వారికి నచ్చుతుందేమో నిజమే. అనూరాధ తరుపున తాను నిర్ణయం తీసుకున్నాడు. సుధాకర్‌కు అసంతృప్తి . గీతకు అసంతృప్తి విషయం తెలుసుకున్న మల్లేశ్‌కు అసంతృప్తి. మల్లేశ్ ప్రవర్తన వల్ల అనూరాధకు అసంతృప్తి. చివరికి మిగిలిందేమిటి ? వారందరి అసంతృప్తి ! అంతేనా ? ఏమో. తను చేసినదంతా వృధా అయిపోతుందా ?

భారతి, శివుడు, అన్నయ్యా వదినా - అందరినీ మించి సావిత్రి అందరూ ఈ రోజు అసంతృప్తిలోనే వున్నారా ? సుధాకర్ భావిస్తున్నట్లుగా వ్యవసాయం కాక మరో వృత్తిలోకి వెళ్ళుంటే బావుండేదనే భావిస్తున్నారా ? వ్యాపారం ! నిజమే - వ్యవసాయంలో ఫలితాలు ఎలా వుంటాయో ఊహించలేం - అవి ప్రకృతి మీద ఆధారపడుతాయి.

నేల, ఆకాశం, నీరు - అన్నీ కలిసి రావాలి. వ్యాపారం లోగా చాకచక్యానికి నేర్పుకు తెలివికీ చోటు లేదు. కానీ, సుధాకర్ అంటోన్న ఆ స్పిన్నింగ్ మిల్లుకు కావల్సిన ముడిసరుకు, డబ్బు, తెలివి, నేర్పు - ఇవేవి కావు. ప్రత్తి ఆ ప్రత్తిని పండించే రైతు.

రైతు ప్రత్తి పండిస్తాడు. స్పిన్నింగ్ మిల్లుల్లో దారమవుతుంది. బట్టలు మిల్లుల్లో బట్ట అవుతుంది. రేడీమేడ్ రంగానికి ఫ్యాషన్ ప్రపంచానికి, అన్నింటికీ బట్ట చేరుతుంది. ఆ బట్టను రైతు కొంటాడు.

ఈ వలయంలో అతి ముఖ్యమైన ముడి పదార్థం రైతు చేతుల్లో వుంది. అందరిలోనూ నిర్లక్ష్యం అయ్యేది రైతు. నిర్భాగ్యాజీవి రైతు. అతని కష్టార్జితం మీద ఎంత వ్యాపారం జరుగుతుంది. ఎంతమంది జీవిస్తున్నారు - ఎంతమంది అనుభవిస్తున్నారు. సుధాకర్ అన్నట్లు స్పిన్నింగ్ మిల్లుల ఓనర్లు కోటీశ్వరులు కావచ్చు. రైతులు ఎప్పటికి పేదవారే. అది అందరికీ తెలిసిన విషయం. కానీ, ఈ రోజు సుధాకర్ లాంటి రైతు కుటుంబీకులు వ్యవసాయాన్ని వద్దనుకొనే పరిస్థితులు వస్తున్నాయి. లేదు. ఈ దృక్పధం మారాలి వ్యవసాయం వైపు ఇంకా ఇంకా దృష్టి కేంద్రీకరించాలి.

వ్యవసాయం- వ్యవసాయం - వ్యవసాయం అన్నింటికీ వ్యవసాయమే మూలం సుధాకర్ పోతే పోని - నేను మాత్రం వ్యవసాయం వదలను. ఈ వూరు వదలను ఈ గడ్డను వదలను. చివరివరకు నాకు తెలిసిన విద్యను దానిపట్ల ఆసక్తి వున్నవారికే నేర్పిస్తాను

ఈనాడు వ్యవసాయ కుటుంబాల్లో వాళ్ళు డాక్టర్లవుతున్నారు. ఇంజనీర్లవుతున్నారు వ్యాపారస్తులవుతున్నారు. వాళ్ళు ఏ పని చేసినా వ్యవసాయం చేసినట్లే కష్టపడి చేస్తారు. సుధాకర్ అంతే. ఆ నమ్మకం నాకుంది. అలాగే వ్యవసాయేతర కుటుంబాల వాళ్ళు వ్యవసాయం వైపు మొగ్గు చూపచ్చు ఎవరైనా కానీ, నాకు తెలిసింది వారితో పంచుకుంటాను. మూడు దశాబ్దాల క్రితం నేను ఇక్కడ అడుగు పెట్టినట్టే ఎవడో ఒకడు రాకపోతాడా ? ఈ గడ్డను బీడుగా మారకుండా కాపాడకపోతాడా ? వస్తాడు ఎవడో వస్తాడు - ''

"మామయ్యా - " అనూరాధ మెల్లిగా పిలిచింది.

రామనాథం ఒక్కసారిగా లోకంలో పడ్డాడు అనూరాధను తేరిపార చూసాడు. అనూరాధలోనూ పెద్దరికం వచ్చింది. నెరసిన చెంపలలో ప్రౌఢిమ ప్రకటించుకుంటోంది. 'పెద్ద వాళ్ళయి పోయారు !' రామనాథం సన్నగా నవ్వాడు.

అనూరాధ మౌనంగా కొన్ని కాగితాలు అతని చేతికి అందించింది. ఒకటి నరసింహానికి పొలం అమ్ముతున్నట్లున్న అగ్రిమెంటు కాగితం - రెండోది రేగడి సీడ్స్‌ను మల్లేశ్ సుధాకర్‌ల పేరన మార్చేది.

రామనాథం గడ్డ కట్టుకుపోయాడు. "తను బ్రతికుండగానే తనకళ్ళముందే - తన భూమిని సారాబట్టీ చేస్తూ వుంటే చూస్తూ ఉండగలడా ? "

"మామయ్య - అందరం ఎంతో నచ్చ చెప్పాం - సుధాకర్ బావ ఒప్పుకోవడం లేదు. ఆస్తి పంపకమైనా చేసి నరసింహానికి చేను అమ్ముతానంటున్నాడు. ఇంక ఇక్కడ అంత ధర రావడం అసాధ్యం అంటున్నాడు. నిజమేగా మామయ్య - మేమూ ఎప్పుడో ఇక్కడి పొలాలు అమ్మేసి పాలమూర్‌లో కొనుక్కొంటిమి - "

రామనాథం ఆమె ముఖంలోకి విచిత్రంగా చూసాడు "తమ ముందు పెరిగి పెద్దయిన వీళ్ళంతా తనకు పాఠాలు చెపుతున్నారు ! "

అనూరాధ చప్పున తలవంచుకుంది.

"మామయ్యా - మల్లేశ్‌కు చినబావకు మధ్య అపార్థం పొడసూపుతోంది. ఇప్పుడు నీ ఆశయం మేరకు రేగడి సీడ్స్‌ను అంతకంతకూ విస్తరించడం ముఖ్యమా - లేక ఇప్పుడిప్పుడే మార్కెట్‌లో పాతుకుపోతోన్న దానిని ముక్కలు చేయడమా - అని ఆలోచిస్తే ఈ మార్గం తప్ప మరొటి తోచలేదు. ఎవరి పని వారు చేసుకొంటారు. నీ రేగడి విత్తులు మాత్రం అందరినీ చేరుతాయి. నన్నర్థం చేసుకో మామయ్యా -

అనూరాధ రామనాథం చేతికి కలం ఇచ్చింద.

"మామయ్యా అతను వ్యాపారం చేసుకొంటే చేసుకొంటాడు నేను వ్యవసాయం చేస్తాను. నా కాళ్ళు మట్టిలోనే వుంటాయి. నీ ఆశని నేను నిలబెడతాను - "

రామనాథం ఏమీ మాట్లాడలేదు.

"నువ్వో పెద్దాడివి అయిపోయావ్ - నా దగ్గరని వచ్చివుండు మామయ్యా - మనిద్దరం కలిసి పొలాలు చూసుకుందాం - "

'రిటైర్మెంట్ ! ఏ వృత్తిలోనైనా వుంటుందేమోకానీ వ్యవసాయంలో రిటైర్మెంట్, వుంటుందా ? '

రామనాథం సన్నగా నవ్వాడు. నవ్వి నవ్వి తనకు తెలియకుండానే కళ్ళల్లో నీళ్ళొచ్చేంత వరకూ నవ్వాడు.

" మొత్తానికి భలే వారమ్మా మీరంతా - నన్ను నా ప్రాణాన్ని - ఎలా వేరు చేస్తామనుకుంటున్నారు ? నా కొడుకు అన్నట్లు నేను మూర్ఖుణ్ణే - నేను చాదస్తుడ్నే - నేను లౌక్యం లేనివాణ్ణే కానీ కొమ్మలందం చూసుకొని వేళ్ళు నరికేవాడిని మాత్రం కాదు !

కానీ, నా కాళ్ళూ చేతులు ఆడతున్నంత వరకూ నన్ను ఎవరూ ఈ మట్టి నుంచి దూరం చేయలేరు. ఎప్పుడైనా శక్తి వుడిగి మంచంలో పడాల్సిన స్థితి వచ్చిందనుకో - అప్పుడు కూడా ఇక్కడే ఓ గుడిసెలో ఈ భూమి మీద నుంచి వచ్చే వాసనలు పీలుస్తూ - ఈ తుమ్మ చెట్ల గుబుర్లను ఈ పార్ధీనియం పొదల్ని, ఈ చెరువు కంపును అన్నింటికి ఆస్వాదిస్తూనే కళ్ళు మూస్తాను. ఇది నా ప్రపంచం ! మీకు మీరు చేస్తున్న పనంటే ఎంత ఆప్యాయమో - నాకు నా పనంటే అంతే ఆప్యాయం.

నా ప్రపంచాన్నుంచి మీరు నన్ను దూరం చేయలేరు. నేను ఎవరినీ నా మాట వినమని కట్టుబడి చేయను. పట్టుబట్టను. చివరికి మీ సావిత్రి అత్తయ్యను కూడా - తన నిర్ణయం తనను తీసుకోమను. అనూరాధా - రేగడి విత్తుల్ని మీకు ఆనందంగా ధారదత్తం చేస్తాను. ఎందుకంటే ఏ రోజు విత్తుల్ని మీ చేతుల్లో పెట్టానో ఆ రోజే మీరు వాటి వారసులయ్యారు. నిజానికి, ఆ గుప్పెడు విత్తులే కాదమ్మా - ఈ రేగడి సంస్కృతిని మూలమూలలకు తీసుకెళ్ళే వాళ్ళంతా రేగడి విత్తులే - నువ్వు సుధాకర్, ఆ కేసన్న - హనుమంతు మీ కల్వకూర్తి - చుట్టాలు - ఒకరేమిటి ఈ వ్యవసాయ సంస్కృతిని తమదనుకున్న వారంతా రేగడి విత్తులే.

విత్తనం ఉత్పత్తికి మూలం. ఉత్పత్తి విప్లవానికి మూలం. విప్లవం విశ్వసౌభాగ్యాని మూలం. అందుకే ఈనాడు విప్లవం చేయాలి. అవీ మారుణాయుధాలతోనో మరో హింసాత్మక పథంతోనే కాదు విత్తనాలతో చేయాలి. విశ్వసౌభాగ్యం విత్తనాల్లో ఇమిడి వుంది. సకల వాణిజ్యాలకు సకల పరిశ్రమలకు వ్యవసాయ ఉత్పత్తులే మూలం అందుకు మూలం విత్తనం. అందుకే మీరందరూ ఏమీ సాధించలేదని అనుకున్నా నేను అనుకోను. మీరు అపజయాల పాలయ్యామని నిరాశచెందినా నేను చెందను ఎందుకంటే నానాటికీ వ్యవసాయ శాస్త్రం

అభివృద్ధి పథాన పురోగామిస్తుందే కానీ తిరోగమించడం లేదు. విశ్వవిద్యాలయాల్లోని శాస్త్రజ్ఞుల అద్భుతాలు సృష్టిస్తున్నారు. ఆ అద్భుతాన్ని విశ్వవిద్యాలయ పరిశోధన శాలల్లోనుంచి విశా ప్రపంచంలోకి మరింతగా తీసుకురావాలి ఈ మధ్య ఎన్నో అడ్డంకులు - ఎన్నో శాఖలు - వా అధికారాలు - వారు పెట్టే ఇబ్బందులు మనకే కాదు. అసలా సృష్టికారులు - శాస్త్రజ్ఞులకె మనదేశంలో ఈ తిప్పలు తప్పడం లేదు వాళ్ళకి గుర్తింపు లేదు వాళ్ళు కనుక్కొన్న ఒక్క విత్తనం వల్ల ఒక్క పంటతో లక్షలు గడించిన వారున్నారు. కోటీశ్వరులైన వారున్నారు. వారు మాత్రం కనీస గుర్తింపు లేకుండా జీతానికి పనిచేస్తూ సామాన్యుల్లా జీవిస్తున్నారు. ఒక సామాన్యుడికి మ సమాజంలో వున్న ఇబ్బందులన్నీ వాళ్ళు అనుభవిస్తున్నారు.

అయినా ప్రయోగాలు చేయడం మానుకొన్నారా ? ఫలితాలు అందించకుండ మానుకొన్నారా ? ఫలితాలు అనుభవిస్తున్న ఏ ఒక్కడికైనా ఆ సామాన్యుడు జ్ఞాపకం వుంటాడా ? అది లోక నైజం ! మీరేమయినా అనుకోండి. నా ఆలోచన నాది. నా విశ్వాసం నాది సుధాకర్ అన్నట్లు వాడిని నిరభ్యంతరంగా ఆస్తి పంచుకుపోమను ! నా వంతు నేను మాత్రం కొత్త విత్తనాలు ప్రయోగించడానికే కొత్త పంటలు పండించడానికే వినియోగిస్తాను. విజయం సాధించిన దానిని మీ రేగడి విత్తులుగా వ్యాపారం చేసుకుందురు - " రామనాథం మీ అన్న మాటను వత్తి పలుకుతూ అన్నాడు.

❋ ❋ ❋

రామనాథం విత్తనాల సంచి తీసుకొని పొలం గట్టు మీద నిల్చున్నాడు. నరసింహం మనుషులు తుమ్మచెట్ల మాటున సారా కాయించడం మొదలు పెట్టే ప్రయత్నంలో వున్నారు

రామనాథం గుండె కలుక్కుమంది. సుధాకర్ మాట వరుసకు అన్నాడని అనుకొన్నాడ కానీ - అది నిజం !

రామనాథం ఎక్సైజు వారికి ఫిర్యాదు చేసాడు. ఎక్సైజు వారు రాలేదు. కానీ నరసింహం మనుషులు దుడ్డు కర్రలతో వచ్చి బెదిరించి పోయారు. రామనాథం నిట్టూర్చాడు

"ఏం చేయాలి ? ఈ దేశంలో చట్టాలున్నాయి. వాటిని అమలుపరచడంలో ఎం అవినీతి ? ఈ కాలంలో తన లాంటి వాడికి నెగ్గుకురావడం కష్టమేనేమో - "

అందరూ వెళ్ళిపోయినా శివుడు రామనాథంతో పాటు వుండి పోయాడు. పిల్లల చదువ కోసం భారతి కూడా కర్నూలు వెళ్ళిపోయింది. సావిత్రి అటు భర్తకూ ఇటు కొడుకుకు మధ నలుగుతూ అక్కడ కొన్ని రోజులు ఇక్కడ కొన్ని రోజులు గడుపుతోంది.

రామనాథం పొలం దున్నించాడు. శివుడు విత్తనాలు సంచి విప్పాడు.

"ఇదేంటి బాబాయ్, ప్రత్తి విత్తనాలు కాదే - "

"సన్ ఫ్లవర్ రా - కొత్త రకం సంకర వంగడం - దీన్ని క్రాస్ చెయ్యడం అంతా కొత్త రకమే

శివుడు రామనాథం వంక చూసాడు రామనాథం తల నెరిసిపోయి వుంది వయోభారాన్ని మోస్తూ వెన్ను వంగింది ముడుతలుపడ్డ చర్మం కాంతిని కోల్పోయి జారిపోయిన కండల్ని, పీక్కుపోయిన దవడల్ని కప్పివుంచాలని ప్రయత్నిస్తుంది కుటుంబ కలతలు మిగిల్చిన గుర్తులుగా గుంటలు పడ్డ కళ్ళు చుట్టూ నల్లటి వలయాలు మిగిలాయి

"ఇప్పుడిక నీళ్ళు సరిగ్గా అందవురా - సుధాకర్ అన్నట్లు వ్యవసాయంలో కూడా ప్రాక్టికల్ ఆలోచించి నిర్ణయాలు తీసుకోవాలి మనం కొత్త కొత్త పంటలను వెతుక్కోవాలి - "

శివుడు మౌనంగా తలాడించాడు.

పొద్దు తిరుగుడు చేను ఏద పెట్టారు

చూస్తుండగానే చకచక చేను ఎదిగింది మొక్కకొక మొగ్గను వుంచి మిగిలినవి తుంచేసారు మొగ్గలోపువ్వులా విచ్చడం మొదలెట్టాయి. క్రాసింగ్ సమయం వచ్చింది అరచేతికి బట్ట తగిలించుకొని - మగ పువ్వుల పుప్పొడిని సేకరించారు ఒక్కో ఆడపువ్వుకు ఈ పుప్పొడిని అద్దారు చూస్తుండగానే పూలు విప్పారాయి. గింజలు పోసుకుంటున్నాయి.

రామనాథం సంతోషంగా చూసుకుంటున్నాడు. "ఎవరన్నారు రేగడి వట్టిపోయిందని - నల్లరేగడి మీద వరుసలు తీరిన పచ్చని మొక్కలు విప్పారిన నిండు పసుపు సూర్యకాంతి పుష్పాలు - నలుపుకు తిరుగుతోన్న విత్తనాలు. "

పొద్దు ఎటు తిరిగితే అటు పూలు తిరుగుతూ అబ్బ - ఆ నల్లరేగడి నల్ల విత్తనాలుగా మారిపోతుంది. నల్లటి పత్తి విత్తనాలు - నల్లటి పొద్దు తిరుగుడు విత్తనాలు - సుధాకర్ వాళ్ళు ఏం సుఖముంది అని అంటూ వుంటారే - సుఖసంతోషాలు మనిషికి ఎప్పుడు లభిస్తాయి ? అంతులేని సంపద వల్ల సమకూరే సౌఖ్యాలతో సుఖమంటుందా ? సంతోష మంటుందా ? అలా అయితే సంపన్నులందరూ సంతృప్తిగానే జీవిస్తున్నారా ? లేదు - వారిలోనూ అసంతృప్తి వుంది. మరి మనిషికి దేంట్లో సంతోషముంది? అతని కనీసావసరాలు తీరాలి. అవి ఆర్థిక నేపథ్యమైనవే. కానీ అతనిలో నిబడీకృతమైన శక్తులన్నీ బయటపడాలి అతని సృజనాత్మక శక్తులన్నీ బయట పడాలి. అతని ఊహాత్మక ప్రపంచానికి వాస్తవ ప్రపంచానికి లంకె కుదరాలి. అతని అనుభూతులకు ఆలోచన సరిజోడవ్వాలి. అతను తన శక్తులను బయలు పరుచుకోలేని స్థితిలో తన జంతు ప్రపంచంలో ఓ జంతువుగానే మిగిలి పోతాడు. మనిషిగా ఎదగడు. అది ఏ రంగమైనా కానీ, అతను అడుగు పెట్టిన చోట అంతుతేల్చి చూడందే అతనికి తృప్తిలేదు. అతను సృష్టికి ప్రతి సృష్టి చేస్తాడు. కానీ సృష్టిలో అతనూ ఓ భాగం ప్రతి క్షణం అతను అతన్ని నిర్మించుకోవాలి. స్వయంగా - "

రామనాథం వెనుక కొన్ని నీడలు గుసగుసలాడుకుంటున్నాయి. "ఏందిరా గీ ముసిలోడు పొద్దులస్తమానం ఈ చేల పడుంటడు ? "నరసింహం మనిషి భ్రుకటి ముడిపడింది.

"వాడు ముంగట మనల గురించి పైదాకా తీస్కపోయిండు. మన నరిసింహం దొర భూపాలు దొర అక్కడ్నే ఆపిన్రు లేకుంటెనా ? కిందుమీద యితుంటిమి ! "

"ఏమైనా వీడు ఖతర్నాక్ ఆద్మీ - ఊకూకే పరేషాన్ చేస్తుండు ఒక్కపారా రెండుపార్లా - ఎన్ని దరఖాస్తులు పెట్టిండు. ఇంగ సి.యంకు గిట్ల రాస్నా రాస్తడు - "

"ముసిలోన్ని ఎంత సేపురా - ముక్కుమూస్తే చాలదూ - "వాళ్ళు గిలిగింతలు పెడుతున్నట్లు నవ్వారు.

"దొరకు చెప్తమా ? "

"ఎందుకు రా ? దొర ఏం చెప్పిండు ? అడ్డమొస్తె ఎవల్లన్నా ఏసేయమనలె - "

"అంతే నంటవా ? "

"కాదుమరి ? ఈ ముసిలోడు సస్తే ఆ సేను గిట్ల దొర కొంటడు - గీ సారా నిషేధం ఎన్ని దినాలుంటుదో - దీపమున్నప్పుడే ఇల్లు దిద్దుకోవాలే - ఏంకాదు ఏసేద్దాం దొర ఇనాం ఇస్తడు."

"ముసిలోన్ని ఒక పాఠం చెప్దం - కొడ్కు తానకు పారిపోతడు - "

వాళ్ళు మెల్లిగా రామనాథం పొలంలోకి వచ్చారు. చకచక చేతికందిన మొక్కలన్ని పీకిపడేస్తూ, చేతుల్లో వేటకత్తుల్తో మొదళ్ళను చెలిగివేస్తూ మొక్కలను పూలను చిన్నాభిన్నం చేస్తూ రామనాథం వైపుకు దూసుకువచ్చారు.

రామనాథం గబగబ వాళ్ళ దగ్గరికి పరిగెత్తాడు.

"ఏంట్రా ఇది - పచ్చని పొలాన్ని అట్లాపాడు చేస్తున్నారు ? "

"పాడు జేస్తున్నమంట - "

వాళ్ళు పగలబడి నవ్వారు.

వాళ్ళకి ముసలి రామనాథం గోలగోలగా ఏడుస్తుంటే తమాషాగా వుంది. వాళ్ళు పగలబడి నవ్వుతూ మరింత ఉత్సాహంగా చేనంతా తొక్కుతూ మొక్కలు నాశనం చేస్తూ గందరగోళం చేస్తున్నారు.

రామనాథం నిస్సహాయంగా వాళ్ళందర్ని బతిమిలాడాడు. వాళ్ళను ఆపాలని విశ్వ ప్రయత్నాలు చేసాడు. చివరికి వాళ్ళ వాళ్ళకు చేతిల్లోచి వేట కత్తులకు అడ్డం కూడా పోయాడు. వాళ్ళు పదిమంది తన ఒక్కడు. భీభత్సం చేసేస్తున్నారు - విధ్వంసం చేస్తున్నారు సర్వనాశనం చేస్తున్నారు.

"శివుడూ - శివుడూ - "

రామనాథం హృదయవిదాకరంగా అరిచాడు.

అతని వయసు మీరిన గొంతు పీలగా సన్నగా గట్టు కూడా దాట లేకపోయింది. వాళ్ళు చేయాల్సినదంతా చేసి - రామనాథం దగ్గరికి వచ్చారు - "ఏంరా ముసిలోడా - వుంటవా పోతవా ? "

ఒకడు దూరం నుంచి అరిచాడు. "అప్పుడే ఏముంది - ముందుంది ముసళ్ళ పండగ "

అదేదో హాస్యానికన్నట్లు అందరూ నవ్వుకుంటూ మొక్కలను కసాపిసా తొక్కుకుంటూ వెళ్ళి పోయారు -

శివుడు పరిగెత్తుకు వచ్చేసరికి మొక్కలన్నీ చెల్లా చెదురుగా పడున్నాయి. వేళ్ళ కుదుళ్ళు ఆకాశాన్ని చూస్తున్నాయి. అందమైన బంగారు పొద్దు తిరుగుడు పూలు కసాపిసా నలిపేయబడి నల్లరేగడిలో పడిదొర్లుతున్నాయి.

రామనాథం పాతేసిన గుంజలా నిలబడిపోయి వున్నాడు.

"ఏంటి బాబాయ్ - ఇదంతా - "

రామనాథం ఏమీ మాట్లాడలేదు. కన్న బిడ్డను కోల్పోయిన తల్లిలా వుంది అతని పరిస్థితి. అతనికి నడిగడ్డ ప్రయాణమైవచ్చేముందు పెద్ద మామయ్య చెప్పిన మాట జ్ఞాపకం వచ్చింది. ఆ మాటే అతన్ని చెవుల్లో ప్రతిధ్వనించింది.

"పడగనీడలో విత్తనం మొలవదురా - "

'ఈ ద్వేషం, అసూయ ఈర్ష్య పగబట్టిన పాముల్లాంటివి ఏ క్షణం కాటేస్తుందో తెలియని ఆ పడగ నీడలో విత్తనం మొలుస్తుందా ? అలా మొలిపించాలను కోవడం అవివేకమా ?

కారణం ఏదైనా ఈనాడు పొలాలలోకి ఆయుధాలు అడుగు పెడుతున్నాయి

ఎన్నో వింటూనే వుంటాం - బాగా ఎదిగిన బత్తాయి తోటలు మొదలంటా నరికేసారు చెరుకుతోటకు నిప్పు పెట్టారు - కుప్పలు తగిలేసారు - ఇలాంటివే ఎన్నో - ఎన్నెన్నో రోజురోజుకీ ఈ వైషమ్యం బిగిసేదే కానీ తగ్గేది కాదు - రోజు రోజుకీ వ్యవసాయం పట్ల ఆసక్తి సన్నగిల్లుతోంది. పై నుంచి ఇలాంటి విద్వంసాలు వ్యక్తిగత కక్షలను తీర్చుకొనే పద్ధతి ఇదేనా ? వ్యక్తి మీద కోపం పచ్చని పంట మీద చూపిస్తారా ? దీనివల్ల నష్టపోయేది నేనొక్కడినేనా ? ఈ విత్తనాలు ఎక్కడెక్కడ ఉపయోగించబడతాయో ఆ క్రమమంతా ఈ నష్ట పోవడం లేదూ ? అయ్యో - ఎందుకింత సంకుచిత దృష్టిలో పంటలను చూస్తారు ?

పంట తగ్గితే - ఉత్పత్తి తగ్గుతుంది. ఉత్పత్తి తగ్గితే సరుకులు తగ్గుతాయి. సరుకులు తగ్గితే ధరలు పెరుగుతాయి. ధరలు తగ్గించండి అటూ, అందరూ గోలపెట్టేవారే - ఉత్పత్తిని పెంచమని ఎందుకు గోల పెట్టరు ? ఈ చేసే పోరాటాలు, సమ్మెలు, బంద్‌లు, అన్నీ ఉత్పత్తి నిరోధకాలే - ఉత్పత్తిని ఆటంకపరచకుండా విప్లవం సాధించుకోలేమా ? కొత్త ప్రపంచం నిర్మించుకోలేమా ?

మానవ మనుగడంతా ఉత్పత్తి మీదే ఆధారపడుతుంది. అది వ్యవసాయం లాంటి ఆర్థికపరమైన భౌతిక పరమైన ఉత్పత్తులే కావు మేధోపరమైనవీ - ఆత్మీకమైనవీ - మరేదైనా - మనిషి ఏ ఏ రంగంలో సాధించడగలడో అన్నీ రంగాల్లోనూ సృజించే ఉత్పత్తి - నిర్మించే ఉత్పత్తి సాధించే ఉత్పత్తి.

మీరు నినాదించండి - పోరాడండి. సాధించండి కానీ అవన్నీ విధ్వంసపూరకమైనవి కాకూడదు. నిర్మాణాత్మకమైనవి కావాలి. విధ్వంసం మానవ తత్వమే కాదు. హింస మనిషిలో మిగిలివున్న జంతుఛాయ.

సర్వనాశనం చేసి ఏం నిర్మిస్తారు ?

మనకు శాస్త్రం వుంది. వనరులున్నాయి. శ్రామిక శక్తి వుంది ఉత్పత్తి లేదు. ఎక్కడా లోపం ? ఆ లోపంపై దండెత్తాలి - ఆ లోపంపై పోరాడాలి. ఆ లోపం పూరించాలి.

నా వంతు నేను విప్లవం ప్రకటిస్తున్నాను. విశ్వసౌభాగ్యం కోసం ! విత్తనాలేనా ఆయుధాలు పంటే నా సాధన !! ఉత్పత్తే నా ధ్యేయం !!!'

"ఏంటి బాబాయ్ - అట్లా ఉలుకూ పలుకూ లేకుండా నిలబడి పోయావ్ - "

శివుడు కంగారుగా రామనాథాన్ని పట్టి వూపాడు.

"వాళ్ళు మనల్నిక్కడ నిలవనిచ్చేట్లు లేరు ..... "

"ఏం చేస్తార్రా ? ప్రాణాలు తీస్తారా ? తీసుకోమను ! కానీ విత్తనాలతో ముడిచిన ఈ పిడికిలి దౌర్జన్యానికి లొంగదు మనం ఈ నడిగడ్డను వెతుక్కుంటు వచ్చాం. గనిగడ్డను చేసాం. మనల్ని మన గడ్డ మీదే నిలవనీయని విషాద పరిస్థితే వస్తే - మరో నడిగడ్డకు పోదాం ! ఈ భారతదేశంలో నదులకేం కొదువ ? నడిగడ్డలకేం కొదువ ? ఈ గడ్డ మనతో మమేకం చెందకముందే మనం దీనిని మనగడ్డగా భావించాం. మమేకమయ్యాం. తాద్యాత్మ్యం చెందాం. ఈనాటికీ మనల్ని పరాయి వాళ్ళలాగా ఈ గడ్డ నుంచి వేరు చేసి చూస్తే - ఈ పరిణామం తప్పదు ! ఈ పోరాటం తప్పదు ! మరో నడిగడ్డను గనిగడ్డను చేసేవరకూ ....... ! " రామనాథం కంఠం ఖంగుమంది. శివుడు రామనాథం ముఖంలోకి విస్మయంగా చూసాడు.

రామనాథం కంఠంలో విశ్వాసం గుసగుసలాడుతుండగా అన్నాడు.

"శివుడూ, పొలం మళ్ళీ దున్ను - కొత్త విత్తనాలు ఏదపెడదాం వాళ్ళు మొక్కల్ని నాశనం చేసారేమో - విత్తనాల్ని కాదుగా ! రేగడి విత్తులు విధ్వంసానికి లొంగవు. రేగడి వున్నంత వరకూ మబ్బు ఉరిమినంత వరకూ సూర్యుడు ఉదయించినంత వరకూ విత్తులు మొలకెత్తుతూనే వుంటాయి.

నా రేగడి విత్తులు చిరంజీవులు ! "

❋ ❋ ❋

"నాగలేమొ అంటగట్టి నాడిగడ్డ[1] దున్నినాడు
ఏ సెనసన్న ఏటిగడ్డ - ఎఌ్ఌజొన్ననో - సై -
మొలుకలేమొ మొలుస్తాయి సుక్కవోలె మెరుస్తాయి ...



---

1 నడిగడ్డ

# నవల కోసం

తానా సభలకు నవల పోటీయా ? ఎందుకు ?

తానా భాష పేరునా, సంస్కృతి పేరునా పెట్టుకున్న సంస్థ కదా అలాటి పనులు చేస్తే బాగుంటుంది !

1,20,000 రూపాయల బహుమతా ? ఎందుకంత ?

జ్ఞానపీఠ్ బహుమతిని మించి ఉంటే బాగుంటుంది జ్ఞానపీఠ్ కూడా ఎప్పుడో పాతిక, ముప్పై ఏళ్ల క్రితం నిర్ణయించారు ఈ పాటికి రెండు మూడు సార్లు పెంచి ఉండాల్సింది ఇండియాలో పత్రికా సంస్థల్ని ఓ పాటిగా కదిలించేదిగా అయితే కూడా బాగుంటుంది.

పెద్ద బహుమానం పెట్టగానే మంచి నవలలొస్తాయని గ్యారంటి ఏమిటి ?

ఏమీలేదు

వస్తే రావచ్చు. మంచిది రాకపోతే యివ్వపనిలేదు

ఎవరికొస్తుందంటారు ? ఏమో !

నవలలు మథించవలసిన విషయాలు దేశంలో కోకొల్లలుగా ఉన్నాయి మంచి రచయితలుంటే కలం పడితే కళాత్మకమైన విలువలతో బ్రహ్మాండమైన నవల్లు బోల్డురావాల్సి ఉంది. అవకాశము, స్ఫూర్తి కల్పించడం సంస్థల బాధ్యత రాయకపోతే రచయితలు తప్పు !

మధ్యతరగతి జీవితాలు, గ్రామీణ జీవితాలు, సహస్రేతర వృత్తివ్యాపార వ్యవహారాలు, మురికి వాడలలోని జీవితాలు, దళిత వర్గాలలోని రచయితలకు మాత్రమే అర్థంకాగల జీవితాలు - ఎన్నో, ఎన్నెన్నో కోటానుకోట్ల బ్రతుకులు ఎలా ఉంటాయో, ఎందుకలా ఉంటాయో చూపించగల రచనలు వేలాదిగా రావాల్సి ఉంది

అందుకే రచయితలకు ప్రోత్సాహం కావాలి. వ్రాసే ప్రకృతి గల మనుషులు అంతఃస్ఫూర్తి మూలాన వ్రాస్తూనే ఉంటారు. బయట నుండి కూడా కొంచెం కుదుపు వస్తే మరింత కదలిక కలగచ్చు అందుకే తానాలు, ఆటాలు, పత్రికలు, ఇతర సాహితీ సంస్థలు తమను తామే కొంత కదల్చుకోవాలి.

ఎవరికొస్తుందో ?

ఎవరి కొస్తేనేం ?

ఎవరు వ్రాస్తేనేం ?

నవల మంచిది కావాలి !

కాకపోతే ఇవ్వద్దు !

అంత డబ్బా ?

కొంత నే చందాల ద్వారా పోగు చేస్తాగా !

ముద్రణకు, టిక్కెట్టుకు తానా పెట్టుకుంటే, బహుమతికి కావాల్సిందే నే కూరుస్తాగా !

ఎవరి కొస్తుందో ?

ఎవరి కొస్తేనేం ?

★ రేగడి విత్తులు

ఇందులో ఏమన్నా కనిపించని ఎజండా ఉందా ?

ఉంది ! ఉండే ఉంటుంది !

అబ్బే లేదు ! ఏవుంటుంది ?

మనవాళ్లకే వస్తుంది !

మనవాళ్ళకి ఎలానూ రాదు !

ఎవరు మనవాళ్ళు ? ఆ ! ఎవరండీ మనవాళ్ళు ???

డబ్బు తగల బెడుతున్నారు ఇండియాలో వాళ్ళకి మనం ఎందుకు చెయ్యాలి మనకు వాళ్ళు ఏం చేస్తున్నారే?

ఇండియాలో వాళ్ళకే కాదు. ఎక్కడవాళ్లైనా వ్రాయచ్చు

మాకసలు ఈ వార్త చేరనే లేదు !

వార్త అందుకోవాలన్నా కొంత ప్రయత్నం చెయ్యాలి సోదర, సోదరీమణులారా

ఎవరికొస్తుంది ? ఏమో ! ఎవరికీ రాకపోవచ్చు. దేనికి పడితే దానికి పట్టం కట్టం

పెద్ద పత్రికలు - అబ్బే మా పోటీలు మేవే పెట్టుకుంటాం. మీతో కలవం

ఆహ్వానం - అలాగేనండి అలాగే చేద్దాం.

ప్రకటన రచనలు రావడం. పేర్లు లేకుండా తీసేసి జడ్జిలకి వెళ్ళడం ఎవరురాశారో తెలీకుండా వాళ్ళు చదివి ఏకగ్రీవంగా ఒకే నవలని ఎన్నుకోడం. దాని పేరు రేగడి విత్తులు కావడం రచయిత పేరు రచయిత్రి కావడం రచయిత్రి పేరు చంద్రలత కావడం

ఆహ్వానం లక్ష్మిగారికీ, అస్మిత ఓల్గాగారికీ, కేతు విశ్వనాథరెడ్డిగారికీ, అబ్బూరి ఛాయాదేవిగారికీ, సరిపల్లె కనక ప్రసాద్‌కూ, జంపాల చౌదరికీ, చందాబాద్ అన్న వారందరికీ కృతజ్ఞతలు చెప్పడం.

నవలా ప్రయత్నం కొనసాగాలి. మంచి పంటలెన్నో పండాలి. నవల సేద్యగాళ్ళు కృషిస్తూనే ఉంటారు తానాలు ఆటాలు ఆ క్షేత్రాలను పట్టించుకోపోతే తప్పు ! మహాపాపం చుట్టుకొంటుంది !

నవలలేవిటి ? ఇతరమైనవి ఎన్నో ! అన్నిట్నీ పట్టించుకోవాలి కీర్తిమంతులనూ, అధికారవంతులనూ, ధనవంతులనూ, పరపతి గలవాళ్ళనూ ఎందరో పట్టించుకుంటారు అవిలేని వాళ్ళను పట్టించుకోవడంలోనే ఉంది ప్రగతి !

అసలు గొడవంతా అక్కడే ఉంది !!!

చైర్మన్

తానా - 97 సావనీర్ కమిటీ

మురళి చందూరి

క్లేర్‌మౌంట్, లాస్ ఏంజిల్స్

# నవల గురించి

## తెలుగు నవలకు కొత్త ఊపిరి

నూటపాతికేళ్ళ వయస్సున్న తెలుగు నవల మొదట్లో ఆంగ్ల సాహిత్యంపైనా, జానపద సాహిత్యంపైనా ఆధారపడ్డా, ఈ శతాబ్దపు ప్రథమార్థంలో తెలుగు సాంఘిక జీవనానికి అద్దంబట్టే మంచి నవలలెన్నో వచ్చాయి ఉన్నవ లక్ష్మీనారాయణ పంతులుగారి మాలపల్లి ప్రచురణ (1922) తెలుగు నవలా చరిత్రలో ఒక మైలురాయి తెలుగుతనాన్ని సంతరించుకున్న ఈ నవల ఇతివృత్తంలోనూ, పాత్రచిత్రణలోనూ, సాంఘిక రాజకీయ జీవన స్థితుల వర్ణనలోనూ, అభ్యుదయ సామాజిక దృక్పథంలోనూ కొత్త ప్రమాణాలను నెల్కొల్పింది ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 1934లోన నిర్వహించిన తెలుగు నవలల పోటీలో ప్రథమ బహుమతి పొందిన అడవి బాపిరాజు నారాయణరావు, ద్వితీయ బహుమతి పొందిన విశ్వనాథ సత్యనారాయణ వేయిపడగలు తెలుగు జీవన సరళిని స్పష్టంగా చిత్రీకరించాయి. అప్పటినుండి తెలుగు నవలా సాహిత్యం విస్తరిస్తూనే ఉంది కుటుంబ జీవితం, మానవ సంబంధాలు, సాంఘిక సమస్యలు వస్తువులుగా చాలా నవలలు ప్రచురించబడ్డాయి ఈ శతాబ్దం అరవయ్యో దశకంలో నవలారచనలో స్పష్టమైన మార్పు వచ్చింది ప్రేమ, వియోగం, త్యాగం, అపార్థాలు ముఖ్య వస్తువులుగా ఉన్న నవలలకు ప్రాధాన్యత హెచ్చింది ఎనభయ్యో దశకంలో ఈ ప్రేమ వస్తుగతమైన నవలలకు ప్రాధాన్యత తగ్గి క్రైమ్, థ్రిల్, సెక్స్ ముఖ్య వస్తువులుగా ఉన్న నవలలకు ప్రాచుర్యం పెరిగింది ఈ నేపథ్యంలో తెలుగులో మంచి నవలలు వెలువడటం తగ్గింది మంచి సాహిత్యానికి కొమ్ముకాసిన అనేక పత్రికలు మూతబడ్డాయి సర్క్యులేషన్ పెంచుకోవటమే ముఖ్యమయిన పత్రికలలో ఎస్కేపిస్ట్ సాహిత్యం రాజ్యమేలుతుంది.

ఈ శతాబ్దం ప్రారంభం నుండి 1955 దాకా తెలుగువారి జీవన విధానంలో ఎలాంటి మార్పులు వచ్చాయో అప్పటి వరకు ప్రచురించబడిన కొన్ని నవలల ద్వారా స్పష్టంగా తెలుసుకోవచ్చు మాలపల్లి, వేయిపడగలు, నారాయణరావు, కొడవటిగంటి కుటుంబరావు చదువు, బుచ్చిబాబు చివరకు మిగిలేది, గోపీచంద్ చీకటిగదులు, మహీధర్ రామ్మోహనరావు కొల్లాయి గట్టితేనేమి, ఉప్పల లక్ష్మణరావు అతడు-ఆమె వంటి నవలలు ఆ కాలపు సాంఘిక రాజకీయ పరిస్థితుల గురించి, తెలుగు జీవితంలో వచ్చిన మార్పుల గురించి వివరంగా తెలుపుతాయి. పెద్ద కాన్వాసుపై చిత్రించిన పానోరమిక్ చిత్రాలు ఈ పుస్తకాలు అయితే 1960 తర్వాత వచ్చిన నవలల్లో ఇంత విస్తృతంగా సాంఘిక జీవన పరిణామాల గురించి చర్చించిన నవలలు అరుదు. అంటే ఈ కాలంలో మంచి నవలలు రాలేదు అన్న ఆక్షేపణ కాదు, ఈ మధ్యలో నామిని మునికన్నడి సేద్యం, స్వామి గద్దలాడతండాయి, కేశవరెడ్డి ఇంక్రెడిబుల్ గాడెస్ వంటి నవలలు రాకపోలేదు అయితే ఈ నవలల వస్తువు కొన్ని సంవత్సరాలకో లేక కొన్ని సంఘటనలకో పరిమితం

వ్యాపార సాహిత్యపు తాకిడి నుంచి గత ఏడెనిమిదేళ్ళలో కొంత వరకూ తెలుగు కథ, కవిత బయటపడినా తెలుగు నవల ఇంకా ఆ విషవలయంనుంచి బయటపడలేదు కాలంలో వచ్చిన మార్పులు చర్చించే నవలలను ప్రచురించే పత్రికలు, ప్రచురణకర్తలు తక్కువ అవటంతో రచయితలకు ప్రేరణ,

ప్రోత్సాహం తగ్గిపోయింది. ఈ నేపధ్యంలో కమర్షియల్ సంస్కృతి ప్రభావంలో చిక్కుకుపోయి విలవిల్లాడిపోతున్న తెలుగు నవలకు కొత్త ఊపిరి పోయటానికి 11వ తానా సమావేశపు సావెనీర్ కమిటీ సంకల్పించింది. "తెలుగువారి జీవితంలోని ఆంతర్యాన్ని, గత కొన్ని దశాబ్దాలుగావారి జీవితంలో వస్తున్న చెప్పుకోదగిన మార్పుల్ని కళాత్మకంగా చూపగల్గిన అత్యుత్తమ శ్రేణి నవల"లను ప్రోత్సహించటానికి ఇంతకు ముందెన్నడూ ఎరగని 1,20,000 రూపాయల బహుమతిని ప్రకటించింది. తెలుగు సాహిత్యంలో నవలల పోటీలు సాహిత్య పరిణామాన్ని నిర్దేశించటం కొత్త గాదు. దాదాపు వందేళ్ళ క్రితం వీరేశలింగం పంతులుగారి చింతామణి పత్రిక నిర్వహించిన పోటీలు కలకాలం నిలిచే నవలల రచనకు కారణమవటం గురించి ఇంతకు ముందే చెప్పుకున్నాం. 1962లో ఆంధ్రప్రభ వారపత్రిక నిర్వహించిన నవలల పోటీలో ప్రధమ బహుమతి పొందిన కోడూరి కౌసల్యాదేవి చక్రభ్రమణం తెలుగు నవలను కొత్త మలుపు తిప్పింది. అలాగే ఇప్పటి పోటీ కూడా తెలుగు నవలా సాహిత్యం ఇంకో మలుపు తిరగడానికి దోహదపడాలని, వాస్తవిక జీవితం ప్రాతిపదికగల పుస్తకాలు వ్రాసే రచయితలను ప్రోత్సహించాలనీ తానా కోరుకొన్నది. ఈ పోటీలో ప్రధమ బహుమతి పొందిన శ్రీమతి పైడి చంద్రలతగారి నవల 'రేగడి విత్తులు' తానా కోరికను నెరవేర్చే స్థాయిలోనే ఉందనే నా అభిప్రాయం.

కొన్ని పుస్తకాలు పాఠకుల్ని ఉత్కంఠాభరితుల్ని చేసి గబగబా పేజీలు తిప్పించేస్తాయి. ఇంకొన్నిటిలో వస్తువు ఎల్లా ఉన్నా రచయిత శైలి మనస్సును ఆకట్టుకొంటుంది. కొన్ని నవలలు మానవ సంబంధాల్ని సున్నితంగా, అందంగా చిత్రిస్తూ పాఠకుల్ని వేరే లోకానికి తీసుకువెళతాయి. మరికొన్ని నవలలు దేశకాల పరిస్థితుల్ని అద్దంపట్టినట్లు చిత్రిస్తాయి. కొన్ని నవలలో పాత్రలు కలకాలం గుర్తుండిపోతాయి. కొన్ని నవలలు చదవటం పూర్తయ్యాక ఆ పాత్రల గురించి, సంఘటలన గురించి చాలాసేపు ఆలోచించవలసి వస్తుంది. చాలాకొన్ని పుస్తకాలు మాత్రం పైన చెప్పిన లక్షణాలన్నీ కలిగి ఉంటాయి. తానా నిర్వహించిన ఈ మొదటి నవలల పోటీలో ప్రధమ బహుమతి పొందిన 'రేగడి విత్తులు' ఆఖరుకోవకు చెందిన పుస్తకం. ఈ పుస్తకంలో దాదాపు ముప్పై సంవత్సరాల తెలుగు గ్రామీణ జీవిత చిత్రణ ఉంది. వాసిరెడ్డి సీతాదేవి మట్టిమనిషి తరువాత ఇంత విస్తృతంగా గ్రామీణ జీవితాన్ని చిత్రించిన నవల ఇదేనేమో.

'నేనేమి సేతూ, సేనెట్లు గాతూ' అంటూ ముసలి లచ్చుమమ్మ పాడుకుంటున్న పాటతో మొదలయ్యే ఈ నవల ముఖ్యాంశం భూమికి రైతుకీ ఉన్న సంబంధం. కధానాయకుడు రామనాధం 'పొలమే బలం' అని నమ్మినవాడు. 'మేఘంలో నీళ్ళు చూసి జడ్డిగంలో విత్తులు ఒలకబోసే వ్యవసాయం కాదు, ఫలసాయాన్ని పెంచే వ్యవసాయం' చేయాలన్నది అతని ఆశయం. ఎన్ని ఎదురుదెబ్బలు తిన్నా, ఎప్పటికప్పుడు కొత్త మార్గాలు వెదుక్కుంటూ, మార్గం లేని చోట కొత్త మార్గాలు నిర్మించుకుంటూ పోవటం అతని అలవాటు. దొర తనకు భూమిని అమ్మటం అతనికి ఆశ్చర్యం. బంగారం పండే భూమిని చేపలదొరువులుగా చేసేవాళ్ళను చూస్తే అతనికి జాలి. తన కుమారుడే తనని కాదని భూమిని బేరానికి పెడుతుంటే అతనికి బాధ. అందరూ వదిలేసి వెళ్ళినా తాను మాత్రం భూమిని వదలలేడు. ప్రత్తి పండకపోతే ప్రొద్దుతిరుగుడు పూలైనా పండించటానికి సిద్ధం. రామనాధానికి భూమిపైనే కాదు తన చుట్టూతావున్న ప్రతి ఒక్కరి మీదా మక్కువే. తనకు నష్టం వచ్చినా సరే పదిమందికి మంచిచేయటం అతని స్వభావం. పనిమనిషి పొరపాటువల్ల చేతికి వచ్చిన ప్రతి పంట మంటపాలైనా,

కోడలు నిర్లక్ష్యంవల్ల విత్తనాల వ్యాపారంలో లక్షలు నష్టం వచ్చినా సంయమనం కోల్పోని స్థితప్రజ్ఞుడు తనవల్ల తోటి రైతులు నష్టపోయారని తోచినప్పుడు వేరే ఆలోచన లేకుండా ఆ నష్టాల్ని భరిస్తాడు కథాంతం నాటికి కూడా రామనాథం తనకు కథా ప్రారంభంలో ఉన్న గుండె నిబ్బరం, ప్రాపంచిక దృక్పథం కోల్పోడు మట్టితో అతనికి ఉన్న అనుబంధం, మట్టిపై అతనికి ఉన్న నమ్మకం మారవు దేశంలో హరితవిప్లవానికి రామనాథంలాటి వైతాళికులే కారణం రామనాథం పాత్ర చిత్రణలో రచయిత్రి చాలా ప్రజ్ఞ చూపారు

రేపల్లె ప్రాంతపు రైతు కుటుంబానికి చెందిన రామనాథం ఆడిటర్‌గా ప్రభుత్వ ఉద్యోగం చేస్తూ, ఈ కథా ప్రారంభం నాటికి (1960 దశకపు తొలిరోజులు) మహబూబ్‌నగర్ జిల్లా నడిగడ్డ ప్రాంతంలో ఉద్యోగరీత్యా ఉంటూ అక్కడి భూమిని చూసి ముచ్చట పడతాడు అతనిలోని రైతు రక్తం సరిగా సాగుచేస్తే ఆ నడిగడ్డ గనిగడ్డే అవుతుందని చెపుతుంది కొంత అమాయకత్వంతోనూ, కొంత ఆవేశంతోనూ, ఉమ్మడి కుటుంబంలో మిగతావారి మాట కాదని, ఉద్యోగం మానేసి, ఉన్న భూమి అమ్మేసి, భార్యతో ఈ కొత్త ప్రాంతానికి వచ్చి, ఊరు వదిలివెళ్తున్న నరసింహం దొర భూమిని కొనుగోలు చేసి ఆ బీళ్ళలో సేద్యం మొదలుబెడతాడు ఆ ప్రాంతపు రైతు బాలయ్య అతనికి సాయంగా నిలుస్తాడు అక్కడికి తుంగభద్ర కాలువ రావటంవల్ల, సేద్యంలో శాస్త్రీయమైన కొత్త పద్ధతులు వాడటంలో రామనాథం చేసిన చొరవ వల్ల రామనాథం దంపతులు పడ్డ కష్టానికి తగ్గ ప్రతిఫలం వస్తుంది సరైన ప్రత్తి విత్తనాలు దొరక్క దెబ్బతిన్న రైతుల్ని చూసి చలించిన రామనాథం మంచి విత్తనాలు ఉత్పత్తి చేసే పద్ధతుల్ని నేర్చుకొని, 'రేగడివిత్తులు' పేరుతో అందరికీ అందించి ఆ ప్రాంతపు అభివృద్ధికి దోహదం చేస్తాడు రామనాథం కుటుంబం అభివృద్ధి చూసి, ఒక్కరొక్కరుగా మిగతా బంధువులూ, ఇతరులూ అక్కడకు వచ్చి భూములు కొని వ్యవసాయం మొదలుబెట్టడంతో ఆ బీడు ఊరవుతుంది రోడ్డు, కరెంటు, బస్సులాటి కొత్త సౌకర్యాలు ఏర్పడతాయి. ఈ సౌకర్యాలతోపాటే సారా అంగళ్ళు, బస్తీ తిరుగుళ్ళు, గూండా రాజకీయాలు వంటి వైపరీత్యాలు కూడా పెరుగుతాయి రామనాథం ఆ ఊరు వచ్చిన ముప్పై సంవత్సరాలకు, ఊరు వదలిన దొర తాను అమ్మిన భూముల్నే మళ్ళీ కొనుక్కొని రామనాథం బంగారం పండించిన భూమిలోనే వ్యవసాయం మానేసి సారా బట్టీలు పెడతాడు. పంటల్లో నష్టాలు వచ్చినా, బంధువులు, కుటుంబసభ్యులు స్వార్థచింతనతో రామనాథాన్ని వదిలివేసినా, భూమిని నమ్మిన రామనాథం తన ప్రయత్నాలు మానడు

రైతులందరికీ భూమి మీద ఈ నమ్మకం, ఈ మక్కువ ఉండవు. రామనాథం భూమి అమ్ముతుంటే అతని అన్న రత్తయ్య విలవిల్లాడాడు. రామనాథానికి భూమి అమ్మటానికి నరసింహం దొరకి ఏ బాధా లేదు రత్తయ్యకు భూమి ప్రాణం; నరసింహం దొరకు భూమి ఆస్తి మాత్రమే ఏనాడైతే రైతుకు మట్టితో ఉన్న మమేకభావన పోయి అధికారభావన వస్తుందో, ఆరోజే ఆ మట్టితో ఉన్న ఆత్మిక బంధం తెగిపోతుంది, రైతుగా పతనం ప్రారంభం అవుతుంది అనుకొంటాడు ఆ సమయంలో రామనాథం రామనాథం తరపు విలువలు ఆ కుటుంబంలోనే తరవాతి తరాలకు లేవు పంటలు లాభదాయకం కాదని తెల్చుకొన్న కుమారుడు సుధాకర్ భూమి అమ్మేసి వ్యాపారం చేయటానికి పట్నం పోవటానికి సిద్ధపడతాడు. ఇప్పుడు సుధాకర్‌కు కూడా ఈ భూమి ఆస్తి మాత్రమే మారుతున్న తరాలలో విలువలు మారడం సహజం. దాదాపు నలభై ఏళ్ళల్లో రామనాథం కుటుంబంలోనూ, వారి పరిసరాల్లోనూ మారుతున్న విలువల్ని చిత్రీకరించటంలో రచయిత్రి పరిశీలనాశక్తిని గమనించవచ్చు కనిపిస్తుంది

రైతుకూ, మట్టికీ ఉన్న సంబంధమే కాక ఈ నవలలో అంతర్గతంగా చాలా ఇతర విషయాలు ఇమిడి ఉన్నాయి. వాటిలో ముఖ్యమయింది వలస జీవితం. కొత్త వనరులు వెతుక్కుంటూ వలసపోవటం అనాదినుంచీ ఉన్నదే అయినా, గత అయిదారు దశాబ్దాల తెలుగు జీవితంలో వలస పోరాటం చాలా ఎక్కువ అయింది. ఉద్యోగాల కోసం, వ్యాపారంకోసం, భూమికోసం, భుక్తి కోసం, ఉన్నవూరు వదిలిపెట్టి కొత్త ప్రాంతాలకు వెళ్ళి స్థిరపడే ప్రయత్నాలు చేయడం ఇప్పుడు సర్వసామాన్యమయింది అయినా ఈ వలసపోవటం నేపథ్యంగా కానీ, ముఖ్య వస్తువుగా కానీ వచ్చిన తెలుగు నవలలు తక్కువ దాదాపు 35 ఏళ్ళ క్రితం పుస్తక ప్రపంచంలో పత్రికలో ఆరుగురు రచయితలు కలసి వ్రాసిన 'పల్లె-పట్నం' తరువాత అలాటి నవలలు వచ్చినట్లు గుర్తులేదు. (వలస వచ్చిన తెలుగువారి సంస్థ నిర్వహించిన ఈ మొదటి నవలల పోటీలో రెండు ఫైనలిస్టు నవలలో ముఖ్యాంశం 'వలస' కావటం విశేషం). 'తాత ముత్తాతల కాలం నుంచీ ఇంత కూడెట్టిన భూమి తల్లిని పరాయి పాల్జేసి రామనాథం వేరే ప్రాంతానికి వెళ్ళిపోతానంటుంటే కుటుంబసభ్యులెవ్వరికీ సమ్మతం కాదు 'కళకళలాడుతున్న మామిడిచెట్టు మొదలంటా పెరికి మరోచోట నాటటం' వంటి వెర్రివెంగళాయ ఆలోచన అని వారి అనుమానం అమెరికా వెళ్తున్న ప్రక్కింటివారి అల్లుడు చలపతి భవిష్యత్తుకంటే నైజాం వెళ్ళి వ్యవసాయం చేస్తానంటున్న రామనాథం భవిష్యత్తంటేనే దగ్గరవారందరికీ భయం కష్టం సుఖం చెప్పుకోవటానికి దగ్గరివారు లేని పరాయిసీమలో నిలువధనం లేకుండా బ్రతుకుతెరువుకై పోరాటం సాగించడం కష్టమైన విషయం కొన్నివేల మైళ్లదూరం అమెరికాకి వలసవచ్చిన మాబోటివాళ్లకు జీవిత విధానాలపైన ఈ కొత్త సంస్కృతి ప్రభావం విస్పష్టంగా తెలుస్తుంది. కాని దగ్గిర ప్రాంతాలకు వలసపోయినప్పుడు ఈ ప్రభావాన్ని గుర్తించటం కొద్దిగా కష్టం. మాట్లాడే భాష ఒక్కటే అయినా రామనాథం పెరిగిన చోటుకీ, వెళ్ళిన గడ్డకీ మధ్య చాలా తేడా. మాటతీరు వేరు, రోజువారీ తిండి వేరు, సేద్యం పద్ధతులు వేరు, ఆచారాలూ, అలవాట్లూ వేరు ఈ రచయిత్రి ఆంధ్రదేశంలో ఒక ప్రాంతం నుండి ఇంకో ప్రాంతానికి వలసపోవటం పరిణామాలను చిత్రించటంలో కృతకృత్యులయ్యారు

ఇప్పటి అమెరికా తెలుగువాళ్ళు తమ వలసజీవిత పరిణామాల గురించి ఆలోచించేటప్పుడు ముందు నిలిచే విషయం ఈ కొత్త వ్యవస్థలో పిల్లల పెళ్ళిళ్ళు. అదే సమస్య ఈ నవలలో వలసపోయిన వాళ్ళకీ ఎదురవుతుంది. రామనాథం చెల్లెలి కూతురు అనూరాధ. చిన్నప్పుడే తల్లిదండ్రుల్ని కోల్పోయిన అనూరాధ మేనమామల ఇంట్లో పెరిగింది మేనబావ సుధాకర్ ఆమెపై ప్రేమ పెంచుకొన్నాడు అయితే అతనిని ఆ దృష్టితో చూడలేని అనూరాధ మేనమామ సహకారంతో సుధాకర్ స్నేహితుడు మల్లేశ్‌ని పెళ్ళాడుతుంది. మల్లేశ్ తండ్రి బాలయ్య రామనాథం నడిగడ్డలో స్థిరపడటానికి సహాయం చేసినవాడు అతని భార్య నారాయణమ్మ ఈ సంబంధమంటే ముందు వెనుకాడుతుంది. కోడలు అలవాట్లు, ప్రవర్తన ఆమె సంస్కృతికి బయటివి. అత్తమామల ఇల్లు, వాళ్ల అలవాట్లు, ఆచారాలు అనూరాధకు అంతకుముందు పరిచయం లేనివి వివాహం జరిగిన కొన్నేళ్ళదాకా కోడలు నీళ్ళాడకపోవటం అత్తగారికి దుర్భరమవుతుంది ఎలాగైనా కోడలు కడుపు పండించటం కోసం తన నమ్మకాల పరిధిలో అత్తగారు చేసే ప్రయత్నాలు కోడలు భరించలేకపోతుంది కొన్నాళ్ళు కష్టపడినా, తనదంటూ ఒక వ్యక్తిత్వాన్నీ, ఉనికినీ పెంచుకొంటుంది అనూరాధ రెండు తరాల, రెండు సంస్కృతుల మధ్య సంఘర్షణ ఈ సన్నివేశాలలో అద్భుతంగా చిత్రీకరించారు రచయిత్రి. అనూరాధ గుండెనిబ్బరం, విచక్షణాశక్తి ఈ నవలలో ఆమెకు ప్రత్యేక స్థానాన్నిస్తాయి

భూమిని నమ్ముకున్న రామనాథం జీవితం ముఖ్య కథ అయితే, అతని చుట్టూతా ఉన్న మిగతా వ్యక్తుల జీవితాలు ఈ నవలలోని ఉపకథలు, రామనాథం భార్య సావిత్రి, తల్లి పున్నమ్మ, అన్న రత్తయ్య, అమెరికా వెళ్ళిన మిత్రుడు చలపతి, తండ్రి మూలాన తన ప్రేమ సఫలం కాలేదని మనస్సు విరుచుకున్న రామనాథం కొడుకు సుధాకర్, బాలయ్య దంపతులు, జీతగాడు సవారి, పట్నంలో పక్కింటి ఇంజనీరుగారి కుటుంబం, ఇంకా ఎందరో గుర్తుండిపోయే వ్యక్తులు ఈ కథలో ప్రత్యక్షమవుతారు. వారిలో ముఖ్యులు ఇంతకు ముందు చెప్పుకున్న అనూరాధ, రామనాథం అన్నకొడుకు శివుడు. కథా ప్రారంభం నాటికి శివుడు స్కూలుకెళ్ళే పిల్లడు చదువు సరిగా వంటబట్టని శివుడు బాబాయికి తోడుగా నడిగడ్డ వచ్చి అక్కడి బీళ్ళని పొలాలు చేయటంలో రామనాథంకంటే ఎక్కువగా కష్టపడతాడు బాబాయి అన్నా, భూమి అన్నా శివుడికి ఉన్న ప్రేమ, అతని భార్య భారతి సహనం రామాయణంలో లక్ష్మణుడు, ఊర్మిళలను తలపిస్తాయి. నడిగడ్డ వచ్చిన కొత్తలో శివుడి మానసికస్థితిని, కాలం అతనిలో తెచ్చిన మానసిక పరిణామాన్ని చాలా నిశితదృష్టితో చిత్రీకరించారు రచయిత్రి.

తెలుగు పల్లెటూరి జీవితం గురించి రచయిత్రికి ఉన్న పరిచయం, ఆ జీవితాన్ని చిత్రించటానికి ఆవిడ వాడిన భాష నన్ను ఆకర్షించాయి. కథలో కొందరు రేపల్లెనుంచి వచ్చినవారైతే, మరికొంతమంది నడిగడ్డ స్థానికులు రెండు ప్రాంతాల మధ్య వాడుకభాషకు, పలుకుబళ్లకూ, ఆచారాలకూ, దైనందిన జీవితవిధానానికీ చాలా తేడా ఉంది. రచయిత్రి ఈ రెండు మాండలికాల మధ్య అవలీలగా సంచరించారు. రామనాథం స్వగ్రామం వెళ్ళినప్పుడు చిత్రీకరించిన గ్రామం వేరు, భాష వేరు, సంభాషణల తీరు వేరు. నడిగడ్డ గ్రామం వేరు, అక్కడి కూలీల భాష వేరు, బాలయ్య ఇంట జరిగే సంభాషణల తీరు వేరు ఈమెకు వ్యవసాయం గురించి చాలా తెలుసు. రెండు ప్రాంతాల్లోనూ వ్యవసాయం సందర్భంగా ఉపయోగించే సాంకేతిక పదజాలం కూడా బాగా తెలుసు. అంతేకాదు, ఎక్కడ ఏ మాట బాగా నప్పుతుందో తెలుసు. నవలలో ఎక్కడ జానపదగీతం చక్కగా అమరుతుందో, ఎక్కడ సూర్యనారాయణ స్తోత్రం ఆలపించాలో రచయిత్రికి చక్కగా తెలుసు. బలమైన వస్తువు ఉన్న ఈ నవలకు మెరుగులు దిద్ది ఆమూలాగ్రం చదివించేలా చేస్తుంది రచయిత్రి శైలి

ఈ నవలలో తాటిముంజలు, సీతాఫలం గింజలు, కాగడామల్లెలు, కరెంటుచీమలు, పల్లెటూరి ఆప్యాయతలు, పట్నం కాలేజీలో ఆడపిల్లల పాట్లు, పొలాల్లో నాట్లు, కుప్పనూర్పిళ్ళు, పంటల అమ్మకాలు, సీతాఫల్ పండుగలు, సంక్రాంతి సంబరాలు, పెళ్ళి సందళ్ళు చాలా సహజంగా ఇమిడిపోతాయి తెలంగాణా వేర్పాటు ఉద్యమం, ప్రత్తి లాంటి వ్యాపారపంటలు, చేపలదొరువులు, సారాదుకాణాలు తెలుగునాట తెచ్చిన మార్పులు ఈ నవల కళ్ళకు కట్టినట్టు చూపిస్తుంది. ఊరికి వచ్చిన రామనాథానికి తల్లి పున్నమ్మ కబుర్లు చెప్పే సన్నివేశమైతేనేమి, నడిగడ్డ వెళ్ళిన కొత్తలో సావిత్రి ఒంటరితనాన్ని వర్ణించేటప్పుడైతేనేమి, సీతాఫల్ పండుగనాడు కాలేజీ పిక్నిక్‌లో సుధాకర్ మల్లేశ్‌ల కేరింతలైతేనేమి, వేర్పాటువాదులు దాడిచేస్తుంటే ప్రాణభయంతో దాక్కోవటమైతేనేమి, సన్నివేశాల్ని కళ్ళకు కట్టినట్టు చిత్రీకరించటంలో అద్భుతమైన నైపుణ్యాన్ని ప్రదర్శించారు రచయిత్రి. సుధాకర్ అనూరాధపై తన ప్రేమను గుర్తించిన సన్నివేశాన్ని రచయిత్రి చిత్రించిన తీరు ఏ రొమాంటిక్ రచనకీ తీసిపోదు.

ఈ రచనలో లోపాలేమి లేవని కాదు అప్పటివరకూ ముఖ్యపాత్రలుగా కన్పించిన వ్యక్తులు (ఉచలపతి, హిమబిందు) నవలలోంచి అకస్మాత్తుగా అదృశ్యమైపోతారు కొన్ని చిన్న సంఘటనలను విపులంగా వర్ణించిన రచయిత్రి కొన్ని ముఖ్యమైన సంఘటనలను సంభాషణలరూపంలో తేల్చిపారేయటం జరిగింది నవల కథాకాలంలో దేశంలో వచ్చిన ఆర్థికమార్పుల్ని విపులంగా చిత్రీకరించిన రచయిత్రి రాజకీయమార్పుల్ని చాలావరకు నిర్లక్ష్యం చేశారు అక్కడక్కడా ఎదురైన ఉపన్యాసాలు నవల నడకను చెడగొట్టాయి పతాకసన్నివేశం కొద్దిగా నాటకీయంగా అనిపించింది. అయితే ఇవి చిన్న చిన్న లోపాలు మాత్రమే ఈ నవల చదివి ఆనందించటానికి, ఆలోచించటానికి ఈ లోపాలు అడ్డం రావు.

వస్తువు, విస్తృతి, పాత్ర చిత్రీకరణ, నిశిత పరిశీలన, కథనశక్తి, భాష మొదలైన అన్ని విషయాలలోనూ ఉత్తమస్థాయిలో ఉన్న ఈ 'రేగడి విత్తులు' కలకాలం నిలుస్తుందనే నా నమ్మకం ఇంత చిన్న వయస్సులో ఇంతటి నవలను వ్రాసిన శ్రీమతి పైడి చంద్రలత నుంచి ఇకముందు మనం ఇంకా మంచి రచనలు ఆశించవచ్చు ఇంత మంచి నవల వెలికి రావటానికి కారణమయిన తానా కార్యనిర్వాహక వర్గానికి, సావెనీర్ కమిటీకి, ముఖ్యంగా మురళి చందూరిగారికి తెలుగు పాఠకుడిగా నా కృతజ్ఞతలు తెలుగునవలకి కొత్త ఊపిరి పోయాలన్న ఈ ప్రయత్నాలు ఇంకా కొనసాగాలని, ఫలప్రదమవాలని నా కోరిక

**డా॥ జంపాల చౌదరి**
బీవర్‌క్రీక్, ఒహాయో.
జూన్ 6, 1997

న్యాయనిర్ణేత
తానా - 97 నవలల పోటీ



# నవల గురించి

# ఇది నవల మాత్రమే కాదు ...

ఇది చంద్రలత తొలి నవలే అయినా తెలుగు నవలే అయినా తెలుగు రైతు చేతికి అందివచ్చిన చంద్రహాసం ! ఇది తెలుగు రైతు ఉసురు తెలుగు నవలా చరిత్రను కొత్త మలుపు తిప్పగల నవల 'రేగడి విత్తులు' కోస్తాలోని రేపల్లెకు, తెలంగాణాలోని 'మైబ్‌నగర్' (మహబూబ్‌నగర్ - పాలమూరు) జిల్లాలోని "నడిగడ్డ"కూ మధ్య వారధిగా వలసబోయిన ఒక రైతు కుటుంబం ఈ నవలకు ఇతి వృత్తం ఇది విశాలాంధ్ర సరిహద్దులలోనే జరిగిన ప్రవాసాంధ్రుల కథ వాస్తవ కథ ప్రకృతి వైపరీత్యాల దోబూచులాటల మధ్య ప్రభుత్వాల ప్రజా వ్యతిరేక విధానాల మధ్య, పాలకుల పదవీ వెంపరాటల మధ్య కొన్ని రైతు కుటుంబాలు, నేలతల్లిని, కన్నతల్లిలాంటి భూమిని నమ్ముకొన్న తెలుగు కుటుంబాలు మనుగడ కోసం రాష్ట్రంలోనే మరో తెలుగు ప్రాంతానికి వలసపోయిన గాథ ఇది చంద్రలత "రేగడి విత్తులు" ఆద్యంతం మట్టి వాసనే చెలక దున్నుకుని, బతికి పరాధీన స్థితి నుంచి బయటపడాలన్న రైతు ఆశ ఈ నవలకు శ్వాస ! ఈ శ్వాసను పీల్చుకోడానికి వచ్చిన అడ్డంకులను అధిగమించి సమైక్యతా గానం చేసిన కుటుంబగాథ నవలకు ప్రాణం ఆంధ్ర - తెలంగాణా ఉద్యమాలకు అతీతంగా, బతుకు తెరువు కోసం ఆధునిక పద్ధతులలో వ్యవసాయాన్ని చేపట్టి నాలుగు రాళ్ళు వెనకేసుకోడంకోసం వలసపోయిన చోట ప్రతి వారికీ ఆదర్శ కుటుంబంగా ఆవతరించడానికి చేసిన ప్రయత్నం దానికి పూర్వరంగం తెలుగుజాతి వైతాళికులలో ఒకరైన సురవరం ప్రతాపరెడ్డిని కన్నగడ్డ "నడిగడ్డ" కృష్ణా - తుంగభద్రల మధ్య నల్లరేగడి ప్రాంతం. సారవంతమైన నడిగడ్డ ఏళ్ళూపూళ్ళుగా బీడుగా, తుమ్మల బీడుగా, నైజాం రక్కసి కీడుగా పడి ఉన్న, కేవలం జొన్నకు, సజ్జకు, వాము పంటకూ పరిమితమైన ఆ భూమిలో వరివంగడాలతో, సంకరజాతులతో రాజనాలు పండించగల గడ్డగా మార్చడానికి చేసిన కృషీవలుల అవిశ్రాంత శ్రమ జీవనానికి ఈ నవల నిలువుటద్దం. స్థానికుల సహకారం, ఆప్యాయతలు, అనురాగాలు, ప్రేమలు, ఎదుటివాడి మనస్సు నొప్పించకుండా వారితో కలివిడిగా, కలుపుగోలుగా స్థానికులతో ప్రవాసులు సంచరించడం, తెలుగువారి ప్రాంతాలలో తెలుగు వాడిగానే మసలడం - రెండు ప్రాంతాల మధ్య ప్రజల మనో వికాసానికి ఎలా దోహదం చేస్తుందో నిరూపించిన అద్భుత నవల "రేగడి విత్తులు". తెలుగు రైతు కుటుంబాల సాంఘిక, ఆర్థిక, రాజకీయ, పర్యావరణ రంగాలను సమతూకంలో సర్వహంగులతో పరామర్శించిన రైతు నవల బహుశా ఇంతవరకు మనకు లేదని చెబితే అతిశయోక్తి కాదు ! చంద్రలత "రేగడి విత్తులు" నిలువెల్లా రైతు స్పృహతోనే కూడుకున్న నవల, కుటుంబ సంప్రదాయాలలో, అవసరమైనపుడు ఆ సంప్రదాయాల ఉల్లంఘనలో, వ్యవసాయంలో పాత పద్ధతుల స్థానే ఆధునిక పద్ధతులను ప్రవేశపెట్టడంలో, సాంఘిక మర్యాదలు, మన్ననలు పాటించడంలో, ప్రకృతిని ఆరాధించడంలో, నిర్ణయంలో, నిబద్ధతలో, కరుకుదనంలో, మొండిదనంలో తెలుగు రైతుల వాడినీ, వేడినీ చూపిస్తుందీ నవల ! రైతుగా మారిన ఉద్యోగి రామనాథం అధునికత మూర్తీభవించిన వ్యక్తిగా,ప్రవాసం వెళ్ళిన అతని కుటుంబాన్ని అంటిపెట్టుకున్న వ్యక్తుల, కుటుంబాల కష్టసుఖాలన్నీ ఇందులోకి ఎక్కాయి. అతిసుఖంగా, ప్రతిపదసుందరంగా, కమ్మని తెలుగులో, నుడులతో, నానుడులతో సంస్కృతీ వైభవంగా సాగిన ఈ నవలలో - రామనాథం, సావిత్రి, రత్తయ్య, లచ్చుమమ్మ పున్నమ్మ భూషయ్య, బ్రహ్మయ్య, బాలయ్య, శివుడు, సూరయ్య, అనూరాధ, కమలమ్మ కల్యాణి, దమయంతి,

హేమబిందు, రమ, మల్లేష్, విజయ, ప్రసాద్, చలపతి, రేణుక, శ్రీదేవి, ఇత్యాది పాత్రలన్నీ భూమిని అంటిపెట్టుకున్న సంసారాల నుంచి వచ్చినవే ! ఇందులో చంద్రలత - "నడిగడ్డ" కాకతీయుల కాలంలో ఎలా వెలుగొందిందీ చెప్పింది విజయనగర రాజుల, బహమనీల మధ్య పదవుల పోరులో రాజ్య విస్తరణ కాంక్షలో ఎలా నలిగిపోయి వీర రక్తపుధారలు వారపోసిందీ చెప్పింది అందుకే ఇది రైతుగడ్డకు బదులు కొన్నాళ్ళు పోతుగడ్డ అయింది కాని ఈ గడ్డకు నీరందించగలిగితే, ఆధునిక వ్యవసాయ పద్ధతులు చేపడితే దానినెలా గనిగడ్డగా మార్చవచ్చో రామనాధం కుటుంబం నిరూపిస్తుంది ! అంతేగాదు, భూమికి విలువాలేదు విలువ కట్టగల షరాబూ లేడు అందువల్లనే కొందరికి చేను (నరసింహం దొరల్లాంటి కామందులకు) ఆస్తికాగా, స్వయంగా కాయకష్టం చేసి జీవించే రత్తయ్యలాంటి రైతుకు అదే భూమి ప్రాణం అవుతోంది ఒకరికి ఆస్తి అలంకారం, మరొరికి అవసరం ! కనుకనే చంద్రలత, ఏనాడైతే మట్టిపై ఉండాల్సిన రైతు కాళ్ళు గట్టుపైకి లేస్తాయో ఆరోజే అతని పతనం మొదలవుతుందని హెచ్చరించింది ! పుట్టిన రేపల్లె వాడ వదిలి రామనాధం కుటుంబం మెట్టిన 'నడిగడ్డ'కు తొలుత 'నడకసిరి' నేర్పిందెవరు? రామనాధం కాదు "హలంపురి" - అదే అలంపూర్ (హలం = నాగలి)! నడిగడ్డకు ప్రవాసిగా ఉన్నా చంద్రలత చరిత్రకు అందాలు దిద్దిందేగాని, ఉన్న చరిత్రకు నడమంత్రపు భాష్యాలు చెప్పలేదు. ప్రాంతీయ విభేదాలు రాజకీయాల రాక్షస విద్యగా, వారి సృష్టిగా తలెత్తినవేగాని, ఆంధ్రలోని గురజాలపాలకుడు చాందమూలుడి కుమార్తె పేరు "నడుకసిరి" అనీ, నడిగడ్డ మీదకు నాగళ్ళను తెచ్చింది ఆమేననీ, ఈ నడుకసిరికి పర్యాయపదమే 'నాగలి' అనీ చంద్రలత పదచర్చ చేయడం విశేషం !

వలస చరిత్ర లేనివాడు ఈ ప్రపంచంలో లేడు రాహుల్ సాంకృత్యాయన్ "వోల్గా సే గంగా" అసంఖ్యాక జనపదాల ప్రవాస చరిత్ర ఆర్యుల చరిత్ర ! భారతీముఖర్జీ రచన ప్రవాస భారతీయుల ప్రచండ యాత్రా చరిత్ర ! ఆ వరసలో రచనా యాత్ర చేసిన చంద్రలత తన నవలను ఆత్మీయంగా, ఆంధ్రీయంగా తెలుగు రైతుల, తెలుగు ప్రజల, తెలుగు యువకుల సంస్కృతీ చరిత్రగా దిద్ది తీర్చింది ఆంధ్ర - తెలంగాణాల మధ్య విశ్వసనీయ వారధిగా నిలిచింది అనుభవంలో సాధించింది ఆచరణ సాధ్యంగా చూపెట్టింది ఒక తల్లి బిడ్డల మధ్య సమైక్యతకు ఇది ఏడుగడ అని రుజువు చేసింది ! కొత్తను కాదనకూడదని, అలవాటు పడడానికి ప్రయత్నించాలని చెప్పింది రాతినేలను అరక కుమ్మతుంది రేగడి పార దమ్ముతో విచ్చుకుంటుంది - మానవుడి మనస్సు కూడా గుండెనిబ్బరంతో ధైర్యంతో ఉన్నప్పుడు ఇంద్రధనుస్సులు చిందిస్తుంది చంద్రలత ఇందులో గ్రామీణాభివృద్ధిని, సకల వృత్తుల సమస్త చిహ్నాలతో నిరూపించడానికి ప్రయత్నిస్తుంది నేటి సమాజంలో కనుమరుగవుతున్న ఉమ్మడి కుటుంబాలలోని మంచి సెబ్బరలు, వాటిలో అడుగడుగునా తొణికిసలాడే ఛలోక్తులు, అనుబంధాలు, ఆప్యాయతలు, అసూయాద్వేషాలు, వేదనలు, రోదనలూ, అనివార్యమవుతున్న వ్యష్టి కుటుంబాలు, పట్టణీకరణ ఫలితాలు - ఒక్కమాటలో మానవ సంబంధాలలోని వెలుగునీడలు చంద్రలత చేతిలో కమ్మెచ్చు లాగినట్టు బొమ్మ కట్టుకున్నాయి గద్వాల గత వైభవాలు కన్నుల కట్టించి, పల్లె జీవనంలోని అమాయకత్వం, పండుగలు, పబ్బాలు, ఆనందాలు, ఆవేశాలూ, మన్ననలూ, మర్యాదలూ "రేగడి విత్తులు" తన సొత్తుగా మార్చుకొంది ! సాంఘికంగా ఇందులో చంద్రలత తీర్చిదిద్దని పార్శ్వం ఏదీలేదని అనిపిస్తుంది ! మూడు ప్రాంతాల (ఆంధ్ర, తెలంగాణా, రాయలసీమ) మాండలికాలు అనువైన చోట్ల ముప్పేటగా అందాలు దిద్దుకున్నాయి పెద్దల మాటలు చద్దిమూటలుగా అందివచ్చాయి ఇది కేవలం నవల కాదు, చరిత్ర ! నవలా రూపంలో నడిచిన మూడు, నాల్గు శతాబ్దాల తెలుగువారి అచ్చట,

ముచ్చట సురవరంవారి ఆంధ్రుల సాంఘిక చరిత్రకు నవలారూపం "రేగడి విత్తులు" ! ఆమాటకు వస్తే చంద్రలతే ప్రకృతిమాత రూపం ఎత్తింది ప్రకృతి సౌందర్యాన్ని అడుగడుగునా దోసిళ్లతో కుమ్మరించింది పానం చేసి, గానం చేసింది ఫలితం తెలుగు రైతు పెరట్లో విరబూసిన మందారాలు, విప్పారిన కాగడా మల్లెలు, విచ్చుకున్న దొంతర మల్లెలు, బోర్లాపడిన పారిజాతాలు, కనకాంబరాలు, ముగ్ధమనోహరంగా ఉన్న ముద్దబంతులు, చిరునవ్వులు చిందే రెక్కబంతులు, చిలిపిగా పలకరించే గడ్డిచేమంతులు, నయాగరాలు పోయే నక్షత్ర చేమంతులు, సీతమ్మ జడబంతులు ! స్త్రీ వాదం అంతర్వాహినిగా సాగింది పెళ్లి నాటి వరకు తాను జీవించిన జీవితాన్ని శూన్యం చేసుకోవడానికి అంగీకరించని ఏ ఆడపిల్ల అయినా ఎదురీదక తప్పదని, కొన్ని సందర్భాలలో ఘర్షణ తప్పదని, సంఘర్షణ తప్పదని చంద్రలత భావిస్తుంది మంచి సంప్రదాయాలను మన్నించడం పురోగతిని అడ్డుకొనే ఛాదస్తాలను చేటలతో చెరగడం, ప్రగతి శీల శక్తులకు ఆహ్వానం పలకడం చంద్రలత సొత్తు ఎక్కడికెక్కడ హేతు వాదం నదిలా ప్రవహించింది మానవీయ సంబంధాలకు మార్గదర్శి అయి కక్షలను, కార్పణ్యాలను కాలరాసింది చంద్రలత జానపద సాహిత్యాన్ని తెలుగువారి సామెతలను తనివితీర చేదుకొని రచనను నవరసభరితం చేసింది నేలతల్లిని నమ్ముకున్న రైతుకు, భూమిని నమ్ముకున్న వ్యవసాయదారునకు, కౌంట్రను నమ్ముకున్న కౌలు దారుకు, రెక్కల కష్టం తప్ప మరో ఆధరువులేని వ్యవసాయ కార్మికునకూ - 'మట్టివాసనే మాణిక్యం' నారతాడుపేనే రత్తయ్య రాట్నం వడికే పున్నమ్మ గ్రామీణ జీవితానికి సజీవ ప్రతినిధులు జొన్నరొట్టెలు, ఉల్లిపాయ పప్పులు, చింతకాయ తొక్కులు, నూనొంకాయలు పల్లెవాసుల భిన్న రుచులకు తావలాలు గుజ్జనగూళ్ళు, బిళ్లంగోళ్ళు, తొక్కుడుబిళ్ళలు, గచ్చకాయలతో అచ్చంగాయలు, చింతపిక్కలతో వామనగుంటలూ - పల్లెపట్టుల్లో ఆబాలగోపాలానికి ఒకనాటి మన క్రీడా విశేషాలు. ఈ తరంవారికి తెలియని ఎన్నెన్నో అంశాలు ఇందులో ఉన్నాయి కోల్గేట్ పేస్ట్ తెలిసినంతగా ముగ్గుకర్ర తెలీదు బావులు తెలిసినా మోటబావులు ఎరుకలేదు, గోదావరి తెలుసుగాని వెన్నకాచిన తరువాత నెయ్యి అడుగున దిగే 'గోదారి' ఎరుగరు ! బల్ల తెలుసుగాని బండి 'జల్ల' తెలీదు, అడుసు తొక్కడం తెలిసినా చేను 'దమ్ము' చేయడం తెలీదు, చేను పిలకలు కట్టడం పోటాకు పొడవడం తెలీదు, మొక్కకు పాదులు తీయడం తెలిసినా 'గొప్పులు' పోసుకోడం తెలియదు. గిత్తలు తెలిసినా వాటి 'గిట్టలు' తెలియవు ! మట్టి తెలుసుగాని 'మొరుసు' మట్టి తెలీదు, దుబ్బులు తెలిసినా 'ఓదెలు' తెలీవు ఇక మన తెలుగు కార్తెలుఅసలే తెలియవు మృగశిర ఉరిమినా పరుగులతో ఉత్తరకార్తె వచ్చినా మనకు పట్టదు ! ఇంగ్లీషు చదువులు మరిగి తెలుగు సౌందర్యాన్ని, సౌలభ్యాన్ని, సౌకుమార్యాన్ని తాకట్టుపెట్టి కూర్చునాం ! పంటసిరి నాట్యానికి ఆచార్యులు రైతులు. వారి విజయ రహస్యం అంతా "విత్తనాలు పంట, పనిముట్లలో" ఉందని రామనాథం తీర్పు ! కాని ఆ విత్తనాలపైన "సంస్కరణం" పేరిట నేడు పెత్తనం చెలాయించజూస్తున్నవి అమెరికన్ కంపెనీలు మరి వేప, పసుపు, నూనె విత్తులపై 'పేటెంటు' కాజేయడానికి బహుళ జాతి గుత్త సంస్థల కన్నుపడింది రచయిత మరువరాదు అయినా నవల కథానాయకుడైన రామనాథం అన్నట్టు విత్తనాలు విధ్వంసానికి లొంగవు కానీ మొక్క బలం విత్తనంలో మాత్రమే లేదు, భూమిలో ఉందని గ్రహించాలి ! సారమతి భూమి, రైతు పురోగామి !

1997 జులై 6, ఆదివారం
వార్త సంపాదకీయంనుంచి

ఎ. బి. కె. ప్రసాద్
ప్రధాన సంపాదకులు "వార్త"

